## 50 వేల కాపీలు పైన అమ్ముడుపోయిన పుస్తకం తెలుగులో ఇంతటి గ్రంథము లేదు

# వాత్స్యాయన కామసూత్రాలు

## పుస్తకముపై పత్రికల అభిప్రాయాలు

'వాత్స్యాయన కామసూత్రాలు' అంటే దాన్ని బూతు పుస్తకంగా కొందరు భావిస్తే, సశాస్త్రీయమైన సెక్స్ విజ్ఞాన సర్వస్వంగా మరికొందరు భావిస్తారు. చదవకుండా ఆ పుస్తకం మీద ఓ అభిప్రాయం ఏర్పరచుకొనే వారికి అది బూతు పుస్తకమే. చదివి దాని సారాంశం తెలుసుకున్నవారికి అది సెక్సు విజ్ఞాన సర్వస్వమే. వాత్స్యాయనుడు ఈ కామసూత్రాలను సుమారు 16 శతాబ్దాల క్రితం రచించాడని అంటారు. ఇంతకాలం ఓ గ్రంథం నిలవగలగటమే దాని ప్రాశస్త్యానికి నిదర్శనం. వాత్స్యాయన కామసూత్రాలు అసలు సంస్కృతంలో వెలువడ్డాయి. వాటికి ప్రపంచంలోని అనేకానేక భాషల్లో వ్యాఖ్యానాలు, వివరణలు లభిస్తున్నాయి. అయితే అటు నేరుగా వాత్స్యాయనుని కామసూత్రాలు వివరిస్తూ ఇటు అర్థమయ్యే భాషలో వాటి గురించి తెలియజేస్తూ వచ్చిన పుస్తకాలు బహు తక్కువ. తెలుగులో అలాటి పుస్తకాలు చాలా కొన్నే ఉన్నాయి. వాటిలో శ్రీ రెంటాల వారి పుస్తకం మంచి గెటప్‌తో, చక్కని వివరణలతో, తేలికైన భాషతో, పుస్తకంలోని విషయానికి తగిన విధంగా చంద్ర వేసిన బొమ్మలతో చక్కగా ఉంది. సశాస్త్రీయమైన దృక్పథంతో, చక్కనైన వివరణలతో వెలువడిన ఈ పుస్తకం గృహస్థధర్మం పాటించే వారంతా తప్పక చదివితీరాలి. అవాంఛనీయమైన రీతిలో సెక్సు గురించి పలురకాల శీర్షికలతో పత్రికలు, పుస్తకాలు వెలువడుతున్న ఈ రోజుల్లో ఇంత చక్కని విధంగా, ప్రయోజనాత్మకంగా ఈ పుస్తకాన్ని వెలువరించిన రచయిత, ప్రచరణకర్తలు అభినందనీయులు.

**- ఈనాడు**

1985 నవంబర్‌లో మనదేశంలో ప్రప్రథమంగా ఏడవ ప్రపంచ సెక్సు నిపుణుల మహాసభ జరిగింది. భారతదేశంలో సహా అమెరికా, ఇటలీ, ఫ్రాన్స్, స్పెయిన్, చైనా మొదలైన 30 దేశాల సెక్సు నిపుణులు సుమారు 700 మంది ఈ మహాసభలో పాల్గొన్నారు.

వాత్స్యాయన కామసూత్రాలపై ఈ సభలో సుదీర్ఘమైన చర్చలు కొనసాగాయి. 16 శతాబ్దాలు గడిచినా ఇప్పటికీ ఈ శాస్త్ర గ్రంథం ఆధునికంగా వున్నదని అంతా ఏకగ్రీవంగా అంగీకరించారు. కామసూత్రా వెనుక సహేతుకమైన శాస్త్రీయ దృష్టి వున్నందువల్లనే అవి ఎన్నో శతాబ్దాల కాలవాహినికి ఎదురీది నేటికీ ఆధునికంగా నిలిచి వున్నాయని నిపుణులందరు ఉగ్గడించారు.

**- ఆంధ్రజ్యోతి వారపత్రిక**

# వాత్స్యాయన కామసూత్రాలు

చంద్ర బొమ్మలతో

రెంటాల గోపాలకృష్ణ



నవసాహితి బుక్ హౌస్
ఏలూరు రోడ్ • విజయవాడ-520 002



# VATSYAYANA KAMASUTRALU

*By :*

**RENTALA GOPALA KRISHNA**



*Publishers :*
**NAVASAHITHI BOOK HOUSE**
Eluru Road, Near Ramamandiram,
Vijayawada - 520 002.
Ph : 0866 - 2432 885
E-mail : navasahithiravi@gmail.com

*First Edition* : February, 1993
*Sixteenth Edition* : September, 2017

*Cover Design & Illustrations by :*
**Chandra**
Hyderabad

*Printers :*
**Nagendra Enterprises**,
Vijayawada-3.

*Price :*
**₹ 150/-**

# విషయ సూచిక

# ఆముఖమ్

విద్వద్వరేణ్యులు బ్రహ్మశ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రుల వంటివారు వ్యాఖ్యానించ వలసిన వాత్స్యాయన కామ సూత్రాలకు నా వంటివాడు వ్యాఖ్య వ్రాయడం విడ్డూరంగా లేదూ? - ఇప్పటి పండితుల్లో ఎవరికైనా ఈ ప్రశ్న ఉదయించవచ్చు. అవును - నిజం! పంచాగ్నులవారు కామ సూత్రాలకు వ్యాఖ్య వ్రాశారు ఎప్పుడో అర్థశతాబ్దం క్రితం. ఇప్పుడు నేను ఈ సాహసం చేశాను. అయితే ఇది దుస్సాహసంకాదు.

నలభై ఏళ్ళ పైమాట. నేను గుంటూరులో చదువుకునే రోజులు. ''పండితులకు మాత్రమే పరిమితం'' అని టైటిల్ పేజీపై ముద్రించబడి ఉన్న పంచాగ్నులవారి కామ సూత్రాలకు తెలుగు వ్యాఖ్యాన గ్రంధాన్ని నేను తొలిసారి చదవడం సంభవించింది. అంతకు ముందే పండితులవల్ల ఈ గ్రంధాన్ని గురించి విని ఉన్నప్పటికీ పంచాగ్నులవారి గ్రంథం చదివినప్పటి నుంచి, ఈ రచనలపట్ల అమితమైన ఆసక్తి, ఉత్సుకత, గౌరవం నాలో ఏర్పడినాయి. ఆ తరువాత కొలది కాలానికే బెనారస్‌లోని Chowkhamba Sanskrit Series వారికి వ్రాసి నాగరలిపిలో యశోదర జయమంగళ వ్యాఖ్యతో ఉన్న వాత్స్యాయన కామసూత్రాలు ఒరిజనల్ గ్రంథాన్ని తెప్పించుకున్నాను. అటుపైన 1883 లోనే తొలిసారిగా వెలువడిన ఆంగ్లానువాదం పునర్ముద్రణ ప్రతిని కూడా సంపాదించాను. ఆధునిక తెలుగు పాఠకులకు రుచించే విధంగా, జయమంగళ వ్యాఖ్యానుసారం మూలశ్లోకాలతో నాకు తోచిన పద్ధతిలో వ్యాఖ్యానం వ్రాయాలని నాకు బుద్ధి పుట్టింది. బుద్ధి పుట్టడమే కాదు. ఈ బృహత్కార్యం నెరవేర్చాలనే పట్టుదల కలిగింది.

ఆర్బత్‌నాట్, రిచెర్డు బర్టన్‌ల ఇంగ్లీషు అనువాదం, మూలంలోని అంశాలు ఎక్కడా పోకుండా ప్రామాణికంగా ఉంది. అయినా సంస్కృత వ్యాఖ్యానుసారం వ్రాయాలని నా అభిలాష. అయితే ''రఘువంశం'' లాంటి కావ్యాలకు కొద్దికాలం నేను పాఠం చెప్పించుకున్నా వాస్తవానికి సంస్కృతంలో నాది మిడి మిడి జ్ఞానమే. ఆ సంగతి నాకు తెలుసు. అలాంటి అల్పజ్ఞుడను ఎక్కడ తప్పటడుగు వేస్తానో, ఈ శాస్త్రీయ గ్రంథానికి అన్యాయం చేసి, పండిత లోకంలో ఎక్కడ అభాసుపాలవుతానో అన్న భీతికలిగింది. అయినా అభిలాష మాత్రం నన్ను విడిచిపెట్టలేదు. ఇంగ్లీషు అనువాదాన్ని అనుసరించి తెలుగులో ఒక చిత్తు ప్రతిని తయారు చేశాను.

అది 1957 - 59 మధ్య. ఆ సమయంలో నేను నా మిత్రులు స్వర్గీయ శ్రీ చదలవాడ పిచ్చయ్యగారి ఆధ్వర్యాన నడుస్తున్న ''నవభారతి'' సాహిత్య మాసపత్రికకు ఇన్‌చార్జి ఎడిటర్‌గా పనిచేస్తున్నా ఆ రోజుల్లో గురువర్యులు, కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి ఇంటికి వెళ్ళి అల్లసానివాని అల్లిక జిగిబిగి, మధ్యాక్కరలు, రామాయణ కల్పవృక్షం మున్నగు వాటిపై విమర్శనాత్మక వ్యాసాలు వారు చెపుతూ ఉంటే వ్రాసుకుని వచ్చి ''నవభారతి''లో ధారా వాహికంగా ముద్రించే వాడను. ఆ సమయంలో ఎస్.ఆర్.ఆర్. అండ్ సి.వి.ఆర్. ప్రభుత్వ కళాశాలలో శ్రీ గరికెపాటి సత్యనారాయణ అనేవారు సంస్కృత భాషాధ్యాపకులుగా పనిచేస్తూ వుండేవారు. విశ్వనాథంవారి స్వగృహంలోగల ఔట్ హౌస్‌లోనే వారి నివాసం. ఆయన ''సంస్కృత పాఠాలు'' సీరియల్‌గా నవభారతి కోసం వ్రాసేవారు. ఆ విధంగా శ్రీ గరికెపాటి వారితో నాకు పరిచయమై అది రానురాను ప్రగాఢమైనమైత్రిగా పరిణమించింది. అప్పటికే నేను కామ సూత్రాలకు తెలుగు వ్రాయడంలో కొంతకృషి చేసి ఉన్నందున, సంస్కృత మూలంలో నాకు అర్థం కాని, బొత్తిగా కొరుకుడు పడని అనేక విషయాలు శ్రీ గరికెపాటి వారిని అడిగి తెలుసుకుని వాటి

భావాన్ని, వ్యాఖ్యానంలోగల విశేషార్థాలను నోట్సుగా వ్రాసిపెట్టుకున్నాను. ఆ విధంగా దరిమిలా ఈ రచన సాగించడం నాకు చాలా సులువైంది. దాంతో మరింత ఉత్సాహం, ఉద్వేగం పుట్టుకొచ్చాయి. కాని ఆశించినంత త్వరగా నా అభిలాష, కార్యరూపం ధరించలేదు. కారణం మరేం కాదు.

'ఆంధ్ర ప్రభ' దినపత్రిక సంపాదక వర్గంలో గురుతర బాధ్యతాయుతమైన నా ఉద్యోగం. అంచాత ఏనాడో ప్రారంభమైన ఈ రచన ఇటీవల మాత్రమే పూర్తి చేయగలిగాను. మూలంలోని విషయం ఎక్కడా విడిచి పెట్టలేదు. లేనివి చేర్చలేదు. న్యూనాతిరిక్తంగానే రచన సాగించాను. అయితే, నేను చేసిన పని ఒకటి ఉంది. అది చెప్పాలి. ''ఔద్దాలకి'' అనే ఋషి పేరు మూలంలో వచ్చిందనుకోండి. నేను వేర్వేరు గ్రంథాలు నాకు లభ్యమైనవి పరిశీలించి ఆ మహర్షికి సంబంధించిన వివరాలు కొన్ని కుండలీకరణాలలో (బ్రాకెట్లలో) ఇచ్చాను. అలాగే ''నాయిక''ను గురించి చెప్పవలసి వచ్చినప్పుడు అష్టవిధ నాయికల వివరాలు, ఇప్పటి పరిస్థితులకు అనుగుణంగా చిన్న చిన్న వ్యాఖ్యాలు పొందుపరిచాను. గ్రంథం సమగ్రంగా, సర్వాంగ సుందరంగా రూపుదిద్దుకోవాలన్న నా చాపల్యమే ఇందుకుకారణం. శిష్ట వ్యవహారిక భాషలోనే రచన సాగించాను. సాధ్యమైనంత వరకూ చౌకబారు పదాలు, అసభ్యకరమైన శబ్దాలు దొర్లకుండా జాగ్రత్తపడ్డాను. ఇలాంటి శృంగార రచనలు సాగించేటప్పుడు పాఠకుల మనో దౌర్బల్యాలను ఆసరాగా తీసుకుని ఉద్రేకాలు రేకెత్తించే అవకాశం ఎంతో ఉంది. అయినా నేను ఆ పంథా తొక్కలేదు. కాగా అనేక సంస్కృత శబ్దాలకు సందర్భానుసారం వాటి అర్థాలు స్ఫురించలేదు. నిఘంటువులుకూడా ఉపయోగపడలేదు అయినా, శక్తిమేరకు భావాన్ని చెప్పాను. ముఖ్యంగా ఔపనిషదకాధి కరణంలో వైద్యశాస్త్ర పారిభాషిక పదాలు, పండితులు, మిత్రులు, సహృదయులు సరియైన అర్థాలు, రచనలోగల దోషాలు నాకు తెలియపరిస్తే మలి ముద్రణలో సవరించుకుంటానని మనవి.

ఈ రచనకు స్ఫూర్తినిచ్చిన స్వర్గీయ పంచాగ్నులవారికీ, మూలంలోని ఎన్నో విషయాలు, విశేషాలు నాకు విడమర్చి చెప్పిన మిత్రులు స్వర్గీయ గరికెపాటి సత్యనారాయణగారికీ, ఈ గ్రంథం పూర్వార్థంలో చాలావరకు దాదాపు 40 వారాలపాటు ధారావాహికంగా ప్రచురించిన, అటుపైన ఏదో అర్థరహితమయిన, అనుచితమయిన ఒత్తిడులకు లోనయి ప్రచురణ నిలిపివేసిన ''ఆంధ్రజ్యోతి'' సచిత్ర వారపత్రిక యాజమాన్యానికీ, సంపాదక మిత్రులు శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మగారికి కృతజ్ఞుడను.

ఇక ప్రస్తుతం — ఇందులో గుణాలు ఏవైన కనిపిస్తే, అవన్నీ వాత్స్యాయనులది. దోషాలు దొర్లితే అవన్నీ నావి. కామ సూత్రాల ప్రాశస్త్యాన్ని గురించి ఈ గ్రంథం ప్రారంభంలోనే విపులంగా వ్రాశాను. కాబట్టి మరల ఇక్కడ ఉపోద్ఘాతం చర్వితచర్వణం అవుతుంది. ఈ రచనతో ఇప్పటివరకూ ముద్రియమయిన నా రచనలు శతాధికమయినాయి. నా ఇతర రచనలు ఆదరణ పొందినట్లే ఈ విశిష్ట గ్రంథం కూడా తెలుగు పాఠకుల ఆదరాభిమానాలు చూరగొంటుందని ఆశిస్తున్నాను. ఇప్పుడిది రెండవ ముద్రణ. దీన్ని సర్వాంగసుందరంగా ప్రచురిస్తున్న 'నవసాహితి బుక్‌హౌస్' అధిపతి, మిత్రుడు, కొండపల్లి ప్రకాశరావుకు అభినందనలు.

ఈ శాస్త్రాన్ని శ్రద్ధగా చదవండి. బుద్ధిగా అనుష్ఠించండి. దుర్వినియోగం మాత్రం చేయకండి దయచేసి.

సాహితీ స్రవంతి,
విజయవాడ - 11 ది. 1-12-1986
ద్వితీయ ముద్రణ 15-1-1993

రెంటాల గోపాలకృష్ణ

# వాత్స్యాయన కామసూత్రాలు

## తిలకం

కావ్యం వేరు, శాస్త్రం వేరు, కావ్యానికి రసం ఆత్మ. రససిద్ధి కలిగించేది కావ్యం. కావ్యసృష్టి చేసినవాడు స్రష్ట. మరి శాస్త్రం అలాకాదు. శాస్త్రం ఎవరు వ్రాసినా, అందులోని విషయం వారి స్వంతం కాదు. అంటే, వారు కొత్తగా సృష్టించింది కాదు. వేదాలు దర్శించబడినవి కాబట్టి అవి అపౌరుషేయా లన్నారు. అందుకే వేద ఋషులను మంత్రద్రష్టలన్నారు. శాస్త్రం కూడా అలాంటిదే. దానికి యథార్థమైన కర్తృత్వం లేదు. ఎందుచేతనంటే అది కూడా దర్శింపబడినదే కాబట్టి. శాస్త్రంలోని సత్యాలు, శాస్త్ర నిర్మాణానికి ముందే లోకంలో నిగూఢంగా ఉన్నాయి. ప్రజ్ఞావంతుడు, ప్రతిభా వ్యుత్పత్తులు కలవాడూ అయిన ఒక మహా మేధావి ఆ సత్యాలను దర్శిస్తాడు. వాటిని సూత్రీకరించి, విశ్వానికి విశదం చేస్తాడు. అందుచేత శాస్త్రకారులు కూడా ద్రష్టలే అనిపిస్తుంది. శాస్త్రాలు కూడా అపౌరుషేయాలే అని అనవలసి వస్తుంది.

ద్రష్ట అయిన అలాంటి ప్రాచీన శాస్త్రకారుల్లో వాత్స్యాయనుడు ఒకడు. అతడు కామశాస్త్రాన్ని నిర్మించాడు. అది సూత్రప్రాయంగా ఉన్నది కాబట్టి దానికి 'కామసూత్రమ్' అని పేరు పెట్టాడు. అసలు, ప్రాచీన భారతీయులు నిర్మించని శాస్త్రమంటూ లేదు, అది లౌకికం కాని అలౌకికం కాని, వారి మేధాశక్తి అసాధారణమైనది. సత్యాన్వేషణకై తపించారు వారు. ప్రకృతిలోని రహస్యాలనూ, అద్భుతాలనూ శోధించి వెలికి తీశారు. అవి దైవలీలలని విశ్వసించారు. గాలి, నీరు, నింగి, నేల, తేజస్సు - మున్నగు వాటికి ఆ దివ్యత్వాన్ని ఆపాదించారు. మనోజ్ఞమైన ఉషస్సు, సుందరమైన సాయం సంధ్య, గలగల ప్రవహించే సెలయేళ్ళు, అగాధ జలధి, మహోన్నతమైన పర్వత శ్రేణులు వీటన్నిటిలోనూ ఒకానొక దివ్యత్వాన్ని దర్శించారు. అవును. సత్యం ఒక్కటే - అది భిన్న రూపాల్లో ఉంది. ఆ భిన్నత్వంలోనే ఏకత్వం. ఆ విధంగా వారు ఒక సంపూర్ణతను, సమన్వయాన్ని సాధించి జీవిత సాఫల్యాన్ని నిర్ధారించారు. ఆ రోజుల్లో వారికి ఎంతో శాంతి ఉండేది. ఆలోచించడానికీ, ప్రయోగాలు జరపడానికీ ఎంతో విశ్రాంతి దొరికేది వారికి. కనుకనే ప్రాచీన భారతీయ విజ్ఞానులు కళ, విజ్ఞాన రంగాలలో అత్యద్భుతమైన, అనన్య సామాన్యమైన విజయాలు సాధించగలిగారు. శిల్ప, వైద్య, యోగ, గణిత, తత్వశాస్త్రాదుల్లో ప్రాచీన భారతీయులదే అగ్రస్థానం. చిన్న వెంట్రుకలను సయితం రెండుగా చీల్చగల నేర్పు, అందుకు అవసరమైన పరికరాలు

వారికి ఉండేవట. మెదడులో 'ట్యూమర్' లాంటి వాటికి కూడా శస్త్ర చికిత్స చేయగలిగే వారట. మానవ శారీరక, మానసిక ప్రవృత్తులను వారు క్షుణ్ణంగా పరిశీలించారు. సృష్టి రహస్యాలను భేదించడంలో భారతీయులు ఎంతటి విజయాలు సాధించారో, సత్యాన్వేషణలో వారు ఎంతగా కృషి చేశారో ఉపనిషత్తులు ఋజువు చేస్తున్నాయి. శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచారి చెప్పినట్లు ప్రపంచంలో అత్యంత ప్రాచీనమైన ఈ పవిత్ర గ్రంథాలు ఈనాటికీ ఎంతో ఆధునికంగా ఉండి ఉపయుక్తంగా ఉంటున్నాయి. శరీరాన్ని, మనస్సును ఎలా స్వాధీనంలో ఉంచుకోవాలో ఉపనిషత్తులు ప్రబోధిస్తున్నాయి. శరీర వ్యాపారం, మానసిక శక్తి యుక్తులను గురించి యోగశాస్త్రం ఎన్నో వినూత్న విషయాలు వెల్లడించింది. కర్మేంద్రియాలనూ, జ్ఞానేంద్రియాలనూ ఆధీనంలో ఉంచుకోడానికి యోగం ఎంతగానో ఉపకరిస్తుంది. యోగంతో హృదయ స్పందనను ఆపవచ్చునట. ఉచ్ఛ్వాస నిశ్వాసాలను నిలిపి వేయవచ్చునట. ఇలా ఎన్నో గంటలు సమాధి స్థితిలో ఉండిపోవచ్చు. ఇది ఒక తమాషా కాదు. ఇంద్రజాలం అంతకన్నా కాదు. ఇది ఒక సహేతుకమైన, శాస్త్రీయమైన విద్య.

ఈ విషయాలను దృష్టిలో ఉంచుకుని వాత్స్యాయన కామసూత్రాలను పరిశీలించవలసి ఉంది. 'సెక్సు' అనేది మానవ జీవితంలో విడదీయరాని ఒక భాగం. స్త్రీ, పురుషుల మధ్య సంబంధాలను గురించి కృత్రిమంగా ఆలోచించ కూడదు. ఈ సంబంధాన్ని బట్టే మానవ జీవితం రూపుదిద్దుకుంటుంది. అందుచేత ఈ అంశాన్ని గురించి పరిశీలించినకొద్దీ, అధ్యయనం చేసినకొద్దీ మనం వాస్తవాన్ని తెలుసుకోగలుగుతాము. ఆహారం, నిద్ర సమస్త ప్రాణులకూ సహజమైనట్లే, మానవ జీవితంలో అతి ప్రధాన భాగమైన 'సెక్సు' కూడా సహజమైనది. దీన్ని ఎంత మాత్రం నిరాదరణ చేయడానికి వీలులేదు. అయితే, ఆత్మనిగ్రహం, ఆత్మవిచారం ఈ రెండూ ఉండి కామ సుఖం అనుభవించినప్పుడే దాని సార్థకత. డాక్టర్లు, గైనొకాలజిస్టులు, సైకియాట్రిస్టులు అవశ్యం తెలుసుకోవలసిన విజ్ఞానం సెక్సు విజ్ఞానం. కాని సామాన్య మానవుడి విషయం ఏమిటి? వారికి కూడా తెలియ జెప్పడం కోసం ప్రాచీన భారతీయులు కామశాస్త్రాన్ని గురించి నిష్పక్షపాతంగా, కూలంకషంగా పరిశీలించారు. తక్కిన కళలవలెనే దీన్ని కూడా ఒక కళగా ఆరాధించారు. లైంగిక సంబంధమైన రహస్యాలు ఎన్నో తెలుసుకున్నారు. తక్కిన ప్రకృతి ధర్మాలలాగానే దీన్ని ఒక ప్రకృతి ధర్మంగా భావించి, త్రికరణ శుద్ధిగా అనుష్ఠించారు. అంతేకాని, ఇది ఒక అశ్లీలతగా, ఒక అసభ్యకరమైన విషయంగా వారు పరిగణించలేదు. జీవితం మరింత సుఖప్రదంగా, ఆనందమయంగా, క్రమబద్ధంగా ఉండాలన్నదే వారి లక్ష్యం.

కామ్యతే సర్వేతితి కామం - అని వ్యుత్పత్తి. అందరిచేత అభిలషించబడేది కామం. స్త్రీ పురుషులలో కలిగే సంభోగాభిలాష కామమే. ఒకానొక అంతర్హేతువు వల్ల కలిగే కోరిక అది. ఋగ్వేదం మొదలైన వేదాలు, బృహదారణ్యకాది ఉపనిషత్తులు ఈ కోరికను గురించి ఉగ్గడించాయి. మనస్సుకు మూలం ఇది. అవ్యక్తంగా

ఉన్న దీన్ని మహర్షులు తమ బుద్ధి బలంతో కనుగొన్నారు. మనస్సులో ప్రాదుర్భవించిన ఈ అవ్యక్తమే సమస్త సృష్టికీ మూలం. కోరిక ఏమిటని ఆలోచించిన మహర్షులకు సృష్టి రహస్యం అవగతమైంది. ఒక్కడుగా ఉన్న విరాట్ పురుషుడివల్ల ఈ విశాల విశ్వాన్ని సృష్టించడం వీలుకాదు. కేవలం ఒక స్త్రీ వల్లా సృష్టి జరగదు. రెండుగా చీలిన విత్తనం నుంచి చెట్టు ఎలా మొలకెత్తదో అలాగే కేవలం పురుషుడివల్ల, లేదా కేవలం స్త్రీ వల్ల సృష్టి జరగదు. ఈ విషయం తెలుసుకుని అతడు మరో దాని కోసం ఆరాటపడ్డాడు. తన దేహాన్నే రెండు భాగాలుగా చేశాడు. ఆ రెంటికే మిథునమని పేరు. వారే దంపతులు వారి మైథున క్రియ మూలంగా సృష్టి ఆరంభమైంది.

**పురుషార్థాలు నాలుగు:** అవి. ధర్మం, అర్థం, కామం, మోక్షం. ప్రతి పురుషుడూ ఈ నాల్గింటినీ సాధించాలి. వీటిలో మోక్షము పరలోకానికి సంబంధించినది. మొదటి మూటికీ త్రివర్గమని పేరు. మానవుడు లోకంలో సుఖంగా జీవించడానికి ఈ మూడూ అవసరం. అయితే, వీటిని సాధించడం ఎలా? అందుకు మార్గం ఏమిటి? అది చెప్పడానికే కామ శాస్త్రం పుట్టింది. ఈ శాస్త్రం ఋషిప్రోక్తం. వాత్స్యాయన ముని ప్రణీతం. ఇది పుక్కిటి పురాణం కాదు. హేతు బద్ధమైన శాస్త్రం. 'సెక్సు'ను శాస్త్రబద్ధం చేసిన ప్రసిద్ధ రచన ఇది. కామ పురుషార్థాన్ని ఎలా సాధించి, అనుభవించి సాఫల్యం చేసుకోవాలో వివరిస్తుంది ఈ శాస్త్రం. ఆనాటి భారతీయ సమాజం, సంస్కృతి, నాగరికత, సాంఘిక జీవనం, ఆచార వ్యవహారాలు, వీటన్నిటికీ అద్దం పడుతుంది. అంతే కాకుండా, మానవ ప్రవృత్తిని అంతరాంతరాల్లో శోధించి చెప్పిన గ్రంథం. ఇది శారీరక శాస్త్రం, మానసిక శాస్త్రం కూడా. కాలం మారినా, మనుషులు మారినా, ఆచారాది వ్యవహారాలు మారిపోయినా, ఈ కాలానికి కూడా అత్యంత ఉపయుక్తమైన రచన ఇది. ఎందుచేతనంటే - ఆత్మానంద హేతువైన కామం సకల జీవులకూ సర్వకాలాల్లో ఆస్వాదించ దగినదే కాని పరిహరించ దగినది కాదు. ప్రాచీన భారతంలో 'కామం' అనేదానికి ఇప్పుడున్న విపరీతార్థం కానీ, అసహ్యం, జుగుప్స కానీ లేవు. ఇంతటి గోప్యమూ లేదు. ఆ రోజుల్లో 'సెక్సు' విజ్ఞానాన్ని గురించి సహేతుకంగా, సశాస్త్రీయంగా బహిరంగ ప్రదేశాల్లో చర్చించేవారు. సామాన్య ప్రజలకు విజ్ఞానదాయకంగా ఉండి, నిత్యజీవితంలో ఉపయోగపడడానికిగాను స్త్రీ, పురుషుల లైంగిక సంబంధమైన విషయాలపై గోష్ఠులు జరిపేవారు. కామ కళా ప్రదర్శనలూ, సభలూ, ఏర్పాటు చేసేవారు. కాని కామ శాస్త్రాన్ని అతి గోప్యంగా ఉంచబట్టే, ఈనాడు 'సెక్సు' అనేది విచ్చలవిడిగా వెర్రి తలలు వేస్తూ, అనేక వికృత రూపాలలో సాక్షాత్కరిస్తున్నది, విపత్కర పరిణామాలకు దారితీస్తున్నది. అందుచేత ఈ కామ శాస్త్రం నీతిబాహ్యమైనదీ, కేవలం తృష్ణ తీర్చుకునేది కాదనీ గ్రహించాలి. చక్కగా శాస్త్రాన్ని అవగతం చేసుకొని ధర్మార్థ కామాలకు పరస్పర వైషమ్యం

కలగకుండా, జితేంద్రియులై కామ పురుషార్థాన్ని అనుష్ఠిస్తే. అది ఐహిక ఆముష్మిక సాధకమై, సుఖంగా జీవయాత్ర సాగించడానికి సహాయపడుతుంది.

## స్త్రీ, పురుష సంబంధాలపై మొదటి మాట చివరి మాట వాత్స్యాయనుడిదే!

ఇకపోతే స్త్రీ, పురుష సంబంధాలపై మొదటి మాట, చివరి మాట వాత్స్యాయనుడిదే. ఇది ఎవరో, ఎప్పుడో అన్న మాటకాదు మొన్న మొన్ననే ప్రపంచ ప్రసిద్ధులైన లైంగిక విజ్ఞాన నిపుణులంతా ముక్తకంఠంతో చెప్పినమాట.

1985 నవంబర్‌లో మనదేశంలో ప్రప్రథమంగా ఏడవ ప్రపంచ సెక్సు నిపుణుల మహాసభ జరిగింది. భారతదేశంతో సహా అమెరికా, ఇటలీ, ఫ్రాన్స్, స్పెయిన్, చైనా మొదలైన 30 దేశాలసెక్సు నిపుణలు సుమారు 700 మంది ఈ మహాసభలో పాల్గొన్నారు.

వాత్స్యాయన కామసూత్రాలపై ఈ సభలో సుదీర్ఘమైన చర్చలు కొనసాగాయి. 16 శతాబ్దాలు గడిచినా ఇప్పటికీ ఈ శాస్త్ర గ్రంథం ఆధునికంగా వున్నదని అంతా ఏకగ్రీవంగా అంగీకరించారు. కామ సూత్రాల వెనుక సహేతుకమైన శాస్త్రీయ దృష్టి వున్నందు వల్లనే అవి ఎన్నో శతాబ్దాల కాలవాహినికి ఎదురీది నేటికీ ఆధునికంగా నిలిచి వున్నాయని నిపుణులందరు ఉగ్గడించారు. సెక్సు విజ్ఞానానికి సంబంధించిన భారతీయ సంఘం అధ్యక్షుడు డాక్టర్ ప్రకాష్ కొఠారి ఈ సభలో ప్రసంగిస్తూ, సుఖమూ, ఆనందమయమూ అయిన సమాజంకోసం లైంగిక తత్వాన్ని, సెక్సు విజ్ఞానాన్ని పెంపొందించుకోవాలని ప్రాచీన భారతీయ విధానాలు ప్రబోధిస్తున్నాయని పేర్కొన్నారు. మానవాళి ఆరోగ్య భాగ్యంతో మనుగడ సాగించాలన్నా, సుఖ శాంతులు పొందాలన్నా, పాఠశాలలలో, కళాశాలలలో సెక్సు విద్యను ప్రవేశపెట్టాలనీ, అందుకు అవసరమైన చర్యలు గైకొనవలసినదిగా అన్ని దేశాల ప్రభుత్వాలనూ కోరాలని ఈ మహాసభ తీర్మానించింది.

సంఘంలో లైంగిక సంబంధమైన రుగ్మతలు అనేకం చోటు చేసుకున్నాయి. వాటిని అరికట్టి, ఆరోగ్యకరమైన వాతావరణాన్ని సృష్టించాలంటే అందుకు సాధనం సెక్సు విజ్ఞానం ఒక్కటే అని నిపుణులు అభిప్రాయ పడడం విశేషం.

దూరదర్శన్ ద్వారా జాతీయస్థాయిలో ఈ మహాసభలకు బహుళ ప్రచారం జరగడం గమనించదగిన విషయం. అంతే కాకుండా, ఒక ఎగ్జిబిషన్‌ను ఏర్పాటుచేసి, శృంగార సంబంధమైన శిల్పాలు, ఫోటోగ్రాఫ్‌లు, చిత్తరువులు ఆ ప్రదర్శనలో చూపించడం ప్రశంసనీయం.

దీన్ని బట్టి శాస్త్రీయమైన సెక్సు విజ్ఞానం ఎంతైనా అవసరమని, దానివల్ల అనర్థాలకు, అకృత్యాలకు అవకాశం లేకుండా ఆరోగ్యకరమైన వాతావరణం మధ్య సామాజిక పురోభివృద్ధిని సాధించవచ్చునని స్పష్టమవుతున్నది.



స్త్రీ, పురుషులిద్దరూ రెండు అరసున్నాల్లాంటి వారు. రెండు అరసున్నాలు కలిస్తే పూర్ణానుస్వారం (నిండు సున్నా) అయినట్లు, స్త్రీ, పురుషులు కలిసినప్పుడే పూర్ణత ఏర్పడుతుంది. శివ శక్తుల సముల్లాసమే మహాకామ సంవిధానమని తత్త్వ శాస్త్రజ్ఞులంటారు. ఆ సముల్లాసం సృష్టిలో సమస్త ప్రాణులందూ వ్యాప్తమై ఉండడంచేత ప్రపంచం యావత్తూ కామానంద భరితమై వుందని శాస్త్రజ్ఞులు వ్యాఖ్యానిస్తారు.

'కామి గాని మోక్ష కామి కాడు' అని నానుడి వుంది. దీనికి రకరకాల అర్థాలు చెపుతారు. కామితం ఉన్నప్పుడే మోక్షం కలుగుతుందని ఈ మాటకు అర్థం అయితే, కామంలో మోక్షం ఉన్నదా అని ప్రశ్న. అవును ఉన్నది. ధర్మయుక్తమైన కామ సేవనం మోక్షదాయకమే అంటున్నాడు వాత్స్యాయనుడు. కామం ఒక మహా సంకల్పం. రతిలో సకల ప్రాణులకూ హృదయానందం కలుగుతూ ఉంది. కల్మషంలేని కామంవల్లనే జీవుల మనోవృత్తులు శాంతి పొందుతూ వున్నాయి. ఇది అఖండానందం. 'ఆనందో బ్రహ్మ' అన్నారు కదా!

ఏదైనా మితంగా వుంటే మేలు. అదే ఆరోగ్యంకూడా. 'అతి సర్వత్రా వర్జయేత్' - అద్భుత కళ అయిన కామాన్ని ఉచితమైన సమయాల్లో మితంగా సేవించినప్పుడే సత్సంతాన ప్రాప్తి. అలా కాక కామం కళ్ళు విప్పి, మితిమీరి ప్రవర్తిస్తే అనర్థం తప్పదు. అతి సంభోగంవల్ల నిర్వీర్యులై అర్థాయుష్కులవుతారు.

వారికి కలిగే సంతానం కూడా దుర్బలంగా వుంటుంది. అతి కాముకత్వం వల్ల నశించిపోయిన పురుషులు అనేక పురాణ గాథల్లో కనిపిస్తారు. వారిలో విచిత్ర వీర్యుడు ఒకడు.

(ఇతని కథ భారతంలో వుంది. శంతన మహారాజుకు సత్యవతివల్ల కలిగిన కుమారుడు విచిత్ర వీర్యుడు. అతనికి అంబిక, అంబాలిక అని ఇద్దరు భార్యలు. సుందరాంగులైన ఆ ఇద్దరు రమణీమణులతో కూడి, రాజ్య విషయాలు పట్టించుకోకుండా నిరంతరం రతి క్రీడల్లో మునిగితేలుతూ వచ్చాడు విచిత్ర వీర్యుడు. ఆ విధంగా ఏడేండ్లు మితిమీరిన సురత క్రీడవల్ల విచిత్ర వీర్యుడికి క్షయ రోగం ప్రాప్తించి మరణించాడు.)

అలాగే అగ్నివర్ణుడు కూడా ఎల్లప్పుడూ స్త్రీ లోలుడై, భోగపరాయణుడై నశించిపోయాడు.

రఘువంశంలో పుష్యుడనేరాజున్నాడు.అతని మనుమడు సుదర్శనుడు. ఆ సుదర్శనుడి కుమారుడే అగ్నివర్ణుడు. అతను స్త్రీ లోలుడు కావడం వల్లనే అల్పాయుష్కుడై మరణించాడు.

ఇలా ఎన్నో కథలు. అంతే కాకుండా 'కామాతురాణాం నలజ్జాన భయం' అన్నట్లు కామాంధులైన వారు సిగ్గు, భయం, నీతి, నియమం లేకుండా పర భార్యలను కోరడం లోకంలో సహజం. అలాంటిదాన్ని నివారించి, పురుషుడు స్వభార్య యందే అనురక్తుడై మితంగా కామ సుఖాలు అనుభవించడానికి, సద్బ్రహ్మచారి అయిన వాత్స్యాయన ముని ఈ శాస్త్రం రచించాడు. స్త్రీని ఆకర్షించడంలో పురుషుడే ఎక్కువ నేర్పు కలిగి వుండాలి. స్త్రీ ఎలాంటి పురుషుణ్ణి నచ్చుతుందో, ఎలాంటి పురుషుడు ఎలాంటి స్త్రీకి తగినవాడో కూడా లోక హితువును అభిలషించి చెప్పాడు శాస్త్రకారుడు. అందుచేత ఈ శాస్త్రం మంచిని బోధించడానికే పుట్టింది కాని చెడును బోధించడానికి కానే కాదు.

అన్ని దేశాల వాఙ్మయంలోనూ ప్రేమ, శృంగారాలకు సంబంధించిన రచనలు అనేకం కానవస్తాయి. ఆయా రచయితలు విభిన్న దృక్పథాల నుండి ఈ విషయాన్ని పరిశీలించి రచనలు సాగించారు. స్త్రీ, పురుషుల లైంగిక సంబంధాలపై హావలాక్ ఎల్లిస్ రచన ప్రసిద్ధమైనది. అయితే, మన దేశంలో వాత్స్యాయన మహర్షి సంస్కృతంలో రచించిన 'కామ సూత్రాలు'- అత్యంత ప్రాచీనమైనవిగా, పరమ ప్రామాణికమైనవిగా పరిగణిస్తారు. మరి వాత్స్యాయనుడికి ముందూ, ఆ తర్వాతా ఇలాంటి రచనలు లేవా అంటే- ఉన్నాయి. ఉన్నప్పటికీ భారతీయ శృంగార సాహిత్యంలో వాత్స్యాయనుడే తరువాతి వారందరికీ మార్గ దర్శకుడుగా కనిపిస్తాడు.

## వాత్స్యాయనుడికి ముందు

ప్రజాపతి ప్రజలను సృష్టించి, వారు ధర్మార్థకామాలు క్రమ పద్ధతిలో సాధించి సుఖ జీవనం సాగించడానికి లక్ష అధ్యాయాలు గల శాస్త్రం ప్రవచించాడట. అందులో

ఒక్క ధర్మాన్ని మాత్రమే తీసుకుని వైవస్వత మనువు ధర్మాధికారికమైన శాస్త్రం నిర్మించాడు. అలాగే అర్థాన్ని విడిగా గ్రహించి దేవ గురువైన బృహస్పతి అర్థాధి కారికమైన శాస్త్రం రచించాడు. ఇక మిగిలిందల్లా కామం. శంకరుడి కింకరుడైన నందీశ్వరుడు కామ పురుషార్థాన్ని వేరుగా గ్రహించి, వేయి అధ్యాయాల కామ సూత్రాన్ని చెప్పాడు. ఆ తరువాత దాన్నే ఔద్దాలకి అయిన శ్వేతకేతువు సంగ్రహించి ఐదు వందల అధ్యాయాల కామ శాస్త్రం రచించాడు. పిమ్మట దాన్నే సంక్షేపించి పాంచాల దేశస్థుడైన బాభ్రవ్యుడు నూట యాభై అధ్యాయాల శాస్త్రం సంతరించాడు. అందులో ఏడు అధికరణాలు వున్నాయి. సాధారణం, సాంప్రయోగికం, కన్యాసంప్రయుక్తం, భార్యాధికారికం, పారదారికం, వైశికం, ఔపనిషదికం, - అని వాటి పేర్లు. ఆరవది అయిన వేశ్యాధికరణాన్ని విడిగా తీసుకుని దత్తకుడనేవాడు పాటలీ పుత్రంలోని వేశ్యలకోరికపై ప్రత్యేక గ్రంథంగా రూపొందించాడు. అలాగే సాధారణాధికరణాన్ని చారాయణుడు, సాంప్రయోగికాన్ని సువర్ణనాభుడు, కన్యాసంప్రయుక్తాన్ని ఘోటకముఖుడు, భార్యాధికారికాన్ని గోనర్దీయుడు, పారదారికాన్ని గోణికాపుత్రుడు ఔపనిషదికాన్ని కుచుమారుడు వేరు వేరు గ్రంథాలుగా నిర్మించారు. (వీరిని గురించి మరి కొంత ముందు ముందు వివరిస్తాను.)

ఈ విధంగా పూర్వాచార్యులు పలువురు ఖండ ఖండాలుగా నిర్మించిన కామశాస్త్రం కాలక్రమేణా శిథిలమైపోయింది. బాభ్రవ్యుడి గ్రంథం సంపూర్ణమైనదే అయినా చాలా పెద్దది, చదవడానికి సాధ్యం కానిది. అందుచేత పూర్వాచార్యులు నిర్మించిన శాస్త్రాలలోని విషయాలన్నీ సంక్షేపించి పఠన యోగ్యంగా, ప్రామాణికంగా ఉండేలా వాత్స్యాయనుడు ఒక శాస్త్రాన్ని నిర్మించి దానికి 'కామసూత్రమ్' అని పేరు పెట్టాడు.

## వాత్స్యాయనుడి తరువాత

ఒక్క వాత్స్యాయనుడి కామసూత్రాలు తప్ప, తక్కిన పూర్వపు గ్రంథాలేవీ ఇప్పుడు మనకు లభ్యం కావు. ప్రస్తుతం మనకు లభించే గ్రంథాలు ఇవి:

*1) రతి రహస్యం, 2) పంచసాయకం 3) స్మర ప్రదీపం, 4) రతి మంజరి, 5) రస మంజరి, 6) అనంగరంగం, ఇత్యాదులు.*

ఇవన్నీ వాత్స్యాయనుడి కామసూత్రాల తరువాత వచ్చినవే. కొక్కోకం, కోకశాస్త్రం అనే పేర్లతో బహుళ ప్రచారం పొందిన రచన 'రతి రహస్యం'. దీని రచయిత కొక్కోకుడు. వేణు దత్తుడి ప్రీతి కోసం (బహుశా ఇతడు ఒక రాజై ఉండవచ్చు) ఈ గ్రంథం రచించినట్లు తెలుస్తున్నది. ఇది పది పరిచ్ఛేదాల గ్రంథం. ప్రతి అధ్యాయం చివర తన పేరు సిద్ధపతీయ పండిత అని పేర్కొన్నాడు రచయిత. ఈ గ్రంథంలో చెప్పిన కొన్ని విషయాలు వాత్స్యాయనుడి కామ సూత్రాల్లో కనిపించవు. ఉదాహరణకు పద్మిని, చిత్తిని, శంఖిణీ, హస్తిని - అనే స్త్రీల జాతుల లక్షణాలు. ఏఏ జాతి స్త్రీలు, ఏఏ రోజుల్లో,

ఏఏ సమయాల్లో కామోద్దీపనం కలిగి వుంటారో కూడా ఈ గ్రంథంలో రచయిత వివరించాడు. దీని రచనా కాలం ఎప్పుడో ఇదమిద్ధంగా చెప్పలేము. దీపిక అనే పేరుతో కాంచీనాథుడు, సుప్రకాశిక అనే పేరుతో రామచంద్ర బుధేంద్రుడు కొక్కోకానికి వ్యాఖ్యాలు రచించినట్లు సంస్కృత వాఙ్మయ చరిత్రకారులు చెపుతున్నారు. ఈ గ్రంథాన్ని బట్టే హరిహర పండితుడు 'శృంగార దీపిక' అనే నామాంతరం గల మరొక 'రతి రహస్యం' రచించాడట. ఏమైనా కొక్కోక కవి సింహళీయుడనీ, మల్లినాథుడు పేర్కొన్న ఈ కవి పదిహేనవ శతాబ్దంలోని వాడై వుంటాడని సంస్కృత వాఙ్మయ చరిత్ర కర్త మహామహోపాధ్యాయ మల్లాది సూర్యనారాయణ శాస్త్రివర్యుల అభిప్రాయం.

ఇక 'పంచసాయకం' రచయిత జ్యోతిరిషుడు. ఇతడు కవి చూడామణి అని, చతుష్షష్టి కళా కోవిదుడని, సంగీత విద్వాంసుడని చెపుతారు. దేవతలు వెల్లడించిన ప్రణయ సూత్రాలను ప్రతిబింబింపజేస్తూ, గోణికా పుత్రుడు, మూలదేవుడు, బాభ్రవ్యుడు, రతిదేవుడు, నందికేశ్వరుడు, క్షేమేంద్రుడు, మున్నగు వారి అభిప్రాయాలను పరిశీలించి తాను ఈ గ్రంథం రచించినట్లు రచయిత చెప్పుకున్నాడు. అయితే ఇతడు పేర్కొన్న రచయితల గ్రంథాలేవీ ఇప్పుడు కనిపించవు. మన్మథుడి ఐదు బాణాలకు ప్రతీకలుగా ఐదు అధ్యాయాలుగల గ్రంథం 'పంచ సాయకం' సుమారు 600 శ్లోకాలు.

'స్మర ప్రదీపం' రచయిత గుణాకరుడు. నాలుగు వందల శ్లోకాల గ్రంథం ఇది. ఇందులో ప్రేమ సూత్రాలకు సంబంధించిన విషయాలు చాలా అల్పం. తక్కిన విషయాలు అధికం.

'రతి మంజరి' రచించినవాడు ప్రసిద్ధ కవి జయదేవుడట. ఈ మహాకవి కేవలం 125 శ్లోకాలలో శృంగార కావ్యాన్ని రచించాడు. ఇక 'రస మంజరి' రచయిత భానుదత్తుడు. ఈ గ్రంథం వ్రాతప్రతిలోని చివరి శ్లోకంలో ఇతడు గణేశ్వరుడనే బ్రాహ్మణపుత్రుడనీ, కవి అని, తిర్హుత్ రాష్ట్రానికి చెందిన వాడనీ వుందట. ఈ సంస్కృత గ్రంథంలో నాలుగు జాతుల స్త్రీ పురుషులను గురించి చెప్పాడు రచయిత. వయస్సు, రూపురేఖలు, గుణగణాలు, ప్రవర్తన మొదలైన వాటిని బట్టి స్త్రీ పురుషులను ఇలా జాతులుగా విభజించాడు. ఇది మూడు అధ్యాయాల గ్రంథం. రచనా కాలం ఎప్పుడో చెప్పడం కష్టం.

ఇక మిగిలింది 'అనంగరంగం'. అనంగుడంటే మన్మథుడు. దీని రచయిత కళ్యాణ మల్లుడు. ఈ గ్రంథంలో కొన్ని భాగాలు మరీ పచ్చిగా వర్ణించబడినాయి. మహమ్మదీయ నాయకుడు 'లోడీఖాన్' సంతుష్టి కోసం రచయిత ఈ గ్రంథాన్ని రచించినట్లు తెలుస్తున్నది. రచనాకాలం 15 లేక 16వ శతాబ్దమని చరిత్రకారులు ఊహిస్తున్నారు. పది ప్రకరణాల గ్రంథం ఇది. ఇంగ్లీషులోకి తర్జుమా అయింది. కామ శాస్త్రానికి సంబంధించిన సంస్కృత గ్రంథాలలో ఇదే చివరిది కావచ్చు.

వాత్స్యాయనుడి అసలు పేరు మల్లినాగుడు. వాత్స్యాయన అనేది గోత్రనామం, వంశనామం కూడా. ఇతడు కఠోర బ్రహ్మచర్యం అవలంబించిన మహర్షి. అలాంటివాడు శృంగార శాస్త్రం రచించడమేమిటి? ఎవరికైనా వింతగా తోచవచ్చు. కాని, వేదార్థాలనే తత్త్వదృష్టితో పరిశీలించి లోక శ్రేయస్సు కోసం ఈ శాస్త్రాన్ని రచించాడు. సకల వర్ణాలవారూ తమ తమ గృహస్థ ధర్మాలు సవ్యంగా అనుష్ఠించడానికీ జితేంద్రియులై ఐహిక, ఆముష్మికాలు సాధించడానికీ సుఖ సంతోషాలతో జీవయాత్ర సాగించడానికీ ఈ కామ శాస్త్రాన్ని నిర్మించాడనేది సుస్పష్టం. ముఖ్యంగా బాభ్రవీయమైన కామ శాస్త్రాన్ని అనుసరించి రచించిన ఈ కామ సూత్రాలకు కొందరు వ్యాఖ్యానాలు వ్రాశారు. వాటిలో యశోధరుడి జయమంగళ వ్యాఖ్య, వీరభద్రుడి కందర్ప చూడామణి, భాస్కర నృసింహశాస్త్రి కృత సూత్ర వృత్తి ముఖ్యమైనవి. వీటిలో 'జయమంగళ' వ్యాఖ్య ప్రశస్తమైనది. వ్యాఖ్యాత యశోధరుడు 10వ శతాబ్దం వాడని చరిత్రకారుల అభిప్రాయం. ఇతడు ఒక సామంత ప్రభువట. ఇతడి గురువు పేరు ఇంద్రపదుడు. తనకు దూరమైన భార్య యశోధర పేర ఈ వ్యాఖ్య రచించాడని కొందరంటారు. ఇక భాస్కర వంశీయుడైన నృసింహశాస్త్రి కృతసూత్రవృత్తి, జయమంగళ వ్యాఖ్య తరువాత పుట్టింది. ఈ నృసింహశాస్త్రి కాశీ నివాసుడట. సర్వేశ్వర శాస్త్రి శిష్యుడట. వత్సరాజు ఆదేశంపై కామ సూత్రాలకు వ్యాఖ్యానం రచించినట్లు తెలుస్తున్నది. ఇతడు 18వ శతాబ్దం ప్రథమ భాగంలోని వాడనీ, భాస్కర అనే ఇంటిపేరును బట్టి ఆంధ్రుడై వుంటాడనీ బ్రహ్మ శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి అభిప్రాయం.

## వాత్స్యాయనుడు ఎవరు? ఎప్పటివాడు?

కౌటిల్యుడి అర్థశాస్త్రం, వాత్స్యాయనుడి కామశాస్త్రం లోక ప్రసిద్ధమైనవి. వాత్స్యయనుడు క్రీ.పూ. ప్రథమ శతాబ్దం వాడనీ, కాదు క్రీ.పూ. మూడవ శతాబ్దం వాడనీ రెండు మతాలున్నాయి. కీత్ మొదలైన పండితులు కొందరు ఈ రెండో అభిప్రాయాన్నే సమర్థించారు. కామ సూత్రాల్లో కుంతల దేశాధీశుడైన శాతకర్ణి శాతవాహనుని ప్రస్తావన వుంది. ఇతని భార్య మలయవతి. కామోద్రేకంలో ఇతడు 'కర్తరి' ప్రయోగం చేసి భార్యను చంపాడనీ అందుచేత ఉద్రేకంతో ఇలాంటి పనులు చేయరాదని హెచ్చరిస్తాడు. ఈ రాజు కాలం ఒకటవ శతాబ్దం. కాబట్టి వాత్స్యాయనుడు కూడా ఆ కాలం వాడే అయి వుంటాడని ఒక అభిప్రాయం. కాగా, ప్రఖ్యాత జ్యోతిశ్శాస్త్రవేత్త వరాహమిహిరుడు తన 'బృహత్సంహిత' 18వ అధ్యాయంలో కామశాస్త్రాన్ని గురించి చెప్పాడు. అతడు చాలా విషయాలు వాత్స్యాయనుడి కామ సూత్రాల నుంచి స్వీకరించినట్లు కనిపిస్తుంది. వరాహమిహిరుడి కాలం 6వ శతాబ్దం అని చరిత్రకారుల నిర్ణయం. కాబట్టి కామ సూత్రాల రచనాకాలం దీనికి పూర్వమే అని అనుకోవలసి వుంది. ఆ విధంగా వాత్స్యాయనుడు క్రీ.పూ. ఒకటవ శతాబ్దికి ముందువాడు కాని, క్రీ.శ. ఆరవ శతాబ్దానికి తరువాతివాడు

కానేకాడని స్పష్టమౌతుంది. అంతే కాకుండా కాళిదాసు, దండి, భవభూతి, మున్నగువారు వాత్స్యాయనుడి కామసూత్రాలలోని అంశాలను తమ కావ్యాంలో పొందు పరిచారు. దీన్నిబట్టి కామ సూత్రాలపై వారికి ఎంతటి గౌరవం వుందో తెల్లమవుతుంది. వాత్స్యాయనుడు వీరందరి కంటే పూర్వీకుడని విశదమవుతుంది. అంతేకాక పతంజలి సమకాలికుడనికొందరంటారు. ఏమైనా అనేకమంది కాల నిర్ణయంలాగానే వాత్స్యాయనుడి కాలాన్ని గురించి కూడా ఇంకా విచారించవలసి వుంది.

కామ సూత్రాలు ఏడు అధికరణాల గ్రంథం. దాదాపు 1250 కి పైగా సూత్రాలు. ముప్పయి ఆరు అధ్యాయాలు. ప్రపంచంలోని ప్రధాన భాషలన్నింటిలోకి ఇది తర్జుమా చేయబడింది. సంస్కృత మూలంలోని ముఖ్యాంశాలు ఏవీ విడిచిపెట్టకుండా సర్ రిచెర్డు బర్టన్, ఎస్. ఎఫ్. ఆర్బత్ నాట్‌లు ఇంగ్లీషులోకి అనువదించారు. ఆంగ్లాను వాదం మొట్టమొదటిసారిగా 1883 లోలండన్ నుంచి, వారణాసి నుంచి వెలువడింది. దీన్ని అనుసరించే ఆ తరువాత అనేక భాషల్లోకి తర్జుమా అయి, పలు రూపాలలో ఖరీదైన ముద్రణలు వెలువడినాయి. కొద్ది కాలం క్రిందట ముల్కరాజ్ ఆనంద్,నాన్‌స్కేన్ సంపాదకత్వంలో చాలా అందమైన ఇంగ్లీషు ముద్రణను వెలువరించాడు. అందులో అపురూపమైన చిత్ర పటాలు, శిల్ప చిత్రాలు, దారు ప్రతిమలు చేర్చారు. సర్వాంగ సుందరమైన ఈ ప్రతి వెల ఎనిమిది వందల రూపాయిలు!

కామసూత్రాలలో పారదారిక ప్రకరణం అని ఒకటి వుంది. మరి, పరస్త్రీ పొందు కోరడం నీతి బాహ్యం కాదా అని ప్రశ్నించవచ్చు. కాని, ఈ శాస్త్రాన్ని ఆద్యంతం శ్రద్ధగా చదివితే పరదార గమనం ప్రవృత్తికి కాదని, దాని నివృత్తికే అని స్పష్టమౌతుంది. కామాంధులై పర భార్యలను అభిలషించేవారు చేసే రకరకాల చేష్టలు, వారు పన్నే ఉపాయాలు ఇందులో చెప్పాడు వాత్స్యాయనుడు. సద్బుద్ధితో, నిగ్రహంతో వాటిని గురించి చదివిన వారు పర భార్యల జోలికిపోరు. స్వ భార్యల యందే అనురక్తులవుతారు. అంతే కాకుండా ఏ శాస్త్రమైనా మనలను సన్మార్గంలో పెట్టడానికే ఉద్దేశించబడింది కాని, దుర్మార్గ ప్రవర్తకులుగా చేయడానికి కాదు. లోక వృత్తి పరిశీలించి, తెలుసుకోడానికే శాస్త్రకారుడు దోషాలను వివరించాడు. వాటిని గుణాలుగా భావించరాదు. అందుచేతనే వాత్స్యాయనుడు ఒక హెచ్చరిక చేశాడు. ఒక పురుషుణ్ణి, ఒక స్త్రీ ప్రేమించాలంటే, ఆమె ప్రేమించగల లక్షణాలు అతనిలో వుండాలి. అప్పుడే ఆ స్త్రీకి అతను ప్రియుడు కాగలుగుతాడు. పురుషుడు ఎంతటి శ్రీమంతుడైనా, స్త్రీ ప్రేమించగల లక్షణాలు లేకపోతే, ఆమెకు నిజమైన ప్రియుడు లేదా భర్త కాలేడతను. ఈ విషయం అందరూ గ్రహించాలి. లోకంలో వివాహాలు అనేకం విఫలం కావడానికి ఇది కూడా ఒక కారణం కావచ్చు. ముఖ్యంగా ఐశ్వర్యవంతులూ, అధికారం కలవారు అవశ్యం అవగతం చేసుకోవలసిన విషయం ఇది. ఎందుచేత నంటే, లోకంలో సామాన్య ప్రజానీకానికి ఆదర్శ ప్రాయులెవరు?

ప్రభువులూ, దేశనాయకులూ, ఉన్నత పదవుల్లో వుండి వ్యవహారాలు నిర్వర్తిస్తూ సమాజాన్ని నడిపించేవారు. మరి వారే అపమార్గం పట్టి, అవినీతి పరులైతే జన సామాన్యం కూడా వారినే అనుసరిస్తుంది. 'యథా రాజా తథా ప్రజా' అన్నారు అందుకే. కాబట్టి పెద్దలనిపించుకున్న వారు ఎప్పుడూ తప్పుత్రోవ పట్టకూడదు. వాత్స్యాయనుడు ఈ విషయాన్నే ఒక హెచ్చరికగా చెప్పాడు.

ఒక పని చేయాలంటే, అందుకు తగిన అర్హత, అధికారం వుండాలి. కేవలం అభిలాష సరిపోదు. అభిలాష వున్నంత మాత్రాన అర్హత, అధికారం రాదు. వాటిని సంపాదించుకోవాలి. అందుకే జితేంద్రియులూ, రాగద్వేషాలు లేనివారు, ధర్మ ప్రవృత్తి, పాపభీతి కలవారు, మంచి ఆరోగ్యవంతులూ, కామ పురుషార్థాన్ని ధర్మబద్ధంగా సాధించాలనుకున్నవారు ఈ శాస్త్రం చదవాలని వాత్స్యాయనుడు చెప్పాడు.



# వాత్స్యాయన కామ సూత్రాలు

## సాధారణాధికరణం - 1

### ప్రథమాధ్యాయం - శాస్త్రసంగ్రహం

*1. ధర్మార్థ కామేభ్యోనమః 2. శాస్త్రే ప్రకృతత్వాత్*

పురుషార్థాలు నాలుగు అవి: ధర్మం, అర్థం, కామం, మోక్షం. వీటిలో మొదటి మూడు అయిన ధర్మార్థకామాలను 'త్రివర్గం' అంటారు.

వాత్స్యాయన ముని 'కామసూత్రమ్' అనే శాస్త్ర రచన ఆరంభిస్తూ, ధర్మార్థ కామాలకు నమస్కరిస్తున్నాడు. ఏ రచయిత అయినా గ్రంథం రచించేటప్పుడు ప్రారంభంలో తన ఇష్టదైవాన్ని ప్రార్థించడం ఆనవాయితీ. అదే ధర్మం కూడా. అయితే, వాత్స్యాయనుడు అలా చేయలేదు. ఎందు చేతనంటే, అతడు వ్రాస్తూ ఉన్న శాస్త్రానికి ధర్మార్థ కామాలే ప్రధానమైన విషయాలు కావడం వల్ల వాటికే ప్రణమిల్లి, వాటినే గౌరవించాడు.

*3. తత్సమ యావబోధకే భ్యశ్చాచార్యేభః 4. తత్సంబంధాత్.*

ధర్మార్థ కామాలకు ప్రణామం చేసి వాత్స్యాయనుడు, ఆ తరువాత వాటిని ఉపదేశించిన ఆచార్యులకు కూడా నమస్కారం అంటున్నాడు. ఎందుకంటే, ఆ ఆచార్యవర్యులకు సయితం ఈ శాస్త్రంతో సంబంధం వుంది కాబట్టి.

## కామశాస్త్రానికి కర్తలెవరు ?

*5. ప్రజాపతిర్హి ప్రజాః సృష్ట్వాతాసాం స్థితి నిబంధనం త్రివర్గస్యసాధన మధ్యాయానాం శత సహస్రేణాగ్రేప్రోవాచ*

ప్రజాపతి మొట్ట మొదట మానవులను సృష్టించాడు. వారి సుఖజీవనానికి సాధనమైన ధర్మార్థాలను గురించి ఒక శాస్త్రం ప్రవచించాడు. దాని పేరు "స్థితి బంధనం". లక్ష అధ్యాయాలు గల బృహద్గ్రంథం అది.

*6. తస్యైకదేశం స్వాయంభువో మనుర్ధర్మాధికారికం పృథక్చకార*

ఈ 'స్థితి బంధనం'లో గల ధర్మార్థ కామాలలో, ధర్మాన్ని మాత్రం తీసుకుని స్వాయంభువ మనువు ప్రత్యేకంగా ఒక ధర్మ శాస్త్రం నిర్మించాడు.

(మనువులు పధ్నాలుగు మంది స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుష, వైవస్వత, సూర్యసావర్ణిక, దక్ష సావర్ణిక, బ్రహ్మ సావర్ణిక, రుద్రసావర్ణిక, ధర్మ సావర్ణిక, రౌచ్య, భౌచ్య అని వారి పేర్లు. బ్రహ్మపుత్రుడైన స్వాయంభువు మొదటి మనువు. అతని భార్య శతరూప. ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు కుమారులు. నూతి, ప్రసూతి, దేవహూతి కుమార్తెలు. మనువు కాలపరిమాణాన్నే మన్వంతరం అంటారు. అంటే 71 దివ్యయుగాలు. ఇప్పుడు నడుస్తున్నది వైవస్వత మన్వంతరం.)

*7. బృహస్పతి రర్థాధికారికం*

*8. మహాదేవాను చరశ్చ నందీ, సహస్రేణాధ్యాయానాం, పృథక్కామసూత్రం ప్రోవాచ.*

అలాగే అర్థాన్ని వేరుగా గ్రహించి, దేవ గురువైన బృహస్పతి ఒక అర్థశాస్త్రాన్ని నిర్మించాడు. ఇక మూడవది అయిన కామ పురుషార్థాన్ని స్వీకరించి, శంకరుడి బంటు అయిన నందీశ్వరుడు కామశాస్త్రాన్ని చెప్పాడు. ఇది వెయ్యి అధ్యాయాల గ్రంథం.

*9. తదేవ తు పంచభిరధ్యాయ, శతైః ఔద్దాలకిః శ్వేతకేతుః సంచిక్షేప.*

ఔద్దాలకి అంటే ఉద్దాలకుడి కుమారుడు. అతనే శ్వేతకేతువు. నందీశ్వరుడి కామ శాస్త్రాన్ని ఈ శ్వేతకేతువు సంక్షిప్తంచేసి ఐదువందల అధ్యాయాలు గల గ్రంథంగా రచించాడు.

(ఉద్దాలకుడు ఒక ముని. ఇతడు శ్వేతకేతువు తండ్రి, అష్టావక్రుడి మేనమామ. బ్రహ్మజ్ఞాని. ఇతని ఇంటికి వచ్చిన అతిథి ఒకడు ఇతడి భార్యను కామించి, ఆమెతో రమించాడు. ఆ కాలంలోని మానవ సమాజంలో కొన్ని దురాచారాలుండేవి. అతిథి ఎవరైనా ఇంటికొస్తే, గృహస్థు అతన్ని అన్ని విధాలా సంతోష పెట్టాలి భోజనం మొదలైన మర్యాదలతోపాటు, అతను కోరితే, తన స్త్రీ జనాన్ని కూడా పంపించి అతన్ని తృప్తిపరచాలి. ఇలాంటి ఘోరమైన ఆచారాలు ఎన్నో వుండేవి ఆ రోజుల్లో.

మరి శ్వేతకేతువు గొప్ప సంస్కర్తలా కనిపిస్తాడు. ఈ దురాచారాలను తీవ్రంగా ఖండించాడు. స్త్రీలకూ, పురుషులకూ కూడా శీలం విషయంలో కొన్ని నియమాలూ, నిబంధనలూ ఏర్పరచాడు తన గ్రంథంలో. ఈయన కామశాస్త్రం త్రేతాయుగంలోని ప్రజల కోసం వ్రాయబడినదిగా కనిపిస్తుంది.

ఈ శ్వేతకేతువు మహాపండితుడు. ఒకనాడు ఇతను ప్రవాహనుడనే రాజు సభకు వెళ్ళాడు. అప్పుడారాజు 'నీవు విద్య సంపూర్ణంగా నేర్చుకున్నావా' అని ప్రశ్నించాడు నేర్చుకున్నానని చెప్పాడు శ్వేతకేతువు. అంతట రాజు 'అయితే చనిపోయిన జీవులు ఎక్కడికి పోతారు? పితృలోకం ఎలా వుంటుంది? జీవులు మళ్ళీ భూమిమీదికి ఎలా వస్తారు?' అని అడిగాడు. శ్వేతకేతువు సమాధానం చెప్పలేకపోయాడు. అప్పుడారాజు 'ఇంతేనా నీ చదువు?' అని ఆక్షేపించాడు. అంతట శ్వేతకేతువు ఇంటికి వచ్చి జరిగిన సంగతి తండ్రికి చెప్పాడు. రాజు ప్రవాహనుడు అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పగల విద్య తనకెందుకు నేర్పలేదని

తండ్రిని అడిగాడు. ఆ విషయాలు తెలుసుకో గల విద్య తనకూ రాదని చెప్పి, తండ్రి ఉద్దాలకుడు తానే ప్రవాహనుడి దగ్గరికి వెళ్ళాడు. ఆయన వల్ల జీవులు మేఘాలై, జలమై, తరువాత ఓషధులై ఎలా జన్మించేదీ తెలుసుకున్నాడు. ఆతరువాత కుమారుడు శ్వేతకేతువుకు బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించాడు.)

*10. తదేవ తు పునరథ్యర్థే నాధ్యాయ, శతేన, సాధారణ,*
*సాంప్రయోగిక, కన్యా సంప్రయుక్తక, భార్యాధి కారిక, పారదారిక,*
*వైశికౌపనిషదికైః సప్త భిరధి కరణైః, బాభ్రవ్యః పాంచాలః సంచిక్షేప.*

ఆ తరువాత శ్వేతకేతువు గ్రంథాన్నే ఇంకా కొంత సంక్షిప్త పరిచి బాభ్రవ్యుడనే అతను ఒక కామ శాస్త్రాన్ని నిర్మించాడు. ఇతను పాంచాల దేశస్థుడు. (ఇంతకన్నా వివరాలుతెలియవు) నూట యాభై అధ్యాయాల శాస్త్రం ఇది. అందులో ఏడు అధికరణాలు (ప్రకరణాలు) ఉన్నాయి. అవి సాధారణం, సాంప్రయోగికం, కన్యాసంప్రయుక్తం, భార్యాధికారికం, పారదారికం, వైశికం, ఔపనిషదికం అనేవి. ఈ శాస్త్రం ద్వాపరయుగంలో ప్రజల కోసం ఉద్దేశించబడింది.

*11. తస్య షష్ఠం వైశిక మధికరణం పాటలీ పుత్రకాణాం,*
*గణికానాం, నియోగాదత్తకః పృథక్చకార.*

బాభ్రవ్యుడి కామ శాస్త్రంలో వైశికం అనే అధికరణం ఉంది. అది కేవలం వేశ్యలకు సంబంధించింది. దాన్ని ఆధారం చేసుకుని దత్తకుడనే అతను ఒక గ్రంథం రూపొందించాడు. పాటలీపుత్రంలో (ఇప్పటి పాట్నా) ఉంటూ వున్న వేశ్యాంగనులు తనను ఎంతగానో వేడుకోగా దత్తకుడు ఈ గ్రంథాన్ని రచించినట్లు చెపుతారు. ఇతనికి దత్తకుడనే పేరు రావడానికి, ఇతనీ శాస్త్రం వ్రాయడానికి కారణమైన ఒక కథ జనంలో ప్రచారమై వుంది.

## దత్తకాచార్యుడి కథ

పాటలీపుత్ర నగరంలో ఒక బ్రాహ్మణుదుండేవాడు. వృద్ధాప్యంలో అతనికొక కొడుకు పుట్టాడు వాడు పుట్టగానే తల్లి చనిపోయింది. ముసలివాడైన తండ్రి ఆ పిల్లవాణ్ణి పెంచలేక ఒకామెకు పెంచుకోమని ఇచ్చాడు. తరువాత కొన్నాళ్ళకు అతను చనిపోయాడు. దత్తత తీసుకున్నది కాబట్టి పెంపుడు తల్లి ఆ పిల్లవాడికి దత్తకుడని పేరు పెట్టింది. పెంచి పెద్దవాణ్ణి చేసింది. దత్తకుడు సకల విద్యాపారంగతుడైనాడు. అన్ని కళల్లోనూ గొప్ప పాండిత్యం సంపాదించాడు. మహా వక్తగా, ఆచార్యుడుగా ప్రసిద్ధి కెక్కాడు.

అయితే, ఇంత చదివినా దత్తకుడికి లోకయాత్రను గురించి తెలియదు. కామకళను గురించి అనుభవపూర్వకమైన జ్ఞానం అసలేలేదు. అది తెలుసు కోవాలని బుద్ధి పుట్టిందతనికి కాని, ఆ కాలంలో ఈ కామకళ ఒక్క వేశ్యలకే బాగా తెలుసు. ఆ రోజుల్లో పాటలీ పుత్రనగరం వేశ్యాంగలనకు ప్రసిద్ధి. అందచందాల్లోనూ, ఆటపాటల్లోనూ వారికెవరూ సాటిరారు. సరససల్లాపా లాడడంలో, వివిధ రీతుల్లో

సురత క్రీడ సలపడంలో వారు ఎంతో నేర్పుకలవారు. అందుచేత దత్తకుడు మెల్లగా ఆ వేశ్యలతో పరిచయం ఏర్పరచుకున్నాడు. వారి మందిరాలలో యధేచ్ఛగా విహరించాడు. స్వతహాగా బుద్ధిశాలీ, పండితుడూ కావడంవల్ల స్వల్ప కాలంలోనే కామకళలో రహస్యాలు, మెళుకువలు ఇట్టే గ్రహించి చివరకు వేశ్యలనే మించిపోయాడు. తరువాత యౌవ్వనంలో వున్న వీరసేన అనే వేశ్య, మరి కొందరు గణికలు దత్తకుడి దగ్గరకి వచ్చి విటులను ఆకర్షించి ఆకట్టుకోడానికీ, వారిని నానా విధాల సంతోష పెట్టడానికి కామకళా రహస్యాలు చెప్పమని ఎంతగానో ప్రార్థించారు.

"పురుషుణ్ణి ఎలా సుఖ పెట్టాలి? అతను ఎల్లప్పుడూ మాపైనే మరులుగొని ఉండేలా చేయాలంటే ఎలా ప్రవర్తించాలి? ఆ రహస్యాలన్నీ మాకు విపులంగా చెప్పండి స్వామీ!" అని బ్రతిమాలు కున్నారట. అప్పుడు దత్తకుడు బాభ్రవ్యుడి కామశాస్త్రంలోని వేశ్యాధి కరణాన్ని తీసుకుని అందులోని విషయాలకు తాను అనుభవ పూర్వకంగా తెలుసుకున్న రహస్యాలు కూడా జోడించి ఒక గ్రంథాన్ని రచించాడు ఆ వేశ్యల కోసం.

ఈ దత్తకుణ్ణి గురించి మరో కథ కూడా ప్రచారంలో వుంది. మొదట ఇతను మితిమీరిన వేశ్యాలంపటుడు. ఇతని ప్రవర్తన చూచి ఏవగించుకుని ఒక మహా పురుషుడెవడో 'ఆడదానివి కమ్ము' అని శపించాట్ట. ఆ శాపం వల్ల దత్తకుడు స్త్రీగా మారాడు. కొన్నాళ్ళ తరువాత మళ్ళీ ఆ మహనీయుడి వల్ల పురుష రూపం పొందాట్ట. ఈ విధంగా దత్తకుడు అటు స్త్రీ గానూ ఇటు పురుషుడు గానూ వుండి, ఎవరికీ తెలియని అనేకానేక రతి రహస్యాలు తెలుసుకోగలిగాడు. అందువల్లనే కామశాస్త్రాన్ని ఎంతో చక్కగా విశ్లేషించి వ్రాయగలిగాడని అంటారు. ఈ కథలు ఎంతవరకు నిజమో తెలియదు కాని, ఒకటి మాత్రం సత్యం. వేశ్యల పరిచయంతో కామకళా రహస్యాలు క్షుణ్ణంగా తెలుసుకుని దత్తకుడు తన శాస్త్రం రచించాడు. అందుచేతనే అది ఎన్నో విశేషాలు గల గొప్ప గ్రంథంగా ప్రసిద్ధమైంది.

*12. తత్ప్రసంగాచ్చారాయణః, సాధారణ మధికరణం పృథ క్ప్రోవాచ.*

ఈ విధంగా బాభ్రవ్యుడి గ్రంథంలోని వేశ్యాధికరణం ఆధారంగా దత్తకాచార్యుడు విడిగా కామ శాస్త్రం రచించినట్లే, చారాయణుడు (ఇతని విషయం తెలియదు) సాధారణాధికారాన్ని విశ్లేషించి మరో శాస్త్రం రూపొందించాడు.

## కామశాస్త్రంలో ఏం ఉంది?

బాభ్రవ్యుడి బృహత్ గ్రంథంలోని వేర్వేరు ప్రకరణాలను పృథక్కరించి శాస్త్రకారులు విడివిడిగా గ్రంథాలు నిర్మించారు.

*13. సువర్ణ నాభః సాంప్రయోగికం, 14. ఘోటక ముఖః కన్యాసంప్రయుక్తకం,*

*15. గోనర్దీయో భార్యాధికారికం, 16. గోణికా పుత్రః పారదారికం,*

*17. కుచుమార ఔపనిషదికం.*

సాంప్రయోగికాన్ని సువర్ణనాభుడూ, కన్యాసంప్రయుక్తకాన్ని ఘోటకముఖుడూ, భార్యాధికారికాన్ని గోనర్దనీయుడూ, పారదారికాన్ని గోణికాపుత్రుడూ, ఔపనిషది కాన్ని కుచుమారుడూ వేర్వేరు గ్రంథాలుగా రచించారు. (ఈ పూర్వాచార్యుల పుట్టుపూర్వోత్తరాలు తెలియవు)

*18. ఏవం బహుభిరాచార్యైః, తచ్ఛాస్త్రం ఖండశః, ప్రణీత ముత్సన్న కల్పం భూయాత్.*

ఇలా భాభ్రవ్యుడు రచించిన కామ శాస్త్రాన్ని తరువాత వచ్చిన ఆచార్యులు ఖండ ఖండాలుగా చేశారు. బాభ్రవ్యుడి గ్రంథం సంపూర్ణమైనదే అయినా, చదవడానికి సాధ్యం కానంత పెద్దది. తక్కిన శాస్త్రవేత్తలు దాన్ని ముక్కలు ముక్కలుగా చేయడంతో, కాలక్రమేణా అదిఖిలమైపోయింది.

*19. తత్రదత్త కాదిభిః ప్రణీతానాం, శాస్త్రావయవానామేక దేశత్వాత్*
*మహదితి చ బాభ్రవీయస్య, దురధ్యేయత్వాత్, సంక్షిప్య*
*సర్వ మర్థమల్పేన గ్రంథేన, కామ సూత్రమిదమ్, ప్రణీతమ్.*

అప్పుడు వాత్స్యాయనుడు అనే మునివర్యుడు 'కామ సూత్రమ్' అనే గ్రంథం రచించాడు. పూర్వపు ఆచార్యుల గ్రంథాలు ముఖ్యంగా బాభ్రవ్యుడి శాస్త్రాన్ని అనుసరించి వాత్స్యాయనుడు తన గ్రంథం రచించినట్లు కనిపిస్తుంది. గ్రంథం యావత్తూ సూత్రప్రాయంగా వున్నందున దానికి 'కామ సూత్రమ్' అనే పేరు సార్థకమైంది. ఇప్పుడు మనకు లభ్యమయే కామ శాస్త్రాలలో ఇదే మొదటిదని చెపుతారు. అంతే కాకుండా మరే కామ శాస్త్రానికీ లేని ప్రసిద్ధి ఉంది దీనికి. దీన్నే ప్రామాణికంగా పరిగణిస్తారు.

*20. తస్యాయం, ప్రకరణాధికరణ, సముద్దేశః శాస్త్ర సంగ్రహః,*
*21. త్రివర్గ ప్రతిపత్తిః 22. విద్యా సముద్దేశః,*
*23. నాగరిక వృత్తమ్ 24. నాయక సహాయ దూతీకర్మ విమర్శః*
*ఇతి సాధారణమ్, ప్రథమ మధికరణమ్ ప్రకరణాని పంచ.*

ఈ కామశాస్త్రం ఏడు అధికరణాలుగా ఉంది. మొదటిది సాధారణాధికరణం. ఈ అధికరణాన్ని మళ్ళీ ఐదు ప్రకరణాలుగా విభజించాడు వాత్స్యాయనుడు. అందులో మొదటిది శాస్త్రం సంగ్రహం. శాస్త్రంలో చెప్పే విషయాలు ఇందులో సంగ్రహంగా వివరించాడు రచయిత. రెండవది త్రివర్గ ప్రతిపత్తి, ధర్మార్థ కామాలను ఒక దానికొకటి విరుద్ధం కాకుండా ఎలా సేవించాలో ఇందులో వుంది. మూడవది విద్యా సముద్దేశం. ఇక్కడ విద్యలంటే కళలు. ఈ కళలు ఆరాధించడానికి అధికారులు ఎవరో ఈ ప్రకరణలో చర్చించాడు శాస్త్రకారుడు. నాలుగవ ప్రకరణం నాగరిక వృత్తం. నగరాలలో నివసించే వారే నాగరికులు. వారి ప్రవర్తనను గురించి ఇందులో చెప్పాడు రచయిత, ఐదవది నాయక సహాయ దూతీకర్మ విమర్శ. నాయికా నాయకులకు సహాయపడే దూతికలు మొదలైన వారిని గురించి ఇందులో విచారణ

చేశాడు శాస్త్రకారుడు. ఈ విధంగా ఆ విషయాలకు తగినట్టుగా ప్రకరణాలకు పేర్లు పెట్టాడు వాత్స్యాయనుడు.

*25. ప్రమాణకాల భావేభ్యో రతావ స్థాపనం 26. ప్రీతి విశేషః,*

*27. ఆలింగన విచారాః 28. చుంబన వికల్పాః, 29. నఖరదన జాతయః*

*30. దశనచ్ఛేద్యవిధయః, 31. దేశ్యా ఉపచారాః 32. సంవేశన ప్రకారాః*

*33. చిత్రరతాని 34. ప్రహణన యోగాః*

*35. తద్యుక్తాశ్చసీత్కృతోపక్రమాః 36. పురుషాయితం,*

*37. పురుషోపసృప్తాని 38. ఔపరిష్టికం,*

*39. రతారంభావసానికం 40. రత విశేషాః,*

*41. ప్రణయ కలహః ఇతి సాంప్రయోగికం, ద్వితీయ మధికరణమ్, అధ్యాయాదశ, ప్రకరణాని సప్తదశ.*

రెండవది సాంప్రయోగికం అనే అధికరణం. ఇందులో పది అధ్యాయాలూ, పదిహేడు ప్రకరణాలూ వున్నాయి. స్త్రీ పురుషుల అంగ ప్రమాణం, రేతస్సు స్ఖలమయ్యే సమయం, స్త్రీ పురుషుల భావప్రాప్తి - ఈ విషయాలు రతావస్థాపనాధ్యాయంలో వర్ణితం. అలాగే, ప్రణయ విశేషాలూ, స్పృష్టకం మొదలైన ఆలింగన (కౌగిళ్ళు), చుంబనాది (ముద్దులు) విశేషాలూ, నఖ క్షతాలూ (గోళ్ళ నొక్కులు), దంత క్షతాలూ (పంటినొక్కులు), దేశీయాలైన ఉపచార చర్యలూ, సంభోగం కోసం స్త్రీ పురుషులను ఆయత్త పరచడం, చిత్ర రతాలూ, ప్రణయ తాడనాలూ, రతికూజితాలూ, పురుషాయితమూ (ఉపరతి), పురుషోపసృప్తము, ఔపరిష్టకమూ, సురతారంభం, సురతాంతం, రతిగతి విశేషాలూ, ప్రణయ కలహాలూ - ఇత్యాదులన్నీ ఈ అధికరణంలో వాత్స్యాయనుడు వివరించాడు.

*42. వరణ విధానం, 43. సంబంధ నిర్ణయః 44. కన్యా విస్రంభణం,*

*45. బాలాయా ఉపక్రమాః 46. ఇంగితాకార సూచనం,*

*47. ఏక పురుషాభియోగః 48. ప్రయోజ్యస్యోపా వర్తనం,*

*49. అభియోగతశ్చ కన్యాయాః ప్రతిపత్తిః,*

*50. వివాహ యోగః, ఇతి కన్యాసంప్రయుక్తకం, తృతీయ మధికరణం, అధ్యాయాః పంచ, ప్రకరణాని నవ.*

మూడవది కన్యా సంప్రయుక్తాధి కరణం. కన్యను వరించే పద్ధతి, కన్యను వివాహం చేసుకునే విధానమూ, కులస్త్రీని వశపరచుకునే పద్ధతీ, బాలను పొందాలంటే, ఆమెతో రతికి ఉపక్రమించే మార్గాలూ, ప్రియురాలికి తన అభిప్రాయాలు ఎలా తెలియజేయవలసిందీ, ప్రయోజ్యాణ్ణిని వర్తింపజేయడమూ, దాది మొదలైన వారి ద్వారా స్త్రీని పొందాలంటే విధానాలూ ఇందులో వున్నాయి.

*51. ఏకచారిణీ వృత్తం, 52. ప్రవాసచర్యా*

లోకంలో ఒక స్త్రీని ఒక పురుషుడు పెళ్ళాడినపుడు ఆమెను భార్య అంటారు. అలాంటి భార్యకు సంబంధించిన సమస్త విషయాలూ చెప్పేది

భార్యాధికరణం. ఇది నాలుగవది. ఇందులో రెండు అధ్యాయాలూ, ఎనిమిది ప్రకరణాలూ వున్నాయి.

ఒక్క భర్త చేతనే ప్రేమించబడుతూ అతని అధీనంలోనే వున్న భార్యను 'ఏకచారిణీ' అని అంటారు. ఆమెను గురించి వివరించేదే ఏకధాచారణీ వృత్తాధ్యాయం. తన భర్త ఏదైనా అవాంతరం వచ్చి దేశాంతరంలో వున్నప్పుడు ఈ ఏకచారిణీ ఏ విధంగా ప్రవర్తిస్తూ వుండాలో చెపుతుంది ప్రవాస చర్యాధ్యాయం.

*53. నపత్నీషు జ్యేష్ఠావృత్తం, 54. కనిష్ఠావృత్తం*

*55. పునర్భూవృత్తం, 56. దుర్భగావృత్తం 57. అంతఃపురికం,*

*58. పురుషస్య బహ్వీషు ప్రతిపత్తిః, ఇతి భార్యాధికారికం, చతుర్థమధికరణం, అధ్యాయౌద్వౌ, ప్రకరణాన్యష్టే.*

ఈ భార్యాధికరణంలోని రెండు అధ్యాయాలలో ఇంకా అనేక విషయాలు చెప్పాడు శాస్త్రకారుడు.

ఒక పురుషుడికి అనేకమంది భార్యలు వున్నప్పుడు వారంతా సవతులు కదా! వారిలో పెద్ద భార్య అనుసరించవలసిన విధానాలూ, అలాగే అందరిలోకి చిన్నదైన భార్య ప్రవర్తించవలసిన తీరూ, పునర్భువు (అంటే మారుమనువు కట్టుకున్న స్త్రీ), దుర్భగ (గయ్యాళి, ధూర్త అయిన కారణంగా మగడొల్లని స్త్రీ), అంతఃపురిక (రాణివాస స్త్రీ) ఈ స్త్రీల నడవడికలూ ఇందులో విశదీకరించాడు రచయిత.

59. స్త్రీ పురుష శీలావస్థాపనం, 60. వ్యావర్తన కారణాని,

61. స్త్రీషు సిద్ధాః పురుషాః 62. అయత్న సాధ్యాయోషితః,

63. పరిచయ కారణాని 64. అభియోగాః, 65. భావపరీక్ష

66. దూతీ కర్మాణి, 67. ఈశ్వర కామితం

68. అతఃపురికం దారరక్షితకం, ఇతి పారదారికం, పంచమ మధికరణం అధ్యాయాః షట్, ప్రకరణాని దశ.

పారదారికం అనే ఐదవ అధికరణంలో అధ్యాయాలు ఆరు, ప్రకరణాలు పది. పరస్త్రీ ఎలాంటిదో, ఎలా వుంటుందో, చెప్పేది కావడంవల్ల ఈ అధికరణానికి పారదారికం అని పేరు. స్త్రీ పురుషుల స్వభావాలు సాధారణంగా ఎలా ఉంటాయి? పురుషుల పట్ల స్త్రీలు విముఖులుగా వుండడానికి కారణాలు ఏమిటి? స్త్రీల కోసం వెంపరలాడే పురుషుణ్ణి కనుక్కోవడం ఎలాగ? అప్రయత్నంగా లభ్యమయ్యే స్త్రీలు ఎలాంటివారు? - ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరుకుతాయి. ఇందులో.

*69. గమ్యచింతా, 70. గమన కారణాని 71. ఉపావర్తన విధిః,*

*72. కాంతానువర్తనం 73. అర్థాగమోపాయాః 74. విరక్తలింగాని*

*75. విరక్త ప్రతిపత్తిః, 76. నిష్కాసన ప్రకారా. 77. విశీర్ణ ప్రతిసంధానం,*

*78. లాభవిశేషః 79. అర్థానర్థానుబంధ సంశయ విచారః*

*80. వేశ్యా విశేషాశ్చ ఇతి వైశికం, షష్ఠమధికరణం, అధ్యాయాః షట్ ప్రకారాణాని ద్వాదశ.*

# కామం అంటే ఏమిటి?



అరవ అధికరణం వైశికం. ఇందులో ఏడు అధ్యాయాలూ, పన్నెండు ప్రకరణాలూ వున్నాయి. వేశ్యల దగ్గరికి వెళ్ళాలంటే అందుకు సహాయపడే వాళ్ళు ఎలా వుండాలి? పొందదగిన పురుషులెవరో? పొందతగని పురుషులెవ్వరో నిర్దేశించి చెప్పడం ఎలా? కారణాలు ఎలాంటివి? పొందదగిన వాళ్ళను ఎలా దగ్గరికి రప్పించుకోవాలి? ఈ విషయాలన్నీ మొదటి అధ్యాయంలో వున్నాయి. రెండవ అధ్యాయంలో కాంతానువృత్తం గురించీ, మూడవ అధ్యాయంలో ధనార్జన చేయడానికి అవసరమైన ఉపాయాలను గురించీ వుంది. అలాగే, స్త్రీ అంటే విరక్తిపుట్టిన వారెవరో గుర్తించడం, నిష్కాసన (వాళ్ళను వెళ్ళగొట్టే) పద్ధతీ చెప్పారు. నాలుగో అధ్యాయంలో వియోగం పొందిన వారిని, మరల సమకూర్చడం, ప్రతి సంధాన విధానం వర్ణించారు. ఐదవ అధ్యాయంలో లాభానికి సంబంధించిన విశేషాలూ, ఆరో అధ్యాయంలో అర్థ అనర్థానుబంధ సంశయ విచారం వివరించాడు శాస్త్రకారుడు.

*81. సుభగంకరణం. 82. వశీకరణం 83. వృష్యాశ్చ యోగాః*

*84. నష్టరాగ ప్రత్యాయనం 85. కామవృద్ధిః 86. వృద్ధి నిధయః*

*87. చిత్రాశ్చ యోగాః ఇత్యౌపనిషదికం, సప్తమ మధికరణం, అధ్యాయౌద్వౌ ప్రకరణానిషట్.*

ఈ శాస్త్రంలో చివరిదైన ఏడవ అధికరణం ఔపనిషదికం. ఇందులో రెండు అధ్యాయాలూ, ఆరు ప్రకరణాలూ వున్నాయి. రకరకాల తంత్రాలు ప్రయోగించినా, కామపురుషార్థాన్ని పొందడం సాధ్యం కాకపోతే, అప్పుడు ఔషధాలు ఏవో, అవసరం అవుతాయి. మరి, ఆ ఔషధాలు, వాటిని ఎలా ప్రయోగించాలో వివరించే అధికరణం ఇది. మొదటి అధ్యాయంలో సుభగంకరణమూ, నష్టమైపోయిన కామాన్ని తిరిగి పొందడానికి ఉపాయాలూ, కామం వృద్ధిపొందడానికి కావలసిన యోగ ప్రక్రియలూ వర్ణితమైనాయి. అలాగే రెండవ అధ్యాయంలో ప్రేమానురాగాలు పోగొట్టుకుంటే వాటిని తిరిగి సంపాదించే మార్గాలూ, ప్రేమను వృద్ధి చేసే యోగాలూ, ఇంకా రకరకాల చిత్రయోగాలూ ఇవన్నీ చెప్పాడు శాస్త్రకారుడు.

*ఏవం షట్ త్రింశదధ్యాయాః, చతుః షష్టిః ప్రకరణాని, అధికరణాని సప్త, పాదం శ్లోకసహస్రం, ఇతి శాస్త్ర సంగ్రహః*

ఈ విధంగా వాత్స్యాయన కామసూత్రాలు అనే గ్రంథం మొత్తం ముప్పయి ఆరు అధ్యాయాలతోనూ, అరవైనాలుగు ప్రకరణాలతోనూ, ఏడు అధికరణాలతోనూ, సహస్రాధికమైన శ్లోకాలతోనూ అలరారుతూ ప్రపంచంలో ప్రఖ్యాతి పొందింది.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే సాధారణే ప్రథమే ధికరణే శాస్త్ర సంగ్రహః, ప్రథమోధ్యాయః, ప్రథమాధికరణమ్*

**ఇది వాత్స్యాయన ముని విరచిత కామసూత్రాల్లో సాధారణం అనే ప్రథమాధికరణంలోని శాస్త్ర సంగ్రహ అనే మొదటి అధ్యాయం.**



# ద్వితీయాధ్యాయం
# త్రివర్గ ప్రతిపత్తి

1. శతాయుర్వై పురుషః విభజ్యకాల మన్యోన్యానుబద్ధం,
పరస్పర స్యానుప ఘాతుకం, త్రివర్గం, సేవేత.

**ధర్మం**, అర్థం, కామం - ఈ మూటినే త్రివర్గం అంటారు. ఈ శాస్త్రానికి ఫలితం ఏమిటయ్యా అంటే, ఆ త్రివర్గాన్ని సాధించడమే. ధర్మార్థ కామాలు ఒకదాని నొకటి ఆశ్రయించుకుని వున్నాయి. ప్రతిమనిషి ఈ మూటినీ సాధించడానికి నిరంతరం కృషి చేస్తూనే వుండాలి. తప్పదు. అయితే వీటిని సాధించడం అంత సులభం కాదు. అందుకు ఉపాయం కావాలి. మరి, ఏమిటా ఉపాయం? సాధారణంగా ఉపాయం మూడు విధాలు. ఒకటి అనుష్ఠానం, రెండు అవబోధం, మూడు సంప్రతిపత్తి. అనుష్ఠానం అంటే ఆచరించడం. అవబోధం అంటే తెలుసుకోవడం. సంప్రతిపత్తి అంటే ఫలితాన్ని అనుభవించడం.

అయితే, ఇక్కడ ఒక విశేషం వుంది. ఈ మూటిలోను, అనుష్ఠానం ముఖ్యమైంది. కాబట్టి, దాన్ని గురించే ఇక్కడ చెబుతున్నాడు వాత్స్యాయనుడు. లోకంలో సాధారణంగా మానవుడి ఆయుర్దాయం నూరేండ్లు. ఈ నూరు సంవత్సరాలలోనూ ధర్మార్థ కామాలు మూటినీ సాధించడానికి ప్రతి మానవుడూ ప్రయత్నించి తీరాలి, అంతేకాదు, ఈ మూడూ ఒకదానితో ఒకటి సంబంధం కలిగి వుండేలా, ఒకదాని కొకటి విరుద్ధం కాకుండా వుండేలా విభజించుకోవాలి.

*2. బాల్యే విద్యా గ్రహణాదీ నర్థాన్*

మానవుడికి పదహారేండ్లు వచ్చేదాకా బాల్యదశ. పదిహేడు లగాయతూ డెబ్బయవ ఏడు వచ్చేదాకా మధ్య దశ. ఆ తరువాత వృద్ధాప్యం. గ్రంథాంతరంలో చెప్పిన వయో విభాగం ఇది. కాని, న్యాయశాస్త్ర ప్రకారం పరిశీలించి చూస్తే అలా లేదని తేలుతుంది. చెప్పిన విషయం గ్రహించడం, గ్రహించింది జ్ఞాపకం పెట్టుకోడం, ఈ లక్షణం ఎవడిలో వుంటుందో అది వున్నంతవరకూ వాడు బాలుడి క్రిందే లెక్క. ఇక విద్య అంటే చదువు లేక జ్ఞానం. బాల్యంలో విధిగా విద్య నేర్చుకోవాలంటాడు వాత్స్యాయనుడు.

*3. కామంచ యౌవనే 4. స్థావిరే ధర్మం, మోక్షంచ*

ఆయుర్దాయం అనేది మన చేతుల్లో లేదు. కాబట్టి దీపం వున్నప్పుడే ఇల్లు చక్కబెట్టుకోమన్నట్లు, యౌవనంలో ఉన్నప్పుడే, విద్యతోబాటు కామాన్ని కూడా సేవించాలనీ, కామ సౌఖ్యాలు అనుభవించడానికి ప్రయత్నించాలనీ అంటాడు వాత్స్యాయనుడు. అవును. యౌవనం మెరుపు తీగలాంటిది తళుక్కుమని

మాయమైపోతుంది. మరి కామసౌఖ్యం పూర్తిగా ఎలా లభిస్తుంది? అందుచేత యౌవనంలో వుండగానే ఈ కామశాస్త్రం అధ్యయనం చేయాలని స్పష్టం అవుతూ వుంది. అయితే 'ధనమూలం ఇదం జగత్' - ఈ జగత్తులో ఏ పని చేయాలన్నా ధనం అవసరం. కామ సౌఖ్యాలు పొందాలన్నా ధనం కావాలి. కాబట్టి కామసాధనకు సహాయకారి అయిన అర్థాన్ని (ధనాన్ని) కూడా సంపాదించాలని భావం.

ఇక స్థావిరం అంటే వృద్ధాప్యం. ముసలితనంలో ధర్మాన్నీ, మోక్షాన్ని కూడా సంపాదించడానికి ప్రయత్నం చెయ్యాలి.

5. *అనిత్యాత్వా దాయుషో, యథోపపాదం వా సేవేత.*

ఈ విధంగా మానవుడు ఏ ఏ వయసుల్లో, ఏ ఏ విషయాలు సాధించాలో చెప్పాడు వాత్స్యాయనుడు. అయితే మానవుడి ఆయుష్షు అస్థిరమైంది. ప్రతి మనిషీ నూరేండ్లు బ్రతుకాడన్న నమ్మకం లేదు. ఎప్పుడు ఆయుష్షు తీరిపోతుందో తెలియదు. అలాంటప్పుడు మానవుడు బాల్య, యౌవన, కౌమార, వృద్ధాప్యం - అనే అన్ని దశలూ అనుభవించి నిండా నూరేండ్లు జీవిస్తాడని చెప్పలేం కాబట్టి ప్రతివాడూ కాలం వృధా పుచ్చకుండా బాల్యం నుండే ధర్మార్థాలు సంపాదించడానికి కృషి చేయాలి. వార్ధక్యంలో ధర్మాన్నీ, శక్తి వుంటే అర్థ కామాలను కూడా సాధించవచ్చు.

6. *బ్రహ్మచర్యమేవ త్వా విద్యా గ్రహణాత్*

**విద్యపూర్తయ్యేదాకా** బ్రహ్మచర్యం అవలంబించాలి. అంటే కామ సుఖాలను ఆశించకూడదన్న మాట. కామశాస్త్రం చదివి, అందలి విషయాలు తెలుసుకోవాలే కాని, కామంపై ఆసక్తి పెంచుకోకూడదు. అలా పెంచుకుంటే విద్య కాస్తా మట్టి కొట్టుకు పోతుంది. కామకేళీ విలాసాల్లోకి దిగితే, ఇక విద్య ఏం వంట పడుతుంది? పైగా అది అధర్మ ప్రవర్తన అవుతుంది. ధర్మం, అర్థం, నశించిపోవడానికి కూడా అది దారి తీస్తుంది. అందుచేత విద్యాభ్యాస కాలంలో కామశాస్త్రం చదివినా, నిగ్రహంతో వుండాలని శాస్త్రకారుడు హెచ్చరిస్తాడు. ఈ విధంగానే ధర్మ విరుద్ధం కాకుండా ప్రతి పురుషార్థాన్నీ సాధించవలసి వుంటుంది.

నూరేండ్ల ఆయుః ప్రమాణాన్ని పై మూడు దశలకూ పంచాలనీ, అంటే ముప్పయిమూడు సంవత్సరాల దాకా బాల్యదశ క్రిందనే లెక్క అనీ కొందరు శాస్త్రకారులంటారు. పదహారవ ఏడు నుంచే మనిషిలో కామం అంకురిస్తుంది. కాబట్టి, బాల్యంలో కూడా ధర్మార్థ కామాలు మూటినీ సంపాదించవచ్చునని వీరి వాదం.

7. *అలౌకికత్వాద దృష్టార్థత్వా దలౌకికానవాం,*
*యజ్ఞాదీనాం, శాస్త్రాత్ప్రవర్తనం, లౌకికత్వా*
*మాంసభక్షణాది భ్యశ్శాస్త్రా దేవ నివారణ ధర్మః*

యజ్ఞం యాగం, తపస్సు మొదలైనవి అందరూ ఆచరించలేరు. అవి

అలౌకికులు, అదృష్టార్థాలూను. అవి ఆచరించలేని వారిని కూడా ఆచరించేలా చేస్తుంది ఈ శాస్త్రం. కామశాస్త్రం అంటే ఏదో అశ్లీలం అని కొట్టి పారేయకండి. లౌకికాలనూ, దృష్టార్థాలనూ, మాంస భక్షణాదులనూ నిషేధించేది కూడా ఈ శాస్త్రమే. పైన పేర్కొన్న ఈ రెండు రకాల ధర్మభేదాన్ని తెలుసుకునే మార్గం వుంది. అదేమిటీ అంటే —

*8. తం(శ్రు)తేర్ధర్మజ్ఞ సమవాయాచ్చ ప్రతిపద్యేత.*

వేదంవల్ల కాని, ధర్మజ్ఞులైన పెద్దల వల్ల కానీ ఈ ధర్మ భేదాన్ని గురించి తెలుసుకోవడం.

*9. విద్యా భూమి హిరణ్య పశుధాన్య భాండోపస్కర*
*మిత్రాదీనా మర్జనం, అర్జితస్య పరిరక్షణార్థః*

పురుషుడు సంపాదించుకోవలసినవి - ఏమిటో చెపుతున్నాడు శాస్త్రకారుడు. విద్య అంటే అరవైనాలుగు విద్యలు. (ఇవి ముందు ముందు వస్తాయి) అన్వీక్షకి అంటే, తర్కశాస్త్రం మొదలైనవి. అర్థం అంటే భూమి చక్కగా దున్ని విత్తనాలు చల్లి పంటలు పండించే పొలం. బంగారు, వెండి, కంచు మొదలైనవి హిరణ్యం. ఏనుగులూ, గుర్రాలూ, ఆవులూ, ఎద్దు మొదలైనవి పశుసంపద. ఇక ధాన్యాలు మూడు రకాలు — అవి పూర్వ్యాలూ, మధ్యాలూ, అపరాలు. పూర్వ్యాలంటే, తొలకరి మొదలుకొని వ్యవసాయం చేసి పండించే వడ్లూ జొన్నలూ మొదలైనవి. మధ్యాలంటే సంవత్సరం మధ్య కాలంలో పండించే తక్కిన ధాన్యాలు. అపరాలంటే సంవత్సరం చివరి భాగంలో పండించే తక్కిన ధాన్యాలు. అపరాలంటే సంవత్సరం చివరి భాగంలో పండించే కందులూ, పెసలూ, మినుములూ మున్నగునవి. కొయ్యతోనూ, మట్టితోనూ లోహాలతోనూ చర్మంతోనూ తయారైన కుండలు, ముంతలు, మూకుళ్ళు — ఇవన్నీ పాత్రలు. వీటినే భాండోపస్కరణం అంటారు. ఇలాంటి పాత్రసామాగ్రి, ఇతర గృహోప యోగ్యాలైన వస్తువులు సంపాదించుకొని వృద్ధిపరచుకోవాలి. మంచి స్నేహితులను అనేక మందిని సంపాదించుకోడం కూడా అవసరం. ఇదంతా అర్థానికి సంబంధించిన విషయం.

## విశేష కామం

(ప్రాచీన భారతంలో ప్రజలకు ముఖ్య వృత్తి వ్యవసాయం. ఈనాడు ప్రజలు భూములు వదలిపెట్టి పట్టణాలకు ఎగబ్రాకి, నానా రకాల వ్యాపారాలు, ఉద్యోగాలు చేసి జీవిస్తున్నారు. అలాగే ఇప్పుడు మట్టి పాత్రలు మోటు అయినాయి. వృత్తిలోను వాడుకునే వస్తు సముదాయంలోను తేడా వున్నా, జనం సుఖంగా జీవించడానికి ఇలాంటి సంపద ఎంత అవసరమో ఆనాడే చెప్పాడు వాత్స్యాయనుడు.)

*10. తం అధ్యక్ష ప్రచారా ద్వార్తా సమయ, విద్భ్యోవణిగ్భ్యశ్చేతి.*

ఆ విధంగా సంపాదించుకున్న ధనాన్ని ఇంకా ఇంకా వృద్ధి పరచుకోవాలి. దానికోసం ఏం చేయాలో అధ్యక్ష ప్రచారం అనే గ్రంథంలో విపులంగా వుంది. (ఈ గ్రంథం ఏమిటో తెలియదు) అది చదువుకోడంతోపాటు, వార్తా శాస్త్రం (ఇది కూడా ఏమిటో తెలియదు) చదివిన పెద్దల వల్లా, వాణిజ్య వేత్తల వల్లా, గోపాలకుల వల్లా విశేషాలు తెలుసుకుని, ఆ పద్ధతుల ప్రకారం ధనాన్ని అభివృద్ధి పరచుకోవాలి.

*11. శ్రోత్రత్వ క్చక్షుర్జిహ్వా ఘ్రణానాం, ఆత్మ సంయుక్తేన మనసా*
*అధిష్టితానాం, స్వేషువిషయే ష్వానుకూల్యతః ప్రవృత్తిఃకామః*

అసలు కామం అంటే ఏమిటనుకుంటున్నారు ? మనం అడగవలసిన ప్రశ్న వాత్స్యాయనుడే అడిగి, అందుకు తానే సమాధానం చెపుతున్నాడు. ఆత్మ అంటే జీవుడు. ఆ జీవాత్మతో కూడివున్నది మనస్సు. ఆ మనస్సు అధీనంలో వుంటూ చెవులూ, చర్మం, కళ్ళూ, నాలుక, ముక్కూ — అనే బుద్ధేంద్రియాలు వాటి వాటి విషయాలు నెరవేరుస్తూవుంటాయి. అదే కామం. ఇంద్రియాల ద్వారా నానా రకాల విషయాలను అనుభవిస్తూ వున్నప్పుడు, జీవాత్మకు ఒక విధమైన సుఖమూ, ఆనందమూ కలుగుతూ వుంటాయి. ఆ సుఖమూ, ఆనందమే కామం.

(పుట్టుకతోనే జీవుణ్ణి ఈ కామం అంటిపెట్టుకుని వున్నట్లు తోస్తుంది. అన్నిటికి మనస్సే ప్రధానం కాబట్టి మనస్సులో పుట్టేందే కామం. కాముడంటే మన్మధుడు. మనస్సు నుండి పుట్టినవాడు కావడం వల్లనే అతనికి మనసిజుడని పేరు)

*12. స్పర్శ విశేష విషయే చ్వస్యా ఆభిమానిక ముఖానువిద్ధా*
*ఫలవత్యర్థ ప్రతీతిః ప్రాధాన్యాత్కామః*

పైన చెప్పింది సామాన్యకామం. ఇక విశేష కామం వుంది. ఈ సూత్రంలో చెప్పిన స్పర్శ విశేషమంటే అర్థం సురతం. రతి సమయంలో స్త్రీ పురుష రూపాలలో వున్న జీవులకు, చుంబనాది క్రియల వల్ల అభిమానపూర్వకమైన ఒకానొక సుఖం కలుగుతుంది. అలా సుఖంతో కూడి ఫలప్రదమవుతూ వున్న అర్థ ప్రతీతే కామం. ముఖ్యమైన లేదా నిజమైన కామం అంటే ఇదే. అర్థ ప్రతీతి అంటే స్ఖలనావస్థలో ఏ ఇంద్రియం అయితే, ఆనందానికి కారణమైన కర్మను పుట్టిస్తుందో, ఆ ఇంద్రియం తాలూకు ఆంతరంగిక స్పర్శ విశేషాన్ని గురించిన భావం అన్నమాట. అభిమాన పూర్వకమైన సుఖం అంటే — 'ఈ పురుషుడు నన్ను గిచ్చుతున్నాడు నన్ను కొరుకుతున్నాడు అని స్త్రీ, ఈ స్త్రీని నేను ముద్దు పెట్టుకుంటున్నాను, కౌగలించుకుంటున్నాను' అని పురుషుడూ — ఇలా ఒకరి నొకరు అభిమానించుకుంటూ ప్రేమించుకుంటూ పొందే సుఖం.

*13. తం కామ సూత్రాన్నాగరక, జన సమావాయాచ్చప్రతిపద్యేత.*

ఈ విధంగా సామాన్య కామాన్ని గురించి,విశేష కామాన్ని గురించి ప్రతి ఒక్కరూ తెలుసుకోవాలి. ఈ కామ శాస్త్రం వల్ల కానీ, కామ శాస్త్రం చదివి తెలుసుకున్న నాగరకుల వల్ల కానీ తెలుసుకోవచ్చు.

*14. తేషాం సమవాయే పూర్వః, పూర్వో గరీయాన్.*

ధర్మార్థ కామాలు సాధించడానికై కొన్ని పద్ధతులు అనుసరించవలసి వుంది. ఈ మూడు పురుషార్థాలూ ఒకేసారి సాధించడం ఎవరికీ సాధ్యం కాదు. అందువల్ల వీటిని సాధించడంలో గల కష్ట సుఖాలను గుర్తించి ప్రవర్తించాలి.ఒకవేళ, ధర్మార్థ కామాలు మూడు ఒకే మాటు సమకూడినవని అనుకుందాం ‘ అప్పుడు కామాన్ని విడిచి అర్థాన్ని, అర్థాన్ని వదిలి ధర్మాన్ని సాధించాలి అంటే - ఒకచోట ధర్మం, అర్థం ప్రాప్తిస్తే అర్థాన్ని అర్థాన్ని విడిచి ధర్మాన్నే స్వీకరించాలి. అలాగే, అర్థ కామాలు రెండూ ఒకేసారి ప్రాప్తిస్తే, కామాన్ని వదిలి అర్థాన్నే స్వీకరించాలి.దీని సారాంశం ఏమిటీ అంటే, ధర్మార్థాలకు విరుద్ధం కాకుండా, వాటికి అడ్డు తగులకుండా ప్రాప్తించే కామాన్నే సేవించాలని శాస్త్రకారుడి అభిప్రాయం. ఈ విధంగా కామం, కంటే అర్థం గొప్పది. అర్థం కన్న ధర్మం గొప్పది. - అని తేలుతూ వుంది. కాబట్టి ధర్మార్థాలను త్రోసిపుచ్చి, కేవలం కామవాంఛ తీర్చుకొడానికై ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించాలని అనుకునే వారు శాస్త్ర జ్ఞానం లేని వారు. అయితే, ఇక్కడొక విశేషం వుంది. అన్ని వర్ణాల వారికి నిబద్ధం చేసిన విధానం కాదు ఇది.

*15. అర్థశ్చరాజ్ఞః -*

అన్నాడు వాత్స్యాయనుడు, ధర్మార్థ కామాలు ఒకే సమయంలో తటస్థిస్తే, క్షత్రియుడైన వాడు ధర్మ కామాలను వదిలిపెట్టి అర్థానికి మాత్రమే ప్రాముఖ్యం ఇవ్వవలసి వుంటుంది.

# లోకయాత్ర అంటే ఏమిటి?

*16. తస్మాల్లోకయాత్రాయాః*

బ్రాహ్మణులూ, క్షత్రియులూ, వైశ్యులూ, శూద్రులూ మొదలైన వర్ణాల వారికి సంబంధించిన క్రమం ఒకటి వుంది. అలాగే బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వాన ప్రస్థం, సన్న్యాసం అనే నాలుగు ఆశ్రమాలలో వుండే వారికి సంబంధించిన క్రమం కూడా ఒకటి వుంది. ఈ క్రమాన్ని సక్రమంగా అనుసరించడాన్నే లోకయాత్ర అంటారు. ఎప్పుడూ కూడా ఇది తారుమారు కాకూడదు. లోక యాత్ర సక్రమంగా సాగేలాచూడడం అంటే దాన్ని సర్వ విధాల సంరక్షిస్తూ, వుండడం రాజుల ధర్మం (అన్ని కాలాలకు వర్తించే ధర్మం ఇది) ప్రభువూ, లేదా పరిపాలకుడి శక్తి సామర్థ్యాల పైన, వారి నీతి - నిజాయితీల పైన ఇది ఆధారపడి వుంటుంది. వారి శక్తి సామర్థ్యాలకు అర్థ బలం, అంగబలం, ఆత్మబలం ఆధారం కాబట్టి, లోకయాత్రకు అర్థబలమే మూలమన్న మాట.

*17. వేశ్యా యాశ్చ, ఇతి త్రివర్గ ప్రతిపత్తిః*

వేశ్య వుంది. ఆమెక్కూడా ధనమే ముఖ్యం. ఒకడూ అందమైన వాడనుకోండి. అయితే, అతను ధనహీనుడు. మరొకడు కురూపి. అయినా అతను ధనవంతుడు. వీరిద్దరూ ఒకే సమయంతో వారకాంత (వేశ్య) ఇంటికి వెడితే ఆమె ధనం లేని అందగాణ్ణి దూరంగా వుంచి ధనమున్న కురూపినే పొందాలని కోరుకుంటుంది. ఇది ఆమె వృత్తి ధర్మం. ఒకవేళ ఆమె ఇందుకు భిన్నంగా ప్రవర్తించిందని అనుకుందాం. అప్పుడూ వేశ్య పరిస్థితి తలక్రిందులవుతుంది.

ఈ విధంగా త్రివర్గ మనబడే ధర్మార్థ కామాలను సేవించే విధానం చెప్పాడు వాత్స్యాయనుడు.

*18. ధర్మస్యా లౌకికత్వాత్తదభిదాయకం శాస్త్రయుక్తం*

*19. ఉపాయ పూర్వకత్వాదర్థ సిద్ధేః*

*20. ఉపాయ ప్రతి పత్తిః శాస్త్రాత్*

ఈ శాస్త్రాన్ని నిందిస్తారు కొందరు. అలాంటి వారు అవివేకులనే చెప్పాలి. ప్రతి ఒక్కరూ విధిగా ఈ శాస్త్రం గురించి తెలుసుకోవలసిందే. ఎందుచేతనంటే, ధర్మం అనేది అలౌకికం. దాన్ని గురించి మానవులకు జ్ఞాపకం చేయడం, వారిని ఆ ధర్మ మార్గంలో నడిపించడం ఈ శాస్త్రం లక్ష్యం. కాబట్టే ఈ శాస్త్రం రచించడం యుక్తమే అంటున్నాడు వాత్స్యాయనుడు.

ప్రతి ఒక్కరూ ధనం సంపాదించాలి. కాని దానంతట అది వస్తుందా ధనం? మరెలా? ఎలా అంటే ఉపాయం. ధన సంపానకు ఏదో ఒక ఉపాయం అవసరం. సంపాదించిన ధనం కాపాడుకోవాలన్నా ఉపాయమూ, తెలవి తేటలూ వుండాలి. అర్థశాస్త్రం, మొదలైనవి చదివి ఉపాయాలు తెలుసుకోవాలి ఉపాయం తెలియకుండా ఎంత ప్రయత్నించినా ధనంరాదు. ధనం వృద్ధీ పొందదు. అంతే కాదు, ధనం లేకుండా దారిద్ర్యంతో అవస్థపడే వాడికి బుద్ధి కూడా సరిగ్గా పనిచేయదు. బుద్ధిబలం ఎప్పుడైతే సన్నగిల్లుతుందో, అప్పుడే మనిషికి, ప్రతి విషయంలోనూ సందేహాలు తలఎత్తుతాయి. ఏ పనికీ సాహసించలేడు. అందుచేత ధన సంపాదనకు అవసరమైన ఉపాయాలు తెలుసుకొని తీరాలి.

*21. తిర్య గ్యోనిష్వపి తున్వయం ప్రవృత్తత్వాత్, కామస్య నిత్యత్వాచ్చ, నశాస్త్రేణ కృత్యమస్తీ త్యాచార్యాః*

ధర్మం, అర్థం, సంపాదించడానికి శాస్త్రాలు అవసరం అయినట్లు గానే, కామ సౌఖ్యం పొందడానికి కామ శాస్త్రం కూడా అవసరమే. అయితే, ఇక్కడ ఒక విశేషం వుంది. పశువులకూ, పక్షులకూ, మృగాలకూ, శాస్త్రజ్ఞానం లేదుకదా! మరి అవి కూడా కామ సుఖం అనుభవిస్తున్నాయే, ఏమంటారు ఇది? అని ప్రశ్న వేయవచ్చు. మానవులలో కొందరికి కామవాంఛ ఒక్కొక్కప్పుడు పశువులకన్నా ఎక్కువగా వుండడం మనం చూస్తుంటాం. అంతే కాకుండా శాస్త్రం చదివి తెలుసుకోకుండానే మానవులు కామ సుఖాలు అనుభవిస్తూ వున్నారు. దీన్ని

బట్టి ఒక విషయం స్పష్టం అవుతూ వుంది. - కామం అనేది ఫలానా విధంగా వుంటుందనీ ఎవరూ చెప్పాల్సిన పనిలేదు. ప్రతిప్రాణిలోనూ 'కామం' సహజంగానే వుంది. అది ఎల్లప్పుడూ దేహన్ని అంటిపెట్టుకునే వుంటుంది. అలాంటప్పుడు ఈ శాస్త్రం ఎందుకని ప్రశ్న? ఇది వ్రాయవలసిన పని లేదని ధర్మార్ధ మోక్షవాదులైన ఆచార్యులు అంటారు.

*22. సంప్రయోగ పరాధీనత్వాత్ స్త్రీ పుంస యోర్యుపాయ మపేక్షత.*

ఈ ప్రశ్నకు వాత్స్యాయన ముని సమాధానం చెపుతున్నాడు. సామాన్య కామమైనా, విశేష కామమైన స్త్రీ పురుషుల సంయోగంపై ఆధారపడి వుంటుంది. మరి, ఈ సంయోగం అన్నది ఉపాయం లేకుండా సంభవించదు. ఆ ఉపాయం తెలియజెప్పడం కోసమే ఈ శాస్త్రం.

*23. సా చోపాయ ప్రతిపత్తిః కామసూత్రాదితి వాత్స్యాయనః*

అందుకే వాత్స్యాయన ఋషి ఈ శాస్త్రం చెప్పాడు. ఇతని అసలు పేర్లు మల్లనాగుడు. వాత్స్యాయన అనేది గోత్ర నామం.

## కామ సమయం!



*24. తిర్యగ్యోనిషు పునరనా వృతత్వాత్, స్త్రీ జాతేశ్చ*
*ఋతౌ యావదర్థం, ప్రవృత్తే రబుద్ధి పూర్వక*
*త్వాచ్చ ప్రవృత్తీనా, మనుపాయః ప్రత్యయః*

పశు, పక్ష్యాదులకు ఏ ఉపాయమూ తెలియదు. మనుష్యుల్లా బట్ట కట్టుకుని మానాన్ని కాపాడుకోడం లాంటివి కూడా వాటికి లేవు. ఆయా ఋతుకాలాలలో మాత్రమే అవి సంభోగిస్తూ వుంటాయి. పరిమితమైన రతితోటే అవి తృప్తిపడుతూ వుంటాయి. ఎప్పుడు బడితే అప్పుడు సంభోగించాలన్న కోరిక వాటికి వుండదు. కాబట్టే ఉపాయం తెలియకపోయినా అవి కామ సుఖాన్ని అనుభవిస్తూ వున్నాయి. మరి, మనుష్యులంటారా? అలా కాదు. ఈ కాలం, అకాలం, అనే విచక్షణ లేకుండా, ఎప్పుడు పడితే అప్పుడు, కామసుఖాల కోసం పరితపిస్తూ వుంటారు. సంతానం కోసం ఋతుసమయాల్లోనూ, స్త్రీలను సంతోషపెట్టడం కోసం ఇతర సమయాల్లోనూ కామకేళీ విలాసాల్లో మునిగితేలుతూ వుంటారు. పశు పక్ష్యాదులు ధర్మం కోసం, లేదా అర్థం కోసం, లేదా వంశవృద్ధికి మూలమైన సంతానం కోసం బుద్ధి పూర్వకంగా సంభోగించవు. మరి, మానవులది బుద్ధి పూర్వకమైన కామసుఖం. అందువల్ల వీరికి కామశాస్త్రం అన్ని విధాలా అవసరం అవుతున్నది అంతేకాదు. అందరూ రతి క్రీడ సలుపుతారు. ఏదో గ్రుడెద్దు చేలో పడ్డట్టు! కాని, ఈ శాస్త్రం చదివినవాళ్ళు స్త్రీలను పురుషులూ, పురుషులను స్త్రీలూ ఎక్కువగా సంతోష పెట్టగలుగుతారు. కారణం ఏమంటే అందుకు అవసరమైన ప్రత్యేక విషయాలు, మెళుకువలు అనేకం ఈ శాస్త్రం చదవడం వల్ల తెలుస్తున్నాయి. ఒకవైపు ఆరోగ్యం కాపాడకుంటూ, మరోవైపు ఒక క్రమ పద్ధతిలో, శాస్త్ర విజ్ఞానం అనే వెలుగులో కామ సుఖం అనుభవించడానికి వీలవుతుంది.

*25. నధర్మాం శ్చ రేత్ 26. ఏష్యత్ఫలత్వాత్*

*27. సాంశయి కత్వాచ్ఛ 28. కో హ్యా బాలిశో హస్తగతం, పరగతం కుర్యాత్*

*29. వరమద్య కపోతశ్శ్వో మయూరాత్*

అసలు ఈ ధర్మార్థ కామాలు అనేవి అవసరమా, కాదా అన్నది ప్రశ్న. యజ్ఞయాగాదుల వల్ల కలిగే ఫలం ఈ జన్మలో లభించదు. మరో జన్మలోనే వీటి ఫలితం. కాబట్టి అవి అలౌకికాలు. వ్యవసాయం మొదలైన వాటిలాగా, అప్పటికప్పుడే కాకుండా ఎప్పుడో ఫలితం ఇచ్చే ఈ ధర్మాన్ని అనుష్ఠించడం అనవసరం అని కొందరి వాదం.

ముందెప్పుడు ఏం జరుగుతుందో ఎవరికి తెలుసు? ఎంతో కష్టపడి బ్రహ్మచర్యం, తపస్సు మొదలైనవి ఆచరిస్తే మాత్రం ఫలితం వుందో లేదో నిర్ధారణగా ఎవరు చెప్పగలరు? - ఇలా సందేహాలతో కూడిన ధర్మం కోసం ప్రాకులాడడం వ్యర్థం కదూ! బుద్ధి గలవాడెవడైనా చేతికి చిక్కిందాన్ని ఇతరులకు కట్టబెట్టి ఊరుకుంటాడా? ఎప్పుడో పుణ్యమో, సుఖమో లభిస్తుందని ఈ లోకంలో చేతికి అందిన సౌఖ్యాలను జారవిడుచుకోడం అవివేకం కాదా? రేపు లభించే నెమలి కన్నా ఈ రోజు దొరికిన పావురం మేలు అంటే రేపటి పరలోక సుఖం కన్నా ఈనాటి ఇహలోక సౌఖ్యం మేలు.

*29. వరం సాంశయి కాన్నిష్కాద సాంశయికః, కార్షాపణ ఇతి లౌకాయతికాః*

ఇందుకు ఉదాహరణగా ఒక కథ ఉంది —

వెనుకటికి ఒకాయన యాచన కోసం ఒక పెద్దమనిషి దగ్గరికి వెళ్ళాడు. 'ఇవాళ నావద్ద అంతగా ధనం లేదు. ఒక కార్షాపణం మాత్రం వుంది. (పదహారు పణాల ఎత్తు నాణెం) అది తీసుకో, లేదా రేపురా. నాకు కొంత ధనం వస్తుంది. అప్పుడు నీక ఒక నిష్కం వరకూ (నిష్కం అంటే మాడ ఎత్తు బంగారు నాణెం) ముట్టచెపుతాను అన్నాట్ట ఆ పెద్దమనిషి. అప్పుడా యాచకుడు బాగా ఆలోచించాడు. రేపు ఆ నిష్కం వస్తుందో రాదో సందేహం. ఇప్పటికిప్పుడే చేతిలో పడే కార్షాపణమే మేలు' అని అనుకుని, ఆ ఇచ్చినదాన్నే పుచ్చుకుని చక్కా పోయాట్ట. ఇదంతా ధర్మంతో పనిలేదని చెపుతూ ధర్మాన్ని ఆక్షేపించే వారి వాదం.

*30. శాస్త్ర స్యా నభిశంక్యత్వా, దభిచారాను వ్యవహార యోశ్చ*
*క్వచిత్ఫల దర్శనా, న్నక్షత్ర చంద్రసూర్య తారాగ్రహ చక్రస్య*
*లోకార్థం బుద్ధి పూర్వకమివ, ప్రవృత్తేర్దర్శనా, ద్వర్ణాశ్రమా*
*చారా స్థితి లక్షణార్థత్వా, చ్చ లోక యాత్రాయాః హస్తగతస్య చ*
*బీజస్య భవిష్య తస్సస్యార్థే త్యాగ దర్శనాచ్చరే ద్ధర్మానితి వాత్స్యాయనః*

అయితే, ఈవాదాన్ని ఖండించి, ధర్మం ముమ్మాటికీ అవసరమే అని అంటున్నాడు వాత్స్యాయనుడు.

శాస్త్రాన్ని ఎప్పుడూ శంకించకూడదు. చేతబడులు, ప్రయోగాలు మొదలైన అభిచార కర్మలున్నాయి. అవి హింసాత్మకాలు. శాంతి, పౌష్టిక మున్నగు మంగళ ప్రదాలైన కర్మలున్నాయి. అవి శుభం చేకూర్చేవి. ఈ కర్మలకు వాటి వాటి ఫలితాలు ప్రత్యక్షంగా కనిపిస్తూనే వున్నాయి. సూర్యచంద్రులూ, గ్రహ నక్షత్ర తారకలూ - ఈ ఖగోళం యావత్తూ క్రమం తప్పకుండా ప్రకాశిస్తూ వుంది కదా! ఎవరు చెబితే అది ఈ పని చేస్తున్నదంటారు? లోకం కోసం అది బుద్ధి పూర్వకంగానే ఇలా ప్రకాశిస్తూ వున్నట్లు కనిపిస్తుంది. వర్ణాశ్రమాలూ, ఆచార వ్యవహారాలూ, లోక యాత్రా - వీటన్నిటికీ ఉనికి మాత్రమే స్వరూపంగా గ్రహించినట్లు తోస్తుంది. అందుచేత ధర్మం దేనికని ప్రశ్నించడం అవివేకమే అవుతుంది. ఎప్పుడో వచ్చే పంటకోసం, మనం మన చేతుల్లో వున్న విత్తనాలను ముందే వెచ్చిస్తున్నాం. కాబట్టే, రానున్న ఫలితాలకోసం ఇప్పుడే ధర్మాన్ని ఆచరించి తీరాలని అంటాడు వాత్స్యాయనుడు.

*31. నధర్మాంశ్చరేత్*

*32. ప్రయత్నతో పిప్యేతే, అనుష్ఠీయమానా నైవ కదా చిత్స్యుః*

ధర్మాచరణ అనవసరం అనేవారి వాదం ఎలా వుంటుందో పైన పేర్కొని, ఇక్కడ దానికి సమాధానం చెపుతున్నాడు వాత్స్యాయనుడు. అలాగే అర్థాన్ని (ధనాన్ని) సంపాదించడానికి ప్రయత్నం అక్కర్లేదు, దానికోసం ఉపాయాలు వెదకవలసిన పనిలేదు - అనే వాదాన్ని కూడా పూర్వ పక్షం చేస్తున్నాడు.

పట్టుదలతో, ఎన్నో ఉపాయాలు వెదికి, వాటిని ప్రయోగించినా ఒక్కొక్కప్పుడు ధనం లభించకపోవడం మనం లోకములో చూస్తూనే వున్నాము. ఒకవేళ లభించినా, అది కాలమహిమే కాని, అందులో నీ ప్రయోజకత్వం ఏమీ లేదు. అంటే, నీ ఉపాయం వల్ల ఆ ధనం రాలేదన్న మాట.

*33. అననుష్ఠీయమానా అపి, యదృచ్ఛయా లభేయః*

*34. తత్సర్వం కాల కారితమితి*

ఉపాయంతో పనిలేకుండానే ఒక్కొక్కప్పుడు ధనం లభిస్తున్నప్పుడు, ఇక అర్ధశాస్త్రం దేనికి? అనవసరమే కదా!

మరి, లోకములో ధనం లభించడం, లభించక పోవడం అనేవి ఎలా జరుగుతున్నాయని ప్రశ్నిస్తే, అదంతా కాలమహిమేనని సమాధానం చెప్పవలసి వుంటుంది. కాబట్టి ప్రతి మానవుడూ కాలాధీనుడు. ఆ కాలానికి మరో పేరు దైవం. (కాలోస్మి లోక క్షయకృత్రవృద్ధో - అన్నాడు కృష్ణ భగవానుడు గీతలో - అంటే లోకక్షయం కోసం వృద్ధిపొందిన కాలమూర్తిని నేను అని చెప్పాడు. అలాగే ఖగోళ, జ్యోతిశ్శాస్త్రాలలో మేషాది పన్నెండు రాశులూ కాలపురుషుడి అవయవాలుగా పేర్కొన్నారు శాస్త్రవేత్తలు. కాలం శివస్వరూపం అన్నారు కొందరు. అందువల్ల కాలం దైవమనే భావం ఏర్పడింది) దైవాధీనం జగత్సర్వమ్ - అని కదా ఆర్యోక్తి. దీన్నే కాలవాదం అంటారు.

*35. కాల ఏవహి పురుషానర్థా నర్థాను బంధయోర్జయ*
*పరాజయయోః సుఖ దుఃఖ యోశ్చ స్థాపయతి*

జగత్తు అంతటికీ కాలమే ఆధారం. ప్రపంచాన్ని సృష్టించేదీ, పోషించేదీ, చివరకు నాశనం చేసేదీ కాలమే. పురుష ప్రయత్నం వల్ల జరగనివి ఎన్నో వుంటున్నాయి. ఇదీ కాలవాదుల సిద్ధాంతం. మానవుడు ఒకప్పుడు ధనవంతుడవుతాడు. ఒకప్పుడు సర్వం పోగొట్టుకొని దారిద్ర్యం అనుభవిస్తాడు. ఒకప్పుడు కార్యాల్లో జయం కలుగుతుంది. మరొకప్పుడు అపజయం సంభవిస్తుంది. ఒకప్పుడు సుఖం, వేరొకప్పుడు కష్టం. ఇదంతా కాలప్రభావమే కాని ఇంకొకటి కాదు. ఇదీ కాలవాదుల వాదం.

*36. కాలేన బలిరింద్రః కృతః, కాలేన వ్యపరోపితః*
*కాల ఏవ పునరప్యేనం, కర్తేతి కాలకారణికాః*

బలి చక్రవర్తి కుత్సితస్వభావుడైనా కాల ప్రభావం వల్ల ఇంద్రపదవి అలంకరించాడు. మళ్ళీ ఆ కాలమే అతన్ని పదవీ భ్రష్టుణ్ణి చేసింది. కాలం అనుకూలిస్తే, తిరిగి అతను ఇంద్రుడు కావచ్చు. కాబట్టి కాలమే అన్నిటికీ మూలం.

## బలి చక్రవర్తి కథ

బలి దానవులలో ఒకడు. ఇతని తండ్రి విరోచనుడు, భార్య పేరు ఆశన. బాణుడు మొదలైనవారు ఇతని కుమారులు. బలి దాతగా లోకప్రసిద్ధుడు. ఇతడు

కృతయుగములోని వాడు. (కృత యుగే బలిర్దాత - అని నానుడి) ఆడిన మాట తప్పనివాడు. దానవులు దేవతలకు విరోధులు కావడంవల్ల వారి బాధ భరించలేక బలి, ఇంద్రుడిపై దండెత్తి వెళ్ళాడు. ఇంద్రుడు భయపడి తమ గురువైన బృహస్పతిని సలహా అడిగాడు. ఇతనితో నీవు యుద్ధము చేయలేవు. ఇంద్రలోకం విడిచిపెట్టి వెళ్ళిపోమ్మని చెప్పాడు బృహస్పతి. ఇంద్రుడు అలాగే చేశాడు. బలి ఇంద్రుడై ముల్లోకాలకూ ప్రభువైనాడు. ఆ తరువాత చాలా కాలానికి ఇంద్రుడు విష్ణుమూర్తికి తన గోడు చెప్పుకుని కాపాడుమని ప్రార్థించగా, విష్ణువు వామనావతారం ఎత్తి, బలిదగ్గరికి వెళ్ళాడు. మూడడుగుల నేల దానం ఇవ్వమని అడిగాడు. సరేనన్నాడు బలి అప్పుడు రాక్షసగురువైన శుక్రచార్యుడు, ఆ వచ్చినవాడు విష్ణుమూర్తి అని, రాజ్యం అపహరించడానికి వచ్చాడని దానం ఇవ్వవద్దని బోధించాడు. అయినా బలి దాత కాబట్టి, ఆడిన మాట తప్పక దానం ఇవ్వడానికి సిద్ధపడ్డాడు. అంతట విష్ణువు త్రివిక్రముడై ఒక అడుగులో భూ మండలాన్ని, రెండవ అడుగుతో ఆకాశాన్ని ఆక్రమించి, మూడవ అడుగు పెట్టడానికి చోటు చూపమని అడగ్గా, తన శిరస్సుపై పెట్టమన్నాడు బలి. విష్ణువు అలాగే చేసి, బలిని పాతాళానికి అణగద్రొక్కాడు. ఆ విధంగా విష్ణువు, బలి నుండి త్రిలోకాధిపత్యం గ్రహించి, తిరిగి ఇంద్రుడికి ఇచ్చివేశాడు. ఈ బలి చక్రవర్తి కథ భాగవతంలో వస్తుంది.

## అకాల కామం ?

కాలవాదులు సిద్ధాంతీకరించి, దేనికైన పురుష ప్రయత్నం అనవసరం. కాబట్టి ఈ శాస్త్రం కూడా అవసరం లేదంటారు. ఆ విధంగా మొదటికే మోసం వస్తున్నందువల్ల వాత్స్యాయనుడు ఆ వాదాన్ని ఖండిస్తూ సమాధానం చెపుతున్నాడు. లోకంలో ప్రతి పనీ మానవ ప్రయత్నంపైనే.

*37. పురుషకార పూర్వకత్వాత్సర్వ, ప్రవృత్తీనాముపాయః ప్రత్యయః*

ఆధారపడి వుంది. ప్రయత్నం లేకుండా ఏ పనీకాదు. ఆ ప్రయత్నానికి కూడా ఏదో ఒక ఉపాయం, ఏదో ఒక మార్గం వుంటే తప్ప అది ఫలప్రదం కాదు. అందుచేత ఏ పనికైన ఉపాయం ముఖ్యం. అది లేని పురుష ప్రయత్నం ధన సంపాదనకు సహాయపడదు.

*38. ఆవశ్యం భావినోప్యర్థస్య, ఉపాయ పూర్వకత్వాదేవన*
*నిష్కర్మణోభద్రమస్తీతి వాత్స్యాయనః*

ఒకవేళ ఎప్పుడైనా, యాదాలాపంగా ధనం ప్రాప్తించినా, అదికూడా అనుకోకుండా ఉపాయం వల్లనే లభించిందని అనుకోవాలి. ఎందుచేతనంటే, ధనం విధిగా ప్రాప్తించవలసి వున్నప్పటికీ, ధనార్జన అనేది ఉపాయపూర్వకమైనది కాబట్టి, మానవ ప్రయత్నంలో లోపం వుంటే, ఆ ధనం లభించదని వాత్స్యాయనుడు అంటున్నాడు. ఈ విధంగా చూచినప్పుడు, అర్థప్రాప్తికి మానవ ప్రయత్నమూ, దైవానుగ్రహమూ రెండూ అవసరమేనని స్పష్టమవుతుంది. ఈ రెంటివల్లనే లోకం

నడుస్తూ వుంది. కాబట్టి పురుష ప్రయత్నానికి ఉపాయం వుండితీరాలి. అలాంటి ఉపాయం చెప్పడానికి శాస్త్రం అవసరం. ఈ రీతిగా కాలవాదుల సిద్ధాంతాన్ని వాత్స్యాయనుడు పూర్వపక్షం చేశాడు.

*39. న కామాంశ్చరేత్*

ఇక కామ పురుషార్థానికి సంబంధించిన శాస్త్రం అనవసరం అనే వారి వాదాన్ని గురించి చెప్పి, అవసరమనే తన వాదాన్ని సమర్థిస్తూ సమాధానం చెపుతున్నాడు శాస్త్రకారుడు.

*40. ధర్మార్థయోః ప్రధానయో రేవ మన్యేషాం చ సతాం,*

*ప్రతిసీకత్వాదనర్థ జనసంసర్గ నద్వ్యవసాయ, మశౌచమనా యతిం చైతే పురుషస్య జనయంతి.*

కామ సాధనకు ఉపాయాలు వెదుక్కూడదు. ధర్మార్థాలకూ తక్కిన మంచి పనులకూ ఈ కామం ప్రజల విరోధి. ఎందుచేతనంటే, కామోద్రేకాన్ని రేకెత్తించడంలోనటులూ, నర్తకులూ గాయకులూ మున్నగువారు ప్రధానపాత్రవహిస్తారు. ఈ కామోపాయాలు వారితో స్నేహాన్ని కల్పిస్తాయి. పాడు పనులు చేయడానికి దారి చూపిస్తాయి. అర్ధరాత్రి వేళ వ్యభిచారం చేసే ఆడదాని కోసం వెంపరలాడడం, ఉచ్చనీచాలు లేకుండా వ్యభిచరించడం మొదలైన దురవాట్లకు గురిచేస్తాయి. అంతే కాకుండా, ఈ పని చేయడంలో కాముకుడు శుచీ, శుభ్రం ఆలోచించడు. సిగ్గూ, భయమూ విడిచిపెట్టి సంచరిస్తాడు. అంతకుముందు ఏదైన ప్రజ్ఞ వుంటే, ఈ పరస్త్రీ లోలత్వంతో అది కాస్త మట్టి కొట్టుకుపోతుంది. ధర్మం ధనం, కీర్తి అన్నీ నశిస్తాయి. మానవుడు పశువు కన్నా హీనంగా తయారవుతాడు. కాబట్టి జన్మ జన్మలకూ ఈ కామోపాయాలు వద్దు బాబూ!

*41. తథా ప్రమాదం లాఘవ మప్రత్యయ మగ్రా హ్యతాంచ*

అంతేకాదు, ఈ కామోపాయాలతో చెడు తిరుగుళ్ళు తిరిగి ఆరోగ్యం పాడవుతుంది. చివరకు ప్రమాదాన్ని తెచ్చి పెడుతుంది. నలుగురిలో పలుచన అవుతాడు మనిషి అలాంటివాడిపై ఎవరికీ నమ్మకంవుండదు. జార పురుషుణ్ణి దగ్గరికి రానివ్వరు. ఛీ ఛీ - అని ఈసడించు కుంటారు.

*42. బహవశ్చ కామవశగా స్సగణా, ఏవ వినష్టా శ్రూయంతే*

ఇలా కామానికి దాసులై సంచరించేవారు అన్ని విధాలా తాము నాశనమైపోవడమే కాకుండా, తమ చుట్టూ వున్న వారిని కూడా నాశనం చేసినట్లు పురాణాల్లో అనేక కథలున్నాయి.

## దాండక్యుడి కథ

*43. యథా దాండక్యోనామ భోజః కామాద్బ్రాహ్మణ కన్యా*

*మభిగమ్య మానః సబంధు రాష్ట్రోవిననాశ.*

పూర్వం ఒకప్పుడు భోజ వంశంలో దాండక్యుడనే రాజు వుండే వాడు. అతి కాముకుడతను. అతని కామదాహానికి అంతు వుండేదికాదు.

ఒకనాడు ఆ దాండక్యుడు వేటకై అడవికి వెళ్ళాడు. అక్కడ అతనికి భార్గవ మహర్షి ఆశ్రమం కనిపించింది. వేటవల్ల బడలి వున్న దాండక్యుడు మహర్షి తనకు ఆతిథ్యం ఇచ్చి సత్కరిస్తాడని భావించి ఆశ్రమంలోకి వెళ్ళాడు. కాని ఆశ్రమంలో మహర్షి లేడు. అతని కుమార్తె వుంది. ఆమె చాలా చక్కనిది. పెళ్ళికాని పిల్ల. యౌవనంలో మిసమిసలాడుతూ వున్న ఆ మునికన్యను చూడగానే, మితిమీరిన కామేచ్ఛగల దాండక్యుడికి మతి పోయింది. వెంటనే ఆమెను బలత్కారంగా తన రథంపై ఎక్కించుకుని వెళ్ళిపోయాడు.

సమిధల్నూ, దర్భలూ తెచ్చుకోవడానికై వనాలకు వెళ్ళిన భార్గవ మహర్షి, కొంతసేపటికి ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. కుమార్తె కనిపించలేదు. చుట్టుపక్కల వెదికాడు. లాభం లేకపోయింది. అప్పుడు దివ్య దృష్టితో జరిగింది తెలుసుకున్నాడు. ఆగ్రహంతో బంధుమిత్ర పరివారంతో నశించిపొమ్మని దాండక్యుని శపించాడు. అంతే! దాండక్యుడు తన వారందరితో నశించిపోయాడు. పూర్వం అలా దాండక్యుడు నాశనమై పోయిన ప్రదేశం తరువాత దండకారణ్యం అనే పేరు పొందింది.

## అహల్య - ఇంద్రుడు

44. *దేవరాజ శ్చాహల్యా మతిబలశ్చ కీచకో ద్రౌపదీం,*

*రావాణశ్చసీతా మపరేచాన్యేచ, బహవో దృశ్యంతే కామవశగా! విసష్టా ఇత్యర్థ చింతకాః*

అలాగే అహల్య, ఇంద్రుడూ, అందరికీ తెలిసిన కథ ఇది. గౌతమ మహర్షి భార్య అహల్య. ఆమె అందాలరాశి. దేవతలకు ప్రభువైన ఇంద్రుడు ఆమెను కామించాడు. మహర్షి లేని సమయం కనిపెట్టి, . మాయోపాయంతో ఆశ్రమంలో ప్రవేశించి, అహల్యను పొందాడు. వారు అలా క్రీడిస్తున్న సమయంలోనే గౌతముడు ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. అప్పుడు అహల్య, ఇంద్రుణ్ణి - తన గర్భంలో ఇముడ్చుకుని తన భర్తకు కనిపించకుండా చేసింది. ఆ తరుణంలోనే గౌతముడు ఎక్కడనుంచో ఆహ్వానం వచ్చింది, తక్షణం రమ్మని. గౌతముడు అహల్యను వెంటపెట్టుకుని అక్కడికి వెళ్ళాడు. గౌతముణ్ణి ఆహ్వానించిన ఆయనకూడా, మహనీయుడు. అహల్య, ఇంద్రుడు చేసిన పని ఆయన దివ్య దృష్టితో తెలుసుకున్నాడు. అందుకే గౌతముడు రాగానే మూడు ఆసనాలు వేసి సిద్ధంగా వుంచాడు. అలా మూడు ఆసనాలు అమర్చి వుండడం చూచి గౌతముడికి 'నేను నా భార్యతో వచ్చాను. మా ఇద్దరికీ చెరొక ఆసనం వేయాల్సింది, మూడు ఆసనాలు వేసి వుంచారేమిటి?' అని సంశయం కలిగింది. యోగదృష్టితో అహల్య తప్పు చేసిందనీ, ఆ మూడో ఆసనం ఇంద్రుడి కోసమే వేశారని తెలుసుకున్నాడు. పట్టరాని కోపం వచ్చింది గౌతమ మహర్షికి. సహస్ర భగుడవుకమ్మని శాపం పెట్టాడు. కామం కళ్ళకు ఎగదట్టి, ఉచితానుచితాలు లేకుండా ప్రవర్తించాడు కాబట్టే ఆ దేవరాజు వళ్ళంతా యోనులై దురవస్థ పొందాడు.

ఇలా ఇంకా ఎందరో ఉన్నారు. ద్రౌపదిని బలాత్కారించిన కీచకుడూ, సీతను చెఱబట్టిన రావణాసురుడూ తమ బంధుమిత్ర పరిజనులతో హతమైపోయారు.

కామంవల్ల ముప్పు తప్పదనీ, అందుచేత కామశాస్త్రం చదవడం అనవసరమనీ అనేవారు చెప్పే కారణాలు ఇవన్నీ. అయినా వీటిని నిర్ద్వందంగా ఖండిస్తున్నాడు వాత్స్యాయనుడు.

*45. శరీరస్థితి హేతుత్వాదాహార సధర్మాణో హి కామాః*

ఈ వాదాలన్నీ పసలేనివి. ఆహార నిద్రామైథునాలు అన్ని ప్రాణులకూ ముఖ్యావసరమైనవి. దేహ పుష్టికి ఆహారం ఎలా అవసరమో ఆరోగ్యానికి సంభోగం కూడా అలాగే అవసరం. కామవాంచ తీర్చుకోకుండా, అణచి పెట్టడంవల్ల అనారోగ్యం ప్రాప్తిస్తుంది. పిచ్చి, మతిభ్రమలాంటి రోగాలు వస్తాయి. కాబట్టి నిత్యం ఆహారం పుచ్చుకున్నట్లే, కామాన్ని కూడా సేవించి తీరాలి.

*46. ఫలభూతాశ్చ ధర్మార్థయోః*

అంతే కాకుండా, కామం అనేది ధర్మార్థాలకు ఫలభూతంగా వుంటున్నది. అంటే కామం వల్లనే ధర్మం, అర్థం ప్రాప్తిస్తున్నవన్న మాట. గ్రంథాంతరంలో ఇంకా ఇలా చెపుతారు. ధర్మాలు ఆచరించడం వల్ల లభించేది స్వర్గమే కదా! అక్కడా రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ లాంటి అందగత్తెలైన అప్సరాంగనలున్నారు. పుణ్యం చేసుకున్న వారు, ఆ అందాల బరిణలతో సుఖాలు అనుభవించడమే స్వర్గ సౌఖ్యం. కాబట్టి, ధర్మాత్ములైన మానవులకు ఇటు ఇహంలోనూ, అటు పరంలోనూ లభించేది కామోపభోగాలే అని స్పష్టమవుతున్నది. ఇంకా చెప్పాలంటే స్త్రీలు, పురుషులకు అనేకవిధాల మేలు చేకూరుస్తున్నారు. వంశ వృద్ధి కోసం సంతానాన్ని ప్రసాదిస్తూ ఉన్నారు. ఇహపర గతులను కారణం అవుతున్నారు. అమితమైన ఆనందాన్ని అందిస్తున్నారు. కాబట్టి స్త్రీ పురుషుల కలయిక ఎప్పటికి అవసరమే. అది లేకపోతే ప్రపంచమే లేదు.

*47. బోద్ధవ్యం తు దోషేష్విన,న హిభిక్షుకాః సంతీతి*
*స్థాల్యో నాధి శ్రీయంతే?న హిమృగాః సంతీతి*
*యవానోప్యంతే? - ఇతి వాత్స్యాయనః*

అలాంటప్పుడు కామశాస్త్రం ఎలా అవసరమవుతుంది? ఈ శాస్త్రంలో దోషం ఏమున్నది? ఇలా ప్రశ్న వేసి శాస్త్రకారుడు సమాధానం చెపుతున్నాడు: అవును - ఉన్నదల్లా ఒక్కటే దోషం - ఆహారం అధికమైతే అజీర్ణాది రోగాలు వచ్చినట్లే, కామప్రవృత్తి మితిమీరితే ముప్పు వాటిల్లుతుంది. అందుచేత ఈ దోషాన్ని పరిహరించుకుంటూ కామసుఖం అనుభవించాలి. అడుక్కునేవారు ఎక్కువైనారని అన్నం వండుకోవడం మానుకుంటామా? అసలు పొయ్యే త్రవ్వేసుకుంటామా? పంటలనూ, పైర్లనూ పాడుచేసే మృగాలు, పక్షులు, చీడ పురుగులు వున్నాయని, పైరు లేయడం మానుకుంటామా? లేదు. అలాగే ఏదో దోషం వున్నదని కామాన్ని వదులుకోడానికి వీలులేదు. ఇదీ వాత్స్యాయనుడి వాదం. సంభోగ సుఖాన్ని ద్వేషించే మనిషి, మనిషేకాడు! దోషం లేని సుఖం అంటూ సృష్టిలోనే లేదు. దోషాన్ని తొలగించుకుంటూ, సుఖం అనుభవించడం మానవ ధర్మం.

కామశాస్త్రాన్ని ఆపేక్షించే ప్రబుద్ధులకు వాత్స్యాయనముని సహేతుకంగా చెప్పిన సమాధానం ఇది.

*48. భవంతి చాత్రశ్లోకాః, ఏవమర్థం చ కామంచ ధర్మంచోపాచన్నరః*
*ఇహాముత్ర చ నిశ్శల్య మత్యంతం సుఖమశ్నుతే*

పైన చెప్పినట్లుగా ప్రతి మానవుడూ అర్థ, కామ, ధర్మాలు మూటినీ విదిగా సేవించాలి. జాగ్రత్తగా వీటిని సేవించడం వల్ల ఇహంలోనూ, పరంలోనూ కూడా ఉత్తమ సుఖ సంతోషాలు ప్రాప్తిస్తాయి.

## కామమంత్రం

ధర్మార్థ కామాలకు భంగం కలుగుతుందన్న సందేహం రాకుండా వుండేపని ఏదైతే ఉంటుందో, సుఖానికీ, అర్థానికీ హాని కలిగించని పని ఏదైతే ఉంటుందో అలాంటి పనే ఎప్పుడూ చేయాలి మానవుడు. చరిత్ర తెలిసినవారు, శిష్టులూ అలాగే చేస్తారు.

*49. కింస్యాత్పరత్రేత్యాశంకా కార్యేయస్మిన్నజాయతే,*
*న చార్థఘ్నం సుఖం చేతి శిష్టాస్తత్ర వ్యవస్థితాః*

*50. త్రివర్గ సాధకం యత్స్యాద్ద్వయోర్యై కస్య వా*
*పునః, కార్యం తదపి కుర్వీత న త్వేకార్థం ద్విబాధకం.*

త్రివర్గాలైన ధర్మార్థ కామాలు మూటికీ గానీ, లేక వీటిలో ఏ రెంటికీ గానీ, లేదా ఏ ఒకదానికీ గానీ సాధనంగా ఉండేపని ఏదో, అదే అందరూ చేయాలి. అంతేకాని పురుషార్థాలకు సాధకం కాని పని ఎప్పుడూ చేయకూడదు. ధర్మార్థ కామాల్లో దేన్ని అయినా బాధించే ఒక పురుషార్థాన్ని ఎన్నడూ సేవించకూడదు.

**ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే సాధారణే ప్రథమాధికరణే త్రివర్గ ప్రతిపత్తిపి ద్వితీయోధ్యాయః**

**ఇది వాత్స్యాయన విరచిత కామసూత్రాల్లో సాధారణమనే ప్రథమాధి కరణలలో త్రివర్గ ప్రతిపత్తి అనే రెండో అధ్యాయం.**



# తృతీయాధ్యాయం
## విద్యాసముద్దేశం

ఇంతకు ముందు అధ్యాయాలలో కామసూత్రాలు ఎందుకో, వీటికి కర్తలెవరో, ఇందులో ఉన్న విషయాలు ఏమిటో, కామాన్ని ఎలా సేవించాలో మొదలైన అంశాలు చెప్పాడు వాత్స్యాయనుడు. ఇక ఈ అధ్యాయంలో విద్యాసముద్దేశాన్ని గురించి వివరిస్తున్నాడు.

1. *ధర్మార్థాంగ విద్యాకాలా ననువరోధయన్*

*కామ సూత్రమ్, తదంగ విద్యాశ్చ పురుషోధీయిత.*

ధర్మార్థ కామాలు సేవించే దశ వచ్చిన మానవుడికీ కామసిద్ధి కలగాలంటే, దానికి మొదటి ఉపాయం కామ విద్యాగ్రహణం. ఈ విద్య తెలియని మనిషికి తరువాత పనులేవీ జరగవు కాబట్టి కామ విద్యాసముద్దేశాన్ని గురించి చెపుతున్నాడు శాస్త్రకారుడు. సముద్దేశం అంటే, ఎంతో విస్తారంగా ఉన్న విషయాన్ని క్లుప్తీకరించి చెప్పడం.

ధర్మ విద్యకూ, అర్థవిద్యకూ అంగభూతమైనది దండ విద్య. అందుచేత ఆ ధర్మవిద్యనూ, అర్థవిద్యనూ, దండ విద్యనూ అభ్యసించే తరుణంలో కాకుండా, తక్కిన సమయాల్లో ఈ కామసూత్రాన్ని అభ్యసించాలి. అంతే కాకుండా దీనికి అంగభూతాలైన సంగీతాది విద్యలను కూడా పురుషుడు అధ్యయనం చేయాలి. అంటే, ప్రతి యువకుడు తన మామూలు విద్యాభ్యాసానికి, తక్కిన వృత్తులకూ ఆటంకం రాకుండా ఈ కామశాస్త్రాన్ని అధ్యయనం చేయాలని పిండితార్థం.

ఈ శాస్త్రం చదవకపోతే మాత్రం పురుషుడు స్త్రీతో సంపర్కం చేయలేడా? అని ఎవరైన ప్రశ్నించవచ్చు. చదవకపోయినా చేయవచ్చు. కాని, అది గ్రుడ్డెద్దు చేలో పడినట్లుంటుంది! ఈ శాస్త్రం తెలిసి, స్త్రీ సంపర్కం చేసేవాడికి అమితమైన సౌఖ్యం కలుగుతుంది. కామశాస్త్రం తెలియని యువతీ యువకుల పొందు - మూలికల ప్రభావం తెలియని వైద్యుడి వైద్యం లాగా, మంత్రమహిమ ఎరుగని మాంత్రికుడి మంత్రంలాగా ఉంటుందని వాత్స్యాయనుడు అంటున్నాడు. అవును, నిజం! భూసారం, విత్తనాల బలం మొదలైన వ్యవసాయ పద్ధతులు తెలిసి చేసే సేద్యానికీ, తెలియకుండా చేసే సేద్యానికీ తేడా లేదూ?

2. *ప్రాగ్యౌవనాత్ స్త్రీ*

యౌవనం అంకురించడానికి ముందే, స్త్రీలు, తండ్రి ఇంట్లో ఉన్నప్పుడే ఈ కామశాస్త్రాన్ని, దీనికి అంగవిద్యలైన నృత్య, సంగీతాది విద్యలను కూడా నేర్చుకోవాలి. ఎందుచేతనంటే, వయస్సు వచ్చిన ఆడపిల్లలకు సాధారణంగా పెళ్ళి చేస్తారు. అప్పుడు వారికి ఈ శాస్త్రం చదివే అవకాశం ఉండదు. కామ సుఖాన్ని అనుభవించే కాలం అది.

3. *ప్రత్తాచ, మత్యురభిప్రాయాత్.*

అయితే, పెండ్లి తరువాత కూడా భర్త అనుమతితో స్త్రీ ఈ కామ శాస్త్రాన్ని చదవవచ్చు. అతని అనుమతి లేకుండా చదివితే, భర్త, బంధుజనులు ఆమెను స్వేచ్ఛా విహారిణిగా అనుమానించే అవకాశం ఉంది.

4. *యోషితాం శాస్త్ర గ్రహణ స్వాభావా దనర్థకమిహ, శాస్త్రే స్త్రీశాసన మిత్యాచార్యాః*

శాస్త్రాభ్యాసం చేసే అధికారం స్త్రీలకు లేదనీ, శాస్త్రాన్ని గ్రహించే సామర్థ్యం కూడా వారికి లేదనీ, అందుచేతనే కామశాస్త్రంలో స్త్రీల విషయమై ఇది చెయ్యవచ్చు. ఇది చెయ్యకూడదు అన్న నియమం పెట్టడం అనర్థదాయకమనీ ప్రాచీన కామశాస్త్రాచార్యుల అభిప్రాయం.

5. *ప్రయోగ గ్రహణం త్వాసాం, ప్రయోగస్య చ,*
*శాస్త్ర పూర్వకత్వా దితి వాత్స్యాయనః*

అయితే, ప్రయోగించే విధానం తెలుసుకోడం స్త్రీలకు ముఖ్యంగా అవసరం. అది కూడా శాస్త్రం వల్లనే తెలుసుకోవాలి కాబట్టి స్త్రీలకు సయితం ఈ శాస్త్రంతో ప్రమేయం ఉండాలనడం దోషమూ కాదు, అనర్థదాయకమమూ కాదు - అని అంటున్నాడు. ఈ విధంగా వాత్స్యాయనుడు పూర్వాచార్యుల అభిప్రాయానికి భిన్నంగా, విప్లవాత్మకమైన పంథా అనుసరించాడని చెప్పవచ్చు. ఆ కాలంలో ఎన్నో విమర్శలకూ, నిందలకూ, ప్రతిఘటనలకూ గురి అయి కూడా ఈ శాస్త్రకారుడు ధైర్యంగా నిలువబడి తాను నమ్మిన సిద్ధాంతాన్ని లోకంలో ప్రచారం చేయడం గమనార్హమైన విషయం.

6. *తన్న కేవల మిహైవ, సర్వత్ర హి లోకే కతి*
*చిదేవ శాస్త్ర జ్ఞాః సర్వజన విషయశ్చ ప్రయోగః*

ప్రయోగ విధానాన్ని గురించి స్త్రీలు విధిగా తెలుసుకోవాలనడం ఈ శాస్త్రంలోనే కాదు - వ్యాకరణ, జ్యోతిషాది శాస్త్రాల్లో కూడా ఉంది. కాబట్టి కామశాస్త్రం స్త్రీలు తెలుసుకోవాలనడం అనర్థకం కానేకాదు. నిజానికి లోకంలో శాస్త్రపరిజ్ఞానం కలిగి ఉండే శక్తి చాలా కొద్దిమందికే ఉంటుంది. కాని ప్రయోగం విషయంలో మాత్రం జనులంతా సమర్థులై ఉంటారు. అందువల్ల ఆ ప్రయోగం ప్రధానంగా శాస్త్రం వల్లనే నేర్చుకోవాలి.

7. *ప్రయోగస్య చ దూరస్థ మపి శాస్త్రమేవ హేతుః*

ఒకవేళ శాస్త్రం చదవడం అందరికీ వీలుకాక పోయినప్పటికీ, సామాన్యజనులు ఆచరించే విధానాలు మాత్రం శాస్త్రంలో చెప్పబడినవిగానే ఉంటాయి. ఎలా అంటే, ఎవరో ఒకరు శాస్త్రాన్ని అభ్యసించి ఉంటే, అతని నుండి ఒకడు ప్రయోగాన్ని నేర్చుకుంటాడు. అతనివల్ల మరొకడు, ఇలా పరంపరగా ఒకరి నుండి ఒకరికి ప్రయోగ విధానం అబ్బుతుంది. మొత్తం మీద చూస్తే ఏ ప్రయోగానికైన ఆధారం శాస్త్రమే అని స్పష్టమవుతున్నది.

*8. అస్తివ్యాకరణ మిత్య నైయాకరణా అపి యాజ్ఞికాః*
*ఊహం క్రతుషు ప్రయుంజతే.*

ఇక్కడ ఒక దృష్టాంతాన్ని కూడా చెపుతున్నాడు శాస్త్రకారుడు. ఒక మంత్రంలో ఒకనొక శబ్దం, ఏదో ఒక లింగంలోనూ, విభక్తిలోనూ, వచనంలోనూ ప్రయోగించబడితే, ప్రసంగాన్ని బట్టి ఆ శబ్దాన్ని తమకు అవసరమైన లింగంలోకి, విభక్తిలోకి, వచనంలోకి మార్చుకోడాన్ని 'ఊహ'అంటారు. యుక్తిమీద ఆధారపడి ఉన్న విషయం ఇది. పైన పేర్కొన్న లింగ, విభక్తి, వచనాల విషయం యావత్తూ వ్యాకరణ శాస్త్రంలో ఉంటుంది యజ్ఞ యాగాదుల్లో పురోహితులు మంత్రాలు ఉచ్చరించేటప్పుడు ఈ లింగ, విభక్తి, వచనాదులను మార్చి పఠిస్తూ ఉంటారు. పరంపరగా వచ్చిన ప్రయోగజ్ఞానం వల్లనే ఇది జరుగుతూ ఉంది.

*9. అస్తిజ్యౌతిషమితి పుణ్యా హేషు కర్మ కుర్వతే.*

జ్యోతిశ్శాస్త్రంలో ఉన్నదన్న విశ్వాసంతోనే యాజ్ఞికులు, ఆ శాస్త్రం ఎప్పుడూ చూడకపోయినా, శుభాశుభాలు తెలుసుకుని పుణ్యకర్మలు నిర్వహిస్తున్నారు. ఈ తెలుసుకోడానికి పరంపరంగా వచ్చిన శాస్త్రమే కారణం.

## కామసూత్రాలు ఎవరివల్ల నేర్చుకోవాలి ?

*10. యథా అశ్వారోహా, గజారోహాశ్చ అశ్వాన్,*
*గజాంశ్చ అనధిగత శాస్త్రా అపి వినయంతే.*

అశ్వశాస్త్రం, గజశాస్త్రం ఉన్నాయి. ఈ శాస్త్రాలు స్వయంగా చదవకపోయినా, అశ్వారోహకులూ, గజారోహకులూ ఈ శాస్త్రాలు తెలిసిన వారివల్ల రహస్యాలు తెలుసుకుని, ఆయా జంతువులను నడపడంలో నేర్పరులై ఉంటున్నారు.

*11. తథా అస్తిరాజేతి దూరస్థా అపిజానపదా,*
*న మర్యాదా మతి వర్తంతే తద్వదేతత్.*

ప్రజలను పాలించే ప్రభువు ఎక్కడో దూరంగా ఉంటాడు. అయినా, జనం హద్దుమీరి ప్రవర్తించడంలేదు. పైన ప్రభువనే వాడు ఒకడున్నాడన్న భయంతో ప్రజలు చట్టాన్ని అతిక్రమించకుండా నడుచుకుంటున్నారు. అలాగే శాస్త్రాన్ని ప్రత్యక్షంగా చూడకపోయినప్పటికీ, కామం విషయములో ప్రజలు పరంపరగా తెలుసుకుని ఆ విధానాలు అనుసరిస్తూ ఉన్నారు.

*12. సం త్యపిఖలు శాస్త్రప్రహత బుద్ధయో గణికా,*
*రాజపుత్ర్యో మహామాత్ర దుహితరశ్చ.*

ఈ కామశాస్త్రం అభ్యసించినవారిలో స్త్రీలు కూడా ఉన్నారు. ముఖ్యంగా వేశ్యలు, రాకుమార్తెలు, మహాసామంతులు, సామంతుల పుత్రికలు ఈ శాస్త్రంలో ఆరితేరినవారు.

# కామవిద్యాదాతలు !

యువకుడు ఈ శాస్త్రాన్ని ఎలా నేర్చుకోవాలో వాత్స్యాయనుడు చెపుతున్నాడు. కామ సూత్రాలు చదివి గ్రహించడమేకాక, వాటిని ప్రయోగం ద్వారా అనుభవం గడించిన స్త్రీలున్నారు. అలాంటి నమ్మకస్థురాలైన స్త్రీవల్ల గ్రహించాలి. ఇది ఉత్తమ పద్ధతి.

*13. తస్మాద్వైశ్యాసికాజ్జనా ద్రహసి ప్రయోగాన్,*
*శాస్త్రమేక దేశం వా స్త్రీ గృహ్ణీయాత్.*

అందుకు అవకాశం, శక్తి సామర్థ్యాలు లేకపోతే, కనీసం ప్రయోగ విధానాన్ని అయినా అభ్యసించాలి. ఇలా అభ్యసించడం మధ్యమ పద్ధతి.

*14. అభ్యాస ప్రయోజ్యాంశ్చ చతుష్షష్టికాన్*
*యోగాన్, కన్యా రహస్యేకాకి న్యభ్యసేత్.*

స్త్రీ కన్యగా ఉన్నప్పుడే అభ్యాసంవల్ల ప్రయోగించడానికి వీలైన కామరహస్యాలనూ, బోద్ధుకమూ, భ్రమరుకమూ మున్నగు చతుష్షష్టి (64) యోగాలనూ ఒంటరిగా, రహస్యంగా నేర్చుకోవాలి.

*15. ఆచార్యాస్తు కన్యానాం ప్రవృత్త పురుష సంప్రయోగా,*
*సహసం ప్రవృద్ధా త్రేయికా, తథాభూతా వా, నిరత్యయ సంభాషణా*
*సఖీ, సవయాశ్చ మాతృష్వసా, విస్రబ్ధా, తత్సానీయా*
*వృద్ధదాసీ, పూర్వ సంసృష్టావా భిక్షుకీ, స్వసాచ విశ్వాస సంప్రయోగాత్.*

ఈ కామశాస్త్రాన్ని బోధించే విషయంలో స్త్రీలకూ, పురుషులకూ గురుత్వాన్ని వహించడానికి అర్హులైన నమ్మకస్థులెవరో వాత్స్యాయనుడు చెపుతున్నాడు. పురుషులు మొదటినుంచీ సర్వతంత్ర స్వతంత్రులు. కాబట్టి వారికి ఈ శాస్త్రం ఉపదేశించే వారు సులభంగా దొరుకుతారు. మరి, స్త్రీలు అలాకాదు. వారి విషయం వేరని వేరే చెప్పనక్కర్లేదు. కాబట్టి పురుషుడితో ఎంతో కాలం రతి సలిపి, రతి రహస్యాలు చక్కగా తెలిసిన స్త్రీవల్లగానీ, తనకూ ఈడు - జోడుగా ఉండి, తనతో పాటు పెరిగిన దాది కూతురు వల్లగానీ, అలాంటిదే అయి, తన మనస్సు తెలిసి ప్రవర్తించే చెలికత్తె వల్లకానీ, తనకు ఈడు - జోడుగా ఉన్న పినతల్లి వల్లగానీ, తమ ఇంట్లో పనులు చేస్తూ నమ్మకస్తురాలుగా ఉన్న వృద్ధ దాసీ వల్లగానీ, పూర్వం పురుష సంబంధం గల భిక్షుకి వల్లగానీ, తన అక్క ద్వారాగానీ, కన్యలు ఈ కామశాస్త్రాన్ని నేర్చుకోవాలి. కన్యలకు గురుత్వం వహించి ఈ రతి రహస్యాలు నేర్పడానికి వారే తగిన వారు.

దీన్ని బట్టి ఒక ముఖ్యమైన విషయం స్పష్టమవుతూ ఉంది.కామ శాస్త్రం చదివినా, పురుషుడితో సుఖం అనుభవించని వారు రతి రహస్యాలు బోధించలేరు. అలాంటి అనుభవం కలవారే నేర్పడానికి అర్హులు.

కామసూత్రాలు ఎవరి వల్ల నేర్చుకోవాలో చెప్పాడు వాత్స్యాయనుడు. అయితే, సురత క్రీడలో స్త్రీ, పురుషులు అపరిమితమైన సుఖం, ఆనందం అనుభవించాలంటే

కేవలం కామ సూత్రాలు నేర్చుకోవడంతోనే సరిపోదని అంటున్నాడు ఈ శాస్త్రకారుడు. లోకంలో చతుష్షష్టి కళలున్నాయి. అంటే అరవై నాలుగు. ఈ అరవై నాలుగూ మూల కళలు. వీటిలో కర్మాశ్రయాలైన కళలు ఇరవైనాలుగు. జూదానికి ఆశ్రయమైన కళలు ఇరవై. అలాగే శయనోపచారికాలైన కళలు పదహారు. ఉత్తర కళలు నాలుగు. ఆ విధంగా మొత్తం అరవైనాలుగు. ఈ అరవై నాలుగు కళలు కామశాస్త్రానికి అంగ విద్యలు. కాబట్టే కామ సూత్రాలతో పాటు ఈ విద్యలు కూడా నేర్చుకోవాలి. అలా నేర్చుకున్న స్త్రీపురుషులు మాత్రమే సంభోగంలో సంపూర్ణమైన తృప్తి పొందగలుగుతారు. అంగ విద్యలుగా వున్న ఆ అరవై నాలుగు కళలు ఇవి :

*16.* *గీతం, వాద్యం, నృత్యమ్, ఆలేఖ్యమ్, విశేషకచ్ఛేద్యమ్, తండుల కుసుమ బలివికారాః పుష్పాస్తరణమ్, దశనవ సనాంగరాగః, మణిభూమికా కర్మ, శయన రచనమ్, ఉదక వాద్యమ్, ఉదకాఘాతమ్, చిత్రాశ్చయోగాః, మాల్యగ్రథన వికల్పాః, శేఖరకాపీడయోజనమ్, నేపథ్య ప్రయోగాః, కర్ణపత్రభంగాః, గంధయుక్తిః, భూషణ యోజనమ్, ఇంద్రజాలాః, కౌచుమారాశ్చ యోగాః, హస్తలాఘవమ్ విచిత్ర శాకయూష భక్ష్య, వికారక్రియా, పానకర సరాగా సవయోజనమ్, సూచీవాన కర్మాణీ, సూత్రక్రీడా, వీణా డమరుక వాద్యాన్ని, ప్రహేళికా, ప్రతిమలా, దుర్వాచక యోగాః, పుస్తకవాచనమ్, నాటకాఖ్యాయికాదర్శనమ్, కావ్య సమస్యా పూరణమ్, పట్టికా వేత్రవాన వికల్పాః, తక్షకర్మాణీ, తక్షణమ్, వాస్తువిద్యా, రూప్య రత్నపరీక్షా, ధాతువాదః, మణిరాగా కరజ్ఞానమ్, వృక్షాయుర్వేద యోగాః, మేషకుక్కుట లావకయుద్ధ విధిః శుక శారికాప్రలాపనమ్, ఉత్సాదనే సంవాహనే కేశమర్దనే చ కౌశలమ్ అక్షరముష్టికా కథనమ్, మ్లేచ్ఛితకవికల్పాః, దేశ భాషా విజ్ఞానమ్, పుష్ప శకటికా, నిమిత్తజ్ఞానమ్, యంత్ర మాతృకా, ధారణ మాతృకా, సంపాఠ్యమ్, మానసీ కావ్య క్రియా, అభిధాన కోశః, ఛందోజ్ఞానమ్, క్రియా కల్పః, ఛలితక యోగాః, వస్త్ర గోపనాని ద్యూతవిశేషః, ఆకర్షక్రీడా, బాలక్రీడ నకాని, వైనయికానామ్, వైజయికానామ్, వ్యాయామి కానామ్, చ విద్యానామ్ జ్ఞానమ్ ఇతి చతుష్షష్టి రంగ విద్యాః కామ సూత్రస్యావయ విన్యః.*

1. మొదటిది గీతం. అంటే సంగీతం అన్నమాట. గానం చేయబడేది కాబట్టే సంగీతం అన్నారు. ఇది స్వర, పద, లయ ప్రధానంగానూ, మనస్సు యొక్క అవధానం ప్రధానంగా లోలోపల గానం చేసేదిగానూ - ఇలా నాలుగు రకాలుగా వుంటుది.

2. వాద్యం - వాయించదగినది కాబట్టే వాద్యం అన్నారు. ఇది కూడా నాలుగు విధాలుగా వుంటుది. తాళాలతో వాయించేది ఒకరకం. దీన్ని ఘనం అంటారు. మద్దెల మొదలైన వాటిపై వాయించేది మరొక రకం. దీన్ని వితతం అంటారు. తీగలున్న వీణ మొదలైన వాటితో వాయించేది ఇంకోరకం. దీన్ని తతం అంటారు. పిల్లనగ్రోవి మొదలైన వాటితో వాయించేది వేరొకరకం. దీన్ని

సుషిరం అంటారు. ఇలా మొత్తం నాలుగురకాల వాద్యాలు.

3. నృత్యం - కరణాలు, అంగహారాలు, విభావాలు, భావాలు, అనుభవాలు, రసాలు, ప్రత్యేకమైన అవయవాలు- వీటితో కూడింది నృత్యం. ఇది ప్రధానంగా అభినయ స్వరూపమైనది. అంటే విభావాలనూ, అనుభవాలతోనూ, భావాలనూ కూడా చేతులు, కాళ్ళు, వేళ్ళు, మున్నగు అవయవాలతోనూ, శరీరంతోనూ ప్రకటిస్తూ రసస్ఫూర్తి కలిగేలా అభినయించడం. నాట్యానికి సంగ్రహ స్వరూపం ఇది.

4. ఆలేఖ్యం - ఆలేఖ్యం అంటే చిత్ర లేఖనం. అందంగా, సంపూర్ణంగా ఒక ఆకారాన్ని చిత్రించడం అన్నమాట. దీనికి ఆరు అంగాలున్నాయి. (1)రూపభేదం, (2)ప్రమాణం, (3)భారయోజనం, (4)లావణ్యయోజనం, (5) సాదృశ్యం, (6)పుష్పాస్తరణం, వర్ణికాభంగం.

5. విశేషకచ్ఛేద్యం - అంటే స్త్రీలు తిలకంతో ముఖాన్ని, స్తనాలను అలంకరించుకోడం. శిరోజాలను, శరీరంలో ఇతర అవయవాలను అలంకరించుకోడం, పత్ర భంగాలు మొదలైన వాటి చిత్రణ ఇది.

6. పుష్పాస్తరణం - పూలతో రకారకాల ఆసనాలు, శయ్యలు తయారుచేయడం.

7. తండుల కుసుమ బలి వికారం - పుష్పాలతోనూ, బియ్యప్పిండితోనూ, రకరకాలుగ ముగ్గురు పెట్టడం, రంగవల్లులు తీర్చడం. భూత తృప్తికోసం చేస్తారు ఇవి.

8. దశ నవ సనాంగరాగం - దంతాలకు, కట్టుకునే వస్త్రాలకు, శరీరానికి అందంగా, ఆకర్షణీయంగా వుండే రంగులు వేసుకోడం.

9. మణి భూమికాకర్మ - మణులతో బొమ్మలు తయారుచేయడం.

10. శయన రచనం - వసంతం, గ్రీష్మం, వర్ష, శరత్, హేమంతం శిశిరం - అని ఋతువులు ఆరు. ఒక్కొక్క ఋతువులో ఒక్కొక్క విధంగా వుంటుంది శీతోష్ణస్థితి. ఆయా శీతోష్ణస్థితులకు తగినట్లుగా శయ్యలు ఏర్పాటు చేయడం.

11. ఉదక వాద్యం అంటే జలతరంగిణి.

12. ఉదకాఘాతం అంటే పిచికార్లతో నీళ్ళు చిమ్మటం.

13. చిత్ర యోగాలు - రకరకాల వేషాలు వేసుకుని సంచరించడం.

14. మాల్యగ్రథన వికల్పాలు - చిత్ర విచిత్రాలైన పూబంతులు, పూలచెండ్లూ, మాలికలు కూర్చే నేర్పు.

15. శేఖర కాపీడయోజనం - పుష్పాలతో కిరీటాలు, తలచుట్టూ అలంకరించుకునే పూల నగిషీలు తయారుచేయడం.

16. నేపథ్య ప్రయోగాలు - రకరకాలుగా అలంకారాలు చేసుకునే విధానాలు.

17. కర్ణపత్ర భంగాలు - ఏనుగు దంతాలతోనూ, శంఖాలతోనూ చెవులకు అలంకరించుకునే వస్తువులు తయారుచేయడం.

18. గంధయుక్తి - అత్తరు మొదలైన పరిమళ ద్రవ్యాలు తయారు చేసే నేర్పు.

19. భూషణ యోజనం - నగలు, సొమ్ములు పెట్టుకునే విధానాలు.

20. ఇంద్రజాలం - ఇంద్రజాల విద్య. చూపరుల కళ్ళకు భ్రమ కల్పించడం.

21. కౌచుమారం - సుభగం కరణాది యోగాలు తెలుసుకోడం.

22. హస్తలాఘవం - చేతిలో వున్న వస్తువులు మాయం చేయడం మొదలైనవి.

23. విచిత్ర శాక యూషభక్ష్య వికార క్రియాపాన కర సరాగాసవ యోజనం - అంటే రకరకాల కూరలు, వంటలు, రొట్టెలు, భక్ష్యాలు పానకాలు, షర్బత్‌లు మొదలైన వంటకాలు, పానీయాలు తయారుచేసే నేర్పు.

24. సూచీవాన కర్మ - గుడ్డలు కుట్టడం.

25. సూత్ర క్రీడ - దారాలు తెంచి, కాల్చి మళ్ళీ ఆ దారాలు వున్నవి వున్నట్లుగా చూపించే నేర్పు.

26. వీణా డమరుక వాద్యాలు - వీణ, డమరుకం మొదలైన ప్రసిద్ధ వాద్యాలను వాయించడంలో ప్రజ్ఞ.

27. ప్రహేళికలు - ఇది కవిత్వంలో ఒక భాగం. పైకిమాత్రం సామాన్య అర్థాన్ని వ్యక్తం చేస్తూ, అసలు అర్థం నిగూఢంగా వుండేటట్లు కవిత్వం చెప్పడం.

28. ప్రతిమాల - చాటు పద్యాలు చెప్పే నేర్పు.

29. దుర్వాచక యోగలు - క్లిష్టంగా అర్థం కాకుండా వున్న పద్యాలను వినోదం కోసం వ్రాసి, చదవడం.

30. పుస్తక వాచనం - కావ్యాలను, పురాణాది గ్రంథాలను రసవత్తరంగా, శ్రావ్యంగా చదవడం.

31. నాటకాఖ్యాయికాదర్శనం - నాటకాలు, గద్య గ్రంథాలు, చంపువులు, మొదలైనవన్నీ చదివి, సరిగా అర్థం చేసుకునే నేర్పు.

32. కావ్య సమస్యా పూరణం - పద్య పాదాలుగా ఇచ్చిన క్లిష్టమైన సమస్యలను పూరించడం.

33. పట్టికావేత్ర వానవికల్పాలు - అంటే పేముతో కుర్చీలు, మంచాలు, బుట్టలు అల్లడం.

34. తర్కుకర్మలు - విలాసార్థం కొయ్యలతోనూ, ఇతర వస్తువులతోనూ రకరకాల బొమ్మలు తయారుచేయడం.

35. తక్షణం - కొయ్యలను రకరకాల బొమ్మలుగా చెక్కడం.

36. వాస్తు విద్య - గృహ వాస్తు విద్య నేర్చుకోడం. అంటే ఇళ్ళు కట్టడానికి అవసరమైన కొలతలు లెక్కకట్టడం.

37. రూప్య రత్న పరీక్ష - వెండి, బంగారు నాణాలనూ, రత్నాలనూ పరీక్షించి మంచి చెడ్డలు తెలుసుకోడం.

38. ధాతువాదం - భూగర్భంలో లోహాలు ఎక్కడెక్కడ వున్నాయో కనిపెట్టడం.

39. మణిరాగాకర జ్ఞానం - మణులు, రత్నాలు, వున్న గనులను కనుక్కోడం.

40. వృషాయుర్వేద యోగాలు - ఆయుర్వేదంలో వృషాయుర్వేదం ఒక భాగం. చెట్ల వైద్యం ఇది.

41. మేషకుక్కుట లావక యుద్ధ విధులు - పొట్టేళ్ళు, లేళ్ళు, లావక పిట్టలు మొదలైన వాటితో పందాలు వేయించి, పోట్లాడించే నేర్పు.

42. శుక శారికా ప్రలాపాలు - చిలుకలనూ, గోరువంకలనూ పలకరించి, వాటిచేత మాటలు చెప్పించడం.

43. ఉత్సాదనే, సంవాహనే, కేశమర్దనేచ కౌశలం - అంటే ఒళ్ళు పట్టడం, పాదాలు ఒత్తడం, తల అంటడం - ఈ పనులలో నేర్పు.

44. అక్షరముష్టికా కథనం - చేత్తో మధ్య మధ్య అక్షరాలు వ్రాస్తూ, కవిత్వం చెప్పడం.

45. మ్లేచ్ఛిత వికల్పాలు - ఇతరుల కవిత్వం ఎంత గొప్పగా వున్నా, దానిలో తప్పులు, అపశబ్దాలు వున్నట్లు భ్రమ పెట్టడం.

46. దేశభాషా విజ్ఞానం - దేశ భాషలన్నింటిలో తగినంత పరిజ్ఞానం కలిగి వుండడం.

47. పుష్ప శకటిక - పూల రథం, పూల పల్లకీ మొదలైనవి తయారుచేయడం.

48. నిమిత్త జ్ఞానం - అంటే శుభాశుభ శకునాలను గురించి తెలుసుకోడం.

49. యంత్ర మాతృక - జలయంత్రాలు మున్నగునవి నిర్మించే నేర్పు.

50. ధారణ మాతృక - ఒకమాటు విన్న దాన్ని ధారణ పట్టి చెప్పడం.అవధాన ప్రక్రియలో ఇది చాలా అవసరం.

51. మానసీక్రియ - మనస్సుతోనూ, బుద్ధితోనూ, ఆలోచించిచేసే అష్టావధాన, శతావధానాది అవధానాలు చేయడంలో ప్రజ్ఞ.

52. సంపాఠ్యం - అనేకమంది గొంతులతో గొంతు కలిపి ఏదైనా చదవడం, పాడడం.

53. కావ్య క్రియ - కావ్యాలు రచించే నేర్పు.

54. అభిధానకోశం - నిఘంటువులను వర్ణించడం.

55. ఛందోజ్ఞానం - ఛందస్సులు ఇరవై ఆరు - అవి - ఉక్త, అత్యుక్త, మధ్య, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్కు, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి, అతిజగతి, శక్వరి, అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి, కృతి, ప్రకృతి, అకృతి, వికృతి, సంకృతి, అభికృతి, ఉత్కృతి. ఈ ఇరవైఆరు ఛందస్సులతో కూడిన ఛందోశాస్త్రాన్ని క్షుణ్ణంగా నేర్చుకొని, గణ యతి ప్రాసాది లక్షణాలతో కూడిన విలక్షణమైన కవిత్వాన్ని చెప్పే నేర్పు.

56. క్రియాకల్పం - ఏ పనిలోనైనా స్వతంత్రమైన సృజనాత్మక శక్తి కలిగి వుండడం.

57. ఛలితక యోగం - ఒక వస్తువును మాయచేసి, దాని రూపాన్నే మార్చి మరో వస్తువును చూపడం.

58. వస్త్ర గోపనం - అలనాడు శ్రీకృష్ణుడు గోపికల వస్త్రాలను మాయం చేసినట్లుగా, గుడ్డలను మాయంచేసే విధానాలు తెలుసుకోడం.

59. ద్యూత విశేషాలు - జూదం ఆడడంలో గల మెళుకువలు తెలుసుకోడం.

60. ఆకర్ష క్రీడ - తాడు అటు - ఇటు లాగుతూ ఆడే ఆటలో నేర్పు.

61. బాల క్రీడనకాలు - పిల్లల ఆట వస్తువులను అందంగా తయారు చేయగలగడం.

62. వైనయికీ జ్ఞానం - అంటే ఇది యుద్ధాల్లో విజయం పొందడానికి అవసరమైన ఉపాయాలు తెలిపే శాస్త్రం. ఏనుగులనూ, గుర్రాలనూ వశపరుచుకునే నేర్పు ఈ శాస్త్రం చదివితే తెలుస్తుంది.

63. వైజయికీ విద్యలు - ఇది కూడా విజయాన్ని సాధించే ఉపాయాలు చెప్పే శాస్త్రం. ఈ శాస్త్రం నేర్చుకోవాలి.

64. వ్యాయామికీ జ్ఞానం - రకరకాల వ్యాయామాల్ని గురించి, శరీర పరిశ్రమను గురించి తెలుసుకోడం.

ఈ విధంగా కామశాస్త్రంతో పాటు ఈ అరవైనాలుగు విద్యల్లోనూ ఆరితేరి వుండాలి.

# శయనమందిరం ఎలా అమర్చుకోవాలి ?

*17. పాంచాలి కీ చతుష్షష్టి రపరా.*

పైన చెప్పిన అరవైనాలుగు మూలకళలే కాక, పాంచాలికీ కళలనే పేరుతో మరో అరవైనాలుగు కళలున్నాయి. అవి కూడా కామశాస్త్రానికి అంగవిద్యలే. వాటివల్ల కూడా కామ ప్రవృత్తి కలుగుతుంది.

*18. తస్యాః ప్రయోగా నన్య వేత్య, సాంప్రయోగికే వక్ష్యామః*

ఈ పాంచాలికీ కళలను ప్రయోగించే విధానాలను ముందుముందు వచ్చే సాంప్రయోగిక అధికరణంలో వివరిస్తాడు శాస్త్రకారుడు.

*19. కామస్య తదాత్మ వేత్వాత్.*

కామం అనేది పాంచాలికీ చతుష్షష్టి రూపమైనది కాబట్టి, కామ శాస్త్రానికి ఈ కళలు అంగభూతాలని చెప్పడానికి మాత్రమే వాటిని గురించి వాత్స్యాయనుడు ఇక్కడ ప్రస్తావించాడు. అంతేకాని, వాటి స్వరూపాన్ని గురించి ఇక్కడ చెప్పదలచలేదు.

*20. ఆభిరభ్యుచ్ఛ్రితా వేశ్యా, శీలరూప గుణాన్వితా,*
*లభతే గణికాశబ్దం స్థానం చ జనసంసది*

ఏ వేశ్య అయితే ఈ పాంచాలికీ కళల్లో నేర్పు గడిస్తుందో, ఆ వేశ్య ఎంతో ఉత్కర్షను పొందుతుంది. అంటే ఎక్కువ ప్రాధాన్యం వహించే గౌరవ మర్యాదలు పొందుతూ అందరినీ అధికంగా ఆకర్షిస్తుంది. అలాంటి వేశ్యకు చక్కని అందచందాలు, మంచి స్వభావం వుండి ముందు వైశికాధికరణంలో చెప్పబోయే

నాయికా గుణాలు కలిగివుంటే ఆ వేశ్య 'గణిక' అనే బిరుదుపొంది, ప్రసిద్ధురాలై రసికజన సభల్లో అగ్రతాంబూలం అందుకుంటుంది.



*21. పూజితా సా సదా రాజ్ఞా, గుణవద్భిశ్చ సంస్తుతా,*
*ప్రార్థనీయా భి గమ్యా చ, లక్ష్య భూతా చ జాయతే.*

ఇలాంటి వేశ్య రాజుల నుండి గృహ క్షేత్రాది దానాలు, పూజలు పొందుతూ నిరంతరం గౌరవమర్యాదలు అనుభవిస్తూ వుంటుంది. రసిక శిఖామణుల పొగడ్తలకు పాత్రురాలు అవుతూ వుంటుంది. ఇతరులకు కళలు నేర్పడానికి కూడా ఈమే అర్హురాలు. నాగరకులందరికీ ఇలాంటి వేశ్యాంగన ఆదర్శ ప్రాయురాలు అంటాడు వాత్స్యాయనుడు.

*22. యోగజ్ఞా రాజపుత్రీ చ, మహామాత్ర సుతా తథా,*
*సహస్రాంతః పురమపి స్వవశే, కురుతే పతిం.*

పైన పేర్కొన్న లక్షణాలన్నీ వున్న రాకుమారి గానీ, మహాసామంతుల కుమార్తెగానీ, వెయ్యిమంది సవతులున్న అంతఃపురంలోనైనా సరే, భర్తను ఇట్టే వశం చేసుకోగలుగుతుంది!

*23. తథా పతి వియోగే చ, వ్యసనం, దారుణం గతాః,*
*దేశాంతరే పి విద్యాభి స్సా, సుఖేనైవ జీవతి.*

ఇలాంటి స్త్రీకి భర్త గతించటం వల్ల పురుషుడితో శాశ్వతమైన వియోగం సంభవించి, దుర్భరమైన దుఃఖం ప్రాప్తించినా, దేశాంతరాల్లోనైనా సరే, తన విద్యచేత సుఖ సంతోషాలతో కాలం వెళ్ళబుచ్చ గలుగుతుంది.

*24. నరః కళాను కుశలో వాచాల శ్చాటుకారకః,*

*అనంతుస్తుతో పి నారీణాం, చిత్త మాశ్వేవ విందతి.*

పైన చెప్పిన కళల్లో నేర్పుగల పురుషుడు కూడా, అనేక విషయాలను గురించి మాట్లాడ గలవాడుగానూ, లౌక్యంతో ప్రవర్తించ గలవాడుగానూ, ప్రియ సంభాషణా చతురుడుగానూ వుండి, తనకు ఎన్నడూ పరిచయం లేని స్త్రీ మనస్సునైనా సరే, ఇట్టే దోచుకుని వశం చేసుకోగలుగుతాడు.

*25. కళానాం గ్రహణాదేవ, సౌభాగ్య ముపజాయతే,*

*దేశకాలౌ త్వవేక్ష్యాసాం, ప్రయోగ స్సంభవేన్న వా.*

ఈ కళలన్నీ నేర్చినందుచేతనే లోకంలో స్త్రీ పురుషులకు మహత్తరమైన సౌభాగ్యం ఏర్పడుతుంది, ఇక్కడ సౌభాగ్యం అంటే ధనప్రాప్తి. అనర్థం వాటిల్లినా దానికి ప్రతిక్రియ చేయగలగడం, కామం, కీర్తి మొదలైనవి. ఇలాంటి వారు దేశకాలాదులను పరీక్షించుకుని, కామ కేళీ విలాసాలు సాగించడానికి తగిన తరుణం అవునా, కాదా అని గ్రహించి ప్రవర్తిస్తారు. అఖండ సౌఖ్యానందం పొందుతారు.

ఇతి విద్యా సముద్దేశ స్తృతీయో ధ్యాయః

**ఇది విద్యా సముద్దేశం అనే మూడవ అధ్యాయం.**



# చతుర్థాధ్యాయం
# నాగరకవృత్తం

*1. గృహీత విద్యః ప్రతి గ్రహ జయ, క్రయ నిర్వేశాధి గతై*
*రర్థైరన్వయాగతై రుభయైర్వా గార్హస్థ్య మధిగమ్య నాగరక వృత్తం వర్తేత.*

**ఇంతకు** ముందు చెప్పినట్లుగా మానవుడు శాస్త్రాలన్నీ చదివి, ఈ కామ సూత్రాలు కూడా తెలుసుకున్న తరువాత పెళ్ళి చేసుకుని భార్యతో కాపురం చేస్తూ వుండాలి.

అయితే, అలా గృహస్థు అయిన వాడికి ధనం లేకపోతే, గృహకృత్యాలు సాగించలేదు. అందుచేత బ్రాహ్మడు విద్యవల్ల, దానధర్మాలు స్వీకరించడం వల్ల క్షత్రియుడు పరాక్రమం వల్ల, వైశ్యుడు వ్యాపారంవల్ల, శూద్రుడు వ్యవసాయాదుల వల్ల ధనం సంపాదించాలి. ఇలా అన్ని వర్ణాల గృహస్థుల కోసం వాత్స్యాయన ముని ఈ కామ సూత్రాలు వ్రాస్తున్నాడు. నాగరకవృత్తం అనే ఈ అధ్యాయం కామ శాస్త్రానికి శరీరం లాంటిది. ఎందుచేతనంటే, మానవుడు ఎన్ని శాస్త్రాలు చదివినా, ఎన్నెన్ని విషయాలు తెలుసుకున్నా, గృహస్థాశ్రమంలోనే వాటన్నిటినీ ఆచరణలో పెట్టగలుగుతాడు.

*2. నగరే పత్తనే ఖర్వాటే, మహతి వా సజ్జనాశ్రయే స్థానం.*

గృహస్థు పెద్ద నగరంలోగానీ, పట్టణంలోగానీ, ఖర్వాటంలోగానీ, అంతకన్నా పెద్దదైన ద్రోణముఖంలో గానీ, సజ్జనులు, విద్వజ్జనులు ఎక్కువ మంది నివసించే మరో చోటగానీ నివాసం ఏర్పరచుకోవాలి.

ఇక్కడ నగరం అంటే, ఎనిమిది వందల గ్రామాల మధ్య గల పెద్ద గ్రామం. పట్టణం అంటే రాజుల నివసించే పెద్ద నగరం. ఖర్వాటం అంటే, నాలుగు వందల గ్రామాల మధ్య వున్న పెద్ద గ్రామం. అంత కన్నా పెద్దది ద్రోణముఖం అంటారు.

*3. యాత్రావశాద్వా*

ఇంకా చెప్పాలంటే జీవితం సుఖంగా గడపడానికి అనుకూలంగా వుండే ప్రదేశం ఏదో అక్కడ నివసించాలి గృహస్థు.

*4. తత్ర భవన మాసన్నోదకం వృక్షవాటికావత్,*
*విభక్త కర్మ కక్షం, ద్విధా వాసగృహం కారయేత్.*

ఎక్కడైన సరే, గృహం లేకుండా గృహస్థు వుండలేదు కాబట్టి, మొదట గృహం నిర్మించుకోవాలి. ఆ ఇంటికి మంచినీటి సౌకర్యం వుండాలి. కాబట్టి ఇంటికి సమీపంలో నదిగానీ, చెరువుగానీ, బావిగానీ వుండితీరాలి. ఆ ఇంటికి దగ్గర్లో తోట కూడా వుండాలి. ఆ తోటకు నీటి సౌకర్యం వుండాలి. నివాస గృహం వాస్తుశాస్త్ర ప్రకారం రెండు భాగాలుగా కట్టుకోవాలి. ప్రధాన గృహానికి

ప్రక్కనే వేరుగా వంట ఇల్లు కట్టుకోవాలి. నివాస గృహంలో రతి క్రీడల కోసం ప్రత్యేకమైన గది వుండాలి. ఈ గృహ నిర్మాణం యావత్తూ వాస్తుశాస్త్రజ్ఞుల వల్ల తెలుసుకుని, ఆ ప్రకారం నడుచుకోవలసి వుంటుంది.

*5. బాహ్యే చ వాసగృహే, సుశ్లక్ష ముభయోపధానం*

*మధ్యే వినతం, శుక్లోత్తరచ్ఛదం, శయనీయం స్యాత్, ప్రతిశయ్యికా చ.*

ఇక గృహంలో అవసరమైన ఉపకరణాలను గురించి, వాటిని అమర్చు కోవలసిన పద్ధతిని గురించి చెపుతున్నాడు శాస్త్రకారుడు. ఇంట్లో లోపలి భాగాన్ని స్త్రీ జనం పడుకోడానికి వీలుగా తయారు చేసుకోవాలి. ఇంట్లో ముందువైపు భాగంలో శయన మందిరం వుండాలి. ఈ పడక గది రతి క్రీడలకు వీలైనట్లుగా ఏర్పాటు చేసుకోవాలి. ఆ గదిలో చిత్ర విచిత్రమైన నగిషీ పనులతో తీర్చిదిద్దిన పెద్ద మంచం వుండాలి. దానిపై మెత్తని దూది పరుపు పరిచి వుంచాలి. ఆ పురుపుమీద శుభ్రమైన తెల్లటి వస్త్రంవేసి, తల క్రిందా, కాళ్ళ క్రిందా రెండు చక్కటి దిండ్లు అమర్చుకోవాలి. పడక గదిలో అడుగు పెట్టేసరికి, సువాసనలు గుప్పున గుబాళించేలాగా అత్తరు, పన్నీరు, అగరు వత్తులు మున్నగు సుగంధ ద్రవ్యాలు గతిలో అట్టిపెట్టి వుంచాలి. పరుపుపై పరచిన దుప్పటి రోజూగానీ, రెండు రోజులకు ఒకసారి గానీ, కనీసం మూడు రోజులకు ఒకసారిగానీ శుభ్రంగా ఉతికి, చలువ చేయిస్తూ వుండాలి.

ఇక సంభోగానంతరం స్త్రీ పురుషులు అదే శయ్యపై పడుకోకూడదు. అందుకని పెద్ద మంచం ప్రక్కనే, దాని కన్నా ఎత్తు తక్కువగా వుండే ఒక చిన్న మంచం ఏర్పాటు చేసుకోవాలి.

## పడకటింటి విలాసమ్

*6. తస్యచ శిరోభాగే కూర్చస్థానం*

శయ్యకు తలవైపున నేలమీద కూచుని దైవ ప్రార్థన చేసుకోడానికై కూర్చాసనం ఒకటి ఏర్పాటు చేసుకోవాలి. అంటే జపం చేసుకోడానికి వీలైన ఆసనం ఇది.

*7. వేదికా చ.*

మంచానికి ఎదురుగా గానీ, గదిలో మరో వైపున గాని మూరెడు వెడల్పు గల అరుగు ఒకటి గోడకు ఆనుకుని వుండాలి.

*8. తత్ర రాత్రిశేషమనులేపనం, మాల్యం, సిక్థా కరండకం, సౌగంధిక*

*పుటికా, మాతులుంగత్వచః, తాంబూలాని చ స్యుః*

క్రిందటి రాత్రి ఉపయోగించగా మిగిలిన పూలు, పూల మాలలు సుగంధ ద్రవ్యాలు, అంగరాగాలు, చెమట పోసినప్పుడు హాయి కోసం విసురుకునే విసనకర్ర, తాంబూల ద్రవ్యాలు, నోటి దుర్వాసన పోగొట్టే లవంగపు బెరడులు మొదలైన వస్తువులు ఈ అరుగుమీద పెట్టుకోవాలి.

# పడకగది ఎలా వుండాలి?



*9. భూమౌ పతద్గ్రహః*

పైన చెప్పిన అరుగునకు క్రింది భాగంలో ఉమ్మి వేసుకునే పాత్ర ఒకటి ఉంచుకోవాలి. తమ్మ ఉమ్మి వేసుకునే పాత్రను పతద్గ్రహం అంటారు.

*10. నాగదంతావసక్తా వీణా, చిత్ర ఫలకం, వర్తికానముద్గకోయః,*

*కశ్చిత్ పుస్తకః, కురంటక మాలాశ్చ).*

ఉత్సాహంగా వున్నప్పుడు మధ్య మధ్య వాయించుకోడానికి ఒక వీణను, ఏనుగు దంతపు చిలుక కొయ్యకు తగిలించుకుని వుంచుకోవాలి. ఆ వీణపై ఏదైనా ఒక శుభ్ర వస్త్రం కప్పి వుంచాలి. అలాగే బుద్ధి పుట్టినప్పుడు చిత్ర పటాలు గీసుకోడానికి ఒక చిత్ర ఫలకం కూడా గదిలో వుండాలి. కామ సూత్ర గ్రంథం కూడా వుండడం అవసరం. ఇక గోరింట పూలు, పొగడపూలు మొదలైనవి అట్టేపెట్టుకోవాలి. ఎందుకంటే, రతి క్రీడలో రాపిడికి పూలు వాడిపోకుండా వుంటాయి. పైన చెప్పిన ఈ వస్తువులన్నీ శయన మందిరంలో తగిన చోట్ల జాగ్రత్త పరచుకోని వుంచు కోవాలంటాడు వాత్స్యాయనుడు.

*11. నాతి దూరే భూమౌ వృత్తాస్తరణమ్ నమస్తకం.*

తల ఆనించి సుఖంగా విశ్రమించడానికి వీలుగా వుండే పడక కుర్చీ ఒకటి, శయ్యకు దగ్గరగా వుండాలి.

*12.* *ఆకర్ష ఫలకం, ద్యూత ఫలకం చ*

ఇంకా చక్కటి అద్దం, కులాసాగా ఆడుకోడానికి చదరంగం బల్ల, లేదా మరో రకంగా జూదం ఆడే పలక గోడకు తగిలించి వుంచాలి. ఇలా పడక గదిలో వుంచిన వస్తువులన్నీ ప్రతి రోజూ తుడిచి శుభ్రం చేస్తూ వుండాలి.

*13.* *తస్య బహిః క్రీడా శకుని పంజరాణి*

నివాస గృహానికి ఆనుకుని ముందున్న ఇంట్లో, వినోదం కోసం విలాసం కోసం, చిలుక పంజరాలు వ్రేలాడ గట్టాలి. ఆ పంజరాలు ఏనుగు దంతంతో తయారుచేసినవిగా వుండాలి.

*14.* *ఏకాంతే చ తర్కు తక్షణ స్థాన మన్యాసాం చ క్రీడానాం*

నివాస గృహంలో ఏకాంతంగా వుండే భాగంలో కొయ్యలు కోయించడానికీ, చెక్కించడానికీ, క్రీడించడానికీ అనువుగా వుండే ప్రత్యేక స్థలం ఒకటి అట్టి పెట్టుకోవాలి.

*15.* *స్వాస్తీర్ణా ప్రేంఖాదోలా వృక్ష వాటికాయాం,*
*నప్రచ్ఛాయాస్థండిల పీఠికా చ, నకుసుమా ఇతి భవన విన్యాసః*

ఉద్యాన వనంలో దట్టంగా అల్లుకున్న చల్లని, చెట్ల కొమ్మల క్రింద ఉయ్యాల కట్టుకోవాలి. వన విహారం చేసేటప్పుడు దీన్ని ఉపయోగించుకోవచ్చు. ఎల్లప్పుడూ పూలు, పుప్పొడులు రాలుతూ వుండే పొదరిండ్ల మధ్య విశ్రమించడానికి ఒక గచ్చు అరుగు ఏర్పాటు చేసుకోవాలి. వన విహార సమయంలో ప్రియురాలిని ప్రక్కన కూచో బెట్టుకుని హాయిగా ఉయ్యాల ఊగవచ్చు. అలాగే రతి అనంతరం అలసట తీర్చుకోవడానికి అరుగుమీద విశ్రమించి, పొదరిండ్ల నుంచి పుష్ప పరిమళాన్ని ఆస్వాదిస్తూ వుంటే, శ్రమ తీరడమే కాక, మనస్సుకు ఆహ్లాదం కలిగి, మళ్ళీ నూతనోత్సాహం పుట్టుకొస్తుంది. అందుకోసమే ఈ ఏర్పాట్లన్నీ చెప్పాడు శాస్త్రకారుడు.

*16.* *న ప్రాతరుత్థాయ, కృతనియత కృత్యః, గృహీత దంతధావనః,*
*మాత్రయా ఆనులేపనం, ధూపం, స్రజమితి గృహీత్వా, దత్వా సిక్థక,*
*మలక్తకం చ, దృష్ట్వా ఆదర్శే ముఖం, గృహీత ముఖ*
*వానతాంబూలః కార్యాణ్యనుతిష్ఠేత్.*

ఇప్పుడు గృహస్థు అయినవాడు ప్రతిరోజూ ఏమేమి చేయాలో చెపుతున్నాడు వాత్సాయనుడు. గృహస్థు రోజూ తెల్లవారక ముందే నిద్రలేచి, దంత ధావనం మున్నగు కాలకృత్యాలు తీర్చుకొని, స్నానం, సంధ్య, జపతపాదులు ముగించుకుని కొద్దిగా గంధం దేహానికి అలదుకుని, ఒళ్ళంతా పారేలా ధూపం వేసుకుని పరిశుభ్రమైన తెల్లటి వస్త్రాలు ధరించాలి. పిమ్మట పూలమాలలు వేసుకోవాలి. పెదవులకు కొద్దిగా లత్తుక అద్దుకుని, అద్దంలో ముఖం చూసుకుని, తాంబూలం వేసుకుని, తమ్మి బుగ్గన పెట్టుకుని, మళ్ళీ తాంబూలం వేసుకోడానికి, తాంబూల కరండం (తాంబూలపు పెట్టె) చేత పట్టుకుని, అప్పుడు ధర్మార్థ కామాలు సాధించే ప్రయత్నంలో నిమగ్నం కావాలి.

*17. నిత్యం స్నానం, ద్వితీయక ముత్సాదనం, తృతీయకః ఫేనకః చతుర్థక మాయుష్యం, పంచమకం దశమక వా ప్రత్యాయుష్యమిత్యహీనం.*

గృహస్థు ఇంకా నిత్యం చేయవలసిన పనులను గురించి వాత్స్యాయనుడు వివరిస్తున్నాడు - ప్రతిరోజూ విధిగా స్నానం చెయ్యాలి రెండుపూటలా. ఉదయం చన్నీళ్ళ స్నానం, సాయంత్రం వేడినీళ్ళ స్నానం ఆరోగ్యకరం, స్నానం దేహానికి తేజస్సు, కాంతీ ఇవ్వడమే కాక, దేహాన్ని పరిశుభ్రంగా, ఆరోగ్యంగా వుంచుతుంది. మూడు రోజులకొకసారి అభ్యంగన స్నానం ఆచరించాలి. తైలంతో తల అంటుకుని స్నానంచేస్తూ ఉండటం ఆరోగ్యానికి ముఖ్యమని ఆయుర్వేదం పేర్కొంటున్నది. అలాగే నాలుగు రోజులకు ఒకసారి క్షౌరం చేయించుకోవాలి. క్షురకర్మ ఆయుష్యాన్ని వృద్ధి చేస్తుంది. అయిదు రోజుల కొకసారి లేదా కనీసం పదిరోజుల కొకసారి అధో రోమాలు తీసివేస్తూ వుండాలి. అలా కాకుండా అధో రోమాలు పెంచటం అనారోగ్యకరం.

*18. సాతత్యాచ్చ సంవృత కక్షా స్వేదాపనోదః*

కొన్ని సందర్భాల్లో మనం చంకలు మూసుకుని వుంటాం. అలాంటప్పుడు, ఇంకా ఏదైనా పనులు చేసేటప్పుడు చంకల్లో ఎక్కువగా చెమట పడుతుంది. వెంట వెంటనే గుడ్డతో చెమట తుడుచుకోవాలి. లేకపోతే దుర్వాసన వెలువడుతుంది.

*19. పూర్వాహ్ణాపరాహ్ణ యోర్భోజనం.*

సూర్యోదయ సూర్యాస్తమయాల కాలం సమంగా వుండే రోజుల్లో రాత్రింబగళ్ళ ప్రమాణం సాధారణంగా 24 గంటలు. కొంత కాలం పగటి ప్రొద్దు ఎక్కువ. మరికొంత కాలం రాత్రి ప్రొద్దు ఎక్కువ. సూర్యగతిని బట్టి కాల ప్రమాణంలో ఇలా వ్యత్యాసాలు ఏర్పడుతున్నాయి. ఏమైనా పగలు, రాత్రి ఒక్కొక్క దాన్ని ఎనిమిదేసి సమభాగాలుగా విభజించుకోవాలి. నాలుగో భాగంలో మళ్ళీ స్నానం చేసి భోజనం చెయ్యాలి. పగటి ఎనిమిదో భాగంలో అంటే చివరి భాగంలో మళ్ళీ వేడినీళ్ళతో స్నానం చేసి భోజనం చెయ్యాలి అంటే ఇది రాత్రి వచ్చిన తరువాత నన్నమాట. వాత్స్యాయనుడు చెప్పిన పద్ధతి ఇది.

*20. సాయం చారాయణస్య.*

అయితే, మధ్యాహ్నానికి ముందున్నూ, సాయంకాలమున్నూ భోజనం చేయాలని చారాయణుడు అంటాడు. అభిప్రాయాలు ఇలా భిన్నంగా వున్నా, రాత్రి భోజనం కంటే సాయంకాల భోజనం పుష్టికరమైనది కాదనేది స్పష్టం.

*21. భోజనానంతరం శుకశారికా ప్రలాపన వ్యాపారాః, లావక కుక్కుట మేష యుద్ధాని, తాస్తాశ్చ కళాః క్రీడాః పీఠమర్దవిట విదూషక కాయత్తాః వ్యాపారాః దివాశయ్యా చ.*

మధ్యాహ్నం భోజనం అయిన తరువాత చిలుకలు, గోరువంకలు, మైనా పిట్టలు మొదలైన పక్షుల చేత మాట్లాడించడం, పావురాళ్ళు, కోళ్ళు, పొట్టేళ్ళు

మొదలైన వాటిచేత పోట్లాడించడం, పీఠమర్దులు, విటులు, విదూషకుల సహాయంతో వేళలకు సంబంధించిన ప్రయోగాలు జరపడం - ఇలాంటి వినోద కార్యక్రమాల్లో పాల్గొనాలి. తరువాత కొంతసేపు నిద్రపోవాలి.

సాధారణంగా పగటి నిద్ర మంచిది కాదు. అయినా వేడి ఎక్కువగా వుండే గ్రీష్మ ఋతువులో పగటి నిద్ర దోషం కాదు.

*22. గృహీత ప్రసాధనస్యాపరాహ్ణే గోష్ఠీ విచారాః*

పైన చెప్పిన కార్యక్రమాలన్నీ పూర్తిచేసుకుని, పగటి చివరి భాగంలో, అంటే సాయంకాలం వేళ విహారానికి తగిన వేషం ధరించి, మిత్రులతోనూ, ఆప్తులతోనూ విహారానికి వెళ్ళాలి.

*23. ప్రదోషే సంగీత కానిచ.*

అలా విహారం పూర్తిచేసి వచ్చి, చీకటి పడగానే నాట్యం, సంగీతం, వాద్యం మొదలైన వాటితో గోష్ఠులు జరపాలి.

## గోష్ఠులూ - సమావేశాలూ

ఈ విధంగా పగటి కార్యక్రమాలు ముగించుకుని, సంగీతాది గోష్ఠులు జరిపిన అనంతరం గృహస్థు ఏం చెయ్యాలో చెబుతున్నాడు వాత్స్యాయనుడు.

*24. తదంతే చ, ప్రసాధితే వాసగృహే, సంచారితే చ సురభిధూపే,*
*ససహాయస్య శయ్యాయాం, అభిసారికాణాం ప్రతీక్షణం,*
*దూతీనాం ప్రేషణం, స్వయం వా గమనం.*

సంగీతాది గోష్ఠుల అనంతరం నాగరకుడైన గృహస్థు, రతిక్రీడకై ఏర్పాటు చేసుకున్న ఇంటి ముందు భాగంలోని గదిలోకి వెళ్ళాలి.

ఆ పడక గది అప్పటికే శుభ్రంగా ఊడ్చి, నీళ్ళుచల్లి, చక్కగా, చిత్ర విచిత్రమైన పుష్పాలతోనూ, ఇతర వస్తువులతోనూ అలంకరించి వుండాలి. శయన మందిరం అంతటా అగరువత్తుల ధూపాలతో, తక్కిన పరిమళ ద్రవ్యాలతో గుప్పున సువాసనలు వెదజల్లుతూ వుండాలి.

విటుడు, విదూషకుడు, పీఠమర్దుడు, చేటుడు మొదలైన వారితో గృహస్థు ఈ శయన గృహంలో ప్రవేశించి అభిసారికకై నిరీక్షిస్తూ వుండాలి.

**నాయికలు ఎనిమిది విధాలు :**

1. ప్రోషిత భర్తృక — అంటే ప్రియుడు దేశాంతరం పోయి వుండగా విచారంతో వుండేది.

2. ఖండిత — అంటే ప్రియుడు మరో స్త్రీతో సంగమించినట్లు గుర్తులు చూచి ఈర్ష్య పడేది.

3. కలహాంతరిత — అంటే, ప్రియుడు ఎదురుగా వున్నప్పుడు పోట్లాడి అతను దూరం కాగానే పశ్చాత్తపించేది.

4. విప్రలబ్ధ — సంకేత స్థలంలో ప్రియుడు కనిపించక, మోసపోయి రాయబారం పంపించేది.

5. వాసవ సజ్జిక — ప్రియుడు వస్తాడని, పడకగది అలంకరించి, నిరీక్షిస్తూ వుండేది.

6. స్వాధీన పతిక — తాను చెప్పినట్లు వింటూ, తాను కోరినట్లుచేసే భర్త గలది.

7. అభిసారిక — అంటే చక్కగా అలంకరించుకుని తనంతటతానే ప్రియుని కలుసుకోడానికి సంకేత స్థలానికి వెళ్ళేది.

8. విరహోత్కంఠిత — సంకేత స్థలానికి ప్రియుడు రాకపోతే విరహంతో దుఃఖించేది.

నాయికలకు చెలులున్నట్టే, నాయకులకు విటుడు, విదూషకుడు, పీఠమర్దుడు, చేటుడు అనేవారు సఖులు.

ఎదురు చూసినా ప్రియురాలు రాకపోతే ఆమె దగ్గరికి దూతికను పంపాలి లేదా తనంతట తానైనా వెళ్ళాలి. గృహస్థు వెంట వచ్చిన అతని సఖులు శయ్యమీద కూచోకుండా వేరే ఆసనాలపై కూచోవాలి.

25. *ఆగతానాం చ మనోహరై రాలా, పైరుపచారైశ్చ సహాయ స్యోపక్రమాః*
*వర్ష ప్రమృష్ట నేపథ్యానాం, దుర్దినాభిసారికాణాం*
*స్వయమేవ పునర్మండనం, మిత్రజనేన వా, పరిచరణ మిత్యాహోరాత్రికమ్.*

ప్రియురాలు రాగానే, ఆమెను ముద్దుగా పలకరించి, ఆమె మనస్సుకు ఆహ్లాదం కలిగే మాటలు చెప్పాలి. మబ్బు పట్టి వర్షం కురుస్తుంటే, ఆ వర్షంవల్లకానీ, మరే కారణంవల్లకానీ ఆమె ముంగురులు చెదిరి వుంటే, ప్రక్కన కూచుని ముంగురు సవరించాలి. తన ప్రేమను తెలుపుతూ ఆమె అలంకారాలు సరిచెయ్యాలి. ఉత్తమ నాయికలకు చేసే పద్ధతి ఇది. అంతే కాకుండా అభిసారిక దూరం నుంచి వచ్చింది కాబట్టి ఆమెకు శ్రమ, అలసట తీరేలా పాదాలు ఒత్తడం, విసరడం మొదలైన ఉపచారాలు చెయ్యాలి. ఈ పనులు పరిచారికల చేత చేయించవచ్చు. నాగరకుడైన వాడు రాత్రింబగళ్ళు నడచుకోవలసిన విధులు ఇవి.

26. *ఘటా నిబంధనం, గోష్ఠీసమ వాయః, సమా పానకం,*
*ఉద్యాన గమనం, సమస్యాః క్రీడాశ్చ ప్రవర్తయేత్.*

పైన చెప్పినవన్నీ నిత్య క్రియలు. అంటే ప్రతిరోజూ చేయవలసిన పనులు. ఇక నైమిత్తిక క్రియలున్నాయి. అంటే ఏదో కారణంవల్ల అప్పుడప్పుడు చేసే పనులు. సభలూ, గోష్ఠులూ మొదలైనవి. దేవుడి ఉత్సవాలు జరిగేటప్పుడు నాగరకులంతా అక్కడ చేరతారు. వాటికి ఘటాలని పేరు. ఒక నియమ పద్ధతిలో నడుస్తూ వుంటాయి ఆ ఉత్సవాలు. నాగరకులంతా కలిసి సభలూ, గోష్ఠులూ ఏర్పాటు చేస్తారు. కళ, సాహిత్యాలను గురించి ఆ సభల్లో, గోష్ఠుల్లో చర్చలు జరుపుతారు. అలాగే, భార్యతోనూ, స్నేహితులతోనూ కలిసి మధువు పున్నగు

పానీయాలు సేవించడం వారితో కలిసి ఉద్యానవనాల్లో విహరించడం (ఇప్పటి పిక్నిక్కుల్లా), నాగరకులంతా ఒకచోట చేరి ప్రసంగాలు చేయడం, ఆట పాటలతో వినోదించడం, - ఇవన్నీ నైమిత్తిక క్రియలు, నాగరకుడైన గృహస్థు ఇవన్నీ విధిగా చేయాలి. (వీటివల్ల సామాజిక సంబంధాలు పెంపొందవచ్చు.)

*27. పక్షస్య మాసస్య వా ప్రజ్ఞా తేహని సరస్వత్యాభువనేని యుక్తానాం నిత్యం సమాజః*

పైన చెప్పిన నైమిత్తిక కర్మలో మొదటిదైన ఘటా నిబంధనం అంటే ఏమిటో చెపుతున్నాడు శాస్త్రకారుడు. పూర్ణిమ, అమావాస్యలలోనూ, ఇతర పర్వదినాల్లోనూ సరస్వతీదేవి ఆలయంలో నాగరకులంతా చేరతారు. వారి వారికై ఏర్పాటుచేసిన పనులు నిర్వహించడానికి సంసిద్ధులవుతారు. దీనికే ఘటం అని పేరు. ఆ రోజుల్లోనే కాదు. ఈనాడు కూడా ఉత్సవాల సందర్భంగా కవులు, గాయకులు, నర్తకులు మొదలైనవారు ఆలయాలకు వచ్చి దేవుడికి చేసే వివిధ ఉపచారాలలో, కార్యక్రమాలలో పాల్గొనడం మనం చూస్తున్నాం. దేవుళ్ళకు ప్రత్యేకంగా మాన్యాలుంటాయి. ఆ మాన్యాలపై వచ్చే పంట, ఆదాయం అనుభవించే వివిధ వృత్తులవారు ఈ పనులు చేస్తూ వుంటారు.

*28. కుశీలవాశ్చాగంతుకాః, ప్రేక్షణక మేషాం దద్యుః*

ఉత్సవాల్లోనూ, పర్వదినాల్లోనూ కాకుండా వారి వారి విద్యా కౌశలాన్ని ప్రదర్శించడానికై దేశాటనం చేస్తూ వుంటారు, కొందరు నటులు, నర్తకులు, గాయకులు. అలాంటి కళాకారులు వచ్చినప్పుడు మామూలు రోజుల్లో కూడా ప్రదర్శనలకు అవసరమైన ఏర్పాట్లు చెయ్యాలి.

*29. ద్వితీయే హని తేభ్యః, పూజానియతం లభేరన్*

ప్రదర్శన జరిగిన మరునాడే ఆ కళాకారులకు తగు పారితోషికం ఇచ్చి సత్కరించాలి. గంధ పుష్ప తాంబూల వస్త్రాదులతో కూడిన ఈ సన్మానం ప్రేక్షకుల సమక్షంలోనే జరగవలసి వుంటుంది.

*30. తతో యథా శ్రద్ధ మేషాం, దర్శన ముత్సర్గోవా.*

పౌరులు మళ్ళీ మళ్ళీ ఆ ప్రదర్శనలు చూడాలని కుతూహల పడేటట్లయితే, మరల వాటిని ప్రదర్శింప జేయవచ్చు. లేకపోతే, మంచి మాటలతో కళాకారులను పంపివెయ్యాలి.

*31. వ్యసనోత్సవేషు చైషాం, పరస్పర స్యైక కార్యతా.*

ఇలా దేశాటనంచేస్తూ వచ్చిన కళాకారులకు ప్రదర్శనలు ఇచ్చే రోజుల్లో ఏదైనా జబ్బు చేసికాని, లేదా ఏదైనా ఆపద సంభవించికానీ, వివాహంలాంటి శుభకార్యాల నిమిత్తం కానీ వారి ఇళ్ళకు వెళ్ళిపోవలసి వస్తే, అప్పుడు స్థానికంగా వుండే కళాకారుల చేత ఆ ప్రదర్శనలు జరిపించాలి. అంతేకాని ప్రదర్శనలు నిలిపివేయకూడదు.

*32. ఆగంతూనాం చ కృత, సమవాయానాం,*
*పూజన మభ్యుపపత్తిశ్చేతి గణ ధర్మః*

ప్రదర్శనలు ఇచ్చే కళాకారులకే కాదు. ప్రేక్షకులలో నాగరకులు, పెద్దలు అయినవారిని సయితం గంధ పుష్ప తాంబూలాదులతో సత్కరించాలి. దీన్ని గణధర్మం అంటారు. వారే కాకుండా ఊళ్ళో ప్రముఖులైన నాగరకులను కూడా పేరు పేరున ప్రేక్షకులకు పరిచయం చేయాలి.

*33. వేశ్యాభవనే సభాయామన్య, తమస్యోదవసితే వా సమాన*
*విద్యాబుద్ధి శీల విత్త, వయసాం సహ వేశ్యాభి*
*రనురూపైరాలాపై రాసన బంధో గోష్ఠీ.*

విద్యా బుద్ధుల్లోనూ, స్వభావాదుల్లోనూ, సంపదల్లోనూ, వయస్సులోనూ, సమానులైన నాగరకులు ఏదైనా ఒక వేశ్య ఇంట్లోకానీ, సభా మండపంలోకానీ, లేక మరే నాగరకుని గృహంలోకానీ వేశ్యలతో కలిసి పరస్పరం పొగడుకుంటూ, ప్రేమానురాగాలలో ఒకరినొకరు ఓరగంట చూసుకుంటూ, పరాచకాలాడుకుంటూ వినోదించడాన్ని గోష్ఠీ సమవాయం అంటారు.

*34. తత్ర చైషాం కావ్య సమస్యాః, కళా సమస్యాశ్చ.*

ఈ గోష్ఠులు సాగించాల్సిన విధం ఇది - కావ్యాలకు సంబంధించిన సమస్యలు, అంటే కవిత్వంలో సమస్యాపూరణం లాంటివి. సాహిత్యం, సంగీతం, నాట్యం మొదలైన కళలకు సంబంధించిన చర్చలతో ఈ గోష్ఠులు సాగాలి.

*35. తస్యాముజ్జ్వలాః లోక కాంతాః పూజ్యాః, ప్రీతి సమానాశ్చ ఆహారితాః*

ఈ గోష్ఠులు అయినా తరువాత ఒకరినొకరు ప్రేమతో పలకరించుకుని, స్నేహ భావంతో కళలకు సంబంధించిన సరస్వతీదేవి, నటరాజు మున్నగు దేవతలను పూజించాలి. ఈ సందర్భంలో వివిధ కళల్లో ఆరితేరిన విదుషీమణులను, వేశ్యాంగనలనూ, నాగరకులనూ తగు విధంగా సత్కరించాలి. రకరకాల కానుకలు సమర్పించి వారిని గౌరవించాలి.

*36. పరస్పర భవనేషు చాపానకాని*

సమాజంలోని నాగరకులు ఒకరినొకరు కలుసుకోడానికీ, పరిచయాలు పెంపొందించుకోడానికీ స్త్రీ, పురుషుల మధ్య ప్రేమానురాగాలు వృద్ధి పొందడానికీ ఈ సమావేశాలు, గోష్ఠులు ఎంతో ఉపకరిస్తాయి.

(అతి ప్రాచీన కాలంలోనే ఇలాంటి సమావేశాలు జరిగేవని వాత్స్యాయనుడు చెప్పడం వల్ల ఒక విషయం స్పష్టమవుతున్నది. ఇప్పుడు కొందరు అనుకుంటున్నట్లుగా సమాజంలో సంకుచితమైన కట్టుబాట్లు లేవు. స్త్రీలకు తగినంత స్వేచ్ఛ వుంది. అన్ని విద్యల్లో మహిళలు ముందంజ వేశారు. ఈనాడు క్లబ్బుల్లో, ఇతరత్రా జరిగే సమావేశాలను ఆక్షేపించ వలసిన పనిలేదు.)

ఇలాంటి సభలకు, సమావేశాలకు హాజరయ్యే స్త్రీ, పురుషులు కనీసం నెలకొకసారి కాని, పదిహేను రోజుల కొకమాటు కాని, వంతుల ప్రకారం ఒక్కొక్కరి ఇంట్లో పానగోష్ఠులు కూడా ఏర్పాటు చేసుకునేవారు.

37. *తత్ర మధు మైరేయాసవాన్, వివిధ లవణ ఫలహరిత శాకతిక్త కటుకామ్లోపదంశాన్ వేశ్యాః, పాయయేయురనుపిబేయుశ్చ.*

ఈ పానగోష్ఠుల్లో మధువు, మైరేయం (ఇదొక రకమైన కమ్మని కల్లు. చెరకురసం నుంచి తయారుచేసిన మద్యం), ఇంకా ఇతర ఆసవాలు, వేశ్యలతోపాటు స్త్రీ పురుషులు సేవిస్తారు. పులుపు, వగరు, తీపి మొదలైన రుచులతో ఉప్పు, ఊరగాయలు, పండ్లు మున్నగు పదార్థాలు భుజిస్తూ, ఈ మద్యపానం చేస్తూ ఆనందిస్తారు.

(మదిరాపానం తేజస్సునూ, ఉత్సాహాన్ని, ఉల్లాసాన్ని, కామోద్రేకాన్ని కలిగిస్తుంది కాబట్టి, మధు సేవనం ఆరోగ్యప్రదమేకాని, దోషం కాదు. అయితే, ఈ పానం ఒక ప్రమాణంలో మితంగా వున్నప్పుడే సత్ఫలితం ఇస్తూ, ఆనందదాయకం అవుతుంది.)

38. *ఏతేనోద్యాన గమనం, వ్యాఖ్యాతమ్.*

ఈ పాన గోష్ఠులు గృహాల్లోనే కాక, వన విహారాలకు వెళ్ళి, ఉద్యానవనాల్లో కూడా జరిపేవారు.

(ఈనాడు యువతీ యువకులు, విద్యార్థులు, విద్యార్థినులు గుంపులు, గుంపులుగా పిక్‌నిక్‌లకూ, వినోద యాత్రలకూ వెళ్ళి రకరకాల వినోద కార్యక్రమాలతో ఆనందిస్తూ ఉంటారు. ఆ రోజుల్లో కూడా ఇవి మరో రూపంలో వుండేవి. వీటిని ముద్దుగా 'వనవిహారం' అనేవారు.)

39. *పూర్వాహ్ణ ఏవ స్వలంకృతాస్తురగాధిరూఢాః,*
*వేశ్యాభిస్సహ పరిచారకామగతా గచ్ఛేయు*
*ర్దైవసికీం చ యాత్రాం తత్రైవాను భూయ కుక్కుట లావక*
*మేషయద్యూతైః, ప్రేక్షాభి రనుకూలైశ్చ*
*చేష్టితైః, కాలం గమయిత్వా, అపరాహ్ణే గృహీత*
*తదుద్యానోపభోగ చిహ్నాస్తథైవ ప్రత్యావ్రజేయుః.*

మధ్యాహ్నం కాకముందే విహారానికి తగిన వేషం ధరించి, వేశ్యలను, పరిచారికలనూ వెంట పెట్టుకొని గుర్రాలపై వనవిహారానికి వెళ్ళాలి. కనీసం పక్షానికొకసారో, మాసానికి ఒకసారో విధిగా ఈ వనవిహారం జరుపుతూ వుండాలి.

40. *ఏతేనరచితో ద్గ్రాహోదకానాం గ్రీష్మే జలక్రీడాభిగమనం వ్యాఖ్యాతం.*

గ్రీష్మ ఋతువులో తాపంగా వుంటుంది. అందుచేత ఉద్యాన వన విహారం చేసేటప్పుడు ఆ తాపం ఉపశమించడానికి కొలనులోగాని, సరోవరంలోగాని, లేదా దిగుడు బావిలోగాని స్త్రీ పురుషులు జలక్రీడలాడాలి.

## కామోద్దీపనకై వినోద క్రీడలు

41. *యక్షరాత్రిః, కౌముదీ జాగరః, సువసంతకః, సహకారభంజికా, అభ్యూషఖాదికా, బిసఖాదికా, నవ పత్రికా, ఉదక క్ష్వేడికా, పాంచాలానుయానం, ఏకశాల్మలీ, యవచతుర్థీ, ఆలోల చతుర్థీ*

మదనోత్సవః, దమన భంజికా, హోలాకా, అశోకోత్తంసికా,
పుష్పావచాయికా చూతలతికా, ఇక్షుభంజికా, కదంబయుద్ధాని,
తాస్తాశ్చ మహిమాన్యాః దేశ్యాశ్చ క్రీడాజనే భ్యో
విశిష్ట మాచరే యురితి సంభూయక్రీడాః.

మనస్సు ఉల్లాసంగా వున్నప్పుడే ఏ పని చేయడానికైన మనకు ఉత్సాహం కలుగుతుంది. ప్రతి మనిషి ఎల్లప్పుడూ ఇలాంటి ఉల్లాస, ఉత్సాహాలతో వుండడానికే ఆ రోజుల్లో నాగరకులైన జనులందరూ ఏదో ఒక రకమైన వినోద క్రీడల్లో మునిగి తేలుతూ వుండేవారు. ఇవన్నీ స్త్రీ పురుషుల్లో కామోద్దీపనం కలగడానికి ఎంతో దోహదం చేస్తాయి. ఆ వినోద క్రీడలను గురించి ఇక్కడ వివరిస్తున్నాడు శాస్త్రకారుడు.

1. యక్షరాత్రి - దీన్ని సుఖరాత్రి అని కూడా అంటారు రాత్రిళ్ళు జూదం మొదలైన ఆటలాడుతూ సుఖంగా కాలక్షేపం చేయడం.

2. కౌముదీ జాగరణం - శరత్కాలం వెన్నెల పుచ్చపువ్వులా, పిండి ఆరబోసినట్లుగా వుండి ఎంతో ఆహ్లాదం కలిగిస్తూ వుంటుంది. అలాంటి రాత్రుళ్ళలో నాగరకులైన స్త్రీ పురుషులు ఒకచోట చేరి, పాటలు పాడుకుంటూ, నాట్యాలు చేస్తూ ఆనందిస్తారు. దేవతలకు పూజలు చేస్తారు కూడా.

3. సువసంతకం - అంటే మన్మథోత్సవం. కామకళకు అధిదేవత అయిన మన్మథుణ్ణి పూజించడం. ఆ దేవుడి సన్నిధిలో సంగీత సభలు, నృత్యం మున్నగున్నవి ఏర్పాటు చేయడం.

4. సహకార భంజికా - నాట్యం చేస్తూ వనంలో ఉన్న తియ్య మామిడి చెట్లనుండి పండ్లు అందుకొని, కోయడం. ఇదొక వినోదం.

5. అభ్యూష఼ఖాదికా - పచ్చి శనగ కాయలు కాల్చి అంటే తంపెట పెట్టి తినడం ఇది ఒక సరదా.

6. బిసఖాదికా - కొలనుల్లో, సరస్సుల్లో తామరలుంటాయి. లేత తామర తూండ్లను పువ్వులతో సహ కోసి, ఆ పూలు ధరించడం, తూళ్ళు భుజించడం మొలలోతు నీళ్ళలో దిగి ఈ పని చేస్తుంటే ఒక ఆటలా ఎంతో సరదాగా వుంటుంది.

7. నవ పత్రికా - తొలకరి వానలు కురిసినప్పుడు చెట్లన్నీ చిగురిస్తాయి. ఆ చెట్ల నీడల్లో హాయిగా ఆటలాడుకోడం.

8. ఉదక క్ష్వేడికా - స్త్రీ పురుషులు ఒకరిపై ఒకరు పిచికార్లతో నీళ్ళు చిమ్ముకోడం.

9. పాంచాలానుయానం - నలుగురైదుగురు స్త్రీ పురుషుల్లు కలిసి, ఆటలాడుకుంటూ కబుర్లు చెప్పుకోడం.

10. ఏక శాల్మలీ - బూరుగుచెట్టు పూత పూస్తే ఎంతో అందంగా వుంటుంది. అలాంటి బూరుగుచెట్టు క్రింద కూచుని, దాని పూలు అలంకరించుకుని, ఆటలాడుకోడం.

11. యవ చతుర్థి - వైశాఖ శుద్ధ చవితిని యవ చతుర్థి అంటారు. ఆనాడు యవ ధ్యానం పిండితో పరిమళ ద్రవ్యాలు కలపి, స్త్రీ పురుషులు ఒకరిపై ఒకరు విలాసంగా చల్లుకుంటూ ఆనందించడం.

12. ఆలోల చతుర్థి - శ్రావణ శుద్ధ చవితిని ఆలోల చతుర్థి అంటారు. ఆ రోజు చెట్లకు ఉయ్యాలలు వ్రేలాడదీసి, ఉయ్యాలలూగుతూ ఆడుకోడం.

13. మదనోత్సవం - ఇది కూడా మన్మథుణ్ణి పూజించడానికై ఉద్దేశించిన ఉత్సవం. మన్మథుడి విగ్రహం పెట్టి పూజా చేయాలి.

14. దమన భంజికా - దమనం సువాసనగల ఒక మొక్క. ఈ దమన దళాలను కోసి, స్త్రీ పురుషులు ఒకరికొకరు అలంకరించుకోడం.

15. హోలాకా - ఫాల్గుణ పూర్ణిమ రోజు వచ్చే పండుగ ఇది. ఆ రోజు స్త్రీ పురుషులు ఒకరిపై ఒకరు వసంతం చల్లుకుంటూ ఆనందిస్తారు.

16. అశోకోత్తంసికా - అంటే అశోక పత్రాలు కోసి శిరస్సుపై ధరించడం. ఇలా చేయడం శుభప్రదం అని చెపుతారు.

17. పుష్పావచాయికా - అంటే పూలు కోయడం. స్త్రీ పురుషులు ఏకమై పూలు కోయాలన్నమాట.

18. చూత లలికాచూత పల్లవా వతంసనం - చూత పల్లవాలంటే మామిడి చిగుళ్ళు. వాటిని కోసి తలపై ధరించడం ఇది ఒక శుభకర్మ.

19. ఇక్షు భంజికా - చెరకుగడలను చిన్న చిన్న ముక్కలుగా కోసి, వాటిని దండలుగా గుచ్చి మెడలో ధరించడం.

20. కదంబ యుద్ధాలు - **కడిమి కొమ్మలు** కత్తుల్లా చేతుల్లో ధరించి ఒకరితో ఒకరు యుద్ధం చేయడం.

ఇవే కాకుండా ఇంకా ఆయా ప్రాంతాల్లో జనసామాన్యం అనుసరించే దేశీయ క్రీడలున్నాయి. నాగరకులు ఇవన్నీ తాము అనుసరిస్తూ, జన సామాన్యం వాటిని అనుసరించేలా చేస్తూ వుండాలి. ఈ వినోద క్రీడలన్నీ ఒకరిద్దరివల్ల అయ్యేవి కావు. జనసంఘం వుండాలి. కాబట్టి ఇవి సామాజిక క్రీడలు.

*42. ఏక చారిణశ్చ విభవ సామర్థ్య ద్గణికాయాః నాయికాయాశ్చ*
*సఖీభిర్నాగర కైశ్చ సహచరిత మేతే న వ్యాఖ్యాతం.*

ఒకవేళ తాను ఒంటరివాడై, ఈ క్రీడలు సాగించడానికి నాగరకులు దొరక్కపోతే, తన తాహతుకు తగినట్లు పరిచారికలు మున్నగువారితో నైన ఈ ఆట - పాటలు, ఉత్సవాలు జరుపుకోవచ్చు.

*43. అవిభవస్తు శరీరమాత్రో, మల్లికాఫేన కషాయమాత్ర*
*పరిచ్ఛదః, పూజ్యాద్దేశాదాగతః కళాసు విచక్షణః తదుపదేశేన*
*గోష్ఠ్యాం, వేశోచితేచవృత్తే, సాధయేదాత్మాన మితి పీఠ మర్దః*

పైన చెప్పినవన్నీ బాగా ధనం వున్నవాళ్ళు చేసే పనులు. మరి, ధనహీనుడై దరిద్రం అనుభవించే వాడికి ఇవన్నీ ఎలా సాగుతాయి? అంటే, కామం మీద

మనసుండాలేకాని మార్గం లేకపోలేదు. కామ శాస్త్రజ్ఞులతోను, కళావేత్తలతోనూ కలిసి మెలిసి తిరిగి, కామశాస్త్ర విషయాలు బాగా ఆకళింపు చేసుకుని, తనే ప్రజలకు ఆ విషయాలన్నీ బోధిస్తూ, వారిచేత ఈ సభలూ, గోష్ఠులూ, వినోద క్రీడలూ జరిపిస్తూ అందరూ నాగరక వృత్తాన్ని అనుసరించేలా చేయవచ్చు. ఆ విధంగా అతనికి ఆత్మ తృప్తి కలుగుతుంది. అలాంటి కామశాస్త్ర ఆచార్య పదవికి మల్లికాదండ పీఠం అని పేరు. ఆ పీఠం ఎక్కినవాణ్ణి పీఠమర్దుడని అంటారు.

*44. భుక్తవిభవస్తు గుణవాన్, సకళత్రో వేశే, గోష్ఠ్యాం చ,*
*బహుమతః, తదుపజీవీ చ విటః*

కొందరు యౌవనంలోనే ఈ నాగరక వృత్తాన్ని అవలంబించి, ముందు - వెనుక చూడకుండా వేశ్యలకోసం, కామకేళీ విలాసాల కోసం ఉన్న ధనమంతా వెచ్చించి దరిద్రులవుతారు. అయినా వారికి కామవాంఛలు తీరవు. అలాంటివారు భార్యా సమేతంగా దేశాలు తిరుగుతూ వేశ్యా జనం మధ్య సభల్లో, గోష్ఠుల్లో పాల్గొంటూ వారివల్ల బహుమతులు, గౌరవ సత్కారాలు పొందుతూ పొట్ట పోసుకుంటారు. అలాంటి వారినే విటులని అంటారు.

*45. ఏక దేశ విద్యస్తు క్రీడనకో, విశ్వాస్యశ్చ విదూషకః, వైహాసికో వా*

పుట్టుకతోనే దరిద్రుడైనా లేక కామక్రీడలవల్ల ధనం పోగొట్టుకుని దరిద్రుడైనా, భార్యా బిడ్డలున్నా లేకున్నా, అక్కడివాడైనా లేక పరదేశీయుడైనా, సంగీతం, నాట్యం మొదలైన విద్యలు నేర్చినవాడై, చమత్కారాలు తెలిసినవాడై, నమ్మకస్థుడై వుంటే, అతను సంపన్నులూ, కాముకులూ అయిన స్త్రీ పురుషులను ఆశ్రయించి బ్రతకవచ్చు. అలాంటివాణ్ణి విదూషకుడనీ, వైహాసికుడనీ అంటారు. అందరినీ కవ్విస్తూ, నవ్విస్తూ వుండడమే అతని పని.

*46. ఏతే వేశ్యానాం నాగర కాణాం చ, మంత్రిణస్సంధి విగ్రహనియుక్తాః*

పైన చెప్పిన విట, విదూషక పీఠ మర్దాదులు వేశ్యలకూ, కామకేళీ విలాసాల్లో మునిగి తేలుతూ వుండే స్త్రీ పురుషులకూ మంత్రులుగా వుండి దేశ కాలాదులకు తగినట్లుగా వారికి తగు ఉపాయాలు బోధిస్తూ ఉంటారు. విడిపోయిన స్త్రీ పురుషులను కలపడంలోనూ, కలసి వున్నవారి మధ్య భేదం సృష్టించి విడదీయడంలోనూ వీరు సహాయపడుతూ వుంటారు, నిజానికి స్త్రీ పురుషుల ప్రేమ కలాపాలకు వీరే సాధనం వంటివారు.

*47. తైర్భిక్షుక్యః కలావిదగ్ధాః, ముండా వృషల్యో వృద్ధ గణికాశ్చ, వ్యాఖ్యాతాః*

పైన పేర్కొన్న ఉపనాయకులతో సరి సమానులనదగిన స్త్రీ భిక్షుకులూ, సన్యాసినులూ, దాసీలూ, వృద్ధ వేశ్యాంగనలూ - వీరందరినీ కూడా ప్రేమికుల మధ్య సంధానం నడపడానికీ, విభేదాలు సృష్టించడానికీ నియోగించవచ్చు. వీరిని 'కుట్టినీ' అని అంటారు.

48. గ్రామ వాసీ చ, సజాతాన్, విచక్షణాన్, కౌతూహలికాన్
ప్రోత్సాహ్య, నాగరక జనస్య, వృత్తం వర్ణయన్, శ్రద్ధాం చ
జనయన్, తదేవానుకుర్వీత, గోష్ఠీశ్చ ప్రవర్తయేత్, సంగత్యా
జనమనురంజయేత్, కర్మ సు చ, సాహాయ్యేన చాను
గృహ్ణీయాద్, ఉపకారయేచ్చేతి నాగరక వృత్తమ్,

నగరాల్లో వుండేవారు నాగరక వృత్తం అనుసరించడానికి అన్ని విధాల వీలుంటుంది. మరి గ్రామాల్లో నివసించేవారు ఎలాగ? అంటే ఆ విషయమే ఇక్కడ చెపుతున్నాడు శాస్త్రకారుడు.

తన జాతికి చెందినవాళ్ళుగా ఉండి, విద్యావంతులు, మంచి చెడ్డలు విమర్శించి తెలుసుకోగలవారు అయి, కుతూహలపడే యువకులను ఈ నాగరక వృత్తం అనుసరించడానికి ప్రోత్సహించాలి. అది ఎలాగా అంటే -

'ఫలానా నగరంలో ఫలానా వారు, ఇలాంటి జనరంజకమైన గోష్ఠులూ, సభలూ, జరుపుతూ నాగరక వృత్తాన్ని అనుసరిస్తున్నారు. అలా మీరు కూడా ఎందుకు జరుపుకోకూడదు?' — అని నచ్చచెప్పి ఆ పనిలో వారికి ఆసక్తి కలిగించాలి. వారిచేత వినోద యాత్రలు మున్నగునవి చేయించాలి. ఆ విధంగా వారికి నాగరక వృత్తంలో శ్రద్ధాసక్తులు పుట్టించి, వారికి అన్ని రకాల సహాయపడుతూ వుండాలి

49. భవంతి చాత్రశ్లోకాః - నాత్యంతం, సంస్కృతేనైవ, నాత్యంతం
దేశ భాషయా, కథాం గోష్ఠీషు కథయన్, లోకే బహుమతో భవేత్.

కేవలం సంస్కృత భాషనే పట్టుకుని వ్రేలాడే శుద్ధ ఛాందసులు వుంటారు. కేవలం దేశ భాషలనే ఉపయోగించే జనులూ వుంటారు. ఈ రెండు వర్గాలూ కాకుండా అటు సంస్కృతం, ఇటు దేశ భాషలూ - రెండూ తెలిసి, నేర్పు, చమత్కారం వున్న నాగరకుడు లోకంలో ఎక్కువ గౌరవ మర్యాదలు పొందగలుగుతాడు.

50. యా గోష్ఠీ లోకవిద్విష్టా, యా చ స్వైర విసర్పిణీ,
పర హింసాత్మికా యా చ, న తామవతరేద్బుధః

బుద్ధిమంతుడైనవాడు, గోష్ఠులు నడపగల శక్తి తనకు లేకపోతే, ఇతరులు నడిపే గోష్ఠుల్లో చేరాలి. అంతే గాని చేతులు ముడుచుకుని కూచోకూడదు. అయితే, తాను చేరదలుచుకున్న గోష్ఠి, సభ ప్రజలు ద్వేషించేదిగా వున్నా, అడ్డూ - ఆపూ లేకుండా స్వేచ్ఛగా ప్రవర్తించే స్త్రీలతో కూడివున్నా అలాంటి గోష్ఠిని, సభను పరిత్యజించాలి. అందులో చేరకూడదు.

51. లోకచిత్తాను వర్తిన్యా, క్రీడా మాత్రైక కార్యయా
గోష్ఠ్యా సహచరన్ విద్వాన్, లోకే సిద్ధిం నియచ్ఛతి.
ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే సాధారణే
ప్రథమేఽధికరణే నాగరకవృత్తంనామ చతుర్థోధ్యాయః

అయితే ఇక్కడ ఒక విషయం వుంది బుద్ధిమంతుడు ఎలాంటి గోష్టిలో చేరాలన్న ప్రశ్న - ఏ గోష్టి ప్రజల మనస్సులకు ఆహ్లాదం కలిగిస్తూ, వినోదమే ప్రధాన ఫలసిద్ధిగా వుంటున్నదో ఆ గోష్టిలో చేరాలని సమాధానం చెపుతున్నాడు శాస్త్రకారుడు. అలాంటి గోష్టిలో చేరి నాగరక వృత్తం అనుసరించే బుద్ధిమంతుడు, విద్యావంతుడు. స్త్రీల హృదయాలను చూరగొని, వారి ప్రేమానురాగాలకు పాత్రుడు కావడంలో సిద్ధహస్తుడవుతాడు.

**ఇది వాత్స్యాయన ముని విరచిత కామసూత్రాల్లో సాధారణమనే ప్రథమాధికరణంలోని నాగరకవృత్తం అనే నాలుగో అధ్యాయం.**



# పంచమాధ్యాయం
# నాయక సహాయ దూతీకర్మ విమర్శ



నాయకుడు తన సహాయకులతో కలిసివుండి, నాయిక దగ్గరికి దూతికను పంపాలని ఇంతకు ముందు చెప్పడం జరిగింది అయితే నాయకుడంటే ఎవరు? ఎలాంటి నాయికతో అతను గృహస్థ ధర్మంలో వుండి నాగరిక వృత్తాన్ని అనుసరిస్తూ వుండాలి? అలాగే సహాయకులంటే ఎవరు? వాళ్ళు ఎలాంటి వాళ్ళై వుండాలి? వాళ్ళు చేసే పనులేమిటి? ఈ ప్రశ్నలకు శాస్త్రకారుడు ఇక్కడ సమాధానాలు చెపుతూ వున్నాడు.

1. కామశ్చ తుర్షు వర్ణేషు సవర్ణతః శాస్త్రతశ్చా నన్య పూర్వాయాం
*ప్రయుజ్యమానః, పుత్రీయో, యశస్యో లౌకికశ్చ భవతి.*

నాయక సహాయకులను గురించి, దూతికలు - వారు చేసే పనులను గురించి చెప్పేది కాబట్టి ఈ అధ్యాయానికి నాయక సహాయ దూతీకర్మ విమర్శాధ్యాయం అని పేరు పెట్టారు. ఇక్కడ దూతీకర్మ అంటే, స్త్రీ దూతికే కాకుండా పురుషదూత అని కూడా అర్థం చేసుకోవాలి.

పశుపక్ష్య మృగాదులూ, వృక్షలూ, పూలూ, పండ్లూ - అన్నిట్లోనూ జాతులున్నాయి. అలాగే స్త్రీ పురుషులలోను జాతి భేదాలున్నాయి. స్త్రీలు నాలుగు

రకాలు పురుషులూ నాలుగు రకాలు. కలయిక అనేది సజాతీయంగా వుండాలి. కానీ అది విజాతీయం కాకూడదు. విజాతీయం ఎప్పుడైనా వికటిస్తుంది. అందుచేత నాలుగురకాల పురుషులూ, తమతమ జాతులకు చెందిన స్త్రీలనే శాస్త్రోక్తంగా పెండ్లాడి భార్య అని పిలువబడే ఆ స్త్రీతో కామసుఖం అనుభవించడం శ్రేష్టం. కీర్తి వంశాభి వృద్ధీ తెచ్చిపెట్టేది కూడా అదే. లోక సమ్మతం అయిందీ అదే.

2. *తద్విపరీత ఉత్తమ వర్ణాను; పరవరి, గృహీతా నుచ ప్రతిషిద్ధః*

అలా కాకుండా తల క్రిందులుగా ఉత్తమ వర్గానికి చెందిన స్త్రీలు అధమ వర్గానికి చెందిన పురుషులను పెళ్ళాడరాదని నిషేధం విధించారు.

3. *అవరవర్ణాస్వ నిరవసితాను వేశ్యాను, పు నర్భ్యూషు చ,*
*న శిష్టో న ప్రతిషిద్ధః, సుఖార్థత్వాత్.*

కులం నుంచి వెలివేయబడినది, తన కులంకన్నా తక్కువ కులంలో పుట్టిందీ, వేశ్య, పునర్భూవు - ఈ మూడు రకాల స్త్రీలతోనూ కామసుఖాలు అనుభవించటం శిష్టసమ్మతం కాదు. ఈ కామం కేవలం శరీర సుఖం కోసమే అని గ్రహించాలి.

4. *తత్ర నాయికాస్త్రిస్రః కన్యా, పునర్భూః, వేశ్యా చ*

అందువల్ల, ఆ విధంగా స్త్రీలను మూడు రకాలుగా విభజించారు.

1. కన్య — అంటే యుక్త వయస్సు వచ్చి కూడా పెళ్ళికాని పడుచుపిల్ల.
2. పునర్భూవు — అంటే మారు మనువు కట్టుకున్న మహిళ.
3. వేశ్య — పడుపు వృత్తితో జీవించే స్త్రీ.

ఇలా స్త్రీలు మూడు రకాలుగా వున్నారు. కాగా, కన్యలను రెండు రకాలుగా విభజించారు కూడా. 1. పుత్ర ఫలప్రదలు, 2. సుఖఫలప్రదలు. కొందరు కన్యలు సంతానప్రాప్తి ఇస్తారు. మరికొందరు కేవలం సుఖానికే తప్ప, పుత్రఫలప్రదలు కాలేరు - పొలాల్లో పంట పొలాలు, బీడు భూములూ వున్నట్లుగా. బీడు భూముల్లో గడ్డి మొలుస్తుంది అలాగే పంట పండదు. కాబట్టి పుత్రఫలప్రద అయిన కన్య శ్రేష్ఠం. ఆమె తన కులానికే చెందినదైతే ఇంకా ఉత్తమం. ఇక కేవలం సుఖం మాత్రమే ఇచ్చే కన్యల్లో ఇతర కులానిదైతే అధమం. ఆ అధమత్వానికి తోడు పునర్భూవు కూడా అయితే ఇహ చెప్పక్కర్లేదు. అది అధమాధమం అన్నమాట. ఈ పునర్భూవు విషయం ముందు ముందు భార్యాధి కరణంలో ఇంకా వివరంగా వస్తుంది.

5. *అన్యకారణవశాత్పర పరి గృహీతాపి, పాక్షికీ చతుర్థీతి గోణికా పుత్రః*

ఇటు సంతానం కోసం, అటు సౌఖ్యం కోసం కాకుండా, ధనాశ మొదలైన ఇతర కారణాలవల్ల సంక్రమించే పరస్త్రీ నాలుగోరకం - ఇది గోణికా పుత్రుడు చెప్పిన మాట.

6. న యదా మన్యతే స్వైరిణీయ మన్యతోపి, బహుశో వ్యవసిత
చారిత్రా తస్యాం వేశ్యాయామివ గమన
ముత్తమ వర్ణిన్యామపి న ధర్మపీడాం కరిష్యతి.

ఒక పరపురుషుడి భార్య వుంటుంది. ఆమె అనేక మందితో సంభోగించాలని కోరుతూ వుంటుంది. అలాంటి స్త్రీని పొందవలెననుకుంటే, ఆమె తనకన్నా ఉత్తమ కులంలో పుట్టిందైనా వేశ్యతో సంగమించినట్లుగా ఆమెతో సంగమించడం దోషం కాదు.

7. పునర్భూరియం అన్య పూర్వావ, రుద్ధా నాత్ర శంకాస్తి

ఇక పునర్భువు విషయం. ఈ స్త్రీ ఇంతకు ముందే ఒకర్ని పెళ్ళాడి, మరొకర్ని మారు మనువు కట్టుకున్నది కాబట్టి ఈమెను పొందడం ధర్మ విరుద్ధం కాదు. ఈ విషయంలో సందేహం ఏమాత్రం అక్కర్లేదు.

8. పతిం వా మహాంత మశ్వర మన్మద, మిత్ర నంసృష్టమియ మవగృహ్య
ప్రభుత్వేన చరతి, సా మయా, నంసృష్టా స్నేహా దేనం వ్యావర్త యిష్యతి

ఈ పునర్భువుతో సంభోగించడానికి గల కారణాలు చెపుతున్నారిక్కడ. ఒక స్త్రీ, ఆమెకు ఒక భర్త. ఆ భర్తకు ఒక స్నేహితుడు, ఆ స్నేహితుడికి ఒక ప్రబల శత్రువూ వున్నారనుకోండి. అప్పుడా శత్రువు ఆమెను పొందడానికి ప్రయత్నిస్తూ వుంటాడు. ఎందుచేతనంటే, తన శత్రువుకు ఆమె భర్త మిత్రుడు కాబట్టి. అతను భాగ్యవంతుడు కూడా అయినందున ఆమె తన భర్త స్నేహితుడుతో సంగమిస్తున్నది. అతని ప్రోద్బలంతో ఆమే తమ భర్తచేత తనకు అపకారం చేయిస్తుందేమో? అందువల్ల నేను ఆమెతో ఇలాంటి సంబంధం పెట్టుకుంటే, నా మీద ప్రేమవల్ల, ఆమె భర్త మిత్రుడైన నా శత్రవును తన భర్తకు దూరం చేస్తుంది - ఇలాంటి ఆలోచనలతో పునర్భువు పొందు సాగుతుంది.

9. విరసం వా మయిశక్తం అపకర్తు, కామం చ ప్రకృతి మాపాద యిష్యతి

పునర్భువు సంగమానికి మరో కారణం కూడా ఉంది ఏదో కార్యంలో నిమగ్నమై వుండి ఇప్పుడు నాకు హాని చెయ్యలేదు కాని, వీలు దొరికినప్పుడు నాకు అపకారం చెయ్యకపోదు - అని అనుకుని తన శత్రువు భార్యను పొందుతాడు. అలా చేయడంవల్ల భర్తకు తనపై గల కోపాన్ని ఆమె చల్లారుస్తుంది - అనే భావంతో పునర్భువు సంగమం జరుగుతుంది.

10. తయా వా, మిత్రీకృతేన, మిత్ర కార్య, మమిత్ర ప్రతీఘాతం,
అన్యద్వా, దుష్ప్రతి పాదకం, కార్యం సాధయిష్యామి

అంతేకాదు. పునర్భువుతో క్రీడిస్తే, ఆమె తన భర్త ద్వారా మిత్రుడుగా వున్న నా పనులన్నీ సాధించి పెడుతుందన్న నమ్మకంతో కూడా ఈ పొందు సాగుతుంది.

*11. సంస్పృష్టో వా అనయాహత్వా అస్యాః పతిమస్మద్భావ్యం తదైశ్వర్య మేవ మధిగమిష్యామి*

మరొక కారణం కూడా వుంది. పురుషుడితో ఒకమాటు లైంగిక సంబంధం పెట్టుకున్న స్త్రీ సాధారణంగా అతనికి ఎప్పుడూ అనుకూలంగానే వుంటుంది. ఆ విధంగా పునర్భువు స్నేహాన్ని సంపాదించి, పురుషుడు ఆమె ద్వారా రహస్యాలు తెలుసుకుని, ఆమె భర్తను హతమారుస్తాడు. తరువాత అతని సంపదను తాను అనుభవించవచ్చు. ఇదొక రకమైన ఆలోచన. ఈమె భర్త మా కుటుంబానికి అన్యాయంచేసి ఆస్తి సంపాదించాడు. కాబట్టి ప్రతీకారంగా ఈ ఉపాయం పన్నడం అధర్మం కాదు - అనుకుంటాడు.

*12. నిరత్యయం వాస్యా గమన మర్థాను బద్ధం, అహం చ నిస్సారత్వాత్ క్షీణ వృత్త్యుపాయః, సోహమనేన ఉపాయేన తద్ధన మతి మహద కృచ్ఛ్రాదధిగమిష్యామి*

ఈ మారుమనువు కట్టుకున్న దాంతో సంభోగిస్తే, ఎలాంటి అపాయం లేకుండా అపారమైన భాగ్యం నాకు లభ్యమవుతుంది. ఇప్పుడు నేను ధన హీనుణ్ణయి, ఏదో నీచ వృత్తి చేసుకుంటూ బ్రతుకుతున్నాను. అలాంటి నాకు ఈ ఉపాయంవల్ల ప్రయాస లేకుండా భాగ్యం పడుతుంది. ఇలాంటి ఆలోచనతో కూడా పునర్భువుతో సంబంధం పెట్టుకోవచ్చు.

*13. మర్మజ్ఞా వా మయి దృఢమభి కామా సా మా మనిచ్ఛంతం దోష విఖ్యాపనేన దూషయిష్యతి*

ఈ పునర్భువు నా గుట్టులన్నీ తెలుసుకుని, నన్నే ఎంతగానో ప్రేమిస్తున్నది. అలాంటప్పుడు నేను ఈమెతో సంగమించడానికి ఇష్టపడకపోతే, తనుగానీ, ఇతరుల ద్వారా గానీ నా గుట్టంతా బట్టబయలుచేసి, నన్ను బజారుకు ఈడుస్తుంది. ఇలాంటి భయం వల్ల కూడా పునర్భువుతో పొత్తు పెట్టుకోడం జరుగుతుంది.

*14. అసద్భూతం వా దోషం శ్రద్ధేయం దుష్పరిహారం మయి క్షేప్స్యతి, యేనమే వినాశః స్యాత్.*

తన కోర్కె తీర్చలేదన్న కోపంతో ఆమె లోకం నమ్మేలాగా నాపై నిందలు మోపుతుంది. ఆ నిందలు పోగొట్టుకోడానికి వీలు లేనివి. దాంతో నేను అన్ని విధాలా నాశనమైపోతాను - ఇలాంటి భయంతో కూడా పునర్భువుతో పొందు తప్పనిసరి అవుతుంది.

*15. ఆయతి మంతం వా వశ్యం పతిం మత్తో విభిద్య ద్విషత స్సంగ్రాహయిష్యతి, స్వయం వా తైస్సహ సంసృజ్యేత*

ఈమె భర్త ఈమె చెప్పు చేతల్లో ఉంటాడు. అతను ముందు ముందు ఎంతో వృద్ధికి వచ్చేవాడు. అలాంటి భర్తను నానుండి చీలదీసి, నాశత్రువుల పక్షంలో చేరుస్తుంది లేదా తనకై తానే వెళ్ళి నా శత్రువులతో సంభోగిస్తుంది. ఆ తరువాత నన్ను కూడా తుదముట్టిస్తుంది - ఇలాంటి భీతివల్ల కూడా పునర్భువుతో రతిక్రీడలు సలిపి ఆమెను తృప్తి పరచవలసి వస్తుంది.

16. మదవరోధానాం వా దూషయితా పతి రస్యాః తదా
అహమప్యస్య దారానేవ దూషయన్ ప్రతి కరిష్యామి

ఈమె భర్త నాభార్యను, నా ఇంట్లోగల తక్కిన ఆడవాళ్ళను మోసం చేసి, వారికి కళంకం తెచ్చిపెట్టాడు. కాబట్టి దానికి బదులుగా అతని భార్యను మోహపెట్టి భ్రష్టురాలిగా చేస్తాను. పగ తీర్చుకుంటాను - ఇలాంటి ఉద్దేశ్యం కడుపులో పెట్టుకుని కూడా పునర్భువుతో సంగమించవచ్చు.

17. రాజ నియోగాచ్చాంతర్వర్తినమ్, శత్రుం వాస్యనిర్హానిష్యామి

రాజు నన్ను గూఢచారిగా నియమించాడు. అందువల్ల నా శత్రువుకు ఉంపుడుగత్తెగా ఉన్న ఈమెతో సంభోగించి, ఆవిధంగా ఈమె ద్వారా నా శత్రువు రహస్యాలు తెలుసుకుని, అతన్ని సంహరిస్తాను. ఇంతకంటే వేరే ఉపాయం లేదు - అని అనుకుని కూడా పునర్భువుతో సంబంధం పెట్టుకోవచ్చు.

18. యామన్యాం కామయిష్యే సాస్యా వశగాతామనేన, సంక్రమేణ అధిగమిష్యామి

నేను ప్రేమిస్తున్న స్త్రీ ఈమె అధీనంలో వుంది. కాబట్టి మొదట ఈమెను వల్లో వేసుకుని, రతిక్రీడతో సంతోషపెట్టి, పిమ్మట ఈమె ద్వారా నా ప్రియురాలిని పొందవచ్చు - అన్న ఊహతోనూ పునర్భువుతో జత పెట్టుకోవడం జరుగుతుంది.

19. కన్యామలభ్యాం వా ఆత్మాధీనాం అర్ధ రూపవతీం మయి సంక్రామయిష్యతి

నేను ధనం లేనివాణ్ణి కాబట్టి ఆ కన్య నాకు లభించదు. అందువల్ల మొదట ఈమెను లోబరచుకుంటే, ఆ తరువాత చక్కని చుక్క, ధనవంతురాలు అయిన ఆ కన్యను నాకు దక్కేలా చేస్తుంది ఈమె - ఇలాంటి ఆలోచనలతో కూడా పునర్భూగమనం సాగుతుంది.

20. మమామిత్రో వాస్యాః పత్యానహైకీ భావ ముపగతస్తమన యా రసేన
యోజయిష్యామీ త్యేవమాదిభిః, కారణైః పరస్త్రీయ మపి ప్రకుర్వీత

ఈమె భర్త, నా శత్రువూ ఏమాత్రం భేదం లేకుండా ఒకటిగా ఉంటున్నారు. కాబట్టి ఈమెతో కలిసి నేను ఈమె ద్వారా నా శత్రువుకు విషప్రయోగం చేయించి చంపుతాను - ఇలాంటి ఆలోచనతో కూడా పునర్భువుతో సంభోగించవచ్చు.

ఇలాంటి కారణాలు పెట్టుకొని కార్యం సాధించాలనుకోవడం దుష్టమైన పద్ధతి. సజ్జనులకు ఇది ఎంతమాత్రం యోగ్యమైంది కాదు. శాస్త్రం వీటిని సమర్ధించదు - అంటున్నాడు వాత్స్యాయనుడు. అయితే, ఇక్కడ ఉత్తమ, మధ్యమ, అధమ పద్ధతులు చెప్పాడు. ఒక్కొక్కప్పుడు ఉత్తములకు నీచులతో విరోధం ప్రాప్తిస్తుంది. దుష్టమైన ఈ లోకం తీరూ - తెన్నులూ అవగతం చేసుకుంటే, ఉత్తముడు తన స్థితికి భంగం కలుగకుండా తప్పించుకోగలడు. తన్నుతాను రక్షించుకోడం అవసరం కాబట్టి ఉత్తములు సయితం ఈ విషయం తెలుసుకుని ఉండాలి.

21. ఇతి సాహసిక్యం న కేవలం రాగా దేవేతి, పర పరిగ్రహ గమన కారణాని.

ఈ మారు మనువు కట్టుకున్న స్త్రీతో పొందు అనేది ప్రేమతో కూడింది కానే కాదు. స్వప్రయోజనం పొందడానికి సంబంధించిన అనేక కారణాలవల్ల జరుగుతూ

వుంది. ఇలాంటి కారణంచేత స్వప్రయోజనాలు సాధించుకోవాలంటే, ఎంతో సాహసం కావాలి. అది లేనివారు ఈ పనులు చేయలేరు.

*22. ఏతై రేవ కారణైః మహామాత్ర సంబద్ధా రాజసంబద్ధా వాత్రైక,*
*దేశచారిణీకా చిదన్యావా కార్య సంపాదినీ విధవా పంచమీతి చారాయణః*

పైన చెప్పిన కారణాలవల్ల మంత్రులతో ఉంపుడుగత్తెలూ, రాజుల ఉంపుడుగత్తెలూ రాజ కుటుంబాలకు సంబంధించిన నాయికలూ, కార్యం సాధించగల ఇతర స్త్రీలూ, విధవరాండ్రూ, వీరంతా అయిదోరకం నాయికలుగా చెపుతాడు చారాయణుడు.

*23. సైవ ప్రవ్రజితా షష్ఠీతి సువర్ణ నాభః*

పైన చెప్పిన రాజులకూ, మంత్రులకూ, వాళ్ళతో సమానులైన సంపన్నులకూ సంబంధించిన స్త్రీలను, అలాంటి విధవరాండ్రను ఆరోరకం నాయికలుగా పరిగణించాడు సువర్ణనాభుడు.

ఇక నాయికల విషయంలో ఘోటక ముఖుడనే మరో శాస్త్రవేత్త అభిప్రాయం ఇక్కడ చెప్పబడుతూ ఉంది.

*24. గణికాయా దుహితా పరిచారికా వా, అనన్య పూర్వా నప్తమీతి ఘోటకముఖః*

పురుష సంపర్కం ఏ మాత్రం లేని భోగం పడుచును గానీ, దాసీ పుత్రికను గానీ ఒక పురుషుడి కిచ్చి, శాస్త్రోకంగా పెళ్ళి చేస్తే, అలాంటి స్త్రీని ఏడో రకం నాయికగా ఘోటకముఖుడు పేర్కొన్నాడు.

*25. ఉత్క్రాంత బాల భావా కులయువతి, రుపచారాన్యత్వాదష్టమీతి గోనర్దీయః*

*ఇక గోనర్దీయుడున్నాడు. బాల్యభావాలు వదిలిపెట్టిన కులస్త్రీ ఎవరైనా సరే, ఉపచార భేదాన్ని బట్టి ఎనిమిదో నాయికగా స్వీకరించవచ్చునని అతని మతం.*

*26. కార్యాంతరా భావా దేతా సామపి పూర్వా స్వేవోపలక్షణమ్*
*తస్మాదేతా ఏవ నాయికా ఇతి వాత్స్యాయనః*

అయితే, వాత్స్యాయనుల మతం వేరు. కన్య, పునర్భువు, వేశ్య, పరదార - ఇలా నాయికల్లో నాలుగే రకాలు. కాని ఇతర కామశాస్త్ర ప్రవక్తలు పైన చెప్పిన వారిని కూడా చేర్చారు. అయినప్పటికీ వీరంతా మొదట చెప్పిన నాలుగు రకాల నాయికల్లోకి చేరుతారని, ఒకవేళ ఇతర నాయికా భేదాలను అంగీకరించినా, పైన పేర్కొన్న నాలుగు రకాల నాయికలూ చేసే పనులే వారు చేస్తారు కాని, అంతకన్నా వారు ప్రత్యేకంగా సాధించే కార్యం ఏదీ ఉండదనీ వాత్స్యాయనులు సిద్ధాంతీకరించాడు.

*27. భిన్నత్వాత్తృతీయా ప్రకృతిః పంచమీత్యేకే.*

ఇకపోతే, ఇటు స్త్రీ కాకుండా, అటు పురుషుడు కాకుండా ఉండే వారు నపుంసకులు. వారు కూడా ఔపరిష్టికాది క్రియల ద్వారా సుఖం కలిగిస్తారు. కాబట్టి వారిని అయిదో నాయికగా కొందరు చెప్పారు.

*28. ఏక ఏవ తు సార్వ లౌకికో నాయకః*

ఇక నాయకుడి విషయం. స్త్రీల లాగా పురుషుల్లో భేదాలు లేవు. అంచేత లోకంలో నాయకుడు ఒక్కడే అని నిర్ధారణ చేశారు.

*29. ప్రచ్ఛన్న స్తు ద్వితీయః విశేష లాభాత్.*

అయితే, ప్రచ్ఛన్న నాయకుడని రెండో నాయకుణ్ణి నిర్ణయించారు. కేవలం సంభోగ సుఖం కోసమే పరస్త్రీలతో రహస్యంగా రతిక్రీడలు సాగించేవాడు ఇతను. కనుకనే ఇతను ప్రచ్ఛన్న నాయకుడు.

*30. ఉత్తమాధమ మధ్యమతాంతు, గుణా Zగుణతో విద్యాత్.*

ఈ నాయకుల్లో మళ్ళీ మూడు రకాలు. ఉత్తమం, మధ్యమం, అధమం అని - సద్గుణ సంపన్నుడై అన్ని విషయాల్లోనూ ధర్మ బుద్ధితో ప్రవర్తించేవాడు ఉత్తముడు. ఒకప్పుడు ధర్మంగానూ, మరోప్పుడు అధర్మంగానూ ప్రవర్తిస్తూ కొన్ని సద్గుణాలు మాత్రమే కలవాడు మధ్యముడు. ఎల్లప్పుడూ అధర్మంగానే ప్రవర్తించేవాడూ, మంచిగుణం ఒక్కటీ లేనివాడు అధముడు.

*31. తాం స్తూభయోరపి గుణాగుణాన్ వైశికే వక్ష్యామః.*

ఈ నాయికా నాయకుల గుణగాణాలను గురించి ముందు ముందు రాబోయే వైశికాధికరణంలో వివరించడం జరుగుతుంది.

*32. అగమ్యా స్త్వే వైతాః కుష్ఠినీ, ఉన్మత్తా, పతితా, భిన్నరహస్యా*
*ప్రకాశప్రార్థినీ, గత ప్రాయయా వనా అతిశ్వేతా, అతి కృష్ణా, దుర్గంధా,*
*నంబంధినీ, నఖీ, ప్రవ్రజితా, నంబంధి నఖి, శ్రోత్రియ రాజదారాశ్చ.*

పైన నాయికల స్వరూపాన్ని గురించి చెప్పినా, వారిలో పొందతగిన వాళ్ళెవరో, పొందకూడని వాళ్ళెవరో శాస్త్రకారుడు చెపుతున్నాడిక్కడ. ఈ క్రింద చెపుతున్న స్త్రీలతో పురుషులు సంభోగించరాదు. కుష్ఠురోగం కలది, పిచ్చిది, కులభ్రష్టురాలు, రహస్యాలు బయటపెట్టే స్వభావం కలది, ఎదుట తియ్యటి మాటలు మాట్లాడుతూ రహస్యంగా ద్రోహం చేసేది, యౌవనం క్షీణించి పోయినది, బొల్లిరోగం కలది, కారు నలుపురంగు దేహం కలది, దేహం నుండి దుర్వాసన వచ్చేది, దగ్గరి చుట్టరికం కలది, భార్య చెలికత్తె, సన్యాసిని, విధువరాలు, విద్యా సంస్థలతోటి, రాజకీయాల తోటి సంబంధం కలది, పురోహితుడి భార్య, రాజు భార్య వీరితో పొత్తు పెట్టుకుని కామసౌఖ్యం కోసం ఉపయోగించుకోరాదని వాత్స్యాయనుల మతం. దీన్నిబట్టి చూస్తే, అసలు పరస్త్రీని పొందడమే పాప హేతువు, అనర్థదాయకం అని ఈ శాస్త్రకారుడి అభిప్రాయమైనట్లు స్పష్టమవుతూ ఉంది.

*33. దృష్ట పంచ పురుషా నాగమ్యా కా చిదస్తీతి బాభ్రవీయాః*

తన భర్త కాకుండా, వేరే అయిదుగురితో రమించిన స్త్రీలు అందరికీ పొందదగిన వారేనని బాభ్రవీయులంటారు.

*34. నంబంధి నఖి శ్రోత్రియ రాజదార వర్జమితి గోణికా పుత్రః*

దగ్గరి చుట్టాల భార్య, తన భార్యకు స్నేహితురాలు, పురోహితుడి భార్య, రాజు భార్య వీరిని మాత్రం విడిచిపెట్టి తక్కిన వారితో రతిక్రీడలు సాగించవచ్చునని గోణికా పుత్రుల అభిప్రాయము.

*35. సహ పాంసు క్రీడిత ముపకార సంబంద్ధం సమాన శీల వ్యసనం, సహాధ్యాయినం, యచ్చాన్య మర్మాణి రహస్యానిచ విద్యా, ద్య స్యచాయం విద్యాద్వా ధాత్ర్యపత్యం సహ సంవృద్ధం: మిత్రం.*

ఇక నాయకుడికి సహాయంగా ఉండి నాయికతో జత కుదిర్చే దూతల విషయం చెపుతున్నారు. ఇలా దూతలుగా ఉండేవారిలో ముఖ్యంగా మూడు విషయాలు గమనించవలసి ఉంటుంది. ఒకటి స్నేహం, రెండు గుణం, మూడు జాతి. ఇందులో మొదటి రకం దూత చిన్నప్పటి నుంచీ తనతో ఆట - పాటల్లో పాల్గొని ఎంతో స్నేహంగా ఉండేవాడు. అతనికి ఉపకార బుద్ధి ఉండాలి. స్వభావంలోనూ, స్థితిగతుల్లో తనతో సమానమైన వాడుగా ఉండాలి. తనతోపాటు చదువుకున్నవాడు కావాలి. అతని రహస్యాలు తనకు చెపుతూ, తన రహస్యాలు అతను తెలుసుకునేటంత స్నేహం కలవాడు, నీవు-నేను అనే భేదం లేకుండా మెలిగేవాడు, తనతోపాటు స్నేహితుడుగా పెరిగిన దాసీదాని కొడుకు, వీళ్ళంతా స్నేహితులుగా పరిగణించబడతారు. దూత కృత్యానికి వీరిని నియమించవచ్చు. అంతే కాకుండా ఇలా స్నేహంవల్ల లభించే సహాయకులు లేదా దూతలు తొమ్మిది రకాలు.

*36. పితృపైతామహమ విసంవాదక మద్రృష్ట వైకృతం వశ్యం ధ్రువమలోభ శీలమపరిహార్య, మమంత్ర విస్రావీతి మిత్ర సంపత్.*

తన తండ్రి, తాతలనాటి నుంచీ స్నేహంగా ఉంటున్న వంశంలో పుట్టిన తన ఈడు - జోడు అయినవాణ్ణి, అరమరికలు లేకుండా తనతో మనస్సు విప్పి మాట్లాడేవాణ్ణి, తను చెప్పినట్లు వినేవాణ్ణి, ఇతరుల మాటలకు లొంగనివాణ్ణి, రహస్యాలు బయటపెట్టని వాణ్ణి - వీరిని దూత కార్యానికి వినియోగించుకోవచ్చు. వీరంతా మిత్రవర్గంలోనివారే.

*37. రజక, నాపిత, మాలాకార, గాంధిక, సౌరిక, భిక్షుక, గోపాలక, తాంబూలిక, సౌవర్ణిక, పీఠమర్ద, విట విదూషకాదయో మిత్రాణి.*

చాకలి, మంగలి, పూలమాలలు కట్టేవాడు, సుగంధ ద్రవ్యాలు తయారుచేసేవాడు, పానీయాలు అమ్మేవాడు, కంసాలి, పీఠమర్దుడు, విటుడు, విదూషకుడు - వీరందరినీ కూడా మిత్రులుగా పరిగణించవచ్చు.

*38. తద్యోషి న్మిత్రాశ్చ నాగరకాఃస్యురితి వాత్స్యాయనః.*

పైన చెప్పిన పురుషులే కాక, వాళ్ళ స్త్రీలూ, వాళ్ళ స్నేహితులూ ఈ విషయంలో నేర్పు కలవారే కాబట్టి వీరందరినీ దూతకార్యానికి వినియోగించుకోవచ్చని వాత్స్యాయనుల అభిప్రాయం.

39. *యదుభయో స్సాధారణ ముభయత్రో దారం విశేషతో నాయికాయాః సువిస్రబ్ధం తత్ర దూతకర్మ.*

ఎవరైతే నాయికానాయకులిద్దరికి అనుకూలంగా ఉండి, ఇద్దరికీ మేలు చేయగలవారై, ముఖ్యంగా నాయికకు ఎక్కువ నమ్మకస్థులుగా ఉంటున్నారో వారే దూతకృత్యం నెరపడానికి యోగ్యులు. కార్యం సాధించడానికి సమర్థులు, అని అంటారు వాత్స్యాయనులు.

40. *పటుతా ధార్ష్ట్య మింగితాకారజ్ఞతా, అనుకూలత్వం, పరమమర్మజ్ఞతా, ప్రమాణతా, ప్రతారణం, దేశజ్ఞానం, కాలజ్ఞ తా, విషహ్య బుద్ధిత్వం, లఘ్వీప్రతిపత్తిః, సోపాయా దూతగుణాః.*

దూతలకు కొన్ని ముఖ్యమైన గుణాలు ఉండాలి. చమత్కారంగా మాట్లాడే నేర్పు, అద్భుతమైన తెలివి తేటలు, అంటేస్తే చాలు అల్లుకుపోగల సూక్ష్మ గ్రాహత్వం, కార్యదక్షత, నాయికా నాయకుల మనోభావాలు ఇట్టే గ్రహించి ఆ విధంగా నడుచుకోగలగడం, ఏ సందర్భంలోనూ కూడా ఏ మాత్రం తొందరపడకుండా, నిగ్రహంతో కార్యం చక్కబెట్టుకుని రాగల సామర్థ్యం, ఇతరుల రహస్యాలు, వారి మనోభావాలు ఇట్టే పసిగట్టగలగడం, ప్రతిపనీ చెప్పినట్లు చేయగలగడం, క్షణంలో ఇతరులను మాయచేసి, మోసపుచ్చగల చాతుర్యం, తాను వెళ్ళినచోటు, అక్కడి వాతావరణం, పరిస్థితులు కనిపెట్టి తదనుగుణంగా ప్రవర్తించగలగడం, కార్యసాధనలో సులువైన, సూక్ష్మమైన మార్గాన్ని కనిపెట్టి మెలగడం - ఇలాంటి ఉపాయాలన్నీ తెలిసినవారే దూత కృత్యం నెరపడానికి అర్హులు.

41. *భవంతి చాత్ర శ్లోకః - ఆత్మవాన్, మిత్రవాన్, యుక్తః, భావజ్ఞో, దేశకాలవిత్, అలభ్యామ ప్రయత్నేన స్త్రియం సంసాధ యే న్నరః.*

పైన చెప్పిన విషయాలన్నీ చక్కగా గ్రహించి, యోగ్యులైన దూతల సహాయంతో నాగరకుడైన వాడు తన ప్రియురాలి మనోభీష్టాలు గ్రహిస్తూ, దేశకాల పాత్రానుసారంగా ప్రయత్నం చేస్తే, ఎలాంటి అసాధ్యమైన స్త్రీనైనా వశపరచుకొని, ఆమెతో కామ సౌఖ్యాలు పొందగలుగుతాడు.

*ఇతి వాత్స్యాయనీయే కామసూత్రే, సాధారణే ప్రథమేధికరణే నాయక సహాయ దూతీకర్మ విమర్శః పంచమోధ్యాయః*

**ఇది వాత్స్యాయన ముని విరచిత కామసూత్రాల్లో సాధారణమనే ప్రథమాధికరణంలో నాయక సహాయదూతీ కర్మ విమర్శ అనే పంచమాధ్యాయం. సాధారణాధి కరణం సమాప్తం.**

# వాత్స్యాయన కామ సూత్రాలు

## సాంప్రయోగికాధికరణం - 2

### ప్రథమాధ్యాయం - రతావస్థాపనం

*1. శశోవృషోశ్వ ఇతి లింగతో నాయక విశేషః*

**ఇంతకు ముందు** అధికరణంలో ఎలాంటి స్త్రీనైన ఎలా లోబరుకోవచ్చునో చెప్పాడు శాస్త్రకారుడు. ఈ అధికరణంలో మొదట, స్త్రీ పురుషుల మర్మావయవాల ప్రమాణాలు చెపుతున్నాడు. ఈ అవయవాల ప్రమాణాలను బట్టే, భావాలను బట్టే, కాలాన్ని బట్టే రతిక్రియను నిరూపిస్తున్నాడు. అంటే, నాయకీ నాయకుల లింగ ప్రమాణం, వారికి గల కామోద్రేకం, వారు రతికి ఉపక్రమించే సమయం - వీటిని అనుసరించి రతిక్రియ అనేది వేర్వేరుగా వుంటుంది.

ఈ మనిషి స్త్రీ ఈ మనిషి పురుషుడు అని దేన్నిబట్టి తెలుసుకో గలుగుతున్నామో దానికి లింగమని పేరు. దాన్నే మర్మాంగం అనికూడా అంటాము. అది పురుషుడికి ముందుకు సాగి పొడుగ్గా వుంటుంది. స్త్రీకి లోపలి భాగంలో లోతుగా వుంటుంది. ఇక ఈ మర్మాంగాల కొలతలు కామశాస్త్రం వల్లా లేదా అనుభవజ్ఞానం వల్లా తెలుసుకోవచ్చు. ఈ కొలతలను అనుసరించే స్త్రీ పురుషులను తరగతులుగా విభజించారు శాస్త్రకారులు.

## స్త్రీ, పురుషుల్లో రకాలు

పురుషుల్లో శశజాతి వాడనీ, వృషజాతి వాడనీ, అశ్వజాతి వాడనీ - మొత్తం మూడు రకాలు. మర్మాంగం మరీ పొట్టిగా వుంటే అతను శశజాతి పురుషుడు. అంత పొట్టీ కాకుండా, అంత పొడుగూ కాకుండా మధ్యరకంగా వుంటే అతను వృషజాతి పురుషుడు. ఉండవలసిన దానికన్నా చాలా పొడుగ్గా వుంటే అతను అశ్వజాతి పురుషుడు.

*2. నాయికా పునర్మృగీ, బడబా, హస్తినీ చేతి*

అలాగే స్త్రీలలో మృగి, బడబ, హస్తినీ అని మొత్తం మూడు రకాలు. పురుషుల మర్మాంగం హెచ్చుతగ్గులను బట్టి రకాలు నిర్ణయించినట్టే, స్త్రీల యోని లోతులో హెచ్చు తగ్గులను బట్టి స్త్రీలలో రకాలను నిర్ణయించారు.

శశజాతి పురుషుడి అంగం పొడుగు అరంగుళాలు. అలాగే మృగిజాతి స్త్రీ యోని ఆరంగుళాల లోతు వుంటుంది. వృషజాతి పురుషుడి అంగం తొమ్మిది అంగుళాల పొడుగు వుండగా, బడబ జాతి స్త్రీ యోని కూడా అంతే లోతు వుంటుంది. ఇక అశ్వజాతి పురుషుడి లింగం పన్నెండంగుళాల పొడుగు వుండగా, హస్తినీ జాతి స్త్రీ యోని పన్నెండంగుళాల లోతు వుంటుంది.

(సంభోగానికి పూర్వం పురుషుడి లింగం బిర్రబిగిసి, దారుఢ్యం చెంది వున్నప్పుడు మాత్రమే దాని ప్రమాణాన్ని పరిగణించాలి.)

అయితే కొక్కోకుడు తన శాస్త్రంలో స్త్రీలను నాలుగురకాలుగా విభజించాడు. 1. పద్మినీ, 2. చిత్రిణీ, 3.శంఖినీ, 4. హస్తినీ. ఈ శాస్త్రకారుడు అంగ ప్రమాణాలను బట్టి స్త్రీ పురుషుల జాతులు నిర్ణయించినట్లు కనపడదు. పద్మినీ జాతి స్త్రీ ఉత్తమురాలనీ, చిత్రిణీ మధ్యమ అనీ, శంఖినీ అధమ అనీ, హస్తినీ అధమాధమమనీ కొక్కోకుడి నిర్ణయం.



# స్త్రీ, పురుషుల్లో జాతి భేదాలు

## 1. పద్మినీ జాతి స్త్రీ లక్షణాలు :

పద్మినీ జాతి స్త్రీ శరీరం తామర మొగ్గలా సుతిమెత్తగా వుంటుంది. శరీరమూ, రతి జలమూ కూడా పద్మం ఎలాంటి సువాసన కలిగి వుంటుందో, అలాంటి సుగంధం కలిగి వుంటాయి. నేత్రాలు విశాలంగా వుండి, తళ తళ మెరుస్తూ, లేడి కళ్ళను పోలివుంటాయి. నాసిక నువ్వు పువ్వులా అందాలు చిందిస్తూ వుంటుంది. చన్నులు పూల బంతుల్లాగా, మారేడు పండ్లలాగా ముచ్చట గొలుపుతూ

వుంటాయి. పద్మినీ జాతి స్త్రీ మనస్సు ఎల్లప్పుడూ దేవబ్రాహ్మణ పూజలోను, గురుపూజలోను ఆసక్తి కలిగివుంటుంది. శరీరం కలువ పువ్వు, సంపంగి పువ్వు కాంతితో శోభిల్లుతూ వుంటుంది. మదన మందిరం తామర రేకులా చక్కని ఆకారం కలిగివుంటుంది. సన్నటి నడుము, దొండ పండులాంటి పెదవులు, చంద్రబింబం లాంటి ముఖం, ఇసుక తిన్నెల్లా వున్నతమైన పిరుదులు, మృదు మధురమైన వాక్కు, హంస నడక, చిలుక పలుకులు - ఇవ్వన్నీ పద్మినీ జాతి స్త్రీలోనే కనిపిస్తాయి. ఆమె గుణాల కుప్ప. సంగీత, సాహిత్యాలన్నా, శాస్త్రాలు, పురాణాలన్నా ఎంతో ఇష్టం. ఎప్పుడూ సత్యం పలుకుతూ వుంటుంది. రకరకాల నగలూ, రత్నహారాలు ధరించడం అంటే చాలా ఇష్టం. ఏ సందర్భంలోనూ కోపం తెచ్చుకోదు. రాత్రి నాలుగోజామున అంటే తెల్లవారుఝామున రతికేళి జరుపగోరుతుంది. పాంచాల జాతి పురుషుడంటేనే ఇష్టపడుతుంది. రతి సమయంలో మనోహరంగా క్రీగంట చూస్తూ, అమితమైన ప్రేమతో ప్రియుని కౌగిలించుకుంటుంది. బాగా రతి చేస్తూ పరవశురాలై పురుషుని గాఢంగా వక్షోజాలకు హత్తుకుంటూ వుండి, మధ్య మధ్య సుఖాతిరేకం వల్ల కన్నులు మూస్తుంటుంది. ఈమె పిక్కలు ఏనుగు తొండాల్లా, తొడలు అరటి స్తంభాల్లా, మీగాళ్ళు తాబేళ్ళలా వుంటాయి. తుమ్మెద రెక్కల్లా నల్లటి తలవెంట్రుకలు, చేతి వ్రేళ్ళు కోమలంగా, చుక్కల శృంగారాన్ని మించిన గోళ్ళు కలిగివుంటుంది. ఉబలాటంతో ఉత్సాహంతో రతి సలుపుతూ ప్రియుని ఆనందంలో ముంచివేస్తుంది. రతిక్రీడకు అన్ని విధాలా యోగ్యురాలు. ఈ పద్మినీ జాతి స్త్రీ. స్వల్ప ఆహారం, తీపి పదార్థాలంటే ఇష్టం. తెల్లటి చీరలు అంటే ప్రీతి.

## 2. చిత్రిణీ జాతి స్త్రీ లక్షణాలు :

చిత్రిణీ జాతి స్త్రీ నడక అందం చిందుతూ వుంటుంది. సన్నటి నడుము, చూపుల్లో అభిమానం తొణికిసలాడుతూ వుంటుంది. చన్నులూ, పిరుదులూ చాలా పెద్దవి. గుండ్రటి పిక్కలు. శంఖంలా మూడు రేఖలు కలిగివుంటుంది కంఠం. చకోర పక్షిలా మాట్లాడుతుంది. నాట్యం, సంగీతం మున్నగు విద్యల్లో నేర్పు, ఆసక్తి. మదనగృహం గుండ్రంగాను, లోతుగాను వుండి ఎక్కువగా జలం ఊరుతూ వుంటుంది. తాకితే మెత్తగా వుంటుంది. అక్కడ రోమాలు కొద్దిగా వుంటాయి. చంచలాక్షి, చిన్నప్పటి నుంచే సంభోగం మీద ఆసక్తి కలిగివుంటుంది. పుల్లటి పదార్థాలంటే ఇష్టం. ఆహారం మధ్య రకం. రంగు రంగుల చీరలు కడుతుంది. తళుకులు ఒలికిస్తూ చిత్ర విచిత్రమైన చూపులు చూస్తుంది. శరీరం కమ్మని పుష్ప పరిమళం వెదజల్లుతూ వుంటుంది. పూలంటే ఎంతో ఇష్టం. వన్నెలు, చిన్నెలు ఒలికే చేష్టలు చేస్తూ వుంటుంది. ముంగురులు ఉంగరాలు తిరిగివుంటాయి. సాధారణంగా కోపం తెచ్చుకోదు. చౌశీతి బంధాలతో చిత్రరతులు చెయ్యాలని కోరుతుంది. కిల కిల నవ్వుతుంది. అయితే ఎక్కడా ప్రేమ నిలువదు. వలపు బయటపెట్టకుండా ప్రవర్తిస్తూ వుంటుంది. కొత్తవారిని కోరుతుంది. కాని

వారికి లొంగదు. ఆట పాటలంటే ఇష్టం. గాఢంగా రతి చేస్తే మనసిచ్చి కరిగిపోతుంది.

సంచారం చేయడం ఇష్టం. చిత్రిణీ అంటే అందగాళ్ళకు తంగేడు చెట్టున వున్న జున్ను లాంటిది. అంటే చాలా సులభంగా లభించేది అని భావం. రతి సమయంలో పదే పదే నడుం పైకి ఎత్తుతూ వుంటుంది. క్రిందామీదా అవుతుంది. తొడలతో పురుషుని నొక్కి పెడుతుంది. ఉత్సుకతతో తానే పురుషుడిపై పడి ఉపరతికి ఉపక్రమిస్తుంది. రతి సమయంలో కడుపు చూపిస్తుంది. ఎక్కువగా కళ్ళు తెరుస్తుంది. వియోగాన్ని సహించలేదు. ఉద్రేకం కలిగించే చమత్కారపు చేష్టలు చేస్తూ తియ్యగా మాట్లాడుతుంది. రాత్రి మొదటిజామున సంభోగాన్ని అభిలషిస్తుంది. మొత్తం మీద పద్మినీ జాతి లక్షణాలకన్నా ఈమె లక్షణాలు కొంచెం తక్కువగా వుంటాయి.

## 3. శంఖినీ జాతి స్త్రీ లక్షణాలు :

ఇక శంఖినీ జాతి స్త్రీ దేహం చాలా ఒడ్డూ పొడుగూ వుండి, బలిసి వుంటుంది. పెద్ద పెద్ద పాదాలు, ఎప్పుడూ కోపంతో చిర్రుబుర్రు లాడుతూ వుంటుంది. పువ్వులంటే ఎక్కువ అపేక్ష. పెదవి ముద్దాడబోతే అదురుతుంది. శరీరం ముట్టుకుంటే కొంచెం వేడిగా వుంటుంది. మదనమందిరం అడవిలా దట్టమైన వెంట్రుకలతో నిండివుంటుంది. సంభోగ సమయంలో రతిజలం ఊరడం చాలా తక్కువ. భర్తపై నఖక్షతాలు చేస్తుంది. ఇతరుల తప్పులు చెపుతుంటే వినడానికి ఉబలాట పడుతుంది. భర్త అభివృద్ధిని కోరుతూ వుంటుంది. కంఠస్వరం కర్కశంగా వుంటుంది. గొంతెత్తి మాట్లాడితే గార్దభస్వరం. మిక్కిలి కుటిల స్వభావం. పైత్యం ప్రకోపించిన మనిషిలా కనిపిస్తుంది. నడుం సన్నం, పాదాలు మెత్తగా వుండవు. ఎప్పుడూ ఏదో వాగుతూనే వుంటుంది. కంఠం శంఖంలా వుంటుంది. ఆహారం మధ్యరకం. కారపు పదార్థాలంటే ఎక్కువ ఇష్టం. చూపులు వక్రంగా వుంటాయి. నల్లటి జుట్టు, వత్తుగా నల్లగా తీర్చిదిద్దినట్టుండే కనుబొమలు, భర్తమీద పిచ్చి నమ్మకం. పరిమళ ద్రవ్యాలంటే అమిత ఇష్టం. నీలిరంగు చీరలు కట్టాలని కోరుతుంది. భర్త శృంగార విషయాలు ఎత్తితే చాలు, కామోద్రేకం పొంది సుఖం వాంఛిస్తుంది. కుచాలు మరీ లావుగా, ఎత్తుగా వుంటాయి. రతిలో మాటిమాటికీ మదనమందిరం చూపుతుంది. భర్తను మాటలతో బెదిరిస్తూ వుంటుంది. తనంతట తానే ప్రియుడి కౌగిట్లో వాలిపోతుంది. పురుషాయితం అంటే పడిచస్తుంది. రాత్రి మూడో జాములో సంభోగం ఇష్టం. ఈమె శశాంకుడనే పురుషుని పొందుకోరుతూ వుంటుంది.

## 4. హస్తినీ జాతి స్త్రీ లక్షణాలు :

ఈమెకు తిన్నగా నడవడం చేతకాదు. కాలివ్రేళ్ళు కొంచెం వంకరగా, పొడుగ్గా వుంటాయి. పాదాలు మరీ పొట్టి. నల్లటి జుట్టు. ఏ పని చేసినా క్రూరస్వభావం. ఊరికూరికనే చిందులు త్రొక్కుతూ వుంటుంది. మర్మావయంపై రోమాలు తక్కువ.

కాని చాలా వెడల్పుగా లోతుగా వుంటుంది. స్తనాలు కుండల్లాగా గుమ్మడికాయల్లాగా మరీ లావుగా ఉండి, వ్రేలాతున్నట్లుంటాయి, శరీరం, యోని కూడా ఏనుగు మదజలం లాంటి వాసన, చంకలు గబ్బు, పెద్ద పెద్ద తొడలు, నడుం పెద్దది, పొట్టకూడా పెద్దది. తిండిపోతు, భోజన ప్రియురాలు, పెదవులు మందం, కంచు మ్రోగినట్లుండే కంఠస్వరము - చంచల స్వభావం, నుదురు మెరక, శరీరం కూడా లావు, వెంట్రుకలు కురచ, పెద్ద పెద్ద కళ్ళు, కపటం తెలియని మనిషి, తియ్యటి మాటలకు మెత్తబడి పోతుంది. ఎంతో గాఢంగా సంభోగం సాగిస్తేగాని తృప్తిపడదు. ఆ సమయంలో మోహం వున్నట్లు కనిపించదు. బాగా రతి చేయగల పురుషుడంటే ఇష్టపడుతుంది. మామిడి చిగురు రంగు చీరెలంటే ఇష్టం. కౌగిలింతలంటే ఎంతో ఇష్టం. అందంగా, బలిసివున్న పురుషులను ప్రేమిస్తూ వుంటుంది. రాత్రి రెండో జాములో కామోద్రేకం ఎక్కువ. అప్పుడు రతి చెయ్యాలని కోరుతూ వుంటుంది. ఇవన్నీ హస్తినీ జాతి స్త్రీల లక్షణాలు.

దీన్ని బట్టి పద్మినీ జాతి స్త్రీ ఉత్తమమనీ, చిత్రిణీ మధ్యమం అనీ, శంఖినీ అధమం అనీ, హస్తినీ అధమాధమం అనీ స్పష్టమవుతుంది.

(అయితే స్త్రీలలో ఈ లక్షణాలన్నీ గుర్తించడం అసాధ్యమనిపిస్తుంది. ఇక్కడ చెప్పిన నాలుగు జాతుల స్త్రీలలో గల గుణాలు కొన్ని, దోషాలు కొన్ని కలగాపులగంగా వుండే మగువలే ఎక్కువగా కనిపిస్తారు. మరి, అలాంటి వారిని ఏ జాతిలో చేర్చాలో శాస్త్రకారులు చెప్పలేదు. ఏమైనా ఒకటి మాత్రం యథార్థమని తోస్తుంది. స్త్రీ హృదయం కనిపెట్టడం బ్రహ్మరుద్రాదుల తరం కూడా కాదంటారు.)

*'' ఔదుంబరాణి పుష్పాణి శ్వేత వర్ణంచ వాయసం,*
*మత్స్యపాదం జలేపశ్యే న్న నారీ హృదయ స్థితమ్ ''*

అంటే, లోకంలో ఔదంబరపూలు ఎక్కడైనా చూడవచ్చునేమో! తెల్లని కాకులను కూడా ఎక్కడో కనుగొనవచ్చు. నీళ్ళలోపల చేపల అడుగుజాడలను కూడా కనిపెట్టవచ్చు. కాని, స్త్రీల హృదయం వున్నదే అది ఎవ్వరూ తెలుసుకోలేరు అని చెప్పారు పెద్దలు. అలాగే,

*'' స్త్రీణాం ద్విగుణ మాహారం, బుద్ధి శ్చాపి చతుర్గుణమ్,*
*సాహసం షడ్గుణం చైవ, కామోష్టగుణిముచ్యతే. ''*

(అంటే పురుషులకన్నా స్త్రీలు అనేక విషయాల్లో అధికులని చెప్పారు. మగవాళ్ళకంటే ఆడవాళ్ళకు ఆహారం రెండు రెట్లు, బుద్ధి నాలుగురెట్లు, సాహసం ఆరు రెట్లు, కామం ఎనిమిది రెట్లు ఎక్కువ అని భావం.)

(పెద్దలు అనుభవంతో ఇలాంటి విషయాలెన్నో చెప్పిన దాన్నిబట్టి ఆలోచిస్తే స్త్రీని రతిలో తృప్తి పరచడం అంత తేలిక అయిన పని కాదని తేలుతుంది. అందుకే కామశాస్త్రం స్త్రీ పురుషుల సంతుష్టికై మార్గాలు చెప్పింది.)

*3. తత్ర సదృశ సంప్రయోగే సమరతానిత్రేణ.*

ఇక ఇప్పుడు రతిలోగల తరగతులను గురించి చెపుతున్నాడు వాత్స్యాయనుడు. స్త్రీ పురుషుల మర్మాంగాలు సరిసమానంగా వుంటే, వారిమధ్య జరిగే రతిని సమరతం అంటారు. అయితే, మళ్ళీ ఈ సమరతాలు మూడు విధాలు. 1) శశజాతి పురుషుడికీ, మృగీజాతి స్త్రీకి, 2) వృషజాతి పురుషుడికీ బడబ జాతి స్త్రీతో, 3) అశ్వజాతి పురుషుడికీ హస్తినీ జాతి నాయికలతో సంభోగం జరిగితే వాటిని సమరతాలంటారు. అసలు సమరతం అంటే, స్త్రీ యోనికి, పురుషుడి మర్మాంగం సరిగ్గా సరిపోవడం అన్నమాట.

4. విపర్యయేణ విషమాణి షట్.

ఇక విషమ రతాలున్నాయి అంటే హెచ్చు తగ్గులుగా వుండే సంభోగాలు. ఇవి ఆరు విధాలు.

1) శశజాతి పురుషుడు, బడబ జాతి స్త్రీతోనూ, హస్తినీతోనూ, 2) వృషజాతి పురుషుడు మృగితోనూ, హస్తినీతోనూ, 3) అశ్వజాతి పురుషుడు మృగితోనూ, బడబతోనూ సంభోగం సాగిస్తే, వాటిని విషమ రతాలు అంటారు. అంటే స్త్రీ పురుషుల మర్మాంగాల హెచ్చు తగ్గులవల్ల ఇవి ఏర్పడుతున్నాయన్నమాట.

*5. విషమేష్వపి పురుషాధిక్యం, చేదనంతర సంప్రయోగే, ద్వే ఉచ్చరతే.*

పైన పేర్కొన్న విషమరతుల్లో సయితం మరో విశేషం వుంది. అదేమిటీ అంటే, స్త్రీ యోని లోతు తక్కువగా వుండడం, పురుషుడి లింగం దీర్ఘమైనదిగా వుండడం. అలాంటప్పుడు పురుషుడి మేహనం స్త్రీ యోనిని చీల్చుకుని లోపలికి వ్యాపిస్తుంది దీన్ని ఉచ్చరతం అంటారు. ఇది రెండు విధాలు.

1) అశ్వజాతి పురుషుడికి బడబ జాతి స్త్రీతోనూ, 2) వృషజాతి పురుషుడికి మృగీజాతి స్త్రీతోనూ సంపర్కం జరిగితే పైన చెప్పిన రెండు విధాలైన ఉచ్చరతాలు ఏర్పడుతాయి.

# రతాలలో తరగతులు

*6. వ్యవహితమేక ముచ్చతర రతం.*

ఉచ్చతర రతం అని మరొకటుంది. ఇక్కడ వ్యవహితం అంటే చివరి జాతి పురుషుడు మధ్యజాతి స్త్రీతో కాకుండా మొదటి జాతి స్త్రీతో సంభోగం జరపడం. ఉచ్చతర రతం అంటే ఇదే. ఇందులో రకాలు లేవు. ఇది ఒకటే రకం.

*7. విపర్యయే ద్వే పునర్నీచరతే.*

పైన చెప్పిన పద్ధతికి భిన్నంగా (తలక్రిందులుగా) అంటే, చాలా పొట్టి అంగం గల పురుషుడు అంతకన్నా లోతైన భగం గల బడబజాతి స్త్రీతో సంభోగించినా, లేక వృషజాతి పురుషుడు హస్తినీ జాతి స్త్రీతో కలిసినా నీచరతి అంటారు.

ఈ నీచరతులు రెండు రకాలు. ఇవి సమరతాల కన్నా నీచరతాలు. పురుషుడి లింగం స్త్రీ యోనికి సరిపోనందున వీటిని నీచరతాలని అన్నారు.

*8. వ్యవహిత నీచతర తరమ్.*

ఉచ్చతర రతంలాగే నీచతర రతం అంటూ మరొకటి వుంది. చివరి జాతి స్త్రీతో మొదటి జాతి పురుషుడికి సంపర్కం కలిగితే ఇది ఏర్పడుతుంది. ఇది కూడా ఒకటే రకం.

*9. తేషు సమాని శ్రేష్ఠాని*

ఇలా చెప్పిన ఆరు రకాల విషమ రతాలకన్నా స్త్రీ పురుషుల మర్మాంగాలు అన్ని విధాల సరిసమానంగా వున్నప్పుడు, ఆ సంభోగం చాలా శ్రేష్ఠమైంది. ఎందుచేతనంటే, అప్పుడు కలిగే సుఖం అంత ఇంత కాదు. అది వర్ణనాతీతమైంది.

కాబట్టి సమరతాలు ఉత్తమమైనవని పిండితార్థం.

*10. తరశబ్దాంకితే ద్వే కనిష్ఠే.*

'తర' అనే శబ్దం (ఇంగ్లీషులో 'మోస్ట్' లాగా) చేర్చబడిన ఉచ్చతర రతమూ, అలాగే నీచతర రతమూ కూడా అధమ శ్రేణిలోనివి.

ఎందుచేతనంటే, ఉచ్చతర రతంలో స్త్రీ భగానికి విపరీతమైన బాధ కలుగుతుంది. నీచతర రతంలో స్త్రీకి స్పర్శ సుఖం అనేది అసలే ఉండదు.

*11 శేషాని మధ్యాని*

తక్కిన నాలుగు రకాల రతాలు మధ్యమ శ్రేణిలో చేరతాయి. అవి ఉచ్చరతాలు రెండు. నీచ రతాలు రెండూను.

విస్పష్టతకోసం ఇంకా ఇలా వివరిస్తున్నాడు శాస్త్రకారుడు.

సమరతాలు మొత్తం మూడు :- అవి

1. శశజాతి పురుషుడు - మృగీజాతి స్త్రీ

2. వృషజాతి పురుషుడు - బడబజాతి స్త్రీ

3. అశ్వజాతి పురుషుడు - హస్తినీ జాతి స్త్రీ

విషమ రతాలు ఆరు - ఈ ఆరింటిలో మళ్ళీ మధ్య రతాలు నాలుగు. ఆ నాలుగు మధ్య రతాల్లోనూ మధ్య రతాలు రెండు. ఉచ్చరతాలు రెండు. ఉచ్చతర రతం ఒకటి, నీచతర రతం ఒకటి - మొత్తం ఆరు.

ఇక మధ్య రతాలు నాలుగు - విషమ రతాల్లోని మధ్య రతాలలో ఉచ్చ రతాలు.

1. అశ్వజాతి పురుషుడు, బడబజాతి స్త్రీ

2. వృషజాతి పురుషుడు, మృగీజాతి స్త్రీ విషమ రతాల్లోని మధ్య రతాలలో నీచ రతాలు.

1. శశజాతి పురుషుడు, బడబజాతి స్త్రీ

2. వృషజాతి పురుషుడు, హస్తినీ జాతి స్త్రీ కాగా, విషమ రతాల్లో అధమ రతాలు రెండు :-

1. అశ్వజాతి పురుషుడు, మృగీజాతి స్త్రీ - ఇది ఉచ్చతర రతం
2. శశజాతి పురుషుడు, హస్తినీ జాతి స్త్రీ - ఇది నీచతర రతం.

ఈ విధంగా సమ రతాలు తప్ప, తక్కిన పై ఆరు రతాలు విషమ రతాలన్న మాట. సమ రతాలతోకూడా కలిపితే మొత్తం తొమ్మిది రకాలైన రతాలు ఏర్పడుతున్నాయి.

*12. సామ్యేపుచ్చాంకం నీచాంకాజ్జ్యాయాఇతి ప్రమాణతో నవరతాని.*

మధ్య రతాల్లో మరో విశేషాన్ని చెపుతున్నారు వాత్స్యాయనులు. మధ్య రతాల్లో అంతగా హెచ్చు తగ్గులు లేకపోయినా, నీచరతంకన్నా ఉచ్చతరం శ్రేష్ఠమని కొందరు శాస్త్రకారుల అభిప్రాయం. ఎందుచేతనంటే, ఉచ్చరతంలో స్త్రీ ఉత్ఫుల్లకాదులచేత (స్త్రీ వెల్లకిల పరుండి భగాన్ని తెరిచి ఉంచడం) పురుషుడి మర్మాంగం భగం లోతుకన్నా ఎక్కువ పొడుగ్గా ఉండడంవల్ల స్త్రీకి ఎంతగానో తృప్తి, సుఖం కలుగుతాయి ఇక నీచ రతంలో అయితే - సంపుటికాదులచేత స్త్రీ తన యోనిని ముడుచుకుని ఉన్నా, పురుషాంగం చాలదు. ఆ కారణంవల్ల స్త్రీకి తృప్తి, సుఖం ఉండవు. అందుచేతనే పురుషాంగం మరీ చిన్నదిగా వున్నవాడు, ఎంత కామోద్రేకం కలవాడైనప్పటికి, స్త్రీ కామాన్ని అణచలేడు. స్త్రీని తృప్తి పరచలేని పురుషుడు ఎప్పుడూ ఆమెకు ఇష్టుడు కాలేడు. ఇది పెద్దలు అనుభవంమీద చెప్పిన మాట.

*13. యస్య సంప్రయోగకాలే ప్రీతి రుదాసీనా, వీర్యమల్పం,*
*క్షతాని చ న సహతే న మందవేగః.*

ఇంతవరకూ స్త్రీ పురుషుల మర్మాంగాల హెచ్చు తగ్గులను బట్టి రతిలో విశేషాలు చెప్పారు వాత్స్యాయనులు. ఇప్పుడు స్త్రీ పురుషుల మనోభావాలను బట్టి రతిస్థితిని నిరూపిస్తున్నాడు. స్త్రీ పురుషుల స్ఖలన కాలంకన్నా ముందు ఉండేది భావప్రాప్తి. కాబట్టి మొదటి దాని గురించే చెబుతున్నారు. ఈ భావం అనేది రెండు విధాలు. సంభోగం చెయ్యాలనే కోరిక పుట్టడాన్ని కామితం అంటారు. తరువాతకలిగే సుఖానికి కారణం ఒక విధం. స్ఖలనం కాబోయే ముందు కలిగే భావం మరొక విధం. ఈ భావం ఫలసిద్ధి రూపమైంది. అందుచేత ఈ రెండు రకాల ద్వారా ముందు రతిని నిరూపిస్తున్నారు. భావ సురతం అనేది మృదువు, మధ్యమం, అధికం - అవి మూడు రకాలు.

సంభోగం చెయ్యాలనే ఉత్సాహం తక్కువగా ఉంటుంది. కొందరికి వీర్యం కూడా స్వల్పంగా ఉంటుంది. స్త్రీ తనను గోళ్ళతో గిచ్చుతున్నా, దంతాలతో కొరుకుతున్నా ఓర్చుకోలేకుండా ఉంటాడు. ఇలాంటి లక్షణాలున్న పురుషుణ్ణి మందవేగుడంటారు.

*14. తద్విపర్యయే మధ్యమచండవేగౌ భవతః*

అలాగే సంభోగం చేయాలనే ఉత్సాహం, వీర్యం, మధ్య రకంగా ఉండి, స్త్రీ నఖక్షత, దంతక్షతాదులను కొంతవరకు సహించగలవాణ్ణి మధ్య వేగుడంటారు. పైన చెప్పిన విషయాలన్నీ ఎక్కువగా ఉన్నవాణ్ణి చండవేగుడంటారు.

*15. తథా నాయికా అపి.*

పురుషుల్లో మాదిరిగానే స్త్రీలలో కూడా పైన చెప్పిన విషయాలు పరిశీలించాలి. అంటే సంభోగంపై తక్కువ ఇచ్ఛ కలిగి, రతిజలం స్వల్పంగా ఉండి, పురుషుడి నఖక్షత, దంత క్షతాదులను ఏ మాత్రం ఓర్చుకోలేని స్త్రీని మందవేగ అని, ఈ లక్షణాలు సామాన్యంగా ఉంటే మధ్య వేగ అని, ఎక్కువగా ఉంటే చండవేగ అని తెలుసుకోవాలి.

*16. అత్రాపి ప్రమాణ వదేవ నవరతాని.*

పైన చెప్పిన భావాల విషయంలోకూడా పురుషుడి మర్మాంగం హెచ్చు తగ్గులను అనుసరించి తొమ్మిది రకాల రతాలను నిర్ణయించినట్లే, తొమ్మిది రకాల రతాలు ఏర్పడుతున్నాయి.

*17. తదత్కాలతోఽపి శీఘ్ర మధ్య, చిరకాలా నాయకాః*

భోహా చ్చౌతగ్గులను బట్టి ఏ విధంగా తొమ్మిది రతాలను నిర్ణయించారో, అలాగే కాలాన్ని బట్టి కూడా తొమ్మిది రతాలు గ్రహించాలి. అంటే పురుషుడి వీర్యం అతి త్వరగా స్ఖలనం అయితే శీఘ్రవేగుడు. ఒక మోస్తరు వ్యవధిలో స్ఖలనం అయితే మధ్య వేగుడు. చాలా ఆలస్యంగా స్ఖలనం అయితే చిరవేగుడు. ఈ సూత్రం స్త్రీలకు కూడా వర్తిస్తుంది.

*18. తత్ర స్త్రియాం వివాదః*

అయితే, స్త్రీల విషయంలో అభిప్రాయం భిన్నంగా ఉంది.

*19. న స్త్రీ పురుష వ దేవభావ మధిగచ్ఛతి.*

స్త్రీకి వీర్యం అనేది లేకపోవడంవల్ల, వీర్య స్ఖలన సమయంలో పురుషుడు పొందే అభిమాన పూర్వకమైన ఆనందం, సుఖం స్త్రీ పొందడంలేదు. ఇది ఔద్దాలకి అభిప్రాయం.

స్త్రీ యోనిలో దురద ఉన్నంతమాత్రాన దాన్ని పోగొట్టుకోడానికి పురుషుడితో సంభోగించాలా ? ఈ పనికి వేరే సాధనాలు లేవా ? - ఈ ప్రశ్నలకు సమాధానం చెబుతున్నారు ఔద్దాలకులు. చెవిలో దురదగా ఉంటే ఒకపుల్లతో ఆ దురద పోగొట్టుకుంటాం. అలాగే యోనిలో 'గుల' గా ఉన్నప్పుడు పురుషుడి లింగంతో స్త్రీ ఆ 'కండూతి' వదుల్చుకుంటుంది కాని, ఇక్కడ మరో ప్రయోజనం కూడా వుంది. కేవలం దురద పోగొట్టుకోడమేకాక, 'ఈ పురుషుడు నన్ను ముద్దాడుతున్నాడు, కౌగలించుకుంటున్నాడు. గిచ్చుతున్నాడు. రకరకాల చేష్టలతో నన్ను సంతోషపెడుతూ సంభోగం జరుపుతున్నాడు.' అని అనుకుంటూ స్త్రీ అమితమైన సుఖాన్ని, అభిమాన పూర్వకమైన ఆనందాన్ని పొందుతూ వుంది. దురద వదల్చుకోడంతోపాటు, ఈ అభిమాన పూర్వకమైన సుఖం కూడా కలిపి, ఒక అనిర్వచనీయమైన సుఖానందాలు కలుగుతున్నాయి స్త్రీకి. మరో విధంగా చెప్పాలంటే తీపి తింటే ఒక రుచి, పులుపు తింటే మరొక రుచి. ఈ రెండూ కలిసిన పదార్థం భక్షిస్తే ఇంకొక రుచి. అలాగే ఇదీను. కాబట్టి కేవలం కండూతి

తీర్చుకోడంవల్ల కలిగే సుఖం కాదు ఇది. పురుషుడి ప్రేమాభిమానాలతో కూడిన ఒక అనితర సాధ్యమైన సుఖం ఇది. అందుచేతనే పురుషుడితో స్త్రీ సంభోగాన్ని కోరుతూ వుంటుందన్న మాట.

*20. సాతత్స్యాత్ప్రస్యాః పురుషేణ కండూతిరప నుద్యతే.*

అయితే, పురుషుడితో స్త్రీ ఎందుకు సంభోగిస్తున్నదని ప్రశ్న. స్త్రీల యోనిలోని కండరాలు, సహజంగా ఒక విధమైన దురద పుట్టించేవిగా వుంటాయి. స్త్రీ పురుషుడివల్ల ఆ దురద పోగొట్టుకుంటున్నది. పురుషుడు తన లింగాన్ని స్త్రీ యోనిలో ప్రవేశపెట్టి, అక్కడ కండూతిని పోగొడుతున్నాడు ఆ పని చెయ్యకపోతే, దురద ఎక్కువ అవుతుంది.

స్త్రీల మదన మందిరంలో అతి సూక్ష్మజీవులు రక్తంనుండి పుట్టి వాటి బలాన్ని బట్టి అవి మృదుశక్తి, మధ్యశక్తి, ఉగ్రశక్తి కలిగి ఉండి, ఆ శక్తిని అనుసరించి ఒక విధమైన దురదను పుట్టిస్తూ ఉంటాయి - ఇది పెద్దలు చెప్పిన సంగతి.

*21. సా పునరాభిమానికేన సుఖేన, సంసృష్టా రసాంతరం జనయతి.*

*22. తస్మిన్ సుఖబుద్ధి రస్యాః*

విశేషమైన ఈ సుఖం ప్రాప్తించినప్పుడే స్త్రీ తాను సుఖిస్తున్నా ననుకుంటుంది. మరే సాధనంతోనో దురద పోగొట్టుకున్నప్పుడు ఆమెకు ఈ సుఖం కలుగదు. ఈ విశేష సుఖమే స్త్రీలకు ముఖ్యమైనది. పురుషుడికి వీర్య స్ఖలనం జరిగినప్పుడు ఒకానొక తృప్తి, ఆనందం కలుగుతాయి. స్త్రీకి అలాంటి సుఖం లేదు కాబట్టి, పురుషుడు సురతం మొదలు పెట్టినప్పటినుంచి దురద వదల్చుకోడం ద్వారా ఈ విశేష సుఖం పొందుతూ వుంది. పురుషుడికి మాత్రం వీర్య స్ఖలనంతో సుఖం పూర్తి అవుతుంది. అందుచేత స్త్రీ పురుషుల సుఖ స్వరూపాన్ని బట్టి, కాలాన్ని బట్టి, సామ్యం అనేది ఎక్కడాలేదు కాబట్టి, కాలానికీ, భావానికీ సంబంధించిన తొమ్మిది రకాల రతాలు లేనే లేవు.

*23. పురుషప్రతీతేశ్చా నభిజ్ఞత్వాత్.*

మరి, పురుషుడు పొందుతున్న రతి సుఖం స్త్రీ పొందడం లేదని ఎలా చెప్పగలం? అది ఎలా తెలుసుకోగలం? - అని అంటే, పురుషుడి ప్రేమకూడా మనస్సుకు సంబంధించింది కాబట్టే, ఇంద్రియాలకు కనిపించనిదాన్ని ప్రత్యక్షంగా తెలుసుకోలేం కాబట్టి స్త్రీ పురుషుల మనోగత ప్రేమ భావాలను ఎవరూ తెలుసుకోజాలరు - అని తేల్చారు శాస్త్రకారులు.

*24. కథం తే సుఖమితి ప్రష్టుమశక్యత్వాత్.*

స్త్రీ పురుషు లిరువురూ 'నీ సుఖం ఎలాంటిది?' అని ఒకరి నొకరు ప్రశ్నించుకుంటే, ఎవరికి ఎవరూ సరియైన సమాధానం చెప్పలేరు. ఎందుచేతనంటే పురుషుడి వీర్యస్ఖలన రూపమైన సుఖం స్త్రీకి తెలియదు. అలాగే స్త్రీకి కలిగే

విశేష సుఖం సంగతి పురుషుడు ఎరుగడు. కాబట్టి ఈ సుఖం 'ఇలాంటిది' అని నిర్వచించి చెప్పడం కుదరనే కుదరదు. ఇక వ్రాయడం ఎలా సాధ్యమవుతుంది?

# రతిలో స్త్రీ పురుషుల సుఖం ఎలాంటిది?

*25. కథమే తదుపలభ్యేత ఇతి చేత్, పురుషో హి రతి మధిగమ్య స్వేచ్ఛయా*
*విరమతి, న స్త్రియమపేక్షతే, న త్వేవం స్త్రీత్యౌద్దాలకిః*

పై విధంగా నిశ్చయించి చెప్పడానికి ఆధారం ఏమిటని ప్రశ్న. అంటే, పురుషుడు సంభోగం జరుపుతూ, వీర్య స్ఖలనం కాగానే, సంపూర్ణ సుఖం పొంది తనంతటతానే రతి చేయడం ఆపివేస్తాడు. ఆ తరువాత స్త్రీ తనకైతాను ఇంకా రతి క్రీడ సాగించమని కోరినా, మళ్ళీ ఆ పని చేయడానికి పురుషుడు సమ్మతించడు. మరి స్త్రీకి అలాకాదు. పురుషుడిలాగా మగువకుకూడా స్ఖలన సుఖం ఉన్నట్లయితే, ఆ సుఖం కలిగిన వెంటనే, పురుషుని విడిచి వేస్తుంది కాని కాంతలు అలా చేయడంలేదు. మళ్ళీ పురుష సంపర్కాన్ని అభిలషిస్తూ ఉంటారు. ఒక పురుషుడు సంభోగించి విరమించిన తరువాత కూడా, మరొక పురుషుడితో రతి సలపడానికి తరుణీమణులు సిద్ధంగా ఉంటున్నట్లు లోకంలో వింటున్నాం. పెద్దలు, అనుభవజ్ఞులు కూడా ఈ విషయంలో కొన్ని సూక్తులు చెప్పారు. పురుషుడికన్నా స్త్రీకి కామం ఎన్నో రెట్లు ఎక్కువ అని ఇంతకుముందే తెలియజేశాం కదా! ఎన్ని కట్టెలు తెచ్చి పెట్టినా అగ్నిహోత్రుడు దహించివేస్తాడు. అగ్నికి తృప్తి పడడం అనేది లేదు. ఎన్ని నదులూ, ప్రవాహాలూ వచ్చి పడినా సముద్రుడు తనలో కలుపుకుంటాడో కాని, ఇక చాలు అనడు. ఎన్నెన్ని భూతాలను దిగమ్రింగుతున్నా ఆ అంతకుడు (యముడు, లేదా మృత్యువు) తృప్తిపడడు. అదే విధంగా ఎంత మంది పురుషులతో సంభోగించినా కాంతలు తృప్తిపడరు. ఇది పెద్దలమాట.

స్ఖలన సుఖాన్ని పొంది రతినుండి విరమించడం అనేది మగువలకు లేదు కాబట్టి, స్ఖలనానికి ముందు పురుషుడు పొందే సుఖం, తృప్తి స్త్రీలకు లేదు. ఇప్పటిదాకా చెప్పిందంతా ఔద్దాలకి అభిప్రాయం.

*26. తత్రైతత్స్యాత్, చిరవేగే నాయకే, స్త్రియోఽను రజ్యంతే, శీఘ్రవేగస్య*
*భావమనాసాద్య అవసానే, అభ్యసూయిన్యో భవంతి,*
*తత్సర్వం, భావప్రాప్తే ర ప్రాప్తేశ్చ లక్షణం.*

భావాన్ని బట్టీ, కాలాన్ని బట్టీ తొమ్మిది రకాల రతాలు ఏర్పడతాయని ఇంతకుముందు చెప్పడం జరిగింది. అయితే, ఈ వాదాన్ని ఖండించి ఔద్దాలకి, పురుషుల్లాగా స్త్రీలకు స్ఖలన సుఖం లేదని సిద్ధాంతంచేశాడు. కాని, దీనిపై సామాన్యంగా ఒక ప్రశ్న వస్తుంది. ఆ ప్రశ్న, దానికి సమాధానం చెపుతున్నారు ఔద్దాలకి.

సంభోగంనుండి పురుషులు విరమించాల్సిందే తప్ప, స్త్రీలు తమంతటతాము విరమించరు. అందువల్ల వారికి స్ఖలన సుఖం లేకపోయినప్పటికీ, అనురాగంవల్ల

కలిగే సుఖం ఉందికదా? అది ఎలా అంటే, ఎక్కువ సేపు రతి సాగించి స్ఖలన సుఖాన్ని పొందిన పురుషుడు, రతి విరమించినప్పటికీ, అతన్ని ఆ స్త్రీ ఎక్కువగా అభిమానిస్తున్నది. అతి తక్కువసేపు రతిచేసి విరమించే పురుషుణ్ణి స్త్రీలు ద్వేషిస్తారు. ఇలా స్త్రీలు సురతం విషయంలో పురుషులను అభిమానించడం, ద్వేషించడం ఉంటున్నది కాబట్టి, భావ ప్రాప్తి కలిగేదాకా రతి చేస్తే స్త్రీ సంతోషిస్తుందనీ, అది ప్రాప్తించక ముందే రతి విరమిస్తే, దుఃఖం పొందుతుందనీ స్పష్టమవుతున్నది. కాంతలు కనుక పురుషాయిత బంధంతో, చాలాసేపు రమించి, విరమించినప్పుడు, ఎక్కువసేపు రతి చేయగల పురుషులు ఆనందిస్తున్నారు. అలాగే చాలా తక్కువసేపు రతిచేసి విరమించిన స్త్రీ వల్ల పురుషుడు దుఃఖం పొందుతున్నాడు. అందువల్ల ఈ సుఖదుఃఖాలనేవి స్త్రీ పురుషులకు సమానంగానే ఉంటున్నట్లు తేలుతున్నది. కాబట్టి పురుషుడిలాగానే స్త్రీకి కూడా స్ఖలన సుఖం వున్నట్లు అనిపిస్తుంది కదా! సాధారణంగా వచ్చే సందేహం ఇది.

*27. తచ్చ న.*

అనురాగ ప్రదర్శనం అనేది భావ ప్రాప్తికి ప్రధాన లక్షణంగానే కాదు. ఈ అనురాగం అనేది స్త్రీ పురుషులిరువురిలోనూ సాధారణంగా ఉంటూనే వుంది.

*28. కండూతి ప్రతీకారోపి హి దీర్ఘకాలం ప్రియ ఇతి.*

ఎక్కువసేపు రతి చేయడంవల్ల స్త్రీకి మర్మాంగంలోని దురదపోతూంది. అంతేకాకుండా ఆమెకు కూడా స్ఖలన సుఖం కలిగిస్తుంది.

ఈ వాదం కొంతవరకు బాగున్నట్లు అనిపించినా, ఇందులో కూడా కొన్ని సందేహాలకు తావు లేకపోలేదు.

*29. ఏతదుప పద్యత ఏవ.*

ఇంతకూ స్త్రీకి దేనివల్ల అనురాగం పుడుతున్నది? స్ఖలనసుఖం పొందడంవల్లనా? లేక యోనిలో దురదను పోగొట్టుకోడంవల్లనా? అలాగే రతిలో సమర్థుడుకాని మందవేగుడివల్ల స్ఖలన సుఖం పొందక పోవడంచేత అసంతృప్తి చెందుతున్నదా, విరక్తురాలు అవుతున్నదా? ఇదీ ఆ సందేహం.

*30. తస్మాత్సందిగ్ధత్వాద లక్షణమితి.*

ఈ విధంగా ప్రేమానురాగం, అసంతృప్తి, విరక్తి - అనే రెండు విషయాల్లోనూ సందేహం ఉత్పన్నం కావడంచేత, స్త్రీకి స్ఖలన సుఖం వున్నదని కానీ, లేదనికానీ ఈ వాదం ఇదమిత్థంగా నిర్ణయించి చెప్పడంలేదు. అందువల్ల స్త్రీ తనంతటతాను సంభోగంనుండి విరమించడం, లేక విరమించకపోవడం అనే వాటిని బట్టి స్త్రీకి స్ఖలన సుఖం వున్నదని కానీ, లేదనికానీ నిర్ధారణ చేయవలసి వుంటుంది. స్త్రీలు ఎప్పుడో తప్ప, సాధారణంగా వాళ్ళంతట వాళ్ళు రతి నుండి విరమించరు. కాబట్టి పురుషుడిలాగా స్త్రీ భావ ప్రాప్తి పొందడం లేదని తేలుతున్నది.

*31. సంయోగే యోషితః పుంసాం, కండూతిరపనుద్యతే,*
*చత్సాభిమాన సంసృష్టం సుఖమిత్యభిధీయతే.*

ఔద్దాలకి చెప్పిన శ్లోకాన్నే ఉదహరిస్తూ ఈ వాదాన్నే విస్పష్టం చేస్తున్నారు వాత్స్యాయనులు. సంభోగ సమయంలో పురుషుడివల్ల స్త్రీ భగంలో గల దురద నివారణ అవుతున్నది. అభిమానంతో నిండిన సౌఖ్యం ఇది. అంటే, కారణంతోపాటు, కార్యధర్మం కూడా కనిపిస్తోంది. కాబట్టే అదే అభిమానిక సుఖం. ఇంతవరకూ చెప్పింది ఔద్దాలకి సిద్ధాంతం.

*32. సాతత్యాద్యువతిరారంభాత్ప్రభృతి, భావమధిగచ్ఛతి, పురుషః పునరంత ఏవ.*

ఇక భాభ్రవ్యుడి మతం - స్త్రీ పురుషులిద్దరూ స్ఖలన సుఖం పొందుతూ ఉన్నారు. రతి ప్రారంభమైన క్షణం నుంచీ కాంత పురుషుడి చేత తెంపు లేకుండా రమింపబడుతూ, చిల్లిపడితే కొంచెం కొంచెం నీరు కారినట్లుగా కొద్దికొద్దిగా రతి జలం విడుస్తూ ఉంటుందనే విషయం అనుభవసిద్ధమైంది. అందుచేత రతి మొదలైనప్పటినుండి మగువ అభిమానిక సుఖ రూపమైన భావాన్ని పొందుతూ పురుషుడిలాగా స్ఖలన సుఖాన్ని సయితం అనుభవిస్తోంది. మరి, పురుషుడు మాత్రం స్ఖలనం జరిగే సమయంలోనే ఈ అభిమానిక సుఖ భావాన్ని పొందుతూ ఉన్నాడు.

*33. ఏత దుపపన్న తరం.*

ఇలా చెబుతున్న బాభ్రవ్యుడి సిద్ధాంతం, ఔద్దాలకి అభిప్రాయం కంటే సహేతుకంగా, కనిపిస్తోంది కాబట్టి, ఇదే సమంజసంగా ఉన్నట్లుతోస్తుంది. అయినప్పటికి ఇక్కడ కూడా ఒక సంశయం ఉత్పన్నం అవుతోంది, అదేమిటి అంటే - స్ఖలన సుఖం అనేదాంట్లో స్త్రీపురుషులిద్దరికి సామ్యం కనిపిస్తున్నది కాబట్టి తొమ్మిది రకాల రతాలు ప్రాప్తించినా, స్ఖలన సమయంలో స్త్రీ పురుషులకు భేదం ఏర్పడుతోంది. అందుచేత, కాలంవల్ల కలిగే నవ రతాలూ సంభవించడంలేదు.

*34. సత్యానత్యాం భావప్రాప్తౌగర్భసంభవ ఇతి బాభ్రవీయాః*

బాభ్రవ్యుడు ఇంకా ఇలా అంటున్నాడు - స్త్రీ యోని ఒక కారణం లాంటిది దాన్ని కదిలిస్తే చాలు, తేనె తుట్టెను కదిలిస్తే తేనేటీగలు లేచినట్లు, అది చెమ్మగిల్లుతూ ఉంటుంది. అలా రతి జలం ఊరి, స్ఖలన సుఖం పొంది సంతుష్టురాలైన స్త్రీ గర్భం ధరిస్తోంది. ఈ గర్భధారణ లక్షణాలను గురించి ఆయుర్వేదాచార్యుడు చరకుడు ఇలా చెప్పాడు.

గర్భిణి స్త్రీ మాటిమాటికీ ఉమ్మివేస్తూ ఉంటుంది. కాళ్ళు, చేతులు బరువెక్కుతాయి. ఏదో సంతోషం ఎక్కువగా పొందుతూ ఉంటుంది. అయితే, మనస్సు మాత్రం ఏదో గుబులుగా ఉంటుంది. రతి చేస్తున్నప్పుడు ఇక చాలు అనిపిస్తుంది. యోనిలోపలికి వీర్యాన్ని గ్రహిస్తుంది - ఇవి గర్భ లక్షణాలు. ఇక, తృప్తి అంటే భావం అని అర్థం. పురుషుడు రేతస్సు విడిచినప్పుడు మాత్రమే ఆ భావ ప్రాప్తి కలుగుతుంది. స్త్రీ కూడా రజస్సు (శోణి) విడిస్తుంది కాని శుక్రాన్ని విడువదని కొందరంటారు. ఇందుకు పెద్దల మాటలుకూడా ప్రమాణాలుగా చూపిస్తారు - ''కామాగ్ని పరితప్త చిత్తులైన స్త్రీపురుషుల భగలింగాల రాపిడివల్ల,

ఆరణి దండాల రాపిడివల్ల అగ్ని పుట్టినట్లుగా, శుక్ల శోణితాలు ఉద్భవిస్తాయి'' -

కాని, మళ్ళీ ఇక్కడొక ప్రశ్న - స్త్రీ విడిచేది శుక్లం కాకపోతే గర్భం ఎలా ధరిస్తున్నది? పురుషుడితో కలియడంవల్ల స్త్రీ గర్భం ధరిస్తున్నది కదా! అలాగే స్త్రీతో కలిస్తే కూడా స్త్రీ గర్భం ధరించాలి! దీనికి ప్రమాణం ఆయుర్వేద గ్రంథం 'సుశ్రుతం'లో కనిపిస్తుంది. ఒక స్త్రీ, మరో స్త్రీతో సంభోగం జరిపితే ఇద్దరూ విడిచిన శుక్లంవల్ల ఎముకలు లేని పిండం పుడుతుంది'' - అని సుశ్రుతాచార్యులంటున్నారు. అందుచేత, ఇటు రసం - అటు ధాతువు - ఈ రెంటివల్ల ఉత్పన్నమైన అన్నధాతువే ఒకానొక అవస్థలో ఆర్తవంగా మారుతుంది. శుక్ల ధాతువు మాత్రం మజ్జధాతువువల్ల ఉద్భవిస్తుంది.

ఒకప్పుడు పాంచాల దేశంలోని పంచనద క్షేత్రంలో ఒకనాడు మహర్షులందరూ సమావిష్టులైనారట. సంఘ పాలన, కృషి, గోరక్షణ, ఆరోగ్యాది విషయాలు ఆలోచించి ఒక్కొక్క విషయాన్ని నిర్వహించడానికి ఒక్కొక్కరు అధ్యక్షులుగా ఏర్పడినారట. మహర్షులలో భరధ్వాజుడు ఆరోగ్య విషయం నిర్వాహణకు పూనుకొన్నాడు. సంఘహితార్థం కోసం స్వర్లోకం నుంచి ఆయుర్వేదాన్ని తీసుకొని వచ్చాడు. ఈ విషయం ఐతరేయ బ్రాహ్మణంలో చెప్పబడింది. బ్రహ్మదేవుడు ఈ ఆయుర్వేదాన్ని మొదటి ప్రజాపతికి చెప్పాడు. అతను దేవ వైద్యులైన అశ్వనీ దేవతలకు, వారు ఇంద్రుడికీ, అతను భరధ్వాజుడికీ, ఆ భరధ్వాజుడు ఆత్రేయ పునర్వసుడికి అతను అగ్నివేశ, భౌలజ, తూకర్ణ, పరాశర, హరీత క్షారపాణులనే ఆరుగురికీ బోధించాడు. ఆ విధంగా ఆయుర్వేదం లోకంలో ఒకరినుంచి ఒకరికి సంక్రమించి ప్రచారమైంది. అగ్నివేశుడే మొదట ఆయుర్వేదానికి సంబంధించిన తంత్రాన్ని నిర్మించాడు, దాన్నే చరకుడు సంస్కరించి వెలయించాడు. ఈ విషయం చరక సంహిత తెల్పుతూ ఉంది. ఆత్రేయ భాషితాన్నే హరీతుడు సంహితగా రచించినట్లు హరీత సంహిత పేర్కొంటున్నది. కాశీరాజు దినోదాసుడనబడే పూజ్యుడైన ధన్వంతరి మహర్షిని, నౌపధేవన, వైతరణ, ఔరభ్ర, పౌష్కలావత, కరవీర్య, గోపురు రక్షిత, సుశ్రుతాదులు ఆశ్రయించి ప్రజాహిత హేతువైన ఆయుర్వేదాన్ని ఉపదేశించమని కోరినారట. అతను చెప్పిన తంత్రాన్నే అనుసరించి సుశ్రుతుడు తన పేర సంహిత రచించినట్లు సుశ్రుత సంహిత విశదం చేస్తున్నది. (ధన్వంతరి పౌత్రుడు దివోదాసుడని విష్ణుపురాణం) పైన చెప్పిన ఆర్ష గ్రంథాలను చూచి తాను అష్టాంగ హృదయం నిర్మించినట్లు వాగ్భటుడు చెపుతున్నాడు.

## సంభోగంలో సంతృప్తి - అసంతృప్తి

ఆయుర్వేదోత్పత్తిని గురించి బ్రహ్మ, విష్ణు, వైవర్త పురాణాదులు పేర్కొంటున్నాయి. ఏమైనప్పటికీ దీనికి మూలపురుషులు, ఆత్రేయులు, అగ్నివేశుడు అనే వాదం అధిక ప్రచారంలో వుంది. ధన్వంతరి కృతమగు లక్ష శ్లోకాలతో కూడిన ఆయుర్వేదంలో - ఆరవది అయిన గదాతంత్రాన్ని తొలుత ఆత్రేయుడు

ఆభ్యసించి పిమ్మట అగ్నివేశుడికి ఉపదేశించినట్లు 'భావప్రకాశిక' తెలుపుతుంది. దాన్ని బట్టి ధన్వంతరే ఆయుర్వేదానికి మూలకర్త అన్న అభిప్రాయం సుశ్రుత మతం వల్ల బలపడుతున్నది. ఇలా భిన్నాభిప్రాయాలున్నప్పటికీ, ఔషధ సంప్రదాయానికి అధికంగా ఆత్రేయ పునర్వసున్నూ శస్త్ర సంప్రదాయానికి ఎక్కువగా ధన్వంతరినీ ప్రధాన ఉపదేష్టలని తోస్తూవుంది. ఇంతవరకూ ధన్వంతరి అనేది బిరుదనామమో, ఋషి నామధేయమో ఇదమిత్తంగా చెప్పడానికి వీలు కాకుండా వుంది. సంస్కృత వాఙ్మయ చరిత్రకారులు సయితం ఈ అభిప్రాయాన్నే వ్యక్తం చేస్తున్నారు. ఏమైనా ఈ ఆయుర్వేద విజ్ఞానం భారతదేశంలో అత్యంత ప్రచీనమైనదీ, ప్రామాణికమైనదీను.

చరకుడు రచించిన 'చరక సంహిత' పాణిని అష్టాధ్యాయిక పూర్వపుది. దీని తరువాతనే 'హారీత, సుశ్రుత సంహితలు పుట్టాయి. అష్టాంగ హృదయకర్త అయిన వాగ్భటాచార్యుడు క్రీ.పూ. రెండవ శతాబ్దంలోనివాడు.

వాత్స్యాయనులు చరక, సుశ్రుతాలను గురించి ప్రస్తావించడంచేత, ఆయుర్వేదాచార్లను గురించి, ఆయుర్వేదాన్ని గురించి ఈ వివరణ ఇవ్వవలసి వచ్చింది. మన ప్రాచీన మహర్షులు నిర్మించిన శాస్త్రాలన్నీ ఇంతే. కామశాస్త్రం కేవలం కామానికి మాత్రమే సంబంధించినది కాదు. దీనికి, ఆయుర్వేదానికి సంబంధం వున్నది. అలాగే ఆయుర్వేదానికి జ్యోతిశ్శాస్త్రంతోనూ సంబంధం వుంది. వాటికి ఛందో శాస్త్రంతో సంబంధం వుంది. ఈ విధంగా ప్రాచీన శాస్త్రాలన్నీ ఒక దానితో ఒకటి ముడిపెట్టి, అన్నిటా పాండిత్యం సంపాదించినవాడే ఆయా శాస్త్రాలకు పరమ ప్రాణికుడుగా పరిగణింపబడుతూ వచ్చాడు.

*35. అత్రాపి తావేవ ఆశంకా, పరిహారౌభూయః*

సరే, ఇప్పుడు బాభ్రవ్యుడి సిద్ధాంతంలో కూడా ఔద్దాలకి వాదంలో ఉత్పన్నమైన ప్రశ్న. సమాధానాలే తిరిగి ఉత్పన్నమవుతూ ఉన్నాయి 'ఆరంభంనుంచీ...' ఈ మొదలైన సంశయాలూ, వాటికి పరిహారాలు సంభవిస్తున్నాయి. అయితే, అనురాగం ఉంది కాబట్టి, పురుషుడిలా భావప్రాప్తి అసూయ ఉంది కాబట్టి మొదటినుంచీ భావప్రాప్తి పొందకపోవడాన్ని సమాధానంగా చెప్పడానికి వీలులేదు. యోనిలో పుట్టే కండూతిని ఎక్కువసేపు వదల్చుకోవడం స్త్రీకి ఇష్టం కాబట్టి ఎక్కువసేపు రతి సాగించలేని శీఘ్రవేగుడైన పురుషుడిపై స్త్రీకి ద్వేషం లేదా అయిష్టత కలగడం సహజం. ఎక్కువ సేపు రతి ఇష్టమున్న స్త్రీకి భావప్రాప్తి ఉన్నప్పటికీ, కండూతి తీరడంలేదు కనుక ఎక్కువసేపు భావప్రాప్తి వుండడానికి కూడా స్త్రీ ఇష్టపడుతున్నది. అందువల్లనే శీఘ్రవేగుని విషయంలో స్త్రీవిరక్తి, అయిష్టత చూపుతున్నది. దీనికి కారణం స్త్రీలకు ఎక్కువ సేపు భావప్రాప్తిలేక పోవడమే. సాధారణంగా స్త్రీ లందరూ ఎక్కువసేపు రతి సాగించి, ఎక్కువసేపు భావప్రాప్తి కలిగించే పురుషులనే కోరుతూ వుంటారు. పురుషులకన్నా స్త్రీలకు కామం ఎనిమిది రెట్లు ఎక్కువ అని ఇదివరకే చెప్పడం జరిగింది కదా! అలాంటప్పుడు

ఇక కాంతలు పురుషుడివల్ల తృప్తిపడేది ఎప్పుడు? విసృష్టి సుఖం వున్నా స్త్రీలక తృప్తి కలగడం లేదు. ఇలా మళ్ళీ సంశయాలు ప్రశ్నలూ, ఉదయిస్తున్నాయి.

36. *తత్రైతత్స్యాత్ సాతత్యేన, రసప్రాప్తావారంభకాలే మధ్యస్థ*
*చిత్తాతా, నాతిసహిష్ణుతా చ, తతః క్రమేణాధికో రాగయోగః*
*శరీరే నిరపేక్షత్వం, అంతే చ, విరామాభీప్సేత్యేతదను పపన్నమితి.*

సంభోగం ప్రారంభించే సమయంలో చిత్తం ఒక మోస్తరుగా వుంటుంది. అప్పుడే స్త్రీ నఖక్షతాదులు ఎక్కువగా సహించలేదు. అయితే తరువాత క్రమ క్రమంగా అనురాగం పొంది గిచ్చుళ్ళకూ, రక్కుళ్ళకూ బాగా తట్టుకుంటుంది. మైమరచి పోతుంది. సంభోగం చాలించే సమయంలో, ఇక రతి చాలిస్తే బాగుండునని అనుకుంటుంది. దీన్ని బట్టి చూస్తే స్త్రీకి రతి ఆరంభం నుంచీ భావప్రాప్తి కలుగుతున్నదనడానికి వీలులేదు. అలా కలుగుతున్నట్లయితే, పైన చెప్పిన క్రమం అసంభవం.

37 *తచ్చన*

ఇలా చెప్పడం సరిగాలేదు. ఈ క్రమం అసంభవం ఎలా అవుతుంది? ఈ క్రింది సూత్రం చూడండి.

38. *సామన్యేపి భ్రాంతి సంస్కారే, కులాల చక్రస్య భ్రమకర స్య*
*వాభ్రాన్తావేవ వర్తమానస్య, ప్రారంభే మందవేగతా,*
*తతశ్చక్రమేణ పూరణం వేగస్యేత్యుపపద్యతే.*

ఇక్కడ 'భ్రమరకం' అంటే కొయ్యతో తయారుచేసే బొంగరం. ఇది పిల్లలు ఆడుకునే ఆట వస్తువు. పొడుగాటి త్రాడుతో దీన్ని చుట్టి విసురుతారు పిల్లలు. అప్పుడా బొంగరం గిర్రున తిరగటం మొదలుపెడుతుంది. అలాగే కుమ్మరి తన కుమ్మరి సానను కొంతసేపు త్రిప్పి వదలిపెడతాడు. ఇలా బొంగరానికిగానీ కుమ్మరి సారెకుగానీ తిరగడం అన గుణం మొదట్లోనే సామాన్యంగా కలిగి వున్నప్పటికీ, అవి అలా తిరుగుతూనే ఆరంభంలో కొద్ది వేగంతో ఉండి క్రమక్రమంగా వేగాన్ని పుంజుకుంటాయి. అదేవిధంగా స్త్రీలు, పురుషులు మొదట తాకడం, కౌగిలించుకోడం, ముద్దుపెట్టుకోడం, గిచ్చడం, నొక్కడం, కొరకడం మొదలయిన చేష్టలు చేయడంవల్ల సామాన్యమైన స్ఖలన సుఖాన్ని పొందుతారు. సంభోగారంభంలో అతి వేగం వుండదు. అది మృదువుగా వుండి, ఒక మోస్తరు ఉత్సాహంతో ఉంటారు. అందుచేతనే నఖక్షత, దంత క్షతాలకు అంతగా తట్టుకోలేరు. కాని తరువాత సంభోగం సాగిస్తున్నప్పుడు క్రమక్రమంగా గాఢమైన రతివల్ల సుఖం పొందుతూ ఎక్కువ ఉత్సాహంతో పురుషుడు ఏం చేస్తున్నా, ఎలాంటి చేష్టలు చేస్తున్నా కిమ్మనకుండా సహిస్తూ మైమరచి ఉంటారు.

39. *ధాతుక్షయాచ్చ విరామా భీప్సేతి.*

అయితే, విరామం లేకుండా స్త్రీకి భావప్రాప్తి కలుగుతుందని అంటున్నారు గదా! అలాంటప్పుడు మళ్ళీ రతి విరమించాలనే కోరిక ఎందుకు కలగాలి?

అంటే, దానికి సమాధానం, సంభోగం చేయాలని బుద్ధి పుట్టిన వెంటనే శుక్ల ధాతువు తన స్థానం నుండి జారి, తాను స్రవించే నాడుల గుండా బయలుదేరి, సంభోగం ప్రారంభించినప్పటినుంచీ కొద్ది కొద్దిగా స్రవిస్తూ చివరకు పూర్తిగా ఆ ధాతువు క్షీణిస్తుంది. అప్పుడు ఇక సంభోగం చేయాలనిపించదు. విరమించాలని అనిపిస్తుంది.

*40. తస్మాదనాపేక్ష ఇతి.*

అందువల్ల పైన చెప్పిన బాభ్రవ్యుని వాదంలో ఆక్షేపణ ఎంత మాత్రం లేదు.

*41. సురతాంతే సుఖం పుంసాం స్త్రీణాంతు సతతం సుఖం,*
*ధాతుయనిమిత్తా చ విరామేచ్ఛోప జాయతే*

ఈ సూత్రాన్ని బాభ్రవ్యుడు వ్రాసిన శ్లోకాన్ని చూపి విస్పష్టం చేస్తున్నారు వాత్స్యాయనులు. పురుషులకు స్ఖలన సమయంలో మాత్రమే సుఖం కలుగుతుంది. స్త్రీలకు అలా కాదు రతి ప్రారంభం నుంచీ, రతి పూర్తయ్యేవరకు వారు తెంపులేని సుఖం అనుభవిస్తున్నారు. ధాతువు ఎప్పుడైతే పూర్తిగా క్షయమవుతుందో అప్పుడు స్త్రీకి రతినుంచి విరమించాలని బుద్ధి పుడుతుంది. ఇది బాభ్రవ్యుల మతం.

*42. తస్మాత్పురుషవదేవ యోషితోఽపి రసవ్యక్తిర్ద్రష్టవ్యా.*

ఇలా ఔద్దాలకి సిద్ధాంతాన్ని, బాభ్రవ్యుని మతాన్ని వివరించి ఇక, తన సిద్ధాంతాన్ని చెపుతున్నారు వాత్స్యాయనులు.

పైన వివరించిన వాదాలనుబట్టి పురుషుడికి లాగానే స్త్రీకి కూడా స్ఖలనసుఖం వుంది.

*43. కథం హి సమానాయామే వా కృతావేకార్థమభి, (పసన్న) యోః కార్యవైలక్షణ్యం ?*

అయితే, స్త్రీ పురుషుల ఆకారంలో భేదంలేదు. మరి, భోజనాది విషయాల్లో వలె కాకుండా, ఒక్క రతి విషయంలో మాత్రమే ఒకే విధంగా ప్రవర్తిస్తున్నప్పుడు ఫలితంలో తేడా ఎందుకు వస్తున్నది ?

*44. స్యాదుపాయ వైలక్షణ్యాదభి మానవైలక్షణ్యాచ్చ.*

ఎందుకంటారా ? వినండి - ఉపాయంలోనూ, అభిమానంలోనూ స్త్రీ పురుషులకు తేడా వుంది. అంచేత ఫలితంలోనూ కూడా వ్యత్యాసం వుంటున్నది.

*45. కథం ? 46. ఉపాయవైలక్షణ్యం తు*
*సర్గాత్కర్తాహి పురుషః ఆధికరణం యువతిః*

అదెలా సరిపోతుంది ? - స్త్రీ పురుషుల మధ్య ఉపాయ భేదం వున్నట్లు ఎంతగా నిరూపించినప్పటికీ, ఆ వ్యత్యాసం అనేది స్త్రీ పురుషులు కలిసి చేసే పనికి మాత్రం వ్యతిరేకం కాదు. స్త్రీ పురుషుల మధ్య ఉపాయభేదం అనేది ఈనాటిది కాదు. సృష్ట్యాదినుంచీ వస్తున్నదే. పురుషుడు కర్త. స్త్రీ ఆధారం. వీరిరువురూ అలా సృష్టించబడ్డారు.

*47. అన్యథాహి కర్తాక్రియా ప్రతి పద్యతః అన్యథా చాధారః*

ఇలా చెప్పకపోతే మరో ఇబ్బంది కూడా వుంది. అదేమిటీ అంటే, కర్త

ఎప్పుడూ క్రియనే చేస్తూ వుంటుంది. ఆధారమేమో కర్తచేసే క్రియనే పొందుతూ వుంటుంది. అందుచేతనే కర్త సాధనం (పురుషాంగం) పొడుగ్గాను, ఆధారం సాధనం (మదన గృహం) లోతుగాను వుంటున్నది. అంటే ఒకటి లోపల ఇముడ్చుకోదగినది గాను, మరొకటి ఇముడ్చుకునేది గాను వుంటున్నది. ఆ విధంగా క్రియలో సయితం తేడా అంగీకరించక తప్పదు. ఏం చేస్తాం? సృష్టిలోనే వచ్చిన భేదం ఇది!

*48. తస్మాచ్చోపాయ వైలక్షణ్యాత్, నర్గాదభిమాన వైలక్షణ్యమపి భవతి.*

అంచేత ఉపాయభేదం వల్ల ఇంతకుముందు చెప్పిన అభిమాన భేదమే కాకుండా కార్యభేదం కూడా సంభవిస్తున్నది.

*49. అభియోక్తాహమితి పురుషః అనురజ్యతే,*
*అభియుక్తాహమనే నేతి యువతిరితి వాత్స్యాయనః*

ఈమెతో నేను సంభోగిస్తున్నాను - అనుకుంటూ పురుషుడు స్త్రీని అభిమానిస్తూ సుఖసంతోషాలు పొందుతూ ఉన్నాడు. స్త్రీ కూడా నేను ఇతని చేత రమింపబడుతున్నాను - అనుకుంటూ అభిమాన పూర్వకమైన సుఖసంతోషాలు అనుభవిస్తూ వుంది. అందువల్ల అభిమానంతోనూ, అనురాగంతోనూ సంభోగంలో మునిగి వున్న స్త్రీ పురుషులు కాలాన్నిబట్టే, స్వరూపాన్ని బట్టే సరిసమానమైన భావాన్ని పొందుతూన్నారే తప్ప క్రియాభేదం వల్ల సుఖభేదం పొందడంలేదు. కాబట్టి తేడా అనేది స్త్రీ పురుషుల అభిమానాలలో మాత్రమే కనిపిస్తోంది. కార్యంలో ఏ మాత్రం భేదంలేదు. ఈ అభిప్రాయాన్నే ధ్రువీకరిస్తూ శాస్త్రకారుడు వాత్స్యాయనుడు తన సిద్ధాంతాన్ని వ్యక్తం చేశాడు. ఇక్కడ కార్యం అంటే సుఖం అని అర్థం చేసుకోవాలి.

## రతి సుఖం అంటే .....!

అందరి వాదాలూ పరిశీలించి తుదకు తన సిద్ధాంతాన్ని వాత్స్యాయనులు ప్రతిపాదించినప్పటికీ, ఇక్కడ కూడా ఒక సందేహం ఉత్పన్నమవుతూ వుంది.

*50. తత్రైతత్స్యాదుపాయ వైలక్షణ్య వదేవ హి కార్య*
*వై లక్షణ్య మపి కస్మాన్న స్యాదితి.*

అదేమిటీ అంటే - స్త్రీ పురుషుల రతి క్రీడకు సంబంధించిన పనిలో తేడా ఉన్నప్పుడు వారిద్దరూ పొందే సుఖసంతోషాలలో మాత్రం తేడా ఎందుకు ఉండదూ?

*51. తచ్చన*

రతి క్రీడల వల్లనే సుఖసంతోషాలు ఉత్పన్నమవుతున్నప్పుడు ఆ సుఖసంతోషాల్లో తేడా ఉందని ఎలా చెప్పుతాం? కాబట్టి ఒకరు రతి చేసేవారు, మరొకరు రతి చేయబడేవారు - ఈ విధంగా రతి క్రీడలోనే భేదం ఉందని తేలుతోంది.

*52. హేతు మదుపాయవై లక్షణ్యం.*

స్త్రీ పురుషుల రతి వ్యాపారంలో వున్నటువంటి తేడా సహేతుకంగానే కనిపిస్తోంది. కనుక, వ్యాపారంలోనే భేదంకాని, సుఖసంతోషాల్లో భేదం లేనేలేదు.

53. *తత్రకర్త్రాధారయోర్భిన్న లక్షణత్వాత్*

ఇలా ఉపాయ భేదం ఏర్పడడానికి కర్త, ఆధారం వేర్వేరు లక్షణాలు కలిగి ఉండడమే కారణం.

54. *అహేతుమత్కార్య వైలక్షణ్య మన్యాయ్యం స్యాత్.*

సుఖ సంతోషాలు స్త్రీ పురుషుల సంభోగ వ్యాపారంవల్ల పుట్టినవే అని చెప్పినా, కారణం వుంది కాబట్టి, ఈ వ్యాపారంలో తేడా ఉందని చెప్పారు. కారణం అనేది లేకుండా స్త్రీ పురుషుల సుఖ సంతోషాల్లో తేడా ఉందని చెప్పడం తెలివితక్కువే అవుతుంది.

55. *ఆకృతే రభేదాత్ ఇతి.*

ఇంతకుముందు చెప్పిన యుక్తినే ఇక్కడ జ్ఞప్తికి తెస్తున్నాడు వాత్స్యాయనుడు. ఒకే విధమైన లక్షణాలు కలిగి వున్న మానవజాతిలో, స్త్రీ పురుషులు ఒకరిపై ఒకరు ఆపేక్షతో చేసే పని ఏదైనా, కాలంవల్ల, స్వరూపంవల్ల ఒకే విధమైన - అంటే సమానమైన సుఖసంతోషాలనే కలుగజేస్తూ ఉన్నాయి.

56. *తత్రైతత్స్యాత్, సంహత్య కారకై రేకోర్థోఅభి నిర్వర్తతే,*

*పృథక్ పృథక్ స్వార్థ సాధకా పునర్నిమా, తదయుక్తమితి.*

పై విషయాన్ని ఇంకా ఇలా చెప్పవచ్చు. దేవదత్తుడు పొయ్యిలో కట్టెలుపెట్టి, పాత్రయందు అన్నం వండుతున్నాడు - అనే వాక్యం ఉన్నదనుకోండి. ఇందులో దేవదత్తుడు కర్త, పొయ్యి కట్టెలు సాధనాలు (కరణాలు) పాత్ర ఆధారం. ఈ విధంగా కర్త, కరణం, ఆధారం - అనే కారకాలు కలిసి అన్నం తయారుచెయ్యడం అనే కార్యం నెరవేర్చుకోడానికి స్త్రీ పురుషులు సంసిద్ధులవుతారు. అందులో స్త్రీ ఆధారంగా ఉండి, పురుషుడు సంభోగం చెయ్యాలనే పనిని ఆపేక్షించి, ఆ పనివల్ల కలిగిన సంతానం ద్వారా సుఖసంతోషాలనే స్వప్రయోజనాన్ని సాధించుకుంటున్నది. అలాగే పురుషుడు కూడా తాను కర్తగా ఉండి, స్త్రీని సంభోగించడం అనే వ్యాపారం అభిలషించి, తద్వారా లభించిన సంతానం వల్ల సుఖసంతోషాలనే స్వప్రయోజనాన్ని సాధించుకుంటున్నాడు. కాబట్టి కొన్ని కారకాలు ఏకమై, ఒకే విధమైన పనిని సాధిస్తాయి కాని, వేర్వేరు కార్యాలు ఎప్పుడూ సాధించవు. స్త్రీ పురుషులనే కారకాలు స్త్రీ సుఖం, పురుష సుఖం అనే వేర్వేరు కార్యాలు ఎలా సాధిస్తున్నాయో, అలాగే సమాన ఆకారాలు కలిగి ఉన్నా కాలంచేత, స్వరూపంచేత భేదంలేని కార్యరూపమైన సుఖసంతోషాలను స్త్రీ పురుషులు పొందుతున్నారని తాత్పర్యం.

57. *తచ్చ న.*

ఇది అయుక్తం కానే కాదు, యుక్తమే!

58. *యుగపద నేకార్థ సిద్ధి రపి దృశ్యతే, యథా మేషయో*

*రభిఘాతే కపిత్థయోర్భేదే మల్లయోర్యుద్ధ ఇతి.*

ఒకసారి అనేక కార్యాలు సిద్ధించడం కూడా లోకంలో చూస్తూఉన్నాము. ఎలాగంటారా? వినండి - రెండు పొట్టేళ్ళు ఒకదానితో ఒకటి ఢీ కొన్నప్పుడు, ఒక్కమాటుగానే రెంటికీ దెబ్బ తగలడమనే రెండు కార్యాలూ సిద్ధిస్తున్నాయి. అలాగే వెలక్కాయలు రెంటిని ఒకదానితో ఒకటి కొట్టినప్పుడు, ఒక్కసారే రెండూ పగలడం అనే రెండు కార్యాలు సిద్ధిస్తున్నాయి. అదే విధంగా మల్లయుద్ధంలో కూడా, ఇద్దరు మల్లులు తలపడినప్పుడు ఇద్దరికి ఒక్కమాటుగా దెబ్బతగలడమనే రెండు కార్యాలు సంభవిస్తున్నాయి. అలాగే కారకాలుగా ఉంటున్న స్త్రీ పురుషులకు సమాన స్వరూప స్వభావాలు గల సుఖ, సంతోషాలు విడివిడిగా కలగడంలో ఆశ్చర్యమేముందీ? ఇక్కడ పొటేళ్ళను, వెలక్కాయలను, మల్లయోధులను ఉదాహరణలుగా చెప్పడం దేనికీ అంటే, వరుసగా పశువుల్లోనూ, అచేతనాల్లోనూ, మనుష్యుల్లోనూ కూడా ఈ న్యాయం ప్రాప్తిస్తున్నదని స్పష్టం చేయడానికే.

*59. న తత్ర కారకభేద ఇతి చేత్ ?*

మరి పొట్టేళ్ళు మున్నగువాటిని తార్కాణాలుగా చెప్పినప్పుడు, అవి రెండూ కర్తలే కాబట్టి కారక భేధం లేదంటారా?- అని ప్రశ్న.

*60. ఇహాపి న వస్తుభేద ఇతి.*

కాని, స్త్రీ పురుషుల్లో కూడా నిజానికి కారక భేదం లేనేలేదు. స్త్రీ పురుషులనే ఇరువురు కర్తలు కలిసి, ఒకే కార్యాన్ని సాధిస్తున్నారు. ఇక ఒకరు కరణమూ, మరొకరు అధికరణమూ అనే తేడా కేవలం వ్యవహారం కోసమే బుద్ధితో కల్పించబడింది.

*61. ఉపాయవైలక్షణ్యం తు నర్గాదితి. తదభిహితం పురస్తాత్.*

ఈ విధంగా స్త్రీ పురుషులకు ఉపాయ భేదం అనేది సృష్టిలోనే ఉన్నదన్న విషయాన్ని చక్కగా స్పష్టం చేశారన్న మాట. ఇక కర్త, ఆధారము అనే లక్షణాలు కలవాటికే ఆ విధంగా ఉంటుందని ముందు ముందు నిరూపిస్తున్నారు శాస్త్రకారులు.

*62. తేనోభయోరపి నదృశీ నుఖ ప్రతిపత్తిరితి.*

ఇలా ఒకర్ని కర్తగానూ, మరొకర్ని ఆధారంగానూ చెప్పడం వల్లనే స్త్రీ పురుషులిరువురికీ కాల స్వరూపాలచేత సమానమైన సుఖ సంతోషాలు కలుగుతూ ఉన్నాయి. అలా కాకపోతే స్త్రీ పురుషుల అనురాగ జ్వరం, లేదా కామజ్వరం ఎలా శాంతిస్తుంది? ఒకానొక గొప్ప ఆనందానుభూతి కలిగింది కాబట్టే, స్త్రీ పురుషుల భగలింగాలను ఆనందేంద్రియాలని వర్ణించారు విజ్ఞులు.

*63. జాతే రభేదాద్దంపత్యోః నదృశం నుఖమిష్యతే,*
*తస్మాత్తథోపచార్యా స్త్రీ ఆయథా గ్రేప్రాప్నుయాద్రితిం.*

పైన చెప్పిన విషయాన్నే సూత్రకారులు శ్లోకంలో సారాంశంగా పేర్కొంటున్నారు. రతి సుఖం అనే విషయాన్ని మాత్రమే అభిలషిస్తున్న స్త్రీ పురుషులిద్దరికీ కూడా జాతి భేదం లేదు కాబట్టి, సుఖసంతోషాలు సమానంగానే

కలుగుతూ ఉన్నాయి. అంచేత స్త్రీ ఎలా చేస్తే ముందుగా రతి సుఖం పొందుతుందో, అలా ఉపచరించాలి పురుషుడు. అంటే, స్త్రీ పురుషుల్లో జాతి భేదాన్ని బట్టి స్త్రీకి కలిగే తీట తీరడమనే సుఖమూ, భగం ద్రవించడం, స్రవించడంవల్ల కలిగే సుఖమూ స్త్రీకి ముందుగా కలిగేలా పురుషుడు సంభోగం జరపాలన్నమాట. ఇక స్ఖలనసుఖం అంటారా ?- అది మాత్రం పురుషుడిలాగే స్త్రీకి కూడా రతి అంత్యకాలంలో సంభవిస్తుంది. దీన్నే పెద్దలు ఇలా చెప్పారు. దురదతీరడం వల్ల ఎడతెరిపిలేకుండా యోని స్రవించడం వల్లా స్త్రీకి రెండు రకాల సుఖం కలుగుతోంది. ఇహ స్ఖలనంలో కూడా కేవలం భగం చెమ్మగిల్లడం వల్ల క్లిన్నత్వం అనే సుఖమూ, మథించడంవల్ల విసృష్టి అనే సుఖమూ కలుగుతూ ఉన్నాయి. ఈ రెండు రకాల స్ఖలన సుఖాలుకూడా స్త్రీలకు మధ్య రతిలో మాత్రమే ప్రాప్తిస్తాయి. ఇహ రతి పూర్తి కాబొయ్యే తరుణంలో పురుషుడిలాగే స్త్రీకి కూడా స్ఖలనం జరుగుతూ ఉంది'' -

సంభోగం చివరి కాలంలో స్త్రీ పురుషులిద్దరికీ ఒక్కసారిగా స్ఖలనం జరిగితే, ఆ సంభోగం శ్రేష్ఠమైనదని అంటారు. అలాకాకుండా, ముందుగా పురుషుడికి వీర్యం స్ఖలనం అయితే వెంటనే మేహనం వాలిపోతుంది. ఎక్కువమంది పురుషుల్లో ఇలాగే జరుగుతూ ఉంటుంది. పురుషుడి లింగం దుర్బలమై, వాలిపోయిన తరువాత స్త్రీ భావప్రాప్తి పొందలేదు. అంచేత విషమరతుల్లో స్త్రీని మొదట ముద్దులతో, ఆలింగనాలతో, ఇంకా అలాంటి కామోద్రేకం కలిగించే ఇతర శృంగార చేష్టలతో ఉపచరిస్తే, ఆమెకు త్వరగా భావప్రాప్తి కలుగుతుంది. అలా భావప్రాప్తి పొంది, తృప్తిపడేలా స్త్రీని ఉపచరించాలి పురుషుడు. ఆమెలో అలాంటి ఉత్సాహం, ఉద్రేకం, భావప్రాప్తి పొందే అవకాశం కలిగిందని గ్రహించగానే పురుషుడు రతిలో వేగాన్ని అనుసరించాలి ఆ విధంగా ఆమెకూ, తనకూ కూడా భావప్రాప్తి పొందేలా చూడాలి.

64. *సదృశత్వస్య సిద్ధత్వాత్, కాలయోగీన్యపిన*
*భావతోపి కాలతః ప్రమాణవదేవ నవరతాని.*

ఇంతకూ సారాంశం ఏమిటి అంటే,

## రతిలో భావప్రాప్తి ఎప్పుడు, ఎలా ?

కాలాన్ని బట్టి భావాన్ని బట్టి కూడా స్త్రీ పురుషులకు సామ్యం వుంది. కాబట్టి కాల సంబంధమైన రతిలో కూడా తొమ్మిది రకాలుగా రతాలు వున్నట్టు తేలింది.

65. *రసో, రతిః, ప్రీతి, ర్భావో, రాగో, వేగః, సమాప్తి రితి రతి*
*పర్యాయాః సంప్రయోగో రతం రహః, శయనం మోహనం ఇతి సురతపర్యాయాః*

రసం, రతి, ప్రీతి, భావం, రాగం, వేగం సమాప్తి- ఈ పదాలన్నీ రతికి పర్యాయ పదాలు. అంటే అన్నింటికీ రతి అనే అర్థం. ఇది భావానికి అంటే అనురాగానికి సంబంధించిన విషయం. ఇక సంప్రయోగం, రహస్సు, శయనం,

మేహనం - ఈ పదాలన్నీ సురత క్రీడకు పర్యాయ పదాలు - అంటే సంభోగం అనే అర్థం. ఈ శాస్త్రంలో ఆయా పదాలను ఆయా అర్థాలలో ప్రయోగిస్తారన్న మాట.

66. *ప్రమాణకాలభావజానాం సంప్రయోగాణాం ఏకైకస్య*
*నవ విధత్వాత్తేషాం వ్యతికరే సురత సంఖ్యా*
*న శక్యతే కర్తు మతి బహుత్వాత్.*

స్త్రీ పురుషుల అంగ ప్రమాణాలను బట్టి, స్ఖలన కాలాన్ని బట్టి, జరిగే సంప్రయోగాల్లో ఒక్కొక్క రకానికి తొమ్మిది రతాలు ఏర్పడతాయి. ఆ విధంగా మొత్తం ఇరవై ఏడు రతాలు. ఆ రతాలు కూడా రెండు రకాలు. ఒకటి శుద్ధరతం, రెండు సంకీర్ణ రతం. శుద్ధరతాన్ని గురించి చెప్పడం సాధ్యంకాదు కాబట్టి కేవలం సంకీర్ణ రతాన్ని గురించే శాస్త్రకారులు చెపుతున్నారు. పైన చెప్పిన ఇరవై ఏడు సురతాలకూ వ్యతిరేకం కలిగినప్పుడు రతాల సంఖ్యను గురించి చెప్పడం విస్తారం కావడం చేత చాల కష్టం.

67. *తేషు తర్కాదుపచారాన్ ప్రయోజయేదితి వాత్స్యాయనః*

ఇలా అనేక రకాలుగా విభేదిస్తున్న సంకీర్ణ రతాల్లో ఉపచారాలనే వాటిని ఊహించుకుని ప్రయోగించాలని వాత్స్యాయనుల అభిప్రాయం.

68. *ప్రథమరతే చండవేగతా, శీఘ్ర కాలతా చ పురుషస్య*
*తద్విపరీత ముత్తరేషు, యోషితః*
*పునరే తదేవ విపరీత మాధాతుక్షయాత్.*

సామాన్యంగా మొదటిసారి రతిలో పురుషుడికి ఉత్సాహం, ఉద్రేకం, అధికంగా వుంటుంది. త్వరగా వీర్య స్ఖలనం జరుగుతూ వుంటుంది. రెండవసారి సంభోగంలో ఉత్సాహం, ఉద్రేకంగా వుండి వీర్య స్ఖలనం ఆలస్యంగా జరుగుతూ వుంటుంది. అయితే, స్త్రీలకు మాత్రం మొదటి సంభోగంలో ఉత్సాహం, ఉద్రేకం తక్కువగా వుండి, ఆలస్యంగా భావప్రాప్తి కలుగుతూ వుంటుంది. రెండో రతంలో ఉత్సాహం, ఉద్రేకం ఎక్కువగా వుండి, త్వరలో స్ఖలనం జరుగుతుంది. ఇలా ధాతువు (వీర్యం) క్షీణించేదాకా స్త్రీ పురుషుల ఉత్సాహ, నిరుత్సాహాలు, శీఘ్ర స్ఖలనాలు సంభవిస్తూ వుంటాయని తెలుసుకోవాలి.

69. *ప్రాక్చ స్త్రీధాతుక్షయాత్పురుష ధాతుక్షయ ఇతి ప్రాయోవాదః*

స్త్రీ కంటే ముందుగా పురుషుడికి వీర్యం స్ఖలనం అవుతుందనే మాట అంత సరియైంది కాదు. అంటే యుక్తి యుక్తమైంది కాదన్న మాట.

70. *మృదుత్వాదుపమృదుత్వాన్ని సర్గాచ్చైవ యోషితః,*
*ప్రాప్ను వంత్యాశుతాః ప్రీతి మిత్యాచార్యా వ్యవస్థితాః*

పురుషులలో వలెనే స్త్రీలలో కూడా శీఘ్ర వేగ, మధ్య వేగ, చిర వేగ అనే రకాలు ఇంతకుముందే చెప్పబడినవి. ఆ స్త్రీలు ఎవరో ఇక్కడ చెపుతున్నారు. మగువలు సహజంగా మృదు స్వభావం కలవారు. చుంబనాదుల చేత ఉప మృగమానలు.

అందుచేతనున్నా, సహజంగా స్వభావం చేత నన్నూ శీఘ్రంగా ప్రీతిని పొందుతున్నారని శాస్త్రకారులు చెప్పనే చెప్పారు.

71. *ఏతావదేవ యుక్తానాం, వ్యాఖ్యాతం సాంప్రయోగికం,*
*మందానామవబోధార్థం, విస్తరోஉతః ప్రవక్ష్యతే,*
*ఇతి ప్రమాణ, కాల, భావేభ్యో రతావస్థాపనం నామమష్ఠ ప్రకరణం.*

ఈ విధంగా బుద్ధి శాలుర కోసం రతావ స్థాపనంతో మాత్రమే సాంప్రయోగికాన్ని గురించి సంక్షిప్తంగా చెప్పారు శాస్త్రకారులు వాత్స్యాయనులు. ఇక మందబుద్ధులు సులభంగా తెలుసుకోడం కోసం విస్తరించి చెప్పబోతున్నారు. ప్రమాణ, కాల, భావాలను అనుసరించి, రతిని స్థాపించడం అనే ఆరో ప్రకరణం ఇది.

72. *అభ్యాసా దభిమానాశ్చ, తథా సంప్రత్యయాదపి,*
*విషయేభ్యశ్చ తంత్రజ్ఞాః ప్రీతి మాహుశ్చతుర్విధాం.*

కామశాస్త్రజ్ఞులు ప్రీతి అనేది నాలుగు రకాలని చెపుతున్నారు. అది అభ్యాసం, అభిమానం సంప్రత్యయం. విషయాలు అనే నాలుగు విధాలుగా లభిస్తుంది.

73. *శబ్దాభ్యో బహిర్భూతా, యాకర్మాభ్యానలక్షణా, ప్రీతి*
*స్సాஉభ్యాసికీ జ్ఞేయా, మృగ యాదిషు కర్మను.*

వేట మున్నగు పనులు చేస్తున్నప్పుడు సంగీతం లాంటి శబ్దాల మూలంగా వెలువడే కర్మాభ్యానం, లక్షణం వున్న ప్రీతిని అభ్యాసికి ప్రీతి అంటారు.

74. *అనభ్యస్తేష్వపి పురా, కర్మ స్వవిషయాత్మికా,*
*సంకల్పాజ్జాయతే ప్రీతిర్యా సా స్యాదాభిమానికీ.*

ఇంతకు ముందు అభ్యసించినా, అభ్యసించకపోయినా మనస్సులో పుట్టిన సంకల్పంవల్ల విషయాత్మికమైన ప్రీతి, కర్మయందైనా పుడితే, దాన్నే అభిమానిక ప్రీతి అంటారు.

75. *ప్రకృతేర్యా తృతీయాస్యాః స్త్రీయా శ్చైవోపరిష్టికే,*
*తేషు తేషు చ విజ్ఞేయా, చుంబనాదిషు కర్మను.*

ఈ అభిమానిక ప్రీతి అనేది ఈ శాస్త్రంలో ఎలా సంభవిస్తుందో ఇక్కడ చెపుతున్నారు. నపుంసకుడికీ, ముఖ చాపల్యం గల స్త్రీకి ఔపరిష్టిక రతి వల్ల, ఇంకా చుంబనం, ఆలింగనం మొదలైన కర్మలవల్ల కలిగే ప్రీతిని అభిమానిక ప్రీతి అంటారు.

76. *నాన్యోஉత మితి యత్రస్యా ధన్యస్మిన్ ప్రీతి కారణే, తంత్రజ్ఞైః*
*కథ్యతే సాஉపి ప్రీతి స్సంప్రత్యయాత్మికా.*

ఏ స్త్రీ అయినా ఏ పురుషుడితో గానీ, ఏ పురుషుడైన ఏ స్త్రీతో గానీ, సంభోగిస్తూ, తన చిత్తంలో వున్న మరో పురుషునిగానీ, మరో స్త్రీని గానీ భావించుకుంటూ అతనే ఇతను అని గానీ, ఆమెయే ఈమె అని గానీ ఆరోపించుకుని ప్రీతిని పొందడాన్ని సంప్రత్యయం అంటారు.

77. *ప్రత్యక్షా లోకతస్సిద్ధా, యాప్రీతిర్విషయాత్మికా,*
*ప్రధాన ఫలవత్త్వాత్సా, తదర్థాశ్చేతరా అపి.*

. లోకంలో ప్రత్యక్షంగా లభ్యమయ్యే శబ్దాది విషయ స్వరూపమైన ప్రీతి ప్రధాన ఫలం కాబట్టి, దాన్నే విషయ ప్రీతి అన్నారు.ఇంకా ఇతర రకాల ప్రీతులన్నీ కూడా దీనికి అంగప్రాయములైనవి.

78. *ప్రీతిరేతాః పరామృశ్య శాస్త్రత శ్శాస్త్రలక్షణాః యో యథా వర్తతే*
*భావస్తంతథైవ ప్రయోజ యేత్. ఇతి శ్రీ వాత్స్యాయనీయే, కామసూత్ర,*
*సాంప్రయోగికే, ద్వితీయేZధికరణే, ప్రమాణ భావకాలేభ్యో,*
*రతావస్థాపనం, ప్రీతివిశేషా ఇతి ప్రథమమోధ్యాయః*

శాస్త్రాన్ని అనుసరించి ఈ ప్రీతి విశేషాలను విచారణ చేసి, ఎవరి భావం ఏ ప్రీతి ఆశిస్తుందో ఆ భావాన్ని అనుసరించాలని చెపుతున్నారు శాస్త్రకారులు.

**ఇది వాత్స్యాయన ముని విరచిత కామ సూత్రాల్లోని సాంప్రయోగిక అధికరణంలో ప్రమాణాలకాల భావాల వల్ల రతావస్థాపనం చెయ్యడం, ప్రీతి విశేషాలు అనే మొదటి అధ్యాయం.**



# ద్వితీయాధ్యాయం
## ఆలింగన విచారం



రతి స్థాపనం, రతిలో భేదాలు, ప్రీతి, సంతుష్టి భావప్రాప్తి మొదలైన విషయాలు క్రిందటి అధ్యాయంలో విపులంగా చెప్పారు వాత్స్యాయనులు. ఇక ఈ అధ్యాయంలో రతికి అంగభూతమైన సంప్రయోగాన్ని గురించి చెప్పబోతూ వున్నారు.

*1. సంప్రయోగాంగం చతుష్షష్టి రిత్యా. చక్షతే చతుఃషష్టి ప్రకరణత్వాల్.*

సంప్రయోగం అంటే సంయోగం. దీనికి అంగభూతమైన మరో చతుష్షష్టి వుంది. అది అరవై నాలుగు ప్రకరణాలతో వున్నందున దాన్ని చతుష్షష్టి అన్నారు. ఈ చతుష్షష్టికి అంగభూతమైనది కూడా చతుష్షష్టి అనే ప్రాచీన ఆచార్యులు పేర్కొన్నారు. దాన్ని గురించే ఇక్కడ చెప్పడం జరుగుతూ వుంది.

*2. శాస్త్రమే వేదం చతుష్షష్టి రిత్యాచార్యవాదః.*

అసలు సంప్రయోగానికి అంగభూతమైన ఉపాయ శాస్త్రం ఒకటి వుంది. దానికి తంత్రా వాపకమని కూడా పేరు. ఈ తంత్రావాపకం అరవై నాలుగు సంఖ్య కలది కాబట్టి దీన్ని చతుష్షష్టి అంటున్నారని వాత్స్యాయనుల వాదం.

*3. కళానాం చతుష్షష్టిత్వా త్తాసాం చ సంప్రయోగాంగ*
*భూతత్వాత్కళా సమూహోవా చతుష్షష్టి రితి.*

అంతే కాకుండా, అసలు కళలనేవి అరవై నాలుగు. (చతుష్షష్టి) ఆ కళల సమూహమే సంప్రయోగానికి అంగం. అంచేత ఆ కళలకు సంబంధించి సంగ్రహంగా చెప్పిన స్వరూపాన్నే చతుష్షష్టి అని కూడా అనవచ్చు.

4. *ఋచాం దశతయానాం చ సంజ్ఞితత్వా దిహాఽపి తదర్థ*
*సంబంధాత్ పంచాల సంబంధాచ్చ బహ్వృచైరేషా*
*పూజాఽర్థం సంజ్ఞా ప్రవర్తితే త్యేకే.*

ఆలింగనం, చుంబనం, దంతక్షతం, నఖక్షతం, సీత్కారం, పాణిఘాతం, సందశనం, ఉపసృతం, ఔపరిష్టకం వరాయితం - ఈ పది అంగాలతో ఋగ్వేదంలో ఋక్కులున్నాయి. వాటికి చతుష్షష్టి అనే సంజ్ఞ వుంది. ఇక్కడ కూడా దాంతో సంబంధం వుంది కనుక, పంచాలుడనే మహర్షి ఋగ్వేదంలో ఈ చతుష్షష్టిని గురించి అనేక ఋక్కులతో చెప్పాడు కనుకా, పాంచాల దేశీయుడైన బాభ్రవ్యుడు సాంప్రయోగం అనే తన గ్రంథంలో ఈ చతుష్షష్టి గురించి వివరించాడు కనుకా, పాంచాల ఋషికీ, ఈ బాభ్రవ్యుడికీ గోత్ర సంబంధం వుంది కనుకా, గౌరవంకోసం ఈ సంజ్ఞ ఏర్పడిందని కొందరి అభిప్రాయం.

5. *ఆలింగన, చుంబన, నఖచ్ఛేద్య, దశనచ్ఛేద్య, సంవేశన, సీత్కృత, పురుషాయి,*
*తౌపరిష్టికానామష్టానా మష్టధా వికల్పా భేదా దష్టావష్టకాశ్చతుష్షష్టి రితి బాభ్రవీయాః.*

అయితే, బాభ్రవీయుని శిష్యులు ఈ చతుష్షష్టి అనేదాన్ని ఒక విధంగా సమర్థిస్తున్నారు. ఆలింగనం అంటే కౌగలించుకోడం, చుంబనం అంటే ముద్దు పెట్టుకోడం, నఖచ్ఛేద్యం అంటే గోళ్ళతో గిచ్చడం లేదా తిన్నగా రక్కడం, దశనచ్ఛేద్యం అంటే పళ్ళతో కొరకడం, సంవేశనం అంటే తత్తరపాటుతో పడుకోవడం, సీత్కృతం అంటే చలిగా వున్నప్పుడు వణికినట్లుగా రతి సమయంలో రకరకాలుగా ధ్వని చేయడం, పురుషాయితం అంటే ఉపరతి. (ఇంకా చెప్పాలంటే స్త్రీ పురుషుడిపై పడుకుని, పురుషుడిలా రతిక్రియ సలపటం). ఔపరిష్టం అంటే నోట్లో నోరు పెట్టడం - ఈ ఎనిమిది రకాల పనులూ ఒక్కొక్కటి ఎనిమిది విధాలుగా వున్నాయి. ఆ విధంగా ఎనిమిది ఎనిమిదులు అరవైనాలుగు. అందువల్ల వీటికి చతుష్షష్టి అనే పేరు వచ్చిందని బాభ్రవ్యుని అనుచరులు చెబుతున్నారు.

6. *వికల్పావర్గాణాం అష్టానాం న్యూనాధికత్వ దర్శనాత్ ప్రహణన, విరుత,*
*పురుషోపసృప్త, చిత్రరతాదీనామన్యేషామపి వర్గాణాం ఇహ ప్రవేశనాత్*
*ప్రాయోవాదోఽయం, యథా సప్తపర్ణోవృక్షః, పంచవర్ణోబలిరితి వాత్స్యాయనః*

పైన చెప్పిన బాభ్రవీయుల అభిప్రాయంతో వాత్స్యాయనులు ఏకీభవించడం లేదు. ఆలింగనం మొదలైన ఎనిమిది క్రియలూ బాభ్రవీయులు చెప్పినట్లుగా ఒక్కొక్కటి ఎనిమిది రకాలు కావడం లేదు.

ఆలింగనంలో అనేక రకాలున్నాయి. పురుషాయితంలో అన్ని భేదాలు లేవు. చాలా తక్కువ. ఇలా హెచ్చు, తగ్గు భేదాలు ఉండడం వల్లా, ప్రహణనం, విరుతం, పురుషోపసృప్తం, చిత్రరతం మొదలైన ఇతర రకాలు కూడా వీటిలో చేరడంవల్లా ఈ చతుష్షష్టి అనే పేరు అనుకోకుండా సామాన్యంగా వచ్చిందేకాని,

అర్థవంతమైనది కాదని వాత్స్యాయనులు స్పష్టం చేస్తున్నారు. ఇందుకు ఉదాహరణలు కూడా చెప్పారు ఈ శాస్త్రకారులు. ఒక చెట్టును 'సప్తవర్ణి' అని (ఏడాకులు కలది) అన్నంతో చేసే బలికర్మను 'పంచవర్ణ' అని (అయిదు రంగులు కలది) పిలవడం లాంటిదే ఇది కూడా, అంటే ఇక్కడ చెట్టుకు ఏడాకులూ, అన్నానికి అయిదు రంగులూ లేకపోయినా ఈ పేర్లు వచ్చాయి. అలాగే చతుష్షష్టి అనే పేరు సామాన్యంగా వచ్చిందేకాని, అర్థవంతమైంది కాదంటారు వాత్స్యాయనులు.

## కౌగిలింతలు, కౌగిలింతలు....పులకింతలు

*7. తత్రాసమాగతయోః ప్రీతిలింగ ద్యోతనార్థం ఆలింగనచతుష్టయం,*
*స్పృష్టకం, విద్ధకం, ఉద్ఘృష్టకం, పీడితకమితి.*

పాంచాలికీ చతుష్షష్టి కళలను గురించి చెపుతున్నారు. ఇక్కడ ఆలింగనం గురించి విచారణ చేస్తున్నారు.

ప్రేమికులు మొదట చేయవలసిన పని ముద్దు పెట్టుకోవడంకాదు. మొదట కౌగిలించుకోవాలి. ఆ తరువాత ముద్దు పెట్టుకోవాలి. అంతకు ముందు ఆలింగన సుఖం ఎరుగని ప్రేమికులకు కౌగిలించుకోవాలనే కుతూహలం కలుగుతుంది. అలాంటి ఉత్సుకత ఉన్న స్త్రీ పురుషులు తమ ప్రేమను సూచించుకోడానికై ఒకరినొకరు కౌగిలించుకుంటారు. ఈ ఆలింగనం నాలుగు రకాలుగా వుంటున్నది.

1. స్పృష్టకం - అంటే ఒకరి నొకరు స్పృశించడం.
2. విద్ధకం - అంటే ఒకరి నొకరు గట్టిగా నొక్కుకోడం.
3. ఉద్ఘృష్టము - అంటే ఒకరినొకరు గట్టిగా రాచుకోడం.
4. పీడితకం - అంటే ఒకనొకరు గాఢంగా ఒత్తుకోడం.

*8. సర్వత్ర సంజ్ఞాఽర్థేనైవ కర్మాతిదేశః.*

ఈ శాస్త్రంలో అన్ని చోట్లా అర్థాన్ని బట్టే పేర్లను నిర్ణయించారు. అంటే వాటి పేర్లే, ఆయా పనులను సూచిస్తాయన్న మాట.

*9 సంముఖాగతాయాం ప్రయోజ్యాయాం అన్యాపదేశేన గచ్ఛతో*
*గాత్రేణ గాత్రస్య స్పర్శనం స్పృష్టకమ్.*

స్త్రీ తనకు ఎదురుగా వస్తున్నప్పుడు, పురుషుడు ఏదో పనిమీద పోతున్నట్లు ఆమె ప్రక్క గుండా వెడుతూ, తన శరీరాన్ని ఆమె శరీరానికి తాకేలా చెయ్యాలి. దీన్నే స్పృష్టకం అంటారు. ఇలా చేయడంవల్ల స్త్రీ పురుషులిద్దరికీ శరీరాలు జలదరిస్తాయి. పులకింతలు పుడతాయి. ప్రేమ అంకురించి, వృద్ధి పొందడానికి ఇది హేతువవుతుంది.

*10. ప్రయోజ్యం నాయికా స్థిత ముపవిష్టం వా విజనే కించిద్గృహ్ణతీ*
*పయోధరేణ విధ్యేన్నాయకోఽపి తామవపీడ్య గృహ్ణీయాదితి విద్ధకం.*

ఎవరూ లేని ప్రదేశంలో ప్రేమికుడు నిలువ బడి ఉన్నప్పుడు గాని, కూచుని ఉన్నప్పుడు గాని ప్రేయసి, అతని దగ్గర ఏదో వస్తువును అందుకునే దానిలా అతన్ని సమీపించి, అతని తన పాలిండ్లతో కుమ్మాలి. అప్పుడు ప్రియుడు

కూడా ప్రేయసిని గట్టిగా నొక్కాలి. దీన్నే విద్ధకం అంటారు. ఈ చర్యవల్ల మరికొంత కామోద్రేకం కలుగుతుంది.

*11. తదుభయ మనతిప్రవృత్త సంభాషణయోః.*

పైన చెప్పిన ఈ రెండు రకాల కౌగిలింతలు, అంతకు ముందు అంతగా పరిచయం లేని స్త్రీ, పురుషులు ఉపయోగించుకునేవి. మొదటిది పురుషుడు ప్రయోగించేది, రెండోది స్త్రీ ప్రయోగించేదీను. అంతుకుముందే బాగా పరిచయం వుండి, మాటలు కలిపిన ప్రేమికులకు ఈ రకమైన ఆలింగానాలు ప్రయోగించడం కుదరదు.

*12. తమసి జనసంబాధే విజనే వాZథ శనకైర్గచ్ఛతోర్నాతి హ్రస్వ*
*కాల ముద్ఘ రణం, పరస్పరస్య గాత్రాణా ముద్ఘృష్టకమ్.*

జన సమూహంలో ఇలాంటి పనులు చేసినా ఎవరూ అనుమానించరు. అలాగే జనశూన్యమైన ప్రదేశంలోనూ ఎలాంటి ఇబ్బందీ వుండదు అంచేత ప్రేయసీ ప్రియులు కలిసి నెమ్మది నెమ్మదిగా నడుస్తూ, ఒకరి శరీరం ఒకరి శరీరానికి అనేకసార్లు రాచుకునేలా ప్రవర్తించడాన్ని ఉద్ఘర్షణం అంటారు. ప్రేయసిని ప్రియుడూ, ప్రియుణ్ణి ప్రేయసీ ఒకరిశరీరాన్ని ఒకరు గట్టిగా రాచుకోవడాన్ని ఉద్ఘృష్టకం అంటారు.

*13. తదేవ కుడ్యసందంశేన స్తంభసందం శేన, వాస్ఫుటక మవపీడయేదితి పీడితకమ్.*

పైన చెప్పిన ఉద్ఘృష్టక ఆలింగనాన్నే మరో విధంగా కూడా చేయవచ్చు. స్త్రీని ఒక గోడకు గానీ లేదా స్తంభానికి గానీ ఆనించి, పై విధంగా చేయడాన్ని స్ఫుటకం అంటారు. అదే పని ఇంకా గాఢంగా నొక్కి చేస్తే పీడితకం అంటారు.

*14. తదుభయ మవగత పరస్పరాకారయోః.*

ఈ రెండు రకాల ఆలింగనాలు స్త్రీ పురుషులు ఒకళ్ళ విషయం ఒకరికి బాగా తెలిసిన తరువాత నిర్భయంగా, నిస్సంకోచంగా ఆచరించేవి.

*15. లతావేష్టితకం, వృక్షాధిరూఢకం, తిలతండులకం,*
*క్షీరనీరకమితి చత్వారి సంప్రయోగకాలే.*

ఇంకా నాలుగు రకాల కౌగిలింతలున్నాయి. అవి (1)లతా వేష్టితకం (2)వృక్షాధి రూఢకం (3) తిలతండులకం (4) క్షీరనీరకం.

ఈ నాలుగు రకాల ఆలింగనాలు స్త్రీ పురుషులు సంభోగ సమయంలో ఆచరించేవి. మొదటి రెండు స్త్రీ ఉపయోగిస్తుంది. తక్కిన రెండు ఇద్దరూ ప్రయోగించవచ్చు.

*16. లతేవ శాలమావేష్టయంతీ చుంబనార్థం ముఖమవనమయే,*
*దుద్ధృత్య మందసీత్కృతా తమాశ్రితా వా*
*కించిద్రామణీయకం పశ్యేత్తల్ల తా వేష్టితకమ్.*

ఈ నాలుగు అలింగనాల్లో మొదటిదైన లతా వేష్టితకాన్ని గురించి ఇక్కడ చెప్తున్నారు. తీగలు చెట్టుకు చుట్టుకున్నట్లుగా, స్త్రీ పురుషుడికి ఎదురుగా వుండి అతన్ని తన బాహు లతలతో చుట్టివేయాలి. అతని ముఖాన్ని ముద్దాడవలెనన్న

కుతూహలంతో, పైకి ఎగబ్రాగుతూ, తన ముఖం పైకెత్తి, అతని ముఖాన్ని క్రిందికి వంచి, మెల్ల మెల్లగా సీత్కారం చేస్తూ (ఇస్,ఇస్ అని ధ్వని చేస్తూ) అతన్ని గాఢంగా రొమ్ములకు హత్తుకుని, అందాన్ని త్రాగుతున్నట్లుగా అతని ముఖంలోకి తదేకంగా చూస్తూ వుండడాన్ని లతావేష్టితకం అంటారు.

*17. చరణేన చరణమాక్రమ్య ద్వితీయ చరణే నోరుదేశ మాక్ర మంతీ,*
*వేష్టయంతీ వా తత్పృష్ఠసక్తైక బాహుర్ద్వితీయే నాంస మవనమయంతీ ఈ*
*షన్మంద సీత్కృతకూజితా చుంబనార్థమే వాధిరోఢు మిచ్ఛేదితి వృక్షాధి రూఢకమ్.*

ప్రేయసి తన కాలితో ప్రియుడి కాలు నొక్కి పట్టి, రెండో కాలు అతని తొడ మీదిగా నడుమును చుట్టిగానీ, కమ్ముకుని గానీ నిలిచి వుండి, ఒక బాహువును అతని వీపు వైపుగా చుట్టి కౌగిలించుకోవాలి. రెండో బాహువుతో ప్రియుడి మెడ వంచుతూ కొద్ది కొద్దిగా సీత్కారంచేస్తూ ముద్దు పెట్టుకోడానికై చెట్టు ఎక్కినట్లుగా ప్రియుడిపైకి ఎక్కడానికి ప్రయత్నిస్తే దాన్ని వృక్షాదిరూఢకం అంటారు.

*18. తదుభయం స్థితకర్మ.*

పైన చెప్పిన రెండు రకాల ఆలింగనాలూ స్త్రీ పురుషులు ఒకరిపై ఒకరికి ప్రేమానురాగాలు బాగా వృద్ధి పొందడానికై నిలుచుండి చేసేవి.

*19. శయనగతా వేవ ఊరు వ్యత్యానం భుజ వ్యత్యానం చ స*
*సంఘర్ష మివ ఘనం నన్వజేతే తత్తిలతండులకమ్.*

స్త్రీ పురుషులు ఒకరికొకరు ఎదురుగా శయ్యపై ఒత్తిగిలి పరుండి, ఒకరి తొడతో ఒకరి తొడనూ, ఒకరి బాహువుతో ఒకరి బాహువునూ గట్టిగా కౌగిలించుకొని వుండడాన్ని తిల తిండులకం అంటారు.

*20. రాగాంధా వన పేక్షి తాత్యయే పరస్పర మను విశత ఇవ ఉత్సంగ*
*గతాయా ముభిముఖోపవిష్టాయాం శయనే వేతి క్షీర జలకమ్.*

అధికమైన రాగానురాగాలతో వళ్ళు తెలియకుండా, ఎముకలు విరుగుతాయో మోనని కూడా ఆలోచించకుండా తన తొడ మీద గానీ, ఎదురుగా గాని కూచుని వున్నప్పుడైనా, పడుకుని ఉన్నప్పుడైనా స్త్రీ పురుషులు ఒకరి నొకరు కౌగిలించుకోడాన్ని క్షీర జలకం అంటారు. ఈ కౌగిలింత పాలు, నీళ్ళు కలిసి నట్లుంటుంది.

*21. తదు భయం రాగకాలే*

పైన చెప్పిన ఈ రెండు ఆలింగనాలూ పురుషుడి అంగం స్తంభించి, బిర్ర బిగిసి రతికి సంసిద్ధమై వున్నప్పుడు, స్త్రీ మర్మావయం ద్రవించి సంభోగం కోరుతూ ఉన్నప్పుడు, రతి ప్రారంభించడానికి ముందు చేసే ఆలింగనాలు.

*22. ఇత్యుపగూహన యోగా బాభ్రవీయాః*

ఈ కౌగిలింతలు బాభ్రవీయులు చెప్పినవి.

*23. సువర్ణ నాభస్య త్వధిక మేకాంగోప గూహన చతుష్టయమ్.*

ఇవి కాకుండా సువర్ణ నాభుడు మరికొన్ని కౌగిలింతలు చెప్పాడు. అది ఒక అవయవంతో మాత్రమే చేసే ఆలింగనాలు. అవి అదనంగా చెప్పినవన్నమాట.

24. *తత్రోరు సందేశేనైక మూరు మూరు ద్వయం వా సర్వప్రాణం పీడయే ది త్యూరూపగూహనమ్.*

పురుషుడు తన రెండు తొడలతోనూ, స్త్రీ ఒక తొడను గానీ లేదా రెండు తొడలను గానీ తన శక్తి కొలదీ గట్టిగా బిగించి నొక్కితే దాన్ని ఊరూప గుహనం అంటారు.

25. *జఘనేవ జఘన మవ పీడ్య ప్రకీర్య మాణకేశ హస్తానఖ దశన, ప్రహణన, చుంబన ప్రయోజనాయ తదవరి లఘయేత్తజ్జ ఘనోవ గూహనమ్.*

ఈ గుహనం అనేది రెండు విధాలుగా వుంది. స్త్రీ పురుషులు ఒకరి కొకరు ఎదురుగా శయ్యపై ఒత్తిగిలి పరుండినప్పుడు స్త్రీ పురుషుడి మర్మాంగాన్ని పట్టుకుని తన భగానికి తాకించుకుంటూ వుండడం ఒక రకం. ఇలా భగ లింగాలు తాకే ప్రసక్తి ఉన్నా, లేకున్నా స్త్రీ, పురుషుడి బొడ్డు క్రింద భాగాన్ని తన తొడలతో గట్టిగా బిగించి పట్టుకుని, సంతోషాతి రేకంలో కేశాలు ముడివీడి పోయిన సంగతి కూడా తెలుసుకోకుండా, నఖక్షతాల కోసం, దంకా క్షతాల కోసం, ప్రణయ తాడనాల కోసం పురుషుడిపై ఆరాటంతో దూకుతూ వుంటుంది. దీన్ని జఘనోప గూహనం అంటారు. ఈ రెండు రకాల ఉప గూహనాలతోనూ స్త్రీ యోని, మహామంజూల మనోజ్ఞమై శోభిస్తుంది. ఈ సమయంలో కాంత తన మదన మందిరాన్ని దాచకుండా స్వేచ్ఛగా, విప్పార్చి ఉంచితే ఇంకా బాగుంటుంది.

26. *స్తనా భ్యా మురః ప్రవిశ్య తత్రైవ భార మారోపయే దితి స్తనా లింగనమ్.*

పురుషుడు కూచుని వున్నా, లేక ఒత్తిగిలి పడుకుని వున్నా స్త్రీ అతనివైపు తిరిగి, తన వెన్ను విరిచి, తన చన్నులతో అతని రొమ్మును అదుముతూ అతని కౌగిట్లో వాలిపోయి, అతని వక్షస్థలంపై తన వక్షోజాల భారాన్ని మోపితే, దాన్ని స్తనాలింగనం అంటారు, మరోరకంగా చెప్పాలంటే ఇది చన్నులతో కౌగలించుకోవడం అన్న మాట.

27. *ముఖే ముఖ మానజ్యాక్షిణీ అక్షోర్ల లాటేన లలాట మా హన్యాత్సాలాలాటికా*

ముఖంలో ముఖం పెట్టి, కళ్ళల్లో కళ్ళుపెట్టి, ఫాలభాగాన్ని ఫాలభాగంపై మోపడాన్ని లాలాటికం అంటారు. స్త్రీ పురుషులు ఒకరి ముఖ సౌందర్యాన్ని ఒకరు త్రాగుతూ ఉన్నట్టుంటుంది ఇది.

28. *సంవాహన మప్యుపగూహన ప్రకార మిత్యే కే మన్యంతే సం స్పర్శత్వాత్*

ఇది ఒకరకమైన సంవాహన క్రియ. స్త్రీ పురుషుల అవయవాలన్నీ - చర్మం, కండరాలు, మాంసం, ఎముకలు ఇవన్నీ రాచుకుంటున్నప్పుడు, కాళ్ళు మొదలైనవి పిసుకుతున్నప్పుడు, ఒక విధమైన సుఖం హాయి కలుగుతాయి. ఇది స్పర్శ సుఖం.

29. *పృథక్కాలత్వా ద్భిన్న ప్రయోజనత్వా, దసాధారణత్వా న్నైతి వాత్స్యాయనః*

అధికమైన స్పర్శ సుఖం పై సంవాహన క్రియను గురించి కొందరు చెపుతారు. కాని, వాత్స్యాయనులు దీన్ని అంగీకరించరు. దీన్ని ఉపగూహన సమయంలో కాకుండా, వేరే సమయాల్లో ఉపయోగించాలంటారాయన. దీని ప్రయోజనం కూడా వేరే అని చెపుతారు. అంచేత ఈ సంవాహన క్రియ ఉపగూహనంలో చేరదని ఆయన మతం. ఈ ఉపగూహనం అనేది ఎప్పుడైనా సరే, స్త్రీ పురుషుల్లో ఎవరు ప్రయోగించినా, ఇద్దరికీ సుఖం కలుగుతుంది. మరి సంవాహనం అలా కాదు. పురుషుడు చేస్తే స్త్రీకి, స్త్రీచేస్తే పురుషుడికి మాత్రమే సుఖం కలుగుతుంది. అంచేతనే దీన్ని అసాధారణం అన్నారు వాత్స్యాయనులు.

*30. పృచ్ఛతాం, శ్రుణ్వతాం వాపి, తథా కథ యతా మపి,*
*ఉప గూహ విధిం కృత్స్నం, రి రంసా జాయతే నృణామ్.*

ఈ రకరకాల కౌగిలింతలను గురించి తెలుసుకోవాలని అడుగుతూ వుంటారు చాలామంది. కొందరు వాటిని గురించి చెపుతూ వుంటారు. పలువురు ప్రక్కనే వుండి ఆసక్తితో వింటూ ఉంటారు. ఇలా అడిగే వాళ్ళకు, చెప్పేవాళ్ళకూ, వినే వాళ్ళకూ - అందరికి కూడా సంభోగం చేయాలన్న కోరిక పుడుతుంది. అలాంటప్పుడు సంభోగ సమయంలో వీటిని ఆచరిస్తూ వుంటే స్త్రీ పురుషులకు రతి చెయ్యాలని కోరిక పుడుతుందని వేరే చెప్పాలా ?

*31. యే పిహ్య శాస్త్రితాః కేచిత్ సంయోగా రాగ వర్ధనాః*
*ఆదరేణైవ తేZన్యత్ర ప్రయోజ్యాః సాంప్రయోగికాః*

ఈ శాస్త్రంలో చెప్పిన ఆలింగనాలే కాక మరికొన్ని రకాల కౌగలింతలు కూడా లోకంలో ఉండవచ్చు. అనుభవంలో వున్న వాటిని గురించి తెలుసుకుని, ఎవరి ఇష్టాన్ని బట్టి వారు ప్రయోగించుకోవచ్చు. అవి కూడా సాంప్రయోగికాల్లోనే చేరతాయి. అంటే అవి కూడా సంభోగానికి ప్రోత్సాహకరాలుగా వుంటాయన్నమాట.

*32. శాస్త్రాణాం విష యస్తావత్ యావన్మంద రసానరాః*
*రతిచక్రే ప్రవృత్తేతు, నైవ శాస్త్రం నచక్రమః*

శాస్త్రాలో చెప్పని వాటిని ప్రయోగించడం ధర్మమేనా ?- అని ప్రశ్నించవచ్చు. తెలియని విషయాన్ని తెలియజెప్పి, మానసిక మాంద్యాన్ని తొలగించి, చురుగుదనం పుట్టించడానికే శాస్త్రం. అంతేకాని, సంభోగంలోకి దిగిన తరువాత ఈ శాస్త్రాలు, ఉపదేశాలు అవసరంలేదు. ఈ క్రమపద్ధతీ అక్కర్లేదు. అనుభవమే పెద్ద శాస్త్రం.

*ఇతి వాత్స్యాయనీయే, కామ సూత్రే, సాంప్రయోగికే,*

*ద్వితియేZధికరణే, ఆలింగన విచారో నామ ద్వితీZ అధ్యాయః*

ఇది వాత్స్యాయనముని విరచిత కామ సూత్రాలలోని సాంప్రయోగికం అనే రెండవ అధికరణంలో ఆలింగన విచారం అనే రెండవ అధ్యాయం.

# తృతీయాధ్యాయం
## చుంబన వికల్పం

*1. చుంబన నఖ దశనచ్ఛే ద్యానామ్ పౌర్వాపర్యమస్తిరాగ యోగాత్*

**ముద్దు ముందా,** కౌగిలింత ముందా అన్న సందేహం రావచ్చు ఎవరికైనా. ఆలింగనం తరువాతనే ముద్దు - అంటున్నారు శాస్త్రకారులు. ఇంతకు పూర్వం అధ్యాయంలో చెప్పినట్లుగానే స్త్రీని మొదట బిగియార కౌగలించుకుని తరువాత ముద్దు పెట్టుకోవాలి. అటుపిమ్మట నఖక్షతాలు, దంతక్షతాలూనూ. ప్రేమానురాగం అంతకంతకూ వృద్ధిపొంది, అసలు సృష్టి కార్యాన్ని ఆరంభించడానికి అనువుగా ఇలాంటి శృంగార చేష్టలకు ఒక క్రమం చెప్పారు శాస్త్రకారులు. ప్రేమికులకు ఇంతకుముందే బాగా పరిచయం వుండి, అనురాగం అధికమై వుంటే, అప్పుడు కూడా పురుషుడు ఈ క్రమపద్ధతిని పాటించనక్కరలేదు - అని సమాధానం.

*2. ప్రాక్సం యోగాదేషాం ప్రాధాన్యేన ప్రయోగః*
*ప్రహణ సీత్కృత యోశ్చ సంప్రయోగే.*

ఇప్పుడిక సంభోగాన్ని లేదా సంయోగాన్ని గురించి చెపుతున్నాడు వాత్స్యాయనుడు. పురుషుడు తన మర్మాంగాన్ని స్త్రీ మదనమందిరంలో ప్రవేశపెట్టడమే సంయోగం లేదా సంభోగం. ఈ పనిచేయడానికి ముందు కౌగిలింతలూ, ముద్దులూ ఎక్కువగా ప్రయోగిస్తే స్త్రీకి అనురాగం వృద్ధి అయి, కామోద్రేకం కలుగుతుంది. సంభోగం జరిపేటప్పుడు ప్రణయతాడనాలూ, సీత్కృతాలూ చెయ్యాలి. ఇలా చేయడం వల్ల కామోద్రేకంలో ఉన్న స్త్రీ, పురుషుడు గట్టిగా గిచ్చినా, కొరికినా, చిన్న చిన్న దెబ్బలు కొట్టినా ఓర్చుకోగలుగుతుంది. ఆమెకు ఎలాంటి బాధ అనిపించదు. ఈ చిరుదెబ్బలకే ప్రణయ తాడనాలంటారు. వీటిని మరీ ఎక్కువగా ప్రయోగిస్తే, స్త్రీకి సీత్కారాలు కూడా ఎక్కువవుతాయి. ఇది కొందరు శాస్త్రజ్ఞులు వెలిబుచ్చిన అభిప్రాయం.

*3. సర్వం సర్వత్ర రాగస్యా నపేక్షితత్వా దితి వాత్స్యాయనః*

చాలాసేపు సంభోగం చేయగలపురుషుడు ప్రియురాలిని మొదట ముద్దు పెట్టుకుని, అటుపైన కౌగలించుకోడం లాంటి చేష్టలు చెయ్యాలని వాత్స్యాయనులు అంటారు. చుంబనం, ఆలింగనం, దంతక్షతం, నఖక్షతం, ప్రణయ తాడనం - వీటిని చుంబన పంచకం అంటారు. ఎక్కువసేపు రతి చెయ్యగల పురుషుడు ప్రధానంగానో అప్రధానంగానో చుంబనాది పంచకాన్ని ప్రయోగించడాన్ని విధిగా కోరితీరతాడు. ఇక మందవేగుడూ, మధ్యవేగుడూ - వీరిరువురూ మాత్రం వీటిని ముందుగానే ప్రయోగించాలని వాత్స్యాయనుల మతం.

*4. తాని ప్రథమ రతే నాతి వ్యక్తాని విస్రబ్ధికాయాం*
*వికల్పేన చ ప్రయుంజీత, తథా భూతత్వాద్రాగస్య.*

అయితే, ఈ క్రింది చెప్పబోయే విశేషం మాత్రం ఉభయపక్షాల లోనూ సమానమే. రతి ప్రారంభంలో చుంబనాదులను ఎక్కువ స్పష్టం కాకుండా ప్రయోగిస్తూ, తొందరపడకుండా, నాయిక కొంత తనకు అనుకూలురాలైన తరువాత 'ఏం చేయమంటావు, 'ఇది కావాలా, అది కావాలా ?' - అని అడిగి, ఆమె ఇష్టాయిష్టాలను అనుసరించి ముద్దులు మున్నగువాటిని ఎక్కువగా ప్రయోగించాలి. అలా చేస్తే రతి ప్రారంభించినపుడు కొద్దిగా వున్న ప్రేమానురాగాలు స్త్రీలో క్రమక్రమంగా వృద్ధిపొందుతాయి.

*5. తతఃపర మతి త్వరయా విశేష వత్స), ముచ్చ)యేన రాగసంధు క్షణార్థమ్*

రతి ప్రారంభంలోకన్నా మధ్య కాలంలో ప్రేమానురాగాలు ఎక్కువగా వుంటాయి. మైమరపు కలుగుతుంది. అందుచేత దానికి తగినట్లుగా తొందర తొందరగా ముద్దులూ, నఖక్షతాలూ, దంతక్షతాలూ, ప్రహణనాలూ, సీత్కృతాలూ ఎక్కువగా ప్రయోగించవలసి వుంటుంది. అలా ప్రయోగించినప్పుడే ప్రేమానురాగాలు అధికమవుతాయి. లేకపోతే రసం విచ్ఛిన్నం అవుతుంది. ఈ రీతిగా ప్రేయసీ ప్రియులకు ఒకరిపై ఒకరికి బాగా నమ్మకం కుదిరిన తరువాత ముద్దు ముందా, మరొకటి ముందా అనే విచారణ అక్కర్లేదు. రతి సమయంలో ఒక క్రమపద్ధతిని అనుసరించవలసిన పనీ లేదు. స్త్రీ పురుషుల ఇష్టానుసారం యధేచ్ఛగా సంభోగం సాగించవచ్చు. కొత్తగా పరిచయమైన స్త్రీని అనుకూలంగా చేసుకోడానికీ, ఆమెకు నమ్మకం పుట్టించడానికీ ఈ క్రమపద్ధతిని అనుసరించాలి. అయితే, స్త్రీ బెదిరిపోయేలా చుంబనాది క్రియలన్నీ ఒకేసారి తొందరపడి ప్రయోగించరాదు.

(కొందరు పురుషులు కామంధులై స్త్రీతో మొరటుగా ప్రవర్తిస్తారు. ముద్దులు మున్నగునవి ప్రయోగించడంలోనూ, రతి సలపడంలోనూ పశువులా ప్రవర్తిస్తారు. అలా చేయడం వల్ల స్త్రీ బెదిరిపోతుంది. పురుషుణ్ణి అసహ్యించుకుంటుంది. అంచేత నాగరకుడు, శాస్త్రం తెలిసినవాడు అయిన పురుషుడు సంభోగ సమయంలో స్త్రీతో చాలా సున్నితంగా నాజూగ్గా ప్రవర్తించాలి. అప్పుడే మగువ మహదానందం పొందుతుంది. హద్దూ - పద్దూ లేకుండా ప్రవర్తిస్తే ముద్దు ముద్దుగా వుండదు. రతి రమ్యంగా వుండదు. ఒక స్త్రీ ఎలాంటిదో, ఆమె కామవాంఛ ఎలాంటిదో, ఆమె అభిరుచులు, కోరికలూ ఎలాంటివో గ్రహించి, తదునుగుణంగా పురుషుడు రతి కార్యాన్ని నిర్వర్తించాలి.)

## ముద్దాడే ప్రదేశాలు

*6. లలాటాలక కపోల నయన వక్షః స్తన, ఓష్ఠాంతర్ముఖేషు చుంబనమ్.*

ఇక్కడ ముద్దుల్లో గల విశేషాలు చెబుతున్నారు. ముద్దులు పెట్టుకోదగిన ప్రదేశాలు కొన్ని వున్నాయి. ఆ ప్రదేశాలను బట్టే ముద్దుల్లో తేడాలు ఏర్పడుతున్నాయి. 1) నుదురు. 2)ముంగురులు. 3) బుగ్గలు. 4) కళ్ళు. 5)వక్షస్థలం. 6) చన్నులు. 7) పెదవులు. 8)నాలుక - ఈ ఎనిమిది ప్రదేశాలూ ముద్దాడే ముఖ్యమైన ప్రదేశాలని ప్రాచీన కామ శాస్త్రాచార్యులు చెప్పారు.

*7. ఊరు సంధి, బాహు, నాభిమూలేషు లాటానమ్.*

గజ్జలూ, చంకలూ, (బొడ్డూ) భగమూ - ఇవి కూడా ముద్దు పెట్టుకోదగిన ప్రదేశాలే అని లాట దేశస్థులైన పూర్వాచార్యుల మతం. పైన చెప్పిన ఎనిమిదీ, ఇవి మూడు - ఇలా మొత్తం పదకొండు చుంబన స్థానాలు. (వీటిని కళా స్థానాలని కూడా అంటారు. అంటే స్త్రీకి మదనోద్రేకం పుట్టించే ప్రదేశాలన్నమాట.)

*8. రాగవశాద్దేశ ప్రవృత్తేశ్చ సన్తితాని తాని స్థానాని,*
*నతు సర్వజన ప్రయోజ్యానీతి వాత్స్యాయనః*

ప్రేమానురాగాలను అనుసరించీ, దేశాచారాన్ని బట్టీ ముద్దాడే ప్రదేశాలు ఇంకా చాలా వున్నాయి. అయితే అవి అన్నీ అందరూ ప్రయోగించదగినవి కావని వాత్స్యాయనులు అంటున్నారు. లాట దేశీయులు రాగాంధులై గజ్జలు, భగము మున్నగుచోట్ల ముద్దులు పెట్టుకుంటారు. అవి అందరూ ప్రయోగించడానికి వీలైనవి కావు. మొదట చెప్పిన ఎనిమిది రకాల చుంబనాలే శిష్టులు ప్రయోగించదగినవి.

*9. నిమితకం, స్ఫురితకం, ఘట్టితక మితి త్రీణి కన్యా చుంబనాని.*

చుంబనం అంటే - రెండు పెదవులు కలిపి, తన ఇష్టమైన ప్రదేశంలో గట్టిగా ఉంచడం. ఇలా చేసినప్పుడు కొంచెం శబ్దం కూడా వస్తుంది. చుంబించే స్థాన భేదాన్ని బట్టి చుంబనాల్లో భేదాలు ఏర్పడుతున్నాయి. ముద్దు పెట్టుకునేది ముఖ్యంగా పెదవులతోనే కాబట్టి, పెదవులను ముద్దాడడంలో గల విశేషాలను చెపుతున్నారు.



**ముద్దుల ఆరాటం! ముద్దరాలి ఉబలాటం!**

పెదవులు రెండు కదా!-క్రింది పెదవి, పై పెదవి. వీటినే అధరోష్ఠం, ఉత్తరోష్ఠం అంటారు. ఈరెండు పెదవులూ కలపడాన్ని సంపుటకం అంటారు. ఇలా మూడు రకాల ముద్దులు ఏర్పడుతున్నాయి. వీటిల్లో కూడా క్రియా కలాపంలో క్రింది పెదవికి ఎక్కువ ప్రాముఖ్యం వుంది కాబట్టి, ముందుగా దాన్ని గురించి చెపుతున్నారు.

ఒక పురుషుడితో ఒక స్త్రీకి పరిచయం వుండి, మాట్లాడగలిగిందిగావున్నా, అతనిపై ఇంకా గట్టినమ్మకం ఏర్పడలేదు కాబట్టి ఆ కొత్త స్త్రీని కన్యగానే పరిగణించవలసి వుంది. అలాంటి నాయిక విషయంలో నిమితికం, స్ఫురితకం, ఘట్టితకం - అనే మూడు రకాల ముద్దులు ప్రయోగించాలి.

*10. బలాత్కారేణ నియక్తా ముఖమ్ ముఖ*
*మా ధత్తే నతు విచేష్టిత మితి నిమితకమ్.*

ఆ పురుషుడు పై స్త్రీకి ఇంకా బాగా నమ్మకం ఏర్పడలేదు కాబట్టి, ఆమె సిగ్గుపడుతూ వుంటుంది. అయినా పురుషుడు ముద్దు పెట్టుకోమని ఆమెను ఎలవంతం చేస్తాడు. అప్పుడు స్త్రీ అతని ముఖంపై తన ముఖం పెడుతుంది. కాని సిగ్గు వల్ల ఎలాంటి చేష్టా చెయ్యదు. దీన్నే నిమితకం అంటారు. (ఇక్కడ ముఖం అంటే పెదవులనే అర్థం.)

*11. వదనే ప్రవేశితం చౌష్ఠం మనాగ పత్ర పానుగ్రహీతు మిచ్ఛంతీ !*
*స్పందయతి స్వమోష్ఠం నోత్తర ముత్సహతే ఇతి స్ఫురితకమ్.*

పురుషుడు తన అధరోష్ఠాన్ని తన ముఖంపైకి తెచ్చినప్పుడు స్త్రీ సిగ్గుతో జంకుతూ, అతని పెదవిని గ్రహించ గోరుతూనే తన క్రింది పెదవిని కదిలిస్తుంది. పై పెదవి కదల్చడానికి ఉత్సాహపడదు. దాన్ని కూడా కదల్చినప్పుడే స్త్రీ, పురుషుడి పెదవిని గ్రహించినట్లు అవుతుంది. దీన్నే స్ఫురితకం అంటారు.

*12. ఈషత్పరి గృహ్యా వినిమీలిత నయనా కరేణ చతన్య నయనే!*
*అనచ్ఛాదయంతీ జిహ్వాగ్రేణ ఘట్టయతీతి ఘట్టితకమ్.*

సిగ్గు ఇంకా పూర్తిగా పోని కారణంగా స్త్రీ తన రెండు పెదవులతో పురుషుడి క్రింద పెదవిని గ్రహించి, కళ్ళు మూసుకుని, తన చేతులతో పురుషుడి కళ్ళు మూస్తుంది. నాలుక కొస కదిలిస్తూ, అతని అధరోష్ఠాన్ని రాపిడి చేస్తుంది. దీన్ని ఘట్టితకం అంటారు.

కొత్తగా పరిచయమై బాగా నమ్మకం ఏర్పడిన కన్యల విషయంలో ముద్దుపెట్టుకునే విషయాన్ని గురించి చెప్పారు. ఇక ఇప్పుడు తక్కిన స్త్రీల విషయంలో ముద్దు పెట్టుకునే విధానాలను గురించి వివరిస్తున్నారు.

*13. సమం తిర్యగుద్భ్రాన్త మవపీడితక మితి చతుర్విధ మపరే.*

స్త్రీ తన పెదవులతో పురుషుడి అధరోష్ఠాన్ని ముద్దాడడంలో నాలుగు రకాలున్నాయి. మొదటిది సమచుంబనం. అంటే తనకు ఎదురుగా వున్న పురుషుడి క్రింది పెదవిని స్త్రీ ముద్దాడడం. రెండోది తిర్యక్ చుంబనం. అంటే రెండు

పెదవులూ ముందుకు చాచి పురుషుడి అధరాన్ని చిగురంటూ గ్రహించడం. ఇక మూడోది ఉద్భ్రాంతం. అంటే పురుషుడి గడ్డాన్ని, శిరస్సును స్త్రీ తన రెండు చేతులతోనూ పట్టుకుని, తన పెదవులు కదిలిస్తూ చుంబించడాన్ని ఉద్భ్రాంతం అంటారు. నాలుగోది అవపీడితకం. అంటే స్త్రీ పురుషులిద్దరూ ఒకళ్ళ పెదవులు ఒకళ్ళు స్వేచ్ఛగా గ్రహించి తనివితీరా అధరామృతాన్ని ఆస్వాదించడం. ఈ అవపీడితకం మళ్ళీ రెండు రకాలు. పెదవులతో మాత్రమే అధరాన్ని గ్రహించి గట్టిగా పీడిస్తే దాన్ని శుద్ధ పీడితకం అంటారు. పెదవినే కాక నాలుక కొసతో కూడా పీడిస్తే దాన్ని చూషణం అనీ, అధరపానం అనీ అంటారు.

*14. అంగుళి సంపుటేన పిండీకృత్య నిర్దశన మోష్ఠపుటే*
*నావపీడయే దిత్యవ పీడితకం పంచమ మపి కరణమ్*

అయిదోరకం ముద్దుకూడా ఒకటి వుంది. స్త్రీ తన చేతి బొటనవ్రేలితోనూ, తర్జనితోనూ (చూపుడువేలు) పురుషుడి అధరాన్ని పట్టుకుని, పళ్ళు నాటుకోకుండా, పెదవులతో మాత్రం గ్రహించి ముద్దాడితే, అవపీడితకం అంటారు. ఇదే అయిదోరకం ముద్దు.

*15. ద్యూతమ్ చాత్ర ప్రవర్తయేత్.*

చేసే పనులలో గల విశేషాలను బట్టి అధరచుంబనాన్ని అయిదు విధాలుగా చెప్పారు.

# ముద్దులలో పందాలు

ఇలా ముద్దుల్లో రకాలను గురించి వివరంగా చెప్పి, అవసరాన్ని బట్టి అధర చుంబనానికి సంబంధించిన జూదాన్ని గురించి కూడా చెపుతున్నారు. ఈ జూదం ప్రేమానురాగాలను పెంపొందిస్తుంది.

*16. పూర్వమధర సంపాదనేన జితమిదం స్యాత్.*

ప్రేయసీ ప్రియులిరువురూ ఒకళ్ళ పెదవి ఒకళ్ళు గ్రహించాలన్న ఆరాటంతో పెనుగులాడతారు. ఎవరు ముందుగా రెండోవారి పెదవిని పట్టుకోగలిగితే, వారు గెలిచినట్లు, రెండోవారు ఓడిపోయినట్లు. ఇది ముద్దుల్లో జూదం అన్నమాట. ఈ జూదంలో స్త్రీ పురుషులిద్దరికీ ఇష్టంగా ఉండే పందెం చెపుతున్నారు. ఇందులో కపట జూదం, నిష్కపట జూదం రెండూ ఉన్నాయి. నాయికా నాయకులు సాధారణంగా ఒకరిపై ఒకరు ప్రేమతో, పెనుగులాడుతూ ముద్దాడాలని ఆరాటపడతారు. అలా ఆరాటపడుతూ ముద్దులు పెట్టుకుంటే దాన్ని నిష్కపట జూదం అంటారు. పురుషుడు ఎలాగైనా బలవంతుడు కాబట్టి ఈ కపటంలేని జూదంలో అతడే నాయిక అధరాన్ని ముందుగా పట్టుకోగలుగుతాడు. కపట ద్యూతంలో అయితే, స్త్రీయే పరుషుడి పెదవిని ముందుగా అందుకుని గెలుస్తుంది.

*17. తత్రజితా సార్ధరుదితం కరం విధునయాత్ప్రణుదేద్దశేత్పరివర్తయే*
*ద్బలాదాహృతా వివదేత పునరవ్యస్తు పణమితి*
*బ్రూయాత్, తత్రాపి జితా ద్విగుణ మాయస్యేత్.*

ఈ జూదంలో ఓడిపోయిన వారు గెలిచిన వారిపై కలహానికి దిగుతారు. ఈ చుంబన కలహం స్త్రీ పురుషుల మధ్య అనురాగాన్ని బాగా వృద్ధి పొందిస్తుంది. జూదంలో స్త్రీ ఓడిపోతే, తన అధరానికి నొప్పి పుట్టిందని దొంగ ఏడుపులు, ఏడుస్తూ చేతులు వణికించాలి. ప్రియుణ్ణి చూడు నిన్ను ఏం చేస్తానో - అంటూ బెదిరించాలి. అతని అధరాన్ని తన పళ్ళతో నొక్కాలి. తన పెదవిని ఇక వదలి పెట్టమని జగడమాడాలి. నేనేం ఓడిపోలేదు. మీరే ఓడిపోయారు, కావాలంటే మళ్ళీ పందెం వేద్దాం - అంటూ పేచీ పెట్టాలి. రెండోసారి కూడా తానే ఓడిపోయి ఇంకా ఎక్కువగా వగలు పడుతూ రకరకాల చేష్టలు చెయ్యాలి.

*18. విప్రలబ్ధన్య, ప్రమత్తన్య వాZర మవగృహ్య, దశనాంతర్గత మనిర్గమం కృత్వా హసేదుత్క్రోశేత్తర్జయే ద్వల్గే దాహ్వయేన్నృత్యే త్ప్రవర్తిత భ్రూణా చ విచలనయనేన ముఖేన విహసంతీ తాని తాని చ బ్రూయాదితి చుంబన ద్యూతకలహః*

ఇక ఇప్పుడు కపట ద్యూతం గురించి చెపుతున్నారు వాత్స్యాయనులు. ఈ ఆటలో స్త్రీ ముందుగా పురుషుణ్ణి నమ్మించాలి. అలా నమ్మించి అతను పరాకుగా ఏదో ఆలోచిస్తున్న తరుణంలో, హఠాత్తుగా అతని అధరాన్ని మొదట తన పెదవులతోనూ, పిమ్మట పళ్ళతోనూ, తప్పించుకోడానికి వీలులేకుండా గట్టిగా పట్టుకోవాలి. ఆ తరువాత అతని క్రింద పెదవిని అలాగే నొక్కి ఉంచిగానీ, వదిలిపెట్టిగానీ తరువాత చెయ్యాల్సిన పనులుచెయ్యాలి. ఈ కపట జూదంలో పొరపాటున స్త్రీకే జయం లభించవచ్చు. ఇలా గెలుపొంది ప్రేయసి, ప్రియుణ్ణి గేలిచెయ్యాలి. చప్పట్లు కొడుతూ గేలిచేస్తే ఇద్దరికీ ఎంతో సంతోషం కలుగుతుంది. 'నా చేతుల్లో ఓడిపోయారు, మీదేం మగతనం?' అంటూ ఫూత్కారం చెయ్యాలి. అతని స్నేహితులూ, తన స్నేహితురాండ్రూ దగ్గర్లో ఉంటే, వారు వినేటట్లుగా బెదిరించాలి. 'దొరికేరు, ఇక మీ పెదవి కొరికేస్తాను' - అంటూ అతను హడలిపొయ్యేలాగా బెదిరిస్తూ, తన శరీరాన్ని నాజూగ్గా కదల్చాలి. చేతనైతే, మీ మగతనం చూపించండి - అని సవాలు చేస్తూ పోట్లాటకు పిలవాలి. కనుబొమలు ఎగరేస్తూ చిందులు త్రొక్కాలి. చివరకు ఓరకంటితో చూస్తూ, కిలకిలా నవ్వాలి. ఆ తరువాత ఎలాంటి పనులు చేస్తే అనురాగం ఎక్కువవుతుందో గ్రహించుకుని ఆ పనులు చెయ్యాలి. పదే పదే ముద్దుల వర్షం కురిపించాలి. ప్రియంగా, చమత్కారంగా మాట్లాడాలి. ఒక్కొక్కప్పుడు పురుషుడు గెలిచినా, ఓడినా కలహం వృద్ధి పొందేలా ప్రవర్తించాలి. ఎలా అంటే, పురుషుడు మొదట ఆమె అధరాన్ని నొక్కిపట్టి, సీత్కారంతో శిరస్సు పంకిస్తూ, స్త్రీ తనను త్రోసివేస్తే, బలాత్కారంగా మళ్ళీ ఆ పని చెయ్యడం కోసం పెనుగులాడాలి. ఆమె కొరికితే, మళ్ళీ కొరకాలి. ఆమె పట్టీ కొట్టేస్తే మళ్ళీ పట్టీ కొట్టించాలి. ఆమె పోట్లాడితే పోట్లాడాలి. ఇందాక గెలిస్తే గెలిచావు. ఈసారి పందెంలో గెలుపు చూద్దాం - అంటూ మళ్ళీ ఆట మొదటికి తీసుకరావాలి. రెండోసారి కూడా పందెంలొ స్త్రీ తానే గెలిచి, మునుపటి కంటె ఎక్కువ చిలిపి చేష్టలు చెయ్యాలి. ఒకవేళ ఓడిపోయినా అందంగా నవ్వాలి. నా చేతుల్లో ఓడిపోయారు, ఓడిపోయారు - అంటూ ఆమె

గెలిచినా పురుషుడు బెదిరిస్తే, మళ్ళీ బెదిరించాలి. ఆమె పోట్లాటకు పిలిస్తే పురుషుడు పోట్లాడాలి. ఆమె చిందులు త్రొక్కుతుంటే తాళం వెయ్యాలి. ఆమె వెళ్ళిపోతుంటే, పోకుండా అడ్డు నిలబడాలి. ఆమె వాదానికి దిగితే, తాను వాదం పెట్టుకోవాలి.

19. *ఏతేన నఖదశనచ్ఛేద్య ప్రహణన ద్యూతకలహాని వ్యాఖ్యాతాని.*

ఈ చుంబన ద్యూతం ఇంత స్పష్టంగా వివరించడం వల్ల నఖక్షత, దంతక్షత, ప్రణయతాండవ ద్యూతాలు ఎలా వుంటాయో స్పష్టమైనాయి. అంటే చుంబన ద్యూతంలో లాగే తక్కిన ద్యూతాలు కూడా నిర్వహించాలన్నమాట।

20. *చండవేగ యోరేవ త్వేషాం ప్రయోగః తత్సాత్మ్యాత్.*

చాలాసేపు రతి చేయగల స్త్రీ పురుషులు మాత్రమే పైన చెప్పిన చుంబన ద్యూతాలు ప్రయోగించాలి. కాని, మందవేగులు, మధ్యవేగులు ప్రయోగించకూడదు. ఎందుచేతనంటే, ఎక్కువ సేపు రతి సలుపలేనివారు, ఒక మోస్తరుగా రతి సలుపగలవారు ఇలాంటి చుంబన కలహాల్లోకి దిగితే, అప్పుడే ఆ పురుషుడి పని అయిపోతుంది. ఉద్రేకం తట్టుకోలేక కొందరికి వీర్యం జారిపోవడం కూడా జరుగుతుంది. అప్పుడు ఇహ అసలు సంభోగం ఎలా చేయగలుగుతారు ? అందువల్లనే అలాంటి దుర్బలులకు ఈ శృంగార క్రియ కూడదన్నారు శాస్త్రకారులు.

21. *తస్యాం చుంబంత్యా మయమప్యుత్తరమ్ గృహ్ణీయాదిత్యుత్తర చుంబితమ్.*

అసలు ముద్దు పెట్టుకోవలసింది, క్రింది పెదవిని మాత్రమే. స్త్రీ తన అధరోష్టాన్ని ముద్దాడుతున్నప్పుడు పురుషుడు ఆమె పై పెదవిని చుంబించాలి. ఆమె పై పెదవిని అందుకున్నప్పుడు తాను ఆమె క్రింద పెదవిని అందుకోవాలి. దీన్ని ఉత్తర చుంబనం అంటారు. ప్రస్తావనలో దీన్ని గురించి చెప్పారే తప్ప, నాసికాపుట పానంలాగా ఇది కూడా అసహ్యం కాబట్టే నిషిద్ధమైనదే.

22. *ఓష్ఠ సందం శే నావగృహ్యోష్ఠద్వయమపి చుంబేదితి*
*సంపుటకం స్త్రియాః పుంసో వా జాతవ్యం జనన్య.*

ఇంకా మీసాలు రాని, లేదా నూనూగు మీసాల నూత్న యౌవనంలో వున్న యువకుడి విషయంలో స్త్రీని ముద్దాడే విధానం చెపుతున్నారు. అలాంటి యువకుడు రెండు పెదవులూ ముడిచి అలాగే రెండు పెదవులూ ముడిచి వున్న యువతిని ముద్దాడాలి. ఈ సందర్భంలో ఒకరి నోట్లో ఒకరు నోరుపెట్టి ముద్దు పెట్టుకోవడం అవసరం అవుతుంది. దీన్ని సంపుటకం అంటారు.

23. *తస్మిన్ని తరోపి జిహ్వయాZన్యాదశనాని*
*ఘట్టయేత్తాలు జిహ్వాంచేతి జిహ్వాయుద్ధమ్.*

24. *ఏతేన బలాద్వదనరదన గ్రహణం దానం చ వ్యాఖ్యాతమ్.*

## పెదాల పాహాళింపు

ఈ సంపుటక చుంబన విధానంలో మరో చుంబన పద్ధతి కూడా చేరి వుంది. దాని పేరు అంతర్ముఖ చుంబనం. స్త్రీ పురుషుల్లో ఎవరి పెదవులు

ఎవరి నోట్లో ప్రవేశిస్తాయో, అలా ప్రవేశించినవారు తమ నాలుకతో రెండవ వారి పై పళ్ళను క్రింద పళ్ళను తాకాలి. ఇద్దరూ నాలుకలు పొడుగ్గా గానీ, కొంచెంగా గానీ చాచి, ఒకళ్ళ నాలుకతో ఒకళ్ళ నాలుకను బాగా రాపిడి చేస్తే దాన్ని జిహ్వా యుద్ధం అంటారు. ఇది అంతర్ముఖ చుంబనం, దశన చుంబనం, జిహ్వాచుంబనం, తాలు చుంబనం - అని నాలుగు విధాలు.

ఇలా జిహ్వా యుద్ధాన్ని గురించి చెప్పడం వల్ల, బలాత్కారంగా పెదవులను ముద్దాడడం, పళ్ళు ముద్దు పెట్టుకోవడం, మున్నగు పద్ధతులు కూడా చెప్పినట్టయింది.

*25. సమం పీడితక మంచితం మృదు శేషాం గేషు చుంబనం*
*స్థానవిశేష యోగాదితి చుంబన విశేషాః*

పెదవులూ, నోటిలోపల కాకుండా నుదురూ మున్నగు శరీరంలోని ఇతర స్థానాల్లో చేసే పనిని బట్టి సమచుంబనం, అంచిత చుంబనం, మృదుచుంబనం, పీడిత చుంబనం అని నాలుగు రకాలు. ఈ చుంబన స్థానాలు ఇదివరకే చెప్పడం జరిగింది. గజ్జలూ, వక్షస్థలం, ప్రదేశాల్లో మాత్రం సమచుంబనాన్ని ప్రయోగించాలి.

చంకలు, చన్నులు - వీటి యందు అంచిత చుంబనం చెయ్యాలి. పాలభాగంలోనూ, కళ్ళ మీదా, మృదు చుంబనం చెయ్యాలి.

*26. సుప్తస్య ముఖమవలోక యంత్యాః, స్వాభిప్రాయేణ చుంబనమ్ రాగదీపనమ్.*

ప్రియుడు నిద్రపోతూ వుంటే, ప్రేయసి అతని ముఖబింబాన్ని ప్రేమ భావంతో చూస్తూ తనకిష్టమైన రీతిలో ముద్దు పెట్టుకోడాన్ని రాగదీపం అంటారు. ప్రేయసి నిద్రిస్తూ వుంటే, ప్రియురాల్ని కూడా అలా ముద్దాడితే ఆమెకు నిద్రాభంగం కలుగుతుంది. అప్పుడది సాంప్రయోగకమే అవుతుంది.

*27. ప్రమతస్య వివద మానస్య వా అన్యతోऽభిముఖస్య*
*సుప్తాభి ముఖస్య వా నిద్రా వ్యాఘాతార్థం చలితకమ్.*

సంగీతం, ఆలేఖ్యం మున్నగు పనుల్లో నిమగ్నమై వున్నప్పుడూ, ప్రణయ కలహ సమయంలోనూ, మరోవైపు దృష్టి మరల్చి ఉన్నప్పుడూ, నిద్రపోతూ వున్నప్పుడూ, పురుషుణ్ణి ఆయా పనుల నుంచి తప్పించడానికి పెట్టుకునే ముద్దును చలితకం అంటారు.

*28. చిరరాత్రా వాగతస్య శయన సుప్తాయాః,*
*స్వాభిప్రాయ చుంబనమ్ ప్రాతిబోధికమ్.*

అర్థరాత్రి వేళ ప్రేయసి నిద్రపోతూ వుంటే ఆమె చేరువకు వెళ్ళి తన ఇష్టం వచ్చిన విధంగా ముద్దు పెట్టుకోవడాన్ని ప్రాతిబోధికం అంటారు. నిద్రపోతున్న ప్రియురాలిని మేల్కొలపడమే ఈ ముద్దు ముఖ్యోద్దేశం.

*29. సాపి పితు భావజిజ్ఞాసార్థినీ నాయక స్యాగమనకాలమ్,*
*సంలక్ష్య వ్యాజేన సుప్తాస్యాత్.*

స్త్రీ తన ప్రియుడి భావం ఎలాంటిదో కనిపెట్టాలనుకుని, అతను వచ్చే వేళకు నిద్రపోతున్నట్లు నటిస్తుంది. నిజంగా అతనికి నాపై ప్రేమ వుంటే,

నన్ను ముద్దు పెట్టుకుంటాడు. అని భావిస్తూ కపట నిద్రలో వున్న ప్రేయసిని ముద్దు పెట్టుకోవడాన్ని ప్రాతిబోధిక చుంబనం అంటారు.

*30. ఆదర్శే కుడ్యే సలిలే వా ప్రయోజ్యాయా శ్చాయా*
*చుంబనం ఆకార ప్రదర్శనార్థ మేవకార్యమ్.*

అద్దంలో కానీ, దీపం వెలుతురు పడుతున్న గోడమీద కానీ, నీళ్ళలో కానీ ప్రియురాలి నీడ పడుతూ వున్నప్పుడు, ఆ నీడను ముద్దుపెట్టుకోవడాన్ని ఛాయా చుంబనం అంటారు.

*31. బాలస్య చిత్రకర్మణః ప్రతి మాయాశ్చ చుంబనం,*
*సాంక్రాంతిక మాలింగనం చ.*

స్త్రీ తన చంకనున్న పసిపిల్ల వాణ్ణి గానీ, చిత్రపటాన్ని గానీ, మట్టితో, రాతితో, కొయ్యతో చేసిన బొమ్మలను గానీ చూస్తూ వున్నప్పుడు, ఆమెను ముద్దు పెట్టుకోవడాన్ని సాంక్రాంతిక చుంబనం అంటారు. పైన పేర్కొన్న ఛాయా చుంబనాన్ని, ఈ సాంక్రాంతిక చుంబనాన్ని మాటలు, మనోభావాలు కలియని దశలో స్త్రీ పై ప్రయోగించదగినవి.

*32. తథా నిశి ప్రేక్షణకే స్వజన సమాజే వా సమీపగతస్య*
*ప్రయోజ్యాయా హస్తాంగుళి చుంబనం, సంవిష్టస్య పాదాంగుళి చుంబనమ్.*

రాత్రివేళగానీ, నాటక ప్రదర్శన జరుగుతున్నప్పుడు గానీ గుంపుగా చేరివున్న బంధు జనంలో గానీ నాయిక కూచుని వుంటే, ఆమెకు దగ్గరలో వున్న నాయకుడు ఆమె చేతివేళ్ళనో, కాలి వేళ్ళనో ముద్దు పెట్టుకోడాన్ని అంగుళి చుంబనం అంటారు.

*33. సంవాహికాయాస్తు నాయక మాకారయంత్యా నిద్రావశా దకామాయా ఇవ*
*తస్యోర్వోర్వ దనస్య నిధాన మూరుచుంబనమ్,*
*పాదాంగుష్ఠ చుంబనం చేత్యాభి యోగికాని.*

స్త్రీ పురుషుడి పాదాలు మెత్తగా ఒత్తుతూ ఆ విధంగా తన మనోభావాన్ని తెలుపుతుంది. నిద్ర ముంచుకు వస్తున్నట్లు ఏమీ ఎరుగని దానిలా మీద వాలిపోయి తన ముఖాన్ని తొడలపై ఆనించి ముద్దాడుతుంది. దీన్ని ఊరు చుంబనం అంటారు. అలాగే కాలి వ్రేళ్ళు లాగుతున్నప్పుడు ఆ కాలి బొటనవ్రేలిని ముద్దుపెట్టుకోవడాన్ని పాదాంగుష్ఠ చుంబనం అంటారు. మాటలు బాగా కలియక, శరీర స్పర్శకు మాత్రమే అలవాటు పడిన స్త్రీ ఈ అంగుళీ చుంబనాదులను ప్రయోగించవలసి వుంటుంది. వీటినే అభియోగాలని కూడా పిలుస్తారు.

*34. కృతే ప్రతికృతం కుర్యాత్తాడితే ప్రతి తాడితం తామ్,*
*కరణేనచ తేనైవ చుంబితే ప్రతి చుంబితమ్*

సంభోగ సమయంలోనూ, అభియోగ కాలంలోనూ (అంటే పరిచయం చేసుకునే కాలంలోనూ) పురుషుడు ఏ రకం ముద్దులు ప్రయోగిస్తే, స్త్రీ కూడా ఆ రకం ముద్దులనే ప్రయోగించాలి. పురుషుడు ఎలా చేస్తే స్త్రీ కూడా అలాగే చెయ్యాలి. అలా చెయ్యలేదనుకోండి, అప్పుడా యువతి శృంగారం తెలియని

మొద్దు అని భావిస్తాడు పురుషుడు. ఈమెతో లాభం లేదని విరక్తి చెందుతాడు. అప్పుడా సంప్రయోగం నీచం అవుతుంది. (స్త్రీ పురుషు లిద్దరూ సమయోచితంగా శృంగార చేష్టలు చేయడంలో నేర్పున్నప్పుడే శృంగారానికి పరాకాష్ట. అందుకే స్వతహాగా తెలియకపోతే, ఈ కామశాస్త్రం చదివి నేర్చుకోమన్నారు పెద్దలు.)

అందువల్ల పురుషుడు ప్రణయ తాడనం చేస్తే, నాయిక కూడా అలా ప్రతి తాడనం చెయ్యాలి. ముద్దు పెట్టుకుంటే, తానూ ముద్దు పెట్టుకోవాలి.

*ఇతి వాత్స్యాసీయయే కామసూత్రే సాంప్రయోగికే ద్వితీయేఽధికరణే*
*చుంబన వికల్పో నామ తృతీయో ఽధ్యాయః*

**ఇది వాత్స్యాయన ముని విరచిత కామసూత్రాల్లో సాంప్రయోగికం అనే రెండవ అధికరణంలోని చుంబన వికల్పం అనే మూడో అధ్యాయం.**



# చతుర్థాధ్యాయం
## నఖజాత్యం

*1. రాగవృద్ధౌ సంఘర్షాత్మకం నఖ విలేఖనం*

నఖ **జాత్యం** అంటే నఖక్షతాలు, అంటే చేతి గోళ్ళతో మెల్లగా, నాజుగ్గా, సుతిమెత్తనగా గిల్లడం, గిచ్చడం, రక్కడం, గీరడం, చక్కలి గింతలు పెట్టడం మొదలైన చేష్టలు. దేనికండి ఈ చేష్టలు ? - అని అడగవచ్చు. పై అధ్యాయంలో చెప్పిన ముద్దుల వల్ల స్త్రీ పురుషులకు అన్యోన్యానురాగం కలుగుతుంది. ఆ అనురాగాన్ని ఇంకా ఇంకా వృద్ధి పొందించడానికి ఈ నఖక్షతాలా ప్రయోగించడం ఎంతైన అవసరం. ప్రేమానురాగాలు పుట్టిన తరువాత గోళ్ళతో ఆయా స్థానాల్లో గిచ్చడాన్ని నఖ విలేఖనం అంటారు.

*2. తస్య ప్రథమ సమాగమే, ప్రవాస ప్రత్యాగమనే, ప్రవాసగమనే, క్రుద్ధ ప్రసన్నాయాం, మత్తాయాంచ ప్రయో గోసనిత్య మచండ వేగయో.*

అయితే, ఈ నఖక్షతాలను ఎక్కడెక్కడ ప్రయోగించాలి? ఎప్పుడెప్పుడు ప్రయోగించాలి? అనే ప్రశ్నలకు వాత్స్యాయనులు సమాధానం చెపుతున్నారు. స్త్రీలను ఎప్పుడూ బడితే అప్పుడు, ఎక్కడ బడితే అక్కడ... ... గిచ్చడాలు, గిల్లడాలు చేయకూడదు. అంతే కాకుండా మందవేగులు, మధ్య వేగులు ఎప్పుడూ ప్రయోగించకూడదని అంటున్నారు శాస్త్రకారులు. ప్రియురాలిని మొట్టమొదటిసారి కలుసుకున్న సమయంలో కానీ, తాను దేశాంతరం నుంచి తిరిగివచ్చినప్పుడు కానీ ప్రియురాలిని విడిచిపెట్టి దూర ప్రాంతాలకు వెళ్ళే సమయంలో కానీ, కోపంతో వున్నప్పుడు ప్రేయసిని బుజ్జగించి ఆమెను ప్రసన్నురాలిగా చేసుకునేటప్పుడు కానీ వీటిని ప్రయోగించాలి. కామోద్రేకంతో ఎక్కువసేపు రతి చేయలేనివారి విషయంలో మాత్రమే ఈ నిబంధన. చాలాసేపు బాగా రతిచేయగల పురుషుడు ఎప్పుడైన సరే, ఎలాగైన సరే వీటిని ప్రయోగించవచ్చు.

*3. తథా దశనచ్ఛేద్యస్య సాత్మ్యవశాద్వా.*

ఈ నఖక్షతాల్లాగానే, అనురాగం వృద్ధి పొందిన తరువాత దంతక్షతాలను కూడా ప్రయోగించాలి. దంతక్షతం అంటే పళ్ళతో తేలిగ్గా కొరకడం, నొక్కడం. ప్రేమానురాగాలు ఎక్కువగా వుంటే, ప్రేయసిని పళ్ళతో తేలిగ్గా నొక్కాలి. అవి తక్కువగా వుంటే, స్త్రీకి ఉద్రేకం పుట్టించడానికిగాను పళ్ళతో గట్టిగా నొక్కాలి. అయితే, ముందవేగులు, మధ్యవేగులు వీటిని సహించలేరు కాబట్టి, వారి విషయంలో వీటిని ప్రయోగించకూడదు.

## నఖక్షతాల్లో రకాలు, ప్రయోగాలు

4. *తదాచ్ఛురితక మర్ధచంద్రోమండలం, రేఖా, వ్యాఘ్రనఖం, మయూర పదకం, శశప్లుతక, ముత్పల పత్రకమితి రూపతోష్ట వికల్పం.*

ఈ నఖక్షతాలు రూపవత్ అనీ, అరూపవత్ అనీ రెండు రకాలు. ఏదైన ఒక వస్తువు రూపాన్ని అనుకరిస్తూ చేసే నఖక్షతాలు రూపవత్తులు. ఏ వస్తువు రూపాన్నీ, అనుసరించకుండా, ఇష్టం వచ్చినట్లు ప్రయోగించే నఖక్షతాలు అరూపవత్తులు. అవి మళ్ళీ మృదువు, మధ్యమం, అతిమాత్రం అని మూడు రకాలుగా వుంటున్నాయి మొదట రూపవత్తులను గురించి ఇక్కడ చెపుతున్నారు వాత్స్యాయనులు అవి : అచ్ఛురితకం, అర్ధ చంద్రాకారం, మండలాకారం, రేఖాకారం, వ్యాఘ్రనఖం, మయూరపదకం, శశప్లుతకం, ఉత్పలపత్రకం, - అని ఎనిమిది విధాలుగా వున్నాయి.

5. *కక్షౌ, స్తనౌ, గళః, పృష్ఠం, జఘన, మూరూ చ స్థానాని.*

బాహు మూలాలు (చంకలు), స్తనాలు, కంఠం, కటిప్రదేశం (పిరుదులు), ఊరువులు (తొడలు), జఘనం (స్త్రీల మొలముందరి ప్రదేశం) - ఈ ఆరు ప్రదేశాల్లో మాత్రమే నఖక్షతాలు ప్రయోగించాలి. ఈ చోటులలో వీటిని ప్రయోగించడం వల్ల స్త్రీ పురుషులకు కామోద్రేకం అధికమవుతుంది. ఎంతో హాయిగా, సుఖంగా వుంటుంది. పూర్వాచార్యుల అభిప్రాయం ఇది. పైన చెప్పిన స్థానాల విషయంలో కొంచెం వివరణ వుంది. కంఠం అంటే కంఠం ప్రక్క ప్రదేశాలనీ, కటి ప్రదేశం అంటే పిరుదులు, పొత్తికడుపు అనీ అర్థం చేసుకోవాలి.

6. *ప్రవృత్తరతి చక్రాణాం నస్థాన మస్థానం వా విద్యతే ఇతి సువర్ణనాభః*

రతిక్రియకు ఉపక్రమించిన కాముకులు వళ్ళు తెలియని స్థితిలో వుంటారు కాబట్టి, నఖక్షతం చేయదగిన ప్రదేశం అని కానీ, చేయకూడని ప్రదేశం అని కానీ విచక్షణ అక్కర్లేదని సువర్ణ నాభులు అభిప్రాయం.

7. *తత్ర నవ్యహస్తాని ప్రత్యగ్ర శిఖరాణి ద్విత్రిశిఖరాణి చండవేగయోర్న ఖాని స్యుః*

## గోళ్ళ నిగారింపులు

నఖక్షతాలనేవి గోళ్ళతో చేసేవి కాబట్టి ఆ గోళ్ళు ఎలా వుండాలో, వాటి ఆశ్రయాలేమిటో, అవి ఎంత ప్రమాణం కలిగి వుండాలో, వాటిని ఎలా కల్పించాలో ఇక్కడ చెపుతున్నారు. సాధారణంగా నఖక్షతాలు చేసేటప్పుడు ఎడమచేతి గోళ్ళనే ఉపయోగించాలి ఆ చేతి గోళ్ళు బాగా కొనలు తేరి వుండాలి. ఆ కొనలు కూడా రంపపు పళ్ళలా రెండు, మూడు మళ్ళు కలిగి వుండాలి. చాలాసేపు రతిక్రీడ సలుపగలవాళ్ళు మాత్రమే ఈ నఖక్షతాలు ప్రయోగించాలని ఇంతకు మునుపే చెప్పడం జరిగింది.

*8. అనుగతరాగరాజి, నమముజ్జ్వల మమలిన మవిపాటితం*
*వివర్ధిష్ణు మృదుస్నిగ్ధ దర్శన మితి నఖగుణాః.*

ఈ గోళ్ళు ఎలా వుండాలో చెపుతున్నారు. గోళ్ళు రంగురంగుల రేఖలు కలిగి, వెనుక భాగం సమానంగా ఉండాలి. మట్టి మొదలైన మురికి చేరకుండా ఉండాలి. చీలికలు లేకుండా ప్రకాశవంతంగా, బాగా పెరిగి గుణం కలిగివుండాలి. మృదువుగా, మెత్తగా చూడడానికి అందంగా ఉండాలి. పిప్పిగోళ్ళు ఉండకూడదు.

(సాముద్రిక శాస్త్రంలో కూడా గోళ్ళు గులాబి వర్ణంలో, మృదువుగా, కాంతివంతంగా ఉంటే ఆరోగ్యానికీ, అదృష్టానికీ లక్షణమని చెప్పారు).

## నమ్మకానికి నఖక్షతం

*9. దీర్ఘాణి హస్తశోభిన్యాలోకే చ యోషితాం చిత్తగ్రాహీణి గౌడానాం నఖానిస్యుః*

గౌడ దేశస్థుల గోళ్ళు చాలా పొడుగ్గా, అందంగా, హస్తానికి అలంకారప్రాయంగా వుంటాయట. ఆడవాళ్ళ మనస్సును ఇట్టే ఆకర్షించి ఆహ్లాదంగా కలిగిస్తాయట. కాని అవి నఖక్షతాలకు పనికిరావని అంటున్నారు శాస్త్రకారులు.

*10. హ్రస్వాని కర్మసహిష్ణూని వికల్ప యోజనాసు చ*
*స్వేచ్ఛావ పాతీని దాక్షిణాత్యానాం.*

దక్షిణ దేశస్తుల గోళ్ళు పొట్టిగా వుండి, యధేచ్ఛగా రకరకాలుగా క్షతాలు చేయడానికి వీలుగా ఉంటాయి.

*11. మధ్యమాన్యుభయభాంజి మహారాష్ట్రి కాణామితి*

మహారాష్ట్రుల గోళ్ళు అంత పొడుగూ కాకుండా, మరీ అంత పొట్టి కాకుండా మధ్యరకంగా వుంటాయి.

(దేశంలోని వివిధ ప్రాంతాలలో గల ప్రజలు అవయువాలు, రూపు రేఖలు ఇంత స్పష్టంగా నిర్దేశించి చెప్పడాన్ని బట్టి వాత్స్యాయనులు దేశమంతటా తిరిగి ప్రజలను పరిశీలించినాడని స్పష్టం అవుతూ వుంది).

*12. తైః సునియమితైః హనుదేశే, స్తనయో రధరే వా లఘుకరణ,*
*మనుద్గత లేఖం, స్పర్శమాత్ర జననా ద్రోమాంచకర*
*మంతే సంనిపాత వర్ధమాన శబ్ద మాచ్ఛురితకం.*

ఇక ఇప్పుడు అచ్ఛురికము మున్నగు వివిధ రకాల నఖక్షతాల స్వరూప స్వభావాలను గురించి, వాటిని ప్రయోగించవలసిన ప్రదేశాలను గురించి వాత్స్యాయనులు వివరిస్తున్నారు.

పైన చెప్పినట్లు విలక్షణంగా ఉన్న, అయిదు వ్రేళ్ళ గోళ్ళనూ గుత్తిలాగా ముడిచి బుగ్గలమీద, చన్నుల మీద, అధరంమీద మృదువుగా తేలిగ్గా, గాటు పడకుండా క్షతం చేస్తే, దాన్ని అచ్ఛురితకం అంటారు. ఈ రకం నఖక్షతంలో కేవలం స్పర్శ మాత్రం చేతనే ఒడలంతా గగుర్పొడుస్తుంది వయ్యారి భామకు. అంతేకాకుండా ఆమెలో కొంచెం సీత్కారం కూడా (సురత క్రీడకు ఉత్సహిస్తూ 'ఇస్, ఇస్' అని చేసే రతి కూజితం) బయలుదేరుతుంది.

13. *ప్రయోజ్యాయాంచ తస్యాంగసంవాహనే, శిరసః కండూయనే, పిటకభేదనే, వ్యాకులీకరణే, భీషణేచ ప్రయోగః*

పైన చెప్పిన నఖక్షతాలను అవస్థా భేదాన్ని బట్టి, పైన చెప్పిన చోట్లలోనే కాక తక్కిన ప్రదేశాల్లో కూడా ప్రయోగించవచ్చు. ప్రియురాలు కన్య అయి ఉంటే, ఆమెకు నమ్మకం కలిగించడానికి ఈ నఖక్షతం చెయ్యాలి. ఇంకా ప్రేయసి శరీరాన్ని ఎక్కడెక్కడ తడుముతున్నా, ఎక్కడెక్కడ సంవాహనం చేస్తున్నా (పిసుకుతున్నా, మర్దిస్తున్నా) అక్కడల్లా ప్రియుడు నఖక్షతాలు చేయవచ్చు, స్త్రీ పురుషులిద్దరూ ఒకరినొకరు ఈ గిచ్చుకోడాలు సాగించవచ్చు. తలలోగానీ, శరీరంలో మరెక్కడైన గానీ కురుపుల్లాంటివి వుంటే, వాటిని చిదిమి వెయ్యడానికీ, తలలో దురదగా వుంటే దాన్ని పోగొట్టడానికీ, భయపెట్టడానికీ కూడా నఖక్షతాలు ప్రయోగించవచ్చు.

14. *గ్రీవాయాం స్తనపృష్ఠే చ వక్రో నఖపదనివేశో ऽర్థచంద్రకః*

కంఠానికి ప్రక్క భాగాల్లోనూ, చన్నుల వెనుక భాగంలోనూ అర్థ చంద్రాకారంగా నఖక్షతాలు చేస్తే దాన్ని అర్థ చంద్రకం అంటారు.

15. *తావేవద్వౌ పరస్పరాభిముఖౌ మండలమ్.*

పైన పేర్కొన్న నఖక్షతాలే రెంటిని, ఒకదాని కొకటి ఎదురుగా వుండేటట్లు చేస్తే దాన్ని మండలం అంటారు.

16. *నాభిమూల కకుందర వంక్షణేషు తస్య ప్రయోగః*

పైన చెప్పిన మండల నఖక్షతాలు స్త్రీల బొడ్డు దగ్గర, పిరుదుల పైన, గజ్జలోను ప్రయోగించాలి.

17. *సర్వస్థానేషు నాతి దీర్ఘకాలే.*

ఇంకా ఇంతులకు, మదనోద్రేకాన్ని పుట్టించే అన్ని మర్మస్థానాల్లోనూ ఎక్కువసేపుకాకుండా నఖక్షతాలు చెయ్యాలి.

18. *సైవ వక్రా వ్యాఘ్రనమిక మాస్తన ముఖమ్*

పాలిండ్ల కొనలపై (బొడిపి) వంకరగా, వయ్యారంగా గిల్లడాన్ని వ్యాఘ్రనమికం అంటారు.

19. *పంచభిరభిముఖై ర్న ఖైర్లేఖా చూచుకాభిముఖీ మయూరపదకమ్.*

చేతి బొటనవ్రేలి గోటితో చనుమొనల క్రింది భాగంలోనూ, నాలుగు వ్రేళ్ళ గోళ్ళతో చూచుకానికి (స్తనాగ్రం) పై భాగంలోనూ, నాటేలా నఖక్షతం చేస్తే దాన్ని మయూర పదకం అంటారు. ఈ రకం నఖక్షతంలో అయిదు వ్రేళ్ళగోళ్ళూ చూచుకానికి (చనుముక్కుకు) చుట్టుకుని అభిముఖంగా ఉంటాయి.

20. *తత్సం ప్రయోగ శ్లాఘాయాః స్తనచూచుకే సంనికృష్టాని పంచనఖ పదాని శశప్లుతకమ్.*

మయూరపదకం ప్రయోగించినప్పుడు మగువకు ప్రేమానురాగాలు అధికమవుతాయి. అప్పుడామె చనుమొనలకు సమీపంగా అయిదువ్రేళ్ళ గోళ్ళ కొసలు ఒక్కటిగా చేర్చి ఆనించి క్షతం చేయడాన్ని శశప్లుతకం అంటారు. ఇంతులకు

ఎంతో ఇష్టమైన నఖక్షతం ఇది. సాధారణంగా ఏ కామిని అయినాసరే, చనుమొనల మీద అయిదు వ్రేళ్ళ గోళ్ళు ఆనించి క్షతం చేస్తే, అమితంగా ఆనందిస్తుంది. ప్రియుణ్ణి ఎంతగానో మెచ్చుకుంటుంది.

( రతి సమయంలో కాముకులు తెలుసుకోవలసిన రహస్యాలు ఇవి.)

21. *స్తనపృష్ఠే మేఖలాపథే చోత్పలపత్రాకృతీత్యుత్పల పత్రకమ్.*

చంచలాక్షి అయిన స్త్రీ చనుమొనకు వెనుకభాగంలోనూ, కటి ప్రదేశంలోనూ, నల్లకలువ రేకుల్లా, గోళ్ళ కొసలు ఆనించి గిచ్చడాన్ని, గిల్లడాన్ని ఉత్పల పత్రకం అంటారు.

22. *ఊర్వోః స్తనపృష్ఠే చ ప్రవాసం గచ్ఛతః స్మరణీయకం*
*సంహతా శ్చతస్ర స్తిస్రోవా లేఖా, ఇతి నఖకర్మాణి.*

పురుడు దేశాంతరానికీ, లేదా దూర ప్రాంతాలకు వెళ్ళేటప్పుడు, మనకు వియోగం ఎక్కువ కాలం లేకుండుగాక! అని కోరుకుంటూ, శుభప్రదంగా వుండడం కోసం గుర్తుగా, ప్రేయసి తొడమీద నాలుగు లేదా, మూడు, లేదా రెండు నఖక్షతాలు చెయ్యాలి. అంటే దూరదేశాల్లో ఎక్కువ కాలం వుండే యెడల ఎక్కువసార్లు, తక్కువకాలం వుండేటట్లయితే తక్కువసార్లు నఖక్షతాలు ప్రయోగించాలన్న మాట. ప్రేయసితో ఎడబాటు సంభవిస్తున్నప్పుడు ఆమెకు జ్ఞాపకం వుండడం కోసం చేసే నఖక్షతం ఇది. అందుకే దీనికి 'స్మరణీయకం' అని పేరు పెట్టారు.

23. *ఆకృతివికారయుక్తా, న్యన్యాన్యపి కుర్వీత.*

అంతే కాకుండా పక్షులు, పుష్పాలు, పాత్రలు, ఆకులు, తీగెలు మొదలైన వాటి ఆకారాలతో కూడా నఖక్షతాలు చేయవచ్చు. దీనిని బట్టి స్త్రీ పురుషుల ఇష్టాలను బట్టి, అభిరుచులను బట్టి ఎన్నో విధాల నఖక్షతాలు చేయవచ్చునని స్పష్టం అవుతూవుంది.

24. *వికల్పానా మనంతత్వా దానం త్యాచ్చ కౌశలవిధే రభ్యాసన్య చ*
*సర్వగామిత్వా ద్రాగాత్మకత్వా చ్ఛేదస్య ప్రకారాన్,*
*కోzభి సమీక్షితు మర్హతీత్యాచార్యాః*

నఖక్షతాలు అనేవి మొత్తం మీద ఎనిమిది రకాలే. అయినప్పటికీ వీటిలో మళ్ళీ మళ్ళీ ఏర్పడే ప్రభేదాలకు లెక్కలేదు. నేర్పు, అభ్యాసాన్ని బట్టి వీటిలో అనేక రకాలు ఏర్పడవచ్చు. పైగా నఖక్షతాలనేవి ప్రేమికులకు ప్రేమ చిహ్నాలుగా వుంటాయి. ఈ కారణాలవల్ల ఈ నఖక్షతాలలో ఎన్ని రకాలు పుట్టుకొస్తాయో ఎవడు చెప్పగలడు ? అంటారు ప్రాచీన ఆచార్యులు.

25. *భవతి హి రాగోzపి చిత్రాపేక్షా వైచిత్ర్యాచ్చ పరస్పరం రాగో*
*జనయితవ్యో, వైచక్షణ్య యుక్తాశ్చ గణికా స్తత్కామినశ్చ పరస్పరం*
*ప్రార్థనీయా భవంతి, ధనుర్వేదాది ష్వపి హి శస్త్ర కర్మ శాస్త్రేషు*
*వైచిత్ర్యమేవ ఆపేక్ష్యతే, కిం పునరిహేతి వాత్స్యాయనః*

ఇప్పుడు వాత్స్యాయనుడు తన అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నాడు. స్త్రీ పురుషుల మధ్య ప్రేమానురాగాలు వున్న సమయంలోనూ, అవి లేని సమయంలోనూ కూడా ఈ నఖక్షతాలు ప్రయోగించబడతాయి. కాబట్టి ఇవి లెక్కలేనన్నివిగా వుండడంలో ఆశ్చర్యం లేదు. అసలు అనురాగం అనేది సహజమైనదే అయినా లేక కల్పితమైనదే అయినా, కొత్త కొత్త విచిత్రాలు లేకపోతే అనురాగం పుట్టదు. అలాంటి చిత్ర విచిత్రాలు బాగా తెలుసుకుని, సందర్భానుసారంగా ప్రయోగించే సమర్థత గల దేవదత్తలాంటి వేశ్యలు వున్నారు. చాలాసేపు రతిక్రీడ సలుపగల మూలదేవుడు లాంటి విటులూ వున్నారు. వీరు ఒకరినొకరు ప్రార్థించుకుని రకరకాల నఖక్షతాలతో చిత్ర విచిత్రంగా సంభోగం చేయడానికి సమర్థులు. అందువల్ల కామినీ కాముకులకు విశేషమైన వైచిత్రిగల అనురాగం పుట్టుకొస్తుంది. ఇలాంటి చిత్ర విచిత్రాలను అపేక్షించడం, అవి నేర్చుకున్న వారిని అనుసరించడం, కామ శాస్త్రంలోనే కాక, తక్కిన శాస్త్రాల్లో కూడా కనిపిస్తూనే వుంది.

ధనుర్వేదం వుంది. శస్త్రాస్త్రాలు, ఖడ్గాలు, కుంతాలు మున్నగు ఆయుధాలు ప్రయోగించడం ఎలాగో నేర్పే ధనుర్విద్యా పారంగతులు విచిత్ర ప్రయోగాలు చేస్తూ వుంటారు. వాటిని తక్కిన వారు అనుసరించడం పరంపరగా వస్తూనే వుంది.

కొత్తదనం గల ప్రేమానురాగల కోసం, రకరకాల చేష్టలకై అనుభవాలపై వెంపరలాడే కామినీ కాముకులకు బోధించే ఈ కామశాస్త్రంలోని చిత్ర విచిత్రాలను గురించి వేరే చెప్పాలా? ఈ శాస్త్రంలో వైచిత్ర్యమే ప్రధానం. చతురుడైన రసికుడు ఎన్నెన్ని చమత్కారాలైనా చేయవచ్చు. అలా చేయకపోతే నాగరకుడికీ, అనాగరకుడికీ తేడా ఏముంటుంది? అంటున్నారు వాత్స్యాయనులు.



# నఖక్షతాల్లో ఎన్నెన్నో రకాలు!

*26.* *నతు పరపరిగ్రహీతాస్వేవం కుర్యాత్, ప్రచ్ఛన్నేషు ప్రదేశేషు*
*తాసా మనుస్మరణార్థం రాగవర్ధనాచ్ఛ విశేషాన్ దర్శయేత్.*

పర భామినులు ఎన్నెన్ని రకాల వైచిత్రాలను కోరేవారైనప్పటికీ, చిత్ర విచిత్ర రతులతో ఉప భోగింపవలసిన వారు. అంచేత వారికి తొడలు, కటి ప్రదేశం, గజ్జలు మొదలైన రహస్య స్థానాల్లో మాత్రమే జ్ఞాపకం కోసం విటులు ఈ నఖక్షతాలు ప్రయోగించాలి. ఈ నఖక్షతాలలోని విశేషాలు చూసుకుని స్త్రీలు తమ ప్రియులను లేదా విటులను ఎల్లప్పుడూ స్మరించుకుంటూ వుంటారు.

(ప్రేయసీ ప్రియులు ప్రతిరోజూ కలుసుకోడం గానీ, రతి క్రీడ సాగించడం గాని కుదరదు కదా! అంచేత ఒకసారి ఒక స్త్రీ ఒక పురుషుడితో సంభోగిస్తే, ఆ రతి క్రీడా విలాసం బ్రతికి వున్నంతకాలం ఆ స్త్రీకి జ్ఞాపకం వుండాలి. అలా జ్ఞాపకం వుండాలంటే పురుషుడు చిత్ర విచిత్రమైన నఖక్షత, దంతక్షత, చుంబన, ఆలింగనాదుల చేత, వివిధ విధాలైన రతిగతుల చేత, మగువను తృప్తిపరిస్తే, ఆజన్మాంతం ఆమె ఆ పురుషుణ్ణే కోరుతూ వుంటుంది. ఎక్కడ వున్నా, ఎంతమందిలో వున్నా ఆ కాముకుడి కోసమే అర్రులు చాస్తూ వుంటుంది.)

విశేషమైన నఖక్షతాల గుర్తులు చూసినప్పుడల్లా స్త్రీలకు సంతోషం అతిశయిస్తుంది. మదనోద్రేకం పుట్టుకొస్తుంది. మధురాతి మధురమైన స్మృతి అది.

*27.* *నఖక్షతాని పశ్యంత్యా గూఢస్థానేషు యోషితః*
*చిరోత్సృష్టా అవ్యభినవా ప్రీతిర్భవతి పేశలా.*

తమ రహస్య స్థలాలలో సొగసుగాళ్ళు చేసిన నఖక్షతాలను చూసుకుంటూ స్త్రీలు ఎంతోకాలంగా వియోగం అనుభవిస్తున్నా కొత్త కొత్త ప్రియుల కోసం వెదుకుతూ ఉండడం సహజం.

*28.* *చిరోత్సృష్టేషు రాగేషు ప్రీతిర్గచ్ఛేత్పరాభవం*
*రాగాయతన సంస్మారి యది న స్యాన్నఖక్షతమ్.*

ప్రేయసీ ప్రియులు కలుసుకుని ఎంతోకాలం అయిందనుకోండి. తరువాత వారు విడిపోయారు. మళ్ళీ ఒకరినొకరు కలుసుకోలేదు. అంచేత వారిమధ్య ప్రేమానురాగాలు కొంత సన్నగిల్లడం సహజమే. అయినప్పటికీ మొదటిసారి కలుసుకున్నప్పుడు ప్రియుడు రసికుడై చిత్ర విచిత్ర రీతుల్లో నఖక్షతాలు చేసి వుంటే, వాటిని, ఆ ప్రియుడు రూపురేఖలను, యౌవనాన్ని, గుణాలను ఆ స్త్రీ నిత్యం జ్ఞాపకం చేసుకుంటూ వుంటుంది. అంచేత కామశాస్త్రంలో ఈ నఖక్షతాలు ప్రధానపాత్ర వహిస్తున్నాయి.

*29.* *పశ్యతో యువతిం దూరాన్నఖోచ్ఛిష్ట పయోధరామ్*
*బహుమానః పరస్యాపి రాగయోగశ్చ జాయతే.*

ఒక పురుషుడి వల్ల తన పాలిండ్లపై నఖక్షతాలు పొంది వున్న స్త్రీ ఆ పురుషుడు అల్లంత దూరాన కనిపించినా, అలాగే పురుషుడు ఆ స్త్రీ ఎంతో దూరాన అగుపించినా, అభిమానం, అనురాగం పొందుతారు. చూచారా, ఈ అనుభవం ఎంత గొప్పదో!

*30. పరుషశ్చ ప్రదేశేషు నఖచిహ్నైర్విచిహ్నితః*

*చిత్తం స్థిరమపి ప్రాయః చలయత్యేవ యోషితః*

పైన పేర్కొన్న దాన్ని బట్టి, పురుషుడు స్త్రీ చేత నఖక్షతాలు పొంది ఆమెను మళ్ళీ చూసినప్పుడు ఎలా విచలిత మనస్కుడవుతాడో, అలాగే పురుషుడి చేత నఖక్షతాలు పొందిన స్త్రీ కూడా మళ్ళీ అతన్ని చూచినప్పుడు తాను దేవతా పూజలో వున్నా, వ్రతాదులు అనుష్ఠిస్తూ వున్నా చంచల చిత్త అవుతుంది.

*31. నాన్యత్పటుతరం కించిదస్తి రాగవివర్ధనం*

*32. నఖదంత సముత్థానాం కర్మణామ్ గతయో యథా.*

స్త్రీ పురుషులకు ప్రేమానురాగాలు వృద్ధి పొందించడంలో ఈ నఖక్షతాలు, దంతక్షతాలు ఉపయోగపడినట్లుగా మరే చేష్టలు వుపయోగపడవు.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే, కామసూత్రే సాంప్రయోగికే, ద్వితీయే ౭ధికరణే, నఖచ్ఛేద్యోనామ చతుర్థో౭ధ్యాయః*

**ఇది వాత్స్యాయన ముని విరచిత కామసూత్రాల్లో సాంప్రయోగిక అధికరణంలో నఖక్షతం అనే నాలుగో అధ్యాయం.**



# పంచమాధ్యాయం

## దశనచ్ఛేద్యం

*1. ఉత్తరోష్ఠ మంతర్ముఖం నయన మితి ముక్త్వా చుంబన వద్దశన రదనస్థానాని.*

**వెనుకటి** అధ్యాయంలో చెప్పినట్లు కామోద్రేకానికి నఖక్షతాలకు మించిన ప్రక్రియ లేదు. అయితే, అంతటితో ఊరుకోడానికి వీలులేదు. 'అధికస్య అధికం ఫలమ్' అన్నట్లు, ఆ ప్రేమానురాగాలు ఇంకా ఇంకా వృద్ధి పొందాలి. అందుకే దంత క్షతాలు. ఇవి కూడా చాలా అవసరం. అయితే, ఇవి ఆయా దేశాలకు అనుకూలమైనవిగా వుండాలి. ఆ విధంగా ప్రయోగిస్తేనే వీటి ప్రయోజనం. సార్థక్యత. మరో విషయం కూడా ముఖ్యంగా గమనించాలి. పళ్ళతో కొరకడం, నొక్కడం అంటే, మోటుగా లోతైన గాట్లు పడేటట్లు నెత్తురు చిమ్మేటట్లు కాదు. అది రాక్షస చర్య అవుతుంది. పంటితో సుతారంగా, సుతిమెత్తగా నొక్కాలి. కొరికీ కొరకనట్లుగా ఎంతో నాజూగ్గా కొరకాలి. స్త్రీ శరీరం పువ్వులాంటిది. అవయవాలన్నీ ఎంతో మృదువుగా వుంటాయి. పువ్వుపై వాలిన తుమ్మెద, ఆ పువ్వు అందాన్ని, ఆకారాన్ని, పరిమళాన్ని దేన్నీ కూడా కించిత్తు అయినా చెడగొట్టకుండా అందలి మధువును ఆస్వాదిస్తుంది. అలాగే పురుషుడు కూడా నఖక్షత, దంతక్షతాలతో కాంతకు ఏ మాత్రం బాధ కలుగకుండా ఆమె అవయవ సౌందర్యాన్ని త్రాగుతూ ఆమెకు ఆనందం కలిగించాలి.

ఇక దంతక్షతాలు ప్రయోగించదగిన స్థానాలు చెపుతున్నారు. పై పెదవి, నాలుక, నేత్రాలు - వీటిని విడిచిపెట్టి ముద్దుల కోసం చెప్పిన పది స్థానాలూ దంతక్షతాలకు సయితం ఉపయోగపడతాయి. అంటే, నుదురు, అధరం, కంఠం, చెక్కిళ్ళు, వక్షస్థలం, చన్నులు - ఇవి దంతక్షతాలకు యోగ్యాలన్నమాట. ఇక గిజ్జలు, చంకలు, భగం - ఈ మూడు ప్రదేశాల్లో లాట దేశస్థులు మాత్రమే ముద్దుపెట్టుకుంటారు. దంతక్షతాలు చేస్తారు. తక్కిన ప్రాంతాల వారెవరూ ఈ చోట్లలో చుంబించకూడదు. దంతక్షతం చేయకూడదు.

## దంతాలు ప్రేమోదంతాలు

*2. సమాః స్నిగ్ధచ్ఛాయా రాగగ్రాహిణో యుక్తవమాణా*
*నిశ్ఛిద్రాస్తీక్ష్ణాగ్రా ఇతి దశనగుణాః*

ఇక ఇక్కడ దంతాలు ఎలా ఉండాలో చెపుతున్నారు. స్త్రీకైనా పురుషునికైనా అందం ఇచ్చే వాటిల్లో దంతాలు ముఖ్యమైనవి. ముక్కు, మొగం, కళ్ళు ఎంత బాగున్నా పళ్ళు అందంగా లేకపోతే మనిషి ఆకారమే చెడిపోతుంది. కొందరు రమణులుంటారు, అన్ని విధాలా ఎంతో అందంగా వుంటారు. పళ్ళ దగ్గర మాత్రం ఆ అందం అంతా మట్టిగొట్టుకుపోతుంది. కొందరివి మిట్ట పళ్లు.

కొందరికి రాక్షస కోరల్లా బయటికి వెళ్ళుకొచ్చి వుంటాయి. కొందరివి బ్రెపళ్ళు. పలువరస దానిమ్మ గింజల్లా ఎంత అందంగా వుంటే, స్త్రీ పురుషుల సౌందర్యం అంతగా రాణిస్తుంది. అంచేత పళ్ళు గొగ్గిపళ్ళు కాకుండా సమంగా, సందులు లేకుండా, సున్నగా తళ తళ లాడుతూ వుండాలి. తగిన పొడవు, వెడల్పు కలిగి తాంబూల రాగంతో శోభిల్లుతూ, వాడిగా మొనలు తేలి వున్న పళ్ళు దంతక్షతాలకు చాలా శ్రేష్టమైనవి.

*3. కుంఠా, రాజ్యూర్ధ్వలాః, పరుషాః విషమాః*
*శ్లక్ష్ణాః పృథవో, విరళా ఇతి చ దోషాః*

ఇక దంతాలలో దోషాలు చెపుతున్నారు. పళ్ళు మొక్కపోయి ఉన్నా, మధ్య మధ్య చారలు కలిగి ఉన్నా, గొగ్గిగా ఉన్నా, మరీ కరుకుగా ఉన్నా, మరీ పెద్దవిగా పారపళ్ళుగా ఉన్నా, తొర్రిగా ఉన్నా, సందులు జాస్తిగా ఉన్నా, అలాంటి పళ్ళు ముఖానికి అలంకారం కాదు. సరికదా, వికృత రూపాన్ని తెచ్చి పెడతాయి. పైగా దంతక్షతాలకు పనికిరావు. పళ్ళలో ముఖ్యమైన దోషాలు ఇవి.

*4. గూఢక, ముచ్ఛూనకం, బిందు, ర్బిందుమాలా, ప్రవాళమణి,*
*ర్మణిమాలా, ఖండాభ్రకం, వరాహ, చర్వితక మితి దశనచ్ఛేదన వికల్పాః*

నఖక్షతాల్లో ప్రధానంగా ఎనిమిది రకాలున్నట్లే, ఈ దంతక్షతాలు కూడా ఎనిమిది రకాలు. అవి గూఢకం, ఉచ్ఛూనకం, బిందువు, బిందుమాల, ప్రవాళమణి, మణిమాల, ఖండాశ్రుకం, వరాహ చర్వితకం.

*5. నాతిలోహితేన రాగమాత్రేణ విభావనీయం గూఢకం.*

రకరకాలైన ఈ దంతక్షత స్వరూపం గురించీ, వాటిని ఎప్పుడు ఎక్కడ ఎలా ప్రయోగించాల్సిందీ చెపుతున్నారు.

## దంతాలు, దంతక్షతాలు!

దంత సౌందర్యం ఒక సౌందర్యం, దంత సౌభాగ్యం ఒక సౌభాగ్యం. దంత సౌందర్యం ఉన్నప్పుడే దంతక్షతంలో ఆనందం!

ఎక్కువ ఎర్రగా కందిపోకుండా పంటి మొనతో నొక్కడాన్ని గూఢకం అంటారు. మిక్కిలి శ్రేష్ఠంగా, అందంగా ఉన్న పంటి మొనతో, అట్టే నొప్పి కలుగకుండా నొక్కడం ఈ దంతక్షతంలో ప్రత్యేకత.

*6. తదేవ పీడనా దుచ్ఛూనకం*

పైన చెప్పిన దానికన్నా మరి కొంచెం గట్టిగా నొక్కితే దాన్ని ఉచ్ఛూనకం అంటారు. ఇలా నొక్కిన చోట కొంచెం పొక్కుతుంది. అదీ ఈ దంతక్షతంలో విశేషం!

*7. తదుభయం బిందు రధరమధ్య ఇతి.*

పైన పేర్కొన్న గూఢకం, ఉచ్ఛూనకం, ఇక ముందు చెప్పబోయే బిందువు - ఈ మూడు రకాల దంతక్షతాలను అధరానికి మధ్యలోనే ప్రయోగించాలి.

*8. ఉచ్ఛూనకం ప్రవాళమణిశ్చ కపోలే.*

అయితే ఉచ్చూనకం, ప్రవాళ మణి అని రెండు రకాల దంతక్షతాలను స్త్రీల బుగ్గల మీద ప్రయోగించడం అవసరం. ఎంచేతనంటే వీటిని ప్రయోగించడానికి స్త్రీల చెక్కిళ్ళే చాలా అనుకూలంగా ఉంటాయి.

*9. కర్ణపూరచుంబనం నఖదశనచ్ఛేద్యమితి సవ్యకపోల మండనాని.*

అయితే, ఏ బుగ్గమీద వీటిని ప్రయోగించాలి? అన్న ప్రశ్న ఉదయిస్తుంది. దానికి సమాధానం చెపుతున్నారు శాస్త్రకారులు. కర్ణాలంకారాన్ని ముద్దాడడం, నఖక్షతాలు చేయడం, దంతక్షతాలు ప్రయోగించడం, ఇవ్వన్నీ ఎడమ బుగ్గమీదనే చెయ్యాలి. అప్పుడే అది అలంకారమై భాసిస్తుంది.

*10. దంతోష్ఠసంయోగాభ్యాస నిష్పాదనా ప్రవాళమణి సిద్ధిః*

అటు పై పళ్ళనూ క్రింది పెదవి కానీ, ఇటు క్రింది పళ్ళనూ పై పెదవిని కానీ క్షతం చేసే ప్రదేశంలో సమకూర్చి పదే పదే కొరుకుతూ బాధ కలిగేలా చేస్తే, దాన్ని ప్రవాళమణి సిద్ధి అంటారు. అభ్యాసం వల్ల ఈ ప్రవాళమణిలో పన్ను నాటుకుని ఎర్రగా జేవురించకుండా, దంతాలు, పెదవుల విన్యాసం మాత్రమే ఈ ప్రయోగంలో జరుగుతూ ఉంటుంది.

*11. సర్వస్యేయం మణిమాలాయాశ్చ.*

ప్రవాళమణిలాగానే మణిమాల కూడా పళ్ళతోను, పెదవితోనూ చేసేదే అయితే, దానికీ, దీనికీ కొంచెం బేధం ఉంది. అదేమిటే అంటే, ఒక్కచోట మాత్రమే దాన్ని ప్రయోగిస్తే ప్రవాళమణి సిద్ధి, వరుసగా అనేకచోట్ల చేస్తే, మణిమాలా అవుతాయి.

*12. అల్పదేశాయాశ్చ త్వచో దశన ద్వయ సందంశజా బిందుసిద్ధిః*

కంఠానికి ప్రక్క భాగాల్లో మినపగింజంత, అధరోష్టం మీద నువ్వు గింజంత, పై పంటితోనూ క్రింది పంటితోనూ క్షతం చేస్తే దాన్ని బిందు సిద్ధి అంటారు. ఇందులో ముందరి నాలుగు పళ్ళతోనూ ఒక్కసారిగా కొరకడం జరుగుతుంది.

*13. సర్వైర్బిందుమాలాశ్చ.*

ఈ బిందు సిద్ధినే అనేక చోట్ల చేస్తే దాన్ని బిందుమాల అని అంటారు.

*14. తస్మాన్మాలాద్వయమపి గళ కక్ష వంక్షణ ప్రదేశేషు*

పైన చెప్పిన మణిమాల, బిందుమాల ఈ రెండు రకాల దంతక్షతాలు స్త్రీ కంఠం మీద, చంకల్లోనూ, గజ్జల్లోనూ, ప్రయోగించవచ్చు.

*15. లలాటే చోర్వోర్బిందుమాలా.*

నుదిటిపైన, తొడలపైనా కూడా బిందుమాల అనే దంతక్షతం చేయవచ్చు.

*16. మండలమివ విషమకూటకయుక్తం ఖండాభ్రకం స్తనపృష్ఠ ఏవ*

కొన్ని దంతాలు గట్టిగా నాటుకునేలాగా, కొన్ని దంతాలు కొద్దిగా నాటుకునేటట్లుగాను, ఇంకా కొన్ని దంతాలు మరీ స్వల్పంగా నాటుకునే లాగాను పాలిండ్ల మీద గుండ్రని ఆకారంలో కొరికితే - దాన్ని ఖండాభ్రకం అంటారు. ఈ రకం దంతక్షతం స్తనాల మీద చెయ్యడానికి చాలా వీలుగా, సుఖంగా ఉంటుంది.

*17. సంహతాః ప్రదీర్ఘా బహ్వ్యో దశన పదరాజయ*
*స్తామ్రాంతరాళా, వరాహ చర్వితకం స్తనపృష్ఠ ఏవ.*

ఒంటిమీద ఒక వైపు నుంచి, మరొక వైపు దాకా చర్మాన్ని పంటితో బాగా నొక్కి లోతుగా, ఎర్రగా గంట్లు పడేలాగా నాలుగైదు వరుసలు పడేటట్లు దంతక్షతం చేస్తే, దాన్ని వరాహ చర్వితకం అంటారు. ఈ రకమైన దంతక్షతాన్ని చండ్ల వెనుకభాగాన చేయడానికి అనుకూలంగా ఉంటుంది. ప్రేయసి అమితంగా సంతోషిస్తుంది కూడా.

*18. తదుభయమపి చ చండ వేగయోః ఇతి దశనచ్ఛేద్యాని.*

పైన పేర్కొన్న ఖండాభ్రకం, వరాహ చర్వితకం - ఈ రెండు రకాలైన దంతక్షతాలను కూడా చాలాసేపు రతి చేయగల పురుషుడు మాత్రమే ప్రయోగించదగినది. స్త్రీ కూడా వీటిని ప్రయోగించవచ్చు. అంటే స్త్రీలు పురుషుడి వక్షస్థలంపై చేయవచ్చునన్న మాట. శాస్త్రాధికారం అనేది స్త్రీ పురుషులిద్దరికీ సమానమే కాబట్టి, ఇందులో చెప్పబడినవన్నీ పురుషుడు స్త్రీలపై ప్రయోగించినట్లే స్త్రీలు పురుషులపై ప్రయోగించవచ్చు. ఆక్షేపణ లేదు. జంకవలసిన అవసరమూ లేదు. అయితే, దేశాచారం, కాలం మొదలైన వాటిని బట్టి కొన్ని మాత్రం స్త్రీలు చేయకూడనివిగా ఉంటున్నాయి.

పురుషులూ, స్త్రీలూ ఒకళ్ళపై ఒకళ్ళు ప్రయోగించుకునే దంతక్షతాలూ ఎనిమిది రకాలు మాత్రమే ఇక్కడ చెప్పడం జరిగింది. సంభోగానికి పూర్వం, సంభోగ సమయంలోను ఈ దంతక్షతాలు ప్రయోగిస్తే స్త్రీ పురుషులిద్దరికీ అమితమైన కామోద్రేకం కలిగి, ఎంతో సుఖంగా ఉంటుంది. కాబట్టి నఖక్షతాల వలెనే ఈ దంతక్షతాలూ చాలా ముఖ్యమైనవి.

*19. విశేష కే కర్ణపూరే పుష్పాపీడే తాంబూల పలాశే తమాలపత్రే*
*చేతి ప్రయోజ్యాగామిషు నఖ దశనచ్ఛేద్యాదీ న్యాభియోగికాని.*

యువతీ యువకులకు ఒకరితో ఒకరికి పరిచయం లేనప్పుడు, పరిచయం కలిగించుకోడానికి ఎన్నో ఉపాయాలున్నాయి. వాటిల్లో ఒకటి, ఒకరి భావాలు ఒకరికి గోప్యంగా తెలియపరచుకోడం - స్త్రీల దగ్గరికి వెళ్ళే పురుషులు భూర్జపత్రాలు, (మెత్తని చర్మం వంటి ఆకులు గల భుజపత్ర చెట్టు ఆకులు, ఈ ఆకులు చాలా ప్రసిద్ధమైనవి. పూర్వకాలంలో మంత్రాలు, యంత్రాలు మున్నగునవి ఈ భూర్జ ప్రతాలపైనే వ్రాసేవారు) తలమీద, చెవులలో అలంకారార్థం ధరించే పువ్వులు, పూబంతులు, మెత్తని లేత తమలపాకులు, మోదుగాకులు, తాపింఛ పత్రాలు (చీకటి మ్రాను ఆకులు) ఇలాంటి వాటిమీద గోళ్ళతోనూ, పళ్ళతోనూ కొన్ని ఆకారాలు గీసి, ఆ విధంగా తమ మనోభావాలు రహస్యంగా తెలియజేస్తారు. దీన్ని అభియోగం అంటారు. ఇలా రకరకాల ఆకుల మీద, సుందరమైన వస్తువుల మీద నఖక్షత, దంతక్షతాలతో గుర్తులు కల్పించి, పరిమళ ద్రవ్యాలు అదిమి

గుమగుమలాడేలా చేసి, ధూతికల ద్వారా యువతుల దగ్గరికి పంపాలి. స్త్రీలు అవి అందుకుని ప్రియుడి మనోభావాలు తెలుసుకుంటారు. వారు కూడా అలాగే గుర్తులు సృష్టించి, సమాధానాలు పంపుతారు. స్త్రీ పురుషులు ఒకరితో ఒకరు పరిచయం చేసుకోడానికి ఒకరి అభిప్రాయం ఒకరు తెలుసుకోడానికి అనుసరించే పద్ధతి ఇది.

*20. దేశ సాత్మ్యాచ్చ యోషిత ఉపచరేత్*

ఆచారం, ఆచారం అంటూ ఉంటాం మనం. ఈ ఆచారం అనేది రెండు రకాలుగా వుంది. ఒకటి దేశాచారం - అంటే దేశంలో సాధారణంగా జనులు అనుసరించేది. రెండోది ఎవరికి వారు స్వతస్సిద్ధంగా, తమకు ఇష్టమైన పద్ధతిలో అనుసరించే ఆచారం. ఈరెండు రకాల ఆచారాల ప్రకారం స్త్రీ పురుషుల రతి క్రీడల్లో మునిగి తేలుతూ వుండవచ్చు. అంటే పురుషులు స్త్రీలను, స్త్రీలు పురుషులనూ శృంగార చేష్టలతో ఉపచరించ వచ్చునన్న మాట. ఇక్కడ ఉపచరించడం అంటే, స్త్రీలను పురుషులూ, పురుషులను స్త్రీలూ రంజంపజేయడం లేక తృప్తిపరచడము అని అర్థం.

*21. మధ్య దేశ్యా ఆర్యప్రాయాః శుచ్యుపచారాశ్చుంబన! నఖదంత పదద్వేషిణ్యః.*

భారతదేశంలో అనేక ప్రాంతాలున్నాయి. ప్రాచీన కాలంలో వాటి పేర్లు ఇలా ఉన్నాయి. ఒకటి మధ్యదేశం - హిమవత్పర్వతానికి, వింధ్య పర్వతానికి మధ్యగానూ, విపాశనానికి తూర్పుగానూ, ప్రయాగకు కొంచెం పడమరగాను వున్న దేశం ఇది. భృగువు చేసిన నిర్వచనం ఇది.మరి కొందరు గంగ, యమునల మధ్య ప్రదేశం మధ్యదేశం అంటారు. వశిష్ఠుడి మతం ఇది. అయితే, భృగువు చేసిన నిర్వచనం శాస్త్ర కారులు అంగీకరిస్తునారు. ఈ మధ్యదేశంలోని ఆచారాలు పరమ పవిత్రాలుగా పరిగణిస్తారు. ఎందుచేతనంటే, లోకోత్తర పురుషులు, పవిత్ర చరిత్రులు అయిన ఆర్యులు ఈప్రాంతంలోనే వుండి అనుసరించిన ఆచారాలు ఇవి. ఈదేశంలో స్త్రీలు ముద్దులన్నా, నఖక్షతాలు, దంత క్షతాలు అన్నా ద్వేషిస్తారు. వారికి కేవలం కౌగిలింతలు మాత్రమే ఇష్టం. ప్రణయ తాడనాల విషయంలో ఒక మోస్తరు అభిలాష కలిగి వుంటారు.

*22. బాహ్లీకదేశ్యా ఆవంతిక్యశ్చ.*

రెండు బాహ్లీకదేశం, అంటే ఉత్తరాపథం. అవంతిక అంటే సాహసాంక విక్రమార్క చక్రవర్తి పాలించిన ఉజ్జయిని ప్రాంతం. ఈరెండు దేశాల్లోకూడా కాంతలు ముద్దులన్నా, నఖక్షతాలు, దంత క్షతాలన్నా అసహ్యించుకుంటారు.

*23. చిత్రరతేషు త్వాసా మభినివేశః.*

ఇక్కడి రమణులకు చిత్ర రతాలంటే చాలా ఇష్టం. ఈ చిత్ర రతాలను గురించి ముమ్ముందు చెప్పడం జరుగుతుంది.



# దేశాచారాన్ని బట్టి ముద్దులూ మురిపాలు!

24. *పరిష్వంగ చుంబన నఖదంత చూషణ ప్రధానాః*
*క్షతవర్జితాః ప్రహణనసాధ్యాః మాలవ్యః అభీర్యశ్చ.*

ఇక పూర్వమాళవ దేశం, శ్రీకంఠక్షేత్రం, కురుక్షేత్రం వున్నాయి. ఇక్కడి మగువలు కౌగలింతలంటే పులకించిపోతారు. అలాగే ముద్దులన్నా నఖక్షతాలు, దంతక్షతాలన్నా ఎగిరి గంతులేస్తారు. ఇవంటే చాలా ఇష్టం వారికి. అయితే, గాట్లు పడేలాగా గిచ్చినా, కొరికినా ఒప్పుకోరు. ప్రణయ తాడనాలకు పరవశించిపోయి, పురుషులకు 'దాసోహం' అంటారు.

25. *సింధుషష్ఠానాం చ నదీనా మంతరాళీయా ఔపరిష్టిక సాత్మ్యాః.*

ఇక సింధు, విపాశ, శతుద్రు, ఇరావతి, చంద్రభాగ, వితస్త- అనే ఆరు నదులున్నాయి. ఈ ఆరు నదుల మధ్యగల దేశంలో జన్మించిన పడతులు కౌగలింతలు, ముద్దులు, నఖక్షతాలు, దంతక్షతాలు, ప్రణయతాడనాలు, సీత్కృతాలు - ఇలాంటివన్నీ ప్రయోగించినా తృప్తిపడరు. అంతులేని కామం వాళ్ళది. పురుషుడి లింగాన్ని నోట్లో పెట్టుకుని కుడుస్తూ, చీకుతూ ఔపరిష్టిక క్రియ కూడా ఆచరిస్తే కాని వాళ్ళ కామాగ్ని చల్లారదట! దీన్నే 'ముఖరతి' అంటారుముద్దుగా! ఇలాంటి కోరికగల స్త్రీలను 'ముఖచపలలు' అంటారు.

(ప్రసిద్ధమైన సింధునదిలో జీలం, చీనాబ్, రావి, బియాస్,సట్లెజ్ నదులువచ్చి కలుస్తున్నాయి. ఈ పంచ నదులు ప్రవహించే దేశానికే పంజాబ్ అని పేరు వచ్చింది. జీలం నదికే పూర్వం వితస్తా నది అని పేరు.ఉమ లేక సతీదేవి ఈ నదీ రూపంలో ప్రవహించినట్లు చెపుతారు. అలాగే చీనాబ్ నదికే పూర్వం

చంద్రభాగ అని పేరు. ఇరావతి అంటే రావినది. బియాస్ నదికే విపాశ అని పేరు. శతద్రు అంటే సట్లెజ్ నది.

పూర్వం విశ్వామిత్రుడివల్ల అనేక కష్టాలు అనుభవించిన వశిష్టమహర్షి విరక్తుడై ఒక నదిలో దూకి ఆత్మహత్య చేసుకోడానికి ప్రయత్నించాడట! అప్పుడా నది వశిష్ట మహర్షి తేజస్సును భరించలేక భయంతో నూరు వైపులకు పరుగులు తీసింది. వశిష్టుడు చావకుండా ఒడ్డుకు చేరుకున్నాడు. అప్పటినుంచీ ఈ నదికి శతద్రు అని పేరు వచ్చింది. శత అంటే నూరు. ద్రుతం అంటే పారిపోవడం.

అయినా వశిష్టుడు మరోసారి ఆత్మహత్యకు యత్నించాడు. ఈ సారి కాళ్ళకు, చేతులకు తీగలు కట్టుకుని మరో నదీ ప్రవాహంలో దూకాడు. కాని అతను అలా నదిలో దూకగానే బంధాన్నీ విడిపోయాయి. మహర్షి ప్రాణాలు తీయడానికి ఆ నది వెరచింది. ఆయన్ను ప్రాణాలతో మళ్ళీ ఒడ్డుకు చేర్చింది. ఇలా పాశాలను (బంధాలను) తొలగించింది. కాబట్టి ఆ నదికి విపాశ అని పేరు వచ్చింది)

*26. చండవేగా మందసీత్కృతా అపరాంతిక్యో లాట్యశ్చ.*

ఇక, పశ్చిమ సముద్ర తీరానగల దేశానికి అపరాంత దేశం అని పేరు. అక్కడ ఉండే స్త్రీలను అపరాంతికలు అంటారు. అపరమాళవ దేశానికి పడమరగా వుండేది లాట దేశం. అక్కడ పుట్టిన స్త్రీలను 'లాటస్త్రీ' అని అంటారు. ఈ రెండు దేశాల్లోనూ పుట్టిన ఆడవాళ్ళు చాలా దృఢంగా, బలంగా వుంటారు. అంచేత వారు ఎంతోసేపు రతిక్రీడ సలపగలుగుతారు. కొద్దికొద్దిగా సీత్కారాలు చేయగలుగుతారు. అలాగే కొంచెం కొంచెం నఖక్షతాలు తట్టుకోగలుగుతారు. ప్రణయ తాడనాలు సయితం సహిస్తారు.

(మహాభారత యుద్ధానంతరం శ్రీకృష్ణుడు అవతారం చాలించిన తరువాత ద్వారకలోని అంతఃపుర కాంతలను, తక్కిన యాదవ స్త్రీలను అర్జునుడు వెంట పెట్టుకుని వెడుతూ వుండగా, బలాఢ్యులైన ఈ అపరాంత దేశస్థులే వారిని కొల్ల గొట్టినట్లు చెపుతారు.)

## దేశాచారం, దేహానందం

*27. దృఢప్రహణన యోగిన్యః ఖరవేగా ఏవ,*
*అపద్రవ్య ప్రధానాః స్త్రీరాజ్యే కోసలాయాంచ.*

ఇకపోతే, అచ్చం ఆడవాళ్ళ రాజ్యమే ఒకటి వుంది. వంగ దేశానికీ, ప్రరక్త దేశానికీ పశ్చిమంగా వున్న దేశానికి 'స్త్రీరాజ్యం' అని పేరు. ఈ స్త్రీ రాజ్యంలోనూ, కోసల దేశంలోనూ జన్మించిన వనితలు, కౌగలింతలు, ముద్దులు, నఖక్షత, దంతక్షతాలు - మున్నగున్నవి అన్నీ చక్కగా అనుభవిస్తారు. అయితే, వాటితోనే తృప్తిపడరు. గాఢమైన ప్రణయ తాడనాలు కూడా అభిలషిస్తారు. అప్పుడే వారికి సంతుష్టి కనుకనే వీరిని 'ఖరవేగ' లంటారు. 'ఖరం' అంటే దురద

తీర్చుకోడానికి ఎక్కువగా సంభోగాన్ని కోరడం. ఈ దేశాల్లోని నారీమణులు, పురుషులు ఎంతగా రతి చేసినా తనివి తీరక, భగమందలి తీట తీరడానికి అనేక రకాల కృత్రిమ సాధనాలు కూడా ఉపయోగిస్తూ వుంటారు!

*28. ప్రకృత్యా మృద్వ్యో రతిప్రియాః అశుచిరుచయోనిరాచారాశ్చాంధ్ర్యః*

నర్మదా నదికి దక్షిణంగా వున్న దేశాన్ని దక్షిణాపథం అంటారు. ఈ దక్షిణాపథంలో కర్ణాట దేశం కంటే తూర్పుగా వున్నది ఆంధ్రదేశం. అక్కడ పుట్టిన ముద్దుగుమ్మలు స్వభావసిద్ధంగా చాలా సుకుమారలుగా వుంటారు. అంచేత ప్రణయ తాడనాలు, నఖక్షత దంతక్షతాలు మొదలైనవి అంతగా సహించలేరు. కేవలం సంభోగం మాత్రమే వాంఛిస్తారు. అయితే, మర్మాంగంలో దురద వదుల్చుకోడానికి వీరు నీచమైన మార్గాలు, పద్ధతులు అవలంబిస్తూ వుంటారు. ఆచారం చాలా తక్కువ వీరికి. హద్దుమీరి ప్రవర్తిస్తారు. కామశాస్త్రంలో చెప్పిన బంధన విధానాలను అనుసరించడంలో ఎక్కువ శ్రద్ధాశక్తులు చూపరు. ఆచారాలను లెక్కచేయకుండా హద్దూపద్దూ లేకుండా సంచరిస్తారు! (ఆ కాలంలో వాత్స్యాయనుడు వెలిబుచ్చిన అభిప్రాయం ఇది.)

*29. సకల చతుష్షష్టి ప్రయోగరాగరిణ్యో అశ్లీల పరుషవాక్యప్రియాః*
*శయనే చ సరభసోపక్రమా మహారాష్ట్రిక్యః*

నర్మదానదికీ, కర్నాట దేశానికీ మధ్య భాగంలో వున్న దేశం, మహారాష్ట్ర దేశం. అక్కడ జన్మించిన స్త్రీలు నృత్యం, గీతం మొదలైన అరవై నాలుగు కళల్లోనూ, పాంచాలికీ చతుష్షష్టి కళల్లోనూ ఆరితేరిన వారు. అంచేత అరవై నాలుగు కళలతోనూ సంభోగం సాగిస్తేనే కాని ఈ కాంతల కామ జ్వరం శాంతింపదు. అప్పుడే వీరు అనురాగం, ఆనందం పొందుతారు అంటే వీరు కళలలో ఎక్కువ అభిలాష కలవారన్న మాట. వీరి సంభాషణ చాలా నీచంగా వుంటుంది. అశ్లీలమైన బూతు మాటలు, గ్రామ్యపు పలుకులు కరుకుగా, కఠినంగా వుండే మాటలు మాట్లాడుతూ వుంటారు. ప్రియులు అలాంటి మాటలు మాట్లాడుతూ వుంటే సంతోషిస్తారు. సంభోగ సమయంలో చాలా తొందరపాటు చూపుతూ వుంటారు. వీరు ధూర్తులు కాబట్టే మగవాళ్ళకంటే ముందుగా తామే రతికి సిద్ధపడి తొందర పెడుతూ ఉంటారు.

*30. తథావిధా ఏవ రహసి ప్రకాశంతే నాగరిక్యః.*

ఇక పాటలీపుత్ర ప్రాంతంలోని స్త్రీలు కూడా మహారాష్ట్ర స్త్రీల వంటివారే. అంటే వారు కూడా అరవైనాలుగు కళల్లోను జాణలు. అలా చతుష్షష్టి కళలతో రతి సలిపితేకాని సంతుష్టి చెందరు. అదే విధంగా పురుషులు బూతులు మాట్లాడుతూ వుంటే సంతోషిస్తారు. తామున్నూ బూతులు మాట్లాడుతూ పురుషులను రెచ్చగొడతారు. రహస్యంగా ఏకాంతంగా ఇలా చేయడం వారికి ఎంతో ఇష్టం. మహారాష్ట్ర స్త్రీలు, రహస్యంగానే కాక నలుగురిలోనూ ఇలా ప్రవర్తిస్తారు. సంభోగానికై

పురుషుడికంటే ముందుగా ప్రక్కమీద చేరడంలో ఈ రెండు దేశాల స్త్రీలు సమానులే అని చెప్పాలి.

*31. మృద్యమానాశ్చాభియోగాన్ మందం మందం ప్రసించంతే ద్రావిడ్యః*

కర్నాటక దేశానికి ఇంకా దక్షిణంగా వున్నది ద్రవిడ దేశం. ఈ దేశంలో జన్మించిన రమణుల కౌగిలింతలు. ముద్దులు మొదలైనవన్నీ సంభోగానికి ముందు, సంభోగ సమయంలోను ఎక్కువగా కోరతారు. ఈ విధమైన చేష్టలతో బాహ్య అవయువాలనూ, లోపల మదన మందిరాన్ని బాగా మర్దిస్తుంటే మెల్లమెల్లగా తృప్తిపడతారు. ఆ తరువాత తొందర తొందరగా స్ఖలన సుఖాన్ని అనుభవిస్తారు. అంటే ఈ ద్రవిడాంగనలను పురుషుడు రకరకాల శృంగార చేష్టలతో ఉద్రేకపరచి, అటుపైన సంభోగం ప్రారంభించి వీర్య బలంతో ఉధృతంగా రతి సాగించాలన్న మాట.

*32. మధ్యమవేగాః సర్వంసహాః స్వాంగప్రచ్ఛాదిన్యః పరాంగహాసిన్యః*
*కుత్సితా శ్లీల పరుష పరిహారిణ్యో వానవాసిక్యః.*

కొంకణ దేశానికి తూర్పుగా వున్నది వనవాస దేశం. అక్కడి స్త్రీలు భావాన్ని బట్టీ, కాలాన్ని బట్టీ మధ్యమవేగం కలవారు. ఆలింగనాదులన్నింటిని హాయిగా ఓర్చుకుంటారు. తమ అవయవాలను ఎక్కువగా దాచుకోడానికి ప్రయత్నిస్తారు. పర పురుషులను చూసి పరిహాసం చేస్తారు. కపటంతో ప్రవర్తించే వారితోనూ, అసహ్యకరంగా, కరుకుగా, కఠినంగా, గ్రామ్యంగా మాట్లాడే వారి తోనూ రతికేళి సలపడానికి ఇష్టపడరు. పైగా అలాంటి వాళ్ళను ద్వేషిస్తారు కూడా.

*33. మృదుభాషిణ్యో అనురాగవత్యో మృద్వంగ్యశ్చ గౌడ్యః*

ఇక తూర్పు దేశాన్ని గౌడ దేశం అంటారు. ఈ గౌడాంగనలు మృదు మధురంగా మాట్లాడతారు. అందమైన వాళ్ళు. సుందర రూపం గల పురుషులను ప్రేమిస్తారు. వీరి శరీరాలు ఎంతో సుకుమారంగా, నాజూగ్గా వుంటాయి.

ఇలా దేశాచారాలను బట్టి ఆయా ప్రాంతాల్లోని స్త్రీలు రతి విషయంలో ఎలా వుంటారో, ఎలా ప్రవర్తిస్తారో చెప్పారు వాత్స్యాయనులు. ( అయితే, ఈ లక్షణాలు అతి ప్రాచీన కాలానికి సంబంధించినవి. ప్రస్తుత కాలంలో ఆయా దేశాలలోవి మగువలు ఇలాగే ప్రవర్తిస్తారని నిర్ధారించి చెప్పలేం. కాని, ఏ ప్రాంతం స్త్రీలు అయినప్పటికీ ఈ కామశాస్త్రంలో చెప్పిన రతి క్రీడారహస్యాలు అనుసరిస్తే, కరిగి పోయి సంతుష్టాంత రంగులు అవుతారని చెప్పక తప్పదు. అంతేకాకుండా స్తనాలవద్ద దంతక్షత , నఖక్షతాదుల వల్ల ఏర్పడిన గుర్తులను కాంతలు ఎప్పుడూ జ్ఞాపకం వుంచుకుంటారనీ, ఆ గుర్తులు స్త్రీలు అల్లంత దూరాన వుండగానే గుర్తు పట్టవచ్చునని శాస్త్రకారులు అంటున్నారు. దీన్ని బట్టి ప్రాచీన కాలంలో స్త్రీలు, స్తనాలను కప్పివేసే రవికల్లాంటివి ధరించేవారు కారని అర్థమవుతున్నది.

అంచేతనే అజంతా మున్నగు గుహల్లో, ఆలయ శిల్పాల్లో కనిపించే చిత్రాలలో స్త్రీల పాలిండ్లు బయటికి కనిపిస్తూనే వుంటాయి.)

*34. దేశసాత్మ్యాత్ప్రకృతి సాత్మ్యం బలీయ ఇతి సువర్ణనాభో, న తత్ర దేశ్యా ఉపచారాః.*

దేశాచారంకన్నా స్వభావ సిద్ధంగా తన హృదయానికి ఆనందం కలిగించే ఆచారమే మంచిదనీ, రసవత్తరమైనదనీ సువర్ణనాభుడి అభిప్రాయం. తన అభిలాష, దేశాచారానికి భిన్నంగా ఉన్నప్పుడు దేశాచారాన్ని వదలి, తన అభిలాష ప్రకారమే ప్రవర్తించడం యుక్తమని అతను అన్నాడు.

*35. కాలయోగాచ్చ దేశాద్దేశాంతర ముపచార వేషలీలాశ్చ అనుగచ్ఛంతి, తచ్చ విద్యాత్*

కాలం యొక్క సంబంధాన్ని అనుసరించి ఒక దేశాచారాలు మరో దేశానికి రావచ్చు. వేషభాషల్లో, విలాసాల్లో, ఉపచారాల్లో ఒక దేశంలో ప్రజలు, మరో దేశ ప్రజలను అనుకరించడంలో లేదా అనుసరించడంలో ఆశ్చర్యంలేదు. అది సహజం. కాబట్టి ఆయా ఆచారాలు దేశాంతరంనుంచి సంక్రమించినవా? లేక స్వతస్సిద్ధంగా వచ్చినవా? - అని తర్కించి వాస్తవాన్ని కనిపెట్టాలి. జాగ్రత్తగా ప్రవర్తించాలి. అలా ప్రవర్తించకపోతే, ఒక దేశపు పద్ధతులు తమకు సరిపడక అక్కడి స్త్రీలు పురుషులకు విముఖులు కావచ్చు. ఒక స్త్రీకి నచ్చింది మరో స్త్రీకి నచ్చకపోవచ్చు. ఎవరి అభిరుచి వారిది, ఎవరికి అపేక్ష వారిది లోకో భిన్నరుచిః అన్నట్లు ఇలాంటి విషయాల్లో ఒక స్త్రీకి మరో స్త్రీకి, ఒక పురుషుడికి, మరో పురుషుడికి భేదం వుంటుంది. అంచాత ఏ మగువకు ఏ పద్ధతి ఇష్టమో బాగా గ్రహించి ఆ విధంగా ఉపచారాలు, రతి క్రీడలు సాగించినప్పుడే ఆమె సంతుష్టురాలవుతుంది.

*36. ఉపగూహనాదిషు చ రాగవర్ధనమ్ పూర్వం పూర్వం విచిత్ర ముత్తర ముత్తరంచ*

ఆలింగనం, చుంబనం, నఖక్షతం, దంతక్షతం ప్రహణనం, సీత్కృతం ఈ ఆరూ బాహ్య రతులు. ఇవి ఒకదానికంటే ఒకటి అధికంగా అనురాగాన్ని, ఆనందాన్ని వృద్ధి పొందిస్తాయి. అంటే సీత్కృతంకన్నా ప్రహణనం, దానికన్నా దంతక్షతం, దానికన్నా నఖక్షతం, దాన్ని కన్నా చుంబనం, ఆ చుంబనంకన్నా ఆలింగనం ఎక్కువ ప్రేమానురాగాలు కలిగిస్తాయన్న మాట. అలాగే ఆలింగనం కంటే చుంబనం విచిత్రమైంది. దానికంటే సీత్కృతం చిత్రమైనది.

*37. వార్యమాణశ్చ పురుషోయత్కుర్యాత్తదనుక్షతమ్, అమృష్యమాణా ద్విగుణమ్ తదేవ ప్రతియోజయేత్.*

స్త్రీ తనకు అక్కర్లేదని అడ్డగిస్తున్నా పురుషుడు బలవంతంగా దంతక్షతమో, నఖక్షతమో చేస్తే, అప్పుడా స్త్రీ సహించలేదు. ఆమె కూడా అలాగే అతన్ని అంతకన్నా ఎక్కువగా ఆ పనిచేసి కసి తీర్చుకుంటుంది!

38. బిందోః ప్రతిక్రియా మాలా, మాలాయాశ్చాభ్రఖండకమ్,
ఇతి క్రోధాదివావిష్టా, కలహాన్ప్రయోజయేత్.

దంతక్షతాలు ఎనిమిది విధాలు కదా! వాటిల్లో బిందువును ఒకరు ప్రయోగిస్తే, రెండోవారు మాల క్షతాన్ని ప్రయోగించి బదులు తీర్చుకోవాలి. అలాగే మాలను ప్రయోగిస్తే, దానికి ప్రతిక్రియగా అభ్రఖండకాన్ని ప్రయోగించాలి. ఈ విధంగా స్త్రీ పురుషులు ప్రణయ కలహాలు ప్రాప్తించినప్పుడు అనుసరించాలని భావం.

39. నకచగ్రహ మున్నమ్య ముఖం తస్య తతః పిబేత్,
నిలీయేత దశేచ్చైవ తత్ర తత్ర మదేరితా.

పురుషుడు స్త్రీ యొక్క క్రింది పెదవిని పానం చేస్తూ చుంబించేటప్పుడు, స్త్రీ ముందుగా ఒక చేత్తో పురుషుడి తలను, రెండో చేత్తో గడ్డాన్ని పట్టుకుని పైకెత్తి అప్పుడు అమృతంతో సమానమగు అధర సుధారసాన్ని ఆస్వాదించాలి. పిమ్మట ప్రియుణ్ణి బాగా గుండెలకు హత్తుకుని, కావలించుకుని, 'నీవే నేను' అన్నట్టుగా అతనిలో ఐక్యం అయిపోవాలి. ఇంకా ఇంతకు ముందు చెప్పిన ఆయా చోట్లలో ముద్దులు, నఖక్షత, దంతక్షతాలు కురిపిస్తూ గాఢమైన ప్రేమతో పరవశురాలు కావాలి.

40. ఉన్నమ్య కంఠే కాంతస్య, సంశ్రితా వక్షసః స్థలీం,
మణిమాలాం ప్రయుంజీత, యచ్చాన్యదపి లక్షితమ్.

మరో పద్ధతి కూడా చెపుతున్నారు శాస్త్రకారులు. స్త్రీ ఒక బాహువుతో పురుషుణ్ణి గట్టిగా హత్తుకుని కొంచెమైన సందులేకుండా కౌగిలించుకుని, కంఠాన్ని ఎత్తి, రెండోచేత్తో అతని గడ్డాన్ని పట్టుకుని మణిమాలను ప్రయోగించాలి. మరిన్ని నఖక్షతాలు, దంతక్షతాలు సమయోచితంగా సలుపుతూ చిత్రవిచిత్రంగా ప్రియుణ్ణి ఆనందడోలికల్లో ఊగించాలి.

41. దివాపిజన సంబాధే నాయకేన ప్రదర్శితమ్,
ఉద్దిశ్య స్వకృతం చిహ్నం హసేదన్యైరలక్షితా.

రాత్రివేళ రతి క్రీడా సమయాల్లో ప్రియురాలు చేసిన దంతక్షత, నఖక్షతాదులు ప్రియుడు పగటిపూట, జనం మధ్య తిరిగేటప్పుడు, ఇతరులకు కనిపించకుండా చెయ్యాలి. ఒక్క ప్రియురాలికి మాత్రం ఆ చిహ్నాలు చూపించాలి వాటిని చూచి ప్రియురాలు "నీ తిక్క బాగా కుదిరిందిలే. నీకీ ప్రాయశ్చిత్తం కావల్సిందేలే!' అనే భావాన్ని సూచించే విధంగా పక్కున నవ్వాలి.

42. వికూణయంతీవ ముఖమ్, కుత్సయంతీవ నాయకమ్,
స్వగాత్రస్థాని చిహ్నాని సాసూయేవ ప్రదర్శయేత్.

ప్రేయసి ఉత్తుత్తి ముద్దులకోసం ముఖాన్ని ముదుస్తున్నట్టు చేష్టలు చేస్తూ కళ్ళూ, కనుబొమలూ వింత వింతగా త్రిప్పుతూ 'మీరు చేసిన అపరాధానికి నేనేం ప్రతిక్రియ చేయనులెండి!' అనే అసూయ వ్యక్తమయ్యే లాగా తన వంటి

మీద ప్రియుడు చేసిన గాట్లు, గంట్లు ఇతరులకు తెలియనివ్వకుండా అతనికే తెలిసేటట్లు చూపించాలి.

*43. పరస్పరానుకూల్యేన తదేవం లజ్జమానయోః,*
*సంవత్సర శతేనాపి ప్రీతిర్న పరిహీయతే.*

ఈ విధంగా స్త్రీ పురుషులు, ప్రేయసి ప్రియులు తమలో తమకు బాగా అనుకూలంగా వుండే సిగ్గు దొంతరలు విరజిమ్ముకుంటూ ప్రవర్తిస్తే, వారి మధ్య ప్రేమానురాగాలు నూరు సంవత్సరాలైన చెక్కు చెదరకుండా వుంటాయి. అంటే బ్రతికి వున్నంతకాలం మరచిపోకుండా నిలిచి వుంటాయన్నమాట.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే, కామసూత్రే, సాంప్రయోగికే,*
*ద్వితీయేऽధికరణే, దశనచ్ఛేద్య విధయో,*
*దేశ్యాశ్చోపచారాః పంచమోऽధ్యాయః*

**ఇది వాత్స్యాయనముని ప్రణీతమైన కామసూత్రాల్లో సాంప్రయోగికం అనే రెండవ అధికరణంలో దంతక్షత విధానాలూ, దేశీయులైన ఉపచారాలు అనే అయిదో అధ్యాయం.**



# షష్టమాధ్యాయం
## సంవేశన చిత్ర రతాలు

**ఇంతకు** ముందు అధ్యాయాల్లో చెప్పినట్టుగా అటు దేశాచారం, ఇటు స్వభావ సిద్ధమైన ఆచారం - ఈ రెంటినీ పాటిస్తూ ఆలింగనం, నఖక్షతం, దంతక్షతం మున్నగువాటి వల్ల స్త్రీ పురుషులు ప్రేమానురాగాలు వృద్ధి పొందించుకోవాలి. ఆ తరువాత వారు సంభోగానికి ఆయత్తమయ్యే అర్హతను సంపాదించుకొంటారు.

(ఇలా చేస్తున్న వారు లోకంలోఎంతమంది? కామశాస్త్రంలో చెప్పిన ఇలాంటి అర్హతతో నిమిత్తం లేకుండానే, ఆడది దొరికింది కదా అని మగవాడు, మగవాడు దొరికాడు కదా అని ఆడది - సంభోగానికి, పూనుకొంటే, అది కామసుఖం అనుభవించడం కానే కాదు. అది కేవలం పశువుల్లాగా ప్రవర్తించడమే అవుతుంది. అది రతిక్రీడ కాదు. రాక్షస రతి! అది తెలుసుకునేటందుకే ఈ శాస్త్రం పుట్టింది.)

*1. రాగకాలే విశాలయంత్యేవ జఘనం మృగీ సంవిశే దుచ్చరతే.*

సంవేశనం అంటే సంభోగానికి సిద్ధపడడం. ఇంకా చెప్పాలంటే స్త్రీ యోనిలో పురుషుడు తన లింగాన్ని ప్రవేశపెట్టడం అన్నమాట. దీనికి సంబంధించిన విశేషాలను గురించి చెప్పే అధ్యాయమే ఈ చిత్ర రతాధ్యాయం. ఆ విషయాలనే ఈ అధ్యాయంలో నిరూపిస్తూన్నారు శాస్త్రకారులు.

రాగకాలం అంటే పురుషుడి లింగమూ, స్త్రీ భగమూ సంయోగానికి సిద్ధపడే సమయం అన్నమాట. ఆ సమయంలో వృషజాతి పురుషుడితో సంభోగించే మృగీజాతి స్త్రీ తన రెండు తొడలూ ప్రక్కలకు వెడల్పుగా చాచి, భగాన్ని బాగా విచ్చేటట్లు చేస్తూ శయ్యపై వెల్లకిల శయనించాలి.

ఎంచాతనంటే మృగీజాతి స్త్రీ భగద్వారం చిన్నదిగా వుంటుంది. అలాంటప్పుడు పురుషుడు తన లింగాన్ని ప్రవేశ పెట్టడం కష్టం అవుతుంది. లింగం కన్నా యోని పెద్దదిగా, వెడల్పుగా వున్నప్పుడు, స్త్రీ తన తొడలను దగ్గరిగా పెట్టి భగాన్ని చిన్నదిగా చేయాలి. ఉచ్చతర రతంలో కూడా ఇదే పద్ధతి. అంటే మృగీజాతి స్త్రీ, హస్తినీ జాతి పురుషుడితో కలిసేటప్పుడు కూడా ఇదే విధానం అన్నమాట.

*2. అవహ్రాసయంతీవ హస్తినీ నీచరతే.*

హస్తినీ జాతి స్త్రీ వృషజాతి పురుషుడితో రతి చేస్తే దాన్ని నీచరతి అంటారు.

(హస్తినీ జాతి మదన మందిరం పన్నెండంగుళాల లోతు వుంటుంది. వృష జాతి పురుషుడి లింగం తొమ్మిది అంగుళాల పొడవు వుంటుంది.)

ఈ నీచరతిలో స్త్రీ తన తొడలను కలిపి వుంచి, భగాన్ని ముడుచుకుని వుండేలా చేస్తూ వెల్లకిల పరుండాలి. శశిజాతి పురుషుడితో హస్తినీ జాతి స్త్రీకి సంభోగం సంభవించినప్పుడు ఆ నీచతర రతంలో కూడా స్త్రీ ఇలాగే చెయ్యాలి.

# సంభోగ సమయంలో ఎలా శయనించాలి ?

*3. న్యాయ్యో యత్ర యోగస్తత్సమ పృష్ఠమ్.*

న్యాయంగా చెప్పాలంటే స్త్రీ పురుషుల భగ లింగాలు సరిసమానంగా, సరిపడేటట్టు వుండాలి. దాన్ని సమరతం అంటారు. ఈ సమతరంలో స్త్రీ తన తొడలు బాగా చాచనూ అక్కర్లేదు. బాగా ముడవనక్కరా లేదు. సామాన్యంగా వుంటే చాలు.

*4. ఆభ్యాం బడబా వ్యాఖ్యాతా.*

పై రకాల స్త్రీలకు చెప్పిన విధానం వల్ల బడబజాతి స్త్రీ అనుసరించవలసిన విధానం కూడా స్పష్టం అయింది. అంటే బడబజాతి మగువ అశ్వ జాతి పురుషుడితో రతి సాగించబోయే తరుణంలో తన రెండు తొడలూ బాగా చాచి, భగం పెద్దదిగా తెరుచుకునేటట్లు చేస్తూ శయనించాలన్న మాట. అలాగే శశజాతి పురుషుడితో సంగమించబోయేటప్పుడు తొడలు బాగా దగ్గరకు పెట్టి, భగాన్ని ముడిచి పడుకోవాలి. ఇక వృషజాతి పురుషుడితో సంభోగించబోయే టప్పుడు భగాన్ని మామూలుగానే వుంచి శయనించవచ్చు.

ఈ పైన చెప్పిన విధానాలనుబట్టి మృగీజాతి స్త్రీ, హస్తినీ జాతి నాయిక అనురించవలసిన విధానం గురించి చూచుకోవచ్చు. గ్రంథాంతరంలో కూడా ఉచ్చరతంలో రమణి తొడలు బాగా వెడల్పుచేసి నీచతరంలో బాగా దగ్గరిగా కలిపి, సమరతంలో సరిసమానంగా వుంచి శయనించాలని వుంది.

*5. తత్ర జఘనేన నాయకం ప్రతి గృహ్ణీయాత్.*

పడతి అలా పడుకున్నందుకు ఫలితం ఏమిటి? పురుషుడి మేహనాన్ని తన భగంలోకి గ్రహించడమే ఫలితం. కాబట్టి పైన చెప్పిన పద్ధతుల్లో తనకు అనుకూలమైన పద్ధతిని అనుసరిస్తూ శయనించి, నానారకాలైన సంవేశనాలతో మగువ, పురుషుడి మదన ధ్వజాన్ని తన మదన గృహంలోకి గ్రహించాలి.

*6. అపద్రవ్యాణి చ సవిశేషం నీచరతే.*

నీచరతిలో - అంటే బడబజాతి స్త్రీ శశజాతి పురుషుడితో కానీ, హస్తినీ జాతి స్త్రీ, వృషజాతి పురుషుడితో కానీ సంభోగించవలసి వస్తే, అప్పుడు కృత్రిమ లింగాలను తయారుచేసుకుని, వాటితోనే సంప్రయోగం సాగించుకోవాలి. ఎంచాతనంటే, ఈ నీచరతిలో స్త్రీ పురుషుల సహజమైన భగలింగాలు ఇద్దరికీ తృప్తి కలిగించే విధంగా వుండవు.

*7. ఉత్ఫుల్లకం, విజృంభితకం, ఇంద్రాణికం, చేత్రిత్రితయం ప్రాయేణ.*

ఉచ్ఛ్రరతంతో తరుణి తన తొడలు బాగా తెరచి శయనించాలనీ, నీచరతంలో రెండు తొడలు దగ్గరికి చేర్చి శయనించాలని చెప్పడం జరిగింది కదా? అలా పడుకోడానికి ఉపాయాలు చెపుతున్నారు ఇక్కడ. అయితే, సమరతంలో శయనించే ఉపాయం శాస్త్రంలో చెప్పలేదు అంటే, చెప్పవలసిన అవసరం లేదన్నమాట. కాని లౌకికమైన యుక్తి మాత్రం చెప్పబడింది. అది ఇవి.

స్త్రీ మామూలుగా వెల్లకిల పరుండి వున్నప్పుడు రెండు రకాలైన సంవేశనాలు, ఒత్తిగిలి పరుండి వున్నపుడు ఒక రకమైన సంవేశనం తటస్థిస్తున్నాయి. ఇవి లోకంలో అందరూ ఎరిగినవే. మొత్తం ఈ మూడు పద్ధతుల్లోనూ సమరతాలే సంభవిస్తాయి. గ్రంథాంతరంలో వాటి స్వరూపాన్ని గురించి ఇలా చెప్పారు. ''సంభోగం కోసం కూచుని వున్న పురుషుడు తన తొడలను స్త్రీ తొడపై వుంచి రతిచేస్తే, దాన్ని గ్రామ్యం అంటారు. అలా కాక స్త్రీ తొడలను పురుషుడు తన తొడలపై వేసుకుని సంభోగిస్తే, దాన్ని నాగరకం అంటారు. ''ఈ నాగరక బంధం లోకంలో ప్రసిద్ధమై వుంది. ఉత్ఫుల్లకం, విజృంభితకం, ఇంద్రాణికం - అనే మూడు రకాలైన సంభోగాలు సాధారణంగా మృగీజాతి స్త్రీకి చాలా అనుకూలంగా వుంటాయి.

*8. శిరో వినిపాత్యోర్ధ్వం జఘన ముత్ఫుల్లకమ్.*

సంయోగ సమయంలో స్త్రీ శయ్యపై వెల్లకిల పరుండి తల మాత్రం ప్రక్కపైనే వుంచి, నడుం పైకెత్తుతూ సంభోగం సాగిస్తే దాన్ని ఉత్ఫుల్లకం అంటారు. సురతం సాగించే సమయంలో ఇది మామూలుగా జరిగే విషయమే అయినప్పటికీ, స్త్రీ తన భగం బాగా విస్తరింపజేయడానికై నడుం బాగా పైకెత్తి రెండు చేతులతో తన భగాన్ని వెడల్పు చేసి, పురుషుడి లింగాన్ని ప్రవేశపెట్టుకోవాలి. అప్పుడు పురుషుడు తన చేతులతో స్త్రీ స్తనాలను బాగా మర్దిస్తూ (పిసుకుతూ) అమెకు కామోద్రేకం కలిగించాలి. ఆ సమయంలో మగువ పాదాలు, మడమలు కూడా పురుషుడి నడుమునకు వెనుక భాగం మీద వుంటాయి. స్త్రీ ఇలా తన నడుం పైకెత్తి భగాన్ని బాగా విస్తృతం చేసి వుంచుతుంది కాబట్టి దీనికి ఉత్ఫుల్లకం అనే పేరు వచ్చింది.

*9. తత్రాపసారం దద్యాత్.*

ఈ ఉత్ఫుల్లక బంధంలో పురుషుడు తన శిశ్నాన్ని భగంలోకి చొప్పించిన తరువాత, స్త్రీ తన నడుమును గుండ్రంగా త్రిప్పాలి. లేదా పురుషుడైనా తన నడుమును మెల్లమెల్లగా గుండ్రంగా త్రిప్పాలి. ఈ పనిని యోని కొద్దిగా ద్రవించే దాకా మాత్రమే చెయ్యాలి. ఈ బంధంలో పురుషుడు ఏ మాత్రం తొందరపడ కూడదు అలా త్వరపడి మోటుగా ప్రవర్తిస్తే స్త్రీకి బాధ కలుగుతుంది. స్త్రీకే కాదు, పురుషుడి లింగం పైన గల చర్మం కూడా నలిగి మంట పుట్టే అవకాశం

వుంది. ఈ విధంగా పురుషాంగం పైన గల చర్మం నలగడాన్ని వైద్య శాస్త్రంలో 'అవపాటిక' అంటారు.

*10. అనీచే నక్షినీ, తిర్యగవస్రజ్య ప్రతీచ్ఛే దితి విజృంభితకమ్*

అలాగే స్త్రీ వెల్లకిల పరుండి తన తొడలను అడ్డంగా పైకి ఎత్తి నిలిపివుంచి పురుషుణ్ణి రతి చేయమంటే దాన్ని విజృంభితకం అంటారు. ఇలా పాదాలు పైకి వుంచడం అనేది ఉత్తాన బంధంలో కూడా ఉంటుంది. అయితే, ఆ బంధంలో పాదాలు అడ్డంగా చాచడం జరుగుతుంది. అంచేత ఆ బంధం, ఈ బంధం ఒకటి కాదు. ఈ విజృంభితక బంధంలో తొడలు చాచడం వల్ల స్త్రీ భగం బాగా తెరచి వుంచిన నోరులాగా తెరచుకుని వుంటుంది।



## రకరకాల రతి బంధాలు

*11. పార్శ్వయో స్సమ మూరూ విన్యస్య పార్శ్వయోః*
*జానునీ నిదధ్యాదిత్యభ్యాస యోగా దింద్రాణీ.*

స్త్రీ తన తొడలు పిక్కలతో కలిపి, సమానంగా ప్రక్క భాగంలో వుంచి, మోకాళ్ళు కూడా ప్రక్కకు వుండేటట్టు చేసి పురుషుణ్ణి సంభోగించమని కోరితే, దాన్ని ఇంద్రాణి బంధం అంటారు. దేవేంద్రుడి భార్య శచీదేవి అందాలరాశి. రతి క్రీడలకు రాణి. ఆమె కనిపెట్టిన బంధం ఇది. అంచేత ఇంద్రాణిబంధం అని దీనికి పేరు వచ్చింది. ఈ బంధంలో పురుషుడు, స్త్రీ మోకాళ్ళను తన చంకల్లో నొక్కిపట్టి వుంచుతాడు. ఆ కారణం వల్ల ఇంతకు ముందు చెప్పిన బంధాల్లో కంటె కూడా స్త్రీ యోని ఎక్కువగా తెరచుకుని వుంటుంది. ఈ బంధంలో మరో విషయం గమనించాలి. దీన్ని తొందరపడి ఒక్కసారిగా చెయ్యడం

సాధ్యం కాదు. పైగా ప్రమాదం సంభవించే అవకాశం వుంది. అంచేత క్రమక్రమంగా అభ్యాసం చేసి ప్రయోగించాలి.

*12. తయోచ్ఛతర రతస్యాపి పరిగ్రహః*

అంతేకాదు, ఇంద్రాణి బంధాన్ని మృగీజాతి స్త్రీ, వృషజాతి పురుషుడితో సంభోగించినప్పుడే కాక, మృగీజాతి నాయికకు, అశ్వజాతి పురుషుడికి రతి సంభవించినప్పుడు కూడా ఉపయోగించవచ్చు. అంటే, ఉచ్చతర రతంలో కూడా వాడవచ్చునన్నమాట. మృగీ జాతి - స్త్రీ వృషజాతి పురుషుణ్ణి కూడినప్పుడు మాత్రం పైన చెప్పిన ఉత్ఫుల్లక, విజృంభితక బంధాలను అవలంబించాలి. అదే విధంగా బడబజాతి స్త్రీ అశ్వజాతి పురుషుణ్ణి కలిసినప్పుడు సయితం పై రెండు బంధాలనే అనుసరించాలి. కాని, ఇంద్రాణి బంధాన్ని ఉపయోగించకూడదు.

*13. సంపుటేన పరిగ్రహో నీచరతే.*

హస్తినీ జాతి స్త్రీ వృషజాతి పురుషుడితో కలిస్తే నీచరతం ఏర్పడుతుంది. కాబట్టి, అలాంటి పురుషుణ్ణి సంపుట బంధంలో గ్రహించాలి స్త్రీ. ఈ సంపుట బంధం గురించి ముందు ముందు చెప్పబోతున్నారు.

*14. ఏతేన నీచతర రతేపి, సంపుటకం, పీడితకం, వేష్టితకం, బాడబక మితి హస్తిన్యాః*

హస్తినీ జాతి స్త్రీ శశజాతి పురుషుణ్ణి కలిసినప్పుడు కూడా సంపుటకం, పీడితకం, వేష్టితకం, బాడబకం అనే బంధాలు అనుసరిస్తే సౌఖ్యంగా వుంటుంది.

*15. ఋజు ప్రసారితావుభావ్యుభయోశ్చరణా వితి సంపుటః*

స్త్రీ పురుషులు కాళ్ళు చక్కగా బారజాపి రతికి ఉపక్రమిస్తే, దాన్ని సంపుటక బంధం అంటారు.

*16. స ద్వివిధః పార్శ్వసంపుట, ఉత్తాన సంపుటశ్చ, తథా కర్మయోగాత్*

ఈ సంపుటక బంధం రెండు రకాలు. ఒకటి పార్శ్వ సంపుటం, రెండోది ఉత్తాన సంపుటం. ప్రక్కకు ఒత్తిగిలి సంభోగిస్తే పార్శ్వ సంపుటకం.

ఎడమ ప్రక్క పురుషుడు, కుడిప్రక్క స్త్రీ పరుండి ఉండే స్త్రీ ఎడమకాలు పురుషుడి కుడిప్రక్కగా వుంటుంది ఈ బంధంలో.

స్త్రీ వెల్లకిల పరుండి పురుషుడు ఆమె మీద బోర్లా పడుకుని రతి సాగిస్తే దాన్ని ఉత్తాన సంపుటకం అంటారు. పురుషుడు వెల్లకిల పరుండి వుండగా స్త్రీ అతని మీద బోర్లా పడుకుని, పురుషుడిలా సంభోగం సాగిస్తే, అది మరో ఉత్తాన సంపుటక బంధం అని కొందరు చెపుతారు.

అయితే, ఈ బంధంలో పురుషుడి లింగం స్త్రీ భగంలో ఎలా ప్రవేశిస్తుంది? - అని సంశయించవలసిన అవసరం లేదు. అలా చెయ్యడం సులువే. ప్రక్కకు ఒత్తిగిలి రతి చేసేటప్పుడు పురుషుడి నడుము దిండు మీదా, స్త్రీ నడుము ప్రక్కమీదా వుండాలి. ఇలా మిట్టపల్లాలుగా వుండాలన్న మాట! అలా వుండకపోతే రతి సాగించే సమయంలో భగ, లింగాలు విడిపోవడం తటస్థిస్తుంది.

*17. పార్శ్వేణ తు శయానో దక్షిణేన నారీ మధిశయీతేతి, సార్వత్రిక మేతత్.*

నిద్రపోయేటప్పుడు స్త్రీకి కుడివైపు పురుషుడు, అతనికి ఎడమవైపు స్త్రీ పరుండాలి. అన్ని జాతుల స్త్రీ పురుషులూ నిద్రించే సమయంలో అనుసరించవలసిన విధానం ఇది.

సంభోగ సమయంలో ఒక్క హస్తినీ జాతి స్త్రీకి మాత్రం ఎడమ వైపున పురుషుడు, అతనికి కుడి వైపున స్త్రీ పరుండాలి.

హస్తినీ జాతి స్త్రీ భగాన్ని పురుషుడు తన చేత్తో తడుమవలసి వస్తుంది కాబట్టి ఈవిధంగా శయనించాలని చెప్పారు శాస్త్రకారులు. హస్తినీ జాతి స్త్రీ విషయంలోనే పెద్దలు ఈ పద్ధతిని అంగీకరించారు.

*18. సంపుటక ప్రయుక్త యంత్రైవ దృఢ మూరూ పీడయేదితి పీడితకమ్.*

ఇక ఉత్తాన సంపుటక బంధంలో కానీ, పార్శ్వ సంపుటక బంధంలో కానీ స్త్రీ పురుషుడి మేహనాన్ని తన భగంలో ప్రవేశపెట్టుకుని, తన రెండు తొడలు కలిపి గట్టిగా నొక్కి పట్టుకుంటే దాన్ని పీడితకం అంటారు.

*19. ఊరూ వ్యత్యస్యేదితి వేష్టితకమ్.*

ఉత్తాన సంపుటక బంధంతో కానీ, పార్శ్వ సంపుటక బంధంతో కానీ, స్త్రీ, పురుషులు సురత క్రీడ సాగించేటప్పుడు స్త్రీ తన కుడి తొడను పురుషుడి ఎడమ తొడ మీదా, ఎడమ తొడను కుడి తొడ మీదా వుంచితే, దాన్ని రెండు విధాలా వేష్టితక బంధం అంటారు. పైన చెప్పిన పీడితక బంధం కంటె ఈ బంధంలో స్త్రీ యోని బాగా ముడుచుకుని వుంటుంది.

*20. బడబేవ నిష్ఠుర మవగృహ్ణీయాదితి బాడబక మాభ్యాసికమ్.*

స్త్రీ ఆడ గుర్రంలాగా కదలకుండా వుండి, పురుషుడి మదనధ్వజాన్ని తన భగంతో బాగా నొక్కిపట్టితే దాన్ని బాడబక బంధం అంటారు. క్రమంగా అభ్యాసం చేస్తేకాని ఈ బంధం సాధ్యం కాదు.

*21. తదాంధ్రీషు ప్రాయేణేతి సంవేశన ప్రకారా బాభ్రవీయాః*

ఆంధ్రదేశంలో పుట్టిన స్త్రీలు అభ్యాసం చేయడంలో ఆసక్తి గలవారు. కాబట్టి ఈ బాడబక బంధాన్ని వారు తరచుగా ఉపయోగించుకుంటారని వాత్స్యాయనులు చెపుతున్నారు. సంప్రదాయం తెలిసినవారి వల్ల, అనుభవజ్ఞుల వల్ల ఈ అభ్యాసాన్ని గురించి తెలుసుకోవాలి. రతి క్రీడల్లో బంధాలు మొత్తం పైన చెప్పినవి ఏడు. ఈ ఏడూ బాభ్రవీయులు చెప్పినవి.

*22. సౌవర్ణనాభస్తు ఉభావప్యూరూ ఊర్ధ్వావితి తద్భుగ్నకమ్.*

అయితే, సువర్ణనాభులు ఇంకా కొన్ని సంవేశన (సంభోగ) విధానాలు చెప్పారు. హస్తినీ జాతి స్త్రీ వెల్లకిల పరుండి తన రెండు తొడలనూ పైకి చాచినప్పుడు, పురుషుడు ఆమె తొడలు కౌగిలించుకుంటూ రతిచేస్తే దాన్ని భుగ్నకం అంటారు.

*23. చరణావూర్ధ్వం నాయకోఽస్యా ధారయేదితి జృంభితకమ్.*

స్త్రీ తన కాళ్ళు పైకి ఎత్తి వుంచితే పురుషుడు ఆమె మోకాళ్ళ వెనుక భాగాన్ని తన భుజాల మీద పెట్టుకుని తొడలను కౌగిలించుకుంటూ రమించడాన్ని జృంభితక బంధం అంటారు.

*24. తత్కుంచితా వుత్పీడితకమ్.*

స్త్రీ, పురుషుడి వక్షస్థలం మీద తన రెండు పాదాలూ ఆనించి వుంచినప్పుడు పురుషుడు తన బాహువులతో స్త్రీ మెడను కౌగిలించుకుంటూ సంభోగిస్తే దాన్ని ఉత్పీడితక బంధం అంటారు. ఈ బంధంలో స్త్రీ తన మోకాళ్ళు బాగా వంచి, తన భుజాల దగ్గరికి చేర్చి వుంచాలి.

*25. తదేకస్మిన్ ప్రసారితే Zర్ధపీడితకమ్.*

పై విధంగానే స్త్రీ తన పాదం ఒక దాన్ని మాత్రం పురుషుడి వక్షస్థలం మీద వుంచి, రెండోపాదాన్ని సాపుగా చాచినప్పుడు పురుషుడు పైన చెప్పిన ఉత్పీడితకంలో లాగానే రతి చేస్తే దాన్ని అర్ధపీడితకం అంటారు.

*26. నాయకస్యాంస ఏకో ద్వితీయకః ప్రసారిత ఇతి పునః*
*పునర్వ్యత్యాసేన వేణుదారితకమ్.*

సంభోగ సమయంలో పురుషుడి భుజాల మీద స్త్రీ తన ఎడమపాదాన్ని ఒక్క క్షణం వుంచి, వెంటనే ఆ పాదాన్ని యథాప్రకారం క్రిందికి జాపితే ఒక రకమైన 'వేణు దారితకం' అవుతుంది. అలాగే రతి చేసేటప్పుడు స్త్రీ తన ఎడమ పాదాన్ని పురుషుడి కుడి భుజంపై క్షణం సేపు వుంచి, మళ్ళీ యథాప్రకారం క్రిందికి దించితే అది రెండో రకం వేణు దారితకం అవుతుంది.

*27. ఏకఃశిరస ఉపరి గచ్ఛేద్ద్వితీయః ప్రసారిత*
*ఇతి శూలాచితక మాభ్యాసికమ్.*

స్త్రీ తన ఎడమ పాదం కాని, కుడి పాదం కాని పురుషుడి తలపై వుంచి, ఆ విధంగానే ఎడమ పాదంకాని, కుడి పాదం కాని చాచి పెట్టితే, అప్పుడు పురుషుడు తన మదన దండాన్ని గూటంలాగా స్త్రీ భగంలోకి దిగవెయ్యాలి. ఆబంధాన్ని శూలాచితకం అంటారు. ఎంతో అభ్యాసం చేస్తే కాని ఇది సాధ్యపడదు.

*28. సంకుచితౌ స్వవస్తిదేశే నిదధ్యా దితి కార్కటకమ్.*

కాంత తన రెండు పాదాలూ ముడిచి వుంచితే, కాముకుడు ఆ రెండు పాదాలనూ తన బొడ్డుకు రెండు వైపులా ఆనించుకుని రతిక్రీడ సాగిస్తాడు. ఈ సందర్భంలో మగువ కాళ్ళు బాగా ముడతపడి వుంటాయి. ఈ బంధాన్ని కార్కటకం అంటారు.

*29. ఊర్ధ్వావూరూ వ్యత్యాస్యే దితి పీడితకమ్.*

రతి సాగించేటప్పుడు తరుణి తన కుడి పాదం ఎడమ వైపుకూ, ఎడమ పాదం కుడివైపుకూ ఎత్తి ప్రియుడి నడుమును నొక్కిపట్టితే దాన్ని పీడితకం అంటారు.

*30. జంఘ వ్యత్యాసేన పద్మాసనవత్.*

వెల్లకిలా పరుండి వున్న స్త్రీ తన ఎడమ పాదాన్ని కుడి గజ్జల్లో, కుడి పాదాన్ని ఎడమ గజ్జల్లో ఆనించి పురుషుడితో రతిక్రీడ సాగిస్తే దాన్ని పద్మాసన బంధం అంటారు.

*31. పృష్ఠం పరిష్వజమానాయాః పరాఙ్ముఖేణ, పరావృత్తక మాభ్యాసికమ్.*

భగ లింగాల సంయోగం వీడిపోనివ్వకుండా పురుషుడు తన నడుం పై భాగాన్ని వెల్లకిల త్రిప్పాలి. ఆ విధంగా పరాఙ్ముఖుడైన (రెండో వైపునకు తిరిగిన) పురుషుడి వీపును స్త్రీ కౌగలించుకోవాలి. అలా తన వీపును కౌగిలించుకున్న స్త్రీతో పురుషుడు రమించాలి. దీన్ని 'పరావృత్తక' బంధం అంటారు. ఇది ఎంతో అభ్యాసం చేస్తే గాని సాధ్యంకాదు. అంచాత తొందరపడి ఈ బంధాన్ని అవలంబిస్తే ముప్పు తప్పదు.

ఇదే విధంగా స్త్రీ తన భగలింగ సంయోగం వీడిపోనివ్వకుండా మెలి తిరిగితే, పురుషుడు ఆమె వీపును కౌగలించుకుని రమించడం మరో రకమైన 'పరావృత్తక' బంధం అవుతుంది. ఇది కూడా అభ్యాసం వల్ల పట్టుబడాల్సిందే తప్ప, తొందరపడి ఆచరిస్తే ప్రమాదం వాటిల్లుతుంది.

*32. జలేచ సంవిష్టోపవిష్ట స్థితాత్మకా శ్చిత్రాన్యోగా*
*నుపలక్షయేత్, తథా సుకరత్వాదితి సువర్ణనాభః*

పైన చెప్పిన సంభోగ పద్ధతులు చిత్ర రతాలలో చేరవు. లోకంలో సాధారణంగా స్త్రీ పురుషులు ఒకరిమీద ఒకరుగానీ లేదా ఒకరి ప్రక్కన ఒకరు గానీ పరుండి రమించడమే ప్రసిద్ధమైనది, ఉత్తమమైన పద్ధతి.

ఇక వీటి కంటె భిన్నమైన చిత్రబంధాలు మూడు వున్నాయి. నీటిలో గానీ, నేలమీద గానీ, పరుండి గానీ, కూచుండి గానీ, నిలబడి గానీ స్త్రీ పురుషులు చిత్రరతాలు సలుపుతూ ఆనందించాలని సువర్ణనాభులు అంటున్నారు.

*33. వార్తాం తు తచ్ఛిష్టైరప స్మృతత్వాదితి వాత్స్యాయనః*

సువర్ణనాభుల అభిప్రాయంతో వాత్స్యాయనులు ఏకీభవించడం లేదు. నీళ్ళలో, నేలపైన, పరుండి, కూచుని, నిలుచుని స్త్రీ పురుషులు చిత్ర విచిత్రంగా సంభోగం సాగించవచ్చు అనేమాట అర్థం లేనిది, నీటిలో మైథునం సాగిస్తే నరకం ప్రాప్తిస్తుంది.

కాబట్టి, పెద్దలు దాన్ని నిషేధించారు. నీళ్ళలో రేతస్సు విడిస్తే మహాపాపం చుట్టుకుంటుంది. కృచ్ఛ్ర, చాంద్రాయణాది వ్రతాలు ఆచరిస్తే గాని ఆ పాతకం పరిహారం కాదు. కాబట్టి నీళ్ళలో సురతం దోషం. నేలమీద సాగించవచ్చు - అని వాత్సాయన ముని సిద్ధాంతం.

(కృచ్ఛ్రం అనేది ఒక వ్రతం, ఇది కృచ్ఛ్రాతికృచ్ఛ్రం, చాంద్రాయణం, తప్తకృచ్ఛ్రం, త్రిరాత్ర కృచ్ఛ్రం, పరాక కృచ్ఛ్రం, ప్రాజాపత్య కృచ్ఛ్రం. సాంతపన కృచ్ఛ్రం, పాదకృచ్ఛ్రం, త్రిపాద కృచ్ఛ్రం - అని అనేక రకాలుగా వుంది.)

చాంద్రాయణం అనగా కృష్ణపక్షంలో, ఒక్కొక్క ముద్ద తగ్గిస్తూ, శుక్లపక్షంలో ఒక్కొక్క ముద్ద హెచ్చిస్తూ భుజించే వ్రతం.

# నేలమీద సాగించే చిత్రరతాలు

34. అథ చిత్రరతాని.

సంభోగం విశేషాలుగా ఉంటున్న చిత్రరతాలను గురించి ఇక్కడ నిరూపిస్తున్నారు. ఇవి నేలమీద మాత్రమే ప్రయోగించదగినవి.

35. ఊర్ధ్వస్థితయోర్యూనోః పరస్పరాపాశ్రయయోః
కుడ్యస్తం భాపాశ్రితయోర్వా స్థితరతమ్.

ఈ చిత్రరతాలలో నిలుచుండి చేసే రతాలు ఇవి. ఈ సందర్భంలో ఆశ్రయాలు ఏవీ ఉండవు కాబట్టి గోడను కానీ, స్తంభాన్ని గానీ ఆనుకుని, ఒకరి నొకరు బాగా కౌగలించుకుని రతిక్రీడ సాగిస్తే దాన్ని 'స్థితరతం' అంటారు.

36. కుడ్యాపాశ్రితస్య కంఠావసక్త బాహుపాశాయాః
తద్ధస్త పంజరోపవిష్టాయా ఊరుపాశేన
జఘన మభివేష్టయంత్యా కుడ్యే చరణ క్రమేణ
వలంత్యా అవలంబితకం రతమ్.

గోడను గానీ లేదా స్తంభాన్ని గానీ పురుషుడు ఆనుకుని ఉండగా, స్త్రీ అతన్ని కంఠాన్ని తన బాహువులతో చుట్టివేసి, అతని బాహుసంజరంలో తాను చిక్కి, తన తొడలతో అతని నడుమును చుట్టి, పదే పదే తన చేతులను అతను ఆనుకుని ఉన్న గోడకో, స్తంభానికో ఆనిస్తూ, తన నడుమును ప్రేరేపిస్తూ సురతం చేస్తే, దాన్ని 'అవలంబితకం' అంటారు. ఇది ఒక విధమైన చిత్రరతం.

# గజరతులూ, గోబంధాలు

37. భూమౌ చతుష్పదవా వదాస్థితాయా
వృషలీలయా అవస్కందనం ధైనుకమ్.

ఆవులాగా నేలమీద రెండు చేతులూ, రెండు కాళ్ళూ ఉంచి ఉన్న స్త్రీని, పురుషుడు వెనుక నుంచి ఆంబోతులాగా ఆమె నడుమును చుట్టి రమిస్తే దాన్ని 'ధేనుక బంధం' అంటారు. మనుషులై పుట్టి ఉండి, పశువుల్లాగా క్రీడిస్తారు కాబట్టి ఇదీ చిత్ర రతమే.

38. తత్ర వృష మురః కర్మాణి లభతే.

అయితే, ఈ ధేనుక బంధంలో ఒక విషయం గమనించాలి. రమణి వెల్లకిల నేలమీద పరుండి ఉన్నప్పుడు, పురుషుడు సంభోగిస్తూ చేసే స్తన మర్దనం, ఆలింగనం, చుంబనం, దంతక్షత, నఖక్షతాలు మొదలగు కాముక చేష్టలన్నీ ఈ ధేనుకబంధంలో పడతి వీపు మీదనే ప్రయోగించవలసి ఉంటుంది!

39. ఏతేనైవ యోగేన శౌనమైణేయం, ఛాగలం, గర్దభాక్రాంతం,
మార్జార లలితకం, వ్యాఘ్రావస్కందనం, గజోపమర్దితం, వరాహఘృష్టకం,
తురగాధిరూఢకం, ఇతి యత్ర యత్ర విశేషోయోగోZ
పూర్వ స్తత్ దుపలక్షయేత్.

పైన చెప్పిన ధేనుక బంధం వలెనే, రకరకాల జంతువులు ఎలా క్రీడిస్తాయో అలా క్రీడించాలని ఈ సూత్రంలో చెపుతున్నారు వాత్స్యాయనులు. అంటే, కుక్కలు, (శునకబంధం) లేళ్ళు (ఐణేయ బంధం), మేకలు (ఛాగల బంధం), గాడిదలు (గర్దభక్రాంత బంధం), పిల్లులు (మార్జార లలితక బంధం), పెద్ద పులులు (వ్యాఘ్రావస్కందన బంధం), ఏనుగులు (గజోపమర్దన బంధం) పందులు (వరాహ ఘృష్టక బంధం), గుర్రాలు (తురగాధి రూఢక బంధం) మొదలైన జంతువులు ఎలా మైధునం సాగిస్తాయో, ఆ విధానాలు పరిశీలించి స్త్రీ పురుషులు కొత్త కొత్త మైధున క్రియలు ఊహించుకుని అనుభవించాలన్నమాట.

(నిజానికి ఇలా రకరకాల జంతువుల రీతిలో స్త్రీ పురుషులు రతి చేయడం నాగరకం కాదు. పశుప్రాయం. అసహ్యాకరం కూడా. అయినప్పటికీ స్త్రీ పురుషులు మంచి యౌవనంలో ఉండి, వారి కామోద్రేకం పెచ్చు మీరినప్పుడు ఇలా రకరకాల చిత్రరతులు సాగిస్తే తప్ప, వారి కామాగ్ని చల్లారి తృప్తి తీరదేమో అనిపిస్తుంది)

*40. మిశ్రీకృత సద్భావాభ్యామ్, ద్వాభామ్ సహ సంఘాటకం రతమ్*

బాగా స్నేహం, ఒకరిపై ఒకరికి గట్టి నమ్మకం గల ఇద్దరు స్త్రీలుంటారు. వారిద్దరూ ఒక పురుషుడ్ని ప్రేమిస్తూ, ఒకే సమయంలో ఆ ఇద్దరూ ఆ పురుషుడితో క్రీడించాలనీ అభిలషిస్తారు. అలా ఒక పురుషుడు ఒకే మాటగా, ఇద్దరు మగువలను మరుకేళిలో తేల్చడాన్ని 'సంఘాటకం' అంటారు. ఇది ఒక రకమైన చిత్ర రతి. ఇద్దరు స్త్రీలూ వెల్లకిల పరుండి ఉంటే, పురుషుడు ఒక స్త్రీ యోనిలో తన లింగాన్ని ప్రవేశపెట్టి రమిస్తూ, రెండో స్త్రీని ముద్దాడడం, చన్నులు మర్దించడం, నఖక్షతం మొదలగు వాటితో తృప్తిపరిచి, సుఖపెడుతూ ఉంటాడు. అలాగే మళ్ళీ రెండో స్త్రీ భగంలో లింగాన్ని ప్రవేశ పెట్టి రతిచేస్తూ, మొదటి స్త్రీని కుచమర్దనం, చుంబనం, నఖక్షతం మున్నగు వాటితో తృప్తి పరిచి సుఖపెట్టాలి. ఇలా ఇద్దరు స్త్రీలకూ ఒకే పురుషుడు ఏక కాలంలో కామ దాహాన్ని తీరుస్తూ ఉంటాడు.

*41. బహ్వీభిశ్చ సహగోయూధికమ్.*

ఒకరిమీద ఒకరికి విశేషమైన అభిమానం నమ్మకం, అధిక ప్రేమ, స్నేహం కలిగిన అనేక మంది అంగనామణులతో ఒకే పురుషుడు ఒకే మాటు సురత క్రీడ సాగించవలసి వస్తే దాన్ని 'గోయూధికం' అంటారు. ఇదీ ఒక రకమైన చిత్రరతం. ఆలమందలో ఆబోతు చొరబడి అనేక ఆవులతో క్రీడించినట్లుగా క్రీడించడం కాబట్టి దీనికి 'గోయూధికం' అనే పేరు సార్థకమైంది.

*42. వారిక్రీడితకం, ఛాగల మైణేయమితి తత్కార్మానుకృతి యోగాత్.*

అదే విధంగా నీళ్ళలో అనేక ఆడ ఏనుగులతో ఒక మగ ఏనుగు క్రీడిస్తూ ఉంటుంది ఎంతో ఉల్లాసంగా. ఇది గజమైధున క్రీడ. అలాగే ఒక పురుషుడు పలువురు పడతులలో నీళ్ళలో రమించడాన్ని 'వారీ క్రీడితకం' అంటారు.

(పూర్వకాలంలో రాజులు రాణులతో కలిసి జల క్రీడలాడడం, ఆ జల క్రీడలలోనే రతి క్రీడలు సాగించడం ఉండేది) అలాగే ఒక మేకపోతు ఆడ మేకల గుంపులో పడి, రమించినట్లుగా రమించడాన్ని 'ఛాగలం' అనీ ఆడ లేళ్ళ గుంపులో పడి ఒక మగలేడి రమించడాన్ని 'ఐణేయ' మనీ అంటారు. అదే విధంగా ఒక్కొక్కప్పుడు ఒకే స్త్రీ ఒకే సమయంలో ఇద్దరు, ముగ్గురు పురుషులతో సంభోగించడం జరుగుతూ ఉంటుంది.

43. *గ్రామనారీ విషయే స్త్రీరాజ్యేచ బాహ్లీకే బహవో యువానో*
*అంతఃపుర సధర్మాణ ఏకైక స్యాః పరిగ్రహభూతాః తేషా మే*
*కైకశో యుగపచ్చ యథా సాత్మ్యం యథా యోగం చ రంజయేయుః*

స్త్రీ రాజ్యానికి సమీపంలో గ్రామనారీదేశం అనే దేశం ఒకటి ఉంది. ఆ దేశంలోనూ స్త్రీ రాజ్యంలోనూ, బాహ్లీక దేశంలోనూ ఒక్కొక్క స్త్రీ అనేక మంది పురుషులను పెళ్ళి చేసుకుని, తన అంతఃపురంలో దాచి ఉంచుకుంటుంది. ఆ పురుషులు ఒక్కొక్కప్పుడు ఒక్కడూ, కొన్ని సమయాల్లో అందరూనూ, ఎవరి ఇష్టం వచ్చినట్లుగా వాళ్ళు రకరకాల బంధాలతో స్త్రీలను అనుభవిస్తూ ఉంటారు.

44. *ఏకో ధారయేదేనామన్యో నిషేవేతాన్యో జఘనం,*
*ముఖమన్యో, మధ్యమన్య ఇతివారం వారేణ వ్యతికరేణ చానుతిష్ఠేయుః*

అనేకమంది పురుషులతో ఒక్క స్త్రీ ఒక్క మాటుగానూ, విడివిడిగానూ రతి సలిపే విధానం ఇక్కడ చెపుతున్నారు.

ఆ స్త్రీని ఒకడు తొడపై కూచోబెట్టుకోవాలి. రెండోవాడు సంభోగం చెయ్యాలి. మూడోవాడు ఆ స్త్రీ కటి ప్రదేశంలో నఖక్షతాలు ప్రయోగించాలి. మరొకడు ముఖం ముద్దాడాలి. ఇంకొకడు కౌగలించుకోవాలి. ఈ విధంగా ఒక్కొక్కడు ఒక్కొక్క రకమైన క్రియతో ఆమెను రంజింప చేయాలి. వంతుల ప్రకారం ఒక రోజు ఒకరితో, మరొక రోజు మరొకరితో క్రీడించే ప్రత్యేక విధానం ఇది. అయితే, ఇదంతా నీచమైన వ్యవహారం అని చెప్పక తప్పదు. కుక్కలకంటే హీనంగా సాగించే ఈ రతి క్రీడలు మనుష్యులు చేయవలసినవి కావు.

45. *ఏతయా గోష్ఠీపరిగ్రహో వేశ్యా రాజయోషా పరిగ్రహోశ్చ వ్యాఖ్యాతాః*

పైన పేర్కొన్నట్లుగానే కొన్ని దేశాల్లో అనేకమంది విటులు ఉంచుకున్న వేశ్య, అనేకమంది పురుషులు పరిగ్రహించిన రాజకాంత పై విధంగానే ప్రవర్తించాలన్న మాట.

46. *అధోరతం పాయావపి దాక్షిణాత్యానా మితి చిత్రరతాని.*

దక్షిణ దేశస్థులు కొందరు స్త్రీయోనిలో కాకుండా, అపాన రంధ్రంలో లింగాల్ని ప్రవేశపెట్టి రతి చేస్తారు. దీన్ని కూడా చిత్ర రతం అనే అంటారు. ఇంతవరకూ చెప్పినవన్నీ చిత్రరతాలు.

(ఈ ఆధునిక కాలంలో ఒక యువకుడు మరో యువకుడి అపాన రంధ్రంతో రతి చేస్తూ కామవాంఛ తీర్చుకోడం జరుగుతూనే వుంది!)

*47. పురుషోపసృప్తకాని పురుషాయితే వక్ష్యామః*

సంవేశనం తరువాత, విధిగా చెప్పవలసినవి పురుషోప సృప్తాలు. వాటిని గురించి పురుషాయితంలో చెపుతారు.

*48. భవతశ్చాత్ర శ్లోకాః పశూనాం, మృగజాతీనాం, పతంగానాం*
*చ విభ్రమైః, తైస్తైరుపాయై, శ్చిత్తజ్ఞోరతి యోగాన్ వివర్ధయేత్.*

బుద్ధిమంతుడైనవాడు పశువులూ, మృగాలూ, పక్షులూ మున్నగునవి అనుసరించే రతి చేష్టితాదులను పరిశీలించి చూచి, ఆయా ఉపాయాలతో రతి బంధాలను అభివృద్ధి పరుస్తూ కాంతలను సంతుష్టాంత రంగలను చేయాలి.

*49. తత్సాత్మ్యద్దేశసాత్మ్యచ్చ తైస్తైర్భావైః ప్రయోజితైః,*
*స్త్రీణాం స్నేహశ్చ రాగశ్చ బహుమానశ్చ జాయతే.*

స్త్రీ అభీష్టాలనూ, అభిరుచులనూ కనిపెట్టి, దేశాచారాలను గమనించి వారికి భావప్రాప్తి కలిగే విధంగా పురుషులు పశుపక్ష్యాదుల రతి క్రీడా విధానాలు అనుసరించాలనీ, ఆ విధంగా వారి ప్రేమాభిమానాలు, గౌరవం చూరగొనాలనీ చెపుతున్నారు శాస్త్రకారులు.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే సాంప్ర*
*యోగికే ద్వితీయే ఽధికరణే సంవేశన*
*ప్రకారా శ్చిత్ర రతాని చ షష్ఠోఽధ్యాయః*

**ఇది వాత్స్యాయన ముని విరచిత కామసూత్రాల్లో సాంప్రయోగికం అనే రెండవ అధికరణంలో సంవేశన విధానాల్లోని చిత్రరతాలు అనే ఆరో అధ్యాయం.**



# సప్తమాధ్యాయం

## ప్రహణనాలు, సీత్కృతాలు

*1. కలహరూపం సురతరూపమాచక్షతే, వివాదాత్మకత్వా ద్వామశీలత్వాచ్చ కామస్య.*

**ఒకే శయ్యపై** పరుండి, భగలింగ సంయోగం కలిగివున్న, స్త్రీ పురుషులు ముఖ్యంగా ప్రయోగించవలసిన ప్రహణనాలను గురించీ, వాటివల్ల పుట్టే సీత్కృతాలను గురించీ ఈ అధ్యాయంలో చెపుతున్నారు శాస్త్రకారులు.

ప్రహణనాలంటే చిరుదెబ్బలు. ప్రేమికులు ఒకరినొకరు చిరుదెబ్బలు కొట్టుకున్నప్పుడు పుట్టే సీత్కృతాలు.

సాధారణంగా చిన్న దెబ్బ కొట్టినా ఎవరికైనా సరే, కోపం వస్తుంది. అలాంటప్పుడు అవి సురతానికి ఎలా ఉపయోగపడతాయి? ఈ ప్రశ్నకు సమాధానం చెపుతున్నారు.

సంభోగం కూడా ఒక పోట్లాట వంటిదే. అయితే, ఇది ప్రణయ కలహం. ఈ ప్రణయ కలహంలో స్త్రీ, పురుషులు ఇద్దరూ ఎవరి సుఖం కోసం వాళ్ళు, రెండవవారిని నొక్కుతో, రక్కుతూ, తిరస్కరిస్తూ, వెక్కిరించుకుంటూ, పీడించుకుని సంభోగం సాగిస్తారు. అంచేత ఈ కలహం సుఖప్రదమైనదీ, ఆనందదాయకమైనదీను. అంతేకాని ద్వేషంతో కూడినది కాదు. కాని, ఈ పోట్లాటలో స్త్రీ పురుషులు నేనుగొప్ప అంటే నేను గొప్ప అని ఒకరితో ఒకరు పోటీ పడతారు. సురతం మృదువుగా చేయవలసినదే. అయినప్పటికీ, ఒకరనొకరు నిర్దయతో పీడించుకుంటారు. కాబట్టే కామం సురతరూపమే కాక, కలహరూపం కూడా అవుతూవుంది.

*2. తస్య రాగవశాత్ ప్రహణనమంగం, స్కంధౌ, శిరః*
*స్తనాంతరం, పృష్ఠం, జఘనం, పార్శ్వ ఇతి స్థానాని.*

అసలు సురతం అనేదానికి మూలం ప్రేమ. ఆ ప్రేమ వృద్ధి పొందడానికి ప్రహణనాలు సాధనాలుగా ఉంటున్నాయి. ఈ చిరుదెబ్బలు ప్రయోగించవలసిన స్థానాలు భుజాలు. శిరస్సు, స్తనాల మధ్య, వీపు, కటి ప్రదేశం, ప్రక్కలు. అంటే ఈ ప్రదేశాల్లోనే ప్రహణనాలను ప్రయోగించాలి.

*3. త చ్చతుర్విధం, అపహస్తకం, ప్రసృతకం, ముష్టి, స్సమతలక మితి.*

ఈ చిరుదెబ్బలు నాలుగు విధాలు. అపహస్తకం, ప్రసృతకం, ముష్టి సమతలకం.

అపహస్తకమంటే అరచేతి వెనుకభాగంతో కొట్టడం. అంటే ఈ దెబ్బలో వేళ్ళు మాత్రమే తగులుతాయి. ప్రసృతాకాన్ని గురించి ముందు చెప్పడం జరుగుతుంది. ముష్టి అంటే పిడికిలితో గుద్దడం. అరచేతిని చాచి స్తనాల మీద చరచడం, స్తనాలను మర్దించడం, సమతలకం.

*4. త్రుషుద్భవం చ సీత్కృతం తస్యాతి రూపత్వాత్, తదనేక విధమ్.*

ఈ చిరుదెబ్బల వల్ల కలిగే సీత్కృతాలు అనేక విధాలుగా ఉన్నాయి.

*5. బిరుతాని చేష్టా.*

రతి కూజితాలు కూడా ఎనిమిది రకాలు. వీటిని కూడా ఇక్కడ చెపుతున్నారు. రతి మూలంగా కలిగే సౌఖ్యవిశేషం వల్ల ఏర్పడతాయి ఇవి. సీత్కృతాలు మాత్రం చిరుదెబ్బల వలననే కలుగుతాయి.

## రతి కూజితాలు, సీత్కృతాలు !

*6. హింకార, స్తనిత, కూజిత, రుదిత సూత్కృత, దూత్కృత, ఫూత్కృతాని.*

రతి కూజితాల్లో హింకారం, స్తనితం, కూజితం, రుదితం, సూత్కృతం, ధూత్కృతం, ఫూత్కృతం అనేవి ప్రసిద్ధమైనవి.



హింకారం అంటే అమితంగా సౌఖ్యం కలిగినప్పుడు, పెదవులతో నోరు మూసుకుని, గొంతుకతోనూ, ముక్కుతోనూ, 'హి, హీ' అనే శబ్దం చేయడం, స్తనితం అంటే మేఘ ధ్వనిలా పెద్దగా ధ్వని చేయడం. ఇది కూడా కంఠంతోనే 'హుం, హుం' అన్నట్లుగా శబ్దం వస్తుంది. ఇక రుదితం అంటే ఏడుస్తున్నట్లుగా ధ్వని చేయడం. సూత్కృతం అంటే నిట్టూర్పు విడవడం. పోతే, కూజితం, ధూత్కృతం, ఫూత్కృతం ఈ మూటి లక్షణాలు ముందు చెపుతారు.

*7. అంబాऽర్థాశ్శబ్దాః వారణార్థా మోక్షణార్థాశ్చ,*
*అలమర్థాస్తే తే చార్థయోగాత్.*

అమ్మ, అమ్మ అనే అర్థం వచ్చే శబ్దాలు, ఆగు, ఆగు అనే అర్థాలు గల శబ్దాలు, అలాగే చాలు, చాలు అనే భావం వచ్చే శబ్దాలు ఇంక చచ్చాను బాబోయ్, చచ్చాను బాబోయ్ అనే శబ్దాలు - ఇవన్నీ రతి కూజితాల్లో సంభవిస్తూ ఉంటాయి. సంభోగ సమయంలో స్త్రీ, పురుషులకు ఒళ్ళు తెలియదు. మరే ప్రపంచమూ కనపడదు. అదొక అనిర్వచనీయమైన ఆనందావస్థ. ఒక సుఖావస్థ. ఆ అవస్థలో, రకరకాల శబ్దాలు చేయడం, కేకలు పెట్టడం జరుగుతూ ఉంటుంది. వీటినే రతి కూజితాలని అంటారు.

*8. పారావత, పరభృత, హారీత, శుక, మధుకర, దాత్యూహ, హంస,*
*కారండవ, లావక విరుతాని, సీత్కృత భూయిష్ఠాని, వికల్పశః ప్రయుంజీత.*

పావురాళ్ళలాగా, కోకిల్లల్లాగా, తీతువుపిట్టల్లాగా, చిలుకల్లాగా, తుమ్మెదల్లాగా, గిడ్డంగి పిట్టల్లాగా, హంసల్లాగా, కారండవ పక్షుల్లాగా, గోరువంకల్లాగా వినడానికి ఇంపుగా, మధురంగా ఉండే ధ్వనులు రకరకాలుగా మార్చి, మార్చి ప్రహణన సమయంలో సీత్కృతాలు ప్రయోగించాలి. ఇవి చిత్ర విచిత్రంగా ఉంటాయి!

*9. ఉత్సంగోపవిష్టాయాః పృష్ఠేముష్టినా ప్రహారః*

పురుషుడు తన తొడమీద కూచుని ఉన్న తరుణీమణి వీపుమీద నెమ్మదిగా పిడికిలితో గుద్దాలి.

*10. తత్ర సాసూయాయా ఇవస్తనిత, రుదిత, కూజితాని ప్రతీఘాతశ్చ స్యాత్.*

అలా పురుషుడు పిడికిలితో గుద్దినప్పుడు, దాన్ని సహించలేనట్లుగా బాధను వ్యక్తంచేస్తూ కాంత స్తనితాన్ని, కూజితాన్ని, రుదితాన్ని చెయ్యాలి. తిరిగి అతని వీపుమీద పిడికిలితో గుద్దాలి. ఇవన్నీ ప్రేమికుల ప్రణయక్రీడలు.

*11. యుక్త యంత్రాయాః స్తనాంతరే అపహస్తకేన ప్రహరేత్.*

సంభోగ సమయంలో భగ, లింగ సంయోగం కలిగి ఉన్నప్పుడు పురుషుడు స్త్రీ చన్నుల మధ్యప్రదేశంలో అరచేతి వెనుక భాగంతో నెమ్మదిగా చరుస్తూ ఉండాలి.

*12. మందోపక్రమం వర్ధమానరాగ, మాపరిసమాప్తేః*

ఈ చిరుదెబ్బలు రతి ప్రారంభ సమయంలో నెమ్మది నెమ్మదిగా మొదలుపెట్టి, అనురాగం ఎక్కువైనకొద్దీ, రతిలో వేగం హెచ్చినకొద్దీ ప్రహణనాలను హెచ్చిస్తూ, రతి పూర్తి అయ్యేదాకా అలా చేస్తూనే వుండాలి.

*13. తత్ర హింకారాదీనా మనియమే నాభ్యాసేవ వికల్పేన చ, తత్కాలమేవ ప్రయోగః*

పురుషుడు స్త్రీ చన్నులమధ్య మెల్లగా కొట్టినప్పుడు ఆమె తన బాధను సూచించే హింకారం, మున్నగు సీత్కృతాలు రతి ప్రారంభంలో స్వల్పంగాను, రతి మధ్యకాలంలో కొంచెం హెచ్చుగాను, రతి చివర ఇంకా హెచ్చుగాను అభ్యాసంతో ప్రయోగిస్తూ ఉండాలి.

*14. శిరసి కించిదాకుంచితాంగులినా కరేణ వివదంత్యాః*
*ఫూత్కృత్య ప్రహణనం తత్ప్రసృతకమ్.*

స్త్రీ తనతో వాగ్వాదం చేస్తున్నప్పుడు పురుషుడు తన చేతివ్రేళ్ళు కొంచెం వంచి, అరచేతి వెనుకభాగంతో ఆమె తలమీద ఫూత్కారం చేస్తూ కొట్టాలి. దీన్ని 'ప్రసృతకం' అంటారు.

*15. తత్రాంతర్ముఖేణ కూజితే ఫూత్కృతం.*

పైన పేర్కొన్న ప్రసృతకం అనే ప్రహణనాన్ని నాయకుడు ప్రయోగించినప్పుడు, నాయిక తాను తాళలేనన్నట్లు ఫూత్కృతం అనే సీత్కారం చెయ్యాలి. అంటే, నోరు మూసుకుని, గొంతుతోను, ముక్కుతోను శబ్దం చెయ్యాలన్న మాట.

*16. రతాంతే చ శ్వసితరుదితే వేణోరివ స్ఫుటతః*
*శబ్దానుకరణం ధూత్కృతమ్.*

సంభోగం ముగిసే సమయంలో ధాతుక్షయం అవుతుంది. కాబట్టి, ఇంచుక ఆయాసంతో ఉన్న భామామణి శ్వసితం, రుదితం అనే రతి కూజితాలను వినడానికి ఇంపుగా, సొంపుగా ఉండేలా చెయ్యాలి. పురుషుడు దంతక్షతమో, నఖక్షతమో చేసినప్పుడు స్త్రీ అలసిపోయినట్లుగా నటిస్తూ, కంఠం నుంచి వెలువరించే శబ్దాన్ని దూత్కృతం అంటారు. వెదురు బొంగును బ్రద్దలు చేసినప్పుడు పుట్టే ధ్వనిలా ఉంటుంది ఈ శబ్దం.

*17. అప్సు బదరస్యేవని పతతః ఫూత్కృతమ్.*

నీళ్ళలో రేగుపండు పడవేస్తే 'బుడుంగు, బుడుంగు' అనే శబ్దం వస్తుంది. అలాంటి శబ్దాన్నే ఫూత్కృతం అంటారు. దవడల పై భాగాన్ని నాలుకతో కలిపి ఉచ్ఛరిస్తే ఈ ధ్వని పుడుతుందట!

*18. సర్వత్ర చుంబనాదిషూపకాంతయా, స్వసీత్కృతం తేనైవ ప్రత్యుత్తరమ్.*

పురుషుడు చుంబనాదులు ప్రారంభించినప్పుడల్లా స్త్రీ కూడా వాటికి సమాధానంగా సీత్కృతాలూ చేస్తూ ముద్దుల వర్షం కురిపించాలి.

*19. రాగవశాత్ప్రహణనాభ్యాసే వారణ, మోక్షణాలమర్థానాం శబ్దానా,*
*మంబాZర్థానాం చ సతాంత శ్వసిత, రుదిత స్తనిత మిశ్రీకృతః*
*ప్రయోగో విరుతానాం చ రాగావసానకాలే*
*జఘనపార్శ్వక స్తాడన మిత్యతిత్వరయాచాపరినమాప్తేః*

రతి సమయంలో ప్రియుడు కామోద్రేకంతో పదే పదే ప్రణయతాడనాలు చేస్తున్నప్పుడు, ప్రేయసి 'వద్దు, వద్దు, ఇక ఆగండి - చాలు, చాలు నన్ను విడిచిపెట్టండి' - అంటూ అలసిపోయిన కంఠస్వరంతో శ్వసితం, రుదితం, స్తనితం మొదలైన సీత్కృతాలను ప్రయోగించాలి. ఇక రతి ఆఖరులో, స్ఖలన సమయమందు కూడా ఇలాంటి రతి కూజితాలే ప్రయోగించాలి. అప్పుడే స్ఖలనమయ్యేదాకా కటి ప్రదేశానికి రెండు ప్రక్కలా మెల్లగా కొడుతూ ఉండాలి. ఇక్కడ 'సమతలకం' అనే సీత్కృతం ప్రయోగించాలని శాస్త్రకారులు చెపుతున్నారు.

*20. తత్ర లావకహంసనికూజితం త్వరయైవైతే స్తనప్రహణనయోగాః*

పురుషుడు తన అరచెయ్యి సాఫుగా చాచి ప్రహణనం చేస్తే గోరువంకలు, హంసలు కూసినట్లు శబ్దం చేస్తుంది స్త్రీ. ఈ ధ్వనులు అత్యంత మనోహరంగా ఉంటాయి. అలాంటి మనోహరమైన కూతలు విని పురుషుడు మహదానందభరితుతుడై మళ్ళీ ప్రహణనం చేస్తాడు. కాంత మళ్ళీ జగన్మోహనంగా రతికూజితం చేస్తుంది.

(సంభోగ సమయంలో కాముకులైన స్త్రీ పురుషులు చేసే ఈ ప్రహణనాలూ, రతికూజితాలు వివరించి చెప్పడం కంటె అనుభవిస్తే తెలుస్తుంది వాటి ఆనందం!)

*21. భవతశ్చాత్ర శ్లోకా పారుష్యం, రభనత్వం చ పౌరుషం, తేజ ఉచ్యతే,*
*అశక్తి రార్తి ర్వ్యావృత్తి రబలత్వం చ యోషితః*

*22. రాగా, త్ప్రయోగ, సాత్మ్యాచ్చ వ్యత్యయోఽపి క్వ చిద్భవేత్,*
*న చిరం తస్య చైవాంతే ప్రకృతే రేవ యోజనమ్.*

ఈ చిరుదెబ్బలూ, సీత్కృతాల విషయంలో స్త్రీ పురుషుల్లో ఏది ఎవరికి సహజంగా ఉంటుంది? - అని అడిగితే, కఠినమైన శరీరం, గంద్రతనం - ఇవి రెండూ పౌరుషమనే తేజస్సుకు సహజ ధర్మాలు. అలాంటి పౌరుషం కలవాడే పురుషుడు. కాబట్టే అతను స్త్రీని తాడనం చేస్తాడు. తిరిగి కొట్టే సామర్థ్యం స్త్రీకి లేదు. ఒకవేళ అలా కొట్టినా ఆ దెబ్బ సుకుమారంగా ఉంటుంది. అంతేకాక ఆమెకే నొప్పి అనిపిస్తుంది! మళ్ళీ కొట్టమని అడిగినా, మగువ శక్తి లేనందున నిస్త్రాణ పడుతుంది. ఇలా ఉండడం స్త్రీలకు సహజమేకదా! అంచేత తరుణులు ప్రహణనాలు చెయ్యలేరు. సీత్కృతం మాత్రమే చేస్తారు.

అయితే, కామోద్రేకాన్ని బట్టి, దేశాచారాన్ని బట్టి, ఒక్కొక్కప్పుడు స్త్రీ తన సహజ లక్షణాలు వదిలేసి, పురుషుడిలాంటి ఔద్ధత్యం పూని, పురుషుడిపై ప్రహణనాలు ప్రయోగించవచ్చు. అప్పుడు పురుషుడు స్త్రీని రెచ్చగొట్టడానికి, ప్రోత్సహించడానికి తన లక్షణాలను వదిలిపెట్టి స్త్రీలాగా సీత్కృతాలూ, విరుతాలూ మొదలైనవి చేయవచ్చు. అన్నివేళలా ఇలా చేయవలసిన పనిలేదని గ్రహించాలి. కేవలం కుతూహలం కోసమే పురుషుడు అలా స్త్రీ లక్షణాలు అనుసరించాలే కాని, ఆ కుతూహలం కాస్తా తీరిపోయింతరువాత, మళ్ళీ తన సహజ లక్షణాలనే ఆశ్రయించాలి - అంటున్నారు వాత్స్యాయనులు.

## ప్రహణనాలలో ప్రమాదాలు!

*23. కీలామురసి, కర్తరీం శిరసి, విద్ధాం కపోలయోః సందంశికాం*
*స్తనయోః పార్శ్వయోశ్చేతి పూర్వైస్సహ ప్రహణన మష్ట*
*విధ మితి దాక్షిణాత్యానాం, తద్యువతీనా మురసి కీలాని చ*
*తత్కృతాని దృశ్యంతే, దేశసాత్మ్య మేతత్.*

ప్రహణనాలు నాలుగు రకాలని ఇదివరకే చెప్పారు. వాటిని ఇంకా పెంచి ఇక్కడ ఎనిమిది విధాలుగా చెపుతున్నారు. ఇంతకుముందు చెప్పిన పిడికిలినే (ముష్టినే) చూపుడు వ్రేలుకూ మధ్య వ్రేలుకూ మధ్యగా, బొటన వ్రేలును

దూర్చి పిడికిలి పట్టి పొడిస్తే దాన్ని 'కీల' అంటారు. దీన్ని మొట్టినట్లుగా పొడవాలి. చన్నుల మధ్య ప్రదేశంలో మాత్రమే ప్రయోగించాలి దీన్ని, 'కర్తరి' అనే ప్రహణనం ఉంది. అది రెండు విధాలు - భద్రకర్తరి, యుగళకర్తరి. వ్రేళ్ళు కొద్దిగా వంచి, ఒక చేత్తో తాడనం చేస్తే అది 'భద్రకర్తరి' రెండు చేతుల వ్రేళ్ళూ కలిపి తాడనం చేస్తే, అది యుగళకర్తరి. ఈ రెండు రకాల ప్రహణనాలనూ తలమీద మాత్రమే ప్రయోగించాలి. చూపుడు వ్రేలుకూ - మధ్య వ్రేలుకూ గాని, మధ్య వ్రేలూకూ, అనామిక వ్రేలుకూగాని (ఉంగరపు వ్రేలు) మధ్యగా బొటన వ్రేలు దూర్చి, పిడికిలి పట్టి పొడిస్తే, దాన్ని 'విద్ధ' అంటారు. దీన్ని బుగ్గల మీద మాత్రమే ప్రయోగించాలి. దీన్నే చన్నుల మీదగానీ, ప్రక్క భాగాల్లోగానీ చర్మాన్ని లాగితే దాన్ని 'సందంశిక' అంటారు. ఇంతకుముందు చెప్పిన నాలుగూ, ఇవి నాలుగూ మొత్తం ఎనిమిది ప్రహణనాలు. ఈ ఎనిమిదినీ దక్షిణ దేశస్థులు ఎక్కువగా ప్రయోగిస్తారు. వీరు రమణుల వక్షస్థలంపై 'కీల' అనే ప్రహణాన్ని ప్రయోగిస్తారు. ఇది వారి దేశాచారం.

*24. క్లేశమనార్యవృత్త మనాదృత్యమితి వాత్స్యాయనః*

పైన చెప్పినవి దేశాచారాన్ని అనుసరించి అలవాటులో ఉన్నవారే ప్రయోగించడం ధర్మం. అభ్యాసం లేని ఇతరులపై ప్రయోగించడం అధర్మం, అనాగరకం, దయాశూన్యమూ, ప్రాణాంతకమూ కూడా.

*25. తథా అన్యదపి దేశసాత్మ్య (త్ప్ర)యుక్తమ(త్ర న ప్రయుంజీత.*

కాబట్టి, ప్రహణనాలు ఏవైనా, మనదేశంలోనో అనుసరిస్తున్నారని చెప్పి, ప్రతిదేశంలోనూ, ప్రతివారు ప్రయోగించరాదు.

*26. ఆత్యయికంతు (తత్రాపి పరిహరేత్.*

వినాశనానికీ, అంగవైకల్యాది ప్రమాదాలకూ కారణాలైన ప్రహణనాలు ఎప్పుడూ, ఎక్కడా ప్రయోగించరాదని వాత్స్యాయనులు హెచ్చరిస్తున్నారు.

*27. రతియోగేహి కీలయా గణికాం చిత్రసేనాం చోళరాజో జఘాన.*

ఇలాంటి ప్రమాదాలు జరిగాయని దృష్టాంతంగా కొన్ని సంఘటనలను గురించి తెలుపుతున్నారు శాస్త్రకారులు.

పూర్వం చోళ దేశాన్ని ఒకరాజు పరిపాలిస్తూ ఉండేవాడట. చిత్రసేన అనే చక్కని భోగంది ఉండేది ఆ రాజుకు. ఆ వేశ్య చాలా సుకుమారురాలు. ముట్టుకుంటే కందిపోయేలా ఉండేది. ఒకరోజు రాజు కామోద్రేకంతో, ఆమెతో సంభోగించబోయి తన శక్తి కొలదీ గట్టిగా, మొరటుగా నొక్కి కౌగలించుకున్నాట్ట! పాపం, నాజూగ్గా, పువ్వులా ఉండే చిత్రసేన ఆ ఆలింగనానికి తట్టుకోలేకపోయింది. బాధపడడం మొదలు పెట్టింది. అలా ఆమె బాధపడుతున్నా, కామాంధుడైన చోళరాజు, ఆమె పరిస్థితి గ్రహించక, నిర్దయుడై ఆమె వక్షస్థలం మీద 'కీల' అనే ప్రహణనాన్ని ప్రయోగించాట్ట. అంతే! ఆమె చనిపోయింది.

*28. కర్తర్యా కుంతలశ్శాతకర్ణిః శాతవాహనో, మహాదేవీం మలయవతీం.*

- అలాగే పూర్వం కుంతల దేశాధిపతి అయిన శాతకర్ణి అనే రాజు కూడా అకృత్యానికి పాల్పడ్డాడు. ఆ రాజు పట్టపురాణి పేరు మలయవతి. ఆమె పసితనంలో ఉంది. పైగా కొత్తగా అప్పుడప్పుడే పరిచయం అవుతూ ఉంది. అలాంటి పట్టపుదేవి, మన్మథోత్సవ సమయంలో ఏదో వేషంలో చక్కగా అలంకారం చేసుకుని కంటపడింది. అప్పుడా రాజు, మోహపరవశుడై, ఒళ్లు తెలియక, ఆమెను కలుసుకోబోయాడు. 'కర్తరి' అనే ప్రహణాన్ని కామోద్రేకంతో, బలంగా ఆమె తలపై ప్రయోగించాడు. ఇంకేముంది ? - మలయవతి తక్షణమే మరణించింది!

*29. నరదేవః కుపాణిః విద్ధయా. దుష్ప్రయుక్తయా నటీం కాణాం చకార.*

అంతేకాదు, పూర్వం పాండ్యరాజు వద్ద ఒక సేనాపతి ఉండేవాడు. అతనిపేరు నరదేవుడు. అమిత బలశాలి. చాలా మొరటు మనిషి. రాజు అంతఃపురంలో 'చిత్రలేఖ' అనే చక్కని నాట్యకత్తె ఉండేది. ఆమెను చూచి మోహించాడు నరదేవుడు. ఆమెతో సంభోగించబోయి, కామోద్రేకంతో 'విద్ధ' అనే ప్రహణాన్ని చిత్రలేఖ మృదువైన చెక్కిళ్ళపై ప్రయోగించాడు. మోటుతనంతో చేసిన ఆ ప్రయోగానికి పాపం ఆ నర్తకి తక్షణమే కళ్ళు తిరిగి క్రిందపడిపోయి ప్రాణాలు కోల్పోయింది!

*30. భవంతి చాత్ర శ్లోకాః నాస్త్యత్ర గణనా కా చిత్, నచ శాస్త్ర పరిగ్రహః*
*ప్రవృత్తే రతి సంయోగే రాగ ఏవాత్ర కారణం.*

అంచాత ఈ ప్రహణనాలు సంగతి, సందర్భాలు తెలుసుకోకుండా, ఇష్టం వచ్చినట్లు ప్రయోగిస్తే ప్రమాదం తప్పదు. అసలు ప్రపంచంలో కామశాస్త్ర రహస్యాలు తెలుసుకున్నవాళ్లు, తెలియని వాళ్ళు అని రెండు రకాల జనం ఉన్నారు. శాస్త్రతత్వం తెలియనివాళ్ళకు లోకమే తెలియదు. కాబట్టి అలాంటివారు క్షణికమైన కామోద్రేకం కళ్ళకు ఎగదట్టగా ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తారు.

పువ్వుల్లాంటి రమణీమణులపై పడి మోటుగా రతికి ఉపక్రమిస్తారు. అలాంటి వారిని మగువలు అసహ్యించుకుంటారు. మరి, శాస్త్రతత్వం తెలుసుకున్న పండితుడు ఎంత ప్రేమానురాగాలు ఉన్నా, కామం పొంగి వచ్చినా, ఇది చేయవచ్చు, ఇది చేయకూడదు - అనే జ్ఞానం విశేషంగా ఉంటుంది కాబట్టి ఆలోచించుకుని ప్రవర్తిస్తాడు, ప్రహణనాదులను ప్రయోగిస్తాడు. అలాంటప్పుడు ఏ ఇబ్బందీ ఉండదు.

*31. స్వప్నేష్వపి న దృశ్యంతేతే భావాస్తే చ విభ్రమాః,*
*సురతవ్యవహారేషు యే స్యుస్తత్క్షణకల్పితా.*

శాస్త్రం తెలిసినవారు కానీ, తెలియనివారు కానీ సురతక్రీడల్లో అప్పటికప్పుడు కల్పించుకునే విలాసాలకూ, భావాలకూ, అభీష్టాలకూ అంతు ఉండదు. అవి కలలో కూడా అనుకోనివిగా ఉంటాయి. అంటే, కామక్రీడలు ఎప్పటికప్పుడు కొత్తగా సృష్టించుకునేవిగా ఉంటాయన్న మాట! అలాంటి విషయాలను సంపూర్ణంగా, సర్వ సమగ్రంగా శాస్త్రంలో చెప్పడం ఎలా సాధ్యమవుతుంది ?

32. *యథా హి పంచమీం ధారాం ఆస్థాయ తురగః పథి, స్థాణుం*
*శ్వభ్రం, దరీం వాఽపి వేగాంధో న సమీక్షతే.*

33. *ఏవం సురత సమ్మర్దే రాగాంధౌ కామినావపి,*
*చండవేగౌః, ప్రవర్తేతే, సమీక్షతే న చాత్యయం.*

ధారం అంటే నడక. గుర్రాలు అయిదు రకాల నడకలతో పరుగెత్తుతూ ఉంటాయి. ఆ నడకలకు విక్రమం, వల్లితం, ఉపకంఠం, ఉపజవం, జవం - అని పేర్లు. ఈ అయిదు రకాల నడకల్లో అయిదోది అయిన జవం అనే రకంతో పరుగుతీసే గుర్రం వాయువేగంతో పోతూ ఉంటుంది. త్రోవలో మిట్ట పల్లాలున్నాయని గానీ, గోతులూ, దిబ్బలూ ఉన్నాయని గానీ అది గమనించదు. అదే విధంగా కామోద్రేకంతో ఉన్న స్త్రీ పురుషులు, తమ్మి తాము మరిచిపోయి ఒళ్ళు తెలియకుండా తొందర తొందరగా సురత క్రీడలు జరపడంలో నిమగ్నులవుతారే తప్ప రాబోయ్యే విపత్తులను గుర్తించరు. శాస్త్రం తెలియని అజ్ఞానుల ప్రవర్తన ఇలాగే ఉంటుంది.

34. *తస్మాన్మృదుత్వం, చండత్వం, యువత్యా బలమేవ చ,*
*ఆత్మనశ్చ బలం జ్ఞాత్వా, తథా యుంజీత శాస్త్రవిత్.*

అంచేత శాస్త్రాన్ని తెలుసుకుని పురుషుడు సమయ, సందర్భాలను గ్రహించి, అవసరాన్ని, అవకాశాన్ని బట్టి తాను సంభోగించబోయే స్త్రీ యొక్క బలాన్నీ, తన బలాన్నీ పరీక్షించుకుని, దానికి తగినట్లుగా ప్రవర్తించాలి. రతి చండవేగంతో సాగించాలో, లేక మృదువుగా నలపాలో ఆలోచించుకుని యుక్తా యుక్త వివేక జ్ఞానంతో వ్యవహరించాలి. అలా వ్యవహరించకపోతే, శాస్త్రం తెలిసిన వాడికీ, తెలియని వాడికీ తేడా ఏముంటుంది? ఈ కామశాస్త్ర తత్వం తెలుసుకున్నవాడు ఎప్పుడూ కామంధుడై ప్రవర్తించడు - అని చెప్పారు పెద్దలు.

35. *న సర్వదా, న సర్వాసు ప్రయోగాస్సాంప్రయోగికాః*
*స్థానే, దేశేచ, కాలేచ, యోగ ఏషాం విధేయతే.*

అన్ని సమయాల్లో, అందరి స్త్రీల యందూ అన్ని రకాల బంధనాలూ ప్రయోగించకూడదు. దేశ కాల మాన పరిస్థితులు గమనించి, ఆ బంధాలు ప్రయోగించవచ్చో, లేదో యోచించుకుని జాగ్రత్తగా ప్రవర్తించాలి.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే ద్వితీయేఽధికరణే ప్రహణన ప్రయోగాస్తద్యుక్తాశ్చ సీత్కృతక్రమాః ఇతి సప్తమోధ్యాయః*

**ఇది వాత్స్యాయన ముని రచించిన కామసూత్రాల్లో సాంప్రయోగికం అనే రెండో అధికరణంలో ప్రహణన యోగాలు, వాటి ప్రయోగాలు, సీత్కృత క్రమాలు అనే ఏడవ అధ్యాయం.**

# అష్టమాధ్యాయం
# పురుషోపసృప్తం

1. *నాయకస్య సంతతాభ్యాసాత్పరిశ్రమ ముపలభ్య రాగస్య*
*చా పశమం, అనుమతా తేన తమధోఽవపాత్య పురుషాయితేన సాహాయ్యం*
*దద్యాల్, స్వాభిప్రాయాద్వా, వికల్పయోజనార్థినీ నాయక కుతూహలాద్వా.*

**ఇంతకు** ముందుచెప్పిన ప్రహణాదులను అదేపనిగా ప్రయోగించడం వల్ల పురుషుడు శ్రమతో అలసిపోతాడు. అయినా అతడు అనురాగంతో పరిపూర్ణుడై ఉంటాడు. అలాంటప్పుడు స్త్రీ పురాషాయితానికి ఉపక్రమించాలి. పురుషుడు స్త్రీ లాగానే వెల్లకిల పరుండి ఉంటే, స్త్రీ ఆ పురుషుడి మీద బోర్ల పడుకుని, పురుషుడు చేసినట్లుగానే రతిక్రియ సాగించడాన్ని పురుషాయితం అంటారు. ఈ పురుషాయితానికై ఉపయోగించే క్రియలే పురుషోపసృప్తాలు. అంచేత పురుషాయితాన్ని గురించీ. పురుషోపసృప్తాలను గురించీ ఈ అధ్యాయంలో వివరిస్తున్నారు శాస్త్రకారులు.

పురుషుడు రకరకాల బంధాలు ప్రయోగిస్తూ వెంట, వెంటనే సంభోగం సాగించి శ్రమతో బాగా అలసిపోయినప్పుడు, అతను ఇంకా రతి యందు అనురాగ పూరితుడై ఉంటే, ఆ సంగతి మగువ గ్రహించాలి. వెంటనే అతని అనుమతితో, అతన్ని పడకపై వెల్లకిల పరుండజేసి, పురుషాయితాన్ని మొదలుపెట్టాలి.

ఈ పురుషాయిత క్రియలో భేదాలున్నాయి. తన కుతూహలాన్ని బట్టిగానీ, పురుషుడి ఆసక్తిని బట్టిగానీ, స్త్రీ ఈ పురుషాయిత క్రియను అనుసరించవచ్చు. అయితే, ఈ పనిలో కాంత, తప్పకుండా నాయకుడి అనుమతి పొందాలి. అతనికి ఇలాంటి పని ఇష్టమున్నదో లేదో తెలుసుకోవాలి. అలా పురుషుడికి ఈ పనిపై ఇష్టమున్నదని తెలిసిన తరువాత, అతను శ్రమతో అలిసి ఉండకపోయినప్పటికీ స్త్రీ పురుషాయితాన్ని ప్రారంభించవచ్చు.

## పురుషాయితం

2. *తత్ర యుక్తయంత్రేణైవేతరేణో త్థాప్యమానా, తమవపాతయే*
*దేవం చ రతమవిచ్ఛిన్న రసం తథా ప్రవృత్తమేవ స్యాదిత్యేకోఽయం*
*మార్గః పునరారంభేణాదిత ఏవోపక్రమేదితి ద్వితీయః*
*పురుషాయితం చెయ్యడంలో రెండు విధాలున్నాయి.*

మొదట నాయిక వెల్లకిల పడుకుని ఉండగా, నాయకుడు సంభోగం చేస్తూ తాను ముక్కోణాకారంలో కూచుని, భగలింగాలు విడిపోకుండానే, నాయికను పైకి లేవదీసుకుని, తన బాహువులతో గాఢంగా కౌగలించుకోవాలి. అప్పుడు

నాయిక అతని మీద వాలిపోతుంది. ఆ తరువాత నాయకుడు శయ్యమీద మెల్లగా వెల్లకిల ఒరుగుతాడు. ఇలా మొదట్లో ప్రారంభించిన రతికి విచ్ఛిత్తి ఏర్పడకుండా, ఆ సుఖానికి తెంపు కలుగకుండా, నాయికా నాయకులు క్రింద మీదై, అంతులేని ఆపేక్షతో, అనురాగంతో, సంతోషంతో, పులకరింపులతో, ఉత్సాహంతో సంభోగ సౌఖ్యం అనుభవించాలి. ఒక రకమైన పురుషాయితం ఇది, నాయకుడు బాగా శ్రమ చెంది ఉన్నప్పుడు గాని, అనురాగం అధికంగా ఉన్నప్పుడు గాని అవలంబించే పురుషాయిత క్రమం ఇది.

ఇక సంభోగం మొదలు పెట్టడానికి ముందే నాయిక, పురుషాయితాన్ని అనుసరించదలచి, అందుకు అనుకూలంగా నాయకుని పడుకోబెట్టుకుని, అతని పైకెక్కి ఆరంభం నుంచీ పురుషాయితాన్ని సాగిస్తే, అది రెండో రకం పురుషాయితం. రతి అనేది ఒక రసం. దాన్నే రతిసార సౌఖ్యం అని కూడా అంటారు. దానికి తెంపు కలగుకుండా అనుసరించేవి ఈ రెండు రకాల పురుషాయితాలే! మరో రకం ఏదీ శాస్త్రం చెప్పడం లేదు.

*3. సాప్రకీర్యమాణ కేశ కుసుమా, శ్వాసవిచ్ఛిన్న హాసినీ, వక్త్ర సంసర్గార్థం;*
*స్తనాభ్యామురః పీడయంతీ, పునః పునః శిరో నమయంతీ, యాశ్చేష్టాః*
*పూర్వమసౌ దర్శితవాంస్తా ఏవ ప్రతి కుర్వీత పాతితా*
*ప్రతిపాతయా మీతి హసంతీ తర్జయంతీ, ప్రతిఘ్నతీ చ బ్రూయాత్, పునశ్చ*
*వ్రీడాం దర్శయేచ్ఛ్రమవిరామాభీ స్సాం చ, పురుషోపసృప్తై రేవోపసర్పేత్.*

అసలు పురుషాయితం అనేది బాహ్యమనీ, అభ్యంతరమనీ రెండు విధాలు. స్త్రీ తన తలలో ధరించిన పూలు విడిపోని విధంగా, చిరునవ్వులు చిందిస్తూ ఆయాసంతో విశ్రాంతి తీసుకోడానికిగాను, పురుషుడి అధరాన్ని పానం చేస్తూ, ముఖాన్ని ముద్దు పెట్టుకోడానికై తన కుచకుంభాలతో అతని వక్షస్థలాన్ని నొక్కుతూ, మాటిమాటికీ సిగ్గుతో తల వాల్చుతూ, మామూలు రతిలో పురుషుడు తనమీద పడి ఏ ఏ చేష్టలు సాగిస్తూ ఉంటాడో, ఎన్నెన్ని రకాలుగా బాధపెడతాడో, అలాగే తనుకూడా అతనిపై పడి కసి తీర్చుకుంటున్నట్లు ఆ పనులన్నీ చెయ్యాలి. అతను తనను తలక్రిందు చేస్తే తాను అలాగే చేస్తానని పరిహాసం ఆడాలి. నవ్వుతూ అతన్ని బెదిరించాలి. చిరుదెబ్బలు కొడుతూ విలాసంగా మాట్లాడాలి. ఈ విధంగా పురుషాయితంలో కాంతామణి ఎంత స్వేచ్ఛగా ప్రవర్తించినా స్త్రీ సహజమైన సిగ్గు, లజ్జ విడిచిపెట్టకూడదు. సిగ్గు, లజ్జ అనేవి స్త్రీకి అలంకారప్రాయములు కదా! కులకాంతకు పెట్టని ఆభరణాలు ఇవి. సౌందర్యాన్ని ఇనుమడింపచేసేవి. పురుషుడిలాగా తాను ఇంకా రతి సాగించాలని మనస్సులో అభిలాష ఉన్నప్పటికీ, స్త్రీ పైకి మాత్రం పురుషాయిత బంధన కృత్యాన్ని చాలించే కోరిక ఉన్నట్లు నటించాలి.

స్త్రీ పురుషుడిలాగే రతి చేస్తే దాన్ని అభ్యంతర పురుషాయితం అంటారు. అంటే, ఇంతకు ముందు చెప్పినట్లుగా, స్త్రీ పురుషుడిపై కూచుండి పురుషాయిత బంధంతో సంభోగం సాగించాలన్నమాట.

4. తానిచక్ష్యామః

ఇక ఇప్పుడు పురుషోపసృప్తాలంటే ఏవో చెపుతున్నారు.

5. పురుషశ్శయనస్థాయా యోషిత స్తద్వచన వ్యాక్షిప్త చిత్తాయా
ఇవ నీవీం విశ్లేషయేత్, తత్ర వివదమానం కపోల చుంబనేన పర్యాకులయేత్
స్థిరలింగశ్చ తత్ర తత్రైనాం పరిస్పృశేత్ ప్రథమ సంగతా
చేత్సంహతోర్వోరంతరే ఘట్టనం, కన్యాయాశ్చతథా స్తనయో,
స్సంహతయోః హస్తయోః కక్షయోః అంసయోః గ్రీవాయామితి చ,
స్వైరిణ్యాం యథాసాత్మ్యం యథా యోగం చ, అలకే చుంబనార్థమేనాం
నిర్దయ మవలంబేత, హనుదేశే చాంగుళి సంపుటేన, తత్రేతరస్యా,
వ్రీడా నిమీలనం చ ప్రథమ సమాగమే కన్యాయాశ్చ.

# పురుషోపసృప్తంలో ఎన్నో సరదాలు !

ఈ పురుషాయితం సందర్భంలో పురుషుడు చేసే పనులనే పురుషోపసృప్తాలని అంటారు. స్త్రీ చేసే పనులను పురుషాయితం అంటారు. ఇప్పుడు మొదట పురుషుడు చేసే పనులకు గురించి చెపుతున్నారు- మొట్టమొదట పురుషుడు శయ్యపై పరుండివున్న ప్రియురాలిని మెల్లగా మాటల్లోనికి దింపి, మాటలతో ఆమె మనస్సును ఆకర్షించి, నెమ్మదిగా కోక ముడిని (చీరముడిని) ఊడదీయాలి. అందుకు ఆమె అంగీకరించక పోతే, బుగ్గల మీద ముద్దులు ప్రయోగించి కలతపెట్టి ఆమెను పరవశురాలినిగా చెయ్యాలి. అప్పుడు తరుణి మైమరచి ఉంటుంది కాబట్టి కోకముడి విప్పడం సులువు. అంతట పురుషుడు నిట్ట నిలువుగా విజృంభించి ఉన్న తన మదనదండాన్ని ఆమె చేతుల మీద, బుజాల పైన, కంఠభాగంలోను, స్తనాలమీద, తొడల మీద ఇంకా ఇలాంటి మృదువైన చోట్ల తాకించాలి.

అంతకు ముందు ఆమె సంభోగం ఎరుగని స్త్రీ గాని, పరిచయంలేని స్త్రీ గాని అయితే, మేహనాన్ని తొడల సందున మాత్రమే గట్టిగా నొక్కుతూ తాకించాలి. కన్య విషయంలో కూడా ఇలాగే చెయ్యాలి. బాగా చనువు, అనుభవం గల మగువ అయితే ఆమెకు ఇష్టమైన చోట్లలో లింగాన్ని తాకించాలి. ఇంకా ఎక్కువ పరిచయం, అలవాటు ఉన్న స్త్రీ అయితే, ఆమె ముంగురులను పదే పదే ముద్దాడాలి. బుగ్గలను మెల్లగా వ్రేళ్ళతో మెలి పెట్టాలి. అదే కొత్త స్త్రీ కాని, కన్యకాని అయితే, ఈ పని చేసేటప్పుడు సిగ్గు పడడమో, కళ్ళు మూసుకోడమో జరుగుతుంది.

బాగా చనువున్న ఆడది అలా సిగ్గుపడదు, కనులు మూయదు. స్వేచ్ఛగా, నిర్భయంగా ప్రవర్తించే జవరాండ్రు ఉంటారు. వాళ్ళు కూడా ఈ పనులకు ఏ మాత్రం జంకరు.



ఈ విధంగా కోకముడి విప్పడం, లింగం తాకించడం, స్త్రీ భగాన్ని లింగంతో బాగా రుద్దడం, బుగ్గలు, చన్నులు, ముంగురులు, ముఖం ముద్దాడడం, ఈ నాలుగు విధాలైన క్రియలు బాహ్య పురుషోపసృప్తాలు. తన ప్రక్కనే పడుకుని ఉన్న కోమలాంగికి కావలసినంత చనువు ఇచ్చి, ముద్దుల వర్షం కురిపిస్తూ పురుషుడు ఆమెను లాలించి, మన్మథక్రీడలో తేలియాడించాలి.

6. *యుక్త యంత్రేణోపసృప్యమాణా యతో దృష్టి మావర్త యేత్తత*
*ఏ వైనాం పీడయేదేత ద్రహస్యం యువతీనామితి సువర్ణ నాభః*

పురుషుడు తన మదన ధ్వజాన్ని స్త్రీ మదన మందిరంలోకి ప్రవేశపెట్టిన తరువాత ఆమె ఆలింగన, ప్రవేశ, స్పర్శ సౌఖ్యాన్ని అనుభవిస్తూ తన చూపును ఏదో ఒక వైపునకు మరల్చుతూ ఉంటుంది. అప్పుడు పురుషుడు ఆమె ఏదిక్కునకు చూపు త్రిప్పిందో, ఆదిక్కున తన సాధనంతో బాగా పీడించాలి. అలా చేయడంవల్ల కామిని త్వరగా రతిలో తృప్తి పొందుతుంది. ఈ సంగతి స్త్రీలు ఎప్పుడూ బయటికి చెప్పరు. కాబట్టి ఇదొక పెద్ద రహస్యం అని సువర్ణనాభులంటున్నారు.

లింగంతో ఎక్కడ స్పృశిస్తే స్త్రీకి తృప్తి, సుఖం కలిగి దృష్టి భ్రమిస్తుందో, అక్కడల్లా లింగంతో స్పృశిస్తూ, పురుషుడు, ఆదిక్కున గల స్త్రీ అవయవాలను పీడిస్తూ రతి చెయ్యాలని కొందరూ, ఏ ఏ ప్రదేశాల్లో పురుషుడి లింగం తాకితే, సుఖాతిశయం చేత స్త్రీ దృష్టి భ్రమిస్తూ ఉంటుందో, ఆ చోట్లలో లింగంతో స్పృశిస్తూ, పాలిండ్లను మర్దిస్తూ సంభోగం సాగించాలని మరి కొందరూ రతి సౌఖ్యానికి లక్షణాలుగా చెపుతున్నారు. అయితే, వాత్స్యాయనులు మాత్రం సువర్ణనాభుల అభిప్రాయంతోనే ఏకీభవిస్తున్నారు.

# భావప్రాప్తి

*7. గాత్రాణాం స్రంసనం, నేత్ర నిమీలనం, వ్రీడానాశః;*
*సమధికాచ రతి యోజనేతి స్త్రీణాం భావలక్షణమ్.*

అయితే, స్త్రీలకు రతిలో భావ ప్రాప్తి కలిగిందనడానికి ఏది గుర్తు? అంటే చెపుతున్నారు. స్త్రీ ఇక క్షణమైనా రతిలో ఆగలేక ఆమె శరీరం జారిపోతుంది. కళ్ళు మూసుకుంటుంది. సిగ్గుపడుతుంది.ఎక్కువగా రతి కోసం పురుషుణ్ణి తన మీద వేసుకుని గట్టిగా హత్తుకుంటుంది.స్త్రీకి రతిలో భావ ప్రాప్తి కలిగిందనడానికి ఇవే గుర్తులు.

*8. హస్తే విధునోతి, స్విద్యతి, దశ, త్యుత్థాతుంనదదాతి,*
*పాదేనాహంతి, రతావసానే చ పురుషాతి వర్తినీ.*

అంతే కాదు. రతిలో భావప్రాప్తి పొందబోయే సమయంలో కాంత, తన చేతులు విదిలిస్తుంది. ఆమె దేహమంతటా చెమటలు పోస్తాయి. పురుషుణ్ణి కదలనివ్వకుండా, లేవనివ్వకుండా గట్టిగా కరుచుకుంటుంది. దంతక్షతాలు చేస్తుంది. నఖక్షతాలు ప్రయోగిస్తుంది. ముద్దులు పెట్టుకుంటుంది. తన పాదాలతో పురుషుడి పాదాలు నొక్కుతుంది. పురుషుడి కన్నా ముందే తనకు స్ఖలనమై, భావప్రాప్తి పొందితే, తానే అతనిపై పడి నడుం ఆడిస్తుంది.

(ఆ సమయంలో స్త్రీ పొందే సౌఖ్యం వర్ణనాతీతం. పురుషుడి వల్ల రతిలో అలాంటి తృప్తి, భావప్రాప్తి పొందినప్పుడే స్త్రీ ఆ పురుషుణ్ణి మెచ్చుకుని ఎల్లప్పుడూ అతనిపై అనురాగంతో ఉండి, అతనితోనే రమించాలని అభిలషిస్తూ ఉంటుంది.)

*9. తస్యాః ప్రాగ్యంత్రయోగా త్కరేణ సంబాధం గజ ఇవ*
*క్షోభయేదామృదుభావా త్తతో యంత్రయోజనమ్.*

(స్త్రీకి కామం ఎక్కువని ఇంతకు ముందు చెప్పబడింది. మదగజం లాంటి స్త్రీ కామాన్ని తీర్చడంలోనే ఉంది పురుషుడి మగతనం! అంచాత మగువకు సత్వరం తృప్తి కలిగించడానికి కొన్ని ఉపాయాలు చెపుతున్నారు.)

మదన ధ్వజాన్ని యోనిలో చొప్పించడానికి ముందు స్త్రీ చేష్టలు ఇలా ఉన్నవి కదా అని పురుషుడు గ్రహించాలి. ఆమెకు ముందుగానే భావప్రాప్తి కలగడానికి, పురుషుడు తన చేత్తో ఆమె భగాన్ని ఏనుగు తొండలో చేసినట్లుగా, నెమ్మది నెమ్మదిగా కదల్చాలి. అలా కదల్చగా ఆమెకు కామోద్రేకం ఎక్కువవుతుంది. యోనిలో మదజలం ఊరుతుంది. అప్పుడు పురుషుడు తన మదన దండాన్ని యోనిలో ప్రవేశపెట్టాలి.

(తేనె తుట్టెను కదిల్చినప్పుడు తేనెటీగలన్నీ ఒక్కసారిగా లేస్తాయి. అలాగే స్త్రీ మర్మావయాన్ని చేత్తో కదిల్చినప్పుడు ఆమెలో కామం పొంగుతుంది.)

అయితే ఇలా భగాన్ని కదల్చడం అనేది నాలుగు విధాలుగా ఉంది. భగం యొక్క ఉనికిని బట్టి ఇలా విభజించారు - సంబాధం, భగం, యంత్రం - అనే మూడు మాటలకూ అర్థం ఒక్కటే. స్త్రీ యోనిలో కొంత భాగం తామరపువ్వు దళంలాగానూ, మరి కొంత భాగం గుండ్రని గుండులాగాను, ఇంకా కొంత మెలితిరిగీ, వేరే కొంత భాగం ఆవునాలుక లాగా గరుకుగాను ఉంటుంది. ఈ నాలుగు భాగాల్లో మొదటి భాగాన్ని వదిలిపెట్టి, తక్కిన మూడు భాగాల్లో దురద తీర్చడానికి పురుషుడు తన చేత్తో భగాన్ని బాగా కలియ బెట్టాలి. అలా చేత్తో కలచినప్పుడు తరుణికి కొద్దిపాటి తృప్తి, భావప్రాప్తి కలుగుతాయి. అప్పుడు ఆమెతో రమిస్తే, తొందరగా భావప్రాప్తి పొందుతుంది.

ఇక భగాన్ని చేత్తో కదల్చడం ఎలాగంటే - పురుషుడు తన చేతి అనామిక వ్రేలును (నాలుగోవ్రేలు) తర్జనితో (చూపుడువ్రేలు) కలిపిపట్టి యోనిలోనికి చొప్పించాలి. అది ఏనుగు తొండంలా భగంలో ప్రవేశిస్తుంది. ఆ విధంగా చేత్తోకదల్చాలన్న మాట!

## తరుణికి తృప్తి, భావప్రాప్తి ఎప్పుడు?

*10. ఉపసృప్తకం, మంథనం, హులః అవమర్దనం, పీడితకం, నిర్ఘాతః,*

*వరాహఘాతః, వృషఘాతః చటకవిలసితం, సంపుట ఇతి పురుషోపసృప్తాని.*

ఉపసృప్తకం, మంథనం, హలం, అవమర్దనం ,పీడితకం, నిర్ఘాతకం, వరాహఘాతం, వృషఘాతం, చటకవిలసితం, సంపుటం, అని ఉపసృప్తాలు పది విధాలు. లింగంతో భగాన్ని సమకూర్చి చేసే ఉపసృప్తాలు ఇవి.

*11. న్యాయ్యమృజు సంమిశ్రణముపసృప్తకం.*

మదన దండాన్ని సాపుగా యోనిలోనికి ప్రవేశపెట్టడానికి ఉపసృప్తకం అంటారు. సాధారణంగా అందరూ అవలంబించే పద్ధతి ఇది. ఇదే న్యాయమైనదీ కూడా.

*12. హస్తేన లింగం స్వరతో భ్రమయేదితి మంథనమ్.*

చేతో లింగాన్ని పట్టుకుని, భగం లోపలి భాగాన్ని అంతటా త్రిప్పడాన్ని మంథనం అంటారు.

*13. నీచీకృత్య జఘనముపరిష్టాద్ఘట్టయేదితి హులః.*

పురుషుడు తన కటి ప్రదేశాన్ని క్రిందుగా ఉంచి, లింగాన్ని భగంలోకి చొప్పించి, వెనుకకు లాగుతూ, ముందుకు పొడుస్తూ ఉండడాన్ని 'హుళం' అంటారు.

*14. తదేవ విపరీతం సరభస మవ మర్దనమ్.*

పైన చెప్పినట్లుగా యోనిలో లింగాన్ని చొప్పించి పొడవడమే తొందర తొందరగా చేస్తే, దాన్ని 'అపమర్దనం' అంటారు.

*15. లింగేన సమాహత్య పీడయం శ్చిరమవతిష్ఠే తేతి పీడితకమ్.*

ఇక లింగాన్ని భగంలోకి ఎంతవరకు చొప్పించడానికి వీలుంటుందో అంతవరకు చొప్పించి, శక్తి ఉన్నంతవరకూ వెనుకకూ ముందుకూ పీడించడాన్ని 'పీడితకం' అంటారు.

*16. సుదూరమాకృష్య వేగేన స్వజఘన మవపాతయే దితి నిర్ఘాతః.*

బాగా భగం లోపలికి ప్రవేశపెట్టిన లింగాన్ని పూర్తిగా వెనుకకు లాగి, మళ్ళీ వేగంగా ఒక్కమాటుగా లోపలికి పొడవడాన్ని 'నిర్ఘాతం' అంటారు.

*17. ఏకతఏవ భూయిష్ఠమవలి ఖే దితి వరాహఘాతః.*

ఒక ప్రక్కగా మాత్రమే భగం లోపలికి లింగాన్ని బాగా చొప్పించడాన్ని 'వరాహఘాతం' అంటారు.

*18. స ఏవోభయతః పర్యాయేణ వృషాఘాతః.*

లింగాన్ని భగం లోపలికి ఒకసారి ఒక ప్రక్కకూ, మరోసారి మరోప్రక్కకూ చొప్పిస్తూ గుచ్చి గుచ్చి రతిచేస్తే దాన్ని 'వృషాఘాతం' అంటారు.

*19. సకృన్మిశ్రిత మనిష్క్రమయ్య. ద్విస్త్రిశ్చతురితిఘట్టయే.*

*దితి చటకవిలసితం, రాగావసానికమ్.*

ఒకమాటు భగంలో ప్రవేశ పెట్టిన లింగాన్ని బయటికి తీయకుండా రెండు,మూడు, నాలుగుసార్లు పొడిస్తే, దాన్ని'చటక విలసితం' అంటారు. స్త్రీ భావప్రాప్తి పొందే సమయంలో చేయవలసిన పద్ధతి ఇది.

*20. వ్యాఖ్యాతం కరణం, సంపుటమితి.*

స్త్రీ పురుషులు కాళ్ళు సాపుగా చాచుకుని, ఇద్దరి అంగాలూ బాగా కలిసేలా కౌగలించుకుని, రతి సాగిస్తే, దాన్ని 'సంపుటం' అంటారు. కరణం ఇంతకు పూర్వమే చెప్పబడింది.

*21. తేషాం స్త్రీ సామ్యాద్వీకల్పేన ప్రయోగః.*

ఇంతవరకూ రకరకాల ఉపసృప్తాలను గురించి చెప్పారు కదా! అయితే, ఏ స్త్రీకి ఎలాంటి ఉపసృప్తాలు సరిపడతాయో - (అంటే ఆమెకు ఇష్టంగా, సుఖంగా, తృప్తిగా ఉంటాయో) ఆ స్త్రీ యందు ఆ ఉపసృప్తాలు అవలంబించాలని శాస్త్రకారులు హెచ్చరిస్తున్నారు. వీటిని ప్రయోగించడంలో కూడా జాగ్రత్తగా ఉండాలి. తొందర పనికిరాదు. మొరటుగా ప్రవర్తించ కూడదు. సురతారంభ కాలంలో నెమ్మదిగా, మృదువుగా, సుతారంగా మొదలుపెట్టి, సగంవరకు వచ్చిన తరువాత కొంత వేగంగాను, చివరకు వచ్చేసరికి మరింత ఉధృతంగాను ప్రయోగించాలి.

పురుషుడు స్త్రీ చీరముడి విప్పి, బాహ్యోపసృప్తాలు ప్రయోగించినట్లే, స్త్రీ కూడా పురుషాయిత సమయంలో పురుషుడి వస్త్రాన్ని ఊడదీసి, బాహ్య పురుషాయితాలు సాగించాలి.

*22. పురుషాయితేతు సందంశో, భ్రమరకః ప్రేంఖోలిత మిత్యధికాని.*

ఇప్పుడు పురుషోపసృప్తాలను గురించి పూర్తిగా చెప్పడం జరిగింది. ఇక కొన్ని విశేషాలు చెపుతున్నారు.

భగలింగ సంయోగంతోకూడి ఉన్న అభ్యంతర పురుషాయితంలో సందంశం, భ్రమరకం, ప్రేంఖోలితం - అని ఇంకా మూడు విశేషాలు అధికంగా ఉన్నాయి.

23. *బాడబేన లింగ మవగృహ్య నిష్కర్షంత్యా,*
*పీడయంత్యా వాచిరాయస్థానం సందంశః.*

పురుషుడి లింగాన్ని స్త్రీ తన చేత్తో పట్టుకుని తన భగ ముఖద్వారం మీద గట్టిగా రుద్దుకుంటూ అలాగే చాలా సేపు వుండడాన్ని 'సందశం' అంటారు.

24. *యుక్తాయంత్రా చక్రవద్భ్రమయే దితి భ్రమరక ఆభ్యాసికః.*

స్త్రీ, పురుషుడి లింగాన్ని, తన భగంలో ప్రవేశ పెట్టుకుని, కాళ్ళు దగ్గరగా ముడుచుకుని, చేతులు పురుషుడి శరీరంపై ఆనించి కుమ్మరిసానలా తిరుగుతూ రతిచేస్తే దాన్ని'భ్రమరకం' అంటారు. అభ్యాసం వల్లనే ఇది చేతనవుతుంది సుమా !

25. *తత్రేతరస్స్వజఘన ముత్క్షిపేత్*

ఈ భ్రమరక బంధంలో పురుషుడు సౌకర్యం కోసం, సౌలభ్యం కోసం తన నడుమును పైకెత్తుతూ స్త్రీకి సహాయపడాలి.

26. *జఘేనమేవ డోలాయమానం సర్వతో*
*భ్రామయేత్ దితి ప్రేంఖోలితం.*

తరుణి తన నడుం వెనక్కూ ముందుకూ ఊగిస్తూ రతిచేసే దాన్ని ప్రేంఖోలితం అంటారు. నడుమును అన్ని వైపులకూ గుండ్రంగా త్రిప్పితే అది 'భ్రమితం' అనే బంధంలో చేరుతుంది. కాని ఇది అదికాదు.

27. *యుక్త యంత్రైవలలాటే లలాటం నిధాయ విశ్రామ్యేత్.*

ఆ తరువాత భగలింగ సంబంధానికి అంతరాయం కలుగకుండా పురుషుడి ముఖంమీద స్త్రీ తన ముఖంపెట్టి విశ్రమించాలి.

28. *విశ్రాంతాయాంచ పురుషస్య పునరావర్తన మితి పురుషాయితాని.*

ఆ విధంగా ప్రియురాలు రతి సలిపి, అలసి సొలసి ఉన్నప్పుడు, ప్రియుడు మునుపు తాను అలిసినప్పుడు ఆమె తనకు ఎలా సహాయపడిందో, అలాగే ఇప్పుడు తాను కూడా ఆమెకు తోడ్పడాలి, అంటే ఆమెను వెల్లకిల పరుండబెట్టి తాను ఆమెపైకి ఎక్కి రతి సాగించాలి.

పురుషాయితాల్లో ఈపద్ధతులు ఎంతో ఆనందాన్ని, సుఖాన్ని, తృప్తిని కలిగిస్తాయి.

29. *ప్రచ్ఛాదిత స్వభావాపి గూఢాకారాని కామినీ,*
*వివృణోత్యేవభావం స్వం రాగాదుపరివర్తనీ.*

రతి సమయంలో రమణి తన స్వభావాన్ని ఎంతగా కప్పిపుచ్చుకుని, బయటపడకుండా గంభీరంగా ఉండడానికి ప్రయత్నించినా, పురుషాయిత సమయంలో మాత్రం ఆమె తన మనోభావాలు స్పష్టంగా బట్టబయలు చేస్తుంది. ఆ తరుణంలో పొందిన నిరతిశయ సుఖానందాలవల్ల ఆమె మైమరచిపోతుంది. తన హృదయాన్ని ఇంచుకైనా దాచకుండా ప్రియుడి దగ్గర వెల్లడిచేస్తుంది!

*30. యథా శీలా భవేన్నారీ, యథా చ రతి లాలసా,*
*తస్యా ఏవ విచేష్టాభి స్త త్సర్వ ముపలక్షయేత్.*

(ఏ ఇద్దరు స్త్రీలూ ఒక్కలా ఉండరు. ఏ ఇద్దరి స్త్రీల స్వభావాలు ఒక్కలా ఉండవు. అసలు స్త్రీల స్వభావం తెలుసుకోడం ఆబ్రహ్మకైనా తరం కాదన్నారు పెద్దలు).

అంచేత ఏ స్త్రీ స్వభావం ఎలాంటిదో, ఏ స్త్రీ అభిలాష, ఇష్టం ఎలాంటివో గ్రహించి, ఆయా స్త్రీల ను ఆవిధమైన శృంగార చేష్టలతో, బంధాలతో, కామకళా నైపుణ్యంతో, రతిక్రీడలు సలిపి తనివితీర తృప్తి పరచడంలోనే ఉంది కామకళలో పురుషుడి ప్రజ్ఞ.

ఇక్కడ మరో అర్థంకూడా చెపుతారు వ్యాఖ్యాతలు. ఏ రకంగా రమిస్తే తన స్త్రీ శీలవతిగా ఉంటుందో, ఎలా రతిలో తృప్తిపరిస్తే ఆమె తన మీదే మక్కువ కలిగి మరో పురుషుణ్ణి కలలోనైనా తలచకుండా ఉంటుందో, ఆ మర్మం తెలుసుకుని పురుషుడు ఆమెను సుఖపెట్టాలి.

*31. నత్వేవర్తా, నప్రసూతాం, నమృగీం నచగర్భిణీం,*
*న చాతి వ్యాయతాం, నారీం యోజయే త్పురుషాయితే.*

బహిష్టు అయివున్న స్త్రీని, ప్రసవించిన స్త్రీని, మృగీజాతి వనితను, గర్భవతిగా వున్న కాంతను, మరీ లావుగా వున్న స్త్రీని పురుషాయిత క్రియకు ఉపయోగించకూడదు. స్త్రీ బయట ఉన్నప్పుడు పురుషాయితం చేస్తే, ఆ స్త్రీ గర్భం ధరించదు. మృగీనాయిక యోని చాలా చిన్నదిగా ఉంటుంది కాబట్టి పురుషాయితం చేస్తే ప్రమాదం సంభవిస్తుంది. గర్భిణీ స్త్రీ పురుషాయితం చేస్తే గర్భస్రావం అవుతుంది. ఇక లావుపాటి స్త్రీ అసలు పురుషాయితం చెయ్యనేలేదు.

*32. ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే, ద్వితీయాధికరణే, పురుషోపసృప్తాని, పురుషాయితం చేతి అష్టమోధ్యాయః*

**ఇది వాత్స్యాయన ముని విరచిత కామసూత్రాల్లో సాంప్రయోగికం అనే రెండో అధికరణంలో, పురుషోపసృప్తాలు, పురుషాయితం అనే ఎనిమిదో అధ్యాయం.**



# నవమాధ్యాయం
## ఔపరిష్టకం

*1. ద్వివిధా తృతీయా ప్రకృతిః స్త్రీ రూపిణీ పురుష రూపిణీచ.*

**ఆలింగనం** మొదలు పురుషాయితం వరకూ స్త్రీతో సంభోగించవలసిన విధానాలన్నీ ఇంతవరకూ చెప్పారు శాస్త్రకారులు. ఈ విధానాలన్నీ నాలుగు జాతుల స్త్రీలయందూ ప్రయోగించవచ్చు.

ఇక అటు స్త్రీ కాకుండా, ఇటు పురుషుడు కాకుండా ఉండే నపుంసక వ్యక్తులున్నారు. వీరిని అయిదోరకం నాయికగా పూర్వాచార్యులు కొందరు పేర్కొన్నారు. ఈ నపుంసక వ్యక్తితో జరిపే సంభోగాన్నే ఔపరిష్టకం అంటారు.

నపుంసకుల్నే మూడో ప్రకృతిగా లోకంలో పరిగణిస్తున్నారు. ఈ నపుంసకులు రెండు రకాలు. స్త్రీల మాదిరిగానే స్తనాలు మొదలైనవి ఉండేవారు ఒకరకం. పురుషుడి మాదిరిగా గడ్డాలు, మీసాలు మొదలునవి ఉండేవారు రెండోరకం. ఈ రెండు రకాలవారూ రతికోసం చేసేపనిని ఔపరిష్టికం అంటారు.

*తత్ర స్త్రీ రూపిణీ స్త్రియావేష మాలావం, లీలాంభావం, మృదుత్వం,*
*భీరుత్వం, ముగ్ధతా, మనహిష్ణుతాం, వ్రీడాం చాను కుర్వీత.*

స్త్రీలమాదిరిగానే స్తనాలు మొదలైనవి కలిగి ఉన్న నపుంసక వ్యక్తి వేష భాషలూ, విలాసాలు, భావాలూ, సౌకుమార్యమూ, భయస్వభావమూ, ముగ్ధత్వమూ, ప్రహణనాదులు సహించలేక పోవడమూ, సిగ్గూ - ఇలాంటి స్త్రీ లక్షణాలు కలిగి ఉంటుంది.

*3. తస్యావదనే జఘన కర్మత, దౌపరిష్టకమ్.*

పై రీతిగా స్త్రీ ధర్మాలు అనుసరిస్తున్న నపుంసక వ్యక్తి, స్త్రీలు తమ యోనితో చేసేపనిని నోటితో (ముఖంతో) చేస్తూ ఉంటుంది. దీనికే ఔపరిష్టికం అని పేరు.

*4. సాతతో రతిమాభిమానికీం, వృత్తిం చలిప్స్యేత్*
*వేశ్యా నచ్చరితం ప్రకాశ్యేదతి స్త్రీ రూపిణీ.*

అలా స్త్రీ వేషాన్ని ధరించిన నపుంసక వ్యక్తి పూర్వం రతావ స్థాపనాధ్యాయంలో చెప్పిన అభిమానిక రతినీ, దానికి సంబంధించిన జీవితాన్నీ గడపాలి. అంటే అన్ని విషయాల్లోనూ, స్త్రీలాగే సంచరిస్తూ ఉండాలి. వేశ్యలాగా సంచరిస్తూ, తాను పొంద దగిన వాళ్ళను ఆశ్రయించి పొందుతూ, భావప్రాప్తి పొంది తృప్తిపడుతూ ఉంటుంది.

*5. పురుష రూపిణీతు ప్రచ్ఛన్న, కామాపురుషం*
*లిప్సమానా సంవాహక భావ ముపజీవేత్.*

ఇక పురుష రూపంతో ఉన్న నపుంసక వ్యక్తి పురుషుడి మాదిరిగానే వస్త్రాలు ధరిస్తూ, స్త్రీ రూపంతో ఉండే నపుంసకవ్యక్తి వ్యవహరించినట్లుగానే నోటితో (ముఖంతో) రతిక్రీడలు సలుపుతూ ఉంటుంది. పైకి మాత్రం తెలియని అభిమానికి సుఖభావాన్ని మనస్సులో కలిగి వుంటుంది. పురుషుడితో సంభోగాన్ని కోరుతూ ఉంటుంది. ఇలాంటి వ్యక్తులు పురుషులకు కాళ్ళు పిసకడం, ఒళ్ళు పట్టడం మొదలైన పనులు చేస్తూ, ఆ విధంగా స్పర్శ సుఖాన్ని పొందుతూ ఉంటారు.

*6. సంవాహనే పరిష్వజ్యమానేవ గాత్రై రూ రూ నాయకస్య*
*మృద్నీయాత్ ప్రసృత పరిచయా చోరు మూలం సజఘనమితి సంస్పృశేత్.*

*ఈ నపుంసక వ్యక్తి పురుషులకు ఒళ్ళు పట్టుతూ, కాళ్ళు పిసుకుతూ ఉండే సమయాల్లో తాను అతన్ని కౌగలించుకుంటున్నట్లు తన అంగాలతో అతని తొడలను పిసకాలి. బాగా పరిచయం అయిన తరువాత గజ్జలు, కటి ప్రదేశం కూడా స్పృశించాలి.*

*7. తత్రస్థిర లింగతా ముపలభ్య చాస్య పాణి మంథేన పరిఘట్టయేత్,*
*చాపలం మస్యకుత్స్య యంతీవ హసేత్.*

ఆ విధంగా గజ్జలూ మున్నగుచోట్ల తాకుతూ ఉంటే పురుషుడి లింగం విజృంభించడం మొదలుపెడుతుంది. అలా ధ్వజ స్తంభంలా మదన ధ్వజం బిర్ర బిగిసి నిటారుగా నిలబడినప్పుడు ఈ నపుంసక వ్యక్తి, అది తన చేతికి తాకేలా ప్రవర్తించాలి. అలా చేత్తో తాకి పిసకడం ప్రారంభిస్తే పురుషుడి మదన దండం మరికొంత విజృంభించి దృఢమవుతుంది. అప్పుడు పురుషుడు ఆ నపుంసక వ్యక్తి చపలత్వాన్ని చూచి నిందిస్తున్నట్లు నవ్వాలి.

*8. కృతే లక్షణేనా ప్యుపలబ్ధ వైకృతేనాపి న చేద్యత ఇతి చేత్ ?*
*స్వయముపక్రమేత, పురుషేణచ చోద్యమానా*
*వివదేత, కృచ్ఛ్రేణ బాభ్యుపగచ్ఛేత.*

పురుషాంగం దారుఢ్యం చెందడం అనేది కామోద్రేకానికి సూచన. అప్పుడలా స్తంభం వలె ఉన్న లింగాన్ని పురుషుడి అనుమతి ఉన్నా సరే, లేకపోయినా సరే నపుంసక వ్యక్తి, ఔపరిష్ట క్రియకు ఉపక్రమించాలి. ఒకవేళ పురుషుడు 'నీ ముఖ చాపలం తీర్చుకో' అని స్వయంగా ప్రేరేపిస్తే, మొదట 'నేను అలాంటిదాన్ని కాను' అని కొంతసేపు వాదించి తరువాత ఆ పనికి అంగీకరించాలి. ఇదే స్త్రీ రూపంలో ఉన్న నపుంసక వ్యక్తి అయితే, తన కామాభిలాష బాహాటంగా ప్రకటిస్తూనే ఉంటుంది గాబట్టి, మొదటినుంచీ ఈ ఔపరిష్టక క్రియకు పూనుకోవచ్చు.

## ఆడా, మగా కాకుంటే ఏం చెయ్యాలి ?

*9. తత్ర కర్మాష్టవిధం, సముచ్చయ ప్రయోజ్యం, నిమితం,*
*పార్శ్వతోదష్టం, బహిః సందంశోZతః*
*సందంశ, శ్చుంబితకం, పరిమృష్టక మామ్రచూషితకం, సంగర ఇతి.*



ఈ ఔపరిష్టక రతిలో వరసగా ఎనిమిది రకాల పనులు చేయదగినవిగా ఉన్నాయి. అవి నిమితకం, పార్శ్వతోదష్టం, బహిఃసందంశనం, అంతః సందంశనం, చుంబితకం, పరిమృష్టకం, ఆమ్రచూషితకం, సంగరం.

*10. తేష్వేకైక మభ్యుపగమ్య విరామాభీప్సాం దర్శయేత్.*

ఈ నిమితకం మొదలైన ఎనిమిది రకాల పనులూ ఒక్కొక్క దాన్నే నపుంసకవ్యక్తి ఆచరించి, చివరకు విరమించే అభిలాషను చూచిస్తే, అప్పుడు పురుషుడికి అభిలాష ఎక్కువవుతుంది. అలా అతనికి అభిలాష అధికం చేసి, అతని అభ్యర్ధనపై మళ్ళీ ఆ పనులు చేస్తున్నట్లు నటించాలి నపుంసకవ్యక్తి.

*11. ఇతరశ్చ పూర్వస్మిన్ ఆభ్యుపగతే తదుత్తర మేవా*
*పరం నిర్దిశేత్త స్మిన్నపి సిద్ధే తదుత్తర మితి.*

నపుంసక నాయిక నిమితం మొదలైన పనులు పూర్తి చేసిన పిదప, మళ్ళీ ఆ పనులు చెయ్యమని ఆదేశించాలి. తరువాత ఆ పనులన్నీ ఒకదాని తరువాత ఒకటి చెయ్యమని గట్టిగా అడగాలి.

*12. కరావలంబిత మోష్ఠయో దుపరి విన్యస్త*
*మువవిధ్య ముఖం విధునుయాత్తన్నిమితకమ్.*

ఇక ఆ పనులు ఎలా ఉంటాయో చెపుతున్నారిక్కడ. ఈ ఔపరిష్టక రతి కూడా బాహ్యం, అభ్యంతరం - అని రెండు విధాలుగా ఉంది. మొదట బాహ్యక్రియ చెపుతున్నారు. పురుషుడి లింగాన్ని నపుంసక నాయిక తన చేత్తో పట్టుకొని, దాని అగ్రాన్ని తన పెదవుల మీద చేర్చి, పెదవులతో ఆ మొనను

నోటితో పట్టుకుని గుండ్రంగా తన ముఖాన్ని త్రిప్పాలి. ఇలా చేయడాన్నే నిమితకం అంటారు.

*13. హస్తేనాగ్ర మవహ్నాద్య పార్శ్వతో నిర్దశవ మోష్ఠాభ్యా మవపీడ్య*
*భవత్యేతా వదితి సాంత్వయేత్, తత్పార్శ్వతోదష్టం.*

పురుషుడి లింగాన్ని నపుంసక నాయిక తన గుప్పిటితో పట్టుకుని దంతాలు తగులకుండా పెదవులతో మాత్రమే పీడించి, ఇక చాలు లెమ్మని అంతటితో ఆపితే దాన్ని పార్శ్వతోదష్టం అంటారు. ఇక్కడ లింగం దంతాలకు తాకకుండా ఒక ప్రక్కగా పెదవుల మధ్య ఉంచుకోవాలి.

*14. భూయశ్చోదితా నంమీలితౌష్ఠీ తస్యాగ్రం నిష్పీడ్య*
*కర్షయంతీవ ముంచే దితి బహిస్సందంశః*

నపుంసక వ్యక్తి తన పెదవులతో పురుషుడి లింగం కొసను నోటితో గట్టిగా నొక్కి వదిలేస్తే దాన్ని బహిస్సందంశం అంటారు.

*15. తస్మిన్నే వాభ్యర్థతయా కించి దధికం ప్రవిశేత్, సాపిచాగ్ర*
*మోష్ఠాభ్యాం నిష్పీడ్య నిష్టి వేదిత్యం తస్సందంశః*

పురుషుడి కోరికపై లింగాన్ని మరికొంత తన నోటి లోపలికి పోనిచ్చి పై విధంగా పెదవులతో నొక్కి వదిలేస్తే దాన్ని అంతస్సందంశ అంటారు.

*16. కరావలంబిత స్యౌష్ఠ వద్గ్రహణం చుంబితకం.*

పురుషుడి అంగాన్ని గుప్పిటతో పట్టుకుని, దాని కొసను పెదవులతో ముద్దాడితే దాన్ని చుంబితకం అంటారు.

*17. తత్కృతా జిహ్వాగ్రేణ నర్వతో ఘట్టన మగ్రేచ వ్యధ నమితి పరిమృష్టకమ్.*

పై రీతిగానే లింగం కొసను ముద్దాడి, ఆ కొసను నాలుకతో రాపిడి చేస్తూ గట్టిగా నొక్కడాన్ని పరిమృష్టకం అంటారు.

*18. తధా భూతమేవ రాగవశాత్ అర్ధప్రమృష్టం నిర్దయ*
*మవపీడ్యా వసీద్య ముంచే దిత్యామ్రచూషితకమ్.*

పురుషుడి అభిలాషను అనుసరించి, పైన చెప్పినట్లు లింగాన్ని బాగా నోటి లోపలికి పోనిచ్చి నాలుకతోను, పెదవులతోనూ కసిగా నొక్కి నొక్కి వదిలితే దాన్ని ఆమ్రచూషితకం అంటారు.

*19. పురుషాభిప్రాయా దేవగిరేత్పీడ యేచ్చా. పరిమాప్తే రితి నంగరః*

పురుషుడి కోరికను బట్టి ఈ ముఖరతిలో లింగాన్ని నాలుకతో ఆడిస్తూ, పెదవులను, తలను అటు - ఇటు కదిలిస్తూ, నొక్కిపట్టి ఉంచితే, దాన్ని సంగరం అంటారు.

*20. యథార్థం చాత్రస్తన ప్రహణన యోః ప్రయోగ ఇత్యౌపరిష్టకమ్.*

కామోద్రేకం ఎలాగైతే మృదు, మధ్య, వేగ భేదాలతో ఈ నిమితాది ఔపరిష్టక క్రియల్లో వృద్ధి పొందుతో ఉన్నదో, అదే విధంగా స్తన, ప్రహణనాది ప్రయోగ

విషయాల్లో కూడా అభివృద్ధి క్రమం ఉంటుందని గ్రహించాలి. ఇలా ఔపరిష్టక విషయాన్ని గురించి సంపూర్ణంగా చెప్పారు శాస్త్రకారులు.

నపుంసకులే కాక కొందరు స్త్రీలు సయితం ఔపరిష్టక రతిని అభిలషిస్తారు.

21. *కులటాః స్వైరిణ్యః పరిచారికాః*
*సంవాహికాశ్చా ప్యేత(త్ప్ర) యో జయంతి.*

కులం నుంచి వెలివేయబడిన స్త్రీలు, యథేచ్ఛగా పురుషులతో తిరిగే స్త్రీలు, పరిచారికలు, ఒళ్ళు పట్టే మగువలు - మొదలయినవారు ఈ ఔపరిష్టక రతిని అనుసరిస్తూ ఉంటారు.

22. *తదేతత్తు నకార్యం సమయ విరోధా, దసభ్యత్వాచ్చ,*
*పునరపిహ్యాసాం వదన సంసర్గే స్వయమేవార్తిం, ప్రతిపద్యే తేత్యాచార్యాః*

అయితే, ఈ ఔపరిష్టిక రతిని ధర్మశాస్త్రం తీవ్రంగా వ్యతిరేకించి, నిషేధం విధించింది. పెద్దలు అనేకులు దీన్ని నిందించారు. అంతే కాకుండా ఔపరిష్టక క్రియను అనుసరిస్తున్న స్త్రీ ముఖాన్ని ముద్దాడాలంటే అసహ్యం పుదుతుంది. ఈ కారణాల వల్ల ఈ పని ఎంత మాత్రం కూడదని ప్రాచీనాచార్యులు స్పష్టం చేశారు.

23. *వేశ్యా కామినః అయమదోషో Zన్యతోపి, పరిహార్యస్స్యాదితి వాత్స్యాయనః*

కులం నుండి వెలివేయబడిన స్త్రీల మొదలు, వేశ్యల వరకు స్త్రీలతో సంభోగించే పురుషులకు ఈ ఔపరిష్టిక కార్యం చేయడంలో దోషం లేదని, కులకాంతల విషయంలో మాత్రం ప్రయోగించడం కూడదని వాత్స్యాయనులు అంటున్నారు.

24. *తస్మాద్యాస్త్వౌపరిష్టిక మాచరంతి, నతాభి స్సహసం సృజ్యంతే ప్రాచ్యాః*

అంచేత ఈ ఔపరిష్టిక కార్యం జరిపే స్త్రీలతో ప్రాచ్య దేశీయులు రతి చెయ్యడానికి ఇష్టపడరు.

25. *వేశ్యాభిరేవ ససంసృజ్యత అహిచ్ఛత్రికాః*
*సంసృష్టా అపి ముఖకర్మతా సాం పరిహరంతి.*

అహిచ్ఛత్ర దేశంలో (ఏదేశమో ఇది ?) పుట్టిన పురుషులు, అసలు వేశ్యలతో సంభోగించరు. ఒకవేళ సంభోగించినా ఈ ముఖరతిని వారిస్తారు.

26. *నిరపేక్షా స్సాకేతా స్సంసృజ్యంతే.*

అయోధ్యలో జన్మించిన పురుషులు మంచి, చెడ్డలు లేకుండా వేశ్యాంగనలలో రతి క్రీడలు సాగిస్తారు. సంప్రయోగాది క్రియలతోపాటు ఔపరిష్టిక క్రియలు కూడా ఆచరిస్తారు.

27. *నతుస్వయ మౌ పరిష్టిక మాచరంతి నాగరకాః*

పాటలీపుత్రంలో ఉండే నాగరకులు తమకై తాము ఔపరిష్టిక క్రియను ప్రోత్సహించరు. కాని వేశ్యలు ప్రార్థిస్తే అందుకు అంగీకరిస్తారు.

28. *సర్వ మవిశంకయా ప్రయోజయంతి శౌరసేనాః*

శూరసేన దేశస్థులు ఏమాత్రం సందేహించకుండా ఔపరిష్టిక క్రియలు నలుపుతూ ఉంటారు.

29. *ఏవం హ్యాహుః కోహి యోషితాం, శీలం, శౌచం,*
*ఆచారం, చరితం, ప్రత్యయం, వచనం, వా శ్రద్ధ థాతుమర్హతి?*
*నిసర్గా దేవహి మలిన దృష్టయో భవంత్యేతా నపరిత్యాజ్యాః*
*తస్మాదాసాం స్మృతిత ఏవశౌచ మన్వేష్టవ్యమ్.*

స్త్రీల స్వభావం, వారి శుచిత్వం, ఆచార, చరిత్ర, విశ్వాసం మాటలు - ఇవన్నీ ఎవడు నమ్ముతాడు? (అంటే నమ్మదగినవి కావు. స్త్రీల స్వభావం సహజంగా మలిన పూరితమైనది. అంచేత వారిని ఎప్పుడూ పూర్తిగా నమ్మరాదు. అలాగని పూర్తిగా నమ్మకుండా ఉండనూ రాదు. నమ్ముతున్నట్లు నటిస్తూ ఉండాలి. అంతే! స్మృతిని బట్టి, అంటే ధర్మాన్ని బట్టి వారి శుచిగుణాన్ని నిర్ణయించాలి. ఇది పెద్దలు చెప్పిన మాట.

30. *శిష్ట విప్రతిపత్తేః స్మృతి వాక్యస్య చ సావకాశత్వాద్దేశస్థితే*
*రాత్మ నశ్చ వృత్తి ప్రత్యయాను రూపం ప్రవర్తేతేతి వాత్స్యాయనః*

శిష్యులైన వారిలోకూడా దేశాచారాలను బట్టి ఎంతో భేదం కనిపిస్తున్నది. సంభోగ సమయంలో స్త్రీ ముఖం శుద్ధమైనదేనని ధర్మశాస్త్రం చెపుతున్నది. అందాత స్త్రీ పురుషలు దేశాచారాలను బట్టీ, తమ అభాలాషను బట్టీ తగు విధంగా ప్రవర్తించాలని వాత్స్యాయనుల అభిప్రాయం.

31. *భవంతి చాత్రశ్లోకాః ప్రమృష్ట మేండలాశ్చాపి యువానః పరిచారకాః*
*కేషాంచి దేవకుర్వంతి, నరాణా మౌపరిష్టకమ్.*

రతి క్రీడల్లో ఎంతో అనుభవం గడించిన పురుషులు, పరిచారికలు, కామోద్రేకం సన్నగిలిపోయినవారు, ముసలితనంలో ఉన్నవారు ఈ ఔపరిష్టిక కర్మకు ఒడిగట్టరాదు. మొత్తం మీద ఇది అనుసరణీయం కాదని, విశేషంగా ప్రచారంలో లేనిదని గ్రహించాలి.

32. *తథానాగరకాః కేచిత్, అన్యోన్యస్యహితైషిణః,*
*కుర్వంతి రూఢవిశ్వాసాః పరస్పర పరిగ్రహం.*

అలాగే కొందరు నాగరకులు సౌఖ్యం అపేక్షించి, తమలో తమకు హితాన్ని చేకూర్చుకోవాలనుకుని, ఆంతరంగికులైన వారితో ఈ ఔపరిష్టికాన్ని ఆచరిస్తారు.

33. *పురుషాశ్చ తథా స్త్రీషు కర్మతత్కిల కుర్వతే,*
*వ్యాసస్తస్య చ విజ్ఞేయో ముఖచుంబన ద్విధిః.*

స్త్రీలు, పురుషులతో ఔపరిష్టిక కార్యాన్ని జరిపినట్లుగానే, పురుషులు కూడా స్త్రీలతో ఔపరిష్టికాన్ని జరుపుతున్నారు కొందరు. ముఖ చుంబనం చేసినట్లుకానే భగచుంబన విధానం ఉంది.

34. *పరివర్తిత దేహేతు స్త్రీ పుంసే యత్పరస్పరం,*
*యుగపత్సం ప్రయుజ్యేతే, నకామః కాకిలః స్మృతః*

స్త్రీలు పురుషులు ఒకరి కాళ్ళవైపున ఒకరు పడుకుని, ఒకరి మర్మాంగాలను ఒకరు చేతితో తడుముతూ ఒకేమాటుగా ఆస్వాదిస్తూ ఉంటే - అలాంటి కామాన్ని 'కాకిలం' అంటారు. ఇందులో స్త్రీ పురుషులు ఒకరి మర్మాంగాన్ని ఒకరు నాలుకతో నాకుతూ ఉంటారు. కాకి తన ముక్కుతో అమేధ్యాన్ని గ్రహించినట్లుగా స్త్రీ పురుషులు అసహ్యంగా చేసే వ్యవహారం కాబట్టి దీనికి 'కాకిలం' అనే పేరు వచ్చింది.

35. *తస్మాద్గుణ వతస్త్యక్త్వా చతురాం స్త్యాగినోవరాన్*
*వేశ్యాః ఖలేషు రజ్యంతే దాస, హస్తిపకాదిషు.*

అంచేత ఎంతో నేర్పు గలవారు, త్యాగశీలురు, ఉత్తములైన బుద్ధిమంతులు - వీరిని మాత్రం విడిచిపెట్టి వేశ్యలూ, కులంతప్పిన భ్రష్టులు, బుద్ధిహీనులూ, చాకలి, మంగళ్ళతోనూ, దాసులతోనూ, మావటి వాళ్ళతోనూ, గుర్రబ్బండ్ల వాళ్ళతోనూ సంపర్కం పెట్టుకుని, తుచ్ఛంగా, నీచంగా రమిస్తూ ఉంటారు.

## ఔపరిష్టికం అసహ్యకరం, నిషిద్ధం

36. *నత్వేతద్బ్రాహ్మణో విద్వాన్ మంత్రీవా రాజ ధూర్వహః*
*గృహీత ప్రత్యయోవాపి కారయే దౌపరిష్టకమ్.*

విద్వాంసుడైన బ్రాహ్మణుడు కానీ, రాజోద్యోగులు, రాచకార్యాలు నడిపే మంత్రులుకానీ, లోకంలో గౌరవమర్యాదలు కావాలనుకునే పెద్ద మనుషులు కానీ, తుచ్ఛమైన ఈ ఔపరిష్టిక కార్యానికి పూనుకోకూడదని - శాస్త్రకారులు హెచ్చరిస్తున్నారు.

37. *న శాస్త్ర మస్తీత్యేతా వత్ప్ర యోగే కారణం భవే,*
*శాస్త్రార్థాన్ వ్యాపినోవిద్యాత్, ప్రయోగాం స్త్వేక దేశికాన్.*

శాస్త్రంలో చెప్పారు కదా అని ప్రతిపనీ చేయడానికి ప్రయత్నించడం తగనిపని. శాస్త్రంలో విషయాలు అన్ని దేశాలకూ సంబంధించి ఉంటాయి. మరి వాటిని అనుసరించేవారు ఏ ఒక్క దేశానికో చెంది ఉంటారు. కాబట్టి ముఖ్యంగా దేశాచారాన్ని స్త్రీ స్వభావాన్నీ బాగా పరిశీలించి ప్రవర్తించాలి.

38. *రసవీర్యవిపాకాహి శ్వ మాంస స్యాపివైద్యకే,*
*కీర్తితా ఇతి తత్కింస్యా ద్భక్షణీయం విచక్షణైః.*

చూడండి - తీపి మున్నగు రుచులూ పౌరుషం మొదలైన గుణాలూ, వృద్ధిక్షయాలు మున్నగు పరిమాణాదులూ, - వీటి మొదలు కుక్క మాంసం వరకూ పదార్థ గుణాలన్నీ వైద్యశాస్త్రంలో చెప్పబడినాయి. కాని అలా శాస్త్రం చెప్పింది కదా అని విద్వాంసుడైనవాడు విచక్షణ లేకుండా దాన్ని భక్షించవచ్చునా?

39. *సంత్యేవ పురుషాః, కేచి త్సంతి దేశాస్తథా విధాః*
*సంతి కాలాశ్చ తేష్వేతే యోగానన్యుః నిరర్థకాః*

ఇలా చేసే పురుషులు కొందరు ఉన్నారు. వీటిని అవలంబించే దేశాలు కొన్ని ఉన్నాయి. కులాలూ కొన్ని ఉన్నాయి, అంచేత ఆయాకాలాల్లో, ఆయా దేశాల్లో, ఆయా మనుష్యుల్లో, ఈ ప్రయోగాలు వృథా కాకుండా ఉపయోగపడతాయి.అంతేకాని, సర్వత్రా కాదు.

*40. తస్మాద్దేశంచ కాలంచ ప్రయోగం శాస్త్రమేవ చ,*
*ఆత్మానం చాపి సంప్రేక్ష్య యోగాయుంజీత వానవా.*

కాబట్టి బుద్ధిమంతులు దేశ, కాల, పరిస్థితులనూ, శాస్త్రాలనూ, తన స్వభావాదులనూ పరీక్షించుకుని ఈ ప్రయోగం తగునా, తగదా? - అని వితర్కించుకుని ప్రయోగించాలి.

*41. అర్థ స్యాన్య రహస్యత్వాత్, చలత్వాన్మనసస్తథా,*
*కః కదా కింకుతః కుర్యాత్ ఇతి కోజ్ఞాతు మర్హతి.*

ఈ ఔపరిష్టిక క్రియ పరమ రహస్యమైనది. ఎంతటివారికైనా మనస్సు చలింపజేసే స్వభావం కలది. కాబట్టి ఎవడు, ఎప్పుడు, ఏ రీతిగా దీన్ని ప్రయోగిస్తాడో ఎవరు చెప్పగలరు ?

*ఇతి వాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే*
*ద్వితీయేఽధికరణే ఔపరిష్టికం నామ నవమో అధ్యాయః.*

**ఇది వాత్స్యాయనముని విరచితమైన కామసూత్రాల్లో సాంప్రయోగాధికరణంలో ఔపరిష్టికం అనే తొమ్మిదో అధ్యాయం.**



# దశమాధ్యాయం
# రతారంభావసానికం

ఇంతవరకూ రతి విశేషాలను గురించి చెప్పారు వాత్స్యాయనులు. అయితే, రతి ఆరంభంలో అనుసరించవలసిన విధానాలూ, అలాగే రతి అనంతరం అనుసరించవలసిన పద్ధతులూ ఉన్నాయి. ఈ అధ్యాయంలో వాటిని చెపుతున్నారు శాస్త్రకారులు. అంచేతనే దీనికి రతారంభావసానికం అని పేరు పెట్టారు.

1. *నాగరకస్సహ మిత్ర జనేన పరిచార కైశ్చకృత పుష్పోపహారః సంచారిత సురభి ధూపే రత్యావాసే ప్రసాధితే వానగృహే, కృతస్నాన ప్రసాధనాం యుక్త్యా పీతాంస్త్రీయం సాంత్వనైః పునః పానేన చోపవేశనం.*

మొదట రతిని ప్రారంభించే ముందు అనుసరించవలసిన విధానాన్ని గురించి చెపుతున్నారు. నాగరకుడు, పీఠమర్దుడు మొదలైన మిత్రులతో కూడి, తాంబూలాదులు అందించే సేవకులను వెంట పెట్టుకుని, పువ్వులు, పూలమాలలు ధరించి, పరిమళ ధూపాలతో, సువాసనలు గుబాళించే అలంకారాలు చేసిన శయన మందిరంలో ప్రవేశించాలి. శుభ్రంగా స్నానం చేసి, చక్కగా అలంకరించుకుని ఉన్న స్త్రీ చేత కొంచెం మద్యం త్రాగించి ఆమెనుముద్దుగా పలకరించి, క్షేమసమాచారం అడిగి, పిదప తను కూడా కొంచెంమద్యం సేవించాలి. ఆమెచేత కూడా మరికొంచెం మద్యం త్రాగిస్తూ ఆమెతోపాటు శయ్యపై ఉపవేశించాలి.

2 - 12. *దక్షిణ తశ్చాస్యా ఉపవేశనం, కేశహస్తే వస్త్రాంతే నీవ్యామిత్యవ లంబనం, రత్యర్థం సవ్యేన బాహు నారనుమర్దితః పరిష్వంగః, పూర్వ ప్రకరణ సంబద్ధైః పరిహాసు రాగైం వహోభిరను వృత్తిః, గూఢాశ్లీలానాం చ వస్తూనాం, సమస్యయా పరిభాషణం సవృత్త మనృత్తం వాగీతం, వాదిత్రం, కళాసునం కథాః పునః పానేనోప చ్ఛదనం, జాతానురాగాయాం కుసు మాను లేపన తాంబూల దానేన చ శేషజన విసృష్టి విజనే చయథోక్తై రాలింగనాదిభి రేనా ముద్ధర్షయేత్, తతోనీవీ విశ్లేషణాది యథోక్త మువక్రమే తేతి అయం రతారంభః.*

ఆ శయ్యమీద స్త్రీకి కుడిభాగంలో పురుషుడు, అతని ఎడమవైపు స్త్రీ ఉపవేసించాలి.పిమ్మట పురుషుడు తన ఎడమ బాహువుతో ఆమెను కౌగలించుకోవాలి. ఇద్దరికీ మధ్యగా పానపాత్ర పట్టుకుని ఇద్దరూ సేవించాలి. అటుపైన కాంత కేశభరాన్ని నిమిరి, ఆమె చేతిని తడిమి, పమిట సవరించి, నెమ్మదిగా కోకముడి. దగ్గరకి చెయ్యి పోనివ్వాలి. ఆ తరువాత రతి నిమిత్తం మెల్లమెల్లగా కుడి బాహువుతో ఆమెను కౌగలించాలి. ఇంతకుముందు ప్రకరణాలలో చెప్పినట్లుగా, పరిహాస వాక్యాలతోనూ, ప్రణయ సంభాషణలతోనూ ముచ్చటించాలి. నృత్తం ఉన్నా,

లేకపోయినా వీణ పట్టించి సంగీతం పాడించాలి. వివిధ రకాల కళలను గురించి కథలు చెప్పాలి. మళ్ళీ మద్యం సేవించమని ప్రోత్సహించాలి.



ఇక్కడ మద్యపానమని సామాన్యంగా చెప్పారు. మద్యం బదులు పాలు, మధురమైన పానకాలు మున్నగునవి సేవించవచ్చు. ఇవి సేవించడం వల్ల ఎలాంటి వాడికైనా మదనోద్రేకం పుట్టుకొస్తుంది. ఈ విధంగా తరుణికి కొంచెం కొంచెం ప్రేమానురాగాలు వృద్ధి పొందించి, తరువాత అక్కడున్న మిత్రులనూ, పరిజనులనూ గంధ, పుష్ప, తాంబూలాదులతో సత్కరించి పంపివెయ్యాలి. అటు తరువాత పూర్వ ప్రకరణాలలో చెప్పినట్లుగా ఆలింగన, చుంబనాదులచేత స్త్రీని ప్రోత్సహించి, కోకముడి ఊడదీయ్యాలి. రతి ఆరంభంలో అనుసరించవలసిన క్రమం ఇది.

*13-22 రతావసానికం రాగమతివాహ్య నంస్తుతయోరివ నవ్రీడయోః*
*పరస్పర మపశ్యతోః, పృథక్ పృథక్ ఆచార భూమి గమనం,*
*ప్రతినివృత్త్య చ వ్రీడాయమానయో రుచిర దేశోపవిష్టయోస్తాంబూల*
*గ్రహణ మచ్ఛీకృతం చందనమన్యద్వా అనులేపనం, తస్యాగాత్రే న్వయమేవ*
*నివేశయేత్, నవ్యేన బాహునాచైనాం పరిరభ్య చషకహస్త*
*స్సాంత్వయన్ పాయయేత్, జలానుపానం వా ఖండఖాద్యక మన్యద్వా*
*ప్రకృతి సాత్మ్యయుక్తం ఉభావప్యాప యుంజీయాతాం, అచ్ఛరసకయూష*
*మమ్లయవాగూం భృష్టమాంసోపదంశాని, పానకాని, చూతఫలాని,*
*శుష్క మాంసం, మాతులుంగ చక్రకాణి నశర్కరాణిచ యథా దేశసాత్మ్యంచ.*
*తత్ర మధురమిదం మృదువిశద మితిచ విదిశ్య విదిశ్య తత్తదుపా హరషత్*
*హర్మ్య తలస్థితి యోర్వా, చంద్రికా సేవనార్థ మానవం, తంత్రానుకూలాభిః*

*కథాభిరనువర్తేత, తదంక నంలీనా యాశ్చంద్ర మనంపశ్యంత్యా నక్షత్ర పంక్తి వ్యక్తీకరణం, అరుంధతీ ధ్రువ నప్తర్షి మాలా దర్శనం చేతి రతావ సానికం.*

## రతి అనంతరం ఏం చేయాలి ?

ఇక రతి అనంతరం చేయవలసిన దాన్ని గురించి చెపుతున్నారు. రతి సుఖం అనుభవించిన తరువాత స్త్రీ పురుషులు, ఏ మాత్రం పరిచయం లేని వాళ్ళలాగా, సిగ్గుపడుతున్నట్లుగా, ఒకరి వంక ఒకరు చూచుకోకుండా వేర్వేరు మరుగు ప్రదేశాలకు వెళ్ళిపోయి, కొంచెం వేడిగా ఉండే నీటితో పరిశుభ్రంగా స్నానం చేయాలి. మర్మావయవాలను గోరువెచ్చని నీళ్ళతో కడుక్కోవాలి. తిరిగివచ్చి ఉచితమైన స్థలంలో కూచుని తాంబూలం సేవించాలి. స్వచ్ఛమైన మంచి గంధాన్ని, తదితర అనులేపనాలను పురుషుడు కాంతకు స్వయంగా అలది, అలంకరించాలి. మళ్ళీ పురుషుడు తన ఎడమ బాహువుతో ప్రియురాలిని ఆలింగనం చేసుకుని, ఆమెచేత మద్యం త్రాగించాలి. అటు పిమ్మట నీటిని కూడా అనుపానంగా త్రాగించి, ధాతువృద్ధికి వాడే వంటకాలతో,పానకాలతో, తమకు ఇష్టమైన వాటిని ఇద్దరూ కలిసి భుజించాలి.

ఆ తరువాత మాంసంతో, లేదా పిండితో తయారైన భక్ష్యాలను భుజించాలి.ఇంకా ధాతుపుష్టిని కలిగించే రకరకాల మాంసపు పదార్థాలు, పిండిపదార్థాలు, పానకాలు, మామిడిపండ్లు, ఎండు మాంసం, చక్కెర కలిపిన మాదీఫలం ముక్కలు, దేశాచారాన్ని బట్టి సేవించాలి. అలా వాటిని సేవించే సమయంలో 'ఈ వస్తువు తియ్యగా ఉంటుంది. ఇది రుచిగా ఉంటుంది, తినడానికి ఇది చాలా శ్రేష్ఠమైనది'- అని మాటలు చెప్పుకుంటూ ఇద్దరూ ఆనందంగా భోజనం చేయాలి. అంతట ఇద్దరూ మేడ పై భాగాన ఆరుబయట వెన్నెట్లో ఒక ఆసనంపై కలిసి కూచోవాలి. అక్కడ ఆనందంగా ఇష్టగోష్ఠి జరపాలి. అప్పుడు తరుణి, ప్రియుడు ఒడిలో పడుకుని, అతనిలో లీనమైపోయినట్లుగా భావించుకుంటూ, చంద్రుడివంక చూస్తూ నక్షత్రాలను గుర్తించి వాటిని గురించి చెప్పుకోవాలి. అరుంధతి, ధ్రువుడు, సప్తర్షులు మున్నగు ఉత్తమ నక్షత్రాలను ఇద్దరూ దర్శించాలి. ఇదంతా రతి అనంతరం సాగవలసిన కార్యక్రమం.

*23-27. అవసానేఽపి ప్రీతిరూప చారైరుప న్యృతా, నవిస్రంభకథా యోగైరతిం జనయతే పరాం, పరస్పర ప్రీతికరై రాత్మ భావానువర్తనైః, క్షణా త్క్రోధపరావృత్తైః క్షణాత్ప్రీతి విలోకితైః, హల్లీసక క్రీడనకైః, గాయనైర్నాట్యరాసకైః, రాగ లోలార్ద్ర నయనైః చంద్రమండల వీక్షణైః, ఆద్యే సందర్శనే జాతే పూర్వం యే న్యుర్మనోరథాః, పునర్వియోగే దుఃఖం చ తస్య సర్వస్య కీర్తనైః, కీర్తనాంతే చ రాగేణ పరిష్వంగైన్సచుంబనైః, తై సైశ్చ భావై స్సంయుక్తో యూనో రాగో వివర్ధతే.*

రతి ఆరంభంలోనూ, రతి అవసానదశలోనూ కూడా స్త్రీ పురుషులు పుష్ప మాలలు, సుగంధాలు ధరించి మధురమైన పానీయాలు సేవిస్తూ, వాటిని ఒకరి కొకరు అందించి పుచ్చుకుంటూ, సరససల్లాపాలతో గోష్ఠులు జరుపుతూ ఉంటే, వాటివల్ల ప్రేమానురాగాలు చెప్పలేనంతగా వృద్ధి పొంది, అపరిమితమైన స్ఖలన సుఖాన్ని కలిగిస్తాయి. తమ ప్రేమభావాలకు తగిన ప్రణయ కోపాలతోనూ, క్రీగంటి చూపులతోనూ ఒకరి నొకరు తృప్తి పరచుకుంటూ, ప్రేమానురాగాలను వృద్ధి చేసుకోవాలి. హల్లీసకం (మండలా కారంతో చేసే నృత్యం ఇది. కోలాటం మున్నగున్నవి ఈ నృత్యం కోవలో చేరుతాయి) మున్నగు నృత్యక్రీడలతోనూ, సంగీతాలతోనూ, రాసక్రీడలతోనూ వినోదించాలి. అలా వృద్ధి పొందిన అనురాగంతో, చిత్ర విచిత్రంగా చలిస్తున్న నయనాలతో, చందమామ వంక చూస్తూ వినోదించాలి.

ప్రేయసీ ప్రియులు మొట్ట మొదట తాము కలుసుకున్న రోజుల్లో మనస్సున ఎలాంటి కోరికలు పుట్టాయో, ఎడబాటు కలిగినప్పుడు ఎలాంటి బాధ అనుభవించారో, ఆ విషయాలన్నీ ఒకరితో ఒకరు చెప్పుకుంటూ కొంతసేపు, ఆ మధురస్మృతులతో ఆనందించాలి. అటు పిమ్మట ఆలింగనం చుంబనాదులతో అన్యోన్యానురాగాన్ని అనుభవించాలి.

(సంభోగానంతరం స్త్రీ పురుషులకు చెమట పట్టడం సహజం. అందచేత స్నానం చాలా అవసరం. ఈ విషయాలన్నీ ఏదో అషామాషీగా చెప్పినవి కావు. ఆరోగ్యం కోసం వైద్యశాస్త్ర రీత్యా ఆలోచించి చెప్పినవి. వేడినీళ్ళ స్నానం వెంటనే శరీరానికి ఉత్సాహాన్ని, బలాన్నీ కలుగజేస్తుంది. అలాగే శుభ్రవస్త్ర ధారణం, తంబూలా చర్వణం, చందనం అందుకోడం, ఉపాహారపానీయ సేవనం, వెన్నెల విహారం, సుఖ నిద్ర - ఇవన్నీ సంభోగానంతరం అవశ్యం ఆచరించాలి. వీటివల్ల ఆయువు వృద్ధి అవుతుంది. అలాగే మర్మాంగాలను శుభ్రం చేసుకోడం కూడా చాలా ముఖ్యం. ప్రధానంగా స్త్రీలు. ఎంచేతనంటే స్త్రీం మర్మాంగంలో ఎక్కువగా క్రిములు దాగి ఉండే అవకాశం ఉంది. అలాగే సురతానంతరం రెండు గడియల దాకా వ్యాయామం కాని, మరే రకమైన దేహ పరిశ్రమ కాని చేయకూడదు. సంభోగానంతరం శ్రమ చెందినవారు పగలు కూడా నిద్రపోవచ్చునని కామ శాస్త్ర కారుల అభిప్రాయం. దీనివల్ల ధాతువృద్ధి, బలం అవయవ పుష్టి కలిగి ఆయుర్వృద్ధి అవుతుంది. రతి అనంతరం చక్కెర కలిపిన పాలు, చెరకు రసం, ఇంకా బెల్లం మున్నగు వాటితో తయారైన తీపి భక్ష్యాలు. సేవించడం ప్రశస్తమని 'భావప్రకాశ కారుడు' తెలిపి ఉన్నాడు.

వీర్య స్ఖలనం కాగానే రతి ముగిసినట్లు భావించకూడదు. వీర్య పతనం అయిన పిమ్మట కూడా పురుషాంగం ఇంచుకసేపు బిర్ర బిగిసే ఉంటుంది. అలా బిగిసి ఉన్నంత సేపూ దాన్ని యోనిలోనే ఉంచాలి కాని బయటికి తీయరాదు. అలా ఉంచడం వల్ల స్త్రీలకు విశేషంగా తృప్తి కలగడమే కాక స్త్రీ పురుషుల ఆరోగ్యానికి మంచిదని శాస్త్రకారులు అంటున్నారు. అలా పురుషాంగాన్ని యోనిలో

ఉంచడం వల్ల, అది యోనిలో ఊరిన ద్రవాన్ని చర్మం ద్వారా లోపలికి పీల్చుకుంటుంది. ఈ ద్రవాన్ని ఎంత ఎక్కువగా పీల్చుకుంటే అంత ఎక్కువగా పురుషుడికి ఆయువు వృద్ధి అవుతుందని వైద్యశాస్త్రం చెపుతున్నది. ప్రతిసారీ సంభోగానంతరం అలా చేస్తుంటే త్వరగా ముసలితనంరాదట. అంతేకాక పురుషాంగం మరింత బలిష్ఠమౌతుందట.

సురతానంతరం యోనిలో ప్రవేశించిన వీర్యం, రక్తంచే గ్రహింపబడి స్త్రీ శరీరమంతటా వ్యాపిస్తుందని, దీనివల్ల స్త్రీ దేహం నూతన తేజస్సుతో, చైతన్యంతో, శక్తి ఉత్సాహాలతో, ప్రకాశిస్తుందని శాస్త్రకారుల అభిప్రాయం. అంతే కాకుండా, స్త్రీ శరీరంలో ప్రవేశించిన వీర్యం యొక్క వాసన, కొన్ని గడియల తరువాత ఆమె ఉచ్ఛ్వాసంలో కనిపిస్తుందని ఒక పాశ్చాత్య శాస్త్రజ్ఞుడు తెలుపుచున్నాడు.

రామాయణాన్ని పద్య కావ్యంగా తెనిగించిన ప్రసిద్ధకవి గోపీనాథ వెంకటకవి (1820 ప్రాంతం) మరో విశేషాన్ని వెల్లడించాడు. ఒక స్త్రీ, ఎవరైనా పురుషుడితో సంభోగించిందీ, లేనిదీ ఆమె శరీరం వాసన చూచి కనిపెట్టవచ్చునని, ఆమె సంభోగం జరిపి ఉంటే శరీరం వాసనలో తెలుస్తుందని ఈ కవి తాను రచించిన 'బ్రహ్మానందశతకం' లో తెలిపినాడు. ఏమైనా వీర్యం స్ఖలనమైన తరువాత కూడా పురుషాంగాన్ని పది, పదిహేను నిమిషాలపాటు యోనిలో ఉంచడం ఆరోగ్య ప్రదమని శాస్త్రకారులు చెప్పిన మాట.)

*28. రాగవ, దాహార్యరాగం, కృత్రిమరాగం, వ్యవహితరాగం*
*పోటారతం, ఖలరతం, అనియంత్రితరత మితి రత విశేషాః*

రతిలో ఇంకా విశేషాలున్నాయి. వాటిని రాగవత్తు, ఆహార్యరాగం, కృత్రిమరాగం, వ్యవహితరాగం, పోటారతం, ఖలరతం, అనియంత్రిత రతం - అని పేర్లు.

*29. సందర్శనాత్ప్ర భృత్యుభయో రపి, ప్రవృద్ధ రాగయోః ప్రయత్నకృతే*
*సమాగమే, ప్రవాస ప్రత్యాగమనే వా కలహ వియోగయోగే తద్రాగవత్.*

ఇక ఈ రతి విశేషాల లక్షణాలను గురించి, వాటి విధానాలను గురించి ఇక్కడ చెపుతున్నారు. స్త్రీ పురుషులు మొట్ట మొదట ఒకరి నొకరు, చూచినది మొదలు, ప్రేమానురాగాలు వృద్ధి పొంది కలుసుకునేంత వరకూ, దూరంగా ఉండడం వల్ల ప్రేయసీ ప్రియులు వియోగం పొంది మరల కలుసుకున్నప్పుడూ, ప్రణయకలహంవచ్చి, దానివల్ల ఎడబాటు సంభవించి తిరిగి కలుసుకున్నప్పుడూ జరిగే రతాన్ని రాగవత్తు అంటారు.

*30. తత్రాత్మాభిప్రాయా ద్యావదర్థం చ ప్రవృత్తిః.*

ఈ రాగవత్తులో ప్రేయసీ ప్రియులు అంతకు ముందే పరస్పరం ప్రేమానురాగాలు వృద్ధి పొందించుకున్నవారు కాబట్టి, తమ తమ అభిప్రాయాలను అనుసరించి, అభిలాష తీరేదాకా సురతక్రీడల్లో మునిగి తేలతారు.

*31. మధ్యస్థరాగ యోరారబ్దం, యదనురుజ్యతే తదాహార్య రాగం.*

ఇంతకు ముందు కేవలం చూపుంతోనే ప్రేమించుకుంటూ, హృదయాలు విప్పి చెప్పుకోడానికి వీలులేని మధ్యన్న అనురాగం గల స్త్రీ పురుషులు చూపులతోనే పొందే రతి సుఖాన్ని ఆహార్యరాగం అంటారు.

## రతిలో మరికొన్ని విశేషాలు

*32. తత్ర చతుః షష్టికై ర్యోగైః, సాత్మ్యాను విద్ధైః సంధుక్ష్య సంధుక్ష్య రాగం ప్రవర్తేత తత్కార్య, హేతో రన్యత్ర సక్తయోర్వా, కృత్రిమ రాగాత్.*

పురుషుడు ఆహార్య రాగంలో తన అభిలాషను అనుసరించి చతుష్షష్టి యోగాలలో, భావరూపంలో ఉన్న ప్రేమానురాగాలను బాగా వృద్ధి పొందించుకోవాలి. ధనాశవల్ల కానీ అనర్థానికి ప్రతి క్రియ చేయడం కోసం కానీ ఉపయోగిస్తుంది ఈరాగం. ఇది నిజమైన అనురాగంకాదు.ఎంచేతనంటే ఈపురుషుడు మరో రమణిని ప్రేమిస్తూ ఉంటే, ఆ మగువ కూడ మరో పురుషునిపై మరలుగొని ఉంటుంది. అలాంటి స్త్రీ పురుషులు ఏదో ఒక ప్రయోజనాన్ని అపేక్షించి రతికి పూనుకొంటారు. అంచేతనే ఇది నిజమైన అనురాగం కాదని కృత్రిమ రాగం అని అన్నారు. ఇది చాలా నీజమైన పని. సత్పురుషులు ఈ పద్ధతి ఎన్నడూ అనుసరించరు.

*33. తత్ర సముచ్చ యేవ యోగాన్ శాస్త్రతః పశ్యేత్.*

ప్రేమానురాగాలు లేని సందర్భంలో పురుషుడు శాస్త్రంలో చెప్పిన ఆలింగనాదులను దేశ కాల పరిస్థితులను బట్టి ప్రయోగించాలి.

*34. పురుషస్తు హృదయ ప్రియామన్యాం మనసి నిధాయ వ్యవహరేత్. సంప్రయోగా త్ప్రభృతి రతింయవ దతస్తద్వ్యవహితరాగం.*

పురుషుడు తనకు ఇష్టురాలైన స్త్రీపై మనస్సు పెట్టి, సంయోగం మొదలుపెట్టినప్పటినుంచీ సంభోగించేవరకూ వ్యవహరిస్తే, దాన్ని వ్యవహిత రాగం అంటారు. స్త్రీ కూడా పురుషుడిపట్ల ఇలాగే వ్యవహరించాలి. ఈ రతిలో కూడా ఇంతకు ముందు చెప్పిన కృత్రిమ రాగం ప్రాప్తిస్తుంది. అంచేత పైన పేర్కొన్నట్లుగానే ఇక్కడ కూడా శాస్త్రంలో చెప్పిన యోగాలన్నీ ప్రయోగించి చూడవలసి ఉంటుంది.

*35. న్యూనాయాం, కుంభదాస్యాం, పరిచారికాయాం వా యావదర్థం సంప్రయోగస్తత్పోటారతం.*

నీచలైన పరిచారికలతోనూ, అలాంటి ఇతర దాసీ జనంతోనూ, కక్కుర్తిగా కాసేపు కామం తీర్చుకోడానికై రతి సాగిస్తే దాన్ని 'పోటారతం' అంటారు. ఇందులో స్త్రీపురుషులకు నిజమైన ప్రేమ ఉండదు. తాత్కాలికంగా దురద తీర్చుకోడానికే సంగమిస్తారు.' పోటా ' అంటే నపుంసకం అని అర్థం.

*36. తత్రోపచారాన్నాద్రి యేత*

ఇలాంటి వారితో సంభోగించినప్పుడు కేవలం మైధునక్రియ జరపాలే కాని కౌగిలింతలు, ముద్దులు మొదలైనవి చేయకూడదు. కేవలం భగలింగాల దురద వదిల్చుకోడమే ఇందులో ప్రధానం.

37. *తథి వేశ్యాయాగ్రామీణేన యావదర్థం ఖలరతం.*

అందాన్నీ, దేహాన్నీ అమ్ముకుని బ్రతికే వేశ్యలు, దాసీ స్త్రీలు, తమ తృప్తి తీరేదాకా రతి చేయగల పురుషులు దొరకనప్పుడు దృఢకాయులైన కార్మికులనో, కర్షకులనోపిలిచి వారిచేత రతి చేయించుకుంటారు. దాన్నే ఖలరతం అంటారు.

38. *గ్రామ వ్రజ ప్రత్యంత యోషి ద్భిశ్చ నాగరకస్య.*

అలాగే గ్రామీణ ప్రాంతాల్లో కొందరు పల్లెపడుచులు కామోద్రేకంతో మదించి ఉంటారు. వారు విలాసంగా ఉండే పట్టణవాసులైన యువకులను చూచి వారిచేత తృప్తి తీరేదాకా రతి చేయించుకుంటారు. దాన్ని కూడా 'ఖలరతం' అనే అంటారు.

39. *ఉత్పన్న విస్రంభయోశ్చ పరస్పరానుకూల్యా దయంత్రిత రతమితి రతాని.*

ఎంతో కాలం బట్టి చనువుగా ఉంటూ, ఒకే భావాలు గల స్త్రీ పురుషులు రతి చేస్తే దాన్ని అనియంత్ర రతం అంటారు.

40. *వర్ధమాన ప్రణయాతు నాయికా సపత్నీ నామ గ్రహణం, తదాశ్రయ మాలాపం వా, గోత్ర స్ఖలితం, వా నమర్షయేత్, నాయక వ్యళీకంచ.*

ఒక పురుషుణ్ణే గాఢంగా ప్రేమిస్తూ అతని ప్రేమానురాగాలు చూరగొన్న స్త్రీ, ఆపురుషుడు మరో యువతిని గురించి తనతో చెప్పినా, ఆమె పేరు ఎత్తినా, ఆమెను గురించి కలవరించినా, అతను అపరాధం చేసినా ఎంత మాత్రం సహించకూడదు. వెంటనే అతనితో కలహించాలి.

## ప్రణయ కలహాలు, కోపగృహాలు!

41. *తత్ర సుభృశః కలహో, రుదిత,మాయాసః, శిరోరుహాణా మవక్షోపణం, ప్రహణన, మాసనా, చ్ఛయనాద్వా, మహ్యాం, పతనం, మాల్యభూషణావ మోక్షో, భూమౌశయ్యా చ.*

అలాంటి సందర్భాల్లో స్త్రీలు పోట్లాట పెట్టుకుని ఏడవడం, ఆయాసపడడం, జుట్టు విరబోసుకోడం, మొత్తుకోడం, కూచున్న ఆసనం నుంచీ లేదా శయ్యపైనుంచీ లేచి, నేలమీదపడి పొర్లాడడం, సిగలో ఉన్న పూలు, మెడలో, వంటిమీదా ఉన్న సొమ్ములు త్రెంచి పారెయ్యడం, ఇలాంటి పనులన్నీ చెయ్యాలి. (సత్యభామలా, కైకేయిలా నాయికలు కోపగృహంలో చేసినట్లుగా)

42. *తత్రయుక్తరూపేణ సామ్నా పాదపతితేన వా ప్రసన్నమనాః, తామనునయన్ను పక్రమ్య శయన మారోహయేత్.*

అప్పుడు ప్రియుడు తగినట్లుగా ఉపాయంగా ఆమెను లాలించి, బుజ్జగించి కాళ్ళా వేళ్ళా పడి బతిమాలుకుని, ప్రసన్నమైన మనస్సుతో అనునయించి, మంచి మాటలతో ఒప్పించి, సమాధానపరచి, రెండు చేతులతో ఎత్తుకుని వచ్చి మళ్ళీ శయ్యపై పరుండబెట్టాలి.

*43.* *తస్య చ వచనముత్తరేణ యోజయంతీ వివృద్ధక్రోధా సకచ*
*గ్రహమస్యాస్యమున్నమయ్య పాదేన బాహౌ,*
*శిరసి, వక్షసి, పృష్ఠే వా, సకృద్ద్విస్త్రిరవహన్యాత్.*

*44.* *ద్వారదేశం గచ్ఛేత్తత్రోపవిశ్యా శ్రుకరణమితి.*

*45.* *అతిక్రుద్ధా అపితున ద్వార దేశాద్భూయో*
*గచ్ఛేద్దోషవత్వా దితి దత్తకః*

పురుషుడు ఈ విధంగా ప్రేయసిని అనునయించే సమయంలో అతని మాటలకు ఏవేవో సమాధానాలు చెపుతూ ప్రేయసి తన కోపాన్ని రెట్టింపు చేసుకుని, అతని జుట్టు పట్టుకుని, ముఖాన్ని పైకెత్తి తన పాదంతో అతని బహువులమీద, వక్షస్థలంపైన, తలపైన, వీపుమీద 'ఒకటి, రెండు, మూడు, అంటూ తన్నాలి. (సత్యాదేవి కృష్ణుని చేసినట్లు) ఆ తరువాత ఇంకా ఇంకా కోపం తెచ్చుకుని తాను వెళ్ళిపోతున్నట్లుగా వాకిలిదాకా వెళ్ళాలి. అక్కడ గడప దగ్గర కూచుని కన్నీరు కార్చాలి. అయితే, ఎంత కోపం వచ్చినా స్త్రీ ద్వారం దాటి వీధిన పడరాదు. గడపదాటి వెళ్ళరాదు. అది కులకాంతకు తగనిపని. వాకిలిదాకా వెళ్ళడంకూడా అనేక సార్లు చేయకూడదు. అలా చేయడం ఎంతో దోషం - అంటారు దత్తకాచార్యులు. మరి అయితే, పురుషుణ్ణి కాలితో తన్నడం దోషం కాదా అంటే, అలా పాదతాడనం కూడా సౌభాగ్యానికి చిహ్నమేనని నాగరక వృద్ధులంటున్నారు. (అంచేతనే సత్యభామ కృష్ణుణ్ణి ఈ పని చేసిందేమో).

*46.* *తత్ర యుక్తితో Zనునీయమానా ప్రసాదమాకాంక్షేత*
*ప్రసన్నా Zపితు సకషాయైరేవ వాక్యైరేనం తుదతీవ*
*ప్రసన్నా రతికాంక్షిణే నాయకేన పరిరభ్యేత.*

ఇలాంటి సందర్భాల్లో ప్రియుడిచేత యుక్తిగా బతిమాలించుకుని, స్త్రీ ప్రసన్నురాలు కావాలి. అంతేకాని, మొండిగా భీష్మించుకుని కూచోరాదు. అయితే, ప్రసన్నురాలైనా కూడా నిష్ఠుర వాక్యాలతో అతన్ని నొప్పిస్తూ ఉన్నట్లే ఉండి క్రమంగా అతనికి లొంగిపోయి సురతాన్ని కాంక్షిస్తూ అతని ఒడిలో వాలిపోవాలి. అప్పుడతను ఆమెను బిగియార కౌగలించుకుంటాడు.

*47.* స్వభవనస్థాతు నిమిత్తాత్కలహితా తథావిధచేష్టైవ నాయకమభి గచ్ఛేత్

48. తత్రపీఠమర్ద, విట, విదూషకైః, నాయకప్రయుక్తైరుప
శమితరోషా తై రేవానునీతా తై సహైవ తద్భవనమధిగచ్ఛేత్,
తత్ర చ వసే దితి ప్రణయకలహః

ఇక వేశ్యలు, పరస్త్రీలతో ప్రణయకలహం సాగించే విధానం చెపుతున్నారు - స్త్రీ తన ఇంట్లోనే ఉండి పైన పేర్కొన్న కారణాలతోనే పైన చెప్పినట్లు పురుషుడితో కలహించాలి. తరువాత అసూయను తెలిపే చూపులతో అతన్ని సమీపించాలి. అప్పుడు పురుషుడికి సహాయకులుగా ఉన్న పీఠమర్దుడు, విటుడు, విదూషకుడు మున్నగు మధ్యవర్తులచేత బ్రతిమాలించుకుని రాజీపడి, శాంతి పొందాలి. వారు అదేపనిగా బ్రతిమాలుతూ ఉండగా వారిని వెంటపెట్టుకుని పురుషుడి మందిరానికి వెళ్ళి అక్కడే ఉండాలి. ప్రణయ కలహానికి లక్షణం ఇది.

*49. భవంతి చాత్ర శ్లోకాః ఏవమేతాం చతుష్షష్టిం బాభ్రవ్యేణ*
*ప్రకీర్తితాం, ప్రయుంజానో పరస్త్రీషు, సిద్ధిం గచ్ఛతి నాయకః. బ్రువన్న*

*50. బ్రువన్నప్యన్య శాస్త్రాణి, చతుష్షష్టివివర్జితః,*
*విద్వత్సంనది నాత్యర్థం కథాను పరిపూజ్యతే.*

*51. వర్జితో వ్యన్య విజ్ఞానై రేతయాయ స్త్వలంకృతః,*
*నగోష్ఠ్యాం, నరనారీణాం, కథాన్వగ్రం విగాహతే.*

*52. విద్వద్భిః పూజితామేనాం, ఖలైరపి సుపూజితాం,*
*పూజితాం గణికా సంఘైః నందినీం కో నపూజయేత్.*

*53-54 నందినీ సుభగాసిద్ధా సుభగం కరణీతి చ, నారీప్రియేతి చాచార్యైః*
*శాస్త్రే ష్వేషా నిరుచ్యతే. కన్యాభిః పర యోషిద్భిః*
*గణికాభిశ్చ భావతః, వీక్ష్యతే బహుమానేన చతుష్షష్టి విచక్షణః*

ఈ పాంచాలీ చతుష్షష్టిని గురించి బాభ్రవ్యుడు విశేషంగా కీర్తించాడు. దీన్ని సక్రమంగా స్త్రీలయందు ప్రయోగించే పురుషుడు ఇష్టార్థ సిద్ధి పొందుతాడు. ఈ చతుష్షష్టిని నేర్చుకోకుండా ఇతర శాస్త్రాలు ఎన్ని చదివినా అలాంటివాడు విద్వత్సభల్లో పూజానీయుడు కాడు. తక్కిన శాస్త్రాల్లో పాండిత్యం లేకపోయినా ఈ శాస్త్ర విజ్ఞానాన్ని తెలుసుకున్నవాడు మానవ స్త్రీ జనం మధ్యలో, వారి గోష్ఠులలో కథల్లో, గాథల్లో అగ్రస్థానం ఆక్రమిస్తారు. ఈ చతుష్షష్టిని 'నందిని' అని కూడా పిలుస్తారు. పండితులూ, పామరులూ, సజ్జనులూ, దుర్జనులూ, వేశ్యాజనం - అందరూ పూజించి, గౌరవించే ఈ నందిని' అనే చతుష్షష్టిని ఎవరు పూజించకుండా, గౌరవించకుండా ఉండగలరు ?

ఈ 'నందినీ' విద్య సుభగ అనీ, సిద్ధి అనీ, సుభగంకరణి అనీ నారీజనప్రియ అనీ ప్రాచీన ఆచార్యులు తమ కామశాస్త్ర గ్రంథాల్లో పేర్కొన్నారు. కన్యలు, వేశ్యలు, కులస్త్రీలు - అందరూ కూడా చతుష్షష్టి తెలిసిన పురుషుణ్ణి ఎంతో గౌరవంగా చూస్తారు.

*ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే ద్వితీయేఽధికరణే,*
*రతారంభావసానికం, రతవిశేషాః ప్రణయకలహాశ్చ దశమోఽధ్యాయః*

ఇది వాత్స్యాయనముని విరచిత కామసూత్రాల్లో సాంప్రయోగికం అనే రెండో అధికరణంలో రతారంభం, రతావసానం, రతి విశేషాలు, ప్రణయ కలహాలు అనే పదో అధ్యాయం.

భారద్వాజ గోత్రుడూ, అశ్వలాయన సూత్రుడూ, ఋక్శాఖేయుడూ నందవరీకీ అయిన రెంటాల గోపాలకృష్ణ వాత్స్యాయన కామసూత్రాలకు యశోధరుని జయమంగళ వ్యాఖ్యానుసారం రచించిన తెలుగువ్యాఖ్య 'శృంగార తిలక',



# వాత్స్యాయన కామసూత్రాలు

## కన్యాసంప్రయుక్తకాధికరణం - 3
## ప్రథమాధ్యాయం
### వరణ విధానం

**పురుషుడు** అరవై నాలుగు కళలూ అభ్యసించి, విశేషంగా లోక జ్ఞానం సంపాదించి నప్పటికీ, స్త్రీ సమాగమం లేకపోతే అతని జీవితం వ్యర్థమే అవుతుంది అందువల్ల స్త్రీ సమాగమానికి ఉపాయాలు చెపుతున్నాడు వాత్స్యాయనుడు. పెళ్ళి చేసుకున్నప్పుడే కదా సంసార సుఖం లభించేది? ఆశ్రమాలన్నిటిలోకీ గృహస్థాశ్రమం శ్రేష్ఠమైనదన్నారుపెద్దలు. తక్కిన మూడు ఆశ్రమాలవారికీ గృహస్థే ఆశ్రయం, ఆధారం. మోక్ష సాధనకు అవసరమైన పూజలు, వ్రతాలు, దానధర్మాలు, యజ్ఞ యాగాదులు, తీర్థయాత్ర సేవనం ఇవన్నీ గృహస్థాశ్రమంలోనే అనుష్ఠించడానికి వీలవుతుంది. కాబట్టి పురుషుడికి భార్య అవసరం. సంతానప్రాప్తికి, వంశాభివృద్ధికి, అర్ధాంగి కావాలి కదా!

1. *సవర్ణయా ఽ మనన్యపూర్వాయాం, శాస్త్రతో ఽధిగతాయాం,*
*ధర్మోఽర్థః పుత్రాః, సంబంధః, పక్షవృద్ధిః, అనుపస్కృతా రతిశ్చ.*

సంప్రయోగం పొందడానికి అన్వేషించే మార్గాన్నే 'ఆవాపం' అంటారు. ఈ ఆవాపంలో కన్య ప్రధానపాత్ర వహిస్తుంది. మరి, ఆ కన్య ఎలాంటిదై ఉండాలి? తన వర్ణంలోనే జన్మించి, ఇంతకు ముందు మనోవాక్కర్మలా ఎవ్వరికీ ఇవ్వబడనిదై, ఎవ్వరినీ ప్రేమించనిదై ఉండాలి. ఆ కన్య శాస్త్రయుక్తంగా వివాహం చేసుకోదగినదిగా ఉండాలి. అలాంటి కన్యను వివాహమాడినప్పుడే ధర్మం దక్కుతుంది. అర్థం లభిస్తుంది. సత్సంతానం ప్రాప్తిస్తుంది. సంబంధం బాంధవ్యాలు, వంశం వృద్ధి అవుతాయి. దోష రహితమైన రతి సౌఖ్యం లభిస్తుంది.

2. *తస్మాత్కన్యాం, అభిజనోపేతాం, మాతాపితృమతీః, త్రివర్షాత్ప్రభృతి న్యూనవ యసం, శ్లాఘ్యాచారే, ధనవతి, పక్షవతి, కులే, సంబంధిప్రియే, సంబంధిభిరాకులే, ప్రసూతాం, ప్రభూతమాతా పితృపక్షాం, రూపశీల లక్షణ సంపన్నాం, అన్యూనాధికా, మవినష్టదంతనఖ కర్ణకేశాక్షిస్తనీం, ఆరోగ ప్రకృతి శరీరాం, తథావిధ ఏవశ్రుతవాన్ శీలయేత్.*

అందువల్ల వివాహం చేసుకోబోయే కన్య ఉత్తమ వంశంలో పుట్టినదై వుండాలని పెద్దలు నిర్ణయించారు. అంతే కాకుండా ఆ అమ్మాయి తల్లి తండ్రులు సజీవులై వుండాలి పురుషుడికన్నా కనీసం మూడేండ్లయినా వయస్సులో చిన్నదిగా వుండాలి. పురుషుడితో సమానమైన కులాచారాలు కలిగి, ధనధాన్య సమృద్ధికలదై వుండాలి. బంధువుల పట్ల ఇష్టం కలదీ, అలాగే బంధువుల చేత ప్రేమించబడేది అయి వుండాలి. మంచి రూపం, మంచి ప్రవర్తన కలదై, శుభ లక్షణాలు కలదై వుండాలి. మరీ పొట్టిగానూ, మరీ పొడుగ్గానూ వుండకూడదు. మధ్యరకం ఎత్తు కలిగి, చక్కని గోళ్ళు, చక్కటి పలువరుస, అందమైన చెవులు, కళ్ళు, మంచి తల వెంట్రుకలు, నిండైన పాలిండ్లు కలదై వుండాలి. ఎలాంటి రోగాలు లేనిదై వుండాలి. ఈ విషయాలన్నీ బాగా ఆలోచించి విలక్షణమైన కన్యను పెండ్లాడాలి.

3. *యాం, గృహీత్వాకృతిన మాత్మానం మన్యేత, న చ*
*సమానైర్నిందేృత, తస్యాంప్రవృత్తిరితి ఘోటక ముఖః.*

ఎలాంటి పిల్లను చేసుకుంటే తన జీవితం ధన్యమవుతుందని పురుషుడికి అనిపిస్తుందో, తన వారినుండి ఎలాంటి నింద రాకుండా వుంటుందో, అలాంటి అమ్మాయినే పరిణయమాడాలని ఘోటకముఖుల అభిప్రాయం.

4. *తస్యాః వరణే మాతాపితరౌ, సంబంధినశ్చ ప్రయతేరన్,*
*మిత్రాణి చ గృహీతవాక్యాని ఉభయ సంబద్ధాని.*

కన్యను వరించడం రెండు విధాలు, మొదటిది పౌరుషంతో సంపాదించడం, రెండవది దైవవిధానంగా పొందడం. పైన చెప్పిన రూపగుణశీలాదులు వంశం గల కన్యను విచారించి, అలాంటి కన్య కోసం బంధువులు, మిత్రులు, యువతీ యువకులు ప్రయత్నించి పెళ్ళి చేసుకోడాన్ని పౌరుష విధానం అంటారు.

6. *కాలాన్ పౌరుషేయాన్ అభిప్రాయసంవర్ధకాంశ్చ నాయకగుణాన్*
*విశేషతశ్చ కన్యామాతురనుకూలాంస్తథాత్వాయతియుక్తాన్దర్శయేయుః*

అలాంటి కన్య కోసం బంధుమిత్రులు ప్రయత్నిస్తున్న సమయంలో, ఆ కన్య కోసమే ఇతరులు ప్రయత్నిస్తున్నట్లయితే, ఆ వరుడి యందు ప్రత్యక్షంగా కనిపించే దోషాలను గురించి, సాముద్రిక శాస్త్రంలో చెప్పిన దోషాలను గురించి, ఆ పిల్ల తల్లిదండ్రులకు ఇతరుల ద్వారా తెలియజెయ్యాలి. అంతే కాకుండా తమ పిల్లవాడికి గల గుణగణాలను గురించి, గౌరవ మర్యాదలను గురించి, శుభలక్షణాలు, విద్య, సామర్థ్యం మొదలయిన వాటిని గురించి కూడా ఆ అమ్మాయి తల్లి దండ్రుల మనస్సులకు నచ్చేలా వర్ణించి చెప్పాలి. ఆ కన్య తల్లికి ముఖ్యంగా తమ కుర్రవాడికిస్తే ఆ అమ్మాయి అనుభవించే భోగాలను గురించి, సౌభాగ్యాన్ని గురించి, యథార్థమైన విషయాలే ఎరుక పరచాలి, పౌరుష విధానంలో అనుసరించవలసిన పద్ధతి ఇదంతా.



# ఎలాంటి కన్యను వివాహమాడాలి ?

*7. దైవచింతకరూపశ్చ శకుననిమిత్తగ్రహలగ్నబల లక్షణ దర్శనేన నాయకన్య భవిష్యంత మర్థ సంయోగం కల్యాణ మనువర్ణయేత్.*

8. అపరే పునరస్యాన్యోన్యతో విశిష్టేన కన్యాలాభేన కన్యామాతరమున్మాదయేయుః.

9. దైవనిమిత్తశకునోపశ్రుతీనాం ఆనులోమ్యేన కన్యాం వరయేద్దద్యాచ్చ.

ఇక దైవ విధానాన్ని గురించి చెపుతున్నారు. కన్యను చూచి వరించేటప్పుడు శకునాలు, శుభ సూచనలు, గ్రహబలం, లగ్నబలం, అదృష్ట లక్షణాలు తప్పక గమనించాలి. పెళ్ళి కుమారుడికి అతని మిత్రులు ముందుగా వెళ్ళి రానున్న ధనలాభం గురించి, కల్యాణ శోభను గురించి చెప్పాలి. అలాగే జ్యోతిష్కులు కూడా కన్య తల్లి దగ్గరికి వెళ్ళి పిల్లను పెళ్ళాడబోతున్న వరుణ్ణి గురించి ఎంతగానో వర్ణించి చెప్పాలి. దైవ నిమిత్తాలు, గమనించి వర్ణించాలి. శుభం కలుగుతుందని నచ్చ చెప్పి, కన్యను ఇచ్చేలా చెయ్యాలి.

*10. న యదృచ్ఛయా కేవలమానుషయేతి ఘోటకముఖః*

కన్యను వరించే సమయంలో కేవలం సామాన్యమైన అభిప్రాయంతోనే వరించాలి గాని ఇతరములైన అభిప్రాయాలతో వరించకూడదు. అలాగే కన్యను ఇచ్చే తల్లిదండ్రులుకూడా అలాంటి అభిప్రాయంతోనే ఇవ్వాలి. ఇది ఘోటకముఖులు చెప్పిన మాట.

*11. సుప్తాం, రుదతీం, నిష్క్రాంతం, వరణే పరివర్జయేత్.*

12. అప్రశస్తనామధేయాంచ, గుప్తాం, దత్తాం, ఘోనాం, పృషతా,
మృషభాం, వినతాం, వికటాం, విముండాం, శుచిదూషితాం, సాంకరికీం,
రాకాం, ఫలినీం, మిత్రాం, స్వనుజాం, వర్షకరీం చ వర్జయేత్.

కన్యను తొలిసారిగా చూడడానికి వెళ్ళినప్పుడు శకునాలు పరిశీలించాలి. ఈశకునాలు రాబోయ్యే శుభాశుభాలక సూచనలు. కన్యను చూడడానికి వెళ్ళేసరికి, ఆ అమ్మాయి నిద్రపోతున్నా, ఏడుస్తున్నా, ఇంట్లో నుంచి బయటికి వెడుతున్నా మంచిదికాదు. అలాంటి కన్యను వివాహమాడితే చెరుపు జరుగుతుంది. అంతేకాకుండా అప్రశస్తమైన పేరుగల కన్యకూడా పనికిరాదు. రహస్యంగా దాచబడిన కన్యను కూడా వరించకూడదు. అంతకు ముందే ఇతరులకు పెళ్ళిచేయడానికై వాగ్దానం చేయబడిన కన్యను, అవలక్షణాలు కలదాన్ని, తప్పకుండా విడిచిపెట్టాలి. అలాగే కపలవర్ణంగల కన్యను, శరీరంమీద బొల్లి ఉన్నదాన్ని, పురుషులతో కలిసి యధేచ్ఛగా తిరిగేదాన్ని, నడుం వంగిపోయినదాన్ని, కాళ్ళు లేదా పాదాలు వంకరగా వున్నదాన్ని, అసహ్యమైన ముఖంకలదాన్ని, పరపురుష సంబంధం కలిగి వున్నదాన్ని, తనతో సమానమైన వయస్సు కలదాన్ని, రజస్వల అయినదాన్ని, మూగపిల్లను, చిన్నతనం నుంచీ తనతో స్నేహం గలదాన్ని, కాళ్ళు, చేతులు చెమటలుకమ్మి ఉండేదాన్ని, పెళ్ళిచేసుకోకూడదు. అంచేత ఇలాంటి శుభాశుభ లక్షణాలు చూచి, మంచి శకునాలు గమనించి, అన్ని విధాల ఉత్తమంగా ఉన్న కన్యను వివాహమాడాలి. ఇది శాస్త్రం, పెద్దలు చెప్పినమాట. అలాకాక తొందరపడితే కష్టాలు ప్రాప్తిస్తాయి. ఆ దాంపత్యం సౌఖ్యదాయకంగా వుండదు.

*13. నక్షత్రాఖ్యాం, నదీనామ్నీం, వృక్షనామ్నీంచ గర్హితాం,*
*లకార రేఫోపాంతాం చ వరణే పరివర్జ యేత్.*

నక్షత్రాల పేర్లు, నదుల పేర్లు గలదాన్ని, చెట్ల పేరు కలదాన్ని, అసహ్యమైన పేరు కలదాన్ని, ల, ర,అనే అక్షరాలు పేరులో చివరి అక్షరానికి ముందున్న పేరు కలదాన్ని పెండ్లాడరాదు.

*14. యస్యాం మనశ్చక్షుషోర్నిబంధస్త స్యామృద్ధిర్నే తరామాద్రి యేతేత్యేకే.*

15. తస్మాత్ప్రదాన సమయే కన్యాముదారవేషాం స్థాపయేయు రాపరాహ్ణికంచ.

ఏ కన్యను చూడగానే కంటికీ, మనస్సుకూ తృప్తి, ఆనందము కలిగి, భార్యగా అంగీకరించాలని అభిలాష పుడుతుందో, ఆ కన్యను భార్యగా స్వీకరిస్తేనే శుభం చేకూరుతుంది కాని, తక్కిన కన్యలను చేసుకుంటే శుభమూ, సుఖమూ వుండదని కొందరు శాస్త్రకారుల అభిప్రాయం అంచేత పెళ్ళి చూపుల సమయంలో కన్యను ఆకర్షణీయమైన వేషంతో, అలంకారాలతో సిద్ధం చేయాలి పెళ్ళి చూపుల తరుణంలోనూ పెళ్ళి జరిగే సమయంలోనూ కూడా కన్యను ఇలాగే తయారు చేయాలని శాస్త్రం చెపుతున్నది.

*16. నిత్యం ప్రసాధితాయాః సఖీభిస్సహక్రీడా యజ్ఞ వివాహాదిషు జనసంప్రావేషు*
*ప్రాయత్నికం దర్శనం, తథోత్సవేషు చ పణ్యాసధర్మత్వాత్.*

17. వరణార్థముపగతాంశ్చ భద్రదర్శనాన్ ప్రదక్షిణ వాచశ్చ
తత్సంబంధినంగతాన్ పురుషాన్మంగల్యైః ప్రతిగృహ్ణీయుః

18. కన్యాం చైషామలంకృతామన్యాపదేశేన దర్శయేయుః

19. దైవం పరీక్షణం చావధిం స్థాపయేయురాప్రదాన నిశ్చయాత్.

20. స్నానాదిషు నియుజ్యమానా వరయితారః సర్వం భవిష్యతీత్యుక్త్వానతదహరేవ అభ్యుపగచ్ఛేయుః.

కన్య ఇతరులకు పెండ్లి జరిగే సమయాల్లో కూడా తానున్నూ పెండ్లికూతురివలె అలంకారం చేసుకుని స్నేహితురాండ్రతో కలిసి ఆడుతూ, పాడుతూ తిరుగుతుండాలి యజ్ఞయాగాదుల్లోనూ, వివాహాది ఉత్సవాల్లోనూ, జనం ఎక్కువగా మూగి వుండే సభలు మొదలైన చోట్లనూ పెండ్లి కావలసిన కన్య చక్కగా అలంకరించుకుని వరుడికి కన్పించేలా తిరుగుతూండాలి. ఇది పణ్యంతో తుల్యమైనది కాబట్టి ధర్మయుక్తమే అవుతుంది కాని ధర్మవిరుద్ధం కాదు. కన్యను చూడడానికి వచ్చిన బంధు మిత్రులునూ, వరుడి పక్షంలోని పెద్దలనూ ఆప్యాయంగా పలకరించి, మంగళకరమగు ద్రవ్యాలతో, మంగళ వాయిద్యాలతో ఎదురు వెళ్ళి తీసుకువచ్చి ఉచితాసనములపై కూచోబెట్టి గౌరవించాలి, మర్యాదలు చెయ్యాలి. తరువాత కన్యను చీని చీనాంబరాలతో, వివిధ ఆభరణాలతో అలకరించి ఏదో ఒక వంకతో ఒక క్షణం వారికి కనిపించేలా ఆ ప్రాంతంలో నడయాడేలా చెయ్యాలి. సంబంధం స్థిరపడేదాకా, వరుడి పక్షంలోని పెద్దలకు గట్టిగా మాట ఇవ్వకుండా అంతా దైవాధీనం అంటూ వుండాలి. లేదా పెద్దలతో ఆలోచించి చెపుతామని మాట తప్పిస్తూ వుండాలి. మంగళ స్నానాల సమయంలో వరుని పక్షంవారు తొందరపడి సిద్ధం చేయకూడదు. ప్రతి విషయం నెమ్మదిగా జరుగుతుంది లెండని కాలయాపన చేస్తూ వుండాలి.

21. దేశప్రవృత్తిసాత్మ్యాద్వా బ్రాహ్మప్రాజాపత్యార్షదైవానామన్యతమేన
వివాహేన శాస్త్రతః పరిణయేదితి వరణవిధానం.

వివాహాల్లో ఆయా దేశాచారాలు వేర్వేరుగా వుంటున్నాయి. బ్రాహ్మం, ప్రాజాపత్యం, ఆర్షం, దైవతం - అని చెప్పబడే వివాహాల్లో ఏదో ఒక రకమైన వివాహపద్ధతిని అవలంబించి శాస్త్ర విరుద్ధం కాకుండా, కన్యను వరించాలన్నారు పెద్దలు. ఇది కన్యను వరించవలసిన విధానం.

22. భవంతి చాత్ర శ్లోకాః - సమస్యాద్యాస్సహక్రీడాః వివాహస్సంగతాని చ,
తాదృశైరేవ కార్యాణి నోత్తమైర్నాపి వాఽధమైః

23. కన్యాం గృహీత్వా వర్తేత ప్రేష్యవద్యత్ర నాయకః,
తం విద్యాదుచ్చ సంబంధం పరిత్యక్తం మనస్విభిః.

24. స్వామివద్విచరేద్యత్ర బాంధవైః స్వైః పురస్కృతః
అశ్లాఘ్యో హీనసంబంధః, సోఽపి సద్భిర్వి నింద్యతే.

25. పరస్పర సుఖాస్వాదా క్రీడా యత్ర ప్రయుజ్యతే, విశేషయంతీ చాన్యోన్యం సంబంధస్సవిధీయతే.

వివాదాలూ, పోట్లాటలు, క్రీడలు, వివాహం, స్నేహం - ఇలాంటి వన్నీ అన్ని విధాల సమానమైన వారితోనే చేయాలికాని తక్కినవారితో చేయరాదనేది శాస్త్రవేత్తల వచనం. కన్య వద్ద వరుడు నిలుచుని వుంటే, ఆమె ముందు అతడొక సేవకుడిలా కనిపిస్తుంటాడనుకోండి - అలాంటి సంబంధం ఇతర కారణాలచేత గొప్పదిగా వున్నా, ఆ సంబంధాన్ని పరిత్యజించాలని పెద్దలన్నారు. అలాగే వరుడు, కన్యను వరించిన పిమ్మట తాను, తన బంధుమిత్రాదులు కన్యతోను, కన్యకు సంబంధించిన వారితోను బడాయిలు కొడుతూ, ప్రగల్భాలు పలుకుతూ పెత్తనం చలాయిస్తుంటే, అలాంటి సంబంధంకూడా పనికిరాదన్నారు. ఆ సంబంధం పైన చెప్పిన దానికంటే హీనమైనదని పెద్దలు వాక్రుచ్చారు. ఏ సంబంధంవల్ల వధూవరులకు, వారి కుటుంబాలకు, బంధుమిత్రులకు పరస్పర గౌరవప్రదంగా, సంతోషకరంగా ఉంటుందో ఆ సంబంధమే ఉత్తమమైనదని పెద్దలు తేల్చారు.

*26. కృత్వాఽపిచోచ్చ సంబంధం పశ్చాత్ జ్ఞాతిషు సంనమేత్.*
*న త్వేవ హీనసంబంధం కుర్యాత్సద్భిర్వి నిందితమ్.*

*ఇది శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే కన్యా సంప్రయుక్తకే తృతీయేఽ ధికరణే, వరణవిధానం నామప్రథమోఽధ్యాయః*

పైన పేర్కొన్న ఉచ్చ నీచ వివాహాల్లో శ్రేష్ఠమైన వివాహం ఏదీ అంటే - మంచి సంబంధం చేసుకున్న తరువాత ధనహీనుడై జ్ఞాతులకు లొంగిపోయినా లొంగిపోవచ్చుగాని, బుద్ధిమంతుల నిందలకు పాత్రమైన హీన సంబంధానికి ఎంతమాత్రం అంగీకరించరాదని వాత్స్యాయనులు ఘంటాపథంగా చెపుతున్నారు.

ఇది వాత్స్యాయన ముని విరచిత కామసూత్రాల్లో కన్యా సంప్రయుక్తకం అనే మూడో అధికరణంలో వరణ విధానం అనే మొదటి అధ్యాయం.



# ద్వితీయాధ్యాయం
## కన్యావిస్రంభణం

**ఇంతకు** ముందు అధ్యాయంలో చెప్పినట్లుగా కన్యను వివాహమాడిన పిదప, ఆమెకు తన యందు నమ్మకం, ప్రేమ అభిమానం కలిగేలా చేసుకోవాలి పురుషుడు. అప్పుడే ఆమెతో సంసార సుఖం విశేష ఆనంద దాయకంగా ఉంటుంది. అందుకు మార్గాలు చెప్పారు వాత్స్యాయనులు. అదే ఈ అధ్యాయం. దీన్ని విస్రంభణం అన్నారు. అంటే ఎక్కువ చనువు, నమ్మకం కలిగించడం.

1. *సంగతయో స్త్రిరాత్రమధశ్శయ్యా, బ్రహ్మచర్యం క్షారలవణవర్జమాహార,*
*స్తథా సప్తాహం సతూర్యం మంగళస్నానం ప్రసాధనం,*
*సహభోజనం చ, ప్రేక్షా సంబంధినాం చ పూజనమితి సార్వ వర్ణికమ్.*

ఇందుకుగాను ముందుగా మంగళాచారాన్ని నిరూపిస్తున్నారు. వివాహ సమయంలో ప్రథమ పరిచయ భాగ్యం పొంది ఉన్న దంపతులు, వివాహనంతరం మూడు రాత్రులు నేలమీద పరుండాలి, చాతుర్థికహోమం చేసేదాకా బ్రహ్మచర్యం పాటించాలి ఆ రోజుల్లో ఉప్పు, కారం తగలని ఆహారం భుజించాలి. అంటే సాత్వికాహరం అన్నమాట. అది మనో నిర్మలత్వాన్ని, ఇంద్రియ నిగ్రహన్ని కలిగిస్తుంది. ఆ విధంగా ఏడు రోజులవరకూ సాత్వికాహరంతో, బ్రహ్మచర్యం అనుష్టిస్తూ, మంగళ ప్రదములైన మేళతాళాలతోనూ, నృత్య గీతాలతోనూ కాలం గడపాలి, తరువాత మరల మంగళస్నానాలు చెయ్యాలి. ఈ ఏడురోజుల్లోనూ ప్రేయసీ ప్రియులు చక్కగా రకరకాల అలంకారాలు చేసుకుంటూ ఉండాలి. ఇద్దరూ ఒకే పాత్రలో భుజించాలి. ఆ భోజనంకూడా ఉప్పు, కారం లేకుండా సాత్వికాహరం అయి ఉండాలి. నృత్య, సంగీత ప్రదర్శనలు తిలకిస్తూ ఆ కళాకారులను గంధ, పుష్ప, తాంబూలాదులతో గౌరవించాలి. ఈ విధంగా యావత్తూ అన్ని వర్ణాలవారికీ సమానమేనని చెప్పారు శాస్త్రకారులు.

2. *తస్మిన్నే తాంనిశి విజనే మృదుభిరుపచారై రుపక్రమేత.*

3. *అనుద్వేగకరై రాలాపన్పర్శనాదిభిః*

ఇక కన్యను విస్రంభణం చేసే మార్గాన్ని గురించి చెపుతున్నారు. విస్రంభణం చేయడమంటే,చనువూ, నమ్మకం కలిగించడం. కన్యలు సాధారణంగా రెండురకాలు. సంసర్గ యోగ్యలైనవారు ఒకరకం - అంటే అప్పటి కప్పుడే కలియడానికి అనుకూలవతు లన్నమాట. అలా కాకుండా కొంత బింకంగా ఉండేవారు రెండోరకం. ఈ రెండోరకం కన్యలకూ విస్రంభణ విధానం అవసరమే.

అప్పటికప్పుడే కలియడానికి అనుకూలురాలైన కన్యను రతి నిమిత్తం విస్రంభింప చెయ్యాలి, రెండోరకం కన్యకు సిగ్గు, బిడియం. భయం ఉంటాయి. కాబట్టి వాటిని పోగొట్టడానికి విస్రంభణ విధానాన్ని అనుసరించాలి. ఈ విధంగా ఈ విస్రంభణ అనేది సర్వత్రా అవసరం అవుతున్నది. కొత్త పెళ్ళి కూతురు సాధారణంగా సంభోగానికి సంసిద్ధంగా ఉండకపోవచ్చు. అంచేత అలాంటి యువతికి సిగ్గు, భయం పోగొట్టి లొంగతీసుకునే విస్రంభణ రహస్యం యువకులందరూ తెలుసుకో వలసి ఉంది.

# నూతన వధువును వశం చేసుకోడం ఎలా?

వివాహమైన పిమ్మట పదిరోజులు రాత్రిపూట, ఏకాంతంగా ఉండే శయన మందిరంలో యువతీ యువకులు చేరి ఉన్నప్పుడు యువకుడు ఆమెను తియ్యని మాటలతో పలకరించి, నెమ్మదిగా ఆమె దేహాన్ని స్పృశిస్తూ మృదువుగా ఉపచరించడానికి ఉపక్రమించాలి.

4. *త్రిరాత్రమవచనం హి స్తంభమివ నాయకం పశ్యంతీ కన్యా నిర్విద్యేత*
   *పరిభవేచ్చ తృతీయామివ ప్రకృతిమితి బాభ్రవీయాః*

5. *ఉపక్రమేత విస్రంభయేచ్చ, న తు బ్రహ్మచర్యమతి వర్తేతేతి వాత్స్యాయనః*

6. *ఉపక్రమాణశ్చ న ప్రసహ్య కించిదాచరేత్.*

ఈ వశీకరణోపాయాలు ఎందుకు ప్రయోగించాలో చెపుతున్నారు శాస్త్రకారులు. పురుషుడు ఈ విస్రంభణోపాయాలు ప్రయోగించకుండా, స్త్రీ దొరకనే దొరికింది కదా అని ఎకా ఎకి రతిక్రీడకు ఉపక్రమిస్తే ఆ తరుణి వీడెవడో మూర్ఖుడిలా ఉన్నాడు. ఈ మోటు మనిషి చేతిలో పడ్డానే భగవంతుడా అని విచారిస్తుంది. పైగా అవమానిస్తుంది కూడా. పురుషుడు కదలక, మెదలక స్తబ్దుగా ఉంటే కూడా ఇతనికి పుస్త్వం లేదేమోనని అనుమాన పడుతుంది. అంచాత విస్రంభణోపాయం అవసరమని బాభ్రవీయులంటున్నారు. అవి వ్రతదినాలు కాబట్టి, ఆ రోజుల్లో యువతి నిర్వేదం చెందకుండా విస్రంభణ విధానాన్ని ప్రయోగించాలేకాని, బ్రహ్మచర్యానికి మాత్రం భంగం కలిగించరాదు. అని వాత్స్యాయనుల సిద్ధాంతం. స్త్రీకి ఇష్టం లేకుండా ఏ పనీ బలత్కారంగా చేయకూడదని ఆయన అంటున్నారు.

7. *కుసుమసధర్మాణో హి యోషితః సుకుమారోప క్రమాః,*
   *తాస్త్వనధిగతవిశ్వాసైః ప్రసభముపక్రమ్యమాణాః*
   *సంప్రయోగద్వేషిణ్యో భవంతి తస్మాత్సామ్నైవోపచరేత్.*

స్త్రీలు సహజంగా సుకుమారలు, పువ్వుల వంటివారు. వారి మనస్సు అంతకంటే మృదువైనది. అంచాత వారితో సంభోగానికి ఉపక్రమించేటప్పుడు ఎంతో సుకుమారంగా, నాజుగ్గా ప్రవర్తించాలి. ఏ సమయంలోనూ బలాత్కారం కూడదు. యువతి మనస్సుకు మొదట నమ్మకం పుట్టించకుండా బలాత్కరిస్తే ఆమె భయభ్రాంత అయి సంభోగానికి విముఖురాలవుతుంది. సామాన్య స్త్రీలలోనే ఇలా ప్రవర్తించవలసి

ఉంటే ఇక కన్యల విషయంలో వేరే చెప్పేదేముంది? వారిపట్ల ఇంకా జాగ్రత్తగా మెలగాలని భావం.

8. *యుక్త్యాఽపి తు యతః ప్రసరముపలభేత తేనైవాను ప్రవిశేత్.*

9. *తత్ప్రియేణాలింగనేన ఆచరితేన నాతికాలత్వాత్.*

10. *పూర్వకాయేన చోపక్రమేత విషహ్యత్వాత్.*

11. *దీపాలోకే విగాఢయౌవనాయాః పూర్వ సంస్తుతాయాః,*
*బాలాయా అపూర్వాయాశ్చాంధకారే.*

పై విధంగా ఉపచరించడానికి అవకాశం చిక్కించుకోలేక పోతే, ఇక ఆ పురుషుడికి ఉపచార యోగమే ఉండదు. అందుకోసమే ఇక్కడ ఉపాయాలు చెపుతున్నారు వాత్స్యాయనులు. మొదటి యుక్తిగా, ఏదో ఒక నెపం పెట్టుకుని తరుణిని సమీపించాలి. అలా చనువు ఏర్పడడానికి మెల్లగా మాటల్లోకి దింపాలి. ఆ విధంగా ఆమెను నెమ్మదిగా ఆట పాటల్లోకి దింపి, మనస్సును రంజింపజేస్తూ కొంచెం కొంచెం అవకాశం చిక్కించుకుని, పిమ్మట జాగు చేయకుండా ఆమెకు ఇష్టంగానూ, సుఖంగానూ, ఉండేలా ఆలింగనం చేసుకోవాలి. ఇక్కడ పూర్తి కౌగిలింత పనికి రాదు. అది ఉద్రేకానికి కారణ మవుతుంది. ఉద్రేకం వస్తే, తనను తొందర పెడుతుంది. కాబట్టి బొడ్డుకు పై భాగంలో మాత్రమే మగువను కౌగిలించుకోవాలి. బాగా యౌవనోద్రేకంగల స్త్రీగాని, అంతకుముందే కొంత పరిచయంగల స్త్రీగాని అయితే, శయన గృహంలో దీపం ఉన్నా ఫరవాలేదు. అలాకాక బొత్తిగా పరిచయంలేనిది గాని, మరీ బాలికగాని అయితే, దీపం తీసివేసి చీకట్లోనే ఉపక్రమించాలి.

12. *అంగీకృతపరిష్వంగాయాశ్చ వదనేన తాంబూల దానం,*
*తదప్రతిపద్యమానాం చ సాంత్వనైర్వాక్యైశ్శపథైః,*
*ప్రతి యాచితైః పాదపతనైశ్చగ్రాహ యేత్ వ్రీడాయుక్తాపి*
*యోషిదత్యంతక్రుద్ధాఽపి న పదపతన మతివర్తత ఇతి సార్వత్రికమ్.*

అలా ఆలింగనం చేసినప్పుడు యువతి ముఖంలో చిరునవ్వు మొలకెత్తుతుంది. అది ఆమె అంగీకారానికి సూచన. అది గుర్తించి పురుషుడు తన నోటియందలి తాంబూలాన్ని ఆమె నోటికి అందించాలి. అందుకు ఆమె ఇష్టపడినట్లయితే, మధురమైన, ఆహ్లాదకరమైన మాటలతో లేదా తన ప్రేమను వ్యక్తంచేసే వాటితో మగువను మురిపించి, మరపించి, ఒప్పించాలి. అప్పటికి ఒప్పుకోకపోతే ఇలా చెయ్యి, అలా చెయ్యి అని ప్రార్థిస్తూగాని, ఆఖరుకు పాదాలమీద పడిగాని ఆమె అంగీకరించేలా చెయ్యాలి. సాధారణంగా స్త్రీలు ఎంత సిగ్గు కలవారైనా, ఎంత కోపిష్టులైనా, భర్తలు తమ పాదాలపైపడి ప్రార్థించిన తరువాత ఏదీ కాదనలేరు. భర్తలమాట అతిక్రమించి ప్రవర్తించలేరు. ఇది స్త్రీ జాతికి సహజగుణం.

13. *తద్దానప్రసంగేణ మృదు విశదమకాహళమస్యా శ్చుంబనం.*

14. తత్ర సిద్ధామాలాపయేత్.

15. తచ్ఛ్రవణార్థ యత్కించిదల్పాక్షరాభి ధేయమజానన్ని వ పృచ్ఛేత్.

16. తత్ర నిష్ప్రతిపత్తిమనుద్వేజయన్ సాంత్వనాయుక్తం బహుశ ఏవ పృచ్ఛేత్.

17. తత్రాప్యవదంతం నిర్బధ్నీయాత్.

అలా తాంబూలం నోటికి అందించే తరుణంలో, చప్పుడు చేయకుండా మృదువుగా, స్పర్శ సుఖం కలిగేలా ఆమెను ముద్దు పెట్టుకోవాలి. అప్పుడామె అనుకూలంగా ఇష్టాన్ని చూపితే, తరువాత ఆమెచేత నెమ్మదిగా మాట్లాడించడానికి ప్రయత్నించాలి. అలా మాట్లాడించేటప్పుడు, ఆమెకు తెలిసి ఉన్న ఏదైనా విచిత్రమైన సంగతిని గురించి తనకు తెలియనట్లుగా అడగాలి. అప్పుడామె అతని మాటకు మారు పలుకకుండా ఊరుకుంటే, ఆమెను చల్లని, మెల్లని మాటలతో మాట్లాడించడానికి మళ్ళీ ప్రయత్నించాలి. అప్పటికీ భీష్మించుకుని కూచుంటే బలాత్కరించవచ్చు.

18. సర్వా ఏవ హి కన్యాః పురుషేణ ప్రయుజ్యమానం వచనం విషహంతే,
న తు లఘుమిశ్రామపి వాచం వదంతీతి ఘోటకముఖః

"అయితే, పురుషులు తమతో చెప్పే విషయాలన్నీ స్త్రీలందరూ వింటారు. కాని ఒక్కొక్కప్పుడు ఒకమాట కూడా బదులు చెప్పరు" — అంటాడు ఘోటకముఖుడు.

19. నిర్బధ్యమానా తు శిరః కంపేన ప్రతివచనాని యోజయేత్,
కలహే తు న శిరః కంపయేత్.

అలాంటి సందర్భాల్లో స్త్రీ అవునని కాని, కాదని కాని శిరఃకంపనం ద్వారా (తల ఊపడం ద్వారా) తెలియజేయవచ్చు. అలాకాక ఆమె కనుక పురుషుడితో కలహిస్తే, తల ఊపడం కూడా చేయరాదు.

20. ఇచ్ఛసి మాం నేచ్ఛసి వా, కిం తేఽహం రుచితో న రుచితో
వేతి పృష్టాం చిరం స్థిత్వా నిర్బధ్యమానా తదానుకూల్యేన
శిరఃకంపయేత్ ప్రపంచ్యమానాతు వివదేత.

పురుషుడు కనుక 'నేనంటే నీ కిష్టమేనా' అని అడిగినప్పుడు, మగువ సమాధానం చెప్పకుండా చాలాసేపు మౌనం వహించి ఉండాలి. చివరకు అతను గట్టిగా నిర్బంధం చేసినప్పుడు అనుకూల సూచకంగా తల పంకించాలి.

21. సంస్తుతా చేత్సఖీమనుకూలాముభయతోఽపివిస్రబ్ధాం
తామంతరాకృత్వా కథాం యోజయేత్.

22. తస్మిన్నధోముఖీ విహసేత్.

23. తాం చాతివాదినీమధిక్షిపేద్వివదేచ్ఛ.

24. సాతు పరిహాసార్థమిదమనయోక్తమితి చానుక్తమపి బ్రూయాత్.

25. తత్ర తామపనుద్య ప్రతివచనార్థమభ్యర్థమానాం తూష్ణీమాసీత.

26. నిర్బధ్యమానా తు నాహమేవం బ్రవీమీతి
అవ్యక్తాక్షర మనవసితార్థం వచనం బ్రూయాత్.

27. నాయకం చ విహసన్తీ కదా చిత్కటాక్షైః ప్రేక్షేతే త్యాలాపయోజనమ్.

యువతిచేత మాట్లాడించేటప్పుడు ఆమెకు పూర్వం బాగా పరిచితురాలైనదీ, ప్రేయసీ ప్రియుల గత జీవితాలు ఎరిగినదీ అయిన ఒక చెలికత్తెను అడ్డం పెట్టుకుని ఆమెకు ఏదైనా ఒక చక్కని విషయం చెప్పడం ప్రారంభించాలి. ఆ విషయం చెలికత్తెకు చెపుతున్నట్లుగా చెపుతూ ఉంటే, యువతి సిగ్గుతో తల వాల్చుకుని, ముసి ముసి నవ్వులు నవ్వుతూ ఉంటుంది. చెలికత్తె కనుక కాస్త గడసరి అయితే, దాన్ని ఆక్షేపిస్తూ ఉంటుంది. పైగా పోట్లాటకూడా లంకించుకుంటుంది. అప్పుడు చెలికత్తె, యువకుడితో 'అమ్మాయి ఇలా అందీ, అలా అందీ' అంటూ లేనిపోని మాటలు హాస్యానికి కల్పించి చెప్పాలి. తరువాత యువతే ఏం సమాధానం చెపుతుందో చూద్దామని చెలికత్తె కాసేపు ఊరుకోవాలి. 'నీవు ఇలా అన్నావు కదా?' - అని చెలికత్తె మళ్ళీ ప్రశ్నించినప్పుడు యువతి 'నేను అలా అనలేదు' - అంటూ అవ్యక్తాక్షరంగానూ, అర్థం పూర్తి కాకుండానూ మాట్లాడాలి. ఇలా మాట్లాడుతూనే యువకుడివంక ఒకటి, రెండు చూపులు, మన్మధుడి తూపుల్లాంటివి విసరాలి. ఈ సంభాషణవల్ల యువతీ యువకుల మధ్య ప్రేమ అంకురిస్తుంది. అదే దీని ప్రయోజనం.

28. ఏవం జాతపరిచయా చ అనిర్వదంతీ తత్సమీపే యాచితం తాంబూలం
విలేపనం స్రజం నిదధ్యాదుత్తరీయే వాస్య నిబధ్నీయాత్.

29. తథా యుక్తామాచ్ఛురితకేన స్తనముకుళయోరు పరి స్పృశేత్.

30. వార్యమాణశ్చ త్వమపి మాం పరిష్వజన్వ తతో నైవమాచరిష్యామీతి స్థిత్యా
పరిష్వంజయేత్, స్వం చ హస్తమానాభిదేశాత్ప్రసార్య ప్రసార్య
నివర్తయేత్, క్రమేణ చైనాముత్సంగమారోప్యాధిక
మధికముపక్రమేతా ప్రతిపద్యమానాం చ భీషయేత్.

ఇలా ఆలింగన, తాంబూల దాన, చుంబన, ఆలాపనాదుల వల్ల యువకుని పరిచయం పొందిన యువతి, యువకుడు అడిగినదే తడవుగా తాంబూలం, గంధమాల్యాదులు తీసుకునివచ్చి ఇస్తుంది. ఇలా వస్తువులు అందివ్వడం ద్వారా పూర్వపరిచయం, కొంత చనువు ఏర్పడి ఉన్నాయి కాబట్టి, వెళ్ళిపోకుండా అతని ఎదుటే నిలువబడి ఉంటుంది. అప్పుడు యువకుడు, ఈ శాస్త్రంలో ఇంతకుముందు చెప్పిన 'అచ్ఛురితకం' తో ఆమెకు 'స్పర్శసుఖం' కలిగించాలి. ఒకవేళ సిగ్గువల్లనో, చక్కలిగింతల వల్లనో, అందుకు ఆమె అంగీకరించకపోతే, 'నీవు కూడా నన్ను కౌగిలించుకుంటే అలా చెయ్యను' - అంటూ ఆ స్థితిలోనే ఆమెను ఆలింగనం చేసుకోవాలి. అలా కౌగలించుకుంటూనే, తన చేత్తో నాయిక బొడ్డుదాకా మెల్ల మెల్లగా స్పృశిస్తూ, ఆమెలో సిగ్గునూ, భయాన్ని పోగొట్టాలి. అటుపైన క్రమంగా ప్రియురాల్ని తన తొడమీద కూచోబెట్టుకోవాలి. ఆ తరువాత

ఇంకా ఎక్కువగా ఆమెను రంజింప చేయడానికి ఉపక్రమించాలి. అలా చేయడానికి ఆమె ఒప్పుకోకపోతే, ఆమెను కొంచెం భయపెట్టాలి. అది కేవలం నవ్వులాట కోసమే సుమా!



*31. అహం ఖలుతవ 'దంతపదాన్యధరే కరిష్యామి' స్తనపృష్ఠే చ నఖపదం ఆత్మనశ్చ స్వయం కృత్వాత్వయా కృతమితి తే సఖీజనస్య పురతః కథయిష్యామి, సాత్వం కిమత్ర వక్ష్యసీతి బాలవిభీషికాభిః బాలప్రత్యాయనైశ్చ శనైరేనాం ప్రతారయేత్.*

*32. ద్వితీయస్యాం తృతీయస్యాం చ రాత్రౌ కించిదధికం విస్రంభితాం హస్తేన యోజయేత్.*

*33. సర్వాంగికం చుంబనముపక్రమేత.*

ప్రియురాల్ని నవ్వులాట కోసం ఎలా భయపెట్టాలో చెపుతున్నారు. 'నా పెదవి నేనే కొరుక్కుంటాను. నా వక్షస్థలంపై నేనే గోళ్ళతో రక్కుకుంటాను, ఇవన్నీ నీవే చేశావని నీ చెలికత్తెలతో చెపుతాను' - అని నాయకుడు బెదిరిస్తూ, మెల్ల మెల్లగా నాయికను వశం చేసుకోవాలి. ఇది తొలిరాత్రి అనుసరించవలసిన పద్ధతి. ఇక రెండో రాత్రి, మూడో రాత్రి ఇంకా కొంచెం నమ్మకం పుట్టించి. సర్వాంగాలూ తడుముతూ, ముద్దులు పెట్టుకోడం మొదలుపెడితే, యువతి పరవశురాలైపోయి తనంతటతానే వశమవుతుంది.

*34. ఊర్వోశ్చోపరి విన్యస్తహస్తః సంవాహనక్రియా యాం సిద్ధాయాం క్రమేణోరుమూల మపి సంవాహయేత్*

*35 తత్ర నివారతే సంవాహనే కో దోష ఇత్యాకులయేదేనాం.*

36. తచ్చ స్థిరీకుర్యాత్ తత్ర సిద్ధాయాంగుహ్యదేశా మర్మనం, రశనావియోజనం, నీవీవిస్రంసనం, వసన పరీవర్తన మూరుమూలసంవాహనం చైతే చాస్యాన్యాపదేశాః

37. యుక్తయంత్రాం రంజయేత్ న త్వకాలే వ్రతఖండన మనుశిష్యేచ్చ.

38. ఆత్మానురాగం దర్శయేత్, మనోరథాంశ్చ పూర్వకాలికానను వర్ణయేదాయత్యాం
చ తదానుకూల్యే న ప్రవృత్తిం ప్రతిజానీయాత్,
సపత్నీభ్యశ్చ సాధ్వ సమవచ్ఛింద్యాత్.

39. కాలేన చ క్రమేణ విముక్తకన్యా భావా
మనుద్వేజయన్నుపక్రమేతేతి కన్యా విస్రంభణం

ఇక ఇప్పుడు హస్తయోజనం చేసే విధానం గురించి చెపుతున్నారు శాస్త్రకారుడు. మొదట పూర్వకాయ సంవాహనం మొదలుపెట్టాలి. అంటే కుచమర్దనం మొదలైనని. తరువాత క్రమంగా చేతిని, తొడలమీదికి పోనిచ్చి అక్కడ సంవాహనం చేస్తూ, మెల్లమెల్లగా ఊరుమూలస్థానంలో కూడా 'సంవాహనం' సాగించాలి. ఆపైన ఊరుమూల ప్రదేశంలో ముద్దుపెట్టుకుని, నఖక్షతాలు ప్రయోగించాలి. ఇదేమిటని నాయిక అడ్డుచెప్పి, ఒప్పుకోకపోతే, ఇందులో తప్పేముంది? అని నచ్చచెప్పాలి నాయకుడు. ఇలా చెపుతూనే పురుషుడు అక్కడనుంచి చెయ్యి తీయకుండా కొంతసేపు ఉంచి, పిమ్మట యోనిని తడుముతూ స్త్రీలో కామోద్రేకాన్ని కలిగించాలి. తరువాత నడుముకు పెట్టుకున్న ఒడ్డాణం ఊడతీసి, కోక ముడివిప్పి, చీర తొలగించాలి. ఆమాట, ఈమాట చెపుతూ మర్మస్థానాన్ని, మర్మప్రదేశాలనూ సంవాహన చేస్తూ కొంతసేపు గడపాలి. అంతేకాని తొందరపడి సంభోగానికి ఉపక్రమించకూడదు. అలా రతిక్రీడకు పూనుకుంటే వ్రతభంగం అవుతుంది. ఇలా మూడు రాత్రులు మాత్రమే వ్రతభంగం కాకుండా జాగ్రత్తపడాలి. నాలుగవరోజు చాతుర్థిక హోమం పూర్తయిన పిమ్మట, ఆ రాత్రి కూడా తొందరపాటు లేకుండా తరుణితో సంభోగం జరిపి ఆమెను తృప్తి పరచాలి. మొదటి మూడు రాత్రుల్లో వ్రతదీక్షలో ఉన్నప్పుడు పురుషుడు తన అనురాగాన్ని తెలియజేయడానికి, తనపట్ల ప్రేమ వృద్ధి పొందడానికి స్త్రీతో పైపై క్రియలు ఎన్నైనా సాగించవచ్చు. రతిక్రియ మాత్రం తగదు. ముందు, ముందు తాము ఇరువురూ సాగించబోయే సంభోగ క్రియను గురించి అందులో గల ఆనందాన్ని గురించి మగువకు తెలియజేయవచ్చు. సవతులు ఎవరైనా ఉంటే వారిని గురించి ఆమెకు గల భయాన్ని తొలగించవచ్చు. ఈ విధంగా కన్యాత్వం నుండి వైదొలగిన నవవధువును వేగిరిపాటు లేకుండా సంభోగక్రియకు సిద్ధపరచవలసి ఉంటుంది పురుషుడు.

40. భవంతి చాత్ర శ్లోకాః ఏవం చిత్తానుగో బాలాముపాయేన ప్రసాధయేత్
తథాZస్య సాZనురక్తా చ సువిస్రబ్ధా ప్రజాయతే.

41. నాత్యంతమానులోమ్యేన న చాతిప్రాతిలోమ్యతః
సిద్ధిం గచ్ఛతి రామాసు తస్మాన్మధ్యేన సాధయేత్.

ఇంతకూ దీని సారాంశం ఏమంటే - పైన చెప్పిన విధంగా యువకుడు కన్య మనోభావాన్ని బాగా అవగతం చేసుకుని ఆమెకు తనపై గట్టి నమ్మకం కలిగించాలి. ఉపాయంగా ఆమెను తన వైపు త్రిప్పుకోవాలి. ఇలా చేయడంవల్ల తరుణి, తన పురుషుడంటే ఎంతగానో ఇష్టపడుతుంది. అంతేకాకుండా మరో ముఖ్య విషయం ఇక్కడ గమనించవలసి ఉంది. ఆమెను నమ్మించే విషయంలో పురుషుడు మిక్కిలి అనుకూలుడైపోయి అటుపైన కూడా అలాగే సంచరించరాదు. తన సహజమైన బింకాన్ని విడిచి పెట్టకూడదు. అంటే పురుషుడు, కాంతకు మరీ దాసుడు కాకూడదు. అలా అని మరీ బెట్టు చూపకూడదు. మరీ దాసుడైతే మగవాణ్ణి నిర్లక్ష్యం చేస్తుంది మగువ. మరీ బెట్టు చూపుతూ ప్రతికూలంగా వుంటే, ఆ పురుషుడంటేనే విరక్తి చెందుతుంది. అంచాత ఏదీ అతికాకుండా జాగ్రత్తగా, తెలివిగా మధ్యరకంగా ప్రవర్తించే యువకుడు, యువతి మనస్సును జయించగలుగుతాడు.

*42. ఆత్మనః ప్రీతిజననం యోషితాం మానవర్ధనం,*
*కన్యావిస్రంభణం వేత్తి యః స తాసాం ప్రియో భవేత్.*

*43. అతిలజ్జాZన్వితే త్యేవం యస్తు కన్యా ముపేక్షతే:*
*సోZనభిప్రాయ వేదీతి పశువత్పరిభూయతే.*

*44. సహసా వాZప్యుపక్రాంతా కన్యాచిత్తమవిందతా,*
*భయం విత్రాసముద్వేగం సద్యో ద్వేషం చ గచ్ఛతి.*

*45. సా ప్రీతి యోగమప్రాప్తా తేనోద్వేగేన దూషితా,*
*పురుషద్వేషిణీ వా స్యాద్విద్విష్టా వాతతో Zన్యగా.*

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే కన్యా సంప్రయుక్తకే*
*తృతీయేకరణే కన్యా విస్రంభణం నామ ద్వితీయోZధ్యాయః*

ఇంతకూ ఈ కన్యా విస్రంభణం వల్ల ఉపయోగం ఏమిటో ఇక్కడ చెపుతున్నారు. ఇది ప్రణయం వృద్ధి కావడానికి కారణం అవుతుంది. పైన చెప్పిన ఉపచారాలున్న స్త్రీలో అభిమానం వృద్ధి పొందడానికి ఉపకరించేవి కాబట్టి, పాతివ్రత్యాన్ని పరిరక్షిస్తాయి కూడా. ఈ అధ్యాయం కన్యల విషయంలోనూ, తక్కిన తరుణుల విషయంలోనూ ప్రత్యేకంగా చెప్పబడింది. అంచాత ఇందలి వాస్తవాన్ని చక్కగా గ్రహించి పురుషులు తెలివిగా వీటిని అనుసరిస్తే అలాంటి పురుషులు మగువలకు మిక్కిలి ప్రీతి పాత్రులవుతారు. పిండితార్థం ఏమంటే, మగువల మనస్తత్వాన్ని గ్రహించి ప్రవర్తించాలి పురుషుడు. అంతేకాని, కాంత బెదిరిపోయేలాగా, అసహ్యం పుట్టేలాగా, మొరటుగా, మూర్ఖంగా ప్రవర్తించరాదు. అలా చేస్తే స్త్రీకి ఉపేక్ష కలుగుతుంది. స్త్రీల చిత్తవృత్తిని గ్రహించలేని అనాగరకుడని భావించి ఆమె, పురుషుణ్ణి తృణీకరిస్తుంది, పరాభవిస్తుంది. కన్యను ఎప్పుడూ కూడా పురుషుడు బలాత్కరించి రతికి ఉపక్రమించకూడదు. అలా చేస్తే ఆమె భయపడుతుంది. మనోవ్యథ

పొందుతుంది. పురుషుణ్ణి ద్వేషిస్తుంది కూడా. అలాంటి ద్వేషం ప్రారంభంలోనే స్త్రీ మనస్సులో అంకురించిందీ అంటే అది ఎప్పటికీ పోదు. జీవితాంతం ఆ పురుషుణ్ణి ద్వేషిస్తుంది, లేదా మరో పురుషుడి సంగమాన్ని అపేక్షిస్తుంది.

**ఇది వాత్స్యాయన ముని రచించిన కామసూత్రాల్లో కన్యాసంప్రయుక్తకాధికరణంలోని కన్యావిస్రంభణం అనే రెండో అధ్యాయం.**



# తృతీయాధ్యాయం
## బాలోపక్రమం

వరణ విధానం ద్వారా లభ్యమైన కన్యను విస్రంభణం చేసే పద్ధతి - ఇంతకు ముందు చెప్పడం జరిగింది. ఇక, అలా లభ్యం కాకుండా ఉన్న కన్యను గాంధర్వాది విధానాల్లో వివాహమాడే పద్ధతిని గురించి ఇక్కడ చెపుతున్నారు.

1. *ధనహీనస్తు, గుణయుక్తోఽపి, మధ్యస్థగుణో, హీనాపదేశో వా, సధనో వా, ప్రాతివేశ్యో, మాతా, పితా, భ్రాతృషు చ, వరతంత్రో బాలవృత్తి రుచిత ప్రవేశో వా, కన్యా మలభ్యత్వాన్న వరయేత్.*
2. *బాల్యాత్ప్రభృతి చైనాం స్వయమేవానురంజయేత్.*
3. *తథాయుక్తశ్చ మాతులకులానువర్తీ దక్షిణాపథే బాల ఏవమాత్రా చ వియుక్తః పరిభూతకల్పో ధనోత్కర్షాదలభ్యాం మాతులదుహితరం, అన్యస్మై వా పూర్వదత్తాం సాధయేత్.*
4. *అన్యామపి బాహ్యాం స్పృహయేద్బాలాయా మేవం సతిధర్మాధిగమే సంవననం శ్లాఘ్యమితి ఘోటక ముఖః*

వరుడు మంచి వంశంలో పుట్టినవాడు, రూపవంతుడు, గుణవంతుడు, విద్యావంతుడు అయి ఉన్నప్పటికీ ధనం లేనివాడైతే తక్కువ వాడుగానే పరిగణింపబడతాడు.

గుణవంతుడైనా, కులం తక్కువ వాడైతేనూ, ధనహీనుడై ఉండి, సరిహద్దులకు సంబంధించిన పోరాటాల్లో చిక్కుకుని ఉన్నట్లయితేనూ, తల్లిదండ్రుల, తక్కిన పెద్దల అదుపాజ్ఞల్లో ఉంటున్నవాడై ఉచిత ప్రవేశం కలిగి ఉన్నా కూడా బాలుడు కావడంచేతనూ, కన్యను వరణవిధానం ద్వారా పొందడానికి అవకాశం ఉండదు. అలాంటివారు చిన్నతనం నుంచే కన్యను స్వయంగా రంజింపజేయడానికి ప్రయత్నించాలి. అప్పుడు ఆ అమ్మాయి అనురాగరక్తురాలైతే గాంధర్వ విధిని స్వయంగా పెళ్ళాడడానికి సిద్ధపడుతుంది. అంచాత బాలికలను రంజింపజేసి, ఆకట్టుకునే విధానాలు చెపుతున్నారు శాస్త్రకారులు. ఈ పద్ధతులు పలురకాలుగా ఉన్నాయి. దక్షిణదేశంలో సాధారణంగా జరిగే విషయం ఒకటి ఉంది. బాల్యంలోనే తల్లిలేని పిల్లవాడైతే, మేనమామల ఇంట్లో పెరుగుతాడు. ఆ మేనమామ కూతురు, అంతక మునుపే మరొకరికి వాగ్దత్తం చేయబడినదైనా సరే, ఆమెనే వశపరచుకుంటాడు. అదే విధంగా పైన పేర్కొన్న తక్కినవారు కూడా సాధించవచ్చు. ఒకవేళ పరాయి సంబంధపు పిల్ల అయినా సరే, రంజన విధానంతో లోబరుచుకోవాలి.

ఇలా బాల్యం నుంచీ పరిచయం పెంచుకుని, రంజన విధానంతో చేసుకున్న వివాహమే ఉత్తమమైందని ఘోటకముఖుడనే శాస్త్రజ్ఞుడి అభిప్రాయం. ఇలాంటి పెళ్ళిళ్ళు గాంధర్వ వివాహాలనే పేరుతో ధర్మబద్ధమైనవిగా పెద్దలు అంగీకరిస్తున్నారు.

5. తయా సహ పుష్పావచయం, గ్రథనం, గృహకం,
దుహితృకాక్రీడా యోజనం, భక్తపాక కరణం,
ఇతి కుర్వీత పరిచయస్య వయసశ్చానురూప్యాత్.

6. ఆకర్షక్రీడా, పట్టికాక్రీడా, ముష్టిద్యూతక్షుల్లకాది ద్యూతాని,
మధ్యమాంగుళి గ్రహణం, షట్పాషాణ కాదీని చ దేశ్యాని
తత్సాత్మ్యాత్తదాప్తదాన చేటికా, ధిస్తస్యాశ్చ సహానుక్రీడేత.

7. క్ష్వేడితకాని సునిమీలితికా, మారబ్ధికాం, లవణ వీథికా
మనిలతాడితికాం, గోధూమపుంజికా, మంగుళితాడితికాం
సఖీభిరన్యాని చ దేశ్యాని.



పైన చెప్పినట్లుగా చిన్నప్పటినుంచీ కన్యలను రంజింప చేయడానికి ఉపక్రమించే వరులు రెండురకాలు. ఒకడు బాలుడు. మరొకడు యువకుడు. వీరిద్దరిలో మొదటి వరుని విధానం చెపుతున్నారు - బాలికతో కలిసి మెలిసి తిరుగుతూ, మాట్లాడుతూ, పూలు కొయ్యడం, బొమ్మరిళ్ళు కట్టడం, కొయ్యతోనూ, మట్టితోనూ ఆటవస్తువులు తయారుచేయడం, బొమ్మల పెళ్ళిళ్ళు జరపడం - ఇలాంటివన్నీ సాగించాలి. దీన్నే దుహితృక్రీడ అంటారు. అన్నం వండడం లాంటి ఇంటిపనులలో బాలనాయకుడు తనకు ఈడు, జోడు గల నాయికతో బాగా పరిచయం సంపాదించుకోవాలి. పైన చెప్పిన బాల్యానికి ఉచితమైన క్రీడలన్నీ చేపట్టాలి.

ఈ ఆటలు ఇంకా అనేకం ఉన్నాయి. ఆకర్షక్రీడ, పట్టికాక్రీడ, ముష్టిద్యూతం, షట్పాషాణకం, క్ష్వేళితకం, సునిమీలితకం, అరబ్ధికం, లవణవీధిక, గోధూమపుంజిక, అంగుళితాడితక, మండూకిక, ఏకపాదిక మున్నగునవి ఆ క్రీడలు.

*1. ఆకర్షక్రీడ:* పిల్లలు రెండు జట్లుగా ఏర్పడి, ఒక పొడుగాటి గుడ్డను మెలిపెట్టి దాని రెండు కొసలూ రెండు జట్లువారూ చెరి ఒకవైపు పట్టుకుని లాగడం.

*2. పట్టికా గ్రథనం:* కళ్ళకు గంతలు కట్టుకుని, ఒకరినొకరు కనుక్కోడం. చిత్రవిచిత్రాలైన కళ్ళకు మూసే గంతలు తయారుచేసి ఆటలాడడం అనికూడా చెపుతున్నారు.

*3. ముష్టిద్యూతం:* ఒకరు పిడికిలితో ఆడుకునే కాయలు గుడ్డచాటున పట్టుకుని, తీసిచూపిస్తే, ఇవతలివారు ఆ కాయలు ఎన్నో లెక్క చెప్పడం.

*4. అంగుళి గ్రహణం:* ఒకరు తన చేతివ్రేళ్ళు, ఒకదాని తరువాత ఒకటి త్వరత్వరగా మార్చి చూపుతూవుంటే, రెండవవారు నడిమి వ్రేలు పట్టుకోడం.

*5. షట్పాషాణకం:* చిన్న చిన్న రాళ్ళు ఒకరు చేతి వ్రేళ్ళపైన మణికట్టుపైన, మోచేతి పైన మున్నగుచోట్ల పెట్టుకుని ఒక్కొక్క రాయి పైకి ఎగురవేస్తూ క్రింద పడకుండా పట్టుకోడం.

*6. క్ష్వేళితకం:* పిల్లలకు శరీర వ్యాయామం కోసం కల్పించబడిన ఆట.

*7. సునిమీలితికం:* దాగుడుమూతల వంటిదే ఈ ఆట. అయితే మొదట దొంగను ఎంపిక చేయడంలో దాగుడుమూతలకు దీనికీ కాస్త తేడా ఉంది.

*8. లవణవీధిక:* కొందరు పిల్లలు చెట్టాపట్టాలు పట్టుకుని గుండ్రంగా నిలుచుని ఉంటే, వాళ్ళ చేతుల సందుల్లోనుంచి ఒకరు ప్రవేశించి 'ఇది ఏ వీధి' అని ప్రతిఒక్కరి చేతిసందు దగ్గరికి వచ్చి అడుగుతూ లోపల్నుంచి బయటికి పోవడానికి ప్రయత్నించడం. ఈ ఆటలో చెట్టాపట్టాలు పట్టుకుని ఉన్న పిల్లలు 'ఇది మురుగుదొడ్డి' లేదా 'మరుగుదొడ్డి' అనిగాని సమాధానం చెపుతూ, లోపలికి వచ్చిన పిల్లలను ఏడిపిస్తారు. ఎవరైనా ఏదో పరధ్యానంగా ఉండి 'ఇది మంచి దొడ్డి' అని సమాధానం చెపితే వారు దొంగ అన్నమాట!

*9. గూధూమ పుంజిక:* అంటే కొన్ని గోధుమలు కుప్పగా పోసి, పిల్లలంతా దాని చుట్టూ చేరి ఒక్కొక్కరు ఒక్కొక్క బంగారు నాణెం ఆ కుప్పలో పడేస్తారు. తరువాత ఒకరు ఆ కుప్పను కలుపుతారు. అటుపైన ఎంతమంది పిల్లలుంటే అన్ని కుప్పలు చేస్తారు గోధుమల్ని. ఒక్కొక్కరు ఒక్కొక్క కుప్పలో వెతగ్గా ఎవరి కుప్పలో అయితే, నాణెం కనిపించకపోతే వారు ముందు తెచ్చిన నాణెంకాక అదనంగా మరొక నాణెం ఇవ్వవలసిఉంటుంది.

*10. అంగుళితాడితికం:* అంటే పిల్లలు గుంపుగా చేరి ఒకర్ని దొంగగా నిర్ణయిస్తారు. కళ్ళు మూసుకోమంటారు. అలా కళ్ళు మూసుకున్నవారి ముక్కును

ఒక్కొక్కరు వేలితో తాకుతూ, 'నా పేరేమిటో కనుక్కో' మంటారు ఆ దొంగ కనుక్కోవాలి.

*11.* మండూకిక: అంటే కప్ప ఎగిరినట్లు ఎగరడం.

*12.* ఏకపాదిక: అంటే కుందడం (ఇలా ఒక కాలితో కుంటుతూ గళ్ళు గీసి పిల్లలు ఇప్పుడూ ఆడుతుంటారు).

*8.* *యాంచ విశ్వస్యామస్యాం మన్యతే తయా*
*నహ నిరంతరాం ప్రీతిం కుర్యాత్, పరిచయాచ్చ బుధ్యేత.*

*9.* *ధాత్రేయికాం చాస్యాః ప్రియహితాభ్యాం అధిక ముపగృహ్ణీయాత్,*
*సా హి ప్రియమాణా విదితా కారాపి అప్రత్యాదిశంతీ*
*తం తాం చ యో జయితుంశక్నుయాదనభిహితాऽపి ప్రత్యాచార్యకం.*

*10.* *అవిదితాకారాऽపి హి గుణానేవ అనురాగాత్ప్రకాశయేత్,*
*యథా ప్రయోజ్యాऽనురజ్యేత.*

*11.* *యత్ర యత్ర చ కౌతుకం ప్రయోజ్యాయాస్తద నుప్రవిశ్య సాధయేత్.*

*12.* *క్రీడనకద్రవ్యాణి యాన్య పూర్వాణి యాన్యన్యా సాం*
*విరళశో విద్యేరన్ తాన్యస్యా అయత్నే న సంపాదయేత్.*

*13.* *తత్ర కందుకమనేకభక్తిచిత్ర మల్పకాలాంతరిత*
*మన్యదన్యచ్చ సందర్శయేత్, తథా సూత్రదారు గవలగజదంతమయీ*
*దుహితృకా మధూచ్ఛిష్ట పిష్టమృణ్మయీశ్చ.*

*14.* *భక్తపాకకార్యమస్యా మహానసికస్య చ దర్శనం*
*కాష్ఠమేఢ్రకయోశ్చ, సంయుక్తయోః స్త్రీ పుంసయోరజైడకానాం*
*దేవకులగృహకానాం మృదిదళ కాష్ఠవినిర్మితానాం*
*శుకపరభృతమదనసారికా లావకకుక్కుటతిత్తిరి పంజరకాణాం*
*వీణికానాం, పిండోలికానాం, పటోలికానాం*
*అలక్తక మనశ్శిలా హరితాళహింగుళక శ్యామమవర్ణ కాదీనాం,*
*తథా చందనకుంకుమయోః పూగఫలానాం పత్రాణాం*
*కాలయుక్తానాం, చ శక్తివిషయే ప్రచ్ఛన్నం దానం, ప్రకాశద్రవ్యాణాం చ*
*ప్రకాశం, యథా చ సర్వాభిప్రాయసంవర్ధకం ఏవం మన్యేత తథా ప్రయతితవ్యం.*

*15.* *వీక్షణేచ ప్రచ్ఛన్నమర్థయేత్, తథా కథాయోజనం.*

*16.* *ప్రచ్ఛన్నదానస్య తం కారణమాత్మనో గురుజనాద్భయం*
*ఖ్యాపయేత్, దేపస్య చాన్యేన స్పృహణీయత్వమితి.*

*17.* *వర్ధమానానురాగాం చ ఆఖ్యానకే మనః కుర్వతీ*
*మన్వర్థాభిః కథాభిశ్చి త్త హారిణీభిశ్చ రంజయేత్.*

*18.* *విస్మయేషుచ ప్రసజ్యమానాం ఇంద్రజాలైః ప్రయోగైర్విస్మాపయేత్,*
*కళాసు కౌశలినీం తత్కౌశలేన, గీతప్రియాం, శ్రుతిహార్యైర్గీతైః*

*అశ్వయుజ్యామష్టమీ చంద్రకే కౌముద్యాముత్సవేషు*
*యాత్రాయాంగ్రహణే గ్రహచారే వా విచిత్రై రాపీడైః*
*కర్ణపత్రభంగైః సిక్థక ప్రధానైర్వస్త్రాంగులీయక భూషణ*
*దానైశ్చ నో చేద్దోషకరాణి మన్యేత.*

*19.* *అన్యపురుష విశేషాభిజ్ఞతయా ధాత్రేయక యాస్యాః*
*పురుష ప్రవృత్తామ్ చాతుష్షష్టి కాన్యోగాన్ గ్రాహయేత్.*

*20.* *తద్గ్రహణోపదేశేన చ ప్రయో జ్యాయాం*
*రతి కౌశలమాత్మనః ప్రకాశయేత్.*

*21.* *ఉదారవేషశ్య స్వయమనుపహత దర్శనశ్చ స్యాత్.*

*22.* *భావం చ కుర్వతీమింగితా కారైః సూచయేత్.*

*23.* *యువతయో హి సంసృష్టమభీక్ష్ణదర్శనం చ పురుషం*
*ప్రథమం కామయంతే కామయమానా అపి తు నాభి*
*యుంజత ఇతి ప్రాయోవాదః ఇతి బాలోపక్రమాః*

*24.* *తానింగితాకారానగ్రే వక్ష్యామః*

ఇంతకు ముందు సూత్రాలలో బాలోపక్రమణ విషయం చెప్పారు. ఇక యువకుల విషయం చెపుతున్నారిక్కడ.

తనను ప్రేమిస్తున్న యువతితో ఎక్కువ చనువుగల దాసీదాన్ని ముందుగా పరిచయం చేసుకుని, తన పనికి సహాయపడుతుందో, లేదో ముందుగానే తేల్చుకోవాలి యువకుడు. ఆ విధంగా దాసీదాని ద్వారా యువతి మనస్సు ఎలా ఉందో గ్రహించి, తరువాత దాసీదానికి ధనమో, వస్తువో ఏదో ఆశపెట్టి చిత్తశుద్ధితో ఆమె తన పని నెరవేర్చేటట్లు చేసుకోవాలి. అలా దాసీదాన్ని బాగా సంతోషపెడితే, ఆ యువతి ఆ యువకుడి పొందు కోరుతున్న సంగతి అంతకు ముందే తనకు తెలిసి ఉన్నప్పటికీ, ఇతని వద్ద బాగా ధనం పుచ్చుకున్నది కాబట్టి, దాసీది మనస్ఫూర్తిగా పనిచేసి పెడుతుంది. యువతికి తగు మాటలు చెప్పి, ఆమెలో గల భయాన్ని, సిగ్గును పోగొట్టి యువకుడితో కలపడానికి గట్టిగా ప్రయత్నిస్తుంది. యువకుడిపై ఆ యువతికి ఎంతో ప్రేమ, అనురాగం కలిగేలాచేస్తుంది.

ఇలాంటి దాసీలు లేదా తార్పుడుకత్తెలు యువతి అభిరుచులు, ఇష్టాఇష్టాలు కనిపెట్టుతూ ఆమెనే అనుసరించి ఉండాలి. అలాగే యువకుడు కూడా దాని ద్వారా యువతి అభిరుచులను, కోరికలను తెలుసుకుని, ఆమెకు ఇష్టమైన వస్తువులు, ఆమెకు ఆసక్తి పుట్టించే రకరకాల వింత వింత వస్తువులు, దాసీ ద్వారా ఆమెకు అందజేస్తూ ఉండాలి. ఇలా చేయడం వల్ల తన ప్రియుడు తన కోసం ఎలాంటి అసాధ్యమైన పనులైనా చేస్తాడని, ఎలాంటి అపురూపమైన వస్తువులైనా సంపాదించి పెడతాడని యువతికి బాగా నమ్మకం కలుగుతుంది. రకరకాల రంగుల్లో చిత్ర విచిత్రంగా తయారైన బంతులు, స్త్రీలకు ఇష్టమైన దారపు అల్లికలు, దంతాలతో, కొయ్యలతో, కొమ్ములతో మైనంతో తయారైన రకరకాల బొమ్మలూ, ఆటవస్తువులూ,

అలాగే కమ్మని పిండివంటలు మొదలైన తినుపదార్థాలు యువకుడు దాసీ ద్వారా యువతికి పంపాలి. దాసీ వాటిని తీసుకుపోయి యువతికి అందజేస్తూ, అతన్ని గూర్చి గొప్పగా పొగడ్తలతో ఆమెకు చెపుతూ ఉండాలి. దాసీకూడా లోకజ్ఞానం గలదై ప్రవరిస్తూ శృంగార సంబంధమైన విషయాలు యువతికి చెపుతూ, మేకలు, పొట్టేళ్ళు మున్నగు జంతువులు, పిచ్చుకలు మొదలైన పక్షులు మైథునక్రియ సాగించడాన్ని సూచించే బొమ్మలు, మట్టితో, కొమ్ములతో, వెదురుతో చేసిన చిలుక పంజరాలు, కోయిలలు, మదన సారికలు, లావక పిట్టలు, మున్నగు పక్షుల గూళ్ళు, కోళ్ళ బుట్టలు, తిత్తిరిపక్షుల పంజరాలు దాసీది తీసుకునివచ్చి యువతికి చూపిస్తూ ఉండాలి. అంతేకాకుండా, చిత్ర విచిత్రమైన శంఖాలు, ముత్యపుచిప్పలు, మైనంతో, కొయ్యతో, వెదురుతో చేసిన నీటిపాత్రలు, వేణువులు, లత్తుక, మణిశిల, అర్ధళము, హింగుళకం, శ్యామవర్ణం మొదలయిన రంగులతో చిత్రించిన బొమ్మలు, నగలు భద్రపరచుకునే పెట్టెలు, చందనం, కుంకుమపువ్వు, వక్కలు, ఆకులు - ఇలాంటివన్నీ దాసీది తీసుకునివచ్చి యువతికి చూపిస్తూ ఉండాలి. ఇంకా ఇలాంటివే రహస్యంగా ఇచ్చే వస్తువులు సామాన్లు యువతికి రహస్యంగానే అందజెయ్యాలి. బహిరంగంగా ఇచ్చే వస్తువులు బహిరంగంగానే అందజెయ్యాలి. దాసీదాని ద్వారా ఇలా రకరకాల వస్తువులు, తరుచుగా అందజేస్తూ ఉంటే ఈ పురుషుడు నన్ను బాగా సుఖపెడతాడని యువతికి నమ్మకం ఏర్పడుతుందన్నమాట. మధ్య మధ్య యువతిని ఏదో నెపంమీద చూచే అవకాశం కల్పించుకోవాలి యువకుడు - దాసీ కూడా ఇలాంటి అవకాశం వీరిద్దరికీ కల్పించాలి. యువతీయువకులు స్వేచ్ఛగా మనస్సులు విప్పి మాట్లాడుకోడానికి వీలు చిక్కించుకోవాలి. 'నాకు ఈ వస్తువులన్నీ ఎందుకు పంపుతున్నారు?' అని - యువతి అడిగితే, పెద్దలంటే, తనకు గల భయభక్తులను గురించి తెలియచెప్పాలి. లేదా ఈ వస్తువులు ఇతరుల ఆశిస్తున్నారు, అందుచేత రహస్యంగా ఇస్తున్నానని కూడా చెప్పవచ్చు. ఈ విధంగా యువతికి తనపై అనురాగం అంతకంతకూ వృద్ధి పొందేలా ప్రవర్తిస్తూ ఆమెకు నచ్చేలా శకుంతల, మొదలైన ఉత్తమ నాయికల కథలను వర్ణించి చెపుతూ ఉండాలి. ఇంకా నాయిక ఇష్టాన్ని, అభిరుచిని కనిపెట్టి ఇంద్రజాల ప్రదర్శనలు; కళాప్రదర్శనలు, గానకచేరీలు, అష్టమీ చంద్రకారులైన కౌముదీ ఉత్సవాలు, యాత్రలు మొదలైన వాటితో యువతిని రంజింపజెయ్యాలి. అలాగే దాసీ అనుభవజ్ఞురాలు, లోకంలో ఇతర పురుషులను గురించి తెలిసినది కాబట్టి వారి గుణగణాలు, ప్రవర్తనను గురించి, అరవై నాలుగు యోగాలను గురించి బోధించాలి. ఆమె బోధల ద్వారానే యువకుడు యువతితో తనకు గల రతిక్రీడా కౌశలాన్ని గురించి చెప్పించాలి. యువకుడు ఎల్లప్పుడూ గంభీరమైన, ఆకర్షకమైన వేషంలో ఉంటూ ఉండాలి. తనకైతాను ఎప్పుడూ యువతికి కనిపించకూడదు. ఇలా ప్రవర్తిస్తూ యువతికి తనపై అనురాగం స్థిరమైనట్లు గ్రహించిన పిమ్మట, తన మనోభావాన్ని మెల్లగా ఎరుకపరచాలి.

ఇక్కడ పురుషుడి వేషం ఆకర్షకంగా, గంభీరంగా వుండాలని చెప్పడానికి ముఖ్యకారణం ఉంది. యువతులు, పడుచుపిల్లలు క్షతయోనులుగా ఉన్నప్పుడు, తమతో కలిసిమెలిసి తిరుగుతూ తమకు సంతోషాన్ని కలిగించే యువకులనే మొదట కోరుకుంటారు. కాని అలా కామించిన వెంటనే వారిని పొందడానికి ఒప్పుకోరు - లోకంలో ప్రతీతిగా ఉన్న మాట ఇది.

ఈ పైన పేర్కొన్నవన్నీ పెళ్ళికాని బాలికలకు ఉపక్రమించే పద్ధతులు. ఇక ఇప్పుడు ఇంగితాకారాలు చెప్పబోతున్నారు వాత్స్యాయనులు.

25. సంముఖం న వీక్షతే తంతు వీక్షితా వ్రీడాం ధర్మయతి.

26. రుచ్యమాత్మనోఽంగమ దేశేన ప్రకాశయతి.

27. ప్రమత్తం ప్రచ్ఛన్నం నాయకం అతిక్రాన్తం చ వీక్షతే

28. పృష్టాచ కించిత్సస్మిత మవ్యక్తాక్షరం అనవసితార్థం
చ మందం మందమధోముఖీ కథయతి.

29. తత్సమీపే చిరం స్థానమభినందతి

30. దూరేస్థితా పశ్యతు మామితి మన్యమానా పరి జనం
సవదనవికార మాభాషతే, తం దేశం న ముంచతి

31. యత్కించిద్దృష్ట్వా విహసితం, కరోతి,
తత్రకథామవస్థానార్థ మనుబధ్నాతి.

32. బాలస్యాంకగత స్యాలింగనం, చుంబనం చ కరోతి
పరిచారికాయాస్తిలకం చ రచయతి.

33. పరిజనానవష్టభ్య తాస్తాశ్చ లీలా ధర్మయతి.

34. తన్మిత్రేషు విశ్వసితి వచనం చైషాం బహుమన్యతే కరోతి చ.

35. తత్పరిచారికైః సహ ప్రీతిం సంకథాం ద్యూతమితి చ కరోతి.

36. స్వకర్మసు చ ప్రభవిష్ణు రివైతాన్ని యుంక్తే.

37. తేషు చ నాయకసంకథామన్యస్య కథయత్సు వహితా తాం శృణోతి.

38. ధాత్రేయికయా చోదితా నాయకస్యోదవసితం ప్రవిశతి.

39. తామంతరాకృత్వా తేన సహ ద్యూతం
క్రీడన మాలాపం వా యోజయితుమిచ్ఛతి.

40. అనలంకృతా దర్శనపథం పరిహరతి.

41. కర్ణపత్ర మంగుళీయకం స్వయం వాతేన యాచితా
సధీరమేవగాత్రాదవతార్య సఖ్యాః హస్తేదదాతి తేన చ దత్తం నిత్యం ధారయతి.

42. అన్యవరసంకథాను విషణ్ణాభవతి,
తత్పక్షకైశ్చ సహన సంసృజ్యత ఇతి.

సాధారణంగా ఒక యువకుడిపై మోజుగల యువతి, ఆ యువకుడికి తన అభిప్రాయాలను, మనోభావాలను ఆకారాదుల ద్వారా తెలుపుతుంది. అంటే ముఖకవళికలు, వలపులు చిమ్మే క్రీగంటి చూపులు మొదలైన చేష్టల ద్వారా తన ప్రేమానురాగాలను సూచిస్తుందన్నమాట.

అలాంటి యువతి, తన ప్రియుడు హఠాత్తుగా ఎదురైతే, సిగ్గుతో తల వాల్చుకుంటుంది. అంతేకాని తల ఎత్తి తదేకంగా చూపు నిలిపి ఎన్నడూ చూడదు. ఒకవేళ చూచినా, తల వాల్చుకునే ఓరకంట చూస్తుంది. అంతేకాదు తనకు ఎక్కువ ఇష్టమైన, అలంకార ప్రియమైన అవయవాన్ని - అంటే చన్నులనో, బాహువులనో చమత్కారంగా, వయ్యారంగా పమిట సర్దుకునే నెపంతో తన సొగసుగాడికి కనిపించేలా చేస్తుంది. తన జతగాడు హఠాత్తుగా ఎదురైనప్పుడుగాని, ఏదైనా పనులలో నిమగ్నమై ఉన్నప్పుడుగాని, ఒంటరిగా ఉన్నప్పుడుగాని, ఎంతో దూరంగా నిలుచుని ఉన్నప్పుడుగాని, అతని దృష్టినీ, మనస్సునూ తనవైపు మళ్ళించుకునే తలంపుతో ఆమె ఎదురుచూస్తూ నిలుచుంటుంది. తన ప్రియుడు పలకరిస్తే, తన ప్రేమను తెలిపే విధంగా ముసిముసి నవ్వులు నవ్వుతూ ముఖం వాల్చుకుని, చాలా నెమ్మదిగా వినిపించీ, వినపించనట్లుగా, చెప్పీ, చెప్పనట్లుగా, ఏదో చెపుతూ ఉంటుంది. ఏదో వంక పెట్టుకుని తన ప్రియుడి సమక్షంలోనే కొంతసేపు నిలుచోడానికి తహతహలాడుతుంది. తాను దూరాన ఉండి కూడా తన మానసచోరుడు తనను చూడాలన్న అభిలాషతో, తన చెలులతోనో, పరిజనులతోనో కళ్ళూ, ముక్కు, ముఖమూ రకరకాలుగా త్రిప్పుకుంటూ మాట్లాడుతుంది. కాని, ఎంతసేపటికీ ఆ ప్రదేశం విడిచిపెట్టి వెళ్ళదు. అక్కడేవుండి దేన్నో చూచి నవ్వుతుంది. తన పరిజనులతో ఏవేవో కథలు, కబుర్లు చెపుతూ కొంతసేపు కాలక్షేపం చేస్తుంది. ఎవరి దగ్గరైనా ఉన్న పసిబిడ్డలను అందుకొని తన తొడమీద కూచోబెట్టుకుంటుంది. ఆ బిడ్డను పదే పదే ముద్దాడుతుంది. పలుమార్లు పమిట సవరిస్తుంది. తన పరిచారికకు తిలకం దిద్దుతుంది. తన చెలులను ఆనుకుని, ఏవేవో చేష్టలు చేస్తుంది. అంతేకాకుండా తన భర్తయొక్క పరిచారికపై ఎక్కువ నమ్మకం పెట్టుకుంటుంది. ఆ పరిచారిక ఏది చెప్పినా వింటుంది. దాన్ని ఎంతగానో ప్రేమిస్తూ, దాంతో ఉత్సాహంగా మాట్లాడుతూ వుంటుంది. తన స్వంత పనులన్నిటికీ ఆ దాసీనే పంపుతూ ఉంటుంది. ఆమెకు తానే రాణి అన్నట్లు ప్రవర్తిస్తూ వుంటుంది. తన ప్రియుడి విషయాలు, పరిచారికలు ఎవరితోనైనా చెపుతూ ఉంటే అమిత ఆసక్తితో వింటూవుంటుంది. తన చెలి ప్రేరేపిస్తే, ప్రియుడి ఇంట్లోకి వెళ్ళడానికి కూడా వెనుకాడదు. చెలికత్తెను అడ్డం పెట్టుకుని ప్రియుడితో జూదం ఆడుతుంది కూడా. అతనితో మాట్లాడాలని ఉబలాటపడుతుంది. చక్కగా అలంకారాలు చేసుకోకుండా ఎప్పుడూ తన ప్రియుడి కంటపడదు. తన చెవి కమ్మనుగాని, కర్ణపత్రాన్ని గాని, మెడలోని పుష్పహారాన్ని గాని, వ్రేలి ఉంగరాన్ని గాని, ప్రియుడు అడిగితే వెంటనే తన ఒంటిమీదినుంచి

తీసి చెలికత్తె ద్వారా అతనికి ఇస్తుంది. అతడు ఏదైనా ఇస్తే దాన్ని ఎల్లప్పుడూ ధరిస్తూ వుంటుంది. పరపురుషుణ్ణి గురించి ఎవరైనా ఏదైనా చెపుతూవుంటే, వినడానికి అయిష్టతను సూచిస్తుంది. తన ప్రియుణ్ణి తప్ప, తక్కిన పురుషులతో సహవాసం చేయడానికి ఎంతమాత్రం అంగీకరించదు.

*43. దృష్ట్వైతాన్భావసంయుక్తాన్ ఆకారానింగితాని చ కన్యాయాః*
*సంప్రయోగార్థం తాంస్తాన్యోగాన్ప్రయోజయేత్.*

*44. బాలక్రీడనకైర్బాలా కళాభిర్యౌవనేస్థితా వత్సలా చాపి*
*సంగ్రాహ్యా విశ్వాస్యజన సంగ్రహాత్.*
*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే కన్యాసంప్రయుక్తకే*
*తృతీయేఽధికరణే బాలోపక్రమా, ఇంగితాకారసూచనం చ తృతీయోఽధ్యాయః*

ఇక పై రెండు అధ్యాయాలలో సారాంశాన్ని చెపుతున్నారు. ఈ అధ్యాయంలో చెప్పిన భావయుక్తమైన ఆకారాలు ఇంగితాలు బాగా పరీక్షించుకుని, యువతి తనపై ప్రేమానురాగాలు కలిగి ఉన్నట్లు ధ్రువపడితే, ఆ తరువాత ఆమెతో సంప్రయోగం జరపడానికి, అందుకు సంబంధించిన ఆయా యోగాలు అనుసరించాలి. ఇక్కడ సంప్రయోగం అంటే గాంధార్వ వివాహం అని భావం. సాధారణంగా కన్యలు బాల, తరుణి, ప్రౌఢ, - అనే భేదాలతో మూడు రకాలుగా ఉంటారు. బాలను పైన పేర్కొన్న బాల క్రీడనకాల ద్వారా వశపరచుకోవాలి. తరుణిని లేదా యువతిని చతుష్షష్టి కళల ద్వారా వశపరచుకోవాలి. ఇక ప్రౌఢను - నమ్మకస్థురాలైన దాసీదాని ద్వారా ఉపక్రమించాలి. ఇంగితాకార సూచన విధానం అంటే ఇదే.

**ఇది వాత్స్యాయన ముని విరచిత కామసూత్రాల్లో కన్యాసంప్రయుక్త కాధికరణంలో బాలోపక్రమం ఇంగితాకార సూచనం అనే మూడో అధ్యాయం.**



# చతుర్థాధ్యాయం
# ఏకపురుషాభియోగం

1. దర్శితేంగితాకారాం కన్యాముపాయతో౽భి యుంజీత.
2. ద్యూతే క్రీడనకేషు చ వివదమానః సాకారమస్యాః పాణిమవలంబేత.
3. యథోక్తం చ స్పృష్టకాదికమాలింగన విధిం విదధ్యాత్.
4. పత్రచ్ఛేద్యక్రియాయాం చ స్వాభిప్రాయసూచకం
మిథునమస్యా దర్శయేత్.
5. ఏవమన్యద్విరళశో దర్శయేత్.
6. జలక్రీడాయాం తద్దూరతో౽ప్సునిమగ్నః సమీప
మస్యాగత్వా స్పృష్ట్వైనాం తత్రైవోన్మజ్జయేత్.
7. నవపత్రికాదిషు చ సవిశేష భావనివేదనం.
8. ఆత్మదుఃఖస్య అనిర్వేదన కథనం.
9. స్వప్నస్య చ భావయుక్తస్య అన్యాపదేశేన.
10. ప్రేక్షణకే స్వజనసమాజే వా సమీపోపవేశనం తత్రాన్యాపదిష్టం స్పర్శనం.
11. అపాశ్రయార్థం చ చరణేన చరణస్య పీడనం.

ఇంతకు ముందు అధ్యాయంలో తెలిపినట్లుగా ఇంగితాకారంలో తన ప్రేమానురాగాలు వ్యక్తం చేసిన కన్యకను ఉపాయంగా సమకూర్చుకోవాలి. యువకుల్లో నాయకులు రెండు రకాలుగా ఉంటారు. నిస్సహాయులు, సహాయులు - నిస్సహాయులంటే ఎవరి సహాయం లేనివారు. అంటే ఎవరి సహాయంతో నిమిత్తం లేకుండా తమంతట తామే నాయికతో పరిచయం సంపాదించుకుని, ఆమెను వశం చేసుకోగలవారు. ఇక సహాయులంటే ఎవరో ఒకరి సహాయం ద్వారా కన్యను ఆకర్షించి కైవసం చేసుకోగలవారు. ఏక పురుషయోగం అనే ఈ అధ్యాయంలో ఎవరి సహాయం లేకుండా తమంతట తామే కన్యకను వశపరుచుకోగల వారిని గురించి చెప్పబడుతూ వుంది. ఒక్కొక్కప్పుడు అసహాయులకు కూడా సంభవిస్తూ ఉండే ఈ అభియోగాలు బాహ్యాలనీ, అభ్యంతరాలనీ రెండు విధాలు. మొదట బాహ్యాభియోగాలను గురించి చెపుతున్నారు వాత్స్యాయనులు. జూదం, క్రీడనకం మొదలైన వాటిల్లో కన్యకతో వివాదం పెట్టుకుని, సాభిప్రాయంగా ఆమె చెయ్యి పట్టుకోవాలి నాయకుడు. ఇలా పాణి గ్రహణం చేయడంలో 'ఇతని చేత నేను వివాహం చేసుకోబడినాను' - అన్న భావం కన్యక హృదయంలో కలిగేలా ప్రవర్తించాలన్నమాట. ఇలాంటి సమయాల్లోనే స్పృష్టకం, విద్ధకం, ఉద్ఘృష్టకం,

పీడితరకం - మున్నగువాటిని ప్రయోగించి నాయికను పరవశింప జేయాలి. తన అభిప్రాయాలు తెలియడానికై ఇంకా హంసమిధునాలు - ఆదిగాగల బొమ్మలను అందజేయాలి. మరిన్నీ ఇతర రకాల చిత్రాలు చూపించాలి. ఇలా చేయడం వల్ల నాయకుడు ఎంతో నాగరకుడని భావిస్తుంది నాయిక. అతనంటే ఎంతో కుతూహల పడుతుంది. ఇక జలక్రీడలాడే సమయాల్లో నాయకుడు నాయికను నీళ్ళ ల్లో చాలాదూరం తీసుకుని పోగా, అక్కడ నీళ్ళలో మునిగి, ఈదులాడుకుంటూ వచ్చిన నాయికను చమత్కారంగా తాకాలి నాయకుడు. అప్పుడే పత్రచ్ఛేద్యం మున్నగు దేశీయమైన క్రీడలతో ఆ అమ్మాయిని రంజిం జేయాలి. తను అనుభవిస్తున్న మనోవ్యధను గురించి ఆమెకు చెపుతూ వుండాలి. కాని ఎంత మనోవ్యధ ఉన్నా తను దాన్ని లక్ష్య పెట్టడం లేదని చెప్పాలి. ఏదో నెపం పెట్టుకుని తనకు కలలో వచ్చిన ప్రేమకథలను గురించి చెపుతూ వుండాలి. నీలాంటి రూపం, అందచందాలు, నీ అంత వయస్సు గల అమ్మాయిని కలిసినట్లు నాకు కల వచ్చిందని' ఆమెకు చెపితే, ఆమె నిజమనుకుని పొంగిపోతుంది. బంధుజనులతో గాని స్వజనంతోగాని కూర్చుని గోష్ఠులు జరుపుతున్నప్పుడు యువకుడు, కన్యకకు దగ్గరగా కూచుని, ఏదో మిషమీద ఆమె అవయవాలు తనకు తాకేలా చూడాలి. తన కాలి తో ఆమె కాలిని నొక్కడం లాంటి చేష్టలు చెయ్యాలి.



*12 తతశ్చన్నకై రేకైకాం అంగులిమభిన్ప్రుశేత్.*

*13. పాదాంగుష్ఠేన చ నఖాగ్రాణి ఘట్టయేత్.*

*14. తత్ర సిద్ధః పదాత్పదమధికమాకాంక్షేత.*

*15. క్షాంత్యర్థం చ తదేవాభ్యస్యేత్.*

*16. పాదశౌచే పాదాంగులినందం శేన తదంగులిపీడనం.*

17. ద్రవ్యస్య సమర్పణ ప్రతిగ్రహే వాతద్గతో వికారః.

18. ఆచమనాంతే చ ఉదకేన ఆసేకః.

19. విజనే తమసి చ ద్వంద్వమాసీనః క్షాంతిం కుర్వీత సమానదేశయ్యాయాం చ.

20. తత్ర యథార్థమనుద్వేజయంతో భావనివేదనం.

21. వివిక్తే చ కించిదస్తి కథయితవ్యమిత్త్యుక్త్వా నిర్వచనం,
భావం చతత్రోపలక్షయేత్ యథా పారదారికే వక్ష్యామః

పైన చెప్పినట్లుగా పురుషుడు మెల్లగా తన పాదంతో అమ్మాయి పాదం నొక్కినప్పుడు ఆమె కిమ్మనకుండా, ఇష్టంగా ఉన్నట్లు కనిపిస్తే మెల్లమెల్లగా, ఒక్కొక్క కాలివ్రేలినే తన పాదంతో రుద్దాలి. అలా స్పృశించడంవల్ల ఆమెలో చలనం కలుగుతుంది. తెలియని ఆనందం కలుగుతుంది. అది గ్రహించి పురుషుడు ఆమెకు నెమ్మదిగా చక్కలిగింత పెట్టాలి. ఆతరువాత తొడలు, నడుము, చన్నులు, మొదలైన అవయవాలు క్రమక్రమంగా స్పృశించాలి. ఇవన్నీ బాహ్యాభియోగాలు. అంటే అసలు లోపలి పని లేకుండా, పై పై చేష్టలద్వారా అమ్మాయిని ఆకర్షించి లోబరుచుకునే విధం.

ఇక ఆంతరంగిక అభియోగాలను గురించి చెపుతున్నారు. నాయిక తన కాళ్ళు కడుగుతున్నప్పుడు నాయకుడు తన కాలి వేళ్ళతో ఆమెకాలి వేళ్ళను నొక్కి పట్టాలి. తాంబూలం మొదలైన వస్తువులు గ్రహించే సమయాల్లో, లేదా ఇచ్చే తరుణంలోనూ పురుషుడు, నాయికపట్ల మోహ వికారాలు ప్రదర్శించాలి. ఏదైనా పానీయం కన్యక చేతిలోనుంచి తీసుకునేటప్పుడు, కొంచెం జలాన్ని విలాసంగా ఆమెపైకి చిలకరిస్తూ ఉండాలి.జనం లేనిచోట, చీకట్లోనూ ఆమె ప్రక్కనే శయ్యపై చేరి, రకరకాల చేష్టలు చేస్తూ,వాటిని ఆమె సహించేలా ప్రవర్తించాలి. ఆ సమయంలో ఎలాంటి ఉద్రేకం తెచ్చుకోకూడదు. ఒంటరిగా ఉన్న సమయాల్లో 'మాట' అంటూ అమ్మాయిని పిలిచి, ఆమె తన దగ్గరికి వచ్చిన తరువాత, 'ఏమిటి, పిలిచారు?' అని ఆమె అడిగితే, ఏమాటా బదులు చెప్పకుండా కేవలం మౌనంగా తన భావాన్ని ప్రకటించాలి. ఇంకా ఈ ఇంగితాకార వేదన విధానాన్ని పారదారికాధికరణంలో చెప్పనున్నారు.

22. విదితభావస్తు వ్యాధిమపది శ్యైనాం వార్తాగ్రహణార్థం స్వముదవసితమానయేత్.

23. ఆగతాశ్చ శిరఃపీడనే నియోగః, పాణి మవ లంబ్య
చాస్యాః సాకారం నయనయోః లలాటే చ నిదధ్యాత్.

24. ఔషధాపదేశార్థం చాస్యాః కర్మవినర్ది శేత్.

25. త్వయైవేదం కర్తవ్యం, నహ్యేతాదృశే కన్యాయాః అన్యేన
కార్యమితి గచ్ఛంతీం పునరాగమనాను బంధమేనాం విసృజేత్.

26. అస్య చ యోగస్య త్రిరాత్రం త్రిసంధ్యంచ ప్రయుక్తిః.

27. అభీక్ష్ణదర్శ నార్థమాగతాయాశ్చ గోష్ఠీం వర్ధయేత్.

28. ఆన్యాభిరపి సహ విశ్వాసనార్థం అధికమధికం చాభియుంజీత నతు వాచా నిర్వదేత్.

29. దూరగతభావోఽపి హి కన్యాను న నిర్వేదేన సిద్ధ్యతీత ఘోటకముఖః.

30. యథా తు బహుసిద్ధాం నమన్యేత తదైవోపక్రమేత.

31. ప్రదోషే నిశి తమసి చ యోషితో మందసాధ్వసాః సురతవ్యవసాయిన్యో రాగవత్యశ్చ భవంతి న చ

పురుషం ప్రత్యాచక్షతే, తస్మాత్తత్కాలం ప్రయోజయితవ్యా ఇతి ప్రాయోవాదః.

పైన పేర్కొన్నట్లుగా యువతి మనోభావాన్ని చక్కగా కనిపెట్టి, తనకు కాస్త తలనొప్పిగా ఉన్నదని గాని, లేక మరేదో వంట్లో ఆరోగ్యంగా లేదనిగాని సాకు చెప్పి, ఆమెను తన ఇంటికి రప్పించు కోవాలి. ఆమెతన ఇంటికి వచ్చే వేళకు తాను ముక్కుతూనో, మూలుగుతూనో - ఏదో బాధ పడుతున్నట్లు నటించాలి. అలా నటించి ఆమె రాగానే తన తల పట్టడానికై ఆమెను నియమించాలి. ఏదైనా మందు రాయమని నెపం పెట్టి, ఆ మందు ఏదో నీవే తెలుసుకునీ, నీవుతెస్తే తప్ప, ఈ బాధ నివారణ కాదని, పలుకుతూ, ఆమె పదే పదే తన దగ్గరికి వచ్చేలా చెయ్యాలి. ఆమె పనిమీద వెళ్ళబోతూ ఉంటే, మళ్ళీ వస్తావుకదూ? రాకపోతే నా అవస్థ ఇంతే - అని దీనంగా చెపుతూ, ఆమెకు తనపై ఎక్కడలేని అభిమానం పుట్టేలా ప్రవర్తించాలి. ఇలా మూడు రాత్రులు, మూడు సంధ్యలు చేసి, ఆవిధంగా ప్రేయసి తనను చూడడానికై పదేపదే వచ్చి పోవడం మొదలు పెట్టిన తరువాత, క్రమేణా ఆమెకు కళా శాస్త్రానికి సంబంధించిన కథలు,విషయాలు చెప్పడం ప్రారంభించాలి. తనకు పరిచితమైన ఇతర స్త్రీలచేత కూడా ఆమెకు ఏవేవో మాటలు చెప్పిస్తూ, బాగా నమ్మకం కలిగేలా చెయ్యాలి. అయితే, ఈ అభియోగ విధానం తాను అనుసరిస్తున్నట్లుగానీ, వీటి భావం ఇదీ అని గానీ తాను నోటితో చెప్పకూడదు ఎప్పుడూ. ఈ విషయం ఘోటకముఖుడు ఎంతో చక్కగా చెప్పాడు - తన విషయంలో కన్య ఎంత నమ్మకం కుదుర్చుకున్నదే అయినా, ఆమె విషయంలో నాయకుడు ఎప్పుడూ తొందరపడి మాట్లాడకూడదు. కన్యలు ఎప్పుడూ కూడా అభియోగాల ద్వారా వశం చేసుకోదగినవారుగా ఉంటారు. అంచేత తన విషయంలో యువతి అనేకసార్లు అనుకూలురాలుగా ఉన్నట్లు తేలిన పిదప, అభియోగ క్రియలను ఎక్కువగా ప్రయోగించి, గాంధర్వ విధితో కార్యానుకూలురాలినిగా చేసుకోవాలి.

ఇక ఈ అభియోగాలకు అవసరమైని సమయం నిరూపిస్తున్నారు. సాధారణంగా రతిక్రీడకు అనుకూలపడే అనురాగయుక్తలైన పడతులు ప్రదోషకాలలోనూ, అర్ధరాత్రి వేళలోను ఎవ్వరు చూడరు కాబట్టి, ఎలాంటి భయమూ లేకుండా అనురక్తితో పురుషులకు సులభంగా లొంగిపోతారు. అంచేతనే సమయాన్ని కనిపెట్టి తరుణులు అధిగమింప తగినవారుగా ఉంటారని అనేకులు చెప్పుకుంటూ ఉంటారు.

ఇప్పటిదాకా ఏక పురుషాభియోగాలు చెప్పారు. అంటే పురుషుడు తనంతట తాను అంగనామణిని ఆధీనం చేసుకోడానికి జరపవలసిన అభియోగాలను గురించి చెప్పారన్నమాట.

32. ఏక పురుషాభియోగానాం తు అసంభవే గృహీతార్థయా
ధాత్రేయికయా సఖ్యా వా తస్యామంతర్భూతయా
తమర్థమనిర్వదంత్యా సహైనామంక మానాయయేత్తతో యథోక్తమభియుంజీత.

33. స్వాం వా పరిచారికామాదావేవ సఖీత్వేనాస్యాః ప్రణితధ్యాత్.

34. యజ్ఞే వివాహేయాత్రాయాముత్సవే వ్యసనే ప్రేక్షణకవ్యాపృతే జనే
తత్ర తత్ర చ దృష్టేంగితాకారాం పరీక్షిత భావామేకాకినీముపక్రమేత.

35. నహిదృష్టవచనా దృష్టభావాహి యోషితో దేశే కాలే చ ప్రయుజ్యమానా
వ్యావర్తంత ఇతి వాత్స్యాయనః - ఇత్యేక పురుషాభియోగాః.

36. మందాపదేశా గుణవత్యపి కన్యా ధనహీనా కులీనాZపి
సమానైరయాచ్యమానా మాతాపితృ వియుక్తా వా
జ్ఞాతి కులావర్తినీ వా ప్రాప్తయౌవనా ప్రాణిగ్రహణం స్వయమభీప్సేత.

37. సాతు గుణవంతం శక్తం సుదర్శనం బాల ప్రీత్యాZ భియోజయేత్.

38. యం వా మన్యేత మాతాపిత్రోరనమీక్షయా స్వయమప్యయ
మింద్రియదౌర్బల్యాన్మయి ప్రవర్తిష్యత ఇతి
ప్రియహితోపచారైః అభీక్ష్ణసందర్శనేనచతమావర్జయేత్.

39. మాతా చైనాం సఖీభిర్ధాత్రేయికాభిశ్చ సహ తదభి ముఖీం కుర్యాత్.

ప్రేయసి ఎక్కడో దూరంగా ఉన్నదనుకోండి. అప్పుడు పురుషుడికి ఇతరుల సహాయం అపేక్షించకుండా అభియోగాన్ని పొందటానికి అవకాశం ఉండదు. అంచాత అలాంటి సందర్భాలలో పురుషుడు, తన భావం, తన ప్రియురాలి భావం బాగా తెలిసి ఉన్నదానివల్ల గానీ, లేదా అలాంటి చెలికత్తె వల్లగానీ, ఏ గొడవా లేకుండా ప్రేయసీ ప్రియులను ప్రోత్సహించే మరెవరివల్లనైనా గానీ సంధానం జరిపించి ప్రేయసిని తన దగ్గరకి పిలిపించుకోవాలి. ఆ తరువాత లోగడ చెప్పినట్లుగానే ద్యూతక్రీడా వివాదం మొదలైన విధానాలతో అభియోగాలకు పూనుకోవాలి. లేదా మొట్టమొదటే తన పరిచారికను ప్రేయసికి చెలికత్తెగా సమకూర్చి, దాని ద్వారా తన కార్యం నెరవేర్చుకోవాలి. యజ్ఞయాగాది క్రతువులు, వివాహాలు, యాత్రలు, ఉత్సవాలు, విందులు, వినోదాలు, క్రీడలు మొదలైనవి జరుగుతున్న ప్రదేశాలలో జనులు గుంపులు గుంపులుగా కూడి ఉంటారు కాబట్టి అలాంటి జన సమూహంలో అక్కడక్కడ హావ భావాలతో తన అభిప్రాయాలు సూచిస్తూ, తన పైన మాత్రమే ఆమెకు ప్రేమ ఉన్నదని పరీక్షించి తెలుసుకున్న తరువాత, పురుషుడు ఆమెను గాంధర్వ విధితో పెళ్ళాడవచ్చు.

స్త్రీలు సాధారణంగా తాము ఇష్టపడిన పురుషుడివిషయంలో, అతని మాటలు చేష్టలు, మనస్సు గుర్తించిన తరువాత, అనుకూలములైన సమయాలు, సందర్భాలు దొరికినప్పుడు, ఆ పురుషుడితో కలియడానికి ఇష్టపడతారే కాని వ్యతిరేకించరు.

ఇది వాత్స్యాయనుల సిద్ధాంతం. ఇవన్నీ ఏక పురుషాభియోగాలు. అంటే పురుషుడు మరెవరి సహాయం లేకుండా తనంతటతానే ప్రేయసిని వశపరచుకునే ఉపాయాలన్నమాట. దారిద్ర్యంతో బాధపడే పురుషుడు ఎలా అయితే, ప్రేయసిని సంపాదించుకోడానికి పై విధంగా అనుసరిస్తున్నాడో, అలాగే కన్యక కూడా పై కారణాలవల్ల, ఎవరిచేతా వరింపబడక ఉన్నప్పుడు, స్వయంగానే ప్రియుణ్ణివెదుక్కొని సుముఖుణ్ణిగా చేసుకోవాలి. ఇలాస్త్రీ తనకై తాను పురుషుణ్ణి అన్వేషించి, తనకు అనుకూలుడుగా చేసుకోటాన్ని 'ప్రయోజ్యోపావర్తనం' అంటారు. స్త్రీ తనంతట తానే యధేచ్ఛగా పురుషుణ్ణి వరించవచ్చునని ధర్మ శాస్త్రాలు కూడా ఉద్ఘోషిస్తున్నాయి.

వ్యక్తురాలైన కన్య తనకు తగిన భర్త కావాలని కోరుకోవడంలో తప్పులేదు. కాని అలా ఈడేరిన పిమ్మట మూడు సంవత్సరాల వరకూ వేచి ఉండి, అప్పటికీ తన తల్లిదండ్రులు, లేదా సంరక్షకులు ఎవరూ తనకు పెళ్ళి చేయకుండా ఉపేక్షిస్తున్నా, తనను ఎవరూ వరించకుండా ఉన్నా, తనకు ఈడు - జోడైన భర్తను ప్రయత్నపూర్వకంగా ఆమె వరించవచ్చు. అలా కన్యకలు భర్తలను చేపట్టే సమయంలో, వారు గుణవంతులు, రూపవంతులు, ప్రయోజకులు అవునో కాదో పరీక్షించి తెలుసుకోవాలి. ఆటపాటల సమయాల్లోనూ, తదితర సందర్భాల్లోనూ ఈడు - జోడైన వారిని కలుసుకుంటూ, వారిలో ఎలాంటి ప్రేమ ఉందో తెలుసుకుని, వారిని తనకు అనుకూలంగా చేసుకుని వివాహమాడాలి. అలాగే పురుషుడు తన తల్లిదండ్రుల ఉపేక్షవల్లనో, ఇంద్రియలోపం వల్లనో, తన మీద మోజుపడుతున్నట్లు తెలుసుకుని కన్య, అతనికి హితోపచారాలు చేస్తూ, పదే పదే అతని కంటపడుతూ, అతన్ని వశం చేసుకోవచ్చు. అంతే కాకుండా కన్య తల్లి కూడా తన చెలుల ద్వారానో పరిచారికల లేదా దాదుల ద్వారానో పురుషుడి పరిచయం సంపాదించి కుమార్తె అంటే అతను ఇష్టపడేలా చెయ్యాలి.

*40. పుష్పగంధతాంబూలహస్తాయా విజనే వికాలే చ తదుపస్థానం.*

*41. కళాకౌశల ప్రకాశనే వా సంవాహనే శిరసః పీడనే చౌచిత్య దర్శనం.*

*42. ప్రయోజ్యస్య సాత్మ్యయుక్తాః కథాయోగాః బాలాయాముపక్రమేషు యథోక్తమాచరేత్.*

*43. న త్వేవాతురాఽపి పురుషం స్వయమభియుంజీత,*
*స్వయమభియోగి నీహి యువతిః సౌభాగ్యం జహాతీత్యాచార్యాః*

*44. తత్ప్రయుక్తానాం త్వభియోగానామానులోమ్యేన గ్రహణం.*

*45. ఆంకపరిష్వక్తా చ న వికృతిం భజేత్.*

*46. శ్లక్ష్ణమాకారమజానతీవ ప్రతిగృహ్ణీయాత్.*

*47. వదనగ్రహణే బలాత్కారః.*

*48. రతిభావనామభ్యర్థ్యమానాయాః కచ్ఛాద్గుహ్య సంస్పర్శనం.*

*49. అభ్యర్థితాఽపి నాతివివృతా స్వయం స్యాదనిశ్చయ కాలాత్.*

50. యదా తు మన్యేతానురక్తోమయి నవ్యావర్తిష్యత
ఇతి తదైవైనమభియంజానం బాలభావమోక్షాయ త్వరయేత్.
51. విముక్తకన్యాభావా చ విశ్వాస్యే ప్రకాశయేదితి ప్రయోజ్యస్యోపావర్తనం.

కన్యక తనంతట తాను పురుషుణ్ణి అనుకూలంగా చేసుకునే పద్ధతి చెపుతున్నారిక్కడ. కన్యక పువ్వులు, పరిమళ ద్రవ్యాలు, తాంబూలం మొదలైనవి తీసుకుని ప్రియుడు ఏకాంతంగా ఉన్న సమయం కనిపెట్టి అతన్ని సమీపించాలి. అలా దగ్గరకి వెళ్ళి తన కళాకౌశలాన్ని ప్రదర్శించడం గానీ, పాదాలు ఒత్తడం, తల పట్టడం మున్నగు ఉపచారాలు చేసిగానీ నేర్పుగా ప్రవర్తించాలి. అతనికి ఇష్టమైన కథలు, కబుర్లు, చెపుతూ అతనికి వినోదం కలిగించాలి. బాలోపక్రమ విధానాలలో చెప్పిన పద్ధతులన్నీ అనుసరించాలి. అయితే, ఆమె తొందరపడి పురుషుణ్ణి అభియోగించ కూడదు. స్వయంగా పురుషుణ్ణి ఉపక్రమించే స్త్రీ సౌభాగ్యాన్ని కోల్పోతుందని కామ శాస్త్రాచార్యులు తీవ్రంగా హెచ్చరిస్తున్నారు.కాబట్టి ఆమెచేసే అభియోగాలను పురుషుడు ఇష్ట పూర్తిగా గ్రహించవలసి ఉంటుంది. ఒకవేళ ప్రియుడు తొడలతో కౌగలించుకుంటే వికారం పొందకూడదు.అతని భావగర్భితమైన ఆకారాన్ని అస్పష్టంగా ఎరగనట్లుగా గ్రహించాలి. అతను తన పెదవులను ముద్దాడబోతే బలవంతం మీద అంగీకరించాలి. అతను తన మదన మందిరాన్ని తాకి, రతి క్రీడ సలపాలని బతిమాలితే, స్త్రీ అతి ప్రయాస మీద అతని లింగాన్ని స్పృశించాలి. ముందుగా ఉభయులూ కలిపి నిర్ణయించుకున్న సమయాలలో తప్ప, మరెప్పుడు కూడా పురుషుడు ఎంతగా ప్రాధేయపడినా, బలవంత పెట్టినాసరే, నాయకి తన అవయవాలను అంటే దాచుకోవలసిన అంగాలను బహిరంగంగా కనబడేటట్లు చేయరాదు. పురుషుడు తనను ఇక నిరాదరణ చేయడనీ, తనపట్ల అంతులేని అనురాగంతో ఉంటాడనీ ఎప్పుడైతే గట్టి నమ్మకం ఏర్పడుతుందో అప్పుడు కన్యక తనను రంజింపచేస్తున్న ప్రియుణ్ణి కన్యాత్వం నుంచీ తనను తప్పించమని తొందరపెట్టాలి. ఇలా గాంధర్వ విధితో పతిని సంపాదించుకున్న వధువు, ఈ విషయంలో తనకు తోడ్పడిన ధాత్రేకలతోనూ ఆప్తులతోనూ ఈ సంగతి చెప్పాలి.

52. భవంతి చాత్ర శ్లోకా - కన్యాభి యుజ్యమానాతు యం మన్యే తాశ్రయం
సుఖం, అనుకూలం చ వశ్యం చ తస్య కుర్యాత్పరిగ్రహం.
53. అనపేక్ష్య గుణాన్యత్ర రూపమౌచిత్య మేవ చ,
కుర్వీత ధనలోభేన పతిం సాపత్న కేష్వసి.
54. తత్ర యుక్తాగుణం వశ్యం బలవదర్థినం,
ఉపాయైరభి యుంజానం కన్యాన ప్రతిలోమయేత్.

ఎవడైతే తన బాహ్యాంభంతర సౌఖ్యాలకు ఆలంబనంగాను, అనుకూలంగాను, వశ్యుడుగాను ఉంటాడో అతని అభియోగాన్ని కోరాలి కన్యక. అంతే కాకుండా అతన్నే పరిగ్రహించాలి కూడా. గుణం, రూపం, ఔచిత్యం - ఇవేవీ చూడకుండా, కేవలం ధనానికి ఆశపడి పలువురు భార్యలు కలవాణ్ణి అయినా సరే ఎప్పుడూ

వరించకూడదు. అదే విధంగా గుణవంతుడు, యోగ్యుడు, తనకు మిక్కిలి అనుకూలుడు, అన్ని పనులలోనూ దక్షత గలవాడు, ఏకాంతంగా తనను కోరేవాడు, ఉపాయంగా అభియోగాలు జరిపేవాడు లభ్యమైనప్పుడు కన్యక ఎప్పుడూ తిరస్కరించకూడదని శాస్త్రకారులు చెపుతున్నారు.

*55. వరం వశ్యో దరిద్రోఽపి నిర్గుణోప్యాత్మధారణః*
*గుణైర్యుక్తోఽపి న త్వేవం బహుసాధారణః పతిః*

*56. ప్రాయేణ ధనినాం దారా బహవో నిరవగ్రహాః*
*బాహ్యే సత్యుపభోగేఽపి నిర్విస్రంభా బహిస్సుఖాః*

*57. నీచో యస్త్వభియుంజీత పురుషః పలితోఽపి వా*
*విదేశగతి శీలశ్చ న స సంయోగమర్హతి.*

*58. యదృచ్ఛయాఽభియుక్తో యో దంభద్యూతాధికోపి వా,*
*సపత్నీకశ్చ సాపత్యో న స సంయోగమర్హతి.*

సాధారణంగా శ్రీమంతులు, ప్రభువులు, ఒక్క భార్యతో తృప్తి పడకుండా పలువులు భార్యలను పెండ్లాడతారు. అలాంటి స్త్రీలకు తిండి, బట్ట మున్నగు బాహ్య సుఖాలకు ఎలాంటి లోటూ ఉండదు. కాని ఏంలాభం? ఆ రమణీమణులకు రతి సుఖం చాలా తక్కువగా ఉంటుంది. అందువల్లనే ధనవంతుల భార్యలు, ప్రభువుల భార్యలు కూడా పొంగుతున్న కామం అణుకోలేక స్వేచ్ఛావిహారిణులై, అడ్డదారులు తొక్కి, అడ్డమైన వాళ్ళతో సంభోగం సాగిస్తూ, దురద తీర్చుకుంటూ ఉంటారు. ఇలా పలువురు భార్యలున్నారని గొప్పలు చెప్పుకుంటూ బుద్ధిమంతుడుగా చలామణి అయ్యే భాగ్యవంతుణ్ణి పెండ్లాడం కంటె, గుణహీనుడైనా సరే, భార్యకు అనుకూలుడుగా ఉంటూ, ప్రయోజకత్వంతో కుటుంబాన్ని పోషించుకునే పేదవాణ్ణి పెండ్లాడం ఉత్తమం అన్నారు పెద్దలు. ఇంకా చెప్పాలంటే, అధమజాతికి చెందినవాడు, తల నెరసిన వృద్ధుడు, విదేశాల్లో తిరిగేవాడు, ఎన్నడూ భోగించడానికి తగడనే చెప్పాలి. ఆడది కనిపిస్తేచాలు, యుక్తాయుక్త విచారణ లేకుండా కనిపించగానే కామం తీర్చుకోవడానికి సిద్ధపడేవాడు, అతి గర్విష్టి, తాగుడు, జూదం మున్నగు దుర్వ్యసనాలకు లోనైనవాడు, పలువురు భార్యలతో సంసారం సాగించేవాడు, కన్యతో రతి చేయడానికి అర్హుడు కాడని శాస్త్రజ్ఞుల నిర్ణయం.

*59. గుణసామ్యే అభియూక్తౄణాం ఏకో వరయితా వరః*
*తత్రాభియోక్తరి శ్రైష్ఠ్యం అనురాగాత్మకో హి సః*

సమాన గుణాలు గల వరులు పలువురు ఉన్నప్పుడు వారిలో కన్యక ఎవరిని వరించాలన్న ప్రశ్న ఉదయిస్తుంది. అనురాగరూపమైన గుణం ఎవరిలో అధికంగా ఉంటుందో అతడే శ్రేష్ఠుడు. కాబట్టే అతన్నే కన్య వరించాలని వాత్స్యాయనుల సిద్ధాంతం.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే కన్యా సంప్రయుక్తకే తృతీయేఽధికరణే*
*ఏకపురుషాభియోగాః ప్రయోజ్యోపావర్తనం,*
*అభియోగతశ్చ కన్యాయాః ప్రతిపత్తిశ్చేతి చతుర్థోఽధ్యాయః*

**ఇది వాత్స్యాయనముని విరచిత కామసూత్రాల్లో కన్యా సంప్రయుక్తకం అనే మూడో అధికరణంలో ఏకపురుషాభియోగం అనే నాలుగో అధ్యాయం.**



# పంచమాధ్యాయం
## వివాహ యోగం

1. ప్రాచుర్యేణ కన్యాయాః వివిక్తదర్శనస్యాలాభే
ధాత్రేయికాం ప్రియహితాభ్యా ముపగృహ్యోప సర్పేత్.

ఇంతకు ముందు అధ్యాయంలో చెప్పినట్లుగా పురుషుడి చేత రంజింప జేయబడిన కన్యక, స్వయంగా వరుణ్ణి ఎన్నుకున్న కన్యక - వీరిని పురుషుడు గాంధర్వవిధిని పెళ్ళాడి ఆమెను భర్త సహవాసం కలదాన్నిగా చెయ్యాలి. ఇక వివాహయోగాలు చెపుతున్నారు.

కొందరు కన్యలు అన్ని విధాలా పురుషులకు అనుకూలురాండ్రుగా ఉంటారు. వారు తరచుగా ఒంటరిపాటున తనకు అగుపిస్తూ ఉంటారు. అలాంటి ఏ కన్యనైనా సరే పురుషుడు తన ఇష్టమైన చోటుకు తీసుకుపోయి గాంధర్వ విధానంతో పెళ్ళి చేసుకోడం చాలా సులువుగా, సుఖంగా ఉంటుంది. కన్య తరచుగా తనకు ఒంటరిపాటున కనిపించకపోయినట్లయితే, అప్పుడు ఆమెను వశపరచుకోడం కష్టం అవుతుంది. కనుక మరొకరి సహాయం అవసరం అవుతుంది. ఆ కన్యక ఒంటరిపాటున కనిపించే అవకాశం లేనప్పుడు, ఆమెకు సన్నిహితంగా ఉండే దాదిని ధనాశపెట్టి లోబరచుకోవాలి. ఆ దాదిని దూతకృత్యానికి నియోగించి కార్యం సాధించుకోవాలి.

2. సా చైవమవిదితా నాయకన్య భూత్వా తద్గుణైరను రంజయేత్,
3. తస్యాశ్చ రుచ్యాన్నాయక గుణాన్ భూయిష్ఠ ముపవర్ణయేత్.
4. అన్యేషాం వరయిత్పృణాం దోషానభిప్రాయ విరుద్ధాన్ ప్రతిపాదయేత్
మాతాపిత్రోశ్చ గుణానభిజ్ఞతాం, లుబ్ధతాం చ చపలతాం చ బాంధవానాం
5. యాశ్చాన్యా అపి సమానజాతీయాః కన్యాః శకుంతలాద్యాః
స్వబుద్ధ్యా భర్తారం ప్రాప్య సంప్రయుక్తా
మోదంతే స్మ తాశ్చాస్యా నిదర్శయేత్.
6. మహాకులేషు సాపత్నకైః బాధ్యమానాః విద్విష్టాః దుఃఖితాః
పరిత్యక్తాశ్చ దృశ్యంతయాయతిం చాన్య వర్ణయేత్.
7. సుఖమనుపహత మేకచారితాయాం నాయకానురాగం చ వర్ణయేత్.
8. సమనోరథాయాశ్చాస్యా అపాయం సాధ్వసం
వ్రీడాం చ హేతుభిరవచ్ఛిందద్యాత్.
9. దూతీకల్పం చ సకలమాచరేత్
10. త్వామజానతీమివ నాయకో బలాద్గ్రహీష్యతీత తథా
సువరిగృహీతం స్యాదితి యోజయేత్.



# నైపుణ్యం గల దూతిక అవసరం

ఈ విధంగా అలా నాయకుడిచేత నియోగింపబడిన దాది నాయిక దగ్గరికి వెళ్ళి, నాయకుడి పేరు తనకు తెలియనట్లుగా, అతని గుణాలను గురించి మాత్రమే పేర్కొని ఆమెకు ఉబలాటం కలిగించాలి. ఆమె నాయకుని మెచ్చుకునేలా అతని గుణాగుణాలను గురించి గొప్పగా వర్ణించి చెప్పాలి. అంతేకాకుండా నాయకుడి విషయంలో ఇతరులు చెప్పేదాన్ని బట్టి నాయికలో ఏర్పడిన అభిప్రాయాలకు భిన్నంగా వివరిస్తూ ఆ అభిప్రాయాలు తప్పని, ఆమెకు నచ్చచెప్పాలి. ఇతరులైతే తల్లిదండులు, చుట్టపక్కాలు - మున్నగువారు గుణహీనులనీ, లోభత్వం, చపలత్వం కలవారని పలు విధాల తార్కాణాలతో నిరూపించి తెలియజెయ్యాలి.

'ఏవమ్మా ? ఏమిటిది ? నీలాంటి కన్యకలు స్వతంత్ర బుద్ధితో ఆలోచించి భర్తలను ఎంపిక చేసుకోవాలి. శకుంతల మున్నగువారు చూడు ఎలా చేశారో - నీవూ అలాగే చేయాలమ్మా ! అలా చేసినవారు సుఖపడినారు. నీవూ అలా సుఖాలతో, ఆనందంతో గడపాలమ్మా !' అంటూ దాది కన్యకు చరిత్రలో జరిగిన సంఘటనలు తెలియజెప్పాలి.

'గొప్ప కులాలలో గల పురుషులపై తెలివితక్కువగా మోజు పడతారు. సంపన్నులకు పలువురు భార్యలుంటారు. నీకు సవతులపోరు తప్పదు. ఆ సవతులు నిన్ను ద్వేషిస్తారు. ఆఖరుకు నీవు భర్తను విడిచి రావలసివస్తుంది. ఆ దుఃఖం నీవు భరించలేవు !' - అని నాయికకు బోధించి తాను చెప్పే నాయకుడు ఎంతటి గుణవంతుడో, బుద్ధిమంతుడో వర్ణించి చెప్పి, అలాంటివాణ్ణే వరిస్తే ముందు ముందు ఎంత భోగం అనుభవించేదీ తెలపాలి. అలాగే ముందు ముందు అతనికి పట్టనున్న అదృష్టాన్ని గురించి కూడా వెల్లడించాలి. అతన్ని పెళ్ళాడితే,

సపత్నులవరూ ఉండరని, ఏకపత్నిగా అంతులేని సుఖం అనుభవించవచ్చునని, అతడు నిన్నే కోరుతున్నాడని అనాలి. అలా నాయికకు నచ్చచెపితే, ఆమె అతన్నే వాంఛిస్తున్నదని తెలుసుకున్న తరువాత ఆ దూతిక, ఇలా చేస్తే ఏదో ప్రమాదం వస్తుందని ఆమె ఊహించుకుంటూ ఉండే అలాంటి భయం, అపాయం ఎంతమాత్రం లేదని, సహేతుకంగా వివరించి, ఆమెలోగల సిగ్గును పోగొట్టాలి. ఈ విధంగా దౌత్యం నెరపడానికి వచ్చిన దాది, దూతిక చేయవలసిన సమస్త పనులు చేస్తూ, దూతికగా, సకల వ్యవహారాలు నడపాలి.

"అమ్మాయీ! నీ వింకా ఇలాగే అమాయకంగా, వెర్రిబాగుల దానిలా ఉంటే, నాయకుడు ఎప్పుడోవచ్చి బలాత్కారంగా నిన్ను ఎగరేసుకుపోతాడు! అప్పుడింకేం చేస్తావు? హాయిగా పెళ్ళి చేసుకుంటాడు!" - అని చెప్పి, అతని మీది ప్రేమానురాగాలు, కుతూహలం కన్యకు కలిగేలా చెయ్యాలి దూతిక.

*11. ప్రతిపన్నామభిప్రేతావకాశవర్తినీం నాయకః శ్రోత్రియాగారాదగ్ని మానాయ్య,*
*కుశానా స్తీర్య, యథాస్మృతి హుత్వా చ, త్రిః పరిక్రమేత్.*

*12. తతోమాతరి పితరి చ ప్రకాశయేత్.*

*13. అగ్ని సాక్షికా హి వివాహా న నివర్తంత ఇత్యాచార్యసమయః.*

ఇక ఇలా ఆ నాయకుణ్ణి చేపట్టడానికి ఇష్టపడి, ఏకాంత ప్రదేశానికి వచ్చిన కన్యకు, నాయకుడు శోత్రియుడి గృహం నుండి అగ్ని హోత్రం తెచ్చినట్లుగా తెచ్చి, దర్భలు పరిచి స్మృతులలో చెప్పినట్లుగా హోమం చేసి, మూడు మార్లు ఆ అగ్నికి ప్రదక్షిణం చెయ్యాలి, అలాగే అమ్మాయి చేత కూడా ప్రదక్షిణం చేయించాలి. ఆ తరువాత ఆ పిల్ల తల్లిదండ్రులకు జరిగిన విషయం తెలియపరచాలి.

ఒకసారి ఇలా అగ్నిసాక్షిగా వివాహితలైన స్త్రీలను, మరొకరు మరల వివాహం ఆడరాదని కామశాస్త్రాచార్యులు స్పష్టంగా చెపుతున్నారు.

*14. దూషయిత్వా చైనాం శనైః స్వజనే ప్రకాశయేత్.*

*15. తద్బాంధవాశ్చ యథా కులస్యాఘం పరిహరంతో*
*దండభయాచ్చ తస్మా ఏవైనాం దద్యుస్తథా యోజయేత్.*

*16. అనంతరం చ ప్రీత్యుపగ్రహేణ రాగేణ, తద్బాంధవాన్ప్రీ యేదితి.*

*17. గాంధర్వేణ వివాహేన వా చేష్టేత.*

పైన చెప్పినట్లుగా పురుషుడు తన ప్రియురాలిని పెండ్లాడి, తానామెను వివాహమాడినట్లు ఆమె బంధుజనానికి నెమ్మదిగా నెమ్మదిగా తెలియజెయ్యాలి. అప్పుడా అమ్మాయి తల్లిదండ్రులు కుల దోషాన్ని పోగొట్టుకోడానికీ, ప్రభువు వల్ల భయం వల్లనూ, ఆ వరుడికే ఆ పిల్ల నిచ్చి పెళ్ళి చేస్తారు. లేదా నాయకుడు అత్త మామలను, వారి పక్షం వారిని ప్రేమ పూర్వకమైన, స్నేహపూర్వకమైన మాటలతోను, వస్తువులతోను సంతోషపెట్టి, గాంధర్వ విధానంతోనైనా వివాహం చేసుకోవచ్చు.

18. అప్రతిపద్యమానాయామంతశ్చారిణీమస్యాం కులప్రమాదాం
పూర్వానంస్పృష్టాం ప్రీయమాణాం చోపగృహ్య తయా
సహ విషహ్యమవకాశమే నామన్యకార్యాపదేశేన ఆనయేత్.

19. తతశ్శ్రోత్రియాగారాదగ్నిమితి సమానం పూర్వేణ.

ఇప్పుడిక అంతరస్థ విషయం గురించి చెపుతున్నారు. పైన చెప్పినట్లుగా నాయికకు దూతీ ముఖంగా బోధచేసిన పిమ్మట కూడా ఆమె వివాహానికి ఒప్పుకోకపోతే, అప్పుడు తనకు అంతరంగిక అయిన కులకాంతను గానీ, పూర్వం పరిచయం గల మరో మగువను గానీ, తల్లిదండ్రుల మంచితనాన్ని బట్టి ప్రేమించబడే మరో స్త్రీని గానీ, ఉపాయంగా లోబరుచుకుని, ఏదో ఒక నెపం మీద ఆమెను తన ఇంటికి రప్పించుకోవాలి. నాయకుడు, అలా రప్పించుకున్న పిమ్మట ఆ కన్యను శ్రోత్రియ గృహం నుండి అగ్నిని తెచ్చినట్లుగా తెచ్చి పూర్వం చెప్పినట్లు చెయ్యాలి. ఇలాంటి పెళ్ళి కూడా గాంధర్వ వివాహంతో సమానమేనని కొందరు ఆచార్యులు అంటారు.

20. ఆసన్నే చ వివాహే మాతరమస్యాః తదభిమతాన్య వరదోషైః అనుశయం గ్రహయేత్.

21. తతస్తదనుమతేన ప్రాతివేశ్యాభవనే నిశి నాయకమానాయ్య
శ్రోత్రియాగారాదగ్నిమితి సమానం పూర్వేణ.

వివాహ సమయం ఆసన్నమైనప్పుడు, పిల్ల నిద్దామనుకుంటున్న పర పురుషునిలో గల దోషాలను గురించి కన్యకా మణి తల్లికి తెలియజెప్పి, ఆమెకు పశ్చాత్తాపం కలిగేలా చెయ్యాలి. అటు పిమ్మట ఆమె ఇష్టాను సారంగా రాత్రివేళ నాయకుణ్ణి కన్యా గృహంలోకి రప్పించి శ్రోత్రియుడి గృహం నుండి అగ్నిని తెప్పించి, ఇంతకు ముందులాగా చెయ్యాలి. ఈ పెళ్ళిలో ద్రవ్యం ఇచ్చి కన్యను గ్రహించడం జరుగుతుంది, అంచాత దీన్ని రెండో రకం వివాహంగా పేర్కొంటున్నారు పెద్దలు.

22. భ్రాతరమస్యా వా సమానవయసం వేశ్యాను పరస్త్రీషు వా
ప్రసక్తమనుకరేణ సాహాయ్యగానేన ప్రియోపగ్రహైశ్చ
సుదీర్ఘకాలమనురంజయేదంతే చ స్వాభిప్రాయం గ్రాహయేత్.

23. ప్రాయేణ హి యువానః సమానశీలవ్యసనవయసాం వయస్యానామర్థే
జీవితమపి త్యజంతి తతస్తే నైవాన్య కార్యాత్తామా
నాయయేద్విషహ్యం సావకాశమితి సమానం పూర్వేణ.

ఇంకా ఏమిటి అంటే, తనతో సమాన వయస్సు గలవాడుగా ఉన్న, నాయిక సోదరుణ్ణి ఒకణ్ణి, దగ్గరికి చేర్చుకుని వేశ్య విషయంలో గాని, పరస్త్రీ విషయంలో గాని, కష్ట సాధ్యంగా ఉన్న అతని కోర్కెను తాను సహాయంగా ఉండి నెరవేర్చాలి. లేదా అతనికి ఇష్టమైన వస్తువును తెచ్చి ఇచ్చి తన స్నేహాన్ని అతడు అభిలషించేలా చూచుకోవాలి. అతడు తనకు ప్రాణ స్నేహితుడనే నమ్మకం ఏర్పడిన పిమ్మట, తన మనస్సులో అభిప్రాయం అతనికి సూచించాలి. యువకులు సాధారణంగా

తమ ఆప్తమిత్రుల కోసం ప్రాణాలైనా ఇవ్వడానికి వెనుదీయరు కాబట్టి, తమ సోదరిని మిత్రునికి అప్పజెప్పే విషయంలో వెనుకాడతారా? అంచాత, అలా అతన్ని అనుకూలుడుగా చేసుకున్న తరువాత, అతని ద్వారానే ఆ నాయికను ఏదో పనిమీద తన ఇంటికి రప్పించుకుని, పైన చెప్పిన రీతిలోనే పరిణయమాడాలి. ఇదొక పద్ధతి.

24. *అష్టమీచంద్రికాదిషుచ ధాత్రేయునా మదనీయ మేనాం పాయయిత్వాకిం*
*చిదాత్మనః కార్యముద్దిశ్య నాయకస్య విషహ్యం ఆనయేత్.*

25. *తత్రైనాం మదాత్సంజ్ఞామప్రతిపద్యమానాందూష*
*యిత్వేతి సమానం పూర్వేణ.*

పైన చెప్పిన పద్ధతిలో కన్యకను పొందడం సాధ్యం కాకపోతే, అష్టమీ చంద్రకాది ఉత్సవాలలో (ఆ రోజుల్లో ఆనందంగా సాగించే ఉత్సవాలు ఇవి పగటి పూట ఉపవాసంచేసి, రాత్రులు చంద్రోదయం అయ్యేదాకా జాగరణ చేస్తూ పూజా పురస్కారాలు నిర్వహిస్తారు. ఈ ఉత్సవదినంనాడు.) అలాంటి సమయాల్లో, అమ్మాయికి ఆప్తురాలుగా ఉండే దాది ద్వారా ఏదో పనిమీద ఆమెను తన వద్దకు పిలిపించుకోవాలి. మద్యం, కల్లు మున్నగు మత్తు పానీయాలు, ఆమె సేవించేలా చేయాలి. అలాంటి పానీయాలు, మత్తుపదార్థాలు సేవించడంవల్ల నాయిక స్మృతితప్పి ఉంటుంది. అప్పుడు బలవంతంగా ఆమెతో కామ క్రీడ సాగించి, ఆ తరువాత ఇంతకు ముందు చెప్పిన పద్ధతిలో పెళ్ళాడాలి. అయితే, ఇది ఎంతో నీచమైన వివాహం అంటారు. ఇలాంటి వివాహాలను ధర్మశాస్త్రాలు ఎంతమాత్రం అంగీకరించవు. అంచాతనే దీన్ని పైశాచిక వివాహం అన్నారు పెద్దలు. ధర్మనిరతి, దయ, దాక్షిణ్యం గల పురుషులెవరూ ఇలాంటి వివాహ పద్ధతికి పాల్పడరు.

26. *సుప్తాం చైకచారిణీం ధాత్రేయికాం వారయిత్వా*
*సంజ్ఞామప్రతిపద్యమానాందూషయిత్వేతి సమానం పూర్వేణ.*

స్త్రీ నిద్రపోతూ ఉంటేనో, లేక ఏకాంతంగా ఉండగానో కనిపెట్టి, ఆమె ప్రక్కన చెలికత్తెగాని, దాసిగాని, ఉంటే వాళ్ళను భయపెట్టి వెళ్ళ గొట్టి ఆమెను ఎత్తుకునిపోయి, మాదకద్రవ్యాలు సేవింపజేసి, పైవిధంగా పెళ్ళిచేసుకోవడం ఒక పద్ధతి - ఇదీ తుచ్ఛమైనదీ, నిషిద్ధమైనదీను.

27. *గ్రామాంతరముద్యానం వా గచ్ఛంతీం విదిత్వా సుసంభృతసహాయో*
*నాయకస్తదా రక్షిణో విత్రాస్య హత్వా వా*
*కన్యామపహరేదితి వివాహయోగాః.*

ఘోరమైన మరో రకం వివాహం కూడా ఉంది. తాను అభిలషించిన కన్య ఏదైన ఊరికిగానీ, ఉద్యానవనానికిగానీ (ఇప్పటి పార్కులకు) వెదుతూ ఉంటే, పురుషుడు అది కనిపెట్టి, ఆమె వెంట ఉన్న సహాయకులను లేదా రక్షకులను, తగిన మందీ - మార్బలంతో వెళ్ళి బెదరగొట్టిగాని అవసరమైతే చంపిగాని,

ఆ స్త్రీని ఎత్తుకునిపోయి, పెళ్ళాడటం మరో రకమైన విధానం. ఇలాంటి వాటిని రాక్షస వివాహాలన్నారు పెద్దలు.

శాస్త్రం అన్ని విషయాలు సమగ్రంగా బోధించాలి కాబట్టి ఇవన్నీ చెప్పటం జరిగింది.

*28 పూర్వః పూర్వః ప్రధానం స్యాత్ వివాహో ధర్మసంస్థితేః,*
*పూర్వాభావే తతః కార్యోయో య ఉత్తర ఉత్తరః.*

అసలు వివాహాలనేవి ఎనిమిది విధాలు

1) బ్రాహ్మం, సదాచారంగల వరుణ్ణి వస్త్రాదులతో అలంకరించి, పూజించి కన్యాదానం చేయడం.

2) దైవం - జ్యోతిష్టోమాది యజ్ఞ ప్రారంభంలో యధావిధిగా యజ్ఞ కర్మ నడిపిన ఋత్విజుని అలంకరించి చేసే వివాహం.

3) ఆర్షం - ధర్మార్థం, వరుడినుండి గోమిధునం తీసుకొని, అతనికి కన్యను ఇచ్చి శాస్త్రోక్తంగా చేసే వివాహం.

4) ప్రాజాపత్యం - వరుడిచేత 'నేను అన్యాశ్రమస్థుడను కాక, గృహస్థాశ్రమంలో ఉండి ధర్మం ఆచరిస్తాను' అని చెప్పించి కన్యాదానం చేయడం.

5) రాక్షసం - కుయ్యో, మొర్రో అని మొర పెట్టుకునే కన్యను బలాత్కారంగా తీసుకొచ్చి పెళ్ళాడడం.

6) ఆసురం - కన్య తల్లిదండ్రులకూ, కన్యకూ శక్త్యానుసారం ధనం ఇచ్చి యధేచ్ఛగా వివాహం చేసుకోవడం.

7) గాంధర్వం - వధూవరులు ఒకరుకొకరు ఇష్టపడి, అన్యోన్య ప్రేమానురాగాలతో చేసుకునే వివాహం.

8) పైశాచం - నిద్రపోతున్న లేదా తాగి మైమరచి ఉన్న, లేదా తన మానం కాపాడుకోడంలో పరాకుగా ఉన్న స్త్రీని సంభోగాభిలాషతో రహస్యంగా చేసుకునే పెళ్ళి.

మొదటి నాలుగు బ్రాహ్మణులకు శ్రేష్ఠమని, గాంధర్వ, రాక్షస వివాహాలు క్షత్రియులకు, ఆసురం వైశ్య శూద్రులకు ప్రశస్తమని పెద్దలు చెప్పారు. ఇక పైశాచికం అనేది అందరికీకూడా నింద్యమైనదే!

అంటే, ఈ ఎనిమిది రకాల పెళ్ళిళ్ళలో తరువాత, తరువాత చెప్పిన వాటికన్నా, మొదటి మొదటి వివాహాలు ధర్మబద్ధమైనవి కావడం చేత, ఉత్తమమైనవని అన్నారు. పూర్వం చెప్పిన వివాహాలు సాధ్యం కానప్పుడు తరువాత వాటిని అనుసరించడంతో తప్పులేదన్నారు.

*29. వ్యూఢానాం హి వివాహానాం అనురాగః ఫలం యతః.*

*మధ్యమోఽపి హి సద్యోగో గాంధర్వస్తేన పూజితః.*

అయితే, ఇక్కడ ఒక సూక్ష్మం ఉంది - గమనించాలి. తరువాత తరువాత చెప్పిన వాటికన్నా పూర్వం, పూర్వం చెప్పిన వివాహాలు ఉత్తమమైనవనిచెప్పారు; బాగానే ఉంది. కాని వివాహం ఏదైనా ఫలం అనురాగమే కదా? అంచేత ఏరకం పెళ్ళికైనా ప్రేమానురాగాలు ప్రధానం. అవిలేని ఏ రకం వివాహమైనా వ్యర్థమే. దీన్నిబట్టి చూస్తే, ఎనిమిదిరకాల వివాహాల్లో లెక్కను బట్టి గాంధర్వం ఏడోదిగా ఉన్నప్పటికీ, (అంటే సాధారణమైనదిగా పరిగణించినప్పటికీ) అన్యోన్య ప్రేమానురాగాలే ప్రధానమైన గాంధర్వ వివాహమే అన్నిటికన్నా మిన్న అయినది పెద్దల అభిప్రాయం.

(దీన్నిబట్టి ఆలోచిస్తే ఇప్పటి యువతీయువకుల ప్రేమ వివాహాలు ఏమాత్రం నింద్యమైనవి కావని స్పష్టపడుతున్నది. లోకోత్తరమైన అనురాగ యోగం ఉండడంవల్ల ప్రేమికులు పెళ్ళాడడమే. అన్నిటికన్నా శ్రేష్ఠమైనదని వాత్స్యాయనుడు శతాబ్దాల క్రితమే చెప్పినట్లు స్పష్టమవుతున్నది.)

*30. సుఖత్వాదబహుక్లేశాదపి చావరణాదికం, అనురాగాత్మకత్వాచ్చ*

*గాంధర్వః ప్రవరో మతః.*

*ఇతి వాత్స్యాయనీయే కామసూత్రే కన్యాసంప్రయుక్తకే*

*తృతీయేఽధికరణే వివాహయోగః పంచమోఽధ్యాయః.*

ఇంకా చెప్పాలంటే గాంధర్వ వివాహం అనేది సుఖ సంతోషాలకు కారణం అయినదీ, కష్టం లేకుండా వధూవరుల ఇష్టంతో లభ్యమయ్యేదీ, వరణ సంవిధానం మొదలైనవేవీ ఇందులో ఉండవు కాబట్టి ఈ గాంధర్వ వివాహమే సర్వోత్కృష్టమైనదని కామశాస్త్ర వేత్తలందరూ అంగీకరించిన విషయం.

**ఇది వాత్స్యాయన మునివిరచితమైన కామసూత్రాల్లో, కన్యాసంప్రయుక్తకం అనే మూడో అధికరణంలో, వివాహయోగాలు అనే అయిదో అధ్యాయం.**



# వాత్స్యాయన కామసూత్రాలు

## భార్యాధికారికాధికరణం - 4

## ప్రథమాధ్యాయం

### ఏకచారిణీవృత్తం - ప్రవాసచర్య



*1.. భార్యా ఏకచారిణీ గూఢవిస్రంభా దేవవత్పతిం.*
*మానుకూల్యేన వర్తేత.*

భార్య అంటే ఎవరో, భార్య అనే అర్హత ఎవరికి లభిస్తుందో చెపుతున్నారిక్కడ. పెళ్ళికాకుండా ఉన్న అమ్మాయిని, ఒక అబ్బాయి, పెళ్ళాడగానే, ఆ అమ్మాయిని భార్య అని పిలుస్తారు. అలా భార్యాత్వాన్ని పొందిన స్త్రీ తన పురుషుడితోఎలా ప్రవర్తించాలో, అదంతా వివరంగా చెప్పేదే ఈ భార్యాధికరణం

భార్యలు రెండు విధాలుగా ఉంటారు. ఒకటి ఏకచారిణీ, రెండు సపత్నిక. భర్త హృదయంలో మరో స్త్రీకి స్థానం ఇవ్వకుండా తాను ఒక్కతే సుఖ, భోగాలు అనుభవించే భార్య ఏకచారిణీ. పలువురు పడతులు ఒక పురుషుడికి భార్యలుగా ఉంటే, వారిలో ప్రతి ఒకతె, మరొకతెకు సపత్నిక అవుతుంది. భార్య అనే

అర్హతను పొందిన వనితారత్నం తక్కిన వారివలె కపటంతో ప్రవర్తించదు. పైగా ఎల్లప్పుడూ తన భర్తపైనే రహస్యంగా ఎంతో విశ్వాసం కలిగి ఉంటుంది. అంతేకాకుండా, తాను చేపట్టిన భర్తను దైవంలాగా చూస్తూ, పూజిస్తూ, గౌరవిస్తూ, అతనికి మనసిచ్చినట్లుగానే అతన్ని అహర్నిశలూ అనుసరిస్తూ ఉంటుంది, ఉండాలి కూడా.

2. *తన్మతేన కుటుంబచింతామాత్మని సంనివేశయేత్.*

'పడతులకు పతియే దైవం' - అన్న ధర్మం ఉంది. ఈ ధర్మాన్ని అనుసరించి, భర్త మనసు తెలుసుకుని ఆ ప్రకారం అనుకూలంగా ప్రవర్తించవలసి ఉంది స్త్రీ. అర్ధాంగుల విషయమై చెప్పిన మాట ఇది. అలాగే ఏకచారిణిగా భార్య, ఇంటి విషయాలన్నిటిలోనూ భర్త ఇష్టాన్ని మనస్సులో పెట్టుకుని ప్రవర్తించాలి.

3. *వేశ్మ చ శుచి సుసంమృష్టస్థానం, విరచితవివిధ కుసుమం సంశ్లక్ష్ణభూమితలం, హృద్యదర్శనం, త్రిషవణాచరితబలికర్మ, పూజితదేవాయతనం కుర్యాత్.*

ఏకచారిణిగా ఉన్న ఇల్లాలు తన నివాస గృహాన్ని ఎల్లప్పుడూ పరి శుభ్రంగా ఉంచుకోవాలి. కసవు ఊడ్చి, అలికి, ముగ్గులు పెట్టి, దేశకాలానుసారం పువ్వులు చల్లి, అలంకరించాలి. ఇల్లు సమతలంగా, నున్నగా, చూడడానికి ముచ్చటగా ఉండేలా చూసుకోవాలి. అలాగే ఉభయ సంధ్యల్లోనూ దేవతా పూజచేసుకుంటూ, అందుకు వీలుగా దేవతాగృహాన్ని శుచిగా, అలంకార యుక్తంగా, శోభాయమానంగా ఉండేలా చూసుకోవాలి.

(ఆనాటి గృహస్థుల కర్తవ్యం ఇది. మరి, ఈ రోజుల్లో ఎందరి ఇళ్ళల్లో దేవతాగృహాలున్నాయో, ఎందరు పూజా పురస్కారాదులు నిర్వహిస్తున్నారో చెప్పలేము.)

(ఇల్లు జూచినతోచు ఇల్లాలి శుభవృత్తి, కల విద్యంగుపదు పలుకబడిన - అన్నారు పెద్దలు. ఊరి ముఖం గోడలే చెపుతాయి అన్నట్లు, ఇల్లాలు ఎంత లక్షణంగా ఉంటుందో ఇల్లు చూచి చెప్పవచ్చు. అయితే, ఆధునిక కాలంలో అలాంటి గృహిణులు ఎందరున్నారో మరి!)

4. *న హ్యాలోన్యద్గృహస్థానాం చిత్తగ్రాహకమస్తీతి గోనర్దీయః.*

పై విధంగా నివాస గృహాలు తయారై ఉంటే, ఆ గృహస్థునకు ఇంతకన్నా ఆనందం, ఆకర్షణీయం మరొకటి ఉండదని గోనర్దీయు లంటున్నారు.

5. *గురుషు మంత్రవర్గేషు భృత్యవర్గేషు నాయక భగినీషు తత్పతిషు చ యథాZర్హం ప్రతిపత్తిః.*

పైన చెప్పినట్లుగా నివాసగృహాన్ని ఆకర్షకంగా రూపొందించుకుని, అటుపిమ్మట తన గృహకృత్యాలలో లోటుపాట్లను సవరించుకోడానికి ఇంట్లో పెద్ద వాళ్ళుగా ఉంటున్న అత్తమామల సంహాలు స్వీకరించాలి. అలాగే తన క్రింద పనిపాటులు చేస్తూ ఉండే సేవకుల విషయంలోనూ, వదిన మరదళ్ళ విషయంలోనూ, వారి

భర్తల విషయంలోనూ, ఎవరిపట్ల చూపవలసిన గౌరవ మర్యాదలు వారిపట్ల చూపుతూ జాగ్రత్తగా ప్రవర్తించాలి.

6. *పరిపూతేషు చ హరిత శాకవప్రాన్ ఇక్షుస్తంభాన్,*
*జీరకసర్ష పాజామోదశతపుష్పతమాలగుల్మాంశ్చకారయేత్.*

విలక్షణంగా ఉండే గృహావరణాలలో, పెరట్లోగాని, ఇతర ఖాళీ ప్రదేశాలలోగాని చెట్ల పాదులు పెట్టుకోవాలి. అల్లం, కొత్తిమేర, పాలంకి మున్నగు పచ్చని కూరగాయలు వేసి పెంచుకోవాలి. చెరకు గడలు నాటించవచ్చు. జీలకర్ర, ఆవాలు, అజామోదం? శతపుష్పం? తమాలం? - మున్నగువాటినికూడా నారు పోయించి పెంచుకోవాలి.

7. *కుబ్జకామలక మల్లికా జాతీకురంటక నవమాలికా*
*తగరనంద్యావర్తకజపాగుల్మాన్, అన్యాంశ్చ బహు*
*పుష్పాన్ బాలకోశీరకపాతాళికాంశ్చ వృక్షవాటి*
*కాయాం చ స్థండిలాని మనోజ్ఞాని కారయేత్.*

అంతేకాకుండా కుబ్జకాలు? ఉసిరికలు, మల్లెలు, జాజులు, గోరంటలు, గ్రంధిగజం?, సంవర్తం, జపాకుసుమం?, మున్నగు పుష్పజాతులు, వట్టివేళ్ళు, పాతాళికవృక్షాలు? మున్నగు పుష్పజాతులతోను, వృక్ష రాజములతోను, మనోహర మైన ఉద్యానవనాలు వేయించుకోవాలి. ఆ వృక్షాల క్రింద తరులతా గుల్మములక్రింద హాయిగా విశ్రమించడానికి, చిన్న చిన్న అరుగులు కూడా అందంగా కట్టించుకోవాలి.

8. *మధ్యే కూపంవాపీం దీర్ఘికాం వా కారయేత్.*

ఉద్యానవనాలు ఏర్పాటు చేసినప్పుడు ఆ తోటల మధ్య నూయిగాని, దిగుడు బావిగాని, కోనేరుగాని త్రవ్వించాలి.

9. *భిక్షుకీశ్రమణాక్షపణాకులటాకుహకేక్షణికామూలకారి కాభిర్న సంసృజ్యేత.*

ఏకచారిణిగా ఉన్న కాంత, భిక్షాటనంచేసి జీవించేదానితోను బౌద్ధసన్యాసినితో ను,గుడ్డలు కుట్టుకుని బ్రతికే దానితోను, హాస్యోక్తులు పలుకుతూ తిరిగే దానితోను, సోది చెపుతూ బ్రతికే ఎరుకల సానితోను, వశీకరణ మూలికలు, ఔషధాలు అమ్మేదానితోను, ఎప్పుడు కూడా స్నేహం చెయ్యకూడదు. వాళ్ళతో పొత్తుపెట్టుకోనూరాదు.

10. *భోజనే చ రుచితమిదమస్మై ద్వేష్యమిదం పథ్య*
*మిదమపథ్యమిదమితి చ విద్యాత్ త్యాగోపాదానార్థం.*

తన భర్త ఏరుచికర పదార్థాలంటే ఎక్కువ ఇష్టపడతాడో కనిపెట్టి ఆ ఆహార పదార్థాలే తయారుచేసి, భోజన సమయాల్లో వడ్డించాలి భార్య.

11. *స్వరం బహిరుపశ్రుత్య భవనమాగచ్ఛతః కిం కృత్యమితి బ్రువతీ సజ్జా భవనమధ్యే తిష్ఠేత్.*

భర్త ఇంటికి వచ్చేవేళ భార్య కనిపెట్టి, అతనికి అత్యావసరంగా కావలసినవేవో అడిగి తెలుసుకుని, ఆ పనులు చేయడానికి సంసిద్ధురాలై ఉండాలి. తను ఇల్లుచేరగానే

ఎదురుగా భార్య కళకళలాడుతూ కనిపించి, అతనికి ఏం కావాలో అడిగి తెలుసుకుని ఆ పనులుచేస్తూ ఉంటే భర్తకు ఎంతో తృప్తి, ఆనందం కలుగుతాయి.

*12. పరిచారికామపనుద్య స్వయం పాదౌ ప్రక్షాళయేత్.*

అలా ఇంటికి వచ్చిన భర్తకు, ఇంట్లో పనివాళ్ళు, దాసీలు ఉన్నాకూడా, భార్య స్వయంగా అతనికి కాళ్ళు కడగాలిగాని, పనివాళ్ళచేత, లేక దాసీల చేత ఆ పని చేయించకూడదు.

*13. నాయకస్య చ న విముక్తభూషణం విజనే సందర్శనే తిష్ఠేత్.*

పతి ఒంటరిగా ఉన్నప్పుడు, భార్య నగలు లేకుండా గానీ, అలంకారాలు లేకుండాగానీ అతని దగ్గరికి వెళ్ళకూడదు. అసలు అలాంటి స్థితిలో అతనికి కనిపించనే కూడదు.

*14. అతివ్యయం, అసద్వ్యయం వా కుర్వాణం రహసి బోధయేత్.*

కొందరు భర్తలు ఆదాయాన్ని మించి అతిగా ఖర్చు చేస్తుంటారు. లేదా దుర్వ్యసనాలకు లోనై ధన వ్యయం చేస్తారు. ఇంకా కొందరు దుష్కార్యాలకు ధనం వెచ్చిస్తూ ఉంటారు. అలాంటి సందర్భాల్లో ఏకచారిణి అయిన భార్య, ఆ విషయం గ్రహించి, అతను ఏకాంతంగా ఉన్న తరుణంలో చెంతకు చేరి, మంచిచెడ్డలు విడమర్చి చెప్పాలి. ఇలా అయితే, సంసారం గుల్ల అవుతుందని శాంత వచనాలతో బోధచేయాలి.

*15. ఆవాహే, వివాహే, యజ్ఞే గమనే సఖీభిస్సహ గోష్ఠీం*
*దేవతాఽభిగమనమిత్యనుజ్ఞాతా కుర్యాత్.*

పెళ్ళిళ్ళు, యజ్ఞ యాగాదులు, విందులు, ఉత్సవాలు మొదలైనవి ఎక్కడైనా జరుగుతూ ఉంటే, భార్య వాటిని చూడాలనుకున్నప్పుడు ముందుగా భర్త అనుమతిని పొందాలి. అలా అనుమతి పొంది తనకు నమ్మకస్థురాలైన చేలికత్తెలనో, స్నేహితురాండ్రనో వెంటపెట్టుకుని ఆ ప్రదేశాలకు వెళ్ళాలి. అలా చేయకపోతే ఈమె 'స్వేచ్ఛా విహారిణి' అని భర్త అనుమానిస్తాడు. లోకులు నిందిస్తారు.

*16. సర్వక్రీడాను చ తదానులోమ్యేన ప్రవృత్తిః.*

యక్షరాత్రి మున్నగు ఉత్సవాలు, క్రీడలు జరిగేటప్పుడు కూడా భర్త అభిప్రాయానుసారం ప్రవర్తించాలి భార్య.

*17. పశ్చాత్సంవేశనం పూర్వముత్థానమనవబోధనం చ సుప్తస్య.*

భర్త శయనించిన తరువాతనే భార్య పడుకోవాలి. అతను లేవకముందే నిద్రలేవాలి. పనిభారంవల్ల భర్త అలసిపోయి నిద్రపోతూ ఉంటే, అతన్ని లేపకూడదు.

*18. మహానసం చ సుగుప్తం స్యాద్దర్శనీయం చ.*

మహానసం అంటే వంటశాల. ఈ వంట ఇంటిని ఎల్లప్పుడూ చాలా రహస్యంగాను, పరిశుభ్రంగాను, ఆకర్షణీయంగాను ఉంచుకోవాలి.

(కొందరి వంటిళ్ళు చూస్తే, ఆకలి అవుతున్నా అన్నం లినబుద్ధిపుట్టదు. అంత అసహ్యంగా, మురికిగా ఉంటాయి!)

19. *నాయకాపచారేషు కిం చిత్కలుషితా నాత్యర్థం నిర్వదేత.*

భర్త ఎప్పుడైనా ఏదైనా తప్పు చేయవచ్చు. పొరపాటు చేయవచ్చు. అయినా భార్య ఆయా సందర్భాలనుబట్టి, అవసరాలను బట్టి ఓర్పుతో, గంభీరంగాఉండవచ్చు. లేక అనవరమనుకుంటే ఇంచుక కోపించనూ వచ్చు. కోపం తెచ్చుకున్నా కూడా నెమ్మదిగా మందలించాలేకాని, పోట్లాట పెట్టుకోకూడదు. రాక్షసిలా గొంతు చించుకుంటూ అసహ్యం పుట్టేలా తిట్లకు దిగకూడదు.

20. *సాధిక్షేపవచనం త్వేనం మిత్రజనమధ్యస్థం ఏకాకినం*
*వాzప్యుపాలభేత న చ మూలకర్మాస్యాత్*

ఒకవేళ భర్తను మందలించాల్సివస్తే, ఏకాంతంగా మందలించాలిగాని నలుగురి సముక్షంలో కాదు. అతను స్నేహితులు మున్నగువారి మధ్య ఉన్నప్పుడు మృదువైన అధిక్షేపవచనాలతో నెమ్మదిగా మందలించాలేకాని వెర్రెత్తినట్లు విరుచుకుపడరాదు. విరక్తి పుట్టేలా మాట్లాడకూడదు. అలా చేస్తే మొదటికే మోసం వస్తుంది.

21. *న హ్యతోzన్యదప్రత్యయకారణమస్తీతి గోనర్దీయః.*

నలుగురి ఎదుటా దురుసుతనంతో భర్తను దూషించడంకన్నా అవిశ్వాస కారణం మరొకటి ఉండదన్నాడు గోనర్దీయుడు. అంటే, అలా మాట్లాడితే భర్త తన భార్యపై పూర్తిగా విశ్వాసం కోల్పోతాడన్నమాట.

22. *దుర్వ్యాహృతం దుర్నిరీక్షితమన్యతో మంత్రణం ద్వారదేశావస్థానం*
*నిరీక్షణం వా నిష్కుటేషు మంత్రణం వివిక్తేషు చిరమవస్థానమితి వర్జయేత్.*

ఏకచారిణిగా ఉన్న స్త్రీ ఎప్పుడూ కూడా భర్తతో దురాలోచన చెయ్యకూడదు. దుర్భాషలాడకూడదు. దోషబుద్ధితో చూడకూడదు. ఎప్పుడూ వాకిట్లో ఔచిత్యం లేకుండా నిలబడకూడదు. భర్త పలకరించినప్పుడు పెడముఖం పెట్టరాదు. వీధిలోకి తొంగిచూస్తూ ఉండకూడదు. పూలతోటలో ఒంటరిగా ఎంతోసేపు నిలబడి ఉండకూడదు.

23. *స్వేదదంతపంకదుర్గంధాళ్ళ బుధ్యేతేతి విరాగకారణం.*

శరీరానికి చెమటపట్టి ఉన్నప్పుడు. పళ్ళు తోముకోకుండాను, కళ్ళు పుసులుకట్టి ఉండగాను, దుర్గంధంతోను ఎప్పుడూ భర్త ఎదుటికి రాకూడదు. అలావస్తే భర్త విరక్తుడవుతాడు.

24. *బహుభూషణం, వివిధ కునుమానులేపనం వివిధాంగ*
*రాగసముజ్వలం, నానావర్ణం వాన ఇత్యాభిగామికో వేషః.*

25. *ప్రతనుశ్లక్ష్ణాల్పదుకూలతా పరిమితమాభరణం, సుగంధితా నా*
*త్యుల్బణమాలేపనం తథా శుక్లాన్యన్యాని పుష్పాణీతి వైహారికో వేషః.*

# స్త్రీల వేషం ఎప్పుడు, ఎలా ఉండాలి ?

స్త్రీలు ధరించే వేషాలు రెండు రకాలు. ఒకటి ఆగామికం, రెండు నైహారికం. ఆగామికం అంటే భర్తతో కూడడానికి చేసుకునే అలంకారం. రకరకాల సొమ్ములు పెట్టుకుని పరిమళ ద్రవ్యాలు,' అంగరాగాలు పూసుకుని, దేశకాలాదులను అనుసరించి చీరలు, రవికలు ధరించడం - ఇది భర్తను కలియడానికై వేసుకునే వేషం. ఇక నైహారికమంటే ఏదైనా ప్రయాణం చేసేటప్పుడు వేసుకునే వేషం. అలాంటి సమయాల్లో వంటిమీద బరువు కాకుండా, మరీ పెద్దది కాకుండా ఉండే చీరకట్టుకుని, తెల్లటివి లేదా మరో రంగు గలవి అయిన పూలు తలలో పెట్టుకుని వెళ్ళాలి.

*26. నాయకన్య వ్రతముపవానం చ న్వయమపి కరణే నానువర్తేత*
*వారితాయాం చ నాహమత్ర నిర్బంధనీయేతి తద్వచసో నివర్తనం.*

భర్త ఏదైనా దీక్షలూ, ఉపవాసాలూ చేస్తుంటే అప్పుడు భార్య కూడా అతన్ని అనుసరిస్తూ తాను కూడా ఆ వ్రతాల్లో, ఉపవాసాల్లో పాల్గొంటూ ఉండాలి. ఒకవేళ భర్త వద్దని చెప్పినా, 'ఈవిషయంలో నన్ను నిర్బంధించకండి' అని నెమ్మదిగా నచ్చచెప్పి, మాట తప్పించాలి.

*27. మృద్విదళకాష్ఠ, చర్మ, లోహ భాండానాం చ కాలే నమగ్రహణం.*

మృణ్మయ పాత్రలు, వెదురు బుట్టలు, పీటలు, మంచాలు, ముంతలు, మూకుళ్ళు, ఇత్తడిపాత్రలు, తోలుతిత్తులు, రాగిపాత్రలు - ఇలాంటి వస్తువులన్నీ సకాలంలో తెచ్చి ఇంట్లో అట్టేపెట్టుకోవాలి.

*28. తథా లవణస్నేహయోశ్చ గంధద్రవ్యకటుక భాండౌషధానాం చ*
*దుర్లభానాం భవనేషు ప్రచ్ఛన్నం నిధానం.*

అదే విధంగా సైంధవలవణం మున్నగు లవణాలు, నెయ్యి, నూనె మొదలైన ఖాద్యతైలాలు, సుగంధద్రవ్యాలు, ఔషధాలు - ఇలాంటివి అనుకున్నప్పుడల్లా దొరకవు కాబట్టి వాటిని ముందుగానే సంపాదించుకుని రహస్యంగా ఇంట్లో భద్రపరుచుకోవాలి.

# కులకాంత బాధ్యతలు

*29. మూలకాలుకపాలంకీ దమనకామ్రాతకైర్వారు కత్రపునూర్తాక*
*కుష్మాండాలాబునూరణ శుకనాస న్వయంగుప్తాతిలపర్ణికాZగ్ని*
*మంథలశునపలాండు ప్రభృతీనాం సర్వౌషధీనాం చ*
*బీజగ్రహణం కాలే వాపశ్చ.*

ముల్లంగి, పాలంకి, అందుగు, దమనకం ?, ఆమ్రాతకం ?, ఆంబాలకం ?, ఏర్వారుకం ?, హోరుకం ?, దోస, వంగ, గుమ్మడి, ఆనప, కంద, అవిసె, నీరుల్లి, వెల్లుల్లి, మొదలైన కాయల విత్తనాలు, దుంపలు జాగ్రత్తగా అట్టేపెట్టుకుని, అవసరాన్ని అనుసరించి పాదులు పెట్టి పండించుకోవాలి.

*30. న్వయం చ సారన్య పరేభ్యో నాఖ్యానం భర్తు మంత్రి తన్య చ.*

తనకు గల ధన ధాన్య సంపదను గురించి ఎవరికీ చెప్పవద్దని, భర్త భార్యకు రహస్యంగా చెపుతాడు. ఇల్లాలు అలాగే ఆ విషయం ఇతరులకు వెల్లడి చేయకుండా వుండాలి. అసలు కులకాంతలు బయటపెట్టకూడని విషయాలు సంసారంలో చాలా ఉన్నాయి. వాటిల్లో ఆయుష్షు ధనం, గృహచ్ఛిద్రం, రహస్య ఆలోచనలు, ఓషధులు, దానం, మానం, అవమానం మున్నగునవి చాలా ముఖ్యమైనవి.

*31. సమానాశ్చ స్త్రియః కౌశలేన ఉజ్వలతయా పాకేన మానేన తథోపచారైరతిశయీత.*

ఏకచారిణి అయిన స్త్రీ తన ఈడు, జోడు అయిన వారిలో యోగ్యురాలు. నేర్పరి, శుచిమతి, బుద్ధిమతి, వంట చేయడంలో సిద్ధహస్తురాలు అనే పేరుతెచ్చుకోవాలి.

*32. సాంవత్సరికమాయం సంఖ్యాయ తదనురూపం వ్యయం కుర్యాత్.*

తమకు ఏడాదికి ఎంత ఆదాయం వస్తుందో లెక్క వేసుకుని, దానికి తగినట్లుగానే ఖర్చు చెయ్యాలి. అంతేకాని ఆదాయాన్ని మించి వ్యయం చేయకూడదు.

*33. భోజనావశిష్టాద్గోరసాత్ సారగ్రహణం తథా తైలగుడయోః*
*కర్పాసస్య చ సూత్రకర్తనం, సూత్రస్య వానం, శిక్యరజ్జుపాశవల్కలసంగ్రహణం,*
*కుట్టన కండనావేక్షణం, ఆచామమండతుషకణకుట్యంగా రాణాముపయోజనం.*
*భృత్యవేతనభరణజ్ఞానం, కృషి పశుపాలనచింతా, వాహనవిధానయోగాః,*
*మేష కుక్కుట లావక శారికా పరభృత మయూర వానరమృగాణామవేక్షణం,*
*దైవసికాయవ్యయపిండీ కరణమితి చ విద్యాత్.*

యజ్ఞయాగాది క్రతువులు జరిగేటప్పుడు బ్రాహ్మణ సమారాధనాదులు చేసి, వారు భుజించగా మిగిలిన పాలు తోడుపెట్టుకుని పెరుగుచెయ్యాలి. నువ్వులు మున్నగువాటిలోనుంచి నూనెతీసి అట్టేపెట్టుకోవాలి. చెరకురసం తీయించి, బెల్లం తయారు చేయించుకోవాలి. ప్రత్తి వడికి నూలు తయారుచేసుకోవాలి. ఆ నూలుతో వస్త్రాలు నేయించుకోవాలి. ఉట్లు, చేంతాళ్ళు, నార చీరలు, మొదలైనవి నారతో తయారు చేసుకోవాలి. దాసీలు, పరిచారకులు ధాన్యం దంచుతూ ఉన్నప్పుడు దగ్గరుండి పర్యవేక్షించాలి. ఊక, రంపపుపొట్టు, బొగ్గులు మొదలైనవి జాగ్రత్త చేసుకోవాలి. దాసీలకు, పనివాళ్ళకు జీతభత్యాలు చెల్లించడానికి అవసరమైన కొలతలు, కొలపాత్రలు, అట్టేపెట్టుకొని లెక్కలు జాగ్రత్తగా చూసుకోవాలి. వ్యవసాయ పనులు, పశుపోషణ, పశుపాలన, ఇంట్లో పెంచుకునే మేకలు, గొర్రెలు, కోళ్ళు, పావురాళ్ళు, గోరువంకలు, కోయిలలు, నెమళ్ళు, కోతులు, లేళ్ళు మొదలగు పెంపుడు జంతువుల ఆహారాదుల విషయంలో శ్రద్ధవహించాలి. జమాఖర్చులను లెక్క తేల్చుకోడం కూడా గృహిణి బాధ్యత.

(ఇవన్నీ ఆనాటి గ్రామీణ జీవితం ఎంత కట్టుదిట్టంగా, విలక్షణంగా ఉండేదో సూచిస్తాయి. అలాగే ఇల్లాలు ఎంతగా బాధ్యతలు నిర్వహిస్తుందో తెలుపుతాయి.)

*34. తజ్జఘన్యానాం చ జీర్ణవాససాం సంచయః తైర్వివిధరాగైః శుద్ధైర్వా కృతకర్మణాం*
*పరిచారకాణాం అనుగ్రహో మానార్థేషు చ దానమన్యత్ర వా ఉపయోగః*

తన భర్త కట్టి విడిచిన బట్టలు, ఇంట్లో దాసీలు లేదా పరిచారికలు ఉతికి శుభ్రం చేయడానికిగాను పోగుచేసి ఉంచాలి. అప్పుడప్పుడు పనివాళ్ళకు మంచిబట్టలు ఇచ్చి వాళ్ళను సంతోషపరుస్తూ ఉండాలి. లేదా కొన్ని పాతబట్టలు ఇంట్లో ఇతర పనులకోసం కూడా ఉపయోగించుకోవచ్చు.

*35. సురాకుంభీనామాసవకుంభీనాం చ స్థాపనం,*
*తదుపయోగః క్రయవిక్రయాయవ్యయావేక్షణమ్.*

మద్యం, ఆసవాలు మున్నగు పానీయాలను జాగ్రత్తగా ఇంట్లో భద్రపరచుకుని, అవసరం వచ్చినప్పుడు ఉపయోగించికునే నేర్పు ఉండాలి. లేదా వాటిని విక్రయించి, అందువల్ల వచ్చిన ఆదాయం, లెక్క చూచుకోడం కూడా ఏకచారిణి బాధ్యత.

*36. నాయకమిత్రాణాం చ స్రగనులేపనతాంబూలదానైః పూజనం న్యాయతః*

*37. శ్వశ్రూశ్వశురపరిచర్యా తత్పారతంత్ర్యమనుత్తర వాదితా,*
*పరిమితాప్రచండాలాపరకణమనుచ్చైర్హాసః.*

38. తత్ప్రియాప్రియేషు స్వప్రియాప్రియేష్వివ వృత్తిః.

39. భోగేష్వనుత్సేకః.

40. పరిజనే దాక్షిణ్యం.

41. నాయకస్యానివేద్య న కస్మై చిద్దానమ్.

42. స్వకర్మసు భృత్యజననియమనముత్సవేషు చ
అస్య పూజనమిత్యేకచారిణీవృత్తం.

ఏకచారిణి చేయవలసిన పనులు ఇంకా చెపుతున్నారు. భర్త స్నేహితులు, మున్నగువారు ఇంటికివస్తే, న్యాయాన్ని అనుసరించి వారిని పుష్ప, గంథ, తాంబూలాదులతో గౌరవిస్తూ వుండాలి. అత్తమామలకు పెద్దలకు పరిచర్యలు చేస్తూ ఉండాలి. తాను ఏ పని చేయబోతున్నా విధిగా వారి అనుమతి పొందాలి. అంతేకాని వారికి ఎదురు చెప్పరాదు. వారి ఎదుట చాలా క్లుప్తంగా, ముక్తసరిగా, మృదువుగా మాట్లాడాలి. ముఖం ముడుచుకోకుండా, భర్త ఇష్టాఇష్టాలను అనుసరించి తాను ప్రవర్తిస్తూ ఉండాలి. అంతేకాని తాను ఏవో భోగాలలో, సుఖాలలో మునిగిపోయి, మైమరచి ఉండరాదు. సేవకులపట్ల ఎంతో కనికరం చూపాలి. భర్తకు తెలియకుండా ఎవరికీ ఏమీ ఇవ్వకూడదు. పనివాళ్ళ పరిస్థితిని ఎప్పటికప్పుడు విచారణ చేస్తూ, అర్హతను బట్టి వారికి పనులు అప్పగిస్తూ, పండుగలు మొదలైనవి వచ్చినప్పుడు వారికి భోజనం పెట్టి సంతుష్టి పరుస్తూ ఉండాలి.

*43. ప్రవాసే చ మంగళమాత్రాభరణా దేవతోప*
*వాసపరా వార్తాయాం స్థితా గృహానవేక్షేత.*

ఇంతవరకూ చెప్పినవన్నీ భర్త దగ్గర ఉన్నప్పుడు ఏకచారిణి చేయవలసిన పనులు, నిర్వహించి వలసిన బాధ్యతలు. ఇక భర్త దూరదేశంలో ఉన్నప్పుడు ఎలా నడుచుకోవాలో చెపుతున్నారు. భర్త దూరదేశం గాని గ్రామంతరం గాని

వెళ్ళినప్పుడు మంగళప్రదమైన మంగళసూత్రం ముక్కుపడక, కర్ణాభరణాలు, గాజులు మాత్రం ధరించాలి. భర్త క్షేమాన్ని, ఆరోగ్యాన్ని అభిలషిస్తూ దేవతా పూజలు, వ్రతాలు, ఉపవాసాలు చేస్తూ ఉండాలి. భర్త ఎప్పుడు వస్తాడా, ఆయన క్షేమ సమాచారం ఎప్పుడు తెలుస్తుందా అని ఎదురుచూస్తూ, పనులు చేసుకోవాలి.

*44. శయ్యా చ గురుజనమూలే.*

*45. తదభిమతా కార్యనిష్పత్తిః.*

*46. నాయకాభిమతానాం చ అర్థమామార్జనే ప్రతి నంస్కారే చ యత్నః.*

అత్తగారు మొదలైన గురుజనులవద్ద, వృద్ధులవద్ద శయనించాలి. వారి అనుమతితోనే గృహ కృత్యాలలో పాల్గొనాలి. తన పతికి ఇష్టమైన పనులు మాత్రమే పూర్తిచేస్తూ, అతనికి ఇష్టంలేని పనులు వదిలేస్తూ ఉండాలి.

*47. నిత్యనైమిత్తికేషు కర్మను ఉచితో వ్యయః.*

*48. తదారబ్ధానాం చ కర్మణాం నమాపనే మతిః*

నిత్యము అంటే రోజూ వచ్చేవి. నైమిత్తికాలంటే అప్పుడప్పుడు వచ్చేవి. ఈ రెండు రకాలైన పనులకూ ఉచితమైన వ్యయంచేస్తూ ఉండాలి. భర్త ప్రారంభించి, పూర్తిచేయకుండా ఉన్న కార్యాలు శ్రద్ధగా, జాగ్రత్తగా పూర్తిచేయాలి.

*49. జ్ఞాతికులస్యానభిగమనమన్యత్ర వ్యననోత్సవాభ్యాం.*

*50. తత్రాపి నాయకపరిజనాధిష్ఠితాయా నాతికాలమవ స్థానమపరివర్తితప్రవానవేషతా చ.*

తన పుట్టింట్లో అత్యవసరమైన కార్యం ఉంటే తప్ప, ప్రవాస దీక్షలో, అనగా భర్త ఊళ్ళోలేనప్పుడు ఏకచారిణి అక్కడకు వెళ్ళకూడదు. ఒకవేళ విధిగా వెళ్ళవలసివస్తే, భర్త పరిజనులను వెంటపెట్టుకుని వెళ్ళాలి. వెళ్ళినా ఎక్కువ రోజులు అక్కడ ఉండరాదు. ఉన్నాకూడా తన ప్రవాసదీక్ష కొనసాగిస్తూనే ఉండాలి.

*51. గురుజనానుజ్ఞాతానాం కరణముపవాసానాం.*

*52. పరిచారకైః శుచిభిరాజ్ఞాZధిష్ఠితైరనుమతేన క్రయవిక్రయకర్మణా సారస్యాపూరణం, తనూకరణం, చ శక్త్యా వ్యయానాం.*

నాయకుడు ఊళ్ళోలేనప్పుడు ఏకచారిణి అత్తమామల అనుజ్ఞతో వ్రతోపవాసాదులు చేసుకోవాలి. విశ్వాసపాత్రులైన పరిచారకుల ద్వారా ఆదాయానికి భంగం లేకుండా, క్రయవిక్రయ కార్యాలను పెద్దల అనుజ్ఞతో చేయించాలి. ఒక్కొక్కప్పుడు వ్యయం ఎక్కువగా ఉంటే, ఉపాయంగా ఖర్చు తగ్గించడానికి ప్రయత్నించాలి.

*53. ఆగతే చ ప్రకృతిస్థాయా ఏవ ప్రథమతో దర్శనం, దైవతపూజనముపహారాణాం చాహరణమితి ప్రవానచర్యా.*

భర్త దేశాంతరంనుంచి తిరిగి రాగానే, అప్పటిదాకా ఉన్న వేషంతోనే ఆయనకు కనిపించి, తరువాత దేవతా పూజలు, మొక్కులు చెల్లించుకోవాలి. ఇది భర్త దేశాంతర గతుడైన సమయంలో ఏకచారిణి అనుసరించవలసిన విధానం.

*54. భవతశ్చాత్ర శ్లోకా — సద్వృత్తమనువర్తేత నాయకస్య హితైషిణీ, కులయోషా పునర్భూర్వా వేశ్యావా ऽ ప్యేకచారిణీ.*

పైన పేర్కొన్న ఏకచారిణి ప్రవర్తించ వలసిన విధానం గురించి పెద్దలు చెప్పిన శ్లోకాలు రెండు ఉన్నాయి. ఏకచారిణి కులకాంత అయినా, లేక మారుమనువు కట్టుకున్నదైనా, ఆఖరుకు వేశ్య అయినా సత్ప్రవర్తనతో ఉండాలి.

*55. ధర్మమర్థం తథా కామం లభంతే స్థానమేవ చ, నిః సపత్నం చ భర్తారం నార్యః సద్వృత్తమాశ్రితాః.*

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే భార్యాऽధికారికే*
*చతుర్థేధికరణే ఏకచారిణీవృత్తం ప్రవాసచర్యా చ ప్రథమోధ్యాయః.*

ఈ విధంగా నడుచుకునే స్త్రీలు ధర్మార్థకామాలను పొందడమే కాక గొప్ప పతివ్రతలుగా పేరు ప్రతిష్ఠలు పొందుతారు.

ఇది వాత్స్యాయనముని విరచిత కామసూత్రాల్లో భార్యాధికారికాధికరణం అనే నాలుగో అధికరణంలోని ఏకచారిణీ వృత్తం - ప్రవాసచర్య అనే ప్రథమాధ్యాయం.



# ద్వితీయాధ్యాయం
## జ్యేష్ఠా వృత్తం

1. *జాడ్యదౌశ్శీల్యదౌర్భాగ్యేభ్యః ప్రజాఽనుత్పత్తేరా భీక్ష్ణ్యేన దారికోత్పత్తేర్నాయకచాపలాద్వానపత్న్యధివేతనమ్.*

ఇంతకు ముందు అధ్యాయంలో స్త్రీ ఏకచారిణిగా అంటే తన భర్తకు తానొక్కతే భార్యగా ఉన్నప్పుడు ఆమె నడుచుకోవలసిన విధానం గురించి చెప్పారు. ఇక సవతులతో కలిసి కాపురం చేయవలసిప్పుడు, సాధ్వి ఎలా ప్రవర్తించాలో చెపుతున్నారు. అంటే ఇది పెద్ద భార్యా - లేక మొదటి భార్యా అనుసరించవలసిన విధానం. మొదట, సవతి అనేది ఎందులకు ఏర్పడుతుందో ఆ కారణాలు పేర్కొంటున్నారు.కట్టుకున్న కాంత పరమ మూర్ఖురాలుగా ఉన్నా, పరమ కోపిష్టిదైనా, శీలవతి కాకపోయినా, పిల్లలులేని గొడ్డుమోతుదైనా, అదేపనిగా ఆడపిల్లలనే కంటున్నా ఆ పురుషుడు మరో పెళ్ళాన్ని కట్టుకోడానికి వీలున్నది. అంచాత స్త్రీలలో ఉండే దోషాలవల్ల ఏర్పడిన కారణాలు ఇవి. పురుషుడు చపలబుద్ధి కలవాడైతే సవతి ఏర్పడే అవకాశం ఉంది. ఇది పురుషులలో ఉండే దోషంవల్ల ఏర్పడిన కారణం.

2. *తదాదిత ఏవ భక్తిశీలవై దగ్ధ్యఖ్యాపనేన పరిజిహీర్షేత్.*

3. *ప్రజాఽనుత్పత్తౌ చ స్వయమేవ సాపత్న్యే చోదయేత్.*

అంచాత మొదటినుంచీ భార్య భర్త యెడల భక్తి విశ్వాసాలు ప్రదర్శిస్తూ, శీలాన్ని జాగ్రత్తగా కాపాడుకుంటూ, పని-పాటలలో చక్కని నేర్పు సంపాదించుకుని - మొదటి మూడు దోషాలూ లేకుండా చేసుకోవాలి. చివరి రెండు దోషాలకు కారణం ఆమె కాదు, అది ప్రారబ్దం. అలాంటప్పుడు మరో పెళ్ళి చేసుకోమని తానే భర్తను ప్రోత్సహించాలి భార్య. అలాగే పురుషుడిలో గల చపలత్వాన్ని కూడా తెలివితేటలచేత, నేర్పుచేత పోగొట్టాలి.

4. *అధివిద్యమానా చ యావచ్ఛక్తియోగాదాత్మనోఽధికత్వేన స్థితిం కారయేత్.*

ఆ ప్రకారం భర్త రెండో పెళ్ళి చేసుకోవలసి వస్తే ఆ రెండో భార్యకూడా పెద్దదైన తన సవతికి తనకన్న ఉన్నతస్థితి, గౌరవ మర్యాదలు లభించేటట్లు చూడడానికి శక్తి వంచన లేకుండా ప్రయత్నించాలి.

5. *ఆగతాం చైనాం భగినికావదీక్షేత.*

6. *నాయకవిదితం చ ప్రాదోషికం విధిమతీవ యత్నాదస్యాః కారయేత్.*

7. *సౌభాగ్యజం వైకృతముత్సేకం వా అస్యా నాద్రియేత్.*



## చిన్నదైన సవతి పట్ల ఎలా ఉండాలి ?

పెద్ద భార్య సయితం చిన్నదైన తన సవతిని చెల్లితో సమానంగా చూడాలి. సవతిని సాయంకాలాల్లో చక్కగా అలంకరించి, భర్తకు సంతోషం కలిగేలా చెయ్యాలి. ఒకవేళ ఆ సవతి సహజంగానే తనకంటె అందగత్తెగా ఉండి, గర్వపడుతున్నా తాను ఈర్ష్యపడకూడదు. పట్టించుకోకుండా ఉండాలి.

*8. భర్తరి ప్రమాద్యంతీము పేక్షేత.*

*9. యత్ర మన్యేతార్థమియం న్వయమపి ప్రతిపత్స్యత ఇతి తత్రైనామాదరతఏవానుశిష్యాత్.*

*10. నాయకప్రసంశవే చ రహసి విశేషానధికాన్దర్శయేత్.*

*11. తదపత్యేష్వవిశేషః.*

*12. పరిజనవర్గేऽధికానుకంపాః.*

*13. మిత్రవర్గే ప్రీతిః.*

*14. ఆత్మజ్ఞాతిషు నాత్యాదరః.*

*15. తజ్జ్ఞాతిషు చాతిసంభ్రమః.*

పైన చెప్పినట్లుగా చిన్న సవతి తాను అందగత్తెనని గర్వంతో విర్రవీగుతూ పతి విషయంలో ప్రమోదం పొందుతూ ఉన్నా పెద్ద భార్య ఏమీ మాట్లాడకూడదు. ఎవరి దోషం వారికే తగులుతుంది లెమ్మని కిమ్మనకుండా వూరుకోవాలి. తన భర్త రతి సుఖంకోసం తానే ఈ సవతిని సమకూర్చి ఉంటే, తన ప్రేమను వ్యక్తం చేయడానికి ఎంతో ఆదరంతో, పొరపాటు పడవలదని మందలించాలి. భర్త సమక్షంలోనే ఆ సవతికి ఎల్లప్పుడూ మంచి విషయాలు బోధిస్తూ ఉండాలి. అనేక విషయాలను గురించి ఆమెకు చెపుతూ ఉండాలి. ఆమె బిడ్డలను తన

బిడ్డల్లా చూడాలి. ఆమె పరిచారికలను, తన పరిచారికల కన్న మిన్నగా, గౌరవ మర్యాదలతో, ప్రేమాదరములతో చూడాలి. అలాగే ఆమె చెలులను ఎంతో ప్రేమగా చూడాలి. ఆమె బంధుజనులను ఎంతగానో గౌరవిస్తూ ఉండాలి.

*16. బహ్వీభిస్త్వధివిన్నా అవ్యవహితయా సంసృజ్యేత.*

సవతులు పలువురితో కాపురం చేయవలసి వస్తే, తన తరువాత సవతితో మాత్రమే ఆదరాభిమానాలు, స్నేహం ప్రకటిస్తూ ఉండాలి.

*17. యాం తు నాయకో౽ధికాం చికర్షేత్తాం భూతపూర్వ సుభగయా ప్రోత్సాహ్య కలహయేత్.*

సవతుల్లో ఏ సవతిని భర్త ఎక్కువగా ప్రేమిస్తూ, ఆదరిస్తున్నాడో దానితో అంతకుముందు భర్త ప్రేమాభిమానాలకు పాత్రురాలైన సవతికి పోగడ్తలతో పోట్లాట పెట్టాలి తెలివిగా. అలా చేయడంతో ఆమె ఆధిక్యత కొంత సన్నగిల్లుతుంది.

*18. తతశ్చానుకంపేత.*

ఇలా కలహం సాగేటప్పుడు, ఒక్కొక్కరిని రహస్యంగా ఇవతలికి పిలిచి ఓదార్చి, తుదకు తగువు మానుకునేలా చేయాలి.

*19. తాభిరేకత్వేనాధికాం చికీర్షితాం స్వయమవివదమానా దుర్జనీకుర్యాత్.*

సవతులందరూ సమైక్యంగా మెలిగేటప్పుడు కూడా, పురుషుడు దేన్ని అయితే, అదికురాలుగా పరిగణిస్తూ ఉంటాడో, ఆవిడతో మాత్రం తాను ఎప్పుడూ తగవు పెట్టుకోకూడదు. ఇతరులతో కలిసి కుట్రపన్ని ఆమెలో గల తప్పులను బయటపెట్టాలి.

*20. నాయకేన తు కలహితామేనాం పక్షపాతావలంబనో౽పి బృంహితా మాశ్వాసయేత్.*

ఒకవేళ పురుషుడితో ఆమెకే తగవు వస్తే, అప్పుడు తానే ఆమె పక్షం వహించి ఆమెకు బదులుగా తానే సమాధానాలు చెపుతూ ఆమెకు వూరటకలిగించాలి.

*21. కలహం చ వర్ధయేత్.*

ఈ విధంగా సవతి పక్షం వహించి భర్తమీదనే దోషం ఆరోపిస్తూ, అతనితో ఆమె తగవును మరింతగా పెంచాలి.

*22. మందం వా కలహముపలభ్య స్వయమేవ సంధుక్షయేత్.*

ఇలా కలహం పెద్దగా ప్రజ్వరిల్లిన పిమ్మట, అది కొద్ది కొద్దిగా చల్లారుతున్నట్లు కనిపిస్తే, అప్పుడు తానే స్వయంగా పూనుకొని అది మళ్ళీ పెద్దదిగా రగుల్కొనేలా చెయ్యాలి.

*23. యది నాయకో౽స్యామద్యాపి సానునయ ఇతి మన్యేత*
*తదాస్వయమేవ సంధౌ ప్రయతేత, ఇతి జ్యేష్ఠా వృత్తమ్.*

ఈ విధంగా కలహం పెంచినా కూడా పురుషుడు ఆమె పైనే ప్రేమానురాగాలు కలిగి ఉన్నట్లయితే, అప్పుడు తానే స్వయంగా పురుషుణ్ణి సముదాయిస్తూ, సంధి ప్రయత్నం సాగించాలి. అంటే పెద్ద భార్య కాపురం చెడిపోకుండా సర్దుబాటు చెయ్యాలన్నమాట. ఇప్పటిదాకా చెప్పిందతా పెద్ద భార్య నడచుకోవలసిన విధానం.

*24. కనిష్ఠా తు మాతృవత్సపత్నీం పశ్యేత్.*

ఇక ఇప్పుడు సవతులలోకెల్ల చిట్టచివరిది ప్రవర్తించవలసిన తీరును గురించి చెపుతున్నారు. కనిష్ఠ అంటె చిట్టచివరి భార్య. ఈమె తన పెద్ద సవతిని కన్నతల్లిలా గౌరవంగా చూడవలసి ఉంటుంది.

*25. జ్ఞాతి దాయమపి తస్యా అవిదితం నోపయుంజీత.*

ఈ చిట్ట చివరి భార్య, తన పుట్టింటినుండి ఏది లభించినాసరే, దాన్ని తన పెద్ద సవతికి చెప్పకుండా ఉపయోగించుకోరాదు. అలాంటప్పుడు భర్త ఇచ్చిందేదైనా సరే, ఆమెకు తెలియకుండా వాడుకోకూడదని వేరే చెప్పక్కర్లేదు.

*26. ఆత్మవృత్తాంతాన్ తదధిష్ఠితాన్ కుర్యాత్.*

తనకు సంబంధించిన విషయాలన్నీ పెద్ద సవతి అధీనంలోనే ఉండేలా చూచుకోవాలి.

*27. అనుజ్ఞాతా పతిమధిశయీత.*

ఆమె అనుమతితోనే, ఇష్టంతోనే, వరుసక్రమాన్ని అనుసరించి భర్తతో పడుకోవలసి ఉంటుంది.

*28. న వా తస్యా వచనమన్యస్యాః కథయేత్.*

పెద్ద సవతి చెప్పిన మాటలు మంచివి కావచ్చు, చెడ్డవి కావచ్చు. అవి ఎలాంటివైనా సరే వాటిని ఇతరులతో చెప్పకూడదు, చిట్ట చివరి భార్య. అలా చెపితే తగవులు వస్తాయి.

*29. తదపత్యాని స్వేభ్యోధికాని పశ్యేత్.*

అంతేకాదు. పెద్ద సవతి సంతానాన్ని తన బిడ్డలకన్నా ఎక్కువ ప్రేమగా చూచుకోవాలి.

*30. రహసి పతిమధికముపచరేత్.*

భర్తతో ఏకాంతంగా శయనించినప్పుడు సవతులందరికన్నా ఎక్కువగా పతిని రంజింపచెయ్యాలి.

*31. ఆత్మనశ్చ సపత్నీవిప్రకారజం దుఃఖం నాచక్షీత.*

ఎప్పుడైనా సవతులవల్ల తనకు అవమానం జరిగితే, తనంతటతాను ఆ విషయం భర్తతో చెప్పినప్పుడు, అతను అది నమ్మడం కష్టం. అంచాత ఆ సంగతి ఇతరులెవరి చేతనైనా చెప్పించడం మంచిది.

*32. పత్యుశ్చ సవిశేషకం గూఢం మానం లిప్సేత.*

తన సవతులకన్నా తననే భర్త ఎక్కువగా రహస్యంగా గౌరవించి, తనకు అనుకూలంగా ఉండాలని ఆమె కోరుకోవచ్చు.

*33. అనేన ఖలు పథ్యదానేన జీవామీతి బ్రూయాత్.*

ఇలా నన్ను అనుగ్రహిస్తే, నేను సవతుల పోరు లేకుండా బ్రతుకుతాను - అని పలికి జాలి పుట్టేలా మాట్లాడాలి.

*34. తత్తు శ్లాఘయా రాగేణ వా బహిర్నా చ క్షిత.*

భర్తకు తనపై ఏర్పడిన కటాక్షం గురించి అతని పొగడ్తల సమయంలో కాని, సవతిపై అతను కోపంతో ఉన్నప్పుడు గానీ, సామాన్య జనుల సమక్షంలో గానీ బయటపెట్టకూడదు. ఆ విషయాన్ని రహస్యంగా దాచి ఉంచాలని దీని భావం.

*35. భిన్న రహస్యా హి భర్తురవజ్ఞాం లభతే.*

రహస్యమైన విషయాలు బయటపెట్టే ఇల్లాలు, భర్తవల్ల అంతులేని అవమానాలు పొందవలసి వస్తుంది. దీన్ని బట్టి, భర్త తనపట్ల చూపే ప్రేమ, గౌరవమర్యాదలను బయటపడనీయకుండా గుండెల్లోనే దాచుకుని ఉంచాలని విశదమవుతున్నది.

*36. జ్యేష్ఠాభయాచ్చ నిగూఢనమ్మానార్థినీ స్యాదితి గోనర్దీయః.*

అలా చేయకపోతే 'నా కంటె ఈమె ఎక్కువగా పతి అభిమానాన్ని పొందుతూ ఉంది -' అనే కోపంతో జ్యేష్ఠురాలు, అనర్థం తెచ్చిపెట్ట చూస్తుందని గోనర్దీయులంటున్నారు.

*37. దుర్భగామనపత్యాం చ జ్యేష్ఠా మనుకంపేత నాయకేన చానుకంపయేత్.*

జ్యేష్ఠ భార్య రోగిష్టి మారిదై ఉన్నా, గొడ్డుమోతుదిగా ఉన్నా, ఆమె పట్ల కనికరం చూపించాలి. భర్తకు కూడా ఆమెపై దయ, జాలి కలిగేలా చేయాలి. అంతేకాని రహస్యంగా ఆమెను అవమానించడానికి ఎన్నడూ ప్రయత్నించరాదు. ఇలా చేయడంవల్ల తనకే కాస్త మంచిపేరు వస్తుంది.

*38. ప్రసహ్య త్వేనామేకచారిణీవృత్తమనులిష్ఠేదితి కనిష్ఠావృత్తమ్.*

పైన చెప్పినట్లుగా రోగగ్రస్థురాలుగానో, గొడ్రాలుగానో ఉన్న పెద్ద సవతితో సంప్రతించి, జ్యేష్ఠ కనిష్ఠ భార్యల మధ్య ఉండే భార్యల్లో పౌర్వాపర్యాలు నిర్ణయించి, వారు కూడా జ్యేష్ఠా, కనిష్ఠా వృత్తాలు అనుసరించేలాగా చూడవలసి ఉంటుంది. ఇది చిట్ట చివరి భార్య నడచుకోవలసిన విధానం.

*39. విధవా త్వింద్రియదౌర్బల్యాదాతురా భోగినం*
*గుణసంపన్నం చ యా పునర్విందేత్ సా పునర్భూః.*

కన్యక ఒక పురుషుణ్ణి పెళ్ళాడి భార్యగా పరిగణించబడుతూ ఉంది. అలాగే పునర్భూ అనే మరో రకం భార్య కూడా వుంది. ఆమె వృత్తాంతం చెపుతున్నారిక్కడ. పునర్భూ అనబడే భార్యలు రెండు రకాలు. ఒకటి క్షతయోనులు, రెండు అక్షతయోనులు. వీరిలో రెండో రకమైన అక్షతయోనులు సంస్కారార్హత కలవారు. అంచాతవారు కన్యల క్రిందనే లెక్క. అంటే వివాహానికి యోగ్యులన్నమాట. మరి క్షతయోనులు మాత్రం సంస్కారానికి యోగ్యులు కారు. వారు కేవలం స్వీకరించదగినవారు మాత్రమే. అంచాతనే విధవలను గురించి వసిష్ఠుడు ఇలా

పేర్కొన్నాడు. "మనోదత్తా వచోదత్తా యాచ మంగళ వాచికా, ఉదక స్పర్శికా చైవ యాచపాణి గృహేతికా, అగ్నిం పరిగతా చైవ పునర్భూః ప్రసవాచయా."

అంటే ఒకరికి ఇవ్వడానికై మనస్సులో సంకల్పించబడినదీ, ఇస్తామని నోటితో చెప్పబడినదీ, పాణిగ్రహణం చేసుకోబడినదీ, పునర్భూవూ, ప్రసవించినదీ, - వీరందరూ భార్య అనే పదంతో పిలువబడతారు. వీరు అక్షతయోనులు. అంటే పురుష స్పర్శ లేకుండానే వైధవ్యాన్ని పొందినవారు, పునర్భువు మాత్రం క్షతయోని. ఆమె విషయమే అనగా విధవ విషయమే ఇక్కడ వివరించబడుతోంది.

## పునర్భువు అంటే ఎవరు?

కొందరు స్త్రీలు భర్త చనిపోయిన పిమ్మట, కామోద్రేకం ఆణచుకోలేక, తొందరపడి గుణవంతుడు, భోగి అయిన మరో పురుషుణ్ణి మళ్ళీ పొందవచ్చు. అలాంటి మగువలు పునర్భూవు అని పిలువబడతారు. అంటే మొదట ఒక పురుషుడికి భార్యగా ఉండి, అతను చనిపోగా మళ్ళీ మరొకరికి భార్య అయిందన్నమాట. ఇది గోనర్దీయుని సిద్ధాంతం.

40. *యతస్తు స్వేచ్ఛాయా పునరపి నిష్క్రమణం నిర్గుణోఽయమితి తదాఽన్యంకాంక్షేతేతి బాభ్రవీయాః*

అయితే బాభ్రవీయుల మతం మరో రకంగా ఉంది. కట్టుకున్న భర్త బ్రతికి ఉండగానే, అతను దుర్మార్గుడనో, మరో కారణం చేతనో, అతన్ని వదిలేసి స్వేచ్ఛగా మరొకరితో లేచిపోతుంది. తరువాత అతను కూడా మంచివాడుకాడని, అతన్ని కూడా విడిచేసి, మరో భోగవంతుణ్ణి, ధనవంతుణ్ణి తగుల్కొంటుంది. అలాంటి ఆమెను పునర్భువు అంటారు భాభ్రవీయులు.

41. *సౌఖ్యార్థినీ సా కిలాన్యం పునర్విందేత.*

ఒక పురుషుణ్ణి విడిచి, మరో పురుషుణ్ణి మరగడం, దేనికోసం? సౌఖ్యం కోసమేకదా! అంచేత అలాంటిదాన్నే పునుర్భువు అంటారు.

42. *గుణేషు సోపభోగేషు సుఖసాకల్యం తస్మాత్తతో విశేష ఇతి గోనర్దీయః.*

గుణవంతుడుగా, ఉపభోగయుక్తుడుగా పురుషుడు ఉన్నప్పుడు అతనివల్ల పూర్తిగా సుఖం కలుగుతూనే ఉంది. అందువల్ల గుణవంతుడుకాని భోగికన్నా గుణవంతుడైన భోగి గొప్పవాడు. కాబట్టి కాంతలు సుఖాపేక్షవల్ల మరో పురుషుణ్ణి కోరుతూ ఉంటారు. ఇది గోనర్దీయుల సిద్ధాంతం. ఇక మాటిమాటికీ ఒకణ్ణి విడిచి మరి ఒకడితో లేచిపోయే స్త్రీ వేశ్యల జాబితాలోనే చేరుతుంది.

43. *ఆత్మనశ్చిత్తానుకూల్యాదితి వాత్స్యాయనః.*

ఇక వాత్స్యాయనులు తన సిద్ధాంతం స్పష్టం చేస్తున్నారు - పురుషుడు గుణవంతుడు, భోగవంతుడు అయినప్పటికీ మనస్సుకు నచ్చకపోతే అతని వల్ల స్త్రీకి సౌఖ్యం అంతగా ఉండదు. అంచాత ఎవడిపై మనస్సు బాగా పడుతుందో వాడి పొందు కోరుతూ ఉంటుంది పడతి. అలాంటి స్త్రీనే పునర్భువు అంటారని చెపుతారు వాత్స్యాయనులు.

44. స్వ బాంధవైర్నాయకాదాపానకోద్యానశ్రద్ధాదాన
మిత్రపూజనాది వ్యయనహిష్ణు కర్మ లిప్సేత.

ఈ సిద్ధాంతాలను బట్టి చూస్తే, మొత్తంమీద విధవ, చిత్త చాంచల్యం గల స్త్రీ పునర్భువు అని స్పష్టమైంది. అలాంటి పునర్భువు తన బంధువులతో కలిసి ఉంటూ, మధ్యపాన గోష్ఠులు. ఉద్యానవన విహారాలు, శ్రద్ధాదానాలు, మిత్రపూజలు మున్నగు ధన వ్యయంతో కూడిన పనులు పురుషుడిచేత చేయిస్తూ అతన్ని కలుసుకోవాలి. ఉత్తమ నాయకుల వల్ల ఉత్తమ నాయికలు మాత్రమే కోరే విధానం ఇది.

45. ఆత్మనస్సారేణ వా అలంకారం తదీయమాత్మీయం వా బిభృయాత్.

తన కున్న నగలు, తనకు ఉన్నవైనా లేక పూర్వపు పురుషుడు ఇచ్చినవే అయినా - వాటిని ఆమె ధరించవచ్చు. మధ్యరకం, అధమరకం స్త్రీలు కోరే కోరికలు ఇవి.

46. ప్రీతిదాయేష్వనియమః

ప్రేమ సందర్భంగా లభ్యమైన నగలు, ఆభరణాలు ధరించడంలో నియమ నిబంధనలు లేవు.

47. స్వేచ్ఛయా చ గృహాన్నిర్గచ్ఛంతీ ప్రీతిదాయాదన్య న్నాయకదత్తం
దీయేత నిష్కాస్యమా నా తు న కించిద్దద్యాత్.

ఒక స్త్రీ ఒక పురుషుణ్ణి విడిచిపెట్టి వెళ్ళే సమయాల్లో, ప్రేమించుకున్న సందర్భంగా అంతకుముందు లభించిన నగలు తప్ప, పురుషుడి వల్ల లభించిన తక్కిన ధన ద్రవ్యాలేవీ తనతో తీసుకుని వెళ్ళకూడదు. అతనికే వదలి వెళ్ళాలి, అలా కాకుండా స్త్రీ పురుషుడి వల్ల బలవంతంగా ఇంట్లో నుంచి గెంటివేయబడినట్లయితే, అలాంటప్పుడు తన అధీనంలో ఉన్న ద్రవ్యాలేవీ స్త్రీ తిరిగి అతనికి ఇవ్వవలసిన అవసరమే లేదు.

48. సా ప్రభవిష్ణురివ తస్య భవనమాప్నుయాత్.

ఒక పురుషుణ్ణి విడిచి మరో పురుషుణ్ణి చేరిన స్త్రీ, ఆ రెండో పురుషుడి ఇంట్లో ఎంతో స్వతంత్రంగా ప్రవర్తించాలి. ఏ మాత్రం సందేహించవలసిన పనిలేదు.

49. కులజాను తు ప్రీత్యా వర్తేత.

అలా ఆ ఇంట్లో సర్వ స్వతంత్రంగా సంచరించ గలిగేటంత వరకూ స్త్రీ, ఆ పురుషుడి తక్కిన భార్యల విషయంలో ప్రేమ కలిగి ఉండాలి.

50. దాక్షిణ్యేన పరిజనే సర్వత్ర సపరిహాసా మిత్రేషు ప్రతిపత్తిః.

51. కళాను కౌశలమధిక్య చ జ్ఞానమ్.

అలాగే తన కొత్త ప్రియుడి పరిజనుల విషయంలో కూడా ఎంతో సద్భావం కలిగి ఉండాలి. అతని స్నేహితుల ఎదుట తన నేర్పు, కళా కౌశలం చూపుతూ నవ్వుతూ, పేలుతూ పురుషుడికి ఆశ్చర్యం కలిగేలా తన ప్రతిభ ప్రదర్శిస్తూ ఉండాలి.

*52. కలహస్థానేషు చ నాయకం స్వయముపాలభేత.*

తగవులు సంభవించినప్పుడు, తాను స్వయంగా పురుషుణ్ణి నిందించాలి. పునర్భువులకు వారి భర్తలతో కలహం ప్రాప్తించే స్థానాలు ఇవి: ఒకటి ఉచిత విచ్ఛేదం అంటే ఔచిత్యాన్ని పాటించక పోవడం. రెండు స్వైరిణి సంసర్గం. అంటే యథేచ్ఛగా తిరిగే రంకుముండలతో కలిసి తిరగడం. మూడు అతిరాత్రగమనం - అంటే చాలా సేపు అక్కడికి ఇక్కడికి తిరుగుతూ ఉండడం, ఇంటి నుంచి పదే పదే లేచిపోతూ ఉండడం మొదలైనవి.

*53. రహసి చ కళయా చతుష్షష్ట్యా అనువర్తేత.*

*54. సపత్నీ నాం చ స్వయముపకుర్యాత్.*

*55. తాసామపత్యేష్వాభరణదానం.*

*56. తేషు స్వామివదుపచారః*

*57. మండనకాని వేషానాదరేణ కుర్వీత.*

*58. పరిజనే మిత్రవర్గే చ అధికం విశ్రాణనం.*

*59. సమాజాపానకోద్యానయాత్రా విహారశీలతాచేతి పునర్భూవృత్తమ్.*

పురుషుడు శయ్యపై చేరిన తరువాత, అతన్ని చతుష్షష్టి కళలతో రంజంపజెయ్యాలి స్త్రీ. కులసతులైన వారి వారి అవసరాలను బట్టి పనులు చేసిపెడుతూ ఉండాలి. అలాగే సవతి బిడ్డలకు సొమ్ములు సమర్పిస్తూ ఉండాలి. తన భర్తకు చేసినట్లే వారికి సేవలు చెయ్యాలి. ఆదరంతో చక్కగా అలంకార యుక్తమైన వేషం ధరించాలి. పరిజనులు, మిత్రవర్గం విషయంలో ఎక్కువ ఉదారబుద్ధితో వ్యవహరిస్తూ ఉండాలి. సమాజంతో కలిసి పానగోష్ఠులు, వన విహారాలు మొదలైన వాటిల్లో ఆసక్తి కలిగి ఉండాలి. ఇదంతా పునర్భువు వృత్తం.

*60. దుర్భగా తు సాపత్న్యపీడితా యాతా సామధిక
మివపత్యావుపచరేత్తా మాశ్రయేత్.*

61. ప్రకాశ్యాని చ కళావిజ్ఞానాని దర్శయేత్.

62. దౌర్భాగ్యాద్రహస్యానామభావః.

పైన చెప్పిన ఏక చారిణులుగా ఉండే భార్యలలో దుర్భగసయింతం ఉండడం సంభవిస్తుంది. ఆ దుర్భగతో ఎలా మెలగాలో ఇక్కడ చెపుతున్నారు. దుర్భగ అయిన సవతి వల్ల కష్టం కలిగితే, ఆమె పురుషుడికి ఎంతో ప్రీతి పాత్రురాలైనప్పటికి, సవతిని ఆశ్రయించక తప్పదు. ఆమె పట్ల తన కళావిజ్ఞానాన్ని చూపించాలి. ఆమె దుర్భగ కాబట్టే ఆమె దగ్గర దాచవలసిన రహస్యాలు ఉండవు. పైన చెప్పిన కళావిజ్ఞానాన్ని సంపాదించితే దుర్భగత్వం లేదా మూఢత్వం కొంతైనా పోగొట్టడం వీలవుతుంది.

*63. నాయకాపత్యానాం ధాత్రీకర్మాణి కుర్యాత్.*

పురుషుడి బిడ్డల విషయంలో తాను పెంపుడు తల్లిలాగా ప్రవర్తించాలి.

64. తన్మిత్రాణి చోపగస్యాత్రైర్భక్తిమాత్మనః ప్రకాశయేత్.

అతని స్నేహితులను మంచి మాటలతో మంచి చేసుకుని వారిపట్ల భక్తి విశ్వాసాలు ప్రదర్శిస్తూ ఉండాలి.

65. ధర్మకృత్యేషు చ పురశ్చారిణీ స్యాద్వ్రతోపవాసయోశ్చ.

ధర్మ కార్యాల్లోనూ, వ్రతాలు, ఉపవాసాల్లోనూ తానే చొరవ తీసుకుని ఎప్పుడూ ముందుండాలి.

66. పరిజనే దాక్షిణ్యం, న చాధికమాత్మానం పశ్యేత్.

పురుషుడి 'పరిజనుల విషయంలో ఎంతో సౌమ్యంగా ప్రవర్తించాలి. సవతులకన్నా, పరిజనులకన్నా తాను అధికురాలనని తలచరాదు.

67. శయనే తత్సాత్మ్యేన ఆత్మనోఽగనురాగ ప్రత్యాయనమ్.

ఇక శయనం విషయంలో పురుషుడికి ఎలా ఉంటే ఇష్టమో, తనకు ఇష్టం లేకపోయినా, అదే తనకూ ఇష్టం అనేలా ప్రవర్తించాలి. అతనికి సంతుష్టి కలిగేదాకా తన ప్రేమానురాగాలు ప్రకటిస్తూ ప్రవర్తించాలి.

68. న చోపాలభేత వామతాం చ న దర్శయేత్.

పురుషుణ్ణి ఎప్పుడూ కూడా స్త్రీ 'నా మీద నీకు ప్రేమ లేదు' - అని నిష్ఠూరాలు పలుకరాదు. అలాగే అతను ప్రేమతో చెంతకు చేరినప్పుడు అనుకూలంగా ఉండాలే కాని ప్రతికూలతను చూపకూడదు.

69. యయా చ కలహితస్స్యాత్ కామం తామావర్తయేత్.

తన సవతులలో ఎవత్తెకైనా సరే, భర్తతో తగవు వస్తే, ఆమెను తాను ఊరడించి, మరల ఆమెకు భర్త అనురాగం లభించేలా చెయ్యాలి.

70. యాం చ ప్రచ్ఛన్నాం కామయేత్తామనేన నూనంగమయేదోపయేచ్చ.

భర్త కనుక రహస్యంగా పరస్త్రీని కామించి ఆమెతో సంబంధం పెట్టుకోదలుచుకుంటే, తాను స్వయంగా రాయబారం నడిపి ఆమె అతనికి లభ్యమయ్యేలా చెయ్యాలి. వారిద్దరికీ అలా జత కుదిర్చి, ఆ విషయం రహస్యంగా అట్టే పెట్టే ఉంచాలికాని, ఎవరిదగ్గరా బయటపెట్టకూడదు.

71. యథా చ పతివ్రతాత్వమశాఠ్యం నాయకో మన్యేత
తథా ప్రతివిదధ్యాత్, ఇతి దుర్భగావృత్తమ్

ఇక ఇప్పుడు దుర్భగ విషయం చెపుతున్నారు. అసలు దుర్భగత్వం ఎందువల్ల సంభవిస్తుందని ప్రశ్న. సాధారణంగా మంకుతనం వల్లగానీ, దుస్స్వభావం వల్లగానీ ఇది సంభవిస్తూ ఉంటుందని సమాధానం చెపుతారు. అలాంటిది ఒక స్త్రీకి సంభవించినప్పుడు, నాయిక తన పతికి కలిగిన సంకోచాన్ని తొలగించడానికి ప్రయత్నించాలి, దీన్నే దుర్భగావృత్తమ్ అని అన్నారు.

72. అంతఃపురాణాం చ వృత్తమేతేష్వేవ ప్రకరణేషు లక్షయేత్.

భార్యయొక్క అధికారం భార్యాధికారం అని అన్నట్లుగానే, భార్యపై నాయకుడి అధికారం అని సప్తమీ సమాధానం చెప్పవలసి ఉంటుంది. అంటే భర్తపట్ల భార్య ఎలా ప్రవర్తించాలో చెప్పే అధికారం భార్యాధికారం అన్నమాట. అదేవిధంగా భార్యపట్ల భర్త ఎలా ప్రవర్తించాలో వివరించే అధికారం భర్త్రాధికారం లేక నాయకాధికారం అన్నారు. ఇలా చెప్పనట్లయితే, నాయకుడితో సంగమించే నాయిక అనువర్తన కలిగి ఉన్నట్లు చెప్పడానికి వీలుండదు. నాయకులు రెండురకాలు. ఒకటి రాజులు, రెండు జానపదులు.

ఇక్కడ రాజ పురుషులను గురించి వర్ణించి చెప్పేదాన్ని అంతఃపురిక వృత్తాంతం అంటారు. ఇందులో రాజుల, రాజ పురుషుల విషయాలు వర్ణించినట్లుగానే, అంతఃపుర సంగతులు కూడా వర్ణించవలసి ఉంటుంది. కాబట్టి, అంతఃపుర కాంతల ప్రవర్తనను గురించి కూడా ఈ ప్రకరణంలో వివరించవలసి ఉంటుంది. అంతఃపుర కాంతలలో కూడా ఏకచారిణి అనీ, జ్యేష్ఠ అనే భేదాలున్నాయి. అంచాత వారిని గురించి వేరే చెప్పడం జరగదు.

*73. మాల్యానులేపనవాసాంసి చాసాం కాంచుకీయా*
*మహత్తరికా వా రాజ్ఞో నివేదయేయుర్దేవీభిః ప్రహితమితి.*

*74. తదాదాయ రాజా నిర్మాల్యమాసాం ప్రతిప్రాభృతకం దద్యాత్.*

*75. అలంకృతశ్చ స్వలంకృతాని చాపరాహ్ణే సర్వాణ్యంతః పురాణ్యేకధ్యేనపశ్యేత్.*

అంతఃపుర స్త్రీలకు అవసరమైన పూలమాలలు, అంగరాగాది లేపనాలు, వస్త్రాలు మొదలైనవి కంచుకిగాని మహత్తరిక గాని తీసుకుని వెళ్ళి, రాణులు పంపించినారని చెప్పి రాజుకు అందజేయ్యాలి. అప్పుడు ప్రభువు వాటిని పరిగ్రహించి, అంతకు మునుపే తన వంటి మీద ధరించి ఉన్న నిర్మాల్యాలను తీసి ఇచ్చి, ఆవిధంగా తన ప్రేమానురాగాలకు చిహ్నంగా పంపాలి. పిమ్మట తాను చక్కగా అలంకారం వేసుకుని సాయం సమయాల్లో అంతఃపురానికి వెళ్ళి అక్కడ అందర్నీ ఒకమాటు చూచిరావాలి.

*76. తాసాం యథాకాలం యథాऽర్హం చ స్థానమానాను వృత్తిస్సపరిహాసాశ్చ కథాః కుర్యాత్.*

అలా అంతఃపురానికి వెళ్ళినప్పుడు అక్కడ ఉన్న వారి కులగోత్రాలను, వయస్సును విచారించి ఎవరికి తగినట్లు వారిని గౌరవించి, మర్యాదలు చెయ్యాలి. ఇంకా వినోద గోష్ఠులు, సరస సల్లాపాలు సాగించవచ్చు.

*77. తదనంతరం పునర్భువస్తథైవ పశ్యేత్.*

ఆ తరువాత పునర్భువులను చూచి, పరామర్శించి, వారి వారి అర్హతలను బట్టి గౌరవ మర్యాదలు చెయ్యాలి.

*78. తతో వేశ్యా అభ్యంతరికా నాటకీయాశ్చ.*

ఆటు పైన అంతఃపురంలో ఉండే వేశ్యలనూ, నర్తకీమణులనూ యథావిధిగా చూచి, అర్హతను బట్టి వారిని గౌరవించాలి.

*79. తాసాం యథో క్తకక్షాణి స్థానాని.*

ఇక, అంతఃపుర జనానికి ఎవరిని ఏ స్థానంలో నియమించాలో చెప్తున్నారు - కుల స్త్రీలకు అంతఃపురంలో మధ్య భాగం, దాని వెలుపల ప్రదేశం పునర్భువుల నివాసానికి, దాని బయట ప్రదేశం వేశ్యలు నివసించడానికి, దానికి కూడా బయట ఉన్న స్థలం నాటకీయుల నివాసానికి ఏర్పాటు చేయాలి.

*80. వాసకపాల్యస్తు యస్యా వాసకః యస్యాశ్చాతీతః యస్యాశ్చఋతు స్తత్పరిచారికాఽనుగతాదివాశయ్యో త్థితస్య*
*రాజ్ఞస్తాభిః ప్రహితమంగులీయక మనులేపన మృతుం వాసకం చ నివేదయేయుః*

రోజులు అంతఃపుర జనంతో వంతుల ప్రకారం, రోజూ నివసిస్తూ ఉండాలి. దీన్నే 'వాసకం' అంటారు ఈ వంతుల క్రమం తప్పకుండా తెలియపరచడానికి ప్రత్యేకంగా కొందరు పరిచారికలు ఉంటారు. వారి పేరు 'వాసకపాలికలు' వీరినే 'మహత్తరికలు' అని కూడా పిలుస్తారు. రాజు అంతఃపురజనాన్ని దర్శించిన తరువాత ఈ వాసకపాలికలు లేదా మహత్తరికలు రాజు చెంతకు వచ్చి, ఆ రోజు ఎవతె దగ్గర ఉండడానికి వంతు అయినదో, వ్యసనోత్సవాలవల్ల ఎవతె దగ్గర గడువు మించి ఉండడం జరగదో, ఎవతెకు బహిష్టు రోజులు సమీపించినవో మొదలైన వివరాలన్నీ తెలియజేస్తారు. ఆ విధంగా పరిజనుల ద్వారా విషయాలన్నీ తెలుసుకుని రాజు భోజనంచేసి, మధ్యాహ్నం నిద్రపోతాడు. నిద్రలేచిన పిదప రాజుకు పరిజనులు ఇంకా ఇంకా విషయాలన్నీ నివేదిస్తారు. అంతఃపురజనం పంపించిన అంగుళీయకం, అను లేపనం ఆయనకు సమర్పిస్తారు. ఆ రోజున ఎవరికి ఎప్పుడు ఋతు సమయమో, ఎవరికి గడువు దినమో తెలియజేస్తారు.

*81. తత్ర రాజా యద్గృహ్ణీయాత్తస్యా వాసకమాజ్ఞాపయేత్.*

ఇలా వాసకపాలికలు వివరాలన్నీ తెలియ జెప్పిన పిమ్మట రాజు, ఏ రాణి పంపిన ముద్దుటుంగరాన్ని, పరిమళద్రవ్యాన్ని గ్రహిస్తాడో, ఆ రోజు ఆమెతో గడపవలసిన దినం. పరిచారిక ద్వారా ఆమెకు ఈ విషయం తెలియజెయ్యాలి.

*82. ఉత్సవేషు చ సర్వాసామనురూపేణ పూజా, ఆపాకంచ సంగీతదర్శనేషు చ.*

ఏవైనా ఉత్సవాలు సంభవిస్తే, ఆ సమయంలో పైన చెప్పిన వాసకపాలికలు నియమ నిబంధనలతో నిమిత్తంలేకుండా, అంతఃపురజనం అందరినీ యథార్హంగా గౌరవించవచ్చు. వాళ్ళందరితో కలిసి పానగోష్టులు సాగించవచ్చు. సంగీతాది వినోదకార్యక్రమాలలో పాల్గొనవచ్చు.

*83. అంతఃపురచరవారిణీనాం బహిరనిష్క్రమో బాహ్యానాం చ ప్రవేశః అన్యత్ర విదితశౌచాభ్యః.*

*84. అపరిక్లిష్టశ్చ కర్మయోగః ఇత్యాంతఃపురికమ్.*

ఇలాంటి వినోద కార్యక్రమాలు జరిగేటప్పుడు శౌచం విషయం బాగా తెలిసిన పెద్దలను తప్ప, నగరంలో మంచి తక్కిన వారెవరినీ ఆ ప్రదేశంలోకి

రానివ్వకూడదు. అలాగే బయటి జనాన్ని కూడా లోపలికి అనుమతించరాదు. నాయికలతో రతిక్రీడలు సాగించే సమయాల్లో ఎలాంటి అత్యాచారాన్నైనా సరే, పరిష్కరించవలసివస్తే ఎలాంటి క్లేశాన్ని చూపకూడదు. అలా చూపితే మరల అలాంటి పనే చేయడానికి ప్రయత్నిస్తారు.

85. *భవంతి చాత్ర శ్లోకాః — పురుషస్తు బహూన్దారాన్ సమాహృత్య సమోభవేత్, న చా వజ్ఞాం చ రే దాసువ్యళీకాన్న సహేత చ.*

ఒక్క రాజులు, ప్రభువులే కాదు. సామాన్య జనులు కూడా అనేక మంది భార్యలు కలిగి ఉండడం కద్దు. అలా బహుభార్యలు గల పురుషుడు. అందరి భార్యల యడల సమానంగానే ప్రేమానురాగాలు చూపాలికాని ఒకరిని ఎక్కువగాను, ఒకరిని తక్కువగాను చూడకూడదు. వాళ్ళు గుణహీనలనీ, అందవికారులనీ హేళన చేయరాదు. వారు ఏదైనా అపరాధంచేస్తే మాత్రం నిర్దాక్షిణ్యంగా శిక్షించవలసిందే.

86. *ఏకస్యాం వా రతిక్రీడా, వైకృతం వా శరీరజం, విస్రంభాద్వా వ్యపాలంభః తమన్యానునకీర్తయేత్.*

87. *న దద్యాత్ర్పసరం స్త్రీణాం సపత్న్యాః కారణే క్వచిత్, తథోపాల భమానాం చ దోషైస్త్రామేవయోజయేత్.*

88. *అన్యాం రహసి విస్రంభైరన్యాం ప్రత్యక్ష పూజనైః. బహుమానై స్తథా చా న్య మిత్యేవం రంజయేత్స్త్రియః.*

89. *ఉద్యానగమనైర్భోగైర్దానైస్త జ్ఞాతిపూజనైః, రహస్యైః ప్రీతియోగై శ్చే త్యేకై కామనురంజయేత్.*

90. *యువతిశ్చ జితక్రోధాయథా శాస్త్రప్రవర్తినీ, కరోతి వశ్యం భర్తారం సపత్నీ శ్చాధితిష్ఠతి.*

ఒక భార్యతో సాగించిన రతిక్రీడాది సుఖాలను గురించి, తనకు ఎంత ఇష్టమైన, నమ్మకమైనదైనా సరే, మరో భార్యతో చెప్పకూడదు పురుషుడు. అలాగే ఒక భార్య అందవికారాలను గురించిగాని, మర్మావయవాల్లో గల దోషాలు, వికారాలను గురించిగాని మరో భార్యతో చెప్పకూడదు. అసలు స్త్రీతో ఆమెకు పోటీగా ఉండే మరో స్త్రీ ఇలాంటి విషయాలు అడిగే అవకాశం ఇవ్వనేకూడదు. ఎవరైనా ఒక భార్య, మరో భార్య అందచందాలలో లేదా అవయవాలలో ఫలానా లోపం ఉన్నదని విమర్శిస్తే, పురుషుడు వెంటనే ఆమెను నిందించి, నీలోనూ ఆ లోపం ఉన్నదని అనాలి. ఒకరి రహస్యాలు మరొకరికి వెల్లడించకూడదు, ఒకరితో గడిపిన మధురక్షణాలను గురించి మరొకరికి చెప్పకూడదు. అలాచెప్పే పురుషుడి విషయంలో మగువలు విరక్తి చెందుతారు, విముఖురాండ్రు అవుతారు. అనేక మంది భార్యలున్నప్పుడు, ఎవరితో ఎప్పుడు ఎలా మెలగాలో అలా మెలగుతూ, ఎవరిని ఎప్పుడు ఎలా గౌరవించాలో, సంతోషపెట్టాలో అలా గౌరవించి సంతోషపెట్టే పురుషుడు స్త్రీలందరి అభిమానం చూరగొన గలుగుతాడు. సత్ప్రవర్తనతో

ధర్మశాస్త్రాల్లో చెప్పిన రీతిగా నడుచుకోగల తరుణి ఎంతమందిలోనైనా భర్త అనురాగాన్ని, అభిమానాన్ని పొంది అందరిలోనూ అధికురాలుగా ఉంటుంది.

*ఇతి వాత్స్యాయనీయే కామసూత్రే భార్యాధికారికే*
*చతుర్థేఽధికరణే జ్యేష్ఠావృత్తం కనిష్ఠావృత్తం ద్వితీయోఽధ్యాయః*

**ఇది వాత్స్యాయన ముని విరచిత కామసూత్రాల్లో భార్యాధికారికం అనే నాలుగో అధికరణంలో జ్యేష్ఠావృత్తం అనే రెండో అధ్యాయం.**



# వాత్స్యాయన కామసూత్రాలు

## పారదారికాధికరణం - 5

## ప్రథమాధ్యాయం

## స్త్రీ పురుష శీలావస్థాపనం

1. *వ్యాఖ్యాతకారణాః పరపరిగ్రహోపగమాః.*

కన్యక, పునర్భువు - అనే ఇరువురు స్త్రీలను పొందడానికి కావలసిన ఉపాయాలను గురించి ఇంతకుముందే వివరంగా చెప్పడం జరిగింది. ఈ ఇద్దరు నాయికలూ కాక వేశ్య అనేది ఒకతె ఉంది. ఆమెవల్ల లభించేది కేవలం కామం మాత్రమే. పరభార్య విషయంలో అలాకాదు. ఆమె మూలంగా కామమేకాక అర్థం కూడా ప్రాప్తిస్తుంది. అంచాతనే వైశికాధికరణం కన్నా ముందుగానే పారదారికాధికరణాన్ని గురించి చెప్పడం జరుగుతూ ఉంది. మొదట స్త్రీ పురుషుల స్వభావాలు నిరూపించి చెప్పాలి. ఆ తరువాతనే తక్కిన విషయాలు చెప్పడం యుక్తం. కాబట్టి ముందుగా స్త్రీ పురుషుల స్వభావాలను నిరూపణ చేస్తున్నారు. పరదార అంటే ఇతరుల భార్య, పరస్త్రీ. ఈ పరస్త్రీలతో సంభోగించడానికి కామసుఖంగాని, పుత్రసుఖంగాని కారణం కాదు; వేరే కారణాలుంటాయి. ఇంతకు మునుపు నాయికా విమర్శచేసే చోట ఆ సంగతి చెప్పనే చెప్పారు.

2. *తేషు సాధ్యత్వమనత్యయం గమ్యత్వమాయతిం వృత్తిం చా దిత ఏవ పరీక్షేత.*

పరస్త్రీని పొందేముందు, ఆమె అసలు వశపరచుకోగలది అవునా కాదా అని ఆలోచించాలి. సాధ్యపడేది అయితే, ఎలాంటి అపాయం లేకుండా సాధ్యపడుతుందా అని కూడా యోచించాలి. ఒకవేళ సాధ్యపడినా ఆమెతో సంభోగిస్తే కుష్ఠు, ఉన్మాదం లాంటి రోగాలు ఏవీ తగులు కోవు కదా అనే విషయం కూడా ఆలోచించాలి. సరే, రోగాలేవీ లేకుండా సంభోగించడానికి అర్హురాలైనప్పటికీ, ఆమెను పొందినందువల్ల ఏదైనా ప్రయోజనం ఉందా అని కూడా చక్కగా విచారించాలి.

3. *యదా తు స్థానాత్ స్థానాంతరం కామం ప్రతిపద్య మానం*
*పశ్యేత్తదా ఆత్మశరీరోపఘాత పరిపరి గ్రహానభ్యుపగచ్ఛేత్*

ఒక పురుషుడు ఎవరైనా ఒక స్త్రీని చూచినప్పుడు ఆమెతో సంభోగించాలనే కోరిక పుట్టుకొస్తుంది. కామితం అనబడే కామం ఇది. ఆ కామం ఒక దశనుండి మరో దశకు మారుతూ ఉంటుంది. అలా మారుతున్నట్లు గ్రహించగానే ఆ పురుషుడు తన శారీరక బాధనుండి తప్పించుకోడానికై ఆ స్త్రీతో సంభోగించాలి.

*4. దశ తు కామస్య స్థానాని.*

కామం అనేది మహాచెడ్డది. అది మనిషిలో పుట్టకుండానే ఉండాలి. పుట్టిన తరువాత, ఆ క్షణంనుంచీ అది అంతకంతకూ పెరిగి పెద్దదై తుదకు ప్రాణం పొయ్యేదాకా మనిషిని విడిచిపెట్టదు. అంతేకాదు ఈ కామం అనేది మనిషిచేత రకరకాల చేష్టలు చేయిస్తుంది. అందుకే ఈ కామానికి పది స్థానాలున్నాయని ప్రాచీన ఆచార్యులు చెప్పారు. ఈస్థానాలనే మన్మథావస్థ లంటారు.

*5. చక్షుః ప్రీతిర్మనః స్సంగః సంకల్పోత్పత్తిః నిద్రాచ్ఛేదః*
*తనుతా విషయేభ్యోవ్యావృత్తిః లజ్జా ప్రణాశః*
*ఉన్మాదః మూర్ఛా మరణమితి తేషాం లింగాని.*

ఈ మన్మథావస్థలు చక్షుఃప్రీతి, మనస్సంగం, సంకల్పోత్పత్తి, నిద్రాచ్ఛేదం, తనుతా, విషయేభ్యోవ్యావృత్తి, లజ్జాప్రణాశం, ఉన్మాదం, మూర్ఛ, మరణం - అనేవి.



ఒక కాంతామణి కంటపడినప్పుడు ఆమెతో సంభోగిద్దామని కోరిక కలిగిన తరువాత, అతని చూపులన్నీ ఆ ఇంతిపైనే లగ్నమవుతాయి. దీన్నే చక్షుఃప్రీతి అంటారు. ఆ తరువాత ఆ మగువపై మనస్సు పూర్తిగా లగ్నమవుతుంది. దాన్నే మనస్సంగం అంటారు. అటుపైన ఆమెను ఎలా పొందాలి? ఒకవేళ పొందగలిగితే ఇలా చేస్తాను, అలా చేస్తాను? - అని రకరకాలుగా ఊహించుకుంటాడు. దీన్నే సంకల్పోత్పత్తి అంటారు. ఇలాంటి ఆలోచనల మూలంగా మనిషికి నిద్రపట్టదు.

ఎప్పుడైతే నిద్రలేక పోతుందో అప్పుడే ఆరోగ్యం చెడుతుంది. మనిషి చిక్కి శల్యమవుతాడు. దానికే తనుత అని పేరు. ఎల్లప్పుడూ మనస్సులో ఇదే ఆలోచనలు ముసురుకోడం వల్ల తక్కిన పనులేవీ చేయడానికి బుద్ధిపుట్టదు. దాన్నే విషయేభ్యోవ్యావృత్తి అంటారు. అటుపిమ్మట సిగ్గు, లజ్జ విడిచిపెడతాడు మనిషి. దాన్నే లజ్జాప్రణాశం అంటారు. ఎప్పుడైతే సిగ్గు విడిచిపెడతాడో అప్పుడే మనిషికి పిచ్చిపడుతుంది. అదే ఉన్మాదం లేక పిచ్చి. ఈ పిచ్చి మూర్ఛకు కారణం అవుతుంది. మూర్ఛవల్ల తుదకు మృత్యువు సంభవిస్తుంది. కాబట్టి అలా మరణంతో కామం కూడా, అగ్ని కట్టెను కాల్చిమసిచేసి తాను కూడా మసి అయి మాయమైపోయినట్లు, తాను కూడా మాయమైపోతుంది!

*6. తత్రాకృతితో లక్షణతశ్చ యువత్యాః శీలం, సత్యం, శౌచం, సాధ్యతాం, చండవేగతాం చా లక్షయేదిత్యాచార్యాః.*

ప్రేమపూర్వకంగా సాగించే స్త్రీ సంభోగంలో ఆ స్త్రీ రూపురేఖలను బట్టి లక్షణాలనుబట్టి సత్స్వభావం కలది అవునా కాదా? సత్యం మాట్లాడేదా. అబద్ధాలు పలికేదా? ఆమె చరిత్ర పవిత్రమైనది అవునా కాదా? ఆమెను వశపరుచుకోగలమా, లేదా? - మొదలైన విషయాలన్నీ బాగా పరిశీలించి చూచుకోవాలి. ప్రాచీనాచార్యులు చెప్పిన మాట ఇది.

*7. వ్యభిచారాదాకృతి లక్షణయోగానామింగితాకారాభ్యామేవ ప్రవృత్తిర్బోద్ధవ్యా యోషిత ఇతి వాత్స్యాయనః.*

మంచి రూపం, మంచి లక్షణాలు ఉన్నంత మాత్రంచేత, ఆ మగువలో విధిగా మంచి శీలం, సత్యం, శౌచం మున్నగు మంచి లక్షణాలన్నీ కూడా ఉంటాయని చెప్పడానికి వీలులేదు. మరి, ఆమె వశపరచుకోదగినదా, కాదా? చండవేగురాలా లేక మందవేగురాలా? అనే విషయాలు తెలునుకోడం ఎలా అని ప్రశ్న. అంటే తన అభిప్రాయాలను సూచించే స్త్రీ చేష్టలవల్ల, ఆకారాదులవల్ల ఆ విషయాలు తెలునుకోవాలని సమాధానం చెప్పారు, వాత్స్యాయనులు.

*8. యం కంచిదుజ్జ్వలం పురుషం దృష్ట్వా స్త్రీ కామయతే తథా పురుషోఽపి యోషితం, అపేయాతు న ప్రవర్తతే, ఇతి గోణికాపుత్రః*

సాధారణంగా స్త్రీలు అందగాడైన పురుషుడు ఎవణ్ణి చూచినా అతనిపై మనసు పడతారు. అలాగే పురుషులు కూడా అందగత్తె అయిన స్త్రీ ఎవరు కంటపడినా ఆమె పొందుకోసం ఉబలాటపడతాడు. ఇది సృష్టిలో సహజం. సరే, ఇలా ఒకరినొకరు కోరుకోనివ్వండి. కాని ఇది ఏదో ఒక ఫలితాన్ని ఆశించి వారిద్దరికీ సంయోగాన్ని కూర్చడంలేదు. ఆ స్త్రీ పురుషులు కలుసుకుంటారని గట్టిగా చెప్పలేము. ఇది గోణికా పుత్రుల అభిప్రాయం.

*9. తత్ర స్త్రియం ప్రతి విశేషః*

స్త్రీ పురుషులిరువురూ సమానమైన శీలం కలవారైనప్పటికీ స్త్రీల విషయంలో మాత్రం ప్రత్యేకంగా ఒక విశేషం ఉంది.

*10. న స్త్రీ ధర్మమధర్మం చాపేక్షతే, కామయత ఏవ కార్యాపేక్షయా తు నాభియుంక్తే.*

*11. స్వభావాచ్చ పురుషేణాభియుజ్యమానాచికీర్షంత్యపి వ్యావర్తతే*

*12. పునః పునరభియుక్తా సిద్ధ్యతి.*

*13. పురుషస్తు ధర్మస్థితి మార్యసమయం చ ఆపేక్ష్య కామయమానోఽపి వ్యావర్తతే.*

*14. తథాబుద్ధిశ్చాభియుజ్యమానోఽపి న సిద్ధ్యతి.*

*15. నిష్కారణమభియుంక్తే అభియుజ్యాపి పునర్నాభియుంక్తే సిద్ధాయాం చ మాధ్యస్థ్యం గచ్ఛతి.*

*16. సులభామవమన్యతే, దుర్లభామాకాంక్షతే ఇతి ప్రాయో వాదః.*

ధర్మంకాని, అధర్మంకాని అపేక్షించకుండానే స్త్రీ అజ్ఞానంవల్ల ఏకాంతంగా పొందదగిన పురుషుడు సందర్భ పడితే సంగమించాలని కోరుతుంది. అయితే, అందుకోసం వేగిరపాటును సూచిస్తే తనపై నిందవస్తుందేమోనన్న భయంతో అలా సంగమించడానికి సాహసించదు. సహజంగా స్త్రీలలో ఇలాంటి మానసిక దోషం ఉన్నప్పటికీ కొందరు స్త్రీలు శీలవతులుగానే ఉంటున్నారు. పురుషుడితో సంభోగించాలని మనస్సులో ఉన్నప్పటికి, పురుషుడు తన దగ్గరికి వచ్చినప్పుడు మొదట విముఖత్వం చూపుతుంది స్త్రీ. ఆ తరువాత పురుషుడు పదేపదే ప్రేరేపించి బలవంతపెడితే, హాయిగా అతనితో సంభోగం సాగిస్తుంది. ఇది స్త్రీకి స్వభావసిద్ధమే. ఇలా అనేకసార్లు పురుషుడు కోరడంవల్ల సంగమించడానికి ఒప్పుకుంటుంది స్త్రీ ఒక్కొక్కప్పుడు. కాని పురుషుడు అలాకాదు. ఒక స్త్రీతో సంభోగించాలని మనస్సులో ఉన్నా ధర్మమార్గాన్ని పెద్దల ఆచారాన్ని గమనించి, స్త్రీ కావాలంటున్నప్పటికీ సంభోగానికి సిద్ధపడడు పురుషుడు సాధారణంగా. దీన్నే కనిపించీ కనిపించని దోషంగల శీలం అంటారు. ఒక్కొక్కప్పుడు పురుషుడు ఎలాంటి కారణం అభిలాష లేకుండానే స్త్రీతో సంగమిస్తాడు. మరొకప్పుడు మళ్ళీ సంగమించడానికి ఇష్టపడడు. ఒకప్పుడు పురుషుడు ఎలాంటి కారణం అభిలాష లేకుండానే స్త్రీతో సంగమిస్తాడు. మరొకప్పుడు మళ్ళీ సంగమించడానికి ఇష్టపడడు. ఒకప్పుడు మగువ తనంతట తాను సంభోగానికి సిద్ధపడితే, అంతగా అపేక్ష లేకుండా ఏదో మధ్యస్థంగా ఆమెతో సంగమిస్తాడు పురుషుడు. సులువుగా, తనంతట తాను సంగమానికి సిద్ధపడే కాంతను అవమానిస్తాడు. తనకు లభించని లలనామణికోసం ఆరాటపడతాడు. ఇదంతా లోకంలో సాధారణంగా ప్రచారమందున్న అభిప్రాయం.

*17. తత్ర వ్యావర్తన కారణాని.*

*18. పత్యావనురాగః.*

*19. అపత్యాపేక్షా.*

*20. అతిక్రాంతవయస్త్వం.*

21. దుఃఖాభిభవః.
22. విరహానుపలంభః.
23. అవజ్ఞయోపమంత్రయత ఇతి క్రోధః.
24. అప్రతర్క్య ఇతి సంకల్పవర్జనం.
25. గమిష్యతీ, త్యనాయతి రన్యత్ర ప్రసక్తమితిరితి చ.
26. అసంవృతాకార ఇత్యుద్వేగః.
27. మిత్రేషు నిస్సృష్టభావ ఇతి తేష్వపేక్షా.
28. శుష్కాభియోగిత్యాశంకా.
29. తేజస్వీతి సాధ్వసం.
30. చండవేగః సమర్థోవేతి భయం మృగ్యాః.
31. నాగరకః కలాసు విచక్షణ ఇతి వ్రీడా.
32. సఖిత్వేనోపచరిత ఇతి చ.
33. అదేశకాలజ్ఞ ఇత్యసూయా.
34. పరిభవస్థానమిత్య బహుమానః.
35. ఆకారితోఽపి నావబుధ్యత ఇత్యవజ్ఞా.
36. శశో మందవేగ ఇతి చ హస్తిన్యాః.
37. మత్తోఽన్య మా భూదనిష్టమిత్యనుకంపా.
38. ఆత్మని దోషదర్శనాన్నిర్వేదః.
39. విదితా సతీ స్వజన బహిష్కృతా భవిష్యామీతి భయమ్.
40. పలిత ఇత్యనాదరః.
41. పత్యా ప్రయుక్తః పరీక్షత ఇతి విమర్శః.
42. ధర్మాపేక్షా చేతి.

పైన పేర్కొన్న సూత్రాలలో స్త్రీ పురుషుల శీలాలు నిరూపించారు శాస్త్రకారులు. స్త్రీలకు పురుషుల మీద వాంఛ ఉంటుంది. అయినా కూడా పరపురుషులతో సంభోగానికి ఒప్పుకోరు. అందుకు కొన్ని ముఖ్య కారణాలు చెపుతున్నారిక్కడ.

1) తన భర్తపైన అమితమైన ప్రేమానురాగాలు.

2) తన పవిత్ర సంతానం క్షేమంగా ఉండాలన్న, నిష్కళంకంగా ఉండాలన్న ఆరాటం.

3) అయినా ఏళ్ళు గడిచిన దాన్ని, ఇంకా నాకెందుకు ఊపాదు పనులపై ఆసక్తి అనే విరక్తి.

4) తన ఆప్తులు మరణించడం వల్ల కలిగిన అమిత దుఃఖం.

5) తన భర్తతో ఏనాడు కూడా ఎడబాటు లేకపోవడం.

6) ఈ మగాడు నన్ను అవమానపరచాలని అనుకుంటున్నాడనే ఆగ్రహం.

7) ఈ పురుషుడి మనస్సు అర్థంకాదు, ఇతనితో భోగించడం దేనికి అన్న వైముఖ్యం.

8) ఇతను ఎక్కువ కాలం నాదగ్గర్లో ఉండడు, ఎక్కడికో వెళ్ళిపోతూ, ఈపని కానిచ్చేసుకుని పోదామనుకుంటున్నాడు, అన్న అభిప్రాయం.

9) ఇతగాడు మరో మగువను మరిగాడన్న అనుమానం.

10) ఇతనితో కలిస్తే, ఆ సంభోగ లక్షణాలు దాచకుండా నా గుట్టు బయటపెడతాడనే భయం.

11) స్నేహితుల చెప్పుచేతల్లో ఉండేవాడు ఇతను, కాబట్టి వారి మాటలు విని నన్ను అవమానిస్తాడేమోనని అనుమానం.

12) ఈ మగాడు అకారణంగా దేంతో బడితే, దాంతో పోతాడన్న సందేహం.

13) ఇతను పౌరుషశాలి కాబట్టి ఏ మాత్రం పొరపాటు జరిగినా క్షమించడు. అనర్థం తెచ్చిపెడతాడని భయం.

14) నేను మృగీ నాయికను, ఇతనేమో చండవేగుడు అనిగాని, లేక చాల సమర్థుడని గాని భయపడడం.

15) ఇతగాడు నాగరకులలో ఉత్తముడు. సమస్త కళల్లో ఆరితేరినవాడు. ఇలాంటి వాడికి నేను తగను - అనే సిగ్గు.

16) నన్ను చెల్లెలులా చూస్తున్నాడనే అభిప్రాయం.

17) ఇతను దేశకాల పరిస్థితులను బట్టి ప్రవర్తించేవాడు కాడని అసూయ.

18) ఇతగాడు నాకు విరోధి వర్గంలోనివాడన్న నిరసన భావం.

19) తన మనోభిప్రాయాన్ని ఎరుకపరిచినా గ్రహించలేని మందమతి అనే తిరస్కారభావం.

20) నేను హస్తినీ నాయికను, ఇతనేమో మందవేగుడైన శశజాతి పురుషుడు. అంచాత నాకేమాత్రం పనికిరాడన్న అభిప్రాయం.

21) ఇతను ఎంతోమదించి ఉన్నాడు. ఇతనికి ఎలాంటి అనర్థం కలుగకుండా ఉండాలని దయ.

22) తనలోనే చాలా తప్పులున్నాయనే విరక్తి.

23) ఒకవేళ ఈ గుట్టు బయటపడితే బంధువులు వెలివేస్తారేమోనన్న భయం.

24) ముసలివాడని అనాదరం.

25) నా శీలాన్ని పరీక్షించడానికై నా భర్తే ఇతన్ని నా దగ్గరికి పంపాడేమోనన్న అనుమానం.

26) అయ్యయ్యో! ఇన్నాళ్ళూ మంచిపేరు తెచ్చుకున్నానే, ఇప్పుడితనితో సంబంధం పెట్టుకుని నా సత్ప్రవర్తన యావత్తూ మంటకలుపుకోడమా అన్న ధర్మబుద్ధి.

ఇవన్నీ పరపురుషులతో సంభోగించడానికి లోపల కోరిక ఉన్నా కులస్త్రీలు వైముఖ్యం చూపడానికి ప్రధాన కారణాలు.

*43. తేషు యదాత్మని లక్షయేత్తదాదిత ఏవ పరిచ్ఛింద్యాత్*

అలాగే పరాంగనను కామించే పురుషుడు కూడా ఆమె తనపట్ల వైముఖ్యం చూపడానికి ఏవైనా కారణాలున్నాయా అని ఆలోచించుకుని, అలాంటివి ఉన్నట్లయితే వాటిని తొలగించుకోవాలి.

*44. ఆర్యత్వయుక్తాని రాగవర్ధనాత్.*

*45. ఆశక్తిజాన్యుపాయప్రదర్శనాత్.*

*46. బహుమానకృతాన్యతి పరిచయాత్.*

*47. పరిభవకృతాన్యతి శౌండీర్యాద్వైచక్షణ్యాచ్చ.*

*48. తత్పరిభవజాని ప్రణత్యా.*

*49. భయయుక్తాని ఆశ్వాసనాదితి.*

ఇంతే కాకుండా ధర్మబద్ధమైన ఆలోచనలు అనేకం స్త్రీలకు అడ్డంకులుగా ఉంటున్నాయి. అవి భర్తమీద విపరీతమైన అనురాగం, తన సంతానం చెడిపోకూడదన్న అపేక్ష, వయస్సు పైన పడిందనే విచారం, ఆప్తులు పలువురు చనిపోయారనే దుఃఖం, ధర్మచింతన మొదలైన వాటివల్ల స్త్రీలో ఏర్పడిన వైముఖ్యాన్ని పురుషుడు తన ప్రేమానురాగాలు అధికంగా ప్రదర్శించి ఆ అవరోధాలను తొలగించుకోవాలి. పైన చెప్పిన వైముఖ్యానికి గల కారణాలు సద్బుద్ధి గల కులస్త్రీలలో విధిగా ఉంటాయి.

*50. పురుషాస్త్వమీ ప్రాయేణ సిద్ధాః కామసూత్రజ్ఞః కథాఖ్యానకుశలః
బాల్యాత్ప్రభృతి సంసృష్టః, ప్రవృద్ధ యౌవనః క్రీడనకర్మాదినా ఆగతవిశ్వాసః
ప్రేషణస్యకర్తా, ఉచితసంభాషణః ప్రియస్యకర్తా, అన్యస్య భూతపూర్వోదూతో
మర్మజ్ఞః ఉత్తమయా ప్రార్థితః సఖ్యా ప్రచ్ఛన్నం సంసృష్టః సుభగాభిఖ్యాతః
సహ సంవృద్ధః ప్రాతివేశ్యః కామశీలః తథాభూతశ్చ పరిచారకః
ధాత్రేయికాపరిగ్రహః నవవరకః ప్రేక్షోద్యాన త్యాగశీలః వృష ఇతి సిద్ధ ప్రతాపః
సాహసికః శూరః విద్యారూపగుణోపభోగైః పత్యురతిశయితా, మహార్హ వేషోపచారశ్చేతి.*

పైన చెప్పినట్లుగా స్త్రీల స్వభావాన్ని, గుణగణాలను మొదట గుర్తించి, ఆ తరువాత తన సామర్థ్యాన్ని గురించి యోచించుకోవాలి. అలా చేయకపోతే సంభోగం ప్రాప్తించదు. అంచాత స్త్రీల విషయంలో సిద్ధులయ్యే పురుషులను గురించి ఇక్కడ చెపుతున్నారు. ఇక్కడ చెప్పబోయే వారు సామాన్యంగా సిద్ధులవుతూ ఉంటారు.

ఈ క్రింద చెప్పబోతున్న పురుషులు సాధారణంగా స్త్రీలను వశపరచుకోగలుగుతారు.

1. కామసూత్రాలు గురించి బాగా తెలుసుకున్నవారు.
2. రకరకాల కథలు, గాథలు చెప్పే నేర్పు గలవారు.

3. ఇరుగు - పొరుగు ఇళ్ళలో ఉంటూ చిన్నతనం నుంచీ ఆ స్త్రీ ఇంటికి వచ్చి పోతూ ఉండేవారు.

4. బాల్యం నుంచీ ఆ స్త్రీతో బాగా పరిచయం, స్నేహం చేస్తూ ఆమెతో కలిసి మెలిసి తిరిగినవారు.

5. అప్పుడప్పుడే యౌవనం అంకురించినవారు.

6. ఆటపాటల్లో సిద్ధహస్తుడై ఆడవారి మనస్సును ఇట్టే దోచుకోగలవారు.

7. స్త్రీలకు అన్ని వేళలా అనుకూలంగా ఉంటూ వారికి కావలసిన పనులన్నీ చక్కగా చేసిపెడుతూ ఉండేవారు.

8. ఔచిత్యాన్ని పాటిస్తూ మాట్లాడేవారు.

9. స్త్రీల ఇష్టాన్ని, కోరికలను వెంటనే తీర్చగలవారు.

10. ఇంతకు మునుపు స్త్రీని మరో పురుషుడితో జతకూర్చడంలో దౌత్యం నెరపి, ఆమె పని సఫలం చేసి సంతోషపెట్టినవారు.

11. స్త్రీ రహస్యాలు, ఆమె గుట్టుమట్టులు బాగా తెలిసి ఉన్నవారు.

12. ఉత్తమురాలైన స్త్రీకి ఎంతో ఇష్టమైన ఉత్తమ పురుషులు.

13. స్త్రీల చెలికత్తెలతో సంభోగించిన పురుషులు, ఆ స్త్రీలను కూడా సులభంగా వశం చేసుకోగలరు.

14. చాలా అందమైన పురుషులు.

15. సహజంగానే ఎక్కువ కాముకత్వం గల పురుషులు

16. స్త్రీల దాదిని పెళ్ళాడిన పురుషులు.

17. ఇంటి కొత్త అల్లుడు ఆ ఇంట్లో స్త్రీలను వశం చేసుకోగలడు.

18. నాటక ప్రదర్శనలు, నాట్య ప్రదర్శనలు అతిగా చూడడానికి వెళ్ళేవారు.

19. ఉద్యానక్రీడలు, వనవిహారాలు ఎక్కువగా సలిపే పురుషులు.

20. ధనం విపరీతంగా దుర్వ్యయం చేసే పురుషులు

21. పౌరుషశాలి అని పేరు పొందిన మగవాడు.

22. అత్యంత ధైర్యసాహసాలు గల వీర పురుషులు.

23. భయం అనేది ఎరుగని శూరాగ్రేసరులు.

24. స్త్రీల భర్తల కన్నా విద్య, ధనం, హోదా మున్నగు వాటిల్లో అధికులుగా ఉన్న పురుషులు.

25. వేషభాషల్లోనూ, డాంబికంలోనూ గొప్పగా కనిపించే మగవారు.

ఈ పురుషులందరూ స్త్రీలను సులువుగా లోబరచుకోగలుగుతారు. వీరికి స్త్రీల మీద, స్త్రీలకు వీరిమీద ఎక్కువ మోజు ఉంటుంది.

*51.* *యథాత్మనఃసిద్ధతాం పశ్యేదేవం యోషితోఽప్య*
*యత్న సాధ్యతా మిత్యయత్నసాధ్యా యోషిత ఉచ్యంతే*

*52.* *యోషితస్త్విమా అభియోగమాత్రసాధ్యాః - ద్వారదేశావస్థాయినీ*
*ప్రాసాదాద్రాజమార్గావలోకినీ, తరుణ ప్రాతివేశ్యగృహే*

గోష్ఠీ యోజినీ, సతతప్రేక్షణ ప్రేక్షితాపార్శ్వవిలోకినీ, నిష్కారణం నవత్స్యాఽధివిన్నా భర్తృద్వేషిణీ, విద్విష్టా చ, పరిహారహీనా, నిరపత్యా, జ్ఞాతికులనిత్యా విపన్నాపత్యా, గోష్ఠీయోజినీ, ప్రీతియోజినీ, కుశీలవభార్యా మృతపతికాబాలా, దరిద్రా, బహూపభోగా, జ్యేష్ఠభార్యా, బహుదేవరికా బహుమానినీ న్యూనభర్తృకి, కౌశలాభిమానినీ, భర్తృమౌర్ఖ్యేణోద్విగ్నా ఆవిశేషజ్ఞతయా లోభేన కన్యా కాలే యత్నేన హారితా, కథం చిదలబ్ధాభి యుక్తాచ, సా తదానీం సమానబుద్ధిశీలమేధా ప్రతిపత్తి సాత్మ్యాః ప్రకృత్యా పక్షపాతినీ, అనపరాధే ఎవ మానితా, తుల్యరూపాభిశ్చాధః కృతా, ప్రోషిత పతికా, ఈర్ష్యాళుపూతిచోక్షక్లీబ దీర్ఘ సూత్రకాపురుష కుబ్జ వామన విరూప మణికార గ్రామ్య దుర్గంధి రోగి వృద్ధభార్యాశ్చేతి.

ఇంతకుముందు స్త్రీలను సులభంగా వశం చేసుకోగల పురుషులను గురించి చెప్పారు. అలాగే ఇప్పుడు సులభంగా పురుషులకు లోబడే స్త్రీలను గురించి చెపుతున్నారు. ఏ స్త్రీలయితే సూచనామాత్రం చేతనే అపేక్షిస్తారో, ఆ స్త్రీలు ప్రయత్నం లేకుండానే పురుషులకు లభ్యపడతారు.

1. వీధుల్లో వచ్చేపోయే పురుషులను చూడాలనే అభిలాషతో తలవాకిట నిలువబడి ఉండే తరుణులు.

2. మిద్దెలు, మేడలు ఎక్కి ఎల్లప్పుడూ రాజవీధులను పరిశీలించి చూస్తుండే సుందరాంగులు.

3. యువకులు ఎక్కడ ఉంటే, అక్కడే వెర్రిగా చూస్తుండే మగువలు.

4. ఇరుగు - పొరుగు ఇళ్ళకు చీటికిమాటికి పోతూ, అక్కడ అమ్మలక్కలతో నానా కబుర్లూ చెపుతూ ఉండేస్త్రీలు.

5. తాము వీధుల్లో వెడుతూ తమను ఎవరైనా చూస్తున్నారా లేదా అన్న ఆసక్తితో వెనుకకు, ప్రక్కలకు మళ్ళి పదేపదే చూస్తూ ఉండే లతాంగులు.

6.బుద్ధిమాంద్యం, దుస్వభావం లేకపోయినా సవతి పెత్తనం సాగించే సారసాక్షులు.

7. భర్త బుద్ధిమంతుడైనా అతన్ని ద్వేషించే భార్యలు.

8. అలాగే భర్తచేత ద్వేషించబడే తరుణీమణులు.

9. శుచీ - శుభ్రం, అంటు-సొంటు లేని ఆడవారు.

10. పిల్లలులేని గొడ్డుమోతురాండ్రు.

11. ఎల్లప్పుడూ పుట్టింట్లోనే ఉండే స్త్రీలు.

12. భర్త వల్ల అల్పాయుష్కులైన సంతానం పొందే రమణులు.

13. సభలు, సమావేశాలు, గోష్ఠులు ఏర్పాటు చేస్తుండే మహిళలు.

14. పర పురుషులతో ప్రేమను గురించి మాట్లాడుతూ ఉండే స్త్రీలు.

15. నటీమణులు, నర్తకురాండ్రు, నటులు, నర్తకులకు సంబంధించిన స్త్రీలు.

16. బాల్యంలోనే భర్తకు దూరమైపోయిన పడతులు.

17. దరిద్రురాండ్రు.

18. అమితంగా భోగలాలసత్వం కల స్త్రీలు.

19. పలువురు భార్యలుంటే, వారిలో పెద్దభార్య.

20. ఎక్కువమంది మరుదులు గల స్త్రీలు.

21. భర్త, తమకు తగనివాడని భావించే భార్యామణులు.

22. కళల్లో ఎక్కువ పరిజ్ఞానం, అభిలాష కల స్త్రీలు.

23. మూర్ఖుడైన మొగుణ్ణి కట్టుకున్న మగువ.

వీరంతా ఎక్కువ ప్రయత్నం లేకుండానే పురుషులకు లభ్యపడతారు. అలాగే కన్యగా ఉన్నప్పుడు ఒక యువకుడు వరించగా, దైవయోగం వల్ల మరొకరి భార్య అయిన అమ్మాయి, మొదటి యువకుడికి సులభంగా సాధ్యపడుతుంది. బుద్ధిలో, శీలంలో, తెలివితేటల్లో, కార్యదీక్షలో, దేశాచారాల్లో, మనోభిలాషల్లో, స్త్రీ ఏ పురుషుడితో సమానురాలుగా ఉంటుందో ఆ స్త్రీ ఆ పురుషుడికి సులువుగా వశం అవుతుంది. ఏ స్త్రీ స్వతస్సిద్ధంగా ఎవడిపై పక్షపాతబుద్ధి కలిగి ఉంటుందో, ఆ స్త్రీ అతనికి వశం అవుతుంది. అకారణంగా, ఏ తప్పు లేకుండా భర్తచేత అవమానింపబడిన స్త్రీ పరపురుషుడికి ప్రయత్నం లేకుండానే లొంగిపోతుంది. సవతులలో చిన్నచూపు చూడబడేదీ, భర్త దేశాంతరాలలో ఉండగా వ్రతదీక్షను అతిక్రమించేదీ, పరపురుషుడికి లొంగిపోతుంది. ఎవడైతే నిష్కారణంగా ఈర్ష్య - అసూయ కలిగి ఉంటాడో, అతని భార్య కూడా సాధ్యురాలే. తల, శరీరం, కట్టుగుడ్డలు మాసి, కంపు కొడుతూ, శుచి - శుభ్రం లేకుండా అసహ్యంగా ఉండేవాడి భార్య అతన్ని అసహ్యించుకుని పరపురుషుడి సంగమం కోరుతూ ఉంటుంది. ఇంకా చెప్పాలంటే 'చోక్ష' అనే జాతి వాని భార్య, నపుంసకుడి భార్య, బద్ధకస్తుడు. సోమరిపోతు అయిన వాడి పెళ్ళాం, కపటవర్తనుడి భార్య, మరుగుజ్జువాడి భార్య, గూనివాడి భార్య, కురూపి భార్య, రత్నాలు, మణులు తయారుచేసే వాడి భార్య, విద్యా - విజ్ఞానం లేనివాడి భార్య, ఒడలు కంపుకొట్టేవాడి భార్య, రోగిష్టివాడి భార్య, ముసలివాడి పడుచుపెళ్ళాం - వీరంతా పరపురుషులకు అప్రయత్నంగా లభిస్తారు.

*53. శ్లోకాపత్ర భవతః - ఇచ్ఛా స్వభావతో జాతా క్రియయా*
*పరిబృంహితా, బుద్ధ్యా సంశోధితో ద్వేగా స్థిరా స్యాదనపాయినీ.*

*54. సిద్ధతామాత్మనో జ్ఞాత్వా లింగాన్యున్నీయ యోషితాం,*
*వ్యావృత్తికారణోచ్ఛేదీ నరో యోషిత్సు సిద్ధ్యతి.*

అందగాణ్ణి ఎవణ్ణి అయినా చూచినప్పుడు స్త్రీలకు సహజంగానే కామం పుట్టుకొస్తుంది. అది పరిచయం వల్ల, స్నేహం వల్ల వృద్ధి పొందుతుంది. బుద్ధిబలంతో శోధించబడి ఉద్వేగం కలిగిస్తుంది. తుదకు అపాయం లేకుండా కార్యసిద్ధిని సమకూరుస్తుంది. అంచాత పురుషుడు తన సహజ గుణాలను, సామర్థ్యాన్ని పరిశీలించుకుని, స్త్రీల అనుకూల, అననుకూల లక్షణాలను, పరిస్థితులను పరీక్షించుకుని

వారు పురుషుల నుండి ఎందుకు విరక్తులు, విముఖులు అవుతారో తెలుసుకుని, ఆ కారణాలు నివారించుకుని తెలివిగా ప్రవర్తిస్తే అతనికి స్త్రీలు సులువుగా వశం అవుతారు.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే పంచమేऽధికరణే స్త్రీ పురుషశీలావస్థాపనం, వ్యావర్తన కారణాని, స్త్రీషు సిద్ధాః పురుషాః అయత్నసాధ్యా యోషితః ఇతి ప్రథమోధ్యాయః*

**ఇది వాత్స్యాయన ముని విరచిత కామసూత్రాల్లో పారదారికం అనే అయిదో అధికరణంలో స్త్రీ పురుష శీలావస్థాపనం అనే ప్రథమాధ్యాయం.**



# ద్వితీయాధ్యాయం
## పరిచయ కారణం

*1. యథా కన్యా స్వయమభియోగసాధ్యా న తథాదూత్యా*
*పరస్త్రియస్తు సూక్ష్మభావాః దూతీసాధ్యాః న తథాత్మనేత్యాచార్యాః*

మనిషిలో పుట్టిన కామేచ్ఛ పరిచయం వల్ల వృద్ధి పొందుతుందని ఇంతకు ముందు అధ్యాయంలో చెప్పడం జరిగింది. ఆ పరిచయం విషయం ఈ అధ్యాయంలో వివరిస్తున్నారు.

పెళ్ళికాని పిల్ల కాని, ఇతరుల భార్య కాని - ఈ రెండు రకాల స్త్రీలు కూడా పరిచయం ద్వారానే పొందదగినవాళ్లు. అయితే, ఈ పరిచయం అనేది రెండు రకాలు. స్వయంగా కల్పించుకునే పరిచయం ఒకటి. దూతిక ద్వారా సంపాదించుకునేది మరొకటి.

పెళ్ళికాని పిల్లలు - అంటే కన్యలు సంయోగం అంటే ఏమిటో అంతకు ముందు ఎరుగరు. కాబట్టి సాధారణంగా యుక్తితోను, బుద్ధిబలంతోను వారితో పరిచయం సంపాదించవలసి ఉంటుంది. అలాంటి యుక్తులు బుద్ధిబలం పురుషుడికి స్వయంగానే ఉండాలి. అలాంటి పురుషుడు దూతికను ఉపయోగించుకోకూడదు - అంటే ఆ అమ్మాయిని పెళ్ళాడాలనుకున్న యువకుడు తనంతటతానే ఆమె పరిచయం సంపాదించుకోవాలన్న మాట. ఇక భర్త అధీనంలో ఉన్న స్త్రీ విషయంలో, అప్పటికే ఆమె పురుషసంపర్కం అనుభవిస్తూ ఉన్న ఆడది కాబట్టి, మరో పురుషుడి దర్శనం కలగడమే కష్టం. అలాంటప్పుడు పరిచయం సంపాదించడం ఎలా సాధ్యం ? కాబట్టి అలాంటి స్త్రీకి పరపురుషుడు తన మనోభావాలు తెలియజేయడం ఎలా అని ప్రశ్న ? అందుకే ఈ సందర్భంలో దూతిక అవసరం అవుతుంది. మరో స్త్రీ దూతిక ద్వారా ఆ స్త్రీతో పరిచయం సంపాదించాలని ప్రాచీనాచార్యులు నిర్ధారించారు.

## స్త్రీ పరిచయం ఎలా సంపాదించాలి ?

*2. సర్వత్ర శక్తివిషయే స్వయం సాధనముపపన్నతరం*
*దురుపపాదత్వాత్తస్య దూతీప్రయోగ ఇతి వాత్స్యాయనః*

ఇక వాత్స్యాయనుల అభిప్రాయం - పురుషుడు స్వయంగా పరిచయాన్ని సంపాదించుకోగల సమర్థుడైతే కన్యతోనూ, పరస్త్రీతోను కూడా అలా సంపాదించుకోడమే ఉత్తమం. అలా పరిచయం సంపాదించుకోడానికి అవకాశం

లేదని అనిపించినప్పుడు దూతిక ద్వారా అది సంపాదించాలని వాత్స్యాయనులు స్పష్టం చేస్తున్నారు.

3. *ప్రథమసాహసా అనియంత్రణసంభాషశ్చ స్వయం ప్రతార్యాః తద్విపరీతాశ్చ దూత్యేతి ప్రాయోవాదః*

పరపురుషుడితో సంభోగించాలనుకునే స్త్రీ విషయంలో పురుషుడు స్వయంగానే ప్రయత్నించాలే తప్ప, దూతికను ప్రయోగించకూడదు. ఆ స్త్రీ అలా లభ్యంకాదు. ఏ ఆటంకం లేకుండా స్వయంగానే పురుషుడు ఆమెతో మాట్లాడగలిగితే, ఇక దూతికతో పనేముంది? పరపురుష స్పర్శ సుఖానికి అలవాటుపడిన పడతులను దూతికల ద్వారా వశం చేసుకోవాలనేమాట సాధారణంగా చెప్పేమాట.

4. *స్వయమభియోక్ష్యమాణస్తు ఆదావేవ పరిచయం కుర్యాత్.*

పరస్త్రీ సంభోగం అనేది అపరిశుద్ధమైన విషయం కాబట్టి, పురుషుడితో సంగమించగోరే స్త్రీతో రమించడం కచ్చితంగా నిషేధించబడింది. అయినప్పటికీ ప్రాణాపాయ సమయంలో దేహ రక్షణార్థం చెప్పారు ఇది. తనంతటతానే స్త్రీని పొందగోరేవాడు ఆమెతో మొదట బాగా పరిచయం సంపాదించుకోవాలి.

5. *తస్యాః స్వాభావికం దర్శనం ప్రాయత్నికం చ.*

6. *స్వాభావికమాత్మనో భవనసన్నికర్షే, ప్రాయత్నికం మిత్రజ్ఞాతి మహామాత్ర వైద్య భవన సన్నికర్షేవివాహ యజ్ఞోత్సవ వ్యసనోద్యాన గమనాదిషు.*

ఇలాంటి పరిచయం కూడా స్త్రీ పురుషులు ఒకరినొకరు బాగా చూచుకున్న పిమ్మటగాని కలుగదు. ఇలా చూచుకోడాన్నే దర్శనం అంటారు. ఈ దర్శనం రెండు విధాలు: స్త్రీ తన ఇంటి సమీపంలో తిరుగాడుతున్నప్పుడు చూడడం సామాన్య దర్శనం. ఇది ఒక విధం. ఇక రెండో రకం - ప్రయత్నపూర్వకంగా సంభవించే స్త్రీ దర్శనం. తన స్నేహితుడి ఇంటిదగ్గర, లేదా జ్ఞాతులు మొదలైన బంధువుల ఇళ్ళ దగ్గర, లేదా వైద్యుల ఇళ్ళ దగ్గర, ఇంకా పెళ్ళిళ్ళు, యజ్ఞయాగాది ఉత్సవాలు, నాటకాలు మున్నగు ప్రదర్శనలు జరిగేచోట్ల లేదా వనవిహారాలకు వెళ్ళేటప్పుడు మనస్సుపడ్డ స్త్రీని పురుషుడు చూడడాన్ని ప్రయత్నపూర్వకమైన దర్శనం అంటారు.

7. *దర్శనే చాస్యాః సతతం సాకారం ప్రేక్షణం కేశసంయమనం,*
*నఖాచ్ఛురణమాభరణ ప్రహ్లాదన మధరోష్ఠవిమర్దనం తాస్తాశ్చ లీలా వయస్యైః*
*సహప్రేక్షమాణాయాః తత్సంబద్ధాః పరాపదేశిన్యశ్చకథాః*
*త్యాగోపభోగప్రకాశనం, సఖ్యురుత్సంగ నిషణ్ణస్య సాంగభంగం జృంభణం*
*ఏక భ్రూప్రేక్షణం, మందవాచ్యాతా, తద్వాక్య శ్రవణం తాముద్దిశ్య*
*బాలేనాన్యజనేన వా సహాన్యోపదిష్టా ద్వ్యర్థా కథా, తస్యాం స్వయం మనోరథావేదన*
*మన్యాపదేశేన, తామేవోద్దిశ్య బాలా చుంబనం, ఆలింగనం చ, జిహ్వయా*
*చాస్య తాంబూలదానం ప్రదేశిన్యా హనుదేశఘట్టనం,*
*తత్తద్యథాయోగం యథావకాశం చ ప్రయోక్తవ్యం.*

*తస్యాశ్చాంకగతస్య బాలస్య లాలనం, బాలక్రీడనకానాం చాస్య దానం, గ్రహణం, తేన సన్నికృష్టత్వాత్కథాయోజనం, తత్సంభాషణక్రమేణ జనేన చ ప్రీతిమాసాద్య కార్యం తననుబంధం చ గమనా గమనస్య యోజనం, సంశ్రవే చాస్యాస్తామపశ్యతో నామ కామసూత్రసంకథా.*



పైన పేర్కొన్న రెండు రకాల దర్శనాల్లోనూ కలిగే పరిచయానికి రెండు రకాల కారణాలున్నాయి. అవి ఒకటి బాహ్యాలు, రెండు అభ్యంతరాలు. మొదట బాహ్య పరిచయం అంటే ఏమిటో చెపుతున్నారు - పురుషుడు కనుసైగలతో, ముఖకవళికలతో తన మనస్సులోని అభిప్రాయాలు స్త్రీకి సూచిస్తూ ఆమె వంక తదేకంగా చూడాలి. జుట్టుముడి ఊడదీసి మళ్ళీ ముడి వేసుకోవాలి. (ఆ రోజుల్లో పురుషులందరికీ జుట్టు ముడులు ఉండేవి) చిటికెన వ్రేలి గోరు కొరుక్కుంటూ నిలుచోవాలి. ఇంకా వంటిమీద గల సొమ్ములు, నగలు గలగలమని ధ్వని పుట్టేలా కదల్చాలి. పెదవిని చేతివ్రేళ్ళతో నొక్కడం మొదలైన చేష్టలు చెయ్యాలి. కాంత తనవంక చూస్తున్నప్పుడు, తన ప్రక్కన ఉన్న తన స్నేహితులతో ఆమెకు సంబంధించిన కథలు, సంగతులు ఎవరి మాటలో చెప్పుతున్నట్లుగా చెప్పడం, తన త్యాగ ఔదార్యాలను గురించి, తన భోగాలను గురించి ఆమెకు తెలియజెయ్యడం, స్నేహితుడి తొడపై తలపెట్టి పడుకుని బద్ధకంగా వళ్ళు విరుచుకోడం, ఆవలించడం, ఒక కనుబొమ్మ పైకి నిక్కించి ఓరగంట చూడడం, స్నేహితుడి చెవిలో ఏదో రహస్యం చెప్పడం, ఆమె మాటలు ఎంతో శ్రద్ధాసక్తులతో వింటూ ఉండడం, తన దగ్గరున్న ఎవరైనా పిల్లవాడితో ఆమెకు సంబంధించిన మాటలు ఎవరో చెప్పినట్టు రెండర్థాలు వచ్చేలాగా తాను చెపుతూ ఉండడం, ఏదో నెపం మీద తన అభిప్రాయం ఆమెకు తెలియజెయ్యడం, ఆమెను ముద్దాడుతున్నట్లుగా తన దగ్గరున్న పిల్లవాణ్ణి ముద్దుపెట్టుకోడం, కౌగలించుకోడం,

నోటిలో నోరుపెట్టి తాంబూలం అందించడం, తర్జనితో బుగ్గమీద పొడవడం ఇలాంటి చేష్టలన్నీ సమయానుకూలంగా వీలునుబట్టి చేయాలి.

అంతే కాకుండా పడతి ఒడిలో ఉన్న పిల్లవాణ్ణి పలకరిస్తూ లాలించాలి. ఆ పిల్లవాణ్ణి దగ్గరికి పిలిచి ఆటవస్తువులు చూపించి అవి అతనికి ఇవ్వాలి. ఆ పిల్లవాడివద్ద ఏదైనా ఉంటే అది తాను తీసుకోవాలి. అలా వస్తువులు ఇచ్చిపుచ్చుకోడం ద్వారా పిల్లవాడితో చనువు చేసుకుని, వాడికి ఏవేవో కబుర్లు చెప్పడం మొదలుపెట్టాలి. ఆ మాటల్లోనే తన మనోభావం తరుణికి తెలియజెయ్యాలి. రహస్యంగా, ఇలా నర్మగర్భంగా అసలు విషయం తెలియజెప్పి, పిమ్మట ఆమె ఎవరి అధీనంలో, ఎవరి అదుపాజ్ఞల్లో ఉందో తెలుసుకుని, పిమ్మట వారి స్నేహాన్ని సంపాదించి, ఆ ప్రకారంగా ఆమె ఉన్నచోటుకు రాకపోకలు సాగించాలి. ఆమె వినడానికి వీలున్న సమయాల్లో ఈ కామసూత్రాలు వినిపించాలి.

*9. ప్రవృత్తే తు పరిచయే తస్యా హస్తేన్యాసం నిక్షేపం చ నిదధ్యాత్.*

*10. తత్ర్పతిదినం ప్రతిక్షణం చైకదేశతో గృహ్ణీయాత్ సౌగంధికంవా పూగఫలాని చ.*

*11. తామాత్మనో దారైఃసహ విస్రంభగోష్ఠ్యాం, వివిక్తాసనే చ యోజయేత్ విశ్వాసనార్థం విజనార్థం చ*

*12. నిత్యదర్శనార్థం సువర్ణకార మణికార వైకటిక నీలీ కుసుంభరజ్జకాదిషు చ కర్మార్థిన్యాం సహాత్మనో వశ్యైస్తేషాం తత్సంపాదనే న్యయం ప్రయత్నేత.*

*13. తదనుష్ఠాన నిరతన్య లోకవిదితో దీర్ఘకాల సందర్శన యోగః*

*14. తస్మింశ్చాన్యేషామపి కర్మణామనుసంధానం, యేన కర్మణా ద్రవ్యేణ కౌశలేన చార్థినీ స్యాత్తస్య ప్రయోగముత్పత్తిమాగ మముపాయం విజ్ఞానం చాత్మాయత్తం దర్శయేత్*

*15. పూర్వ ప్రవృత్తేషు లోకచరితేషు ద్రవ్యగుణ పరీక్షాసు చ తయాతత్పరిజనేన చ సూవివాదః*

*16. తత్ర నిర్దిష్టాని ఫణితాని తేష్వేనాం ప్రాశ్నికత్వేన యోజయేత్*

*17. తయా తు వివదమానోఽన్యం తద్భక్తమితి పరిచయ కారణాని.*

ఇక అభ్యంతర పరిచయాన్ని గురించి చెపుతున్నారు. కామించిన స్త్రీతో కొంచెం పరిచయం ఏర్పడిన పిమ్మట 'ఈ వస్తువు నీ దగ్గర దాచి ఉంచు' - అని ఏదైనా వస్తువు ఆమె చేతికి అందించి, మళ్ళీ ఒకరోజు తరువాత ఆమె దగ్గరనుండి ఆ వస్తువు తీసుకోవాలి. అలాగే క్రమక్రమంగా వస్తువులు రోజూ ఇచ్చి పుచ్చుకుంటూ ఉండాలి. ఆ తరువాత తరువాత పరిమళ ద్రవ్యాలు, పోకచక్కలు, మున్నగునవి ఆమెకు అందించాలి. మెల్ల మెల్లగా తన ఆడవాళ్ళతో ఆమెకు పరిచయం కలిగించి, పానగోష్టులు మొదలైనవి సాగించేటప్పుడు తాను కూచున్న ఆసనంపైన ఆమె కూడా కూచునేలా చెయ్యాలి. ఇలా చేయడం వల్ల ఏకాంతంగా ఉండడానికి వీలు కలుగుతుంది. ఆమెను ఎల్లప్పుడూ చూస్తూ ఉండడానికి గాను కంసాలి, మణులు చెక్కేవాడు, రత్నాలు పరీక్షించేవాడు,

బట్టలకు రంగు వేసేవాడు మొదలైన వాళ్ళను తన అధీనంలో అట్టిపెట్టుకుని ఆమెకు ఏ అవసరం వచ్చినా తానే జోక్యం చేసుకుని ఆమెకు ఆయా పనులు చేయించి పెడుతూ ఆమె ఇంటికి రాకపోకలు ఎక్కువ చెయ్యాలి. ఇలా చేయడం వల్ల ప్రేయురాలిని ఎక్కువగా దర్శించడం సాధ్యం అవుతుంది. ఈ విషయం లోకంలో అందరికీ అనుభవమే. ఆమె దర్శనం కోసం ఇలాంటివే మరికొన్ని పనులు కల్పించుకోవాలి. ఆ పనులు నిరాటంకంగా నెరవేర్చడానికిగాను అవి ఆమెకు తెలిసినవిగా ఉండాలి. ఈ పనులు చేసేటప్పుడు ప్రేయసికి కావలసినది ఏమిటో, అది ఎక్కడ లభిస్తుందో దాన్ని సంపాదించడం ఎలాగో, మొదలైనవన్నీ తెలుసుకోగల సామర్థ్యం పురుషుడికి వుండాలి. పనులు సాధించడం ద్వారా అతను తన గొప్పతనాన్ని నిరూపించుకోవాలి.

పూర్వ కాలంనుంచీ లోక ప్రసిద్ధంగా ఉన్న రామాయణాది గ్రంథాలలో గానీ, రత్నాలు, మణులు మొదలైన వస్తువుల మంచి చెడ్డల పరీక్షలో గానీ, ఆ మగువ పరిజనులతో వాదించాలి. ఆయా ప్రాచీన గ్రంథాలలో గానీ, అమూల్య వస్తువులలో గానీ ఉన్న వాస్తవాలను వెలికి తీసి, వాటిని గురించి తరుణిని ప్రశ్నిస్తూ ఉండాలి. అలా ఆమెతో కూడా వాదిస్తూ మెల్లమెల్లగా ఆమెకు అనుకూలుడుగా మారిపోవాలి. ఈ పైన చెప్పినవన్నీ పరిచయ కారణాలు.

*18. కృతపరిచయాం దర్శితేంగితాకారాం కన్యామివోపాయ తోzభియుంజీతేతి.'*

*19. ప్రాయేణ తత్ర సూక్ష్మ అభియోగాః కన్యానామ సంప్రయుక్తత్వాత్.*

*20. ఇతరాను తానేవ స్ఫుటమువదద్యాత్, సంప్రయుక్తత్వాత్.*

*21. సందర్శితాకారాయం నిర్భిన్నసద్భావాయాం.*
*సమూపభోగ వ్యతికరేతదీయాన్యువ యుంజీత.*

*22. తత్ర మహోర్ఘగంధముత్తరీయం కుసుమం చాత్మీయంస్యాదంగుళీయకం చ తద్ధుస్యాత్ తాంబూల గ్రహణం గోష్ఠీగమనోద్యతస్య కేశహస్తపుష్పయాచనం.*

*23. తత్ర మహోర్ఘగంధం స్పృహణీయం స్వనఖదశన పదచిహ్నితం సాకారం దద్యాత్.*

*24. అధికైరధికైశ్చాభియోగైః సాధ్వసవిచ్ఛేదనమ్.*

పైన చెప్పినట్లుగా పరిచయాన్ని సంపాదించుకుని, తనతో సంభోగించడానికి సుముఖతను వ్యక్తం చేసిన మగువను, కన్యతో సంభోగించినట్లుగా జాగ్రత్తగా, ఉపాయంగా సంభోగించాలి. ఎంచేతనంటే, కన్యలు అంతకుముందు ఇలాంటి ఉపాయాలు ఎరుగరు. అందువల్ల వారితో తొందరపడి మొరటుగా ప్రవర్తించకూడదు. ముఖం మొత్తకుండా సున్నితంగా, సుతిమెత్తనగా సంభోగం సాగించాలి. ఇక తక్కిన పరస్త్రీల విషయంలో, వారు ఇంతకు మునుపే సంభోగాభిరుచి మరిగిన వారు కాబట్టి వారితో యథేచ్ఛగా భోగించవచ్చు. గాఢంగా సంప్రయోగాలు సాగించవచ్చు. కాంత తనతో సంభోగించడానికి సుముఖతను సూచిస్తూ తన నుండి సుముఖతను తొలగించుకోలేనంతటి గాఢమైన అనురాగం పొందిన పిమ్మట

పురుషుడు, పరిమళ ద్రవ్యాలు అలదిన తన ఉత్తరీయాలు ధరించమని ఆమెకు ఇవ్వాలి. ఆమె వస్తువులు తాను స్వీకరించాలి. మేలిరకం పరిమళ ద్రవ్యాలతో ఘుమఘుమలాడే తన ఉత్తరీయం గానీ, తాను పెట్టుకున్న పువ్వులు గానీ, తన ఉంగరంగానీ ఆమెకు ఇచ్చి, ఆమె చేత్తో సుగంధ ద్రవ్యాలతో కూడిన తాంబూలం స్వీకరించాలి. ఏవైనా గోష్ఠులు జరపడానికి ప్రయాణమై వెళ్ళే సందర్భాలలో ఆమె తలలో ధరించిన పూలుగానీ, చేతిలో ధరించిన పూలుగానీ అడిగి పుచ్చుకోవాలి.

స్త్రీలకు స్తనాలు మొదలైన కళాస్థానాలున్నాయి. పరిమళభరితమైన సుగంధాలు చన్నులు మున్నగు కళాస్థానాలలో ఆమె జ్ఞాపకార్థం చిలకరించి, నఖక్షతాలు, దంతక్షతాలు భావసూచకంగా చెయ్యాలి. సామాన్యంగా పరస్త్రీలు, పరపురుషుల దగ్గర ఎంతగానో భయపడతారు. అందువల్ల ఆమెకు ఎక్కువగా దంతక్షతాలు, నఖక్షతాలు మొదలైనవి చేసి, ఆమెలోగల భయ సందేహాలను పూర్తిగా పోగొట్టాలి.

*25. క్రమేణ చ వివిక్తదేశే గమనమాలింగనం చుంబనం తాంబూలస్య గ్రహణం దానాంతే ద్రవ్యాణాం పరివర్తనం గుహ్యదేశాభి మర్శనం చేత్యభియోగాః.*

ఇక అభ్యంతర పరిచయాన్ని గురించి వివరిస్తున్నారు. భయం, సిగ్గు - బిడియం ఏమాత్రం లేకుండా పురుషుడితో బాగా చనువు ఏర్పడి అతనితో సంభోగానికి సిద్ధపడిన పిమ్మట ఆమెను, జనం ఎవ్వరూ లేని ఏకాంత ప్రదేశానికి తీసుకునిపోయి కౌగిలింతలు, ముద్దులు సాగించాలి. తాంబూలం నోటికి అందించి, తాను కూడా ఆమె నోటినుండి తమలం గ్రహించాలి. పిమ్మట ఒకరి నగలు ఒకరు మార్చుకోవాలి. ఇలా పురుషుడు మెల్ల మెల్లగా ఆమె భగాన్ని చేత్తో తడుముతూ, రతి క్రీడకు ఉపక్రమించాలి.

*26. యత్రైకాభియుక్తా న తత్రాపరామభియుంజీత తత్ర యావృద్ధా అనుభూతవిషయా ప్రియోవగ్రాహ్యా తాముపగృహ్ణీయాత్*

అయితే, ఇక్కడ సంభోగం విషయంలో ఒక నిషేధం విధిస్తున్నారు. పరస్త్రీ ఎవరితోనైనా రమించినప్పుడు, మళ్ళీ ఆమె ఇంట్లో గల మరో రమణితో రతి సాగించకూడదు. అలా చేయడంవల్ల ఆ ఇద్దరు స్త్రీలూ తమలో తాము పోట్లాడుకుని రహస్యం బయటపెడతారు.

ఒకవేళ ఆ ఇంట్లో పరపురుష సంగమానికి బాగా అలవాటు పడిన భ్రష్టురాలు అయిన వృద్ధురాలు ఎవరైనా ఉంటే, దాని దగ్గర పడుకుని గానీ లేదా దానికి ఇష్టమైన వస్తువులు, ధన ద్రవ్యాలు ఇచ్చిగాని లోబరచుకుని దాని ద్వారా తన ప్రియురాలిని పొందవచ్చు.

*27. శ్లోకావత్ర భవతః ——*

*అన్యత్ర దృష్టసంచారః తచ్ఛ్రాయత్ర నాయకః*

*న తత్ర యోషితం కాం చిత్సుప్రాపామపి లఘయేత్.*

*28. శంకితాం రక్షితాం భీతాం సశ్వ్రశూకాం చ*
*యోషితం, న తర్క్యయేత మేధావీ జానన్ ప్రత్యయమాత్మనః*

ఒక ఇంట్లో ఒక గృహస్థు పరస్త్రీతో కలిసి కాపురం చేస్తుంటాడు. అలాంటప్పుడు ఆ గృహస్థు భార్యను పరపురుషుడు తనకు అందుబాటులో ఉన్నట్లు కనిపించినప్పటికీ, ఆమెతో భోగించడానికి ప్రయత్నించకూడదు. అత్త మామలు, మొగుడు అనుమానించిన ఆడదాన్ని, కత్తులు - కటార్లు మొదలగు మారణాయుధాలతో పురుషులు సంరక్షిస్తున్న స్త్రీని, అత్తమామలు అహర్నిశలూ కంటికి రెప్పలా కాపాడుతున్న ఇల్లాలిని, బుద్ధిమంతుడైనవాడు ఎప్పుడూ పొందడానికి ప్రయత్నించరాదు. అలాంటి ఆలోచనలే మనస్సులోకి రానివ్వకూడదు. ఇలా ప్రవర్తించేవాడు చక్కని ఫలితాలు పొందగలుగుతాడు.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే పంచమేఽధికరణే పరిచయకారణాన్యభియోగా ద్వితీయోధ్యాయః*

**ఇది వాత్స్యాయన ముని విరచిత కామసూత్రాల్లో పారదారికం అనే అయిదో అధికరణంలో పరిచయ కారణం అనే రెండో అధ్యాయం.**



# తృతీయాధ్యాయం
## భావపరీక్ష

*1. అభియుంజానో యోషితః ప్రవృత్తిం పరీక్షేత తయాభావః పరీక్షితో భవతి.*

అభియోగాలు సాగిస్తున్నా కొందరు కోమలాంగులు తొణకరు, బెణకరు. ధీరత్వంతో ఉంటూ మగాణ్ణి పరీక్షిస్తూ ఉంటారు. అలాంటి మగువలు పరపురుషులకు లొంగరని, విముఖురాండ్రని భావించరాదు. వీరి విషయంలో పురుషుడు తొందరపాటు లేకుండా జాగ్రత్తగా, తెలివిగా ప్రవర్తించాలి. ఎక్కువగా కామచేష్టలు చెయ్యకూడదు. తాను పొందదలచిన పడతి ప్రవర్తనను గమనిస్తూ ఉండాలి. ఇలా ఆమె మనోభావాలు పరీక్షించి తెలుసుకోవాలి.

*2. మంత్రమవృణ్వానాం దూత్యైనాం సాధయేత్*

మరి ఇంత గుంభనంగా, ధీరత్వంతో ఉండే ఉవిదను ఎలా వశపరచుకోవాలని ప్రశ్న? ఆమె కనుక ప్రత్యక్షంగా సంభోగానికి సమ్మతించే సూచనలు ఏవీ చెయ్యకపోతే, అప్పుడు దూతికను పంపి ఆమె ద్వారా లొంగదీసుకోవడానికి ప్రయత్నించాలి.

*3. అప్రతీగృహ్యాభియోగం పునరపి సంసృజ్యమానాం*
*ద్విధాభూతమానసాం విద్యాత్ తాం క్రమేణ సాధయేత్.*

దూతికను పంపినప్పటికీ ఆమె సంభోగించడానికి ఒప్పుకోకపోతే, అప్పుడు కొన్ని రోజులు ఆగి, మళ్ళీ దూతికను పంపి ప్రయత్నం చేయాలి. అప్పటికీ ఆమె వైఖరి అర్థంకాక సందేహంగా ఉంటే, క్రమక్రమంగా ప్రయత్నం కొనసాగించి వశపరచుకోవాలి.

*4. అప్రతిగృహ్యాభియోగం సవిశేషమలంకృతా చ పునర్దృశ్యేత*
*తత్రైవ తామభిగచ్ఛేచ్ఛ వివిక్తే బలాద్గ్రహణీయాం విద్యాత్.*

తన చేష్టలకు అనుకూలంగా ఆమె బదులు చెప్పకుండా, చక్కగా అలంకారాలు చేసుకుని తన కంటపడుతూ ఉంటే, అప్పుడు అతను ఆమెను పట్టుకుని రతిక్రీడ సాగించవచ్చు. అంటే అలాంటి ఆడదాన్ని ఒంటరిపాటున బలాత్కారంగా సంభోగించవచ్చునన్న మాట.

*5. బహూనపి విషహేతే అభియోగాన్న చ చిరేణాపి ప్రయచ్ఛత్యాత్మానం*
*సా శుష్కప్రతి గ్రాహిణీ పరిచయ విఘటనసాధ్యా.*

పురుషుడు తనను చూచి చేసే చేష్టలన్నీ చూస్తూ కూడా మగువ ఎంతమాత్రం చలించకుండా, సుముఖురాలు కాకుండా ఉంటే, ఆమె అర్థం పర్థం లేని శూన్య

చేష్టలను వాంఛిస్తున్నదని గ్రహించాలి. అలాంటి స్త్రీ దీర్ఘకాలం ఎంతగానో పరీక్షించి తెలుసుకోదగిన స్త్రీ అయి వుంటుందని తెలుసుకోవాలి. ఆమెతో పూర్తిగా పరిచయం వదిలేసి నిర్లిప్తంగా ఉన్నప్పుడే ఆమె లొంగిపోతుందని అర్థం.

6. *మనుష్య జాతేశ్చిత్తానిత్యత్వాత్.*

కాని, ఇక్కడొక సందేహం వస్తుంది. పరిచయాన్ని పూర్తిగా వదులుకుని త్రెంచివేసుకుంటే ఆమె ఎలా వశం అవుతుంది? అంటే సామాన్యంగా మానవజాతి బుద్ధి చంచలమైనది. అంచాత పరిచయం దూరమై పోయినప్పుడు విచారం కలగడం సహజం. ఆ విచారం తట్టుకోలేక మరల పరిచయం కోసం తాపత్రయపడుతుంది స్త్రీ.

7. *అభియుక్తాపి పరిహరతి న చ సంసృజ్యతే న చ*
*ప్రత్యాచష్టే తస్మిన్నాత్మని చ గౌరవాభిమానాత్*
*సాతిపరిచయాత్కృచ్ఛ్రసాధ్యా మర్మజ్ఞయాదూత్యా తాం సాధయేత్.*

పురుషుడి అభియోగాలన్నీ ఒక స్త్రీ అంగీకరించినా సంభోగించడానికి ఒప్పుకోకపోవచ్చు. అలా అని కేవలం విముఖత్వం చూపుతున్నట్లు కూడా కనిపించదు. సంభోగానికి ఇష్టపడుతూనే ఉంటుంది. ఇలాంటి వైఖరి గల వనిత ఆత్మాభిమానం గలదని అర్థం. అయితే ఆమెకు పరాయి మగాడిపై కూడా అభిమానం లేకపోలేదు. నలుగురిలో కాకుండా ఒంటరిగా ఒప్పుకునే స్త్రీ అన్నమాట. మరి అలాంటి ఏకాంతం లభించేది ఎలా? ఆమెతో ఎక్కువగా పరిచయం సంపాదించడం కష్టమే. అలాంటి పరిచయం ద్వారా ఆమెను లొంగదీసుకోడమూ కష్టమే. అంచాత ఆమె రహస్యాలు, గుట్టు - మట్టులు బాగా తెలిసి ఉన్న ఒక దూతిక సహాయంతో ఆమెను వశపరచుకోవచ్చు.

8. *సా చేదభియుజ్యమానా పారుష్యేణ ప్రత్యాదిశత్యుపేక్ష్యా.*

ఈమె విషయంలో ఒక విశేషం సయితం ఉంది. ఈవిడతో అభియోగం జరిపే తరుణంలో, ఒకవేళ ఈమె పరుషంగా మాట్లాడినట్లయితే, వెంటనే ఆమె పట్ల తన ప్రయత్నాన్ని అతను విరమించడం మంచిది.

9. *పరుషయిత్వాఽపి తు ప్రీతియోజనీం సాధయేత్.*

ఈ విధంగా విముఖత్వం చూపుతున్నట్లు కనిపించే స్త్రీ విషయంలో మరో విశేషం కూడా చెపుతున్నారు శాస్త్రకారులు. అభియోగ కాలంలో - అంటే పరిచయం సంపాదించుకునే సమయంలో ఈమె పైన చెప్పినట్లు సూచించినట్లయితే, మరల అభియోగాలు జరపడం ద్వారా ఆమెను వశం చేసుకోవచ్చు.

10. *కారణాత్సంస్పర్శనం సహతే నావబుధ్యతే నామద్విధాభూతమానసా*
*సాతత్యేన క్షాంత్యా వాసాధ్యా.*

ఒకప్పుడు కాంత ఏదో ఒక కారణం వల్ల పరపురుషుడు తనను ముట్టుకుంటే సహించి ఊరుకుంటుంది. అంటే ఆ పురుషుడి అభిప్రాయం ఏమిటో ఎరుగని

దానిలా పరధ్యానంగా ఉన్నట్టుండి ఏదో పనిమీద అతని దేహ స్పర్శ తనకు తగిలినా మాట్లాడకుండా ఊరుకుంటుంది. అలాంటి సందర్భాలలో ఆమె మనస్సు ఏదీ నిర్ణయించుకోలేక అటు - ఇటు ఊగిసలాడుతూ ఉంటుంది. కాబట్టే, ఏదో నెపంపై ఎడతెరిపి లేకుండా ఆమెను స్పృశిస్తూ, లేదా అమితమైన ఓరిమితో ఆమెను లొంగదీసుకోవాలి.

*11. సమీపే శయానాయాః సుప్తో నామ కరముపరివిన్యసేత్సాపిసుప్తా*
*నామోపేక్షతే జాగ్రతీ త్వపనుపదేద్భూయోభియోగకాంక్షిణీ.*

పైన చెప్పినట్లుగా పురుషుడు చేసే పరిచయ ప్రయత్నాలను, శరీర స్పర్శను సహించిన స్త్రీకి దగ్గరగా ఆ పురుషుడు పడుకుని ఆమె మీద చెయ్యివెయ్యవచ్చు. అలా చెయ్యి వేసినప్పుడు ఆ మగువ మేలుకొని ఉండి కూడా నిద్రపోతున్నట్లు ఊరుకుని, వెంటనే అతని స్పర్శవల్ల మెలకువ వచ్చినట్లు మేలుకొని చెయ్యి త్రోసివేస్తుంది. అంటే, అతను మళ్ళీ చెయ్యివేస్తే ఆ స్పర్శ సుఖం అనుభవించాలన్న అభిలాషతోనే ఆమె అలా చేస్తుంది! లేకపోతే నిద్రలో ఒడలు తెలీక ఇలా చెయ్యివేశాడా ? లేక పరిచయం కోసం చెయ్యివేశాడా? అనే సంశయానికి అవకాశం కలుగుతూ ఉంది.

*12. ఏతేన పాదస్యోపరి పాదన్యాసో వ్యాఖ్యాతః.*

ఇలా చెయ్యి వేసినట్లే, ఆమెపై కాలు కూడా వెయ్యవచ్చు. కాలు వేసే విధానం వేరే చెప్పవలసిన పనిలేదు.

*13. తస్మిన్ప్రసృతే భూయః సుప్తసంశ్లేషణముపక్రమేత*

*14. తదసహమానాముత్థితాం ద్వితీయేహని ప్రకృతివర్తినీ*
*మభియోగార్థినీం విద్యాత్, అదృశ్యమానాంతు దూతీసాధ్యాం.*

ఇంతకు ముందు చెప్పినట్లు స్త్రీ హస్త స్పర్శకూ పాద స్పర్శకూ సహించి ఊరుకున్న పిదప, ఆమెను నిద్రలో ఒడలు తెలియక కౌగలించుకున్నట్లుగా కౌగలించుకొవాలి ఆ ఆలింగనాన్ని ఆమె సహించక అక్కడ నుంచి లేచి వెళ్ళి, ఎప్పటిలా సుముఖురాలుగా ఉన్నట్లయితే, ఆమె మళ్ళీ అభియోగాలు కోరుతున్నదని గ్రహించాలి. ఒకవేళ లేచివెళ్ళి, మరల కనిపించకుండాపోతే, దూతికను పంపి వశపరచుకొవాలి.

*15. చిరమదృష్టాపి ప్రకృతి స్థైవ సంసృజ్యతే*
*కృతలక్షణాంతాం దర్శితాకారాముపక్రయేత.*

ఆ విధంగా నిద్రలో ఉన్నట్లు కౌగలించుకున్నప్పుడు సహించనట్లుగా లేచి వెళ్ళిపోయిన కాంత మళ్ళీ చాలా రోజులకు కనిపిస్తే, అప్పుడామే సంభోగానికి కష్టం లేకుండా ఒప్పుకుంటుంది. ఆమె సంభోగానికి తొందరపడుతున్నట్లు భావం వ్యక్తం చేస్తుంటే, అప్పుడామెతో రతి క్రీడకు ఉపక్రమించాలి.

*16. అనభియుక్తాప్యాకారయతి వివిక్తేహాత్మానం దర్శయతి.*

17. సవేపథుగద్గదం వదతి.

18. స్విన్న కరచరణాంగుళిః స్విన్నముఖీ చ భవతి.

19. శిరఃపీడనే సంవాహనే చ ఉర్వోరాత్మానం నాయకే నియోజయతి.

20. ఆతురా సంవాహికా చ ఏకేన హస్తేన సంవాహయంతీ
ద్వితీయేన బాహునా స్పర్శమావేదయతిశ్లేషయతి చ.

21. విస్మితభావా నిద్రాంధా వా పరిస్పృశ్యోరుభ్యాంబాహుభ్యామపతిష్ఠతి.

22. అళికైకదేశమూర్వోరుపరి పాతయతి.

23. ఊరుమూలసంవాహనే నియుక్తా నప్రతిలోమయతి.

24. తత్రైవ హస్తమేకమవిచలం న్యస్యతి.

25. అంగసందం శేన చ పీడితం చిరాదపనయతి.

26. ప్రతిగృహ్యైవం నాయకాభియోగాన్ పునర్ద్వితీయేహని సంవాహనాయోపగచ్ఛతి.

27. నాత్యర్థం సంసృజ్యతే న చ పరిహరతి.

28. వివిక్తేభావం దర్శయతి నిష్కారణం చాగూఢమన్యత్ర ప్రచ్ఛన్న ప్రదేశాత్.

29. సన్నికృష్టపరిచారకోపభోగ్యా సా చేదాకారితాపి తథైవ
స్యాత్ సామర్మజ్ఞయా దూత్యా సాధ్యా.

30. వ్యావర్తమానా తు తర్కణీయేతి భావపరిక్షా.



అభియోగాలకు స్త్రీ ఇష్టపడక పోయినప్పటికి అనుకూల వైఖరిని సూచిస్తుంది. జనం ఎవరూ లేని ప్రదేశంలో బుద్ధి పూర్వకంగా అతనికి కనిపిస్తుంది. అతనితో మాట్లాడవలసి వస్తే గద్గదకంఠంతో మాట్లాడుతుంది. అప్పుడామె ముఖానికి, కాళ్ళకు, చేతులకు బాగా చెమటలు కమ్ముతాయి. పురుషుడి తల మర్దన చేయడానికి, అతని తొడలు పిసకడానికి తనకై తానే ముందుకు వస్తుంది. అలా మర్దన

చేస్తూనే వేగిరపాటుతో, కామాతురాలై ఒక చేత్తో పిసుకుతూ, రెండో చేత్తో పురుషుడి లింగప్రదేశాన్ని తాకుతుంది. ఆ విధంగా తన అభిప్రాయాన్ని అతనికి గుర్తుచేస్తుంది. వెంటనే ఆగకుండా కౌగలించుకుంటుంది. ఆ కౌగిలింతలో మైమరచి పోతుంది. ఒక్కొక్కప్పుడు నిద్ర ముంచుకుని వస్తున్నట్లుగా తన రెండు చేతులూ పురుషుడి తొడల పైనే ఉంచి నెమ్మదిగా అతని మీద వాలిపోతుంది. తన మదన మందిరం అతని తొడకు తాకిస్తుంది! తన గజ్జల్లో మొదలగు రహస్య స్థలాల్లో సంవాహనం చెయ్యమని అతను అడిగితే అందుకు ఆమె ఇష్టపడి అలాగే చేస్తుంది. పురుషుడి లింగస్థానంలో తన చెయ్యి ఒకటి కదలకుండా అట్టేపెట్టి ఉంచుతుంది. అతని అంగం లేచి బిర్రబిగిసే దాకా తన చెయ్యి అక్కడనుంచి తీయదు.

ఇలా ప్రియుడి అభియోగాలన్నీ అనుకూలంగా స్వీకరించి, మరునాడు అతన్ని కాళ్ళు పిసకటానికి దగ్గరకి వస్తుంది. అప్పుడు అతి చనువుగాను ఉండదు అతిగా వైముఖ్యం చూపుతున్నట్లూ ఉండదు. ఎవరూ లేని ప్రదేశంలో తన మనోభావాలు సూచిస్తుంది. జనం ఉన్నచోట తన భావాన్ని రహస్యంగా వెల్లడిస్తుంది. దగ్గరున్న పరిచారకుడికి ఉపభోగింప తగినదిగా కూడా ఉంటుంది. పురుషుడు ఏ అభిప్రాయాలు సూచిస్తున్నప్పటికీ గంభీరంగా ఉండిపోతుంది. అంతేకాని సమాధానం ఏమీ చెప్పదు. అలాంటి అవస్థలో ఉన్న మగువను ఆమె రహస్యాలు బాగా తెలిసి ఉన్న దూతిక ద్వారా సాధించడానికి వీలున్నదని నమ్మకం కలగకపోతే, అప్పుడు ఆమె చరిత్ర ఏమిటో తెలుసుకుని ప్రవర్తించాలి. ఒక స్త్రీయొక్క మనోభావం తెలుసుకునే విధానం ఇది. అంచాతనే దీన్ని భావపరీక్షాధ్యాయం అన్నారు.

*31. భవంతి చాత్రశ్లోకాః - ఆదౌపరిచయంకుర్యాత్తతశ్చ పరిభాషణం,*
*పరిభాషణసంమిశ్రం మిథశ్చా కారవేదనం.*

*32. ప్రత్యుత్తరేణ పశ్యేచ్చేదాకారస్య పరిగ్రహం,*
*తతోభియంజీత నరః స్త్రీయం విగత సాధ్వసః*

*33. ఆకారేణాత్మనో భావం యా నారీ ప్రాక్ప్రయోజయేత్,*
*క్షిప్రమేవాభియోజ్యా సా ప్రథమే త్వేవదర్శనే.*

*34. శ్లక్ష్ణమాకారితా యాతు దర్శయేత్స్ఫుటముత్తరం,*
*సాపి తత్క్షణసిద్ధేతి విజ్ఞేయా రతిలాలసా.*

*35. ధీరాయామప్రగల్భాయాం పరీక్ష్యాయాం చ యోషితి,*
*ఏష సూక్ష్మోవిధిః ప్రోక్తః సిద్ధా ఏవస్ఫుటం స్త్రియః.*

స్త్రీల విషయంలో సాధారణంగా అనుసరించవలసిన క్రమం ఇది. మొట్టమొదట స్త్రీతో పరిచయం చేసుకోడం, తరువాత కొస్త కొస్త మాటలు కలపడం, అలా మాటలు కలుపుకుంటూనే ఒకరి మనోభావాలు ఒకరు తెలియజేసుకోడం; తన భావాలకు స్త్రీ అనుకూలంగా జవాబు చెపితే, ఆ ప్రకారం పురుషుడు ఆమెతో రమించడానికి ప్రయత్నించడం పురుషుడికన్నా ముందే తన అభిప్రాయాన్ని

ఎరుకపరిచే ఇంతి, మొదటి సమావేశంలోనే పురుషుడి దగ్గర పడుకోడానికి తగి వుంటుంది. మొదటి చూపులోనే పురుషుడు కనుసైగ చేస్తే, ఆమె అనుకూలంగా సంభోగేచ్ఛను సూచిస్తుంది. అలాంటి స్త్రీ విషయంలో కూడా పైన చెప్పిన క్రమ పద్ధతినే అనుసరించడం మంచిది.

ఇక ఏమాత్రం తొణకక - బెణకక ధీరురాలుగా ఉండే ఆ స్త్రీ తత్వాన్ని నిదానంగా పరీక్షించవలసి వుంటుంది. ఆమె విషయంలో సయితం పైన చెప్పిన క్రమ పద్ధతినే అనుసరించాలి. మొదట్లో అలా బెట్టుగా, గుంభనంగా ఉండే ఆడవాళ్ళు కూడా క్రమక్రమంగా పురుషులకు లొంగిపోతారు.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే*
*పంచమేఽధికరణే భావపరీక్షా నామ తృతీయోఽధ్యాయః*

**ఇది వాత్స్యాయన ముని విరచిత కామసూత్రాల్లో పారిదారికం అనే అయిదో అధికరణంలో భావపరీక్ష అనే మూడో అధ్యాయం.**



# చతుర్థాధ్యాయం
# దూతీకర్మ విమర్శః

1. *దర్శితేంగితాకారాంతు ప్రవిరళదర్శనామపూర్వాం చ దూత్యోపసర్పయేత్.*

**పడతితో** పరిచయం చేసుకొనబోయే పురుషుడు తనకు సుముఖురాలుగా ఉన్న భామ తరుచుగా తనకు కనిపించే అవకాశం లేకపోతే అప్పుడు తనకు పరిచయం లేనిదైన దూతిక సహాయాన్ని అపేక్షించాలి.

2. *సైనాం శీలతోను ప్రవిశ్య ఆఖ్యానకపటైః, సుభగంకరణయోగైః,*
   *లోకవృత్తాంతైః కవికథాభిః, పారదారికకథాభిశ్చ తస్యాశ్చ*
   *రూపవిజ్ఞానదాక్షిణ్యశీలానుప్రశంసాభిశ్చ తాం రంజయేత్.*
3. *కథమేవం విధాయాస్తవాయమిత్థంభూతః పతిరితి చానుశయం గ్రాహయేత్.*
4. *న తవ సుభగే! దాస్యమపి కర్తుం యుక్త ఇతి బ్రూయాత్.*
5. *మందవేగతామీర్ష్యాళుతాం శఠతామకృతజ్ఞతాంచా*
   *సంభోగశీతాంకదర్యతాం చపలతా మన్యాని*
   *చ యానితస్మిన్సుప్తాన్యస్యా ఆభ్యాసేనతి సద్భావేతిశయేన భాషేత.*
6. *యేన చ దోషేణోద్విగ్నాం లక్షయేత్తేనైవాను ప్రవిశేత్.*
7. *యదాసౌ మృగీ తదా నైవశశతాదోషః*
8. *ఏతేనైవ బడబా హస్తినీ విషయశ్చోక్తః.*

దూతికలు ముఖ్యంగా మూడు రకాలు. ఒకటి నిసృష్టార్థలు, రెండు పరిమితార్థలు, మూడు పత్రాహారులు. ఈ మూడు రకాలవారూ సామాన్యంగా నిర్వహించే దౌత్యకర్మను గురించి ఇక్కడ చెపుతున్నారు.

దూతిక మొదట ఎంతో సద్బుద్ధి కలదానిలా, తాను సంధానం జరపదలచిన తరుణి దగ్గరకి వెళ్ళాలి. జారకాంతల కథలు తెలిపే చిత్రపటాలు మధ్య మధ్య ఆమెకు చూపిస్తూ ఉండాలి. సుభగం, కరణం - అనే యోగాలను గురించి (వీటిని గురించి ముందు ముందు చెప్పడం జరుగుతుంది) తెలియజెయ్యాలి, లోకంలో ప్రసిద్ధంగా వున్న జార కథలు, పురాణాలలోని బూతు గాథలు, హృదయాన్ని ఆకర్షించేలా ఆమెకు చెపుతూ ఉండాలి. అలాగే పరకాంతలను గురించి కవులు కల్పించి వ్రాసిన బిందుమతి మున్నగు వారి కథలు, గౌతముడి భార్య అయిన అహల్యతో ఇంద్రుడు, బృహస్పతి భార్య అయిన తారతో చంద్రుడు ఎలా రతిక్రీడలు సలిపారో ఆ కథలు (ఈ పురాణ గాథలు లోకప్రసిద్ధమైనవి) చెపుతూ ఆమెను ఆనందింపజేయాలి. తరువాత ఆమె కులం - గోత్రం, అంద - చందాలు, ఔన్నత్యం, శాస్త్రపరిజ్ఞానం, విద్య, విజ్ఞానం, అనుకూల స్వభావం, మంచితనం

మొదలైన వాటిని గురించి బాగా పొగడాలి. ఇలాంటి పొగడ్తలకు ఎవరైనా లొంగిపోతారు. లోకజ్ఞానం లేని స్త్రీ అయితే మరీ పొంగిపోతుంది. వెంటనే 'ఇలాంటి గొప్ప గుణాలుగల నీకు ఇంతటి కురూపి, దుర్గుణాలుగల భర్త ఎక్కడ దాపురించాడమ్మా ? నీ ముందు ఇలాంటివాడు నౌకరుగా ఉండడానికి కూడా తగడు' అని అనాలి. అలా క్రమక్రమంగా ఆ పురుషుడి మందగొడితనం, అసమర్థత, ఈర్ష్యస్వభావం, దుర్గుణం, కృతఘ్నత, సంభోగం చేయడంలో చేతగానితనం, మున్నగు చెడుగుణాలన్నీ ఆమెకు నూరిపోయాలి. ఆమె మనస్సులో గల దిగులు, అతని ముసలితనం, ఉగ్గడించాలి. ఆమె భర్తలో ఏదో ఒక దోషం ఉండితీరుతుంది కాబట్టి, ఆ దోషం ఏదో గ్రహించి, అదే ఆమె ఎదుట పదే పదే బయటపెట్టి ఆ దోషం కారణంగానే ఆమె తన భర్తపట్ల విరక్తురాలై తనకు సుముఖంగా ఉండేలా చూచుకోవాలి దూతిక. ఈ స్త్రీ మృగి అయితే, శశ జాతి పురుషుడనే దోషం ఉండదు. అలాగే బడబ అయితే, వృషజాతి వాడని, హస్తిని అయితే అశ్వజాతివాడనీ దోషం ఉండదు.

*9. నాయికాయా ఏవ తు విశ్వాస్యతాముపలభ్యదూతీత్వేన ఉపసర్పయేత్ప్రథమసాహసాయాం సూక్ష్మభావాయాంచేతి గోణికాపుత్రః.*

దూతిక తను అనుకున్న స్త్రీ చెంతకు చేరాలని పై సూత్రంలో సామాన్య మాటగా చెప్పారు శాస్త్రకారులు. ఇప్పుడిక్కడ ఈ విషయంలో గోణికాపుత్రుల అభిప్రాయం చెపుతున్నారు. - ఆ స్త్రీకి నమ్మకస్తురాలైనప్పుడే దూతిక ఆమెను సమీపించాలి. అలా వెళ్ళి మొట్ట మొదట పరపురుష సంగమం కోరే పడతి, తన అభిప్రాయం స్పష్టంగా చెప్పకుండా నిబ్బరంగా ఉండేదాన్ని వశపరుచుకోడానికి మాత్రమే దూతిక ప్రయత్నించాలని గోణికాపుత్రులు అంటున్నారు. వాత్స్యాయనులు కూడా ఈ మతాన్నే సమర్థిస్తున్నారు.

*10. సా నాయకస్య చరితమనులోమతాం కామితాని చ కథయేత్.*

*11. ప్రసృత సద్భావాయాం చ యుక్త్యా కార్యశరీర మిత్థం వదేత్.*

*12. శృణు! విచిత్రమిదం సుభగే! త్వాం కిల దృష్ట్వా అముత్ర అసావిత్థం గోత్రపుత్రో నాయకశ్చిత్తోన్మాదమనుభవతి ప్రకృత్యా సుకుమారః కదా చిదన్యత్రా పరిక్లిష్టపూర్వ స్తపస్వీ తతోఽధునా శక్యమనేన మరణమప్యనుభవితుమితి వర్ణయేత్.*

*13. తత్ర సిద్ధా ద్వితీయేఽహని వాచి వక్త్రే దృష్ట్యాంచ ప్రసాదముపలక్ష్యపునరపి కథాంప్రవర్తయేత్.*

*14. శృణ్వత్యాం చాహల్యాఽ విమారక శాకుంతలా దీన్యన్యాన్యపి లౌకికాని చ కథయే త్తద్యుక్తాని.*

*15. వృషతాం, చతుష్షష్టివిజ్ఞతాం, సౌభాగ్యం చ నాయకస్య శ్లాఘనీయతాంచాస్య ప్రచ్ఛన్నం సంప్రయోగం భూతమభూతపూర్వం వా వర్ణయేదాకారం చాస్య లక్షయేత్.*

ఆ విధంగా దూతిక, పరస్త్రీని సమీపించి తన పురుషుడి సత్ప్రవర్తనను గురించి, అనుకూల వైఖరిని గురించి, సంభోగ సమయంలోను ప్రారంభంలోను, మధ్యలోను, చివరలోను అతనికి గల కామోద్రేకం, సంభోగ సామర్థ్యం గురించి మెల్లమెల్లగా ఆమెకు చెప్పాలి. విషయాలన్నీ విని ఆమె అనుకూల వైఖరిని వ్యక్తం చేస్తే, అప్పుడు దూతిక ఉపాయంగా ఏం చేయాలో చెపుతున్నారు.

'' ఓ సుందరాంగీ! ఈ విచిత్రం విన్నావా? పలానా కులగోత్రాలు, గుణ గణాలు గల పలానా పురుషుడు నిన్ను చూచి పిచ్చెక్కిపోతున్నాడమ్మా! అతగాడు పాపం ఎంతో మంచివాడు సుమా! ఇంతకు ముందెన్నడూ ఇలా అయిపోలేదు. అతను మనస్సులో అనుకుంటేచాలు, ఎలాంటి స్త్రీ అయినా అతనికి పాదాక్రాంతురాలయ్యేది. ఇప్పుడు కనుక నీవు అతని కోరిక తీర్చకపోతే అతను ప్రాణాలు విడిచినా ఆశ్చర్యం లేదమ్మా!'' అని బోధ చెయ్యాలి. ఈ బోధలు విని ఆమె అనుకూలత వెల్లడిస్తే, మరునాడు కూడా ఆమె మాటలు, ముఖకవళికలు, చేష్టలు, సంతోషం - అన్నీ గమనించి మళ్ళీ ఏవేవో కథలు, కబుర్లు చెప్పడం మొదలుపెట్టాలి. ' పూర్వం గౌతముడి అర్థాంగి అహల్యను ఇంద్రుడు మోహించలేదా? అలాగే అగ్నిహోత్రకుడనే ఋషి తన కోడల్ని అగ్నిహోత్రం చేసుకునే గృహంలో పనిపాటులు చేయమని నియమించాడు. కాని ఆమెను చూచి మోహించి ఆమెతో రమించాడు. అప్పుడామె గర్భవతి అయింది. అంతట తనను కులము నుంచి బహిష్కరిస్తారని భయపడి మామ ఆమెను అడవిలో వదలిపెట్టి వెళ్ళాడు. అప్పుడు ఒక శబరనాయకుడు ఆమెను తన ఇంటికి తీసుకునిపోయి కుమార్తెలా పోషించసాగాడు. ఆమె అక్కడే మగపిల్లవాణ్ణి కన్నది. ఆ కుర్రవాడు చిన్నతనం నుంచీ గొర్రెల మందల్లోను, మేకలమందల్లోను తిరుగుతూ వాటి పాలు త్రాగి బలవంతుడైనాడు. అలా బాల్యంలోనే భయంకరమైన క్రూరమృగాలను సంహరిస్తూ వచ్చాడు. అతని బలపరాక్రమాలు చూచి శబరనాయకుడు అతనికి అవిమారకుడు - అని పేరుపెట్టాడు. వాడు క్రమంగా పెరిగి పెద్దవాడైనాడు. యౌవనం వచ్చింది.

ఇలా ఉండగా ఆ దేశాన్ని పాలించే రాజు ఒకనాడు తన భార్యా బిడ్డలను వెంటబెట్టుకుని వేటాడడానికై ఆ అడవికి వచ్చాడు అప్పుడాయన కుమార్తెను ఒక ఏనుగు చంపబోయింది. వెంటనే అవిమారకుడు ఆ ఏనుగును సంహరించి రాజు కుమార్తెను రక్షించాడు. ఆ అమ్మాయి అతన్ని చూచి మోహించింది. స్వయంగానే అతన్ని వరించి పెళ్ళాడింది' అని చక్కని కథ చెప్పవచ్చు. ఇలాగే శకుంతల, దుష్యంతుల ప్రణయ గాథ లాంటివి ఎన్నో వినిపించవచ్చు. ఇంకా తన పురుషుడికి రతి క్రీడల్లో ఎంతటి సిద్ధహస్తుడో, రహస్యంగా వివరించి, ఒక మాటు అతని దగ్గర పడుకుని చూస్తే, నీకే తెలుస్తుందని ఊరించి, ఉబలాటం కలిగించాలి!

*16.* *సవిహాసితం దృష్ట్వా సంభాషతే.*

*17.* *ఆసనే చోపనిమంత్రయతే.*

18. క్వాసితం, క్వ శయితం క్వ భుక్తం క్వచేష్టితం, కిం వా కృతమితి పృచ్ఛతి.

19. వివిక్తే దర్శయత్యాత్మానం.

20. ఆఖ్యానకాన్యసు యుంక్తే.

21. చింతయంతీ నిఃశ్వసితి, విజృంభతే చ.

22. ప్రీతిదాయం చ దదాతి.

23. ఇష్టేషూత్స) వేషు చ స్మరతి.

24. పునర్దర్శనానుబంధం విస్రజతి.

25. సాధువాదినీ సతీకిమిదమశోభనమభిధత్స) ఇతి కథామనుబధ్నాతి.

26. నాయకస్య శాఠ్యచాపల్యనంబద్ధాన్దోషాన్దదాతి.

27. పూర్వ ప్రవృత్తం చ తత్సందర్శనం కథాభియోగం చ
స్వయమకథయంతీ తయోచ్యమానమాకాంక్షతే.

28. నాయకమనోరథేషు చ కథ్యమానేషు నపరిభవం నా మహసతి న చ నిర్వదతీతి.



# పరస్త్రీ తన మనోభావాలు ఎలా సూచిస్తుంది?

పరస్త్రీ తన మనోభావాలు ఎలా సూచిస్తుందో ఇక్కడ చెపుతున్నారు. ఇష్టపడే పరకాంత నవ్వులు ఒలికిస్తూ, కనులతోనే నవ్వుతూ సంతోషంగా మాట్లాడుతుంది. ఆ ఆసనంపై ఆశీనులుకండి - అంటూ మర్యాద చేస్తుంది. 'మీరెక్కడుంటున్నారు? ఎక్కడ పడుకుంటున్నారు? ఎక్కడెక్కడ తిరుగుతు న్నారు? ఏమేమి చేస్తున్నారు? అని విచారిస్తుంది. ఇలాంటి మాటల సందర్భంలో ఈ దూతిక పురుషుడితో కలిసి మాట్లాడడం, అతను చెప్పిన మాటలు వినడం - మొదలైన పనులకు వీలుంటుంది కాబట్టి అలా అడుగుతుంది. దూతికతో ఒంటరిగా మంతనాలు సాగించడానికి వీలు కల్పించుకుంటుంది. ఏవైనా కథలు,

కబుర్లు చెప్పమని అడుగుతుంది దూతికను. ఏదో ఆలోచిస్తున్నట్లు పరధ్యాన్నంగా ఉంటుంది. పదే పదే నిశ్వసిస్తుంది. ఆవులిస్తుంది ఏదో ఒక వస్తువు పురుషుడికి ఇవ్వమని చెప్పి దూతికకు ఇస్తుంది. ఆవిధంగా అతనిపై తన ప్రేమను సూచిస్తుంది. తనకు ఇష్టమైన పనులు చేసేటప్పుడు, ఉత్సవాలు మొదలైనవి జరిగే సమయాల్లోను దూతిక ఇంకా రాలేదే అని ఆమెను గురించి అనుకుంటుంది. దూతిక వెళ్ళిపోతూ ఉంటే వెంట వెళ్ళి మర్యాదగా సాగనంపుతుంది. మళ్ళీ మళ్ళీ రమ్మని కోరుతుంది. పురుషుణ్ణి గురించి దూతిక ఏదైనా మాట్లాడే సందర్భాలలో, తనంతట తాను జోక్యం కలిగించుకుని మాటలు కలుపుతుంది. ఈ పురుషుడు వట్టి మోసగాడు, చపలచిత్తుడు అని ఏవేవో దోషాలు ఆరోపిస్తుంది. ఆ పురుషుడు ఇంతకు ముందు తనకు కనిపించడం, కొంత కామగ్రంథం నడపటం జ్ఞాపకం తెచ్చుకుని, సిగ్గువల్ల ఆ విషయాలు తాను స్వయంగా చెప్పకుండా దూతిక చెపితే వినాలని అభిలషిస్తుంది. పురుషుడి అభిలాషలను గురించి దూతిక చెపుతూ ఉంటే, అతన్ని వేళాకోళం చేస్తూ, వెక్కిరిస్తూ నవ్వుతుంది.

*29. దూత్యేనాం దర్శితాకారాం నాయకాభిజ్ఞానైరుపబృంహయేత్.*

*30. అనంస్తుతాంతు గుణకథనైరనురాగ కథాభిశ్చావర్జయేత్.*

ఆమె ముఖ లక్షణాలు, మనోభావాలు గ్రహించిన తరువాత దూతిక, ఆమె పరపురుష సంగమానికి సుముఖంగా ఉన్నట్లు తెలుస్తుంది. కాబట్టి, పురుషుడితో తనకు జరిగిన సంభాషణ యావత్తు పూసగుచ్చినట్లు వినిపించాలి. ఆమెకు పురుషుడిపై ప్రేమ ఎక్కువ అయ్యేట్లు ప్రోత్సహించాలి. ఆమె కనుక కొత్త వనిత అయితే, పురుషుడి గుణగణాలను వర్ణించి చెప్పి, అతని ప్రేమ కలాపాలు వివరించి ఆమె అనుకూలురాలు అయ్యేలా చెయ్యాలి.

*31. నానంస్తుతాదృష్టాకారయోర్దౌత్యమస్తీత్యౌద్దాలకిః*

*32. నంస్తుతాకారయోరనంస్తుతయ్యోరస్తీతి బాభ్రవీయాః*

*33. నం స్తుతయోరప్య నంస్పృష్టాకారయోరస్తీతి గోణికాపుత్రః.*

*34. అనంస్తుత యోరదృష్టాకారయోరపిదూతీ ప్రత్యయాదితి వాత్స్యాయనః.*

అయితే ఈ విషయంలో కామశాస్త్రాచార్యుల మధ్య అభిప్రాయభేదాలున్నాయి. కలుసుకోవాలనుకునే స్త్రీ పురుషులు అంతకు ముందు ఒక సారైనా ఒకరినొకరు చూచుకోకుండా వుంటే ఒకరి అభిప్రాయాలు ఒకరు తెలునుకోకుండా వుంటే, అలాంటప్పుడు ఇలాంటి దౌత్యాలవల్ల ప్రయోజనం లేదని ఔద్దాలకి అభిప్రాయం. స్త్రీ పురుషులు ఒకరినొకరు చూచుకొనకపోయినా ఒకరి గుణాలను గురించి ఒకరు వినడం జరిగితే కూడా దౌత్యం ఉపకరిస్తుందని బాభ్రవీయులంటారు. ఒకరిని ఒకరు చూచుకోటం జరిగినా, ఒకరి అభిప్రాయాలు ఒకరికి తెలియనప్పుడు దౌత్యం నెరపడం అవసరమే అంటారు గోణికాపుత్రులు. స్త్రీ పురుషులు ఒకరినొకరు చూచుకొనకపోయినా, ఒకరి భావాలు ఒకరు తెలుసుకొనక పోయినా, దూతిక

సమర్థురాలు, చాకచక్యం కలది అయితే అన్ని కార్యాలూ సిద్ధిస్తాయని వాత్స్యాయనులు స్పష్టం చేస్తున్నారు.

35. *తాసాం మనోహరాణ్యుపాయనాని తాంబూలమను లేపనం స్రజమంగులీయకం దాస్యా వా తేన ప్రహితం దర్శయేత్.*

36. *తేషు నాయకస్య యథార్థం నఖదశనపదాని తానితాని చ చిహ్నాని స్యుః*

37. *వాససి చ కుంకుమాంకమంజలిం నిదధ్యాత్.*

38. *పత్రచ్ఛేద్యాని నానాభిప్రాయాకృతీని దర్శయేత్, లేఖపత్రగర్భాణి కర్ణపత్రాణ్యాపీడాంశ్చ.*

39. *తేషు స్వమనో రథాఖ్యాపనం, ప్రతిప్రాభృతదానే చైరాం నియోజయేత్.*

40. *ఏవం కృతపరస్పర పరిగ్రహయోశ్చ దూతీప్రత్యయః సమాగమః.*

పరపురుషుడితో పరిచయంలేని పడతులకు మనోజ్ఞములైన కానుకలు, తంబూలం, గంధం, పుష్పాలు, పూలమాలలు, ఉంగరాలు మొదలైనవి పురుషుడు తన ద్వారా పంపినాడని దూతిక పడతికి చూపించాలి. తాంబూలాదుల్లో నాయకుడి నిజమైన దంతక్షతాలు, నఖక్షతాలు వుండాలి. నాయిక చీరమీద నాయకుడిచేత కుంకుమతో అద్దబడిన చేతి ముద్రలు వేయాలి. అలాగే రకరకాల అభిప్రాయాలు వ్యక్తంచేసే పత్ర భంగాలతో చెవులకు అలంకరించుకునే కర్ణ పత్రాలు కూడా అందజెయ్యాలి. అలా ఆమెకు పంపే పత్రాలలో పురుషుడు తన మనోభిప్రాయాలను సూచించాలి. ఆమె పంపే ప్రేమలేఖలు తెమ్మని దూతికను పురమాయించాలి. ఈ విధంగా దూతిక ద్వారా పరిచయాన్ని పెంపొందించుకున్న స్త్రీ పురుషులు ఆమె ద్వారానే సమాగమం పొందగలుగుతారు.

41. *న తు దేవతాభిగమనే, యాత్రాయాం, ఉద్యానక్రీడాయాం, జలావతరణే, వివాహే, యజ్ఞవ్యసనోత్సవేష్వగ్న్యుత్పాతే, చౌరవిభ్రమే, జనపదస్య చక్రారోహణే, ప్రేక్షావ్యాపారేషు తేషు తేషు చ కార్యేష్వితి బాభ్రవీయాః.*

42. *సఖీభిక్షుకీక్షపణికాతాపసీ ఏతాసాం భవనేషు సుఖోపాయ ఇతి గోణికాపుత్రః.*

43. *తస్యా ఏతాసు గేహే విదిత నిష్క్రమ ప్రవేశే చింతితాత్యయప్రతీకారే ప్రవేశనముపపన్నం చ నిష్క్రమణమవిజ్ఞాతకాలం చ తన్నిత్యం సుఖోపాయం చేతి వాత్స్యాయనః.*

ఇక దేవతా పూజలకు వేళ్ళేచోట్లా, పుణ్యక్షేత్రాలకు పోయే సందర్భాల్లోనూ, జనసమూహంతో కలిసి నదులలో, తీర్థాలలో స్నానాదులు చేసే సమయాల్లోనూ, అగ్నిప్రమాదాలు సంభవించినప్పుడూ, దొంగల, దోపిడిగాండ్ర అలజడి వ్యాపించినప్పుడూ, బండ్లు మున్నగునవి ఎక్కి ప్రయాణం చేసేటప్పుడూ, ఇలాంటి సమయాల్లో జనసమ్మర్దంగా వున్నా లేక ఏకాంత ప్రదేశంలో వున్నా దూతిక సహాయంతో స్త్రీలను పొందడం సులువు. అంటే ఇలాంటి సందర్భాల్లో ఎవరూ అంతగా పట్టించుకోరు. ఇది బాభ్రవీయుల సిద్ధాంతం.

చెలికత్తెలు, బిచ్చగత్తెలు, తాపసిలు - మొదలైన వాళ్ళ ఇళ్ళలో కూడా దూతిక ద్వారా స్త్రీలను లోబరుచుకుని అనుభవించవచ్చునని గోణికాపుత్రుల మతం. అలాంటి స్త్రీల ఇళ్ళలోనే రహస్యంగా లోపలికి వెళ్ళడానికి, బయటికి రావడానికి అనుకూలంగా వుండే మార్గం గుండా రాకపోకలు జరుపుతూ కార్యం సాధించడం చాలా సులభం అని వాత్స్యాయనులంటున్నారు.

*44. నిసృష్టార్థా, పరిమితార్థా, పత్రహారీ, స్వయందూతీ, మూఢదూతీ, భార్యాదూతీ, మూకదూతీ, వాతదూతీ, చేతిదూతీ విశేషాః.*

*45. నాయకస్య నాయికాయాశ్చ యథా మనీషిత మర్థముపలభ్య స్వబుద్ధ్యా కార్యసంపాదినీ నిసృష్టార్థా.*

## దూతికలలో రకాలు

పైన పేర్కొన్న దూతికలు ఎనిమిది రకాలుగా వున్నారు. వారు నిస్సృష్టర్థ, పరిమితార్థ పత్రహారి, స్వయందూతి, మూఢదూతి, భార్యాదూతి, మూకదూతి, వాతదూతి - అనేవారు.

1) నిస్సృష్టర్థ - ప్రేయసీప్రియుల అభిలాషలను స్వబుద్ధితో ఊహించి, కార్యం సాధించే దూతికను నిస్సృష్టార్థ అంటారు.

*46. నా ప్రాయేణ సంస్తుత సంభాషణయోః.*

*47. నాయికయా ప్రయుక్తా సంస్తుతా సంభాషణయోరపి.*

*48. కౌతుకాచ్చానురూపౌ యుక్తావిమౌ పరస్పరస్యేత్య సంస్తుతయోరపి.*

ఇక ఈ నిస్సృష్టార్థ అనే దూతిక చేసే పనిని గురించి చెపుతున్నారు - స్త్రీ పురుషులు ఒకరినొకరు బాగా ఎరిగి ఉండీ, మాటలుకలిసిన తరువాత దౌత్యం నెరపడం ఈమె పని. కేవలం పరిచయం మాత్రం ఏర్పడి, మాటలు కలియని నాయికా నాయకుల మధ్య సంధానం నెరపడానికి నాయిక పంపగా కార్యం సాధించే దూతిక ఈమె. ఒక్కొక్కప్పుడు నాయికా నాయకులు ఒకరినొకరు ఎరక్కపోయినా, ఆసక్తికొలదీ ఈమె వారిరువురికీ సంధానం నెరపి జత కుదురుస్తుందీమె.

*49. కార్యైకదేశమభియోగైక దేశం చ ఉపలభ్య శేషం సంపాదయతీతి పరిమితార్థా.*

*2) ఇక పరిమితార్థ - అంటే పురుషుడు కొంతవరకు అభియోగాలు ప్రయోగించి, పని కొంతవరకు సాధించినప్పుడు, అతను పంపగా ఆ పనికి పూనుకొని మిగతా కార్యం నెరవేర్చే దూతికను పరిమితార్థ అంటారు.*

*50. సా దృష్టపరస్పరాకారయోః ప్రవిరళదర్శనయోః*

*స్త్రీ పురుషులు ఒకరి భావాలు ఒకరికి తెలియజెప్పుకున్న తరువాత కూడా ఒకరినొకరు చూచుకోడం చాలా అరుదుగా ఉన్నప్పుడు తాను జోక్యం కలిగించుకుని కార్యం సాధిస్తుంది ఈ దూతిక.*

51. సందేశ మాత్రం ప్రాపయతీతి పత్రహారీ.

3) ఇక పత్రహారి - అంటే స్త్రీ పురుషులకు కేవలం వార్తలు మాత్రమే చేరవేసే దూతికను పత్రహారి అంటారు.

52. సా ప్రగాఢసద్భావయోః సంసృష్టయోశ్చ దేశకాల సంబోధనార్థం.

స్త్రీ పురుషుల మధ్య చక్కని అనుకూలత ఏర్పడి ఉంది. ఇంతకు మునుపే సంయోగం సాగించి ఉన్నవారికి ఫలానా చోట, ఫలానా సమయంలో కలుద్దామనే వార్త చేరవేయడానికి ఈ దూతిక ఉపయోగపడుతుంది.

53. దౌత్యేన ప్రహితాన్యయా స్వయమేవ నాయకమభిగచ్ఛేద జానతీ నామతేన
సహోపభోగం స్వప్నే వా కథయేత్, గోత్రస్ఖలితే భార్యాం చాస్య నిందేత్,
తద్వ్యపదేశేన స్వయమీర్ష్యాం దర్శయేత్, నఖదశన చిహ్నితం వాకిం చిద్దత్యాత్
భవేత్ఽహమాదౌ దాతుం సంకల్పితేతి చ అభిదధీత,
మమత్వద్భార్యాయా వా ఆకార రమణీయతేతి వివిక్తేపర్యనుయుంజీత సా
స్వయందూతీ.

54. తస్యా వివిక్తే దర్శనమ్ ప్రతిగ్రహశ్చ .

55. యాతీచ్ఛేవే నాన్యామభిసంధాయాస్యాః సందేశ శ్రవణద్వారేణ
నాయకం సాధయేత్ తాం చోపహన్యాత్సాఽస్వయందూతీ

56. ఏతయా నాయకోఽప్యన్య దూత్యశ్చ వ్యాఖ్యాతాః

ఈ దూతికలలో మొట్టమొదటి రకం దూతిక నిసృష్టార్థ రెండువిధాలు. ఇతరులకోసం ఇతరుల దగ్గర దూతకృత్యం నెరపేది ఒకరకం, తన కొరకై తాను నాయకుడి వద్దకు వెళ్ళి దౌత్యం నెరపేది రెండోరకం. ఈ రకం దూతికను స్వయం దూతిక అనికూడా పిలుస్తారు.

4) ఇక ఈ స్వయం దూతిక చేయవలసిన పనులను గురించి పేర్కొంటున్నారు. తనఊరు - పేరు పురుషుడితో చెప్పకుండా 'ఇవాళ మీరు నాతో సంభోగించినట్లు నాకు కల వచ్చింది' అని అనాలి లేదా గోత్ర స్ఖలితంతో అతని అర్ధాంగిని దూషించాలి. అలాగే ఆమెపట్ల ఈర్ష్య చూపించాలి. నఖక్షతాలు, దంతక్షతాలు గల ఏదైనా వస్తువు అతనికి ఇవ్వాలి. మొట్టమొదట నన్ను మీకే ఇచ్చి పెళ్ళి చేయాలని ప్రయత్నాలు జరిగాయి. నేను అందగత్తెనో లేక మీ భార్య అందగత్తెయో చూడండి - అని అతనితో జనం ఎవరూ లేనిచోట రహస్యంగా చెప్పాలి. ఇలా చేసే దాన్ని స్వయందూతి అంటారు. ఈమెను నిర్జన స్థలంలోనే దర్శించడం. సంభోగించడం ఉచితం. తానే దూతికలాగా పురుషుడి దగ్గరికి వెళ్ళి ఏదో ఒక విషయం చెపుతూ, సందేశం వినిపించడం ద్వారా అతన్ని వశపరుచుకో గల దూతికను కూడా స్వయం దూతిక అని అంటారు. అంతేకాకుండా ఆమె ఏ స్త్రీని గురించి అయితే ఇప్పటిదాకా వర్ణించి చెప్పిందో ఆమెలో గల దోషాలు కూడా అతనికి తెలియజెప్పాలి.

ఈ విధంగా స్వయం దూతిక విషయం వివరంగా చెప్పడం వల్ల తనంతటతానే దూత్యాన్ని నిర్వహించుకునే పురుషుడి విషయం, అతని దూతల విషయం కూడా చెప్పినట్లయింది.

*57. నాయకభార్యాం ముగ్ధాం విశ్వాస్య అయంత్రణయానుప్రవిశ్యనాయకస్య చేష్టితాని పృచ్ఛేత్, యోగాన్ శిక్షయేత్, సాకారం మండయేత్, కోపమేనాం గ్రాహయేత్. ఏవంచ ప్రతిపద్యస్వేతి శ్రావయేత్, స్వయంచాస్యాం నఖదశనపదాని నిర్వర్తయేత్, తేనద్వారేణనాయక మాకారయేత్సా మూఢదూతీ.*

5. ఇక మూఢదూతి ఉంది - ఈమె విషయం వివరిస్తున్నారు. స్త్రీ రహస్యంగా వ్యవహారం నడపవలసి ఉంది కాబట్టి తనంతట తాను రాయభారం నడిపే అవకాశం ఉండదు. అలాంటప్పుడు ముగ్ధరాలుగా ఉన్న నాయకుడి భార్యను నాయిక నమ్మించి వశపరచుకోవాలి. నాయకుడు ఏ విధంగా, ఏ రకంగా రతిక్రీడలు సాగిస్తాడో తెలుసుకుని, ఆ క్రియలన్నీతాను నడపాలి. అప్పుడామె బేలతనం వల్ల నాయికకు వశ్యురాలై, ఏమాత్రం సంకోచం లేకుండా తన భర్త చేసే చేష్టలన్నీ తెలుసుకుని, అతన్ని స్వాధీనపరచుకునే ప్రక్రియలు ఆమెకు నేర్పాలి. తన ఉద్దేశ్యాలు నాయకుడికి తెలిపేటందుకు ఆమెను అలంకరించాలి. ఆమె కోపం తెచ్చుకునేలా ఆమెకు బోధించాలి. తనంటతతాను దంతక్షతాలు, నకక్షతాలు ఆమెపై ప్రయోగించాలి. ఇలా నాయకుడి హృదయంలో నాయికను గురించి ఒక అభిప్రాయం కలిగేలా నాయకుడి భార్య ప్రవర్తించాలి. ఈ నాయకుడి భార్యనే మూఢదూతి అని పిలుస్తారు.

*58. తస్యాస్తయైన ప్రత్యుత్తరాణి యోజయేత్.*

ఈ మూఢదూతిక ద్వారానే పురుషుడికి రతి విషయంలో ప్రతి సమాధానం పంపేలా చూడాలి.

*59. స్వభార్యాం వా మూఢాం ప్రయోజ్యయా తయానహ విశ్వాసేన యోజయిత్వా, తయైవాకారయే దాత్మ నశ్చవైచక్షణ్యం ప్రకాశయేత్. సా భార్యా దూతీ, తస్యాస్తయైవాకారగ్రహణం.*

6. భార్యదూతి - ఒక్కొక్కప్పుడు పురుషుడు సిగ్గువల్ల స్వయంగా దౌత్యం నెరపలేకపోతాడు. అప్పుడతను మూఢురాలుగా ఉన్న తన భార్యకు ఆమెతో నమ్మకంగా స్నేహం కల్పించి, ఆమె ద్వారా తన అభిప్రాయాలను నాయికకు ఎరుక పరచాలి. ఆమెకు తనపైన ఒక సదభిప్రాయం ఏర్పడేలాగా ఆమెచేత రకరకాల చేష్టలు చేయించాలి. ఇంకా ఆమెద్వారా తనకు కళలోగల నేర్పు. చాతుర్యం మొదలైనవి నాయికకు తెలియజెయ్యాలి. ఇలాంటి ఆమెను భార్యాదూతి అంటారు. తెలివి, ప్రపంచ జ్ఞానం గల భార్యను ఇలాంటి దౌత్యానికి నియోగిస్తే, ఆమె అతనికి విరుద్ధంగా ప్రవర్తిస్తుంది.

*60. బాలాం వా పరిచారికా మదోషజ్ఞా మదుష్టేనోపాయేనప్రహిణుయాత్ తత్రస్రజికర్ణపత్రే వా గూఢలేఖ విధానం, నఖదశనపదం వా*

*సామూకదూతీ, తస్యాస్తయైవ ప్రత్యుత్తర ప్రార్థనం.*

లేదా ఏ దోషం ఎరుగని మోసాలు ఏమీ తెలియని బాలికగా ఉన్న పరిచారికను పిల్లలతో ఆడుకోమనే నెపంతో ప్రతిరోజూ పరస్త్రీ ఇంటికి పంపుతూ ఉండాలి. అలా ఆ అమ్మాయి నాయికతో పరిచయం పెంచుకున్న పిదప, ఆ పిల్లద్వారా పూలమాలికలతో రహస్యంగా ప్రేమ లేఖలు పెట్టి పంపాలి. ఈమె వార్తలేవీ నాయికకు చెప్పదు కాబట్టి ప్రేమలేఖలు చేరవేసే పత్రహారి అనే దూతిక వంటిది. ఈమెను మూకదూతి అంటారు.(7)

ఈ అమ్మాయి ద్వారానే నాయకుడు నాయిక వద్దనుండి ప్రత్యుత్తరం తెప్పించుకోవలసి ఉంటుంది.

*61. పూర్వప్రస్తుతార్థ లింగసంబద్ధ మన్యజనాగ్రహణీయం లౌకికార్థం ద్వ్యర్థం వా వచన ముదాసీన యా శ్రావయేత్సావాతదూతీ,*

*తస్యా అపితయైవ ప్రత్యుత్తర ప్రార్థనమితి తాసాం విశేషః.*

8. ఇక వాతదూతి ఎవరో ఆమెచేసే పని ఏదో చెపుతున్నారు. పైన చెప్పిన బాలికవల్ల కూడా పరకాంత వశం కాలేదనుకోండి అప్పుడు నాయికా నాయకులకు ఇంతకు ముందు జరిగిన వ్యవహారాలను గుర్తుచేసే వాక్యాలను ఇతరులకు తెలియకుండా ఉండేలాగాను, అర్థం కాకుండాను వ్రాసి నాయిక వద్దకు పంపాలి నాయకుడు లేదా ద్వంద్వార్థాలు వచ్చేలాగా కవిత్వం అల్లి అయినా ఉత్తరం పంపాలి. ఇలా లేఖలు చేరవేసే దూతిక ఎంతో ధైర్యసాహసాలు కలదిగాను, ఎవరికి లొంగనిదిగాను అయిఉండాలి. వాతదూతి అంటే ఈమే. నాయిక అభిప్రాయం ఏమిటో ఈమె ద్వారా గుర్తించవలసి ఉంటుంది. ఈ దూతికలో విశేషాలు ఇవి.

*62. భవంతి చాత్రశ్లోకాః - విధవేక్షణికా దాసీ భిక్షుకీ శిల్పకారికా,*

*ప్రవిశత్యాశు విశ్వాసం, దూతీకార్యం చ విందతి.*

*63. విద్వేషం కారయేత్పత్యౌ, రమణీయాని వర్ణయేత్. చిత్రాన్సురత సంభోగనన్యా సామపి ధర్మయేత్*

*64. నాయకస్యానురాగం చ పునశ్చరతికౌశలం, ప్రార్థనాంచాధిక స్త్రీభి రవష్టంభం చ వర్ణయేత్.*

విధవ, సోది చెప్పేదీ, దాసిదీ, యోగినీ, బొమ్మలు తయారుచేసేదీ - వీరంతా దూతీకర్మ సాగించడానికి ఎంతో అనుకూలురాండ్రుగా ఉంటారు. ఎంచేతనంటే వీరు ఇతరుల ఇళ్ళలో ఎలాంటి జంకు - కొంకు లేకుండా ప్రవేశించగలరు. అంతేకాక ఆడవాళ్ళను చక్కగా నమ్మిస్తారు.

## దూతికలు చేయవలసిన పనులు

ఇక దూతికలు చేయవలసిన ముఖ్యమైన పనులను గురించి చెపుతున్నారు. భర్త పట్ల ద్వేషం పుట్టించడం, చిత్రవిచిత్రమైన, సుందరమైన, ఇతర స్త్రీలకు

సంబంధించిన రతి కేళీల కథలు నాయికలకు వినిపించడం, నాయకుడికి గల ప్రేమాతిశయం గురించి, సురతక్రీడలో అతనికి గల నేర్పు, సామర్థ్యాన్ని గురించి సుందరాంగులైన పలువురు స్త్రీలు అతని వెంటపడుతూ ఉండడాన్ని గురించి నాయికకు వర్ణించి చెప్పడం - ఇలాంటివి దూతిక చేయవలసిన ముఖ్యమైన పనులు.

*65. అనంకల్పిత మవ్యర్థముత్సృష్టం దోషకారణాత్, పునరావర్తయత్యేవ దూతీ వచనకౌశలాత్.*

ఒకవేళ నాయికలో ఏవో దోషాలున్నాయనే కారణం చేత నాయకుడు ఆమెను గురించి ఆలోచించడం మానివేసినా, దూతిక తన మాటల నేర్పుతో మళ్ళీ నాయికపై ప్రేమ కల్పించ గలుగుతుంది.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే పంచమేऽధికరణే దూతీకర్మాణి చతుర్థోऽధ్యాయః*

**ఇది వాత్స్యాయనముని విరచితమైన కామ సూత్రాల్లో పారదారికం అనే అయిదో అధికరణంలో దూతీకర్మ అనే నాలుగో అధ్యాయం.**



# పంచమాధ్యాయం
## ఈశ్వర కామితం

*1. నరాజ్ఞాం మహామాత్రాణాం వా పరభవనప్రవేశో విద్యతే,*
*మహాజనేన హి చరితమేషాం దృశ్యతే అను విధీయతే చ.*

ఇక **రాజులు** మంత్రులు, సామంతులు, మున్నగువారున్నారు. వీరికి ఇతరుల ఇళ్ళలో ప్రవేశించే అవకాశమే ఉండదు. వీరి నడవడిని, వీరి చరిత్ర ప్రజలంతా గమనిస్తూ ఉంటారు. ఎల్లప్పుడూ వీరిచుట్టూ జనం మూగి ఉంటారు. 'యథారాజా తథాప్రజా' - అన్నట్లు వీరినే ప్రజలు అనుసరిస్తూ ఉంటారు. కాబట్టి, వీరు తప్పులు చేస్తే ప్రజలూ అదే తప్పు చేస్తారు.

*2. సవితారముద్యంతం త్రయోలోకాః పశ్యంతి అనూద్యంతి*
*చ గచ్ఛంతమపి పశ్యంతి, అనుప్రతిష్ఠంతే చ.*

మూడు లోకాలలోనూ సూర్యభగవానుడు శ్రేష్ఠుడని చెప్పబడుతున్నాడు. అతను ఉదయించడం ముల్లోకాలూ చూస్తున్నాయి. అతనితోపాటే లోకాలన్నీ నిద్రలేస్తున్నాయి. అతను అస్తమించడం చూచి అతనితో పాటే లోకాలు నిద్రిస్తున్నాయి. సూర్యుడి ఉదయాస్తమయాలను బట్టే లోకంలో జనులు తమ తమ పనులు చేసుకుంటున్నారు.

*3. తస్మాదశక్యత్వాద్గర్హణీయత్వాచ్చ న తే వృథాకించిదాచరేయుః.*

అందువల్ల ప్రభువులు, రాజులు మొదలైనవారు ఇతరుల ఇళ్ళలో ప్రవేశించి పరస్త్రీలతో సంభోగించడం సాధ్యంకాదు. వారు అలా తిరుగుబోతులు, నీతిలేనివారు అయితే, ప్రజలు వారిని అసహ్యించుకుంటారు. అంతేకాకుండా లోకులు కూడా అలాగే ప్రవర్తించడం జరుగుతుంది. అందువల్ల రాజ పురుషులు, పెద్దలు, ఉన్నత వర్గాల్లో ఉండేవారు, సచ్చరిత్రకలవారు పరకాంతా గమనాన్ని ఎన్నడూ అపేక్షించరాదు.

*4. అవశ్యం త్వాచరితవ్యే యోగాన్ప్రయుంజీరన్.*

పైన చెప్పిన పెద్ద మనుష్యులందరూ తప్పనిసరిగా పరస్త్రీ గమనం చేయవలసివస్తే దూతికల ద్వారా వ్యవహారం సాగించాలిగాని, తమంతట తాము పరస్త్రీ గృహాలలో చొరబడకూడదు.

*5. గ్రామాధిపతేరాయుక్తకస్యహాలోత్థ వృత్తిపుత్రస్యయూనో*
*గ్రామీణ యోషితో వచనమాత్ర సాధ్యాఃతాశ్చర్షణ్య ఇత్యాచక్షతే విటాః.*

అలా దూతికల ద్వారా ప్రయోగాలు జరిపేటప్పుడు ప్రభువులు, కొన్ని

ప్రయోగాలు రహస్యంగాను, కొన్ని వ్యక్తంగాను జరపవలసి ఉంటుంది.

ఈ ప్రభువుల్లో కూడా రెండు రకాలవారు ఉన్నారు. ఒకరు అల్పులు, రెండు అధికులు లేక ముఖ్యులు. ఇక్కడ అల్పులైన రాజులు రహస్యంగా ప్రయోగించవలసిన అభియోగాలను గురించి చెపుతున్నారు.



# అల్పులైన ప్రభువుల అభియోగాలు

అగ్రహారీకులు, గ్రామాధికార్లు మున్నగువారు, రైతుల నుండి పన్నులు, సుంకాలు వసూలు చేసే అధికారులు, కరణాలు, మునసబులు, యువకులుగా ఉన్న రైతుల కుమారులు - వీరందరికీ సంఘంలో ఎంతో కొంత పేరు - పలుకుబడి ఉంటాయి. అంచేత వీరంతా అల్పాధికారం గల ప్రభువులని పిలువబడతారు. వీరు మాటమాత్రం కబురుపెడితేచాలు, అంగనామణులు అధీనమైపోతారు. కాని పల్లెటూళ్ళల్లో ఉండే స్త్రీలందరూ అలాంటివారే అని అనుకోకూడదు. ఎవరో కొందరు నీచురాండ్రైన కాంతలు మాత్రమే అలా ఉంటారు. అలాంటి పురుషులు కూడా ఉంటారు. వారిని విటులని, స్త్రీలైతే జారిణులని పిలుస్తారు. అలాంటి జారకాంతలను చర్షణులని కూడా అంటారు.

6. *తాభిస్సహ విష్టికర్మను కోష్ఠాగారప్రవేశే ద్రవ్యాణాం నిష్క్రమణ ప్రవేశనయోః, భవన ప్రతిసంస్కారే, క్షేత్రకర్మణి కర్పాసోర్ణాZతసీశణ వల్కలాదానే, సూత్రప్రతిగ్రహే, ద్రవ్యాణాంక్రయవిక్రయవినిమయేషు, తేషు తేషు చ కర్మసుసంప్రయోగః.*

పైన పేర్కొన్న జారిణులైన పల్లెపడుచులతో ఎలా సంప్రయోగం జరపాలో ఆ విధానం గురించి చెపుతున్నారు - ఈ స్త్రీలు సాధారణంగా ఇంటి పనులలో నియమింపబడుతూ ఉంటారు. వడ్లు దంచడం, బియ్యం చెరగడం, పిండి విసరడం, చెరగడం, ఇళ్ళు ఊడ్చడం, అలకడం, ముగ్గులు పెట్టడం మొదలైన విష్టికర్మలు

చేస్తుంటారు వీళ్ళు. ఈ పనులుచేసినందుకు ధనానికి బదులు ధాన్యం, బియ్యం, అన్నం, మున్నగునవి తీసుకుంటారు. ఇది సర్వసాధారణంగా అందరికీ అనుభవ సిద్ధమే. అలాంటి సమయాలలో ధాన్యం గాదెలు, వడ్లకొట్లు, పురులు మొదలైన వాటిల్లో ధాన్యం పోయించే సమయాల్లోనూ, వాటిలో నుంచి ధాన్యం తీయించే సమయాల్లోనూ, ఇళ్ళకు బూజులు దులిపించే సమయాల్లోనూ, సున్నం కొట్టించేటప్పుడూ, పొలాల్లో పనులు చేయించేటప్పుడూ, ప్రత్తి, ఉన్ని, నారలు శుభ్రం చేయించే సమయాల్లోనూ, ప్రత్తిదారాలు వడిగించేటప్పుడూ, అలా తీసిన దారాలు తిరిగి ఒప్పజెప్పుకునే సందార్భాల్లోనూ, ధాన్యాదులు కొనుగోలు చేసే సమయల్లోనూ, అమ్మకం చేసే సందర్భాల్లోనూ, ఈ పనులు చేసే పడతులను వీలుచూసుకుని సంభోగిస్తూ ఉంటారు పురుషులు.

*7. తథా వ్రజయోషిద్భి: సహగవాధ్యక్షస్య.*

*8. విధూZనాథా ప్రవ్రజితాభిన్సహసూత్రాధ్యక్షస్య.*

అలాగే గోవులు కలవారు గొల్ల పడుచులతో సంభోగిస్తుంటారు. విధవలు, భర్తలచే విడువబడినవారు. సన్యాసినులు, మొదలైన వారితో వారికి సమీపంగా వుండే వారితో సంభోగం సాగుతూ ఉంటుంది.

*9. మర్మజ్ఞత్వాద్రాత్రావటనే చాZటంతీభిర్నాగరకస్య.*

నాగరీకులు కొందరు రాత్రివేళల్లో గస్తీ తిరగడానికి నియమించబడతారు. వారికి రమణుల రహస్యాలు బాగా తెలుస్తాయి. అంచేత వారికి రాత్రులందు సంచరించే సరసిజాక్షులతో సంభోగం కుదురుతుంది.

*10. క్రయవిక్రయే పణ్యాధ్యక్షస్య.*

రాజకీయ సంబంధమైన వస్తువులు విక్రయించే సమయాల్లోనూ, కొనే సమయాల్లోనూ, ఆయా క్రయవిక్రయాలలో నియమితులైన అధికారులకు ఆ వ్యాపారాలు చేసే స్త్రీలతో సంభోగం జరుగుతుంది.

*11. అష్టమీచంద్రకౌముదీను వసంతకాదిషు పత్తన నగర*
*ఖర్వాటయోషితా మీశ్వరభవనే సహాంతఃపురికాభిః ప్రాయేణక్రీడా.*

ఇప్పుడిక రాజపురుషుల్లో ముఖ్యులు రహస్యంగా సాగించే అభియోగాలను గురించి పేర్కొంటున్నారు. అష్టమీ చంద్ర కౌముది, వసంతకం, మున్నగు ఉత్సవ సమయాల్లో పట్టణాల్లోను, నగరాల్లోను ఖర్వాటలలోను నివసించే నీరజాక్షులతోను, రాజాంతఃపుర స్త్రీలతోను, రాజులకు, పెద్దమనుష్యులకు రతిక్రీడలు సాగుతూ ఉంటాయి, సాధారణంగా.

*12. తత్ర చాపానకాంతే నగరస్త్రియో యధాపరిచయమంతఃపురికాణాం*
*పృధక్పృధగ్బ్రగా వాసకాన్ప్రవిశ్య కథాభి రాసిత్వా*
*పూజితాశ్ప్రేవ ప్రదోషం నిష్క్రామయేయుః.*

ఈ రతిక్రీడల సందర్భంగా అంతఃపుర కాంతలలో కలిసి పానీయాలు సేవించడం జరుగుతుంది. ఆ తరువాత రతికేళికా మందిరాలలో ప్రవేశించి రతికి సంబంధించిన కథలు సాయంకాలందాకా చెప్పుకుంటారు. వాళ్ళచేత పూజలు చేయించుకుంటారు. వాళ్ళ ద్వారానే పానీయాలు సేవిస్తారు. ఆ తరువాత రాజగృహంనుండి తమతమ స్థానాలకు చేరుకోవాలి. స్త్రీలను కూడా వారి వారి ప్రదేశాలకు చేర్చాలి.

*13. తత్ర ప్రణిహితా రాజదాసీ ప్రయోజ్యాయాః పూర్వ సంసృష్టలాంతత్ర సంభాషేత.*

*14. రామణీయక దర్శనేచ యోజయేత్.*

*15. ప్రాగేవ స్వభవన స్థాం(బ్రూయాత్.*

*16. అముష్యాం క్రీడాయాం తవరాజభవన స్థానాని రామణీయకాని దర్శయిష్యా మీతి కాలే యోజయేత్.*

*17. బహిః ప్రవాళకుట్టిమంతే దర్శయిష్యా మీతి, మణిభూమికాం వృక్షవాటికాం, మృద్వీకా మండపం, సముద్ర గృహ ప్రసాదాన్, గూఢాభిత్తి సంచారాంశ్చిత్ర కర్మాణి క్రీడా మృగాన్ యంత్రాణి, శకునా న్వ్యాఘ్ర సింహ పంజరా దీని చ యాని పురస్తాద్వర్ణితానిన్యః.*

*18. ఏకాంతే చ తద్గతమీశ్వరానురాగం శ్రావయేత్.*

*19. సంప్రయోగే చాతుర్యం చాభివర్ణయేత్.*

*20. ఆమంత్ర స్రావంచ ప్రతిపన్నాం యోజయేత్.*

పైన పేర్కొన్న ఉత్సవాలలో అంతకు పూర్వం రాజు నియమించిన రాజదాసి అతను కోరి వున్న నాయికతో కలిసి అక్కడ మాట్లాడాలి. క్రమంగా నీకు అందచందాలైన చిత్రాలు చూపిస్తానని ఆమె ఇంట్లో ఉండగానే చెప్పి, ఈ క్రీడా సందర్భంలో నీకు రాజభవనం, అక్కడి విశేషాలు, అందమైన ప్రదేశాలు చూపిస్తాను రమ్మని ఆమెను ఒప్పించి ఆ చోటుకు తీసుకుని వెళ్లాలి. పిమ్మట మెల్లగా బయట ఉన్న ప్రవాళ కుట్టిమాన్ని చూపిస్తానని చెప్పి, దాన్నీ మణిమందిరాన్ని పూలతోటను, ద్రాక్ష మంటపాన్ని, జలయంత్రాలను, సముద్ర గృహాలను రహస్యంగా గోడలో నుంచి నడిచివేళ్ళే మార్గాలను, చిత్రకర్మలను, ఆటలకోసం ఉద్దేశించబడిన జంతువుల బొమ్మలను, శకున పక్షులను పెద్దపులులు, సింహాలు మున్నగునవి ఉండే బోనులు, ఇంకా పూర్వం ఆమెకు చూపిస్తానని చెప్పినవన్నీ చూపించాలి. అటుపైన ఒక ఏకాంత స్థలంలోకి ఆమెను తీసుకునిపోయి, ప్రభువు నీతో సంభోగించాలని అభిలాషపడుతున్నాడు, నిన్ను ప్రేమిస్తున్నాడు అని ఆమెకు తెలియపరచాలి. అతనికి సంభోగంలో గల నేర్పు, సామర్థ్యం గురించి ఆమెకు వర్ణించి చెప్పాలి.

మనం ఇలా వచ్చినట్లు ఎవరికీ తెలియదని ధైర్యం చెప్పి, నెమ్మదిగా రాజుతో సంప్రయోగానికి ఆమెను సిద్ధం చేయాలి దూతిక.

21. అప్రతిపద్యమానాంతు స్వయమే వేశ్వర ఆగత్య ఉపచారై స్సాంతయిత్వా
తాం రంజయిత్వా సంభూయచ సానురాగం విసృజేత్.

22. ప్రయోజ్యాయాశ్చ) వత్యురనుగ్రహోచితస్యదారాన్నిత్య మంతఃపుర
మౌచిత్యాత్ప్రవేశయే తత్రప్రణి హితా రాజదానీత సమానం పూర్వేణ.

23. అంతఃపురికా వాప్రయోజ్యయా సహస్వచేటికా సంప్రేషణేన ప్రీతిం కుర్యాత్,
ప్రసృత ప్రీతించసావదేశం దర్శనేనియోజయేత్,
ప్రవిష్టాం, పూజితాం పీతవతీం ప్రణిహితా రాజదానీతి సమానం పూర్వేణ.

24. యస్మిన్వా విజ్ఞానే ప్రయోజ్యా విఖ్యాతా స్యాతద్దర్శనార్థ మాంతఃపురికా సోపచారం
తమాహ్వయేత్, ప్రవిష్టాం ప్రణిహితా రాజదానీతి సమానం పూర్వేణ.

25. అద్భుతానర్థస్య భీతస్యవా భార్యాం భిక్షుకీ బ్రూయత్, అసావాంతః
పురికా రాజని సిద్ధా గృహీత వాక్యా, ముసవచనం శృణోతి,
స్వభావతశ్చ) కృపాశీలా, తామనేనోపాయే నాధి గమిష్యామి,
అహమేవతే ప్రవేశం, కరిష్యామిసాచతే భర్తుర్మహాంత మనర్థం నివర్త
యిష్యతీతి ప్రతి పన్నాం ద్విస్త్రిరితి ప్రవేశయేత్, అంతఃపురికాస్యా అభయం
దాద్యాదభయ శ్రవణాచ్చ) సంప్రహృష్టాం ప్రణిహితా రాజదానీతి సమానం పూర్వేణ.

26. ఏతయా వృత్యర్థినాం, మహామాత్రాధి తస్తానాంబలా ద్విగృహీతానాం, వ్యవహారే
దుర్బలానాం, స్వభోగేనా సంతుష్టానాం,
రాజని ప్రీతికామానాం, రాజభవనేషు స్వాతంత్ర్యమిచ్ఛాతాం,
సజాతైర్బాధ్య మానానాం, సజాతాన్బాధితు కామానాం,
సూచకానామ న్యేషాం, కార్యవశీనాం జాయాః వ్యాఖ్యాతాః.

ఇక పురుషుడు అభిలషించిన పరస్త్రీ ఇష్టపడని సందర్భాలలో చేయవలసిన పనులను గురించి చెపుతున్నారు - పూలు మొదలైన అలంకారాదులచేత, మధ్యపానాదులచేత, స్త్రీకి చక్కగా ఊరట కలిగించి పురుషుడు ఆమెను లోబరుచుకోవాలి. సాధారణంగా సుదతులు ప్రేమ సూచకాలైన ఉపచారాలవల్ల, సపర్యల వల్ల సిగ్గుపడి వశమై పోతుంటారు. అంచాత అలా వశమైన వనితామణికి ఇష్టమైన రీతిలో ఆమెతో సంభోగించి సంతుష్టి పరచాలి. దాసీదాని ద్వారా ఆమెను నాగరిక స్త్రీ జనంతో చేర్చి ప్రేమపూర్వకంగా సాగనంపాలి. ఈ ప్రభువు నన్ను ప్రేమించాడని సంతృప్తి కలిగే విధంగా ఆమెపట్ల అమిత ప్రేమాభిమానాలు చూపించాలని భావం. రాజు అనుగ్రహం పొందగోరే పురుషుడి భార్యను సయితం ఎప్పుడూ అంతఃపురంలోకి ప్రవేశం కలిగించాలి. కాబట్టి, ఆమె అలా అంతఃపురంలోకి వచ్చిన పిదప, పూర్వం రాజదాసి వెనుకటి పద్ధతి మాదిరిగానే రాజుకు తార్చాలి. ఒక అంతఃపురకాంత, ఆమెతో కలిసి తన చెలికత్తెను ఆమె వెంటపంపి, ఆమెకు ప్రీతి కలిగించాలి. అలా ఇమె సంతోషంగా ఉన్నప్పుడు, ఆ మాట - ఈ మాట చెపుతూ ఆమెను అటు - ఇటు త్రిప్పి చివరకు రాజు ఉన్న చోటుకు తీసుకుని వెళ్ళాలి. అటుపైన ఆమెను కబుర్లలోకి దింపి రాజు సన్నిధికి చేర్చి,

మద్యం సేవించేలా చేసి రాజదాసి హాయిగా కబుర్లు చెప్పాలి. మళ్ళీపైన చెప్పినట్లు చెయ్యాలి. ఆ స్త్రీ అప్పటికే గొప్ప విజ్ఞానవంతురాలుగా పేరు - ప్రఖ్యాతులు పొంది ఉంటే, ఆమెను చూడడానికి అంతఃపురకాంత ఆమెను సగౌరవంగా తన దగ్గరికి పిలిపించుకోవాలి. ఆ విధంగా అంతఃపురంలోకి వచ్చిన పిమ్మట రాజదాసి తియ్యని మాటలతో ఆమెను వెనుకటిలా సంతోషపెట్టాలి.

ఉరిశిక్షలాంటి మహావిపత్తులో ఉన్నవాడి భార్య, ఇతరుల వల్ల భయపడి వున్న వాడి భార్య - వీరిని బిచ్చగత్తె సమీపించి ''ఫలానా అంతఃపురకాంత రాజుకు ఎంతో ఇష్టురాలు. ఆమె మాట రాజు జవదాటడు. నామాట కూడా ఆమె తప్పకుండా వింటుంది. అంతేకాకుండా ఆమె స్వతహాగా దయ - దాక్షిణ్యం గల మనిషి. అంచేత నేను నిన్ను ఉపాయంగా ఆమె దగ్గరికి తీసుకెడతాను. మళ్ళీ నేనే నిన్ను ఇక్కడ దిగవిడుస్తాను. నీ మొగుడికి వచ్చిన ఆపద, ఆమె తన భర్తకు చెప్పి తప్పిస్తుంది'' అని నచ్చచెప్పి అంతఃపురంలోకి రెండు, మూడు సార్లు స్వేచ్ఛగా వచ్చేలా చెయ్యాలి. ఆ అంతఃపురకాంత కూడా తప్పక రక్షిస్తానని ఆమెకు అభయం ఇవ్వాలి. ఇలా అభయం ఇవ్వడం వల్ల ఆమె సంతోషిస్తుంది. ఆ తరువాత రాజదాసి ఆమెను లోబరుచుకుని వెనుకటిలాగా కార్యం సాధించుకోవాలి.

ఈ విధానంలో ఏవైనా ఉద్యోగాలు, నౌకరీలు కావాలని ప్రాధేయపడే పురుషులు భార్యలు, మంత్రి సామంతాదులచేత పీడింపబడిన వారి భార్యలు, బందీల భార్యలు, ఉద్యోగాల్లో, ఇతర వ్యవహారాల్లో దెబ్బతింటున్న వారి భార్యలు, తమ పురుషుల సంభోగంతో తృప్తిపడని వారి భార్యలు, రాజును సంతోషపెట్టాలని అనుకునే అర్ధాంగులు, రాజభవనాలలో స్వేచ్ఛ - స్వతంత్ర్యాలు సంపాదించుకోవాలని అనుకునే వారి సతులు, తమ జాతి వారిచేత బాధలు పడేవారి పడతులు, లేదా తమ జాతి వారిని బాధించాలని అనుకునే వారి ఇల్లాండ్రు, ఇలాంటి కార్యకలాపాల్లో నిమగ్నులై ఉండేవారి భార్యలు - వీరందరినీ వశపరచుకునే విధానం ఇదేనని స్పష్టం చేస్తున్నారు శాస్త్రకారులు. ఇలాంటి వారందర్నీ గురించి ఇక్కడ వ్యాఖ్యానించబడిందన్నమాట!

*27. ఆన్యేనవా నహ నంనృష్టాం నంగ్రాహ్యాః ప్రయోజ్యాం*
*దాన్యముపనీతాం క్రమేణాంతఃపురం ప్రవేశయేత్.*

*28. ప్రణిధినా చ యతి మస్యాః నంధూష్య రాజనివిద్విష్ట ఇతి కళత్రావగ్రహోపాయేన ఏనా మంతఃపురం ప్రవేశయేత్, ఇతి ప్రచ్ఛన్న యోగాఃఏతే రాజ పుత్రేషు [illegible]యేణ.*

పైన చెప్పినట్లు వశంకాని స్త్రీలను సహజంగా దుష్టురాండ్రు కాకపోయినప్పటికి, ఎవరితోనో సంసర్గం చేసినట్లు నేరం ఆరోపించి కులంలో నుంచి వెలి వేయించాలి. ఆమెను దాసీదానిగా స్వీకరించి నెమ్మదిగా అంతఃపురంలో ప్రవేశం కల్పించాలి. లేదా ఆమె భర్త పరకాంతను ఎత్తుకపోయినట్లు చారుడి ద్వారా ప్రచారం చేయించి, అందుకు బదులుగా అతని భార్యను అంతఃపురంలోకి తీసుకురావాలి. వీటిని

రహస్యయోగా లంటారు. సాధారణంగా రాకుమారులు, రాజపుత్రులకు సంబంధించిన విషయాలు ఇవి.

*29. నత్యేవ పరభవన మీశ్వరః ప్రవిశేత్.*

*30. ఆ భీరంహి కోట్టరాజం పరభవన గతం భాతృప్రయుక్తో*
*రజకో జఘున, కాశీరాజం జయత్సేన మశ్వాధ్యక్షః ఇతి.*

రాజైనవాడు ఎలాంటి సమయంలోనైనా సరే, ఎలాంటి సందర్భంలోనైనా సరే పరగృహంలో ప్రవేశించనే కూడదు. అలా ప్రవేశిస్తే ప్రమాదాలు వాటిల్ల వచ్చు. ఇందుకు తార్కాణంగా ఒక కథ ఉంది వినండి. -

పూర్వం మూర్జర దేశపు ప్రభువు అభీరుడనేవాడు, పరాయి ఆడదాని కోసం ఇతరుల ఇంట్లో ప్రవేశించాడు. అతని రాజ్యం అపహరించాలని అంతకు ముందు ఎన్నాళ్ళనుంచో ఎదురు చూస్తున్న అతని సోదరుడు ఈ సమయం కనిపెట్టాడు. అతన్ని సంహరించి రమ్మని ఒక రజకుణ్ణి పంపాడు. అలాగే ఆ రజకుడు వెళ్ళి, పరకాంత కోసం వెంపరలాడుతూ ఇతరుల ఇంట్లో వున్న రాజాను చంపివచ్చాడు. అలాగే కాశీ రాజైన జయత్సేనుణ్ణి, ఇలాంటి సందర్భం, సమయం కనిపెట్టి ఒక అశ్వదళాధ్యక్షుడు సంహరించడం జరిగింది.

*31 ప్రకాశకామితాని తు దేశ ప్రవృత్తి యోగాత్.*

దేశాచారాలను బాగా పరిశీలించి, కామ కలాపాల్లో పాల్గొనాలని రాజులను హెచ్చరిస్తున్నారు.

*32. ప్రత్తాః జనపదకన్యాః దశమే హని కించిదౌ పాయనిక*
*ముపగృహ్యా ప్రవిశం త్యంతఃపుర ముపభుక్తా ఏవ విసృజంత ఇత్యాంధ్రాణాం.*

*33. మహా మాత్రేశ్వరాణా మంతఃపురాణి నిశినేవార్థ*
*రాజాన ముపగచ్ఛంతి వాత్స గుల్మకానాం.*

*34. రూపవతీర్జనపద యోషితః ప్రీత్యపదేశేన మానం మాసార్థం*
*వానయం త్యంతఃపుర ఏవాంతఃపురికా వైదర్భాణాం.*

*35. దర్శనీయాః స్వభార్యాః ప్రీతిదాయమేవ మహామాత్ర రాజభ్యో దదత్యపరాంత కాణాం.*

*36. రాజక్రీడార్థం నగరస్త్రియో జనపదస్త్రియశ్చ నంఘశ్చః*
*ఏకశశ్చ రాజకులం ప్రవిశంతి సౌరాష్ట్ర కాణామితి.*

కొత్తగా పెళ్ళిళ్ళు చేసుకున్న పల్లె పిల్లలు వీలునుబట్టి ఏదో ఒకరోజు, రకరకాల కానుకలు తీసుకుని రాజుగారికి ఇవ్వడానికై రాజాంతపురాల్లోకి వెడతారు. అప్పుడు ప్రభువులు వాళ్ళతో రతిక్రీడలు సాగిస్తుంటారు. ఇది ఆంధ్రదేశంలో వున్న ఆచారం.

అలాగే వేర్వేరు దేశాల్లో వేర్వేరు ఆచారాలు వున్నాయి. వాత్సగుల్మ దేశంలో మరో ఆచారం వుంది. ఆ దేశంలో పల్లెపడుచులు రాత్రివేళల్లో రాజుల, గొప్ప

వారి సేవలు చేయడానికై మంత్రి, సామంతుల, ధనవంతుల అంతఃపురాల్లోకి వెళ్ళి అక్కడ వారిచేత సంభోగింపబడుతూ వుంటారు.

(దక్షిణాపథంలో వాత్స, గుల్మ అనే ఇరువురు రాజులు ఉండేవారు పూర్వం. వారు పాలించే దేశం పేరే వాత్స గుల్మదేశం.)

చక్కని చుక్కలుగా వుండే పల్లెటూరి అమ్మాయిలను రాజులు మోజుపడి తమ అంతఃపురాలలోనికి పిలిపించుకుంటారు. సెల రోజులో, నెలా పదిహేను రోజులో వారిని అలా అంతఃపురాలలోనే వుంచుకుని వారితో రతిక్రీడల్లో తేలియాడుతూ ఆనందిస్తారు. ఇది వైదర్భ దేశంలోని ఆచారంగా వుంటున్నది. అలాగే అపరాంతదేశస్థులు సుందరాంగులైన తమ సుదతీమణుల అనుగ్రహం సంపాదించుకోడం కోసం రాజులకు, మహామంత్రులకు, భాగ్యవంతులకు వారిని తారుస్తూ వుంటారు. పట్టణస్త్రీలు, పల్లెపడుచులు కూడా రాసక్రీడల కోసం విడివిడిగాను, గుంపులు గుంపులుగాను రాజాంతఃపురాలలోకి వెడుతూ వుంటారు. అప్పుడు వారు సురత సుఖాలు అనుభవిస్తారు. ఇది సౌరాష్ట్ర దేశంలోని ఆచారం.

*37. శ్లోకావత్ర భవతః - ఏతే చాన్యేచబహవః ప్రయోగాః పారదారికాః*
*దేశే దేశే ప్రవర్తంతే రాజభిః సంప్రవర్తితాః*

*38. నత్వేవై తత్ర యుంజీతరాజా లోకహి తేరతః*
*నిగృహీతారిషడ్వర్గః తదా విజయతే మహీం*

ఈ పైన చెప్పినవన్నీ, ఇంకా ఇతరమైనవీ ఎన్నెన్నో ప్రయోగాలు పరదాల విషయమై వున్నాయి. వేర్వేరు దేశాలలో వేర్వేరు రకాల ప్రయోగాలు ఆచరణలోనూ, అనుభవంలోనూ వున్నాయి. రాజులు, రాజ పురుషులు వీటిని ఆచరణలో పెడుతున్నారు కూడా. అయితే, లోకశ్రేయస్సు అభిలషించే రాజు ఎవడూ కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరాలనే అరిషడ్వర్గాలను జయించి, జితేంద్రియుడై ప్రవర్తించాలి. అప్పుడే ఆ ప్రభువు జయశీలుడై దిగ్విజయంగా, ఏకచ్ఛత్రంగా ఈ క్షోణితలాన్ని పరిపాలించగలుగుతాడు.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే పంచమేఽధికరణే ఈశ్వరకామితం నామ పంచమోధ్యాయః*

**ఇది శ్రీ వాత్స్యాయన ముని విరచితమైన కామసూత్రాల్లో పారదారికం అనే అయిదో అధికరణంలో ఈశ్వర కామితం అనే అయిదో అధ్యాయం.**



# షష్ఠాధ్యాయం
## అంతఃపురికం, దారరక్షితం

1. *నాంతఃపురాణాం రక్షణ యోగాత్పురుష సందర్శనం విద్యతే*
*పత్యుశ్చైకత్వా దనేక సాధారణత్వాచ్చ అతృప్తి*
*స్తస్మాత్తాని యోగత ఏవ పరస్పరం రంజయేయుః*

రాజాంతఃపురాలలో ఉండే రమణులకు రక్షణలు ఉంటాయి. కాపలాలూ ఉంటాయి. ఇవి మిక్కుటంగా ఉండడం వల్ల ఈ కాంతలు పరపురుషులను చూడడం అనేది కుదరదు. పైగా ఈ అంతపుర కాంతలు పలువురికి ఒక్కడే భర్తగా ఉంటాడు సాధారణంగా. అంచాత ఈ పడతులు కామవాంఛ తీరక, వారిలో వారే ఒకరి వల్ల ఒకరు ప్రయోగాల ద్వారా కోరిక తీర్చుకుంటూ ఉంటారు. ఆ విధానమే ఇక్కడ చెపుతున్నారు.

2. *ధాత్రేయికాం సఖీం దాసీం వా పురుషవదలంకృత్య ఆకృతి సంయుక్తైః*
*కందమూల ఫలావయవైరుపద్ర వ్యైర్వా ఆత్మాభిప్రాయం నిర్వర్తయేయుః*

దాదికిగాని, చెలికత్తెకు గాని, దాసికి గాని పరపురుషుడి వేషం వేసి, కంద మూలాదులతో పురుషులకు ఉండే అవయవాలన్నీ ఆమెకు అమర్చి ఆమె నిజంగానే పురుషుడని అనుకుంటూ ఆమెతో సంభోగిస్తూ కామవాంఛ తీర్చుకుంటారు.

3. *పురుషప్రతిమా అవ్యక్తలింగాశ్చాధిశయీరన్.*

అంతే కాకుండా కొందరు కొజ్జాలుంటారు. వారి ఆకారం పురుషుడి ఆకారమే కాని గడ్డం, మీసం ఉండవు. అలాంటి వారిని పక్కలో పడుకోబెట్టుకుని కామదాహం తీర్చుకుంటారు.

4. *రాజానశ్చ కృపాశీలాః వినాఽపి భావయోగాదాయోజితా*
*పద్రవ్యాయావదర్థమేకయా రాత్ర్యా బహ్వీభిరపి గచ్ఛంతి, యస్యాం తు*
*ప్రీతి ర్వాసకబుతుర్వాతత్రాభిప్రాయతః ప్రవర్తంత ఇతి ప్రాచ్యోపరాః*

ప్రాచ్య దేశీయుల్లో ఒకానొక ఆచారం ఉంది. రాజులు, రాజ పురుషులు కామాసక్తులై తమ అంతఃపుర స్త్రీలను దయదలచి వారితో భోగించి, వారిని సంతుష్టి పరుస్తున్నారు. అలాగే ఒక్కొక్కప్పుడు కామవాంఛ లేకపోయినా కృత్రిమ లింగాలు మొలకు కట్టుకుని, వారితో సంభోగించి తృప్తి పరుస్తున్నారు. ఇలా ఒకే రాత్రి పలువురు పడతుల దగ్గర పడుకుని వారిని సంతుష్టి పరుస్తుంటారు. వారిలో ఏ స్త్రీకి ఋతుదినమో, ఏ స్త్రీ యందు తమ మనస్సు లగ్నమైనదో ఆ స్త్రీతో మాత్రం మనఃపూర్తిగా సంభోగిస్తున్నారు.

5. *స్త్రీ యోగేనైవ పురుషాణామప్యలబ్ధ వృత్తీనాం వియోనిషు*
*విజాతిషు స్త్రీ ప్రతిమాను కేవలోపమర్దనాచ్చ అభిప్రాయనివృత్తి ర్వ్యాఖ్యాతా.*

పర పురుష దర్శనం లేని పడతులు, తమ చెలికత్తెలకు మగవేషం వేసి, వారితో సంభోగించడం ద్వారా కామవాంఛ తీర్చుకున్నట్లే పురుషులు కూడా తమ తోటి పురుషులకు ఆడవేషం వేసి, వారితో పడుకుని కామవాంఛ తీర్చుకుంటారు. ఇలా పురుషులకు ఆడవేషం వేసినప్పుడు కృత్రిమ యోనులు కల్పిస్తారు లేదా ఇతర మృగాల మర్మాంగాలుగానీ, ఆడబొమ్మలు, విగ్రహాలు అమర్చడం ద్వారా గానీ రతి సలిపి కామం తీర్చుకుంటారు.

6. *యోషావేషాంశ్చ నాగరకాన్ప్రాయేణ అంతఃపురికా పరిచారికాభిః సహ ప్రవేశయంతి.*

7. *తేషాముపావర్తనే ధాత్రేయికాశ్చాభ్యంతర సంసృష్టా ఆయతిం దర్శయంత్యః ప్రయతేరన్.*

8. *సుఖప్రవేశితామవసార భూమిం విశాలతాం వేశ్మనః*
*ప్రమాదంరక్షిణామనిత్యతాం పరిజనస్య వర్ణయేయుః*

9. *నచనద్భూతేనార్థేన ప్రవేశయితుంజన మావర్జయే యుర్దోషాత్.*

సాధారణంగా అంతఃపురకాంతలు ఆడవేషం వేసుకుని ఉన్న నాగరక పురుషులను తమ దాసీల సహాయంతో అంతఃపురానికి పిలిపించుకుంటారు. ఆ నాగరక పురుషులను అనుకూలురుగా చేసుకోవడానికి అంతఃపురస్త్రీల అనుమతితో దాదులు, ఏవేవో ఆశలు వారికి కల్పించి ప్రయత్నాలు చేస్తారు. అలా ప్రయత్నిస్తూనే, ఆ పురుషులకు ఏదైనా భయం, విపత్తు ప్రాప్తిస్తే, ఫలానా త్రోవగుండా చులాగ్గా పారిపోవచ్చునని ధైర్యం చెప్పాలి. ఎప్పుడుబడితే అప్పుడు సులువుగా రావడానికి అనువైన మార్గం వారికి చూపించాలి. ఆపద సంభవించినప్పుడు తాము తప్పించుకునే మార్గం ఇంత విశాలమైనదని వర్ణించి చెప్పాలి. పరిజనులు అజాగ్రత్తగా ఉంటారని, కాబట్టి భయం ఉండదని నిరూపించాలి. అయితే, లేనిపోని అబద్ధాలు పలికి వారిని మోసగించకూడదు. ఒక్కొక్కప్పుడు అది వారి ప్రాణాలనే తీయవచ్చు. మరి అలాంటిది మహా దోషం కదా!

10. *నాగరకస్తు సుప్రాపా మప్యంతఃపురమపాయ*
*భూయాష్ఠత్వాన్న ప్రవిశేదితి వాత్స్యాయనః*

11. *సాపసారంతు ప్రమదవనావ గాఢం విభక్తదీర్ఘకక్షం అల్పప్రమత్త రక్షకం*
*ప్రోషితరాజకం, కారణాని సమీక్ష్య బహుశః ఆహూయమానోzర్థబుద్ధ్వా కక్షాప్రవేశం*
*చ దృష్ట్వాతాభిరేవ హితోపాయః ప్రవిశేత్.*

12. *శక్తి విషయే చ ప్రతిదినం నిష్క్రామయేత్.*

ఒక నాగరకుడు ఎంత చులాగ్గా ఎక్కడికైనా ప్రవేశించగలవాడైనప్పటికీ రాజుల అంతఃపురాలలోకి మాత్రం ప్రవేశించరాదని వాత్స్యాయనులంటున్నారు. ఒకవేళ తప్పనిసరిగా రాజాంతఃపురాలలో ప్రవేశించవలసివస్తే, సులువుగా అలా ప్రవేశించడానికీ, మళ్ళీ బయటికి రావడానికి అనుకూలమైన దారులు గల

ఉద్యానవనాల్లో రహస్య మార్గాలు కనిపెట్టాలి. రాజు నగరంలో ఉన్నదీ లేనిదీ కూడా గమనించాలి. తప్పతాగి, పాలకజనం అంతగా లేని సమయం కనిపెట్టి, అనేక కారణాలు విచారించి, చాలాసార్లు నేర్పుతో, ద్వారం ఎక్కడున్నదీ, తనంతటతాను వెళ్ళగలిగిన ఏర్పాటు ఉన్నదీ విచారణ చేసి అప్పుడు అంతఃపురంలో అడుగుపెట్టాలి. తగిన సామర్థ్యం కలవాడైతే అలా ఎన్నిసార్లయినా, రోజూ అయినా అక్కడికి వెళ్ళవచ్చు. సురక్షితంగా తిరిగిరావచ్చు.

*13. బహిశ్చ రక్షభి రన్యదేవతా కారణమువదిశ్య సంసృజ్యేత*

*14. అంతశ్చారిణ్యాంచ పరిచారికాయాం విదితార్థాయాం*
*నక్తమాత్మానం రూపయేత్తదలా భాచ్ఛశోకం.*

*15. అంతఃప్రవేశినీభిశ్చ దూతీకల్పం సకల మాచరేత్.*

*16. రాజప్రణిధీంశ్చ బుధ్యేత*

*17. దూత్యాశ్చ సంచారే యత్రగృహీతాకారాయాః*
*ప్రయోజ్యాయాః దర్శనయోగ స్తత్రావస్థాపనమ్.*

*18. తస్మిన్నపిలు రక్షిషు ముపచారికావ్యపదేశః*

*19. చక్షురనుబధ్నత్యా మింగితాకార నివేదనమ్.*

*20. యత్రసంపాతో స్యాన్తత్ర చిత్రకర్మణ స్తద్వ్యక్తస్యద్వ్యర్థానాం గీతవస్తుకానాం*
*క్రీడనకానాం కృతచిహ్నానామా పీడనకస్యాంగులీయకస్యా చ విధానం*

*21. ప్రత్యుత్తరం చ తయాదత్తం ప్రపశ్యేతత్తః ప్రవేశనే యతేత.*

రాజాంతఃపురాలలో స్వయంగా ప్రయత్నించే పద్ధతిని గురించి ఇక్కడ చెపుతున్నారు. మొట్టమొదట ద్వారపాలకులతో లేదా ప్రతీహారులతో ఏదో నెపం మీద స్నేహం చెయ్యాలి. వాళ్ళతో చెలిమి ఏర్పడితే, ఆ తరువాత అంతఃపురంలో తిరుగాడే పరిచారిక తనతో మైత్రికి ఒప్పుకున్నదని, ఆమె మీద తన మనస్సు లగ్నమైనదని, తాను లభ్యం కానందున ఆమె ఎంతగానో విచారపడుతున్నదని, చెప్పి దుఃఖాన్ని నటించాలి. బయటినుంచి అంతఃపురంలోకి వెళ్ళే స్త్రీల ద్వారా కొంత రాయబారం నడపాలి. రాజుకు గూఢచారులు ఉంటారు కాబట్టి, వారిని కూడా కొంతవరకు లోబరచుకోవాలి.

పిమ్మట దూతిక లభించినప్పుడు నాయిక తన మనోభావాన్ని ఆమెకు సూచించడానికీ, తన అభిప్రాయం ఆమెకు తెలపడానికీ తగిన ప్రదేశంలో ఆమెను చూస్తూ నిలుచోవాలి. అక్కడ కూడా పరిచారకులు, రాజభటులు ఉండేటట్లయితే తను అనుకున్న పరిచారిక కోసం నిరీక్షిస్తున్నట్లు నటించాలి. నాయిక తన వంక చూస్తున్నప్పుడు నాయకుడు తన అభిప్రాయాన్ని సూచనప్రాయంగా వ్యక్తం చేయాలి. ఆమె ఎటువైపు చూస్తుంటే అటువైపు విచిత్రములైన బొమ్మలు, రెండర్థాలు స్ఫురించే వస్తువులు, తలలో పెట్టుకునే పూలు, ఉంగరాలు మున్నగునవి చిత్రించాలి. వాటికి ఆమె ఏమి ప్రత్యుత్తరాలు ఇస్తుందో అవి కూడా జాగ్రత్తగా గమనించాలి. ఆ తరువాత అంతఃపురంలో అడుగుపెట్టడానికి ప్రయత్నంచేయాలి.

22. యత్ర చాస్యా నియతం గమనమితి విద్యాత్ తత్ర ప్రచ్ఛన్నస్య ప్రాగేవ అవస్థానమ్.

23. రక్షి పురుషేవా తదనుజ్ఞాతో వేళాయం ప్రవిశేత్.

24. అన్తరణ ప్రావరణ వేష్టితస్యవా ప్రవేశ నిర్వారే.

25. పుటాపుటైర్యోగైర్వానష్టచ్ఛాయా రూపః

26. తత్రాయం ప్రయోగో నకుల హృదయం, చోరక తుంబీ ఫలాని
సర్పాణి చాంతర్ధూమేన పచేత తేం జనేన
సమభాగే నోదకేన పేషయే దనేనాభ్యక్త నయనో నష్టచ్ఛాయా రూపశ్చరతి.

27. రాత్రి కౌముదీషు చ దీపికా సంబాధే సురం గయావా.

నాయిక ఎప్పుడైతే సంకేత స్థలానికి వస్తుందని అనిపిస్తే అప్పుడు నాయకుడు రహస్యంగా ముందుగానే ఆ సంకేత స్థలానికి వెళ్ళాలి. రక్షకభటుల సహాయంతో రాత్రివేళలో ఆమె సూచించిన ప్రదేశంలో ప్రవేశించాలి. అలా ప్రవేశించేటప్పుడు కంబళి, లేదా నూలుదుప్పటి, కప్పుకుని గుట్టుగా, ఎవరూ గుర్తించడానికి వీలులేకుండా వెళ్ళాలి. లేదా అదృశ్యయోగాలున్నాయి. అదృశ్యకరణి మొదలైనవి. అలాంటి యోగాలు ప్రయోగింపైనా వెళ్ళాలి. అదృశ్యయోగాలు చేపట్టినప్పుడు మనిషి నీడ కనిపించదు. అలా కనిపించకుండా ఉండడానికి ఔషధాలున్నాయి. అవి ఇవి:- కర్పూరం, తుంబీఫలం, సర్పాక్షి - ఈ మూటినీ అంతర్ధూమంతో వండి, ఆ అంజనంలో సమభాగం నీళ్ళు పోసి బాగా నూరాలి. ఆ కాటుక కళ్ళకు ధరిస్తే అతని రూపం ఎవరికీ కనిపించదు. (కౌటిల్యుని అర్థశాస్త్రంలో ఈ అదృశ్యకరణికి సంబంధించిన ప్రక్రియలు అనేకం ఉన్నాయి.)

ఇక పిండారపోసినట్లు వెన్నెల కాస్తున్నా, చుట్టూ దీపకాంతులు ప్రసరిస్తున్నా - అలాంటి వెలుతుర్లో వెళ్ళవలసివస్తే సొరంగమార్గాల గుండా వెళ్ళాలని చెప్పారు.

28. భవంతి చాత్రశ్లోకాః - ద్రవ్యాణామపి నిర్హారే యానకానాం ప్రవేశనే
ఆపానకోత్సవార్థేపి చేటి కానాం చ సంభ్రమే.

29. వ్యత్యాసే వేశ్మనాం చైవ రక్షిణాం చ వివర్యయే
ఉద్యాన యాత్రా గమనే యాత్రాతశ్చ ప్రవేశనే.

30. దీర్ఘకాలోదయాం యాత్రాం ప్రోషితే చాపి రాజని.

31. ప్రవేశనం భవేత్ప్రాయో యూనాం నిష్క్రమణం తథా, పరస్పరస్య కార్యాణిజ్ఞా
త్వాచాంతః పురాలయాః ఏకకార్యస్తతః కుర్యుః శేషాణా మపి భేదనమ్.

32. దూషయిత్వాతతో న్యోన్యమేక కార్యార్పణే స్థిరః
అభేద్యతాం గతస్సద్యః యథేష్టం ఫలమశ్నుతే:

అంతఃపురంలోకి వెళ్ళడానికీ, మరల బయటికి రావడానికీ ఇంకా కొన్ని ఉపాయాలు చెపుతున్నారిక్కడ. పెద్ద పెద్ద దూలాలు మొదలైన సామాన్లు తీసుకుని పోతుంటారు. అలాంటివి తీసుకుని పోయే సమయాల్లోను, బళ్ళు, పాలకీలు, మేనాళ్ళు పోయే సమయాల్లోను, పానోత్సవం మున్నగు ఉత్సవాలు, వేడుకలు

జరిగేటప్పుడు పరిచారికలు, చెలికత్తెలు అటు ఇటు హడావిడిగా తిరుగుతో ఉండే తరుణాలలోను, అంతఃపురంలో ఏవైనా మార్పులు, చేర్పులు జరిగే సమయాల్లోను, ఉద్యానయాత్రకు, వనవిహారాలకు వెళ్ళే వేళల్లోను, అలాగే ఏదైనా యాత్రనుండి వచ్చి తిరిగి కోటలో ప్రవేశించే సమయాల్లోను, కనిపెట్టి అంతఃపురంలో ప్రవేశించాలి. అలాగే ఎంతోకాలం యాత్రకు వెళ్ళి, రాజు రాణి విడిగా ఉన్నప్పుడు సాధారణంగా యువకులు అంతఃపురాల్లోకి ప్రవేశ నిష్క్రమణాలు సాగిస్తూ ఉంటారు. ఈ అంతఃపుర కాంతలు కొందరు ఒక సంఘంగా ఏర్పడి, ఒక యువతికి కావలసిన, కార్యం, అందరం కలిసి సాధించుదామని ఆ కార్యానికి పూనుకొంటారు. అప్పుడు ఈ ప్రేయసీ ప్రియులు, వారిలో వారికి భేదాభిప్రాయాలు పుట్టించి ఆ సంఘం తలపెట్టిన కార్యం కాకుండా చేయాలి. అప్పుడా సంఘంలో సభ్యురాండ్రు ఒకరి నొకరు తూలనాడుకుని, మరల సమైక్యమై, కార్యం సాధించాలని పట్టుదలతో తమ ఇష్టాన్ని నెరవేర్చుకోగలుగుతారు.

(శతాబ్దాలనాడు ఇలా అంతఃపుర కాంతలు ఒక కట్టుబాటుతో సంఘంగా ఏర్పడి ఐక్యతతో తమ అభీష్టాన్ని నెరవేర్చుకోడానికి ప్రయత్నించేవారంటే, ఈనాటి సంఘాలు యూనియన్లులాంటివి ఆనాడే ఉండేవని స్పష్టమవుతున్నది. సంఘంగా ఉంటే ఏపనైనా సాధించవచ్చునన్న సూత్రం శాశ్వతమైనదనీ, భారతీయ సంప్రదాయసిద్ధమైనదనీ చెప్పక చెప్పుతున్నది.)

*33. తత్ర రాజకులచారిణ్య ఏవలక్షణ్యాన్ పురుషానంతఃపురం ప్రవేశయంతి, నాతి సురక్షత్వా దాపకాంతికానాం.*

*34. క్షత్రియ సంజ్ఞకై రంతఃపుర రక్షిభిరే వార్థం సాధయంత్యా భీరకాణాం.*

*35. ప్రేష్యాభిస్సహ తద్వేషాన్నాగరక పుత్రాన్ప్రవేశ యంతివాత్స గుల్మకానాం.*

*36. స్వైరేవ పుత్రైరంతః పురకాణి కామచారైర్జన నీ వర్జముపయుంజ్యంతే వైదర్భకాణాం*

*37. తథా ప్రవేశిభిరేవ జ్ఞాతి సంబంధి ర్నాన్యైరుపయుజ్యంతే స్త్రై రాజకాణాం.*

*38. బ్రాహ్మణైర్మిత్రై ర్భృత్యైర్దాసచేటైశ్చ గౌడానాం*

*39. పరిస్పందాః కర్మకారాశ్చాంతః పురేష్వ నిషిద్ధా అన్యేపి తద్రూపాశ్చ సైంధవానాం*

*40. అర్థేన రక్షణముపగృహ్య సాహసికా స్సంహతాః ప్రవిశంతి హైమవతానాం.*

*41. పుష్పదాన నియోగాన్నగర బ్రాహ్మణా రాజవిదిత మంతఃపురాణి గచ్ఛంతి పటాంతరిత శ్చైషామాలాపః తేన ప్రసంగేన వ్యతికరో భవతి, వంగాంగ కళింగానాం.*

*42. సంహత్య నవదశేత్యేకైకం యువానం ప్రచ్ఛాదయంతి ప్రాచ్యానాం, ఇత్యేవం పరస్త్రియః ప్రకుర్వీత, ఇత్యాంతః పురికావృత్తమ్.*



# వివిధ దేశాల స్త్రీల కామక్రీడలు

వివిధ దేశాల్లో వేర్వేరు ఆచారాలు, అలవాట్లు ఉంటున్నాయి. అపరాంత దేశంలో రాజుల భవనాలలో రక్షణ ఏర్పాట్లు చాలా తక్కువ. అందువల్ల అక్కడ అంతఃపురకాంతలు, ఆడవేషాలు వేసుకున్న పురుషులను అదేపనిగా తమదగ్గరికి రప్పించుకుని వారితో సంభోగం జరుపుతూ ఉంటారు. అభీర దేశస్థులు, క్షత్రియజాతివారైన అంతఃపుర రక్షకుల చేతనే తమ కామవాంఛ తీర్చుకుంటూ ఉంటారు. అలాగే వాత్స, గుల్మ దేశంలో కాంతలు, స్త్రీ వేషాలు ధరించి ఉన్న నాగరక యువకులను దూతికల ద్వారా అంతఃపురంలోకి రప్పించుకుని వారితో క్రీడిస్తూ ఉంటారు. ఇక వైదర్భ దేశపు వనితలు, తమ కడుపున పుట్టిన కుమాళ్ళతో తప్ప, తక్కిన కుమాళ్ళ వరుసగల వారితో సహా అందిరతో రహస్యంగా కామక్రీడలు సాగిస్తూ ఉంటారు. ఆడవాళ్ళ రాజ్యాలున్నాయి. అక్కడ ఆడవాళ్ళు చనువుగా వచ్చిపోయే జ్ఞాతి జనంలోనే యథేచ్ఛగా సంభోగిస్తూ ఉంటారు. ఇతరులతో భోగించరు. గౌడదేశపు కమలాక్షులు బ్రాహ్మలు, స్నేహితులు, సేవకులు, దాసులు, చేటులు మొదలైన వారితో రహస్యంగా సంబంధం పెట్టుకుని, కామతృష్ణ తీర్చుకుంటారు. సైంధవ దేశపు సారసాక్షులు ద్వారపాలకులు, ప్రతీహారులు, కూలిపనివాళ్ళు మున్నగు అంతఃపుర ప్రవేశం గల అలగాజనంతో మోహం తీర్చుకుంటారు. ఇక హైమవత దేశపు స్త్రీలు రక్షకభటులను, కాపలావాళ్ళను ధనంతో వశం చేసుకుని, ధైర్య, సాహసాలతో వారివల్ల కామవాంఛలు తీర్చుకుంటారు. పోతే అంగ, వంగ, కళింగ దేశపు కాంతలు మరో రకమైన తమాషాచేస్తారు. అక్కడ నగర బ్రాహ్మణులు పూలు ఇచ్చే పనిమీద, రాజుల అనుజ్ఞప్రకారం యథేచ్ఛగా అంతఃపురంలో ప్రవేశిస్తారు. అప్పుడు తెరచాటున ఉన్న అంతఃపుర పడతులతో మాట్లాడతారు. ఆ ప్రసంగాల్లో సంగతులు తారుమారు అవుతూ ఉంటాయి. అంటే ఆ కబుర్లే కామకేళికి దారితీస్తాయి. ఆ దేశపు స్త్రీలు ఆ

విధంగా తమ కామవాంఛ తీర్చుకుంటూరు. ఇక ప్రాచ్యదేశపు భాషల విషయం ఉంది. అక్కడ రాజకాంతలు ఒక్కొక్కరు తొమ్మిది పదిమంది పురుషులను పెట్టుకుని వారితో కులుకుతూ ఉంటారట!

ఇదంతా పరస్త్రీల విషయంలో ప్రవర్తించే విషయం. అంతఃపురికా వృత్తం అంటే ఇదే!

*43 ఏభ్య ఏవచ కారణేభ్యః స్వదారాన్రక్షేత్*

ఇలాంటి ఉపాయాలతో పరభామలను పొందినట్లే, వారి స్త్రీలను కూడా ఇతర పురుషులు భోగిస్తూ ఉంటారన్న సత్యాన్ని తెలుసుకోవాలి. అంచాతనే పరస్త్రీ గమనం ఎంతమాత్రం పనికిరాదని పదేపదే చెప్పడం జరిగింది.

# పర పురుషుల నుండి భార్యను రక్షించుకునేది ఎలా?

ఇక పరపురుషుల నుండి తమ భార్యలను రక్షించుకోడం ఎలాగో చెపుతున్నారు. తన భార్య ఏ కారణంతో తన పట్ల విముఖురాలుగా ఉంటున్నదో మొదట తెలుసుకోవాలి. ఆ కారణాలను మొదట తొలగించుకోవాలి పురుషుడు. ఆమె హృదయాన్ని ఆకర్షించడం ఎంతైనా అవసరం. ఆ విధంగా ఆమె దృష్టిని పరపురుషుల నుండి తప్పించాలి. తల వాకిట్లో నిలుచుని ఉండడం, పరిచయ కారణాలు, దూతీ కర్మలు, ఈశ్వర కామితోపాయం, అంతఃపురికావృత్తం - ఇలాంటివాటి నుండి తమ భార్యలను పురుషులు తమ చరిత్రను చక్కదిద్దుకుని సుఖించవలసి ఉంటుంది. వారిని రక్షించుకోవలసి ఉంటుంది.

*44. కామోపధాశుద్ధాన్ రక్షిణోంతఃపురే స్థాపయే దిత్యాచార్యాః*

*45. తేహిభయేన చార్థేనచాన్యం ప్రయోజయేస్తస్మాత్కామభ*
*యార్థో పధాశుద్ధానితి గోణికాపుత్రః*

*46. అద్రోహో ధర్మస్తదతి భయాజ్జహ్యాదతో ధర్మ భయోపధా శుద్ధానితి వాత్స్యాయనః*

కామం విషయంలో పరీక్షలన్నింటికి తట్టుకుని పరిశుద్ధుడని నిర్ణయించబడిన వారిని మాత్రమే అంతఃపురాల్లో రమణుల రక్షణకోసం ఏర్పాటు చేయాలి - అని పూర్వపు ఆచార్యులు స్పష్టంగా చెప్పారు. అయితే వారు భయం వల్లనైతేనేమి, ధనాశవల్ల నైతేనేమి, ప్రయోగాలకు లోనై ఇతరులను అంతఃపురాలలోకి రానిస్తారు. అంచాత కామం విషయంలో ఎలాంటి కల్మషం లేనివారు, నిర్భయంగా ప్రవర్తించగలవారు, ఆశలేనివారు, ఎవరో బాగాపరీక్షించి, అలాంటి వారిని మాత్రమే అంతఃపుర పరిరక్షకులుగా నియమించాలని గోణికాపుత్రుల అభిప్రాయం. ద్రోహం తలపెట్టకుండా ఉండడం ఉత్తమధర్మం. కాని అలాంటి ధర్మాన్ని సయితం ఏదో భయంవల్ల విడిచిపెట్టవచ్చు. అంచాత ధర్మం, భయం, అర్థం, కామం మున్నగు విషయాల్లో బాగా పరీక్షించి నిగ్గుతేల్చి, అలాంటివారిని నియమించాలని వాత్స్యాయనులంటున్నారు.

47. పరవాక్యాభి దాయినీభిశ్చ గూఢకారాభి రాత్మదారానువద
ర్యాచ్చే) చా శౌచ పరిజ్ఞానార్థమితి బా(భవీయాః

48. దుష్టానాం యువతిషు సిద్ధత్వాన్నా కస్మాదదుష్ట దూషణ మాచరేదితి వాత్స్యాయనః

తన భార్య విషయమై పరీక్షకూడా రక్షణోపాయమేనని కొందరంటున్నారు. పలానా వ్యక్తి నీ యందు బద్ధానురాగుడై ఉన్నాడు. అతను నా (పాణాలు రక్షించమన్నాడు, అని దాసీదాని చేత చెప్పించి ఆమె మనస్సు ఎలాంటిదో పరీక్షించాలి. అలా పరీక్షించేటప్పుడు అనుకూలంగా ఆమె జవాబు చెపితే ఆమె గుణం మంచిది కాదని (పతికూలంగా జవాబు చెపితే గుణవంతురాలని తెలుసుకోవాలి. ఇది బా(భవీయుల అభి(పాయం. దుష్టులైన పురుషులు (స్త్రీల విషయమై సిద్ధులవుతారు కాబట్టి, ఏదో పురుషుడి దోషాన్నిన అనుసరించి (స్త్రీ బుద్ధి మంచిదికాదని తొందరపాటుతో నిర్ణయించగూడదు. (స్త్రీలలో సహజంగా దోషంలేకపోయినా, దోషాలని అనుకునే అవగుణాలు కొన్ని సహజంగానే ఉంటాయని వాత్స్యాయనులు అంటున్నారు.

49. *అతిగోష్ఠీ నిరంకుశత్వం, భర్తుః స్వైరతా, పురుషైః*
*సహ నియం(త్రణతా (పవాసేZవస్థానం,*
*విదేశీ నివాసః స్వవృత్త్యుపఘాతః స్వైరిణీ సంసర్గః*
*(పత్యురేర్ష్యాళుతా, చేతి (స్త్రీణాం వినాశకారణాని.*

అతిగా గోష్ఠులు జరపడం, నిరంకుశ వైఖరి, భర్త స్వేచ్ఛావిహారుడు కావడం, పురుషుడు (పవాసంలో ఉండడం, విదేశాలలో ఉండడం, స్వేచ్ఛగా విహరించే (స్త్రీలతో సంబంధం ఇలాంటివన్నీ కుల(స్త్రీలు చెడిపోవడానికి కొన్ని ముఖ్యకారణాలు.

50. *సయాతి ఛలనాం కశ్చిత్స్వ దారా(న్పతి శాస్త్రవిత్*

51. *పాక్షికత్వా(త్ప్రయోగాణాం అపాయానాంచ దర్శనాత్,*
*ధర్మార్థయోశ్చ వైలోమ్యాన్నాచరేత్పార దారికమ్.*

52. *తదేతద్దార గుప్త్యర్థం ఆరబ్ధం (శ్రేయసే నృణాం,*
*(పజానాం దూషణాయైవనివిజ్ఞేయో హ్యయం విధిః*

ఈ పారదారికాధికరణంలో చెప్పిన యోగాలను శా(స్త్ర దృష్టితో పరిశీలించి, శా(స్త్రజ్ఞానం అలవరచుకున్న (పతి ఒక్కడూ తన భార్యవిషయంలో అన్యాయం జరగకుండా మెలగగలుగుతున్నాడు. ఈ పరదార గమనాలనేవి (పాణంపోతూ ఉంటే అగలిక గత్యాపాక్షికంగా చెప్పడం వల్లనూ, (పమాదకరంగా కనిపిస్తూ ఉండడం వల్లనూ, ధర్మార్థాలకు ఎంతో దూరమైన విషయం కనుకనూ, పరభార్యలతో పొత్తు, ఎంతమా(త్రం పనికిరాదు. తమ తమ భార్యలను రక్షించుకోడానికై మానవుల (శ్రేయస్సు కోసం ఇందలి (పయోగాలు చెప్పబడినవే తప్ప, (పజలను దుర్మార్గులుగా, దోషయుక్తులుగా చేయడానికి కానేకాదు. ఈ విషయం (పతి ఒక్కరూ స్పష్టంగా తెలుసుకోవలసి ఉంది.

ఇతి వాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే పంచమేధికరణే
అంతఃపురికం, దారరక్షితం నామ షష్ఠోధ్యాయః

ఇది వాత్స్యాయన ముని విరచితమైన కామసూత్రాల్లో పారదారికం అనే అయిదో అధికరణంలో అంతఃపురికం, దార రక్షితం అనే ఆరో అధ్యాయం.



# వాత్స్యాయన కామసూత్రాలు

## వైశికాధికరణం - 6

## ప్రథమాధ్యాయం

## సహాయ గమ్యాగమ్య గమన కారణ చింత

1. *వేశ్యానాం పురుషాధిగమే రతిర్వృత్తిశ్చ సర్గాత్.*
2. *రతితః ప్రవర్తనం స్వాభావికం, కృత్రిమమర్థార్థం.*
3. *తదపి స్వాభావికవద్రూపయేత్.*
4. *కామపరాసు హి పుంసాం విశ్వాసయోగాత్.*
5. *అలుబ్ధతాం చ ఖ్యాపయేత్తస్యనిదర్శనార్థం.*
6. *న చానుపాయేనార్థాన్ సాధయేదాయతిసంరక్షణార్థం.*
7. *నిత్యమలంకారయోగినీ, రాజమార్గావలోకినీ దృశ్యమానా న చాతి వివృతా తిష్ఠేత్.*

ఇంతకు ముందు అధికరణంలో కన్య, పునర్భువు, పరదార- అనే ముగ్గురు నాయికలతో సమాగమం సాగించే విధానం గురించి చెప్పారు. ఇక నాలుగో రకం నాయిక ఉంది. ఆమె వేశ్య. ఆమెతో సమాగమం చేసే విధానం గురించి చెప్పేదే ఈ వైశాధికరణం. ఇది కామ సూత్రాల్లో ఆరో ప్రకరణం.

వేశ్యతో పురుషుడు సమాగమం జరిపేటప్పుడు, రతిఫలం సమానమే. అయినా ప్రయోగించేది వేశ్య. అంచేత ఈ విషయంలో అధికారం వేశ్యదే.

పురుషుడితో సంభోగించడం వల్ల వేశ్యకు స్ఖలన రూపకమైన రతి సౌఖ్యం, ధనం - రెండూ లభిస్తున్నాయి. కాబట్టి ఆమె జీవనోపాధికి కూడా మార్గం దొరికిందన్న మాట! ఇంకా ఏమిటీ అంటే పురుష సంపర్కంతో వేశ్యకు అర్థ, కామాలు - రెండూ ప్రాప్తిస్తున్నాయి. ఇక పురుషుడి కంటూరా? ఒక్క కామం మాత్రం లభిస్తున్నది. ధనం పోతున్నది. వేశ్య తన రతి సౌఖ్యం కోసం పురుషుడితో భోగిస్తే లోకంలోలాగే అది స్వాభావికమే అవుతుంది. ధనం కోసం సంగమిస్తే కృత్రిమం అవుతుంది. కాబట్టి అది కూడా స్వాభావికంగానే పరిగణించాలి వేశ్య. కామవాంచ గల స్త్రీల పట్ల పురుషులకు విశ్వాసం ఎక్కువ. అంచేత పురుషుడు ఆమెను విడిచిపెట్టలేదు. కేవలం ధనం పైనే ఎక్కువ ఆసక్తి చూపితే అంత ఇదిగా ఉండదు. కామాసక్తిసే

ఎక్కువ ప్రదర్శిస్తూ ధనంపై అంతగా ప్రీతి లేనట్లు నటించాలి. ఇలా చేయడం వల్ల పురుషుడికి అనురాగం అధికమై, ధనం తెచ్చి ఇస్తాడు. భవిష్యత్తులో తన రక్షణకోసం ఉపాయంతో ధనం సేకరించుకోవాలి. ఆ ఉపాయాలే ఇక్కడ చెపుతున్నారు.

వేశ్య ఎల్లప్పుడూ తన సౌందర్యాన్ని కాపాడుకుంటూ ఉండాలి. దేహాన్ని చక్కగా అలంకరించుకుని రాజవీధివంక చూస్తూ, త్రోవన వచ్చేపోయేవారు తనను చూసే సమయాల్లో కనిపించీ కనిపించనట్లు నిలుచుని ఉండాలి. ఇది వేశ్య ధర్మం.

8. *యైర్నాయకమావర్జయే ద్న్యాభ్యశ్చ అవచ్ఛింద్యా, దాత్మనశ్చానర్థం ప్రతికుర్యా, దర్థంచ సాధయేన్న చ గమ్యైః పరిభూయేత, తాన్సహాయాన్కుర్యాత్.*

9. *తేల్వా రక్షక పురుషాః ధర్మాధికరణస్థాః దైవజ్ఞాః విక్రాన్తాః శూరాః సమానవిద్యాః కళాగ్రాహిణః పీఠమర్ద, విట, విదూషక, మాలాకార, గాంధిక, శౌండిక, రజక, నాపిత, భిక్షుకాస్తే చ తే కార్య యోగాత్.*

నాయకుణ్ణి తమకు అనుకూలుడుగా ఉండేలా తయారుచేయాలి. అతని మనస్సు మరే ఇతర స్త్రీలపై మళ్ళకుండా చేయగలగాలి. తనకు సంభవించే ఆపదలనూ, అనర్థాలనూ అతను తప్పించగలిగి ఉండాలి. అతను ధనం రాబట్ట గలిగి ఉండాలి. దుర్మార్గులైన పురుషులనుండి పరాభవం సంభవించకుండా అతను కాపాడగలిగి ఉండాలి. - ఇలాంటి వాటిల్లో సామర్థ్యం కలవారిని వేశ్య తన సహాయార్థం సహాయకులుగా నియమించుకోవాలి. అంతేకాకుండా రక్షక భటులు, ధర్మాధికారులు, శాస్త్రవేత్తలు, నగర పాలకులు, శూరులు, తనతో సమానంగా విద్య నేర్చినవారు, కళలలో ఆరితేరినవారు, పీఠమర్దులు, విటులు, చేటులు, విదూషకులు, మాలాకారులు, గ్రంథకారులు, మావటివాండ్రు, రజకులు, మంగళ్ళు, బిచ్చగత్తెలు, - మున్నగువారు వేశ్యకు ఆయా పనులలో సహాయకులుగా ఉండడానికి అర్హులు.

10. *కేవలార్థన్తు మీగమ్యాః స్వతంత్రః, పూర్వేవయసి వర్తనానః విత్తవాన్, అపరోక్షవృత్తిః అధికరణవాన్, అకృచ్ఛ్రాధిగతవిత్తః సంఘర్షవాక్, సంతతాయః, సుభగాభిమానీ, శ్లాఘనకః, పండకశ్చ, పుంశబ్దార్థీ, సమాన స్పర్ధీ, స్వభావతస్త్యాగీ, రాజని మహామాత్రే వాసిద్ధః దైవప్రమాణః విత్తావమానీ, గురూణాం శాసనాతిగః సజాతీనాం లక్ష్యభూతః, సవిత్తః ఏకపుత్రః లింగీ, ప్రచ్ఛన్న కామః శూరః, వైద్య శ్చేతి.*

కేవలం డబ్బుకోసం వేశ్య సంభోగించదగిన పురుషులు ఎవరో ఇక్కడ చెపుతున్నారు - మాంచి యౌవనంలో ఫెళఫెళలాడుతూ ఉన్న వాడు, సర్వతంత్ర స్వతంత్రుడు, బాగా ధనం ఉన్నవాడు, స్వంత ఊళ్ళోనే ఎల్లప్పుడూ ఉండేవాడు. కోశాధికారి, కష్టపడకుండా సులువుగా, సుఖంగా ఎక్కువ ధనం సంపాదించగలవాడు, ఇతరులకన్నా ఎక్కువ ధనం ముట్టచెపుతానని చెప్పి వచ్చినవాడు, ఎల్లప్పుడూ తరగని ఆదాయం వచ్చేవాడు, అందగాణ్ణి అని విర్రవీగేవాడు, ఇతరుల పొగడ్తలు కావాలని కోరేవాడు, నపుంసకుడు, తనను మగవాడని లోకం చెప్పుకోవాలని

అనుకునేవాడు, పౌరుషం కోసం తనతో సమానులైనవారితో పోరాడేవాడు, సహజంగానే గొప్పత్యాగి, రాజులకు, మంత్రులకు స్నేహితుడు, దైవభక్తి కలవాడు, ధనం అంటే లెక్క చెయ్యనివాడు, గురువుల ఆజ్ఞను అతిక్రమించేవాడు, ఒకజాతి జనానికి ఆదర్శప్రాయుడైనవాడు, ధనవంతుడు, ఒకేఒక కుమారుడు కలవాడు, సన్యాసి, జారుడు, శూరుడు, వైద్యుడు - వీరందరూ వేశ్యలు పొందదగినవారు.

*11. ప్రీతియశో౽ర్థాన్తు గుణతో౽ధిగమ్యాః*

*12. మహాకులీనః విద్వాన్, సర్వసమయజ్ఞః కవిః ఆఖ్యానకుశలః, వాగ్మీ, ప్రగల్భః, వివిధశిల్పజ్ఞః, వృద్ధదర్శీ, స్థూలలక్షః మహోత్సాహః దృఢభక్తిః, అనసూయకః, త్యాగీ, మిత్రవత్సలః ఘటా గోష్ఠీః, ప్రేక్షణకసమాజ సమస్యా క్రీడనకుశలః, నీరు జః అవ్యంగశరీరః, ప్రాణవాన్, అమద్యపః వృషః, మైత్రః, స్త్రీణాం ప్రణేతా, లాలయ తా చ, న చాసాం వశగః, స్వతంత్రవృత్తిః అనిష్ఠురః, అనీ ర్ష్యాళుః అన వేశంకీ చేతి నాయకగుణా.*

ప్రేమను, కీర్తిని వాంఛించే పురుషులు ఎంతో గుణవంతులుగా ఉంటారు. అలాంటి పురుషులు ఎవరో గుణాలనుబట్టి గుర్తించాలి. అలాంటి పురుషుల ముఖ్య గుణాలు ఏమిటో ఇక్కడ చెపుతున్నారు - గొప్పకులీన కుటుంబంలో పుట్టినవాడు, విద్వాంసుడు, అన్ని విషయాలూ అనుభవపూర్వకంగా ఎరిగినవాడు, మంచి కవిత్వం చెప్పగలవాడు, కమ్మని కథలు మనోరంజకంగా చెప్పగలవాడు, ఏవిషయాన్ని గురించి అయినా ఆహ్లాదకరంగా మాట్లాడగలవాడు, మాటలోను,చేతల్లోను గడసరి, సమస్త శిల్పవిధానాలు తెలిసినవాడు,జ్ఞానులనుండి, వయోవృద్ధుల నుండి అనుభవాలు గడించినవాడు, అందరియందూ సమదృష్టి గలవాడు, ఎంత గానో ఉత్సాహం గలవాడు, ఎడతెగని భక్తి కలవాడు, అసూయలేనివాడు, గొప్ప త్యాగబుద్ధి గలవాడు, మిత్రులపట్ల అమిత వాత్సల్యం కలవాడు, సభలు, సమావేశాలు జరపడంలో నేర్పరి, రోగాలు లేనివాడు, అవయవలోపం లేనివాడు, బలాఢ్యుడు, మద్యపానం చేయనివాడు, దయ - దాక్షిణ్యం గలవాడు, స్త్రీలకు నీతులు, బుద్ధులు చెప్పేవాడు, రతిక్రీడలు సలపడంలో నేర్పరి, స్త్రీలను గౌరవించేవాడు, ఆడవారికి లొంగనివాడు, స్వతంత్రంగా జీవించేవాడు, పరులకు బాధ కలిగించనివాడు, ఈర్ష్యలేనివాడు, సందేహ స్వభావం లేనివాడు - మున్నగు వారందరూ వేశ్యలు పొందదగినవారు.

*13. రూపయౌవన లక్షణ మాధుర్యయోగినీ, గుణేష్వనురక్తా నతథా౽ర్థేషు,*
*ప్రీతి సంయోగశీలా, స్థిరమతిః ఏక జాతీయా విశేషార్థినీ,*
*నిత్యమకదర్య వృత్తిః గోష్ఠీ కళాప్రియా చేతి నాయికాగుణాః.*

పై సూత్రంలో నాయకుడి గుణాలు చెప్పి, ఇక్కడ నాయిక గుణాలు చెపుతున్నారు. నాయిక ఎప్పుడూ మంచి శరీర శోభ కలిగి ఉండాలి. సౌభాగ్యాన్ని ప్రకటించే ముఖవర్చస్సు కలిగి ఉండాలి. మిసమిసలాడే యౌవనంలో ఉండాలి. మాటల్లో మాధుర్యం తొణికిసలాడాలి. ధనం కన్నా గుణాన్నే అధికంగా ప్రేమించేదిగా ఉండాలి. సంభోగంలో ప్రేమ చూపేదిగా ఉండాలి. చలించని బుద్ధి కలదిగాను,

ఒకే జాలికి చెందినదిగాను, కామ విశేషాలు తెలుసుకునేదిగాను, ఎల్లప్పుడు నిష్కపటమైన ప్రవర్తన కలదిగాను, గోష్ఠులన్నా, కళలన్నా ఎక్కువ మక్కువ కలదిగాను ఉండాలి. ఇవన్నీ నాయికకు ముఖ్యంగా ఉండవలసిన గుణాలు.

14. *బుద్ధి శీలాచారః ఆర్జవం, కృతజ్ఞతా, దీర్ఘదూర దర్శిత్వం, అవిసంవాదితా, దేశకాలజ్ఞతా నాగరకతా, దైన్యాతాహాస పైశున్య పరివాదక్రోధలోభ స్తంభచాపల వర్జనం స్మితపూర్వాభిభాషితా, కామసూత్రే కౌశలం, తదంగ విద్యాను చేతి సాధారణ గుణాః*

15. *గుణ విపర్యయే దోషః.*

నాయికలకు సాధారణ గుణాలు కొన్ని ఉన్నాయి. అవి సద్బుద్ధి, సచ్ఛీలం, సదాచారం, సత్ప్రవర్తన, కృతజ్ఞత, దీర్ఘాలోచన చేయడం, కలహ స్వభావం లేకుండా ఉండడం, దేశకాలపరిస్థితులను గమనించి నడుచుకోడం, నాజూగ్గా ఉండడం, దైన్యం లేకుండా ఉండడం, ఎక్కువగా నవ్వకుండా ఉండడం స్నేహితుల మధ్య భేదం పుట్టినా విడదీయక పోవడం, పరాయి వాళ్ళపై చాడీలు చెప్పక పోవడం, ఎప్పుడు కోపం లేకుండా ఉంచడం, అశ. నిశ్చేష్టత చపలత్వం లేకపోవడం - ఈ ఎనిమిది గుణాలు ఉండడం, నవ్వుతూ మాట్లాడడం, కామకేళీ విలాసాదుల్లో నేర్పు, సంగీతం మున్నగు అంగవిద్యల్లో కౌశలం - ఇవీ.

ఈ గుణాలు తారుమారైతే దోషాలుగా పరిగణింపబడతాయి.

16. *క్షయీ రోగీ, కృమిశకృత్ వాయసాస్యః ప్రియ కళత్రః పరుషవాక్, కదర్యః. నిర్ఘృణః గురుజన పరిత్యక్తః స్తేనః, దంభశీలః, మూలకర్మణి ప్రసక్తః. మానావమానయోరణపేక్షీ, ద్వేష్యైరప్యర్థహార్యః అతిలజ్జ ఇత్యగమ్యాః.*



# వేశ్య పొందదగని నాయకులు

ఇక వేశ్యపొందదగని నాయకులను గురించి చెపుతున్నారు. క్షయ వ్యాధి కలవాడు, ఎప్పుడూ దీర్ఘరోగాలతో బాధపడేవాడు, (కుష్ఠురోగి), వంటిమీద పుండ్లరోగం కలవాడు, పాడుకంపు కొట్టే నోరు కలవాడు, మంచిచెడ్డలు లేకుండా కనిపించిన ఆడదానినల్లా సంభోగించేవాడు, ప్రియమైన భార్య కలవాడు, కఠినంగా మాట్లాడేవాడు, నీచప్రవృత్తి కలవాడు, నీచతత్వం కలవాడు, దయ - దాక్షిణ్యం లేనివాడు, గురువులు పరిత్యజించగా భ్రష్టుడై తిరిగేవాడు, దొంగ, కపటం కలవాడు, దూతికల ద్వారా స్త్రీలను వశం చేసుకునేవాడు, మానాభిమానాలు సెప్పు నమానంగా చూచేవాడు, ధనానికి ఆశపడి శత్రుపక్షంలోనైనా చేరేవాడు, అమితంగా సిగ్గుపడేవాడు - ఇలాంటి వారిని వేశ్యలు పొందదగిన వారుకారు.

*17. రాగః, భయం, అర్ధః, నయుర్షః, వైరనిర్యాతనం జిజ్ఞాసాపక్షః, ఖేదః, ధర్మః, యశః, అనుకంపా,సుహృద్వాక్యం, హ్రీః, ప్రియసాదృశ్యం, ధన్యతా, రాగాపనయః. సాజాత్యం, సాహవేశ్యం, సాతత్సం, ఆయతిశ్చ, గమన కారణాని భవంతీత్యాచార్యాః.*

*18. అర్థోzనర్థప్రతీఘాతః, ప్రీతిశ్చేతి వాత్స్యాయనః.*

*19. అర్థంతు ప్రీత్యా న బాధేతాస్య ప్రాధాన్యాత్.*

*20. భయాదిషు తు గురులాఘవం పరీక్ష్యం, ఇతిసహాయ గమ్యాగమ్య గమనంకారణచింతా.*

# పురుషులతో వేశ్య ఎందుకు సంగమిస్తుంది?

వేశ్యలు పురుషులతో ఎందుకు నంగమిస్తారో, ఆకారణాలు చెపుతున్నారు. ఒక్కొక్కప్పుడు వేశ్యకు ఒక పురుషుడి మీద హఠాత్తుగా అనురాగం పుట్టుకొస్తుంది. కొడతాడేమో, చంపుతాడేమోనని భీతి జనిస్తుంది. పట్టుదలలు, పందాలు వస్తాయి. ఒకరితో నంగమించడం ద్వారా శత్రువుపై పగ తీర్చుకునే అవకాశం ఏర్పడుతుంది. శత్రువు ప్రజ్ఞ ఎలాంటిదో చూద్దామని పౌరుషం వస్తుంది. ఏదైనా గొప్ప దుఃఖం నంప్రాప్తిస్తుంది. ధర్మం ఆలోచించవలసి వస్తుంది. అతనితో పోతే కీర్తి వస్తుంది. అతనిపై దయ కలుగుతుంది. ప్రాణ స్నేహితుడో, స్నేహితురాలో మాట మన్నించవలసి వస్తుంది. అమితమైన సిగ్గు ఏర్పడుతుంది. తన ప్రియుడికి, లేదా ఇష్టుడికి నమానమైన వాడు అన్న అభిమానం అతనితో పోతే జన్మ ధన్యమవుతుందని, కామోద్రేకాన్ని అణుచుకోడానికి, నమాన జాతీయుడని, పొరుగింటి వాడు కదా అని మొగమాటపడి, బాల్య స్నేహితుడని, అతనితో నంభోగిస్తే గొప్ప ప్రభావం కలుగుతుందని, - ఈ కారణాల వల్ల వేశ్యలు సాధారణంగా పొందతగని వాళ్ళతో నయితం పొత్తు పెట్టుకుని నంభోగిస్తూ ఉంటారు. ఇది పూర్వపు ఆచార్యులు చెప్పిన మాట! అయితే వేశ్యలు ధనం కోనం, ఆపదకు ప్రతిక్రియ చేయడం కోనం, కేవలం ప్రేమ కోనం, పరపురుష గమనం చేస్తూంటారని వాత్స్యాయను లంటున్నారు.

వేశ్యకు ధనమే ప్రధానం కాబట్టి దానికి ప్రేమ అడ్డం కారాదు. భయాదులు ప్రాప్తించినపుడు హెచ్చు తక్కువలు ఆలోచించి పురుషుడితో సంగమించాలి. ఇలా సహాయకులు, గమ్యులు, అగమ్యులు అనే వారిని గురించి వేశ్యల విషయంలో చెప్పారు శాస్త్రకారులు. గమన కారణ చింతను గురించి కూడా చెప్పడం జరిగింది.

21. *ఉపమంత్రితాఽపిగమ్యేన సహసాన ప్రతిజానీయాత్ పురుషాణాం సులభావమానిత్వాత్.*

22. *భావజిజ్ఞాకసార్థం చ పరిచారకం ముఖాన్ సంవాహకగాయన*
*వైహాసిక పురుషాన్గమ్యేతద్భక్తాన్వా ప్రణిదధ్యాత్తదభావే పీఠమర్దాదీన్.*

23. *తేభ్యో నాయకస్య శౌచాశౌచం రాగాపరాగౌ సక్తాసక్తతాం, దానాదానే చ విద్యాత్.*

24. సంభావితేన చ సహ విటపురోగాం ప్రీతి యోజయేత్.

పురుషుడు (నాయకుడు) సంగమించడానికి పిలిచినా వేశ్య (నాయిక) తొందరపడి వెంటనే అందుకు అంగీకరించకూడదు. స్త్రీ సులువుగా లొంగిపోతే, పురుషుడు ఆమెను చులకనగా చూస్తాడు. అవమానిస్తాడు. అంచాత అతని మనోభావాన్ని తెలుసుకునేందుకు మొదట తన పరిచారికులను లేదా గాయకులను లేదా విదూషకులు మున్నగువారిని పంపాలి వేశ్య. వారి ద్వారా నాయకుడు ఎలాంటివాడో, శుచిగలవాడా కాదా? ప్రేమ కలవాడా కాదా? నిజంగా ఆసక్తి ఉన్నవాడా, కాదా? దానశీలుడవునా కాదా? - మొదలైన విషయాలన్నీ విచారించాలి. ఈ విషయాలన్నీ తెలుసుకున్న తరువాత ఆ విటుల ద్వారా ప్రేమ వ్యవహారం నడపాలి.

25. *లావక కుక్కుట మేష యుద్ధ శుకశారికా ప్రలాపన ప్రేక్షణక కళా వ్యపదేశేన.*
*పీఠమర్దో నాయకం తస్యా ఉదవసితమానయేత్ తాం వా తస్య.*

26. *ఆగతస్య ప్రీతి కౌతుక జననం కించిద్ద్రవ్యజాతం స్వయమిద.*
*మసాధారణోపభోగ్య మితి ప్రీతిదాయందద్యాత్.*

27. యత్ర చరమతే తయా గోష్ఠ్యా ఏనముపచారైశ్చరంజయేత్.

పీఠమర్దుడు చేయవలసిన కార్యాలు కొన్ని ఉన్నాయి. లావక పిట్టలు, కోళ్ళు, గొఱ్ఱెపొటేళ్ళు మున్నగు వాటి పందాలూ, చిలుకలు, గోరువంకలు, మొదలైన వాటిని పలకరించడం, మాట్లాడించడం, రమణీయమైన దృశ్యాలను చూడడం - ఇత్యాది వినోదక్రీడల ద్వారా నాయకుణ్ణి ఆనందపరిచి అతన్ని నాయిక ఉన్న ప్రదేశానికి తీసుకుని రావాలి పీఠమర్దుడు. లేదా ఆమెనైనా అతను ఉన్నచోటుకు చేర్చాలి. అలా నాయకుడు వచ్చిన పిమ్మట, అతనిలో ప్రేమ, కుతూహలం అధికం కావడానికి గాను ఇది చూడండి ఒకమాట! సాధారణంగా ఎక్కడా లభ్యంకాని వస్తువు ఇది! అని స్వయంగా, ప్రేమ పూర్వకంగా అతనికి వింతవింత వస్తువులు ఇవ్వాలి. అప్పుడతని బుద్ధి ఏ వస్తువుపై లగ్నం అవుతుందో ఆవస్తువు ఇచ్చి అతని మనస్సుకు నచ్చిన విషయంపై గోష్ఠిసాగిస్తూ ఉపచారాలతో అతనితో సంగమించి రంజింపజెయ్యాలి.

28. *గతే చ న పరిహాన ప్రలాపాం సోపాయనాల పరిచారికా మభీక్ష్ణం ప్రేషయేత్, సపీఠమర్దాయాశ్చ కారణాపదేశేన స్వయంగమనమ్ ఇతి గమ్యోపా వర్తనమ్.*

నాయకుడు వెళ్ళిపోయిన తరువాత కూడా హాస్యంగాను, చమత్కారంగాను మాట్లాడే తన పరిచారిక చేతికి ఏవో కానుకలు ఇచ్చి "అతనికి గుర్తుగా ఇచ్చి రమ్మని చెప్పి పంపాలి. పీఠమర్దునితో కూడా ఏదో ఒకనెపంపై స్వయంగా అతని చెంతకు చేరాలి. దీన్నే గమ్యోపావర్తనం అంటారు.

29. *భవంతి చాత్రశ్లోకాః - తాంబూలాని స్రజశ్చైవ సంస్కృతం చానులేపనం, ఆగతస్యాహరేత్ప్రీత్యా కలాగోష్ఠీశ్చ యోజయేత్.*

30. ద్రవ్యాణి ప్రణయేదద్యాత్ కుర్యాచ్చ పరివర్తనం సంప్రయోగస్య చా కూతం నిజేనైవ ప్రయోజయేత్.

31. ప్రీతిదాయైరుపన్యాసైః ఉపచారైశ్చ కేవలైః, గమ్యేన సహ సంసృష్టా రంజయేత్తంతతః పరం.

సంస్కార యుతమైన తాంబూలం, పూలమాలలు, గంధాదులు, భోగించడానికై వచ్చిన వాడికి ప్రీతిపూర్వకంగా అందించాలి. ఆయా కళలను గురించి ప్రసంగించాలి. ప్రేమ సూచకంగా రకరకాల రమ్యమైన వస్తువులు ఇవ్వాలి. పిమ్మట ఒకరి వస్తువులు ఒకరు మార్చుకోవాలి. సంభోగం సంగతి నాయకుడికి సూచనప్రాయంగా తెలియజెయ్యాలి. ఇంకా ప్రేమను సూచించే మాటలు, కబుర్లు, ఉపచారాలు మొదలైన వాటితో నాయకుణ్ణి ఆనందపరచాలి. అటు తరువాత రతి క్రీడలో అతన్ని రంజింపజెయ్యాలి.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే వైశికే షష్ఠేZధికరణే సహాయగమ్యాగమ్యగమన కారణచింతా గమ్యోపావర్తనం నామ ప్రథమో Zధ్యాయః*

**ఇది శ్రీ వాత్స్యాయనముని విరచిత కామసూత్రాల్లో వైశికాధికరణం అనే ఆరో అధికరణంలో సహాయ గమ్యాగమ్య గమనకారణచింతితం, గమ్యోపావర్తనం అనే మొదటి అధ్యాయం.**



# ద్వితీయాధ్యాయం

## కాంతానువృత్తం



*1. సంయుక్తా నాయకేన తద్రంజనార్థం ఏకచారిణీ వృత్తమనుతిష్ఠేత్.*

*2. సంజయేన్న తు సజేత్ సక్తవచ్ఛ చేష్టేతేతి సంక్షేపోక్తిః*

*3. మాతరి చ క్రూరశీలాయం అర్థపరాయాం చ ఆయుత్తా స్యాత్ తదభావే మాతృకాయం.*

*4. సా తు గమ్యేన నాతిప్రీయేత ప్రసహ్య చ దుహిత రమానయేత్.*

*5. తత్ర తు నాయికాయాః సంతతమరతిర్నిర్వేదో వ్రీడా భయం చ న త్వేవ శాసనాతి వృత్తిః*

*6. వ్యాధిం చ కృతాకమేకమనిమిత్త మజుగుప్సిత మచక్షుర్గ్రాహ్య మనిత్యం ఖ్యాపయేత్.*

*7. సతి కారణే తదపదేశం చ నాయకానభిగమనమ్*

*8. నిర్మాల్యస్య తు నాయికా చేటికాం ప్రేషయే త్తాంబూలస్య చ.*

**పురుషుడితో** సంభోగించి అతన్ని రంజింపజేయడానికి వేశ్య ఏకచారిణీ వృత్తాని అనుసరించాలి. ఆమె ఏకచారిణిగా వుంటే పురుషుదుకూడా భర్తలాంటి వాడే అవుతాడు. కాబట్టి కాంతనువృత్తం అయినా అనుష్ఠించాలి. దాన్ని గురించే ఇక్కడ చెపుతున్నారు.-

కాంతానువృత్తం అనేది రెండు విధాలు: ఒకటి సంక్షేపం, రెండు విస్తరం. సంక్షేపం గురించి చెపుతున్నారిక్కడ. వేశ్య ఎప్పుడూ కూడా ఆసక్తురాలుగా కనిపించాలే తప్ప సక్తురాలు కాకూడదు. సక్తురాలుగా ఉన్నట్లు నటించాలికాని

నిజంగా సక్తురాలు కారాదు. తన కన్నతల్లి స్వాధీనంలోనో లేక పెంపుడుతల్లి స్వాధీనంలోనో వున్నట్లు నటించాలి. ఆ కన్న తల్లి లేదా పెంపుడుతల్లి క్రూరురాలు, దురాశాపరురాలు అయినట్లు భ్రాంతి కలిగించాలి చూచేవారికి. ఆ తల్లి లేదా పెంపుడుతల్లి తన కుమార్తె, పురుషుడియందు సక్తురాలు కాకుండా చూచుకోవాలి. ఒకవేళ ఏ పురుషుడియందైనా సక్తురాలతే, ఆమెను వెంటనే అతని నుండి విడిపించాలి. అలాంటి సందర్భాల్లో వేశ్య అలా రావడం తనకు ఏ మాత్రం ఇష్టం లేనట్లు, విచారం, సిగ్గు, భయం ముంచుకొస్తున్నట్లు నటిస్తూ తల్లి ఆజ్ఞకు ఎదురుచెప్పలేనట్లు వ్యక్తం చేయాలి. అకారణంగానే తనకేదో కంటికి కనిపించనిదీ, అసహ్యం అనిపించేదీ అయిన రోగం పట్టుకున్నట్లు తెలియజెయ్యాలి. ఏదో నెపం పైన పురుషుణ్ణి సమీపించకుండా వుండాలి. వేరే పురుషులతో సంబంధం పెట్టుకోడానికి ప్రయత్నించాలి. అయితే, ఆ పురుషుల అనురాగానికి దూరం కాకుండా వారు పెట్టుకున్న పూలు, పూసుకున్న గంధం వగైరాలు తాను స్వీకరించాలి. అయితే ఏదో కారణంపై వారి దరిచేరకుండా వుంటూ వారికి ఆ విషయం తెలిసేలా ప్రవర్తించాలి. వారి తాంబూలాది ద్రవ్యాలను అందుకోడానికై తన చేటికను పంపించాలి.

9. *వ్యవాయే తదుపచారేషు విస్మయః చతుష్షష్ట్యాం*
*శిష్యత్వం, తదుపదిష్టానాం చ యోగానాం ఆలీప్స్యే*
*నానుయోగః తత్సాత్మ్యద్రహసి వృత్తిః మనో రథానామాఖ్యానం*
*గుహ్యానాం వైకృత ప్రచ్ఛాదనం, శయనే పరావృత్తస్యాను పేక్షణ*
*మానులోమ్యం గుహ్యాన్పర్శనే, సుప్తస్య చుంబనం, ఆలింగనం చ.*

ఇక నాయకుడితో వేశ్య ఏకాంత సమయంలో ఎలా ప్రవర్తించాలో చెపుతున్నారు - ప్రత్యేకంగా నడుచుకోవలసిన పద్ధతి ఇది -

## వేశ్య ఎలా నడచుకోవాలి?

రతి సాగించే సమయంలోనూ, అతనికి ఉపచారాలు చేసే తరుణంలోనూ మిక్కిలి ఆశ్చర్యాన్ని ప్రదర్శించాలి. చతుష్షష్టి కళల్లో పురుషుడి చాతుర్యం ఎలాంటిదో గమనించి, అతనికి శిష్యరికం చేస్తున్నట్లు అభినయించాలి. అతను బోధించే యోగాలు తాను అనుసరించాలి. అతనికి ఎలా వుంటే ఇష్టమో అలాగే రహస్య సమయాల్లో ప్రవర్తించాలి. అంటే అతనికి ఇష్టమైన రీతుల్లో సంభోగించాలన్న మాట! అలాగే వేశ్య కూడా తనకు వివిధ రీతుల్లో, భంగిమల్లో రతి సలపడం ఇష్టమని అతనికి చెప్పాలి. బొడ్డు, చంకలు, గజ్జలు మున్నగు ప్రదేశాలను వికారంగా అగుపించకుండా గోప్యంగా ఉంచాలి. శయ్యపై అతను అటువైపు తిరిగి పడుకుంటే, తాను భరించలేనట్లు, అతన్ని తనవైపు మళ్ళించుకోవాలి.

అతను తన మదన మందిరాన్ని తాకవలెనని కోరితే, తాను అడ్డుపెట్టకూడదు. స్వేచ్ఛగా అతన్ని అక్కడ స్పృశించనిచ్చి, అతనికి ఉత్సాహం, ఉద్రేకం కలిగించాలి. అతను నిద్రపోతూ ఉంటే అతన్ని ముద్దాడాలి. ఆలింగనం చేసుకోవాలి.

10. ప్రేక్షణమన్యమనస్కాన్య రాజమార్గే చ ప్రాసాదస్థాయాః తత్ర విదాతాయా క్రీడా శాఠ్యనాశః త ద్వేష్యే ద్వేష్యతా, తత్ప్రియే ప్రియతా తద్రమ్యే రతిః తమను హర్షశోకే, స్త్రీషుజిజ్ఞాసా, కోపశ్చాదీర్ఘః, స్వకృతేష్వపి నఖదశన చిహ్నేషు అన్యాశంకా.

తను సంభోగించదలచిన పురుషుడు పరధ్యాన్నంగా రాజవీధిలో వున్నప్పుడు, తాను మేడపైనుంచి చూచి కనిపెట్టాలి వేశ్య. అలా ఆమె చూస్తుండగా అతను గుర్తుపడితే, అప్పుడామె సిగ్గును అభినయించాలి. దీన్నే శాఠ్యనాశనం అంటారు. పురుషుడి విరోధి ఎవరైన వుంటే, అతన్ని తాను కూడా విరోధిగానే పరిగణించాలి. అతని స్నేహితుణ్ణే తన స్నేహితుడుగా భావించాలి. అతను ఏదైనా వస్తువు అందంగా వున్నదని అంటే తానుకూడా అలాగే అందంగా వున్నదని అనాలి. సంతోషం కాని, దుఃఖం కాని అతనికి ఎలావుంటే తనకూ అలాగే వుండాలి. స్త్రీలకు సంబంధించిన విషయాలు ప్రసంగవశాత్తూ అతనితో ప్రస్తావించి అతని అభిప్రాయాలు తెలుసుకోవాలి. అతనిపై అప్పుడప్పుడు చిరుకోపం తెచ్చుకుంటూ మరుక్షణంలోనే ఆ కోపాన్ని ఉపసంహరించుకుంటూ వుండాలి. తానే దంతక్షతాలు, నఖక్షతాలు చేసి, ఇవన్నీ ఎవరు చేశారని చలిపితనంగా ప్రశ్నించాలి.

11. అనురాగస్యావచన మాకారతస్తు దర్శయేన్మద స్వప్న వ్యాధిషు తు నిర్వచనం, శ్లాఘ్యానాం నాయక కర్మణాం చ.

12. తస్మిన్వ్రువాణే వ్యాకార్థగ్రహణం, తదవధార్య ప్రశంసా, విషయే భాషణం తద్వాక్యస్య చోత్తరేణ యోజనంభక్తి మాంశ్చేత్.

13. కథాస్వనువృత్తి రన్యత్రసపత్న్యాః

14. నిశ్వాసే, జృంభితే, స్ఖలితే పతితే వా తస్య చార్తిమాశం సేత.

15. క్షుత వ్యాహృత విస్మితేషు జీవేత్యుదాహరణం

16. దౌర్మనస్యే వ్యాధిదౌర్హృదాపదేశః

17. గుణతః పరస్యాకీర్తనం, న నిందా సమాన దోషస్య, దత్తస్య ధారణమ్.

18. వృధాZపరాధే తద్వ్యసనే వా అలంకారస్యా గ్రహణ మభోజనం చ.

వేశ్య ఎప్పుడూ కూడా పురుషుడితో నిన్నే నేను ప్రేమిస్తున్నానని తన నోటితో చెప్పకూడదు. భావ సూచనలతో ఆ అభిప్రాయం వెలిబుచ్చాలి అంతే. మత్తులో ఉన్నప్పుడూ, స్వప్నంలోనూ, వ్యాధిగ్రస్తురై ఉన్నప్పుడూ, పురుషునిలో గల సద్గుణాలను మెచ్చుకోదగిన వాటిని గురించి కలవరించాలి. అతను పుణ్యకార్యాలు ఏవైనా చేసి ఉంటే, వాటిని పేర్కొంటూ అతన్ని ప్రశంసిస్తూ మాట్లాడాలి. అతని మాటలకు అనుకూలమైన సమాధానంగా మాట్లాడాలి. అతను తన సవతుల సంగతి కాకుండా మరే విషయాలు చెప్పబోతున్నా 'ఊ' కొట్టాలి. పురుషుడు నిశ్వసించేటపుడూ, ఆవులించేటపుడూ, మనస్సు సరిగాలేనపుడూ, ఎక్కడైనా కాలుజారి పడినపుడూ, ఎంతో ఆర్తితో, ఆవేదనతో క్షేమవాక్యాలు పలకాలి. తన

మనస్సు సరిగాలేనప్పుడు ఏదో సుస్తీగా ఉన్నదని చెప్పి తప్పించుకోవాలి. మరో పురుషుడి గుణగణాలను గురించి అతని దగ్గర ప్రశంసించకూడదు. వారి దోషాలను పేర్కొని. అతని ఎదుట నిందించడం కూడా తగదు. అతడు ఏ వస్తువు ఇచ్చినా దాన్ని స్వీకరించాలి. ధరించే వస్తువు అయితే, మారు చెప్పకుండా ధరించాలి. అకస్మాత్తుగా తన ప్రియుడికి ఏదైనా అపదగాని, విచారకరమైన సంఘటన గాని సంభవించినప్పుడు, తాను ఎలాంటి అలంకారాలూ చేసుకోకూడదు. భోజనం కూడా చేయకూడదు.

*19. తద్వ్యక్తాశ్చ విలాపాః, తేన సహదేశమోక్షం రోచయేద్, రాజని నిష్క్రయం చ.*

*20. సామర్థ్యమాయష స్తదవాప్తౌ తస్యార్థాధిగమేఽభి ప్రేతసిద్ధౌ*
*శరీరోపచయే వా పూర్వంభాషిత ఇష్టదేవతో పహారాః.*

*21. నిత్యమలంకారయోగః, పరిమితోఽభ్యవహారః.*

*22. గీతే చ నామగోత్రయోః గ్రహణం, గ్లాన్యామురసి లలాటే చ కరం కుర్వీత.*

*23. తత్సుఖ ముపలభ్య నిద్రాలాభే, ఉత్సంగే లాస్యోప*
*వేశనం స్వపనం చ, గమనం వియోగే.*

*24. తస్మాత్పుత్రార్థినీ స్యాదాయుషో నాధిక్యమిచ్ఛేత్.*

వేశ్య సంబంధం పెట్టుకున్న నాయకుడికి ఏదైనా వ్యాధి వచ్చినప్పుడు, అతని కష్టంలో పాలుపంచుకున్నట్లుగా అతన్ని గురించి దుఃఖపడాలి. అతను ఏదైనా దేశాంతరం వెడుతూ ఉంటే, తాను కూడా అతని వెంట వెళ్ళడానికి ప్రయత్నించాలి. ' ఏమండీ! నేనూ మీతో వస్తాను. అయితే, మా అమ్మ అసాధ్యురాలు. ఎలాగైనా ఆమెను ఏమార్చి నన్ను తీసుకుపొండి '- అని చెప్పాలి. ఒకవేళ ఆ సమయంలో ఈ వేశ్య, రాజుగారి కొలువులో ఏదైనా నాట్యాది ప్రదర్శనలకు హాజరు కావలసి ఉంటే, రాజుగారితో చెప్పి, ఆ పని నుంచి నన్ను తప్పించండి - అని అడగాలి. ఏదైనా అసాధ్యమైన పని అతను సాధించి పెడితే, ఈ పని చేసి మీరు నా ప్రాణాలు కాపాడినారు. మీరిది చేయకపోతే ఈ పాటికి నేను ఏమైపోయేదాననో! - అని అతన్ని స్తుతించాలి. పూర్వం తాను కొలిచిన ఇష్టదేవతా ప్రసాదాన్ని అతనికి సమర్పించాలి. అతని గోత్ర, నామాలతో పాటలుపాడాలి. ఏదైనా బాధపడుతుంటే, అతని వక్షస్థలం, నుదురు చేత్తో పట్టుకుని పరీక్షించాలి. ఆ స్పర్శ సుఖం వల్ల నాయకుడు క్రమంగా నిద్రలో మునిగి పొయ్యేటట్లయితే అతని తల తన తొడమీద ఉంచుకుని పరుండ బెట్టుకోవాలి. నిద్ర పుచ్చాలి. అతను తనను విడిచి ఎక్కడికైనా వెడుతూ ఉంటే, తాను కూడా వస్తానని చెప్పి వెంటవెళ్ళాలి. అతని వల్ల గర్భం వస్తే, ఈ కాన్పు సమయంలో నేను చనిపోతే మీరు జాగ్రత్త సుమా ? - అని చెప్పాలి.

*25. తస్య ఆవిజ్ఞాత మర్థం రహసి నబ్రూయాత్.*

*26. వ్రతముపవాసం చాస్య నివర్తయేద్, మయి దోష*
*ఇతి ఆశక్యే స్వయమపి తద్రూపా స్యాత్.*

27. వివాదే తేన్యాప్యశక్యమితర్ఠనిర్దేశః.

28. తదీయ మాత్మీయం వా స్వమవిశేషేణ పశ్యేత్.

29. తేన వినా గోష్ఠ్యాదీనామగమనమితి.

30. నిర్మాల్యధారణే శ్లాఘా, ఉచ్ఛిష్ట భోజనే చ.

31. కులశీల శిల్ప జాతి విద్యావర్ణ విత్త దేశ మిత్రగుణవయో మాధుర్యపూజా.

32. గీతాదిషు చోదనమభిజ్ఞస్య.

33. భయశీతోష్ణవర్షాణ్యనపేక్ష్య తదభిగమనం.

34. న ఏవ చ మే స్యాదిత్యౌర్ధ్వదేహికేషు వచనం.

35. తదిష్ట రసభావశీలానువర్తనం.

36. మూలకర్మాభిశంకా.

37. తనభిగమనే చ జనన్యా సహనిత్యో వివాదః.

38. బలాత్కారేణ చ యద్యన్యత్ర తయా నీయతే తదా
శస్త్రం విషమనశనం రజ్జుం వా కామయేత్.

39. ప్రత్యాయనంచ ప్రణిధిభిః నాయకస్య.

40. స్వయం వా ఆత్మనో వృత్తిర్గ్రహణం.

41. న త్వేవార్థేషు వివాదః.

42. మాత్రా వినాకించిన్న చేష్టేత.

పురుషుడికి తెలియకుండా అతని సమక్షంలో మరొకరితో రహస్యాలు సాగించరాదు వేశ్య. పురుషుడు వ్రతం, లేదా ఉపవాసం చెయ్యబోతుంటే ' మీరు బలహీనంగా ఉన్నారు. అంచాత మీ బదులు ఆ వ్రతమో, ఉపవాసమో నేను చేస్తాను. '- అని చెప్పి, తానే అది అనుష్ఠించాలి. అలా అతను అంగీకరించలేకపోతే, అతనితోపాటు తాను కూడా వ్రతమో, ఉపవాసమో చెయ్యాలి. అతనితో ఏదైనా వివాదం వస్తే, ' మీరు కాదు - మిమ్మల్ని పుట్టించిన బ్రహ్మతరం కూడా కాదు '- అని చెప్పాలి. తన వస్తువని, అతని వస్తువని భేదం పాటించ కూడదు. ఇరివురి వస్తువులూ ఒకటే అన్న భావంతో ప్రవర్తించాలి. అతను వెంట లేకుండా సభలకూ, సమావేశాలకూ, గోష్ఠులయకు వెళ్ళకూడదు. అతను ధరించిన పూలు, అలంకారాలు మున్నగునవి ధరించడంలో గౌరవ మర్యాదలు, ప్రశంస చూపించాలి. అతను తినగా మిగిలిన అన్నం తినాలి. అతని కులం, శీలం, జాతి, విద్య, వర్ణం, ధనం - వీటన్నింటినీ పూజించాలి, గౌరవించాలి.

సంగీత సభలు, గాన కచేరీలు జరుగుతూ ఉంటే గాయకులతో చెప్పి వారి ద్వారా అతన్ని స్తుతింపజేయ్యాలి. చలి, ఎండ, వాన, అనేది లేకుండా, భయం అనేది లేకుండా అతను ఎక్కడికి వెళితే అక్కడికి వెంటవెళ్ళాలి. రానున్న జన్మల్లో ఇతనే నాభర్త కావాలని అంటూ ఉండాలి. అతనికి ఇష్టమైన రసభావశీలలను

ప్రదర్శిస్తూ ఉండాలి. వశీకరణ విషయంలో తదకేదో అనుమానం ఉన్నట్లు నటించాలి. అతన్ని అనుసరించేటప్పుడు తన తల్లితో ఎప్పుడూ కూడా వాదం పెట్టుకోకూడదు. ఒకవేళ వేశ్యమాత వేశ్యను ఆమె ప్రియుడి నుండి బలవంతాన వేరుచేయబోతూ ఉంటే, వేశ్య అన్నం నీళ్ళు వర్జిస్తాననో, గొంతుకోసుకుంటాననో, ఉరిపోసుకుంటాననో, చెపుతూ అందుకు ప్రయత్నించాలి. తన పురుషుణ్ణి చారులద్వారా రప్పించుకోవాలి. తన కులవృత్తిని తనే నిందిస్తూ అసహ్యించుకోవాలి. అతనితో ఎప్పుడూ కూడా ధనం విషయమై పేచీ పెట్టుకోకూడదు. అయితే, తల్లి లేకుండా మాత్రం ఏ పనీ చేయకూడదు.

*43. ప్రవాసే శీఘ్రగమనాయ శాపదానం.*

*44. ప్రోషితే మృజానియమః చ ఆలంకారస్య ప్రతి షేధః.*
*మంగళం త్వపేక్ష్యం, ఏకంశంఖవలయం వా ధారయేత్.*

*45. స్మరణమతీతానాం, గమనమీక్షణికోపశ్రుతీనాం,*
*నక్షత్ర, చంద్ర సూర్య తారాభ్యః, స్పృహణ.*

*46. ఇష్ట స్వప్నదర్శనే తత్సంగమో మమాస్త్వితి వచనం.*

*47. ఉద్వేగోఽనిష్టే శంతి కర్మ చ.*

*48. ప్రత్యాగతే కామపూజా చ.*

*49. దేవతో పహారాణాం కరణం.*

*50. సఖీభిః పూర్ణపాత్రస్యాహరణం.*

*51. వాయనపూజా చ.*

*52. ప్రథమసమాగమానంతరం చైతదేవ వాయనపూజా వర్జమ్.*

*53. సక్తస్య చానుమరణం బ్రూయాత్.*

తన పురుషుడు ఏదైనా దూరదేశానికి పోతూ ఉంటే, తొందరగా తిరిగి రమ్మని, అతనిచేత ఒట్టుపెట్టించుకోవాలి. అతను అలా వెళ్ళిపోయిన పిమ్మట తాను ఎలాంటి అలంకారాలూ ధరించకూడదు. దేహసంస్కారాలు కూడా మానుకోవాలి. మంగళసూత్రం తప్ప మరే ఆభరణాలు ధరించరాదు. లేదా శంఖులదండైనా ఒక్కటే పెట్టుకోవాలి. రోజులు గడుస్తున్న కొలదీ, జరిగిన రోజులు లెక్కపెట్టుకుంటూ ఉండాలి. తను వ్రతాలు, ఉపవాసాదులు చేయటం తన పురుషుడి బంధుజనానికి తెలిసేలాగా నక్షత్రాలు, సూర్యచంద్రుల, - గమనాన్ని స్మరిస్తూ ఉండాలి. తనకు ఇష్టమైన మంచి కల వచ్చినప్పుడు, అతని సంగమం మళ్ళీ నాకు లభించుగాక! - అని పలకాలి. రాకూడని చెడుకలలు ఏవైనావస్తే తత్తరపాటుతో లేచి, పెద్దలను అడిగి శాంతిక్రియలు జరిపించాలి. అతను తిరిగి ఇల్లు చేరగానే కాముని పూజించాలి. (కాముని పున్నమి మొదలైనవి) దేవతోపహారాలు జరపాలి. చెలికత్తెలతో పూర్ణపాత్రలు తెప్పించి, వాయనపూజ చేయాలి. (ఈ పూజ ఏమిటో తెలీదు) (ప్రథమ సంగమం అయిన తరువాత మళ్ళీ పై తతంగం

యావత్తూ నిర్వహించాలి. అతనికి పరిపూర్ణ విశ్వాసం కలగడానికిగాను 'మీతోనే నా మరణం ప్రాప్తించు గాక!' అని అంటూ ఉండాలి.

*54. నిస్పష్టభావః, సమాన వృత్తిః, ప్రయోజనకారీ, నిరాశంకః, నిరపేక్షోఽర్థేషు, ఇతి సక్తలక్షణాని.*

ఇక స్త్రీయందు సక్తుడైనవాడి లక్షణాలు ఎలా ఉంటాయో, చెపుతున్నారు. అతను అన్ని విధాల వేశ్యను నమ్ముతాడు. ఆమెను తనతో సమానంగా చూస్తాడు. ఆమె అడిగిందల్లా తెచ్చి ఇస్తాడు. ఎలాంటి సందేహాలు, అనుమానాలు లేకుండా ఉంటాడు. ధనం విషయమై ఎలాంటి ఆసక్తి, ఆశ కనపరచడు. ఇవి సక్తుని లక్షణాలు.

*55. తదేతన్ని దర్శనార్థం దత్తకశాసనాదుక్త మనుక్తం చ లోకతః శీలయేత్పురుష ప్రకతితశ్చ.*

దత్తకాచార్యుల శాస్త్రాన్ని గ్రహించి ఈ విషయాలు వ్రాశారు వాత్స్యాయనులు. ఇక్కడ చెప్పనటువంటి తక్కిన విషయాలు లోకం నుండి గ్రహించవలసి ఉంటుంది.

*56. భవతశ్చాత్ర శ్లోకా - సూక్ష్మత్వాదతిలోభాచ్చ ప్రకృత్యాఽజ్ఞానతస్తథా,*
*కామలక్ష్మతు దుర్జ్ఞానం స్త్రీణాం తద్భావితైరపి.*

*57. కామయంతే విరజ్యంతే రంజయంతి త్యజంతి చ,*
*కర్షయంత్యోఽపి సర్వార్థాన్ జ్ఞాయంతే నైనయోషితః.*

అయితే, ఇంతకూ వేశ్యలకు కామస్వభావం సహజమా? కాదా? అనే ప్రశ్న వస్తుంది. దీనికి సమాధానం తెలుసుకోడం సాధ్యంకాదు. అంతేకాకుండా వేశ్యలకు ధనంపై ఎక్కువ ఆశ ఉంటుంది. పైగా కామం అనేది స్వభావసిద్ధంగా అజ్ఞాన లక్షణం. ఈ కారణాలవల్ల కామలక్షణం ఎలాంటిదో తెలుసుకోడం మహాజ్ఞానులకు సయితం శక్యంకాదు. వేశ్యాంగనలు ఒక్కొక్కప్పుడు ఎంతో ఆసక్తి కనపరుస్తూ, కామిస్తున్నట్లు కనపడుతూ సురతక్రీడలు జరుపుతారు. మరొకప్పుడు విరక్తితో విముఖత్వం చూపుతారు. ఇలా ప్రవర్తిస్తూనే పురుషుడి సమస్త ధనద్రవ్యాలూ అపహరిస్తారు. అంచేత వేశ్యల స్వభావం తెలుసుకోడం, వారి హృదయం అవగతం చేసుకోడం ఆ బ్రహ్మదేవుడికైనా తరంకాదు.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే వైశికే షష్ఠేఽధికరణే*
*కాంతానువృత్తం నామ ద్వితీయోఽ ధ్యాయః.*

**ఇది శ్రీ వాత్స్యాయనముని విరచితమైన కామసూత్రాల్లో వైశికం అనే ఆరో అధికరణంలో కాంతానువృత్తం అనే రెండో అధ్యాయం.**



# తృతీయాధ్యాయం
## అర్థాగమోపాయం

1. నక్తా ద్విత్తాదానం స్వాభావికముపాయతశ్చ.
2. తత్ర స్వాభావికం నంకల్పితం నంకల్పనమధికం
వా లభమానా నోపాయాన్ప్రయుంజీతేత్యాచార్యాః.
3. విదితయప్యుపాయైః పరిష్కృతం ద్విగుణం దాన్యతీతి వాత్స్యాయనః.

వేశ్య ఎప్పుడూ తనపై ఆసక్తి చూపుతున్న పురుషుడి దగ్గరనుంచి సహజంగానూ, ఉపాయంతోనూ ధనం రాబట్టుకోవాలి. ఇది ఆమె ధర్మం. ఇందులో తప్పులేదు. సహజంగా తన కోరికకు సరిపడేటట్లుగా గానీ, అంతకు ఎక్కువగా గానీ ధనం లభిస్తే, ఇక ఉపాయం అక్కర్లేదు. ఇది ప్రాచీనాచార్యుల అభిప్రాయం.

అయితే, మొట్టమొదట అతని నుండి ఇంత మొత్తం ధనం లభిస్తుందని తెలిసి ఉన్నప్పటికీ, ఉపాయంతో ప్రవర్తిస్తే అంతకన్నా రెట్టింపు ధనం లభిస్తుందని వాత్స్యాయనులు చెపుతున్నారు.

4. 'అలంకార భక్ష్యభోజ్యపేయ మాల్యవస్త్ర గంధద్రవ్యాది
వ్యవహారిషు కాలిక ముద్ధార్య మర్థ ప్రతినయనేవ తత్సమక్షమ్.
5. తద్విత్తప్రశంసా.
6. వ్రతవృక్షారామదేవకులతటాకోద్యానోత్సవ ప్రీతిదాయ వ్యపదేశః
7. తదభిగమనిమిత్తో రక్షిభిశ్చౌరైర్వా అలంకారపరిమోషః.
8. దాహాత్కుడ్యచ్ఛేదా ప్రమాదాద్భవనే చ అర్థనాశః.
9. తథా యాచితాలంకారాణాం నాయకాలంకారాణాం చ
తదభిగమనార్థస్య వ్యయస్య ప్రణిధిభిర్నివేదనమ్.
10. తదర్థ మృణగ్రహణమ్, జనన్యా సహ తదుద్భవస్య వ్యయస్య వివాదః/
11. సుహృత్కార్యేష్వనభిగమన మనభిహారహేతోః.
12. తైశ్చ పూర్వమాహృతా గురవోऽభిహారాః
పూర్వముపనీతాః పూర్వం శ్రావితాః స్యుః.
13. ఉచితానాం క్రియాణాం విచ్ఛిత్తిః.
14. నాయకార్థం చ శిల్పిషు కార్యం.
15. వైద్యమహామాత్రయోః ఉపకారక్రియా కార్యహేతోః.
16. మిత్రాణాం చోపకారిణాం వ్యసనేష్వభ్యుపపత్తిః.

17. గృహకర్మ, సఖ్యాః పుత్రస్య ఉత్సంజనం,
దోహదం వ్యాధిః, మిత్రస్య దుఃఖాపనయనమితి.

18. అలంకారైకదేశ విక్రయో నాయకస్యార్థే.

19. తయా శీలితస్య చాలంకారస్య భాండోపస్కరస్య వా వణిజో విక్రయార్థం దర్శనీమ్.

20. ప్రతిగణికానాం చ సదృశస్యయ భాండస్య వ్యతికరే ప్రతివిశిష్టస్య గ్రహణమ్.

21. పుర్వోపకారాణాం అవిస్మరణ మనుకీర్తనం చ.

22. ప్రణిధిభిః ప్రతిగణికానాం లాభాతిశయం శ్రావ్యయేత్.

23. తాను నాయక సమక్షం ఆత్మనోఽభ్యధికం లాభం భూతమభూతం వా వ్రీడితా నామవర్తయేత్.

24. పూర్వ యోగినాం చ లాభాతిశయేన పునః సంధానే యతమానానాం ఆవిష్కృతః ప్రతిషేధః.

25. తత్స్పర్థినాం చ త్యాగయోగితా నిదర్శనమ్.

26. న పునరేవ్యతీతి భాలయాచితకమిత్యర్థాగమోపాయాః.

# వేశ్యలు ధనం గుంజే ఉపాయాలు

ఎలాంటి ఉపాయాలవల్ల పురుషుడు ఇవ్వదలుచుకున్న ధనం కన్నా ఎక్కువ ధనం రాబట్టుకోడానికి వేశ్యలకు వీలున్నదో ఆ ఉపాయాలు ఇక్కడ చెపుతున్నారు.

అలంకార వస్తువులు, లడ్లు, పిండివంటలు, మిఠాయిలు మున్నగు భక్ష్యాలు, అన్నం మొదలైన భోజ్య పదార్థాలు, మద్యం మొదలైన పానద్రవ్యాలు, వస్త్రాలు, గంధం, తాంబూలం మొదలైన పరిమళ ద్రవ్యాలు, పనిముట్లు ఇలాంటివన్నీ తన దగ్గరికి వచ్చే పురుషుడి సమక్షంలో బేరమాడి, వర్తకులనుండి కొనుక్కోవాలి. అప్పుడు ఆ విటుడే వాటి ధర తనంతట తానే చెల్లిస్తాడు. అంచేత ఆ వస్తువులన్నీ ఉచితంగానే వచ్చినట్టవుతుంది. అతను అలా ధనం ఇచ్చినప్పుడు అతని గుణాలను మెచ్చుకోవాలి. అక్కడ ఒక చెట్టు నాటాలి. ఇక్కడ ఒక తోట వెయ్యాలి. అదిగో, ఆ చోటులో ఒక దేవాలయం ప్రతిష్ఠించాలనుకుంటున్నాను. అంతేకాకుండా ఉద్యానోత్సవం జరపాలని ఉంది. దగ్గరి బంధువులొచ్చారు. వారికేమైనా పెట్టి పోతలు, మర్యాదలు చెయ్యకపోతే బాగుండదు - అని ఇలా రకరకాల తన కోరికలు వెలిబుచ్చుతూ, ప్రతిపాదనలు చేస్తే తన కోసం వచ్చిన విలాస పురుషుడు తప్పించుకోలేడు. చేయవలసినవన్నీ చెయ్యి - ఫరవాలేదు. ధనం నేను ఇస్తాను. ఎంత డబ్బుకావాలి అంటాడతను తన పరువు పోతుందని. అప్పుడు ఇంత కావాలని వేశ్య అడగాలి. అతను ఆ ధనం ఇచ్చివేస్తాడు. అలాగే అతనితో ఎక్కడికైనా ప్రయాణం చేసేటప్పుడు తన మనుషులతో లాలూచీ అయి, తన వస్తువులు, అలంకారాలు, నగలు మున్నగునవి వాళ్ళచే దొంగిలింపజేసి, తన ధనద్రవ్యాలు పోయినవని గొడవచెయ్యాలి. అప్పుడు తనకోసం వచ్చిన పురుషుడు ఆ నగలు, వస్తువులు మరల కొనిపెడతాడు. తన ధనం దొంగలు దోచుకున్నారు.

అగ్నిప్రమాదంలో తన ఇల్లు తగులబడి పోయిందని, అప్పుడా ఇంట్లో ఉన్న ధన ద్రవ్యాలన్నీ నాశనమైపోయినవని, ఇదంతా నిన్ను మరిగినందువల్లనే జరిగిందని గొడవపెడుతూ ఏడుపులంకించుకోవాలి. మా అమ్మ ధనం కూడా ఇందులో ఉందని చెప్పాలి. అతనితో ప్రయాణం చేయడం వల్లనే తన అలంకారాలు, ధన ద్రవ్యాలు పోయినవని గూఢచారుల ద్వారా చెప్పించి విచారపడాలి. అతనికోసం తాను అప్పుచేసినట్లు చూపించాలి. అతనికోసం చేసిన ఖర్చును గురించి తల్లితో తగవుపెట్టుకోవాలి. పురుషుడి బంధు మిత్రుల గృహాలలో ఏవైనా ఉత్సవాలు, శుభకార్యాలు జరుగుతూ ఉంటే అతను రమ్మని పిలుస్తున్నా ఆఖరుకు గట్టిగా బ్రతిమాలుతున్నా ఏదో కానుకలు, బహుమతులు తీసుకోకుండా అక్కడికి వెళ్ళకూడదు. ఇంతకు ముందు ఆ విటుడు ఏ ఏ గొప్ప వస్తువులు తెచ్చి ఇస్తానని మాట ఇచ్చాడో, అవి ఇప్పుడు తెచ్చి ఇస్తేగాని ఇల్లువిడిచి అక్కడికి వెళ్ళనని కచ్చితంగా చెప్పాలి. లేదా అక్కడ బంధుమిత్రులు ఇచ్చే బహుమతులన్నీ నీకే తెచ్చిఇస్తాను. నాయకుడు మాట ఇచ్చేలా చెయ్యాలి. రోజూ తన ఇంట్లో జరుగుబాటు లేనట్లుగా వంట మానెయ్యాలి. ఆ పరిస్థితిని చూచి జార పురుషుడు ఏదో ఒకటి ఇవ్వకుండా ఎలా ఊరుకుంటాడు? ఇంతే కాకుండా, ఇంకా ధనం రాబట్టడానికి ఇల్లు బాగుచేయడానికి, శిల్పపు పనులు మొదలైన వాటికి ధనం లేనట్లు నటించి, ఆ పనులు పూర్తి చేయడానికి అయ్యే డబ్బు అతన్ని అడిగిపుచ్చుకోవాలి. రోగాలకూ, నొప్పులకూ అయ్యే ఖర్చులకు కూడా అతనినుండి ధనం గుంజాలి. తనకు మేలుచేసే బంధు మిత్రులకు ఏదో కష్టం ప్రాప్తించినదని కొంత, ఇంటి పనులకని కొంత, చెలికత్తె లేదా దాసిదాని పిల్లల శుభకార్యాలకని కొంత, జబ్బులకని కొంత, తన స్నేహితురాండ్ర రోగనివారణకని కొంత, ద్రవ్యం అడిగి పుచ్చుకోవాలి. తన అలంకారాలలో కొంతభాగం విక్రయించి విటుడికోసం ఖర్చు పెడుతున్నాట్లుగా అతని ఎదుట నటించాలి. వర్తకుడితో అదివరకే రహస్యంగా మాట్లాడి, ఆ ద్రవ్యం కోసం, తన ఇంట్లోగల వస్తువులు తీసుకుని పొమ్మని విటుడి ఎదుట చెప్పాలి. అలా చేయడం వల్ల ఆ డబ్బు విటుడే ఇచ్చి వస్తువులు తీసుకుని పోకుండా కాపాడుతాడు.

తన బంధుమిత్రుల ఇళ్ళలో కూడా అచ్చం ఇలాంటి పోలికలు గల వస్తువులే ఉన్నందున మారుపడిపోతున్నాయని, అంచేత వీటిని మార్చుకుని మరల కొత్త వస్తువులు కొనుక్కోవడానికి కొంత ధనం కావాలని నమ్మపలికి ధనం అపహరించాలి. తనపై మోజుపడి వచ్చేవిటుడు లోగడ తనకు చేసిన ఉపకారాలు ఎప్పుడూ మరువకూడదు వేశ్య. వాటిని గుర్తు చేసుకుంటూ అతన్ని పొగడుతూ ఉండాలి. గూఢచారుల ద్వారా ఇతర వేశ్యలు గడిస్తున్న లాభాలను గురించి అతనికి చెప్పించాలి. తోటి వేశ్యాంగనలు తనకంటె మిన్నగా ఎంతెంత ధనం ఎలా సంపాదించారో, ఉన్నవీ లేనివీ కల్పించి, సిగ్గునటిస్తూ జార పురుషుడితో చెప్పాలి. ఇంతకు ముందు తనను ఉంచుకున్న వాళ్ళు పెద్దపెద్ద మొత్తాల్లో ధనం ఇస్తున్నామంటున్నారని,

పునస్సంధానం కోసంతాపత్రయ పడుతున్నారని, అయినప్పటికీ మిమ్మలను విడిచిపెట్టలేక నేను ఒప్పుకోవడం లేదని, వారి ధనానికి ఆశపడకుండా వారి మాట కాదన్నానని చెప్పాలి. అలాగే తన విరోధి వర్గంలోని వేశ్యలకు వారి విటులు ఇంతింత లాభం ఇవ్వబోతున్నారని తన గూఢచారులచేత అతనికి చెప్పించాలి. ఇంకా పోనుపోను, చిన్న పిల్లలు పెద్దవాళ్ళు చెంతచేరి ఇది కొనిపెట్టు, అది కొనిపెట్టు, ఇది తెచ్చివ్వు అది తెచ్చివ్వు అని అస్తమానం పీడిస్తున్నట్లు ప్రవర్తించాలి. అది చూచి జారపురుషుడు తట్టుకోలేక అవన్నీ తానే కొనితెచ్చి పిల్లలకు ఇస్తాడు. ఈ విధంగా వేశ్యలు ఉపాయంగా, లబ్జుగా ధనం గుంజే విధానాలు.

# విరక్తులయిన విటుల లక్షణాలు

*27. విరక్తం చ నిత్యమేవ ప్రకృతి విక్రియాలో విద్యాత్ ముఖవర్ణచ్చ.*

ఇక విరక్తుల లక్షణాలు పేర్కొంటున్నారు. వేశ్యాంగన ఇలా ధనం అడిగే సమయాల్లో విటుడు తన స్వభావానికి విరుద్ధంగా ప్రవర్తించినా, అతని ముఖ కవళికలలో ఎలాంటి మార్పులు కనిపించినా, అతను విరక్తుడై ఉన్నట్లు అర్థంచేసుకోవాలి.

*28. ఊనమతిరిక్తం వా దదాతి.*

*29. ప్రతిలోమైః సంబధ్యతే.*

*30. వ్యపది శ్యాన్యత్కరోతి.*

*31. ఉచితమాచ్ఛినత్తి.*

*32. ప్రతిజ్ఞాతం విస్మరతి అన్యథా వా యోజయతి.*

*33. స్వపక్షైః సంజ్ఞయా భాషతే.*

*34. మిత్రకార్య మపది శ్యాన్యత్ర శేతే.*

*35. పూర్వ సంసృష్టయాశ్చ పరిజనేన మిథః కథయతి.*

ఇంకా అలాంటి విరక్తుడి చేష్టలు ఎలా ఉంటాయో చెపుతున్నారు. ఆ విటుడు మామూలుగా ఇచ్చే ధనంకన్నా ఎక్కువైనా ఇస్తాడు. లేదా చాలా తక్కువైనా ఇస్తాడు. వేశ్యకు ఇష్టంలేని వాళ్ళతో స్నేహం చెయ్యడం మొదలెడతాడు. ఆమె చెప్పిన పని ఏదైనా ఎంతో శ్రద్ధతో, ప్రేమతో చేసేవాడిలా నటించి అందుకు భిన్నంగా చేస్తాడు. ఔచిత్యాన్ని ఎంతమాత్రం పాటించడు. తాను చేసిన వాగ్దానాన్ని ఇట్టే మరచి పోతాడు. లేదా ఆదే మరో విధంగానైనా చేయడానికి ప్రయత్నిస్తాడు. వేశ్యకు తెలియకుండా తన వాళ్ళతో సైగలతో మోసం చేస్తూ మాట్లాడతాడు. తన స్నేహిడుడి పని ఏదో ఉన్నదని లేనిపోని నెపం చెప్పి, మరోచోట పడుకుంటాడు. తనకు ఇంతకు ముందు సంబంధం గల గణిక తాలూకు మనుష్యులతో రహస్యంగా మాట్లాడుతూ, వారితో ఏవేవో మంతనాలు సాగిస్తాడు.

*36. తస్య సారద్రవ్యాణి ప్రాగవబోధాందన్యాపదేశేనహస్తే కుర్వీత.*

37. తాని చాస్యా హస్తాదుత్తమర్ణః ప్రసహ్యా గృహ్ణీయాత్.

38. వివదమానేన సహ ధర్మస్థేషు వ్యవహారేదితి విరక్త ప్రతిపత్తిః.

ఇలాంటి విరక్త లక్షణాలు గల విటుడి తాలూకు వెండి, బంగారం మొదలైన విలువగల వస్తువులను ఆతనికి తెలియకుండానే ఏదో నెపంతో తన వశం చేసుకోవాలి. ఆ వస్తువులను తన దగ్గరనుంచి అప్పులవాడెవడో గుంజుకొని పోయినట్లుగా నాటకం ఆడాలి. ఒకవేళ విటుడు పోట్లాటకు దిగితే, న్యాయస్థానంలో ఫిర్యాదు చెయ్యాలి. విరక్తులైన విటులకు, వేశ్యలకు మధ్య సాగే వ్యవహారం ఇదంతా!

39. నక్తం తు పూర్వోపకారిణ మప్యల్పఫలం వ్యళీకేనానుపాలయేత్.

40. అసారంతు నిష్ప్రతి పత్తిక ముపాయతోZపవాహయేదన్యమవష్టభ్య.



## విరక్తుడైన విటుని వెళ్ళగొట్టేదెలా?

విరక్తుడై ఉన్న విటుణ్ణి వెళ్ళగొట్టే విధానం గురించి ఇక్కడ చెపుతున్నారు.

సాధారణంగా వేశ్యలపట్ల విరక్తుడైన విటుడు, వేశ్యచేత చీవాట్లు, చెప్పుదెబ్బలు తినకుండా తనకైతానే గుట్టుగా వెళ్ళిపోతాడు. అతని విషయంలో ప్రయత్నం చెయ్యడమే అనవసరం. ఇక తన ధనద్రవ్యాలన్నీ తగలేసుకుని, అమెపై ఇంకా మమకారం వదులుకోలేకుండా ఉన్న విటుడు, పూర్వం తనకు ఎంత మేలుచేసినవాడు అయినప్పటికీ, ఇంకా కొద్దో, గొప్పో తనకు ధనం ముట్టచెపుతున్నప్పటికీ, వేశ్య నిర్దాక్షిణ్యంగా ఏవేవో తప్పులు చూపించి అతన్ని వెళ్ళగొట్టే ప్రయత్నం చెయ్యాలి. అలాంటప్పుడు అసలు ఏమీ ఇవ్వలేక, నిర్ధనుడై వట్టిపోయిన గేదెలా ఉన్న విటుణ్ణి, అతనివల్ల ఏమాత్రం లాభంలేదని గ్రహించి, వేశ్య మరొక ధనికుడైన జారపురుషుణ్ణి చేరదీసి, మొదటివాణ్ణి సాగనంపాలి.

41. తదనిష్టసేవా, నిందితాభ్యాసః, ఓష్ఠనిర్భోగః, పాదేనభూమేరభిఘాతః.

అవిజ్ఞాతవిషయస్య సంకథా, తద్విజ్ఞాతేష్వవిస్మయః, కుత్సా చ, దర్పవిఘాతః.

ఆధికైః సహ సంవాసః, అనపేక్షణం, సమానదోషాణాం నిందా, రహసి చావస్థానమ్.

ఇక అలాంటి విరక్త విటుణ్ణి సాగనంపే పద్ధతి - అతనికి ఏమాత్రం ఇష్టంలేని పనులు చెయ్యాలి వేశ్య. అసహ్యించుకునే మద్యపానం మొదలైనవి సేవించాలి. ముక్కువిరుపులు, మూతివిరుపులు చేస్తూ వెక్కిరించాలి. కాళ్ళతో నేలమీద రాయాలి. అతనికి తెలియని విషయాలు అడిగి ఏడిపించాలి. ఒకవేళ అతను సరైన సమాధానాలు చెపితే ఆశ్చర్యం ప్రకటించాలి. అసహ్యించుకోవాలి. ఈ విషయం, నీకంటె ఫలానా వాళ్ళకు బాగా తెలుసు - అంటూ పదిమందిలో అతన్ని హేళన చేసి అవమానించాలి. అతను తెలిసినవాడైనప్పటికీ చులకనచేసి చూడాలి. అతనికి చిన్నతనం కలిగేలా అతనికన్నా అధికులతో స్నేహంచేసి, వారితో కలిసి మెలిసి తిరగాలి. ఇంకా ఎవరిచేతనైనా అతనికి గర్వభంగం చేయించాలి. అతనివంక కన్నెత్తి అయినా చూడకూడదు. అతనికి సంబంధించిన వస్తువు తనకు ఎంత ప్రియమైనదే అయినప్పటికీ హీనంగా చూడాలి. అది ముట్టుకోకూడదు. ఎప్పుడూ అతని కంట పడకుండా తిరగాలి. (ఈ పనులుచేస్తే విటుడు అసలే ధనంలేదు కాబట్టి, ఇంకా అవమానంతో క్రుంగిపోయి వెళ్ళిపోతాడు. సాధారణంగా విటులకు వేశ్యల ఇళ్ళలో ఇలాంటి గతే పడుతుంది.)

*42. రతోపచారేషూద్వేగః, ముఖస్యాదానం, జఘనస్య రక్షణం, నఖదశనక్షతేభ్యో జుగుప్సా, పరిష్వంగే భుజమయ్యా సూచ్యా వ్యవధానం, స్తబ్ధతాగాత్రాణాం నక్తోర్వ్యత్యాసః. నిద్రాపరత్వం చ, శ్రాంతముపలభ్య చోదనా, అశక్తౌహాసః, శక్తావనభినందనం, దివాఽపి భావముపలభ్య మహాజనాభిగమనమ్.*

# రతికేళి సమయంలో విటుడికి ఎలా విరక్తి పుట్టించాలి?

విరక్తుడై ఉన్న విటుణ్ణి రతికేళి సమయంలో కూడా ఎలా విరక్తి పుట్టించాలో చెపుతున్నారు.

1) సురత సమయంలో అదిరిపాటు చూపించాలి. 2) ముద్దాడబోతే మూతి తిప్పుకోవాలి. 3) మదన మందిరాన్ని దాచుకోడం, బయటికి కనిపించకుండా చెయ్యడం, 4) నఖక్షతాలు, దంతక్షతాలు అసహ్యించుకోడం, వాటికి ఓర్చుకోలేనని చెప్పడం, 5) కౌగిలించబోతే చేతులు అడ్డుపెట్టడం 6) అతనికి ఉద్రేకం హెచ్చిన కొలదీ సుఖం లేకుండా చేయడం, 7) శరీరంలో చలనం లేకుండా మొద్దులా పడి ఉండడం, 8) తొడమీద తొడ మెలివేసి పడుకుని రతిక్రీడ సలపడానికి వీలులేకుండా చేయడం, 9) నిద్ర ముంచుకుని వస్తున్నట్లు నటించడం, 10) విటుడు వీర్యహీనుడై రతి చేయలేకుండా ఉన్న సమయంలో రతి సాగించమని ప్రేరేపించడం, అతను అశక్తుడుగా ఉన్నప్పుడు హాస్యమాడడం, 11) అతను శక్తి వంతుడుగా ఉంటే, ఏమాత్రం మెచ్చుకపోవడం, 12) పగలు కూడా వచ్చి

మరుకేళికి పూనుకొంటే అక్కడ నుంచి లేచి జనం ఉన్నచోటుకు పారిపోవడం, ఈ పన్నెందు పనులూ రతివేళలో విటుడికి విరక్తి పుట్టించి వెళ్ళగొట్టే ఉపాయాలు.

*43. వాక్యేషు చలగ్రహణం, అనర్మణి హాసః, నర్మణిచాన్యమువదిశ్య హాసేత్*
*వదతి తస్మిన్కటాక్షేణ పరిజనస్యా(ప్రేక్షణం, తాడనం చ,*
*ఆహత్య చాస్య కథామన్యాః కథాః, తద్వ్యళీకానాం వ్యసనానాం చ*
*అపరిహార్యాణాం అనుకీర్తనం, మర్మాణాం చ చేటికయోపక్షేపణమ్.*

*44. ఆగతే వా దర్శనమయాచ్యయాచనమంతే స్వయంమోక్షశ్చేతి ప్రతిగ్రహకల్పో దత్తకస్య.*

అతను ఏం మాట్లాడినా వాటిల్లో తప్పులు పట్టాలి. చమత్కారంలేని మాట మాట్లాడి నవ్వాలి. వెకిలిగా దేనికోసమో నవ్వినట్లుగా, చమత్కారపు మాటలకు నవ్వాలి. అతను మాట్లాడుతుంటే నిర్లక్ష్యంగా ఇతరులవంక చూస్తూ ఉండాలి. నవ్వుతూ కరతాళ ధ్వనులు చేయాలి. అతని చెడు పనులు, ఇతర విషయాలు, సహించలేని వ్యసనాలు - ఇవన్నీ గుర్తుచేస్తూ అతన్ని ఎత్తిపొడవాలి. ఇంకా ఎవరికీ తెలియని రహస్యమైన లోపాలు కూడా చెలికత్తె ద్వారా వెల్లడిచేయించి ఆక్షేపించాలి. అతను రాగానే గొంతెమ్మ కోరికలు కోరి, వాటిని తీర్చలేకపోయినాడన్న కారణంపై అతన్ని తన ఇంట్లోనుంచి వెళ్ళగొట్టాలి. దత్తకాచార్యులు చెప్పిన ఉపాయాలు ఇవి.

*45. భవతశ్చాత్రశ్లోకా - పరీక్ష్యగమ్యైః సంయోగః సంయుక్తస్యానురంజనం,*
*రక్తార్థస్య చాదానమంతే మోక్షశ్చ వైశికమ్.*

*46. ఏవమేతేన కల్పేన స్థితా వేశ్యాపరిగ్రహే నాతిసంధీయతే గమ్యైః కరోత్యర్థాంశ్చ పుష్కలాన్.*

వేశ్య తన వద్దకు వచ్చిన విటశిఖామణిని పరీక్షించి అతనితో సంయోగం నెరపడం, సంబంధం పెట్టుకున్న జారుణ్ణి యథావిధిగా సుఖపెట్టడం, తనపై మోజు పెట్టుకున్న వానినుండి బాగా ధనాన్ని గుంజడం, నిర్ధనుడైన పిదప వాణ్ణి వెళ్లగొట్టడం - ఇదంతా వేశ్యలకు సంబంధించిన వ్యవహారం. ఈ విధంగా ప్రవర్తిస్తూ పదుపుగత్తె, జారపురుషులను ఆకర్షించి తాను మోహంలో చిక్కుకోకుండా ధనం మాత్రం సంపాదించాలి. అదే ఆమె వృత్తి ధర్మం. అదే ఆమె జీవిత పరమావధి. అంతేకాని సక్తురాలు కాకూడదు ఎప్పుడూ.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే వైశికేషష్ఠేఽధికరణే*
*అర్థాగమోపాయాః విరక్తప్రతిపత్తిః నిష్కాసనక్రమాస్తృతీయోఽధ్యాయః.*

**ఇది వాత్స్యాయన మునివిరచిత కామసూత్రాల్లోని వైశికం అనే ఆరో అధికరణంలో అర్థాగమోపాయం అనే మూడో అధ్యాయం.**



# చతుర్థాధ్యాయం
## విశీర్ణ ప్రతిసంధానం

*1. వర్తమానం నిష్పీడితార్థం ఉత్సృజంతీ విశీర్ణేన సహసంధధ్యాత్.*

నిర్ధనుడైన విటుణ్ణి వెళ్ళగొట్టిన తరువాత ఇంతకు ముందు ఇలాగే తనను మరిగి వదిలేసిన జారపురుషుని దగ్గరకు తీయాలి. విశీర్ణ ప్రతిసంధానం అంటే ఇదే!

*2. నచేదవసితార్థో విత్తవాన్ సామరాగశ్చ తతస్సంధేయః.*

పాదాలకు పెట్టుకున్న లత్తుకను కడిగేసి, పదల్చుకున్నట్లుగా వదిలేసిన పురుషుణ్ణి తిరిగి రాబుట్టుకోడం అంటే ఏమిటో ఇక్కడ చెపుతున్నారు. వేశ్యను మరిగిన మగాడు ఒకసారి ఆమెచేత ఇంట్లో నుంచి గెంటివేయబడినప్పటికీ, ఆ తరువాత తరువాత మళ్ళీ ఏదోవిధంగా ధనం ఆర్జించగలిగితే, మళ్ళీ ఆమెకు సమర్పించి ఆమెతో భోగించడానికి తప్పకుండా ప్రయత్నిస్తాడు అది తీరని వ్యసనం. జూదంలో ధనం: పోగొట్టుకున్నవాడూ అంతే. డబ్బురాగానే మళ్ళీ వచ్చి జూదంలో పెడతాడు.

(స్త్రీ, జూదం, పానం, వేట, వాక్పారుష్యం, తగనివెచ్చం, కఠినదండం - ఈ ఏడూ సప్తవ్యసనాలు. ఇవి అంటుకుంటే ఒక పట్టాన వదలవు.)

అలా ప్రయత్నం చేసినప్పుడు అతని అనురాగాన్ని బాగా పరీక్షించి దగ్గరికి చేరనివ్వాలి వేశ్యః అలా చేరనివ్వకపోతే పూర్వం గెంటివేయడాన్ని మనసులో పెట్టుకుని అతను ఏదోవిధంగా అపకారం చేస్తాడు. అంచేత బాగా పరీక్షించి అతన్ని దగ్గరికి చేర్చుకోవాలి.

*3. అన్యత్రగతస్తర్క యితవ్యః, సకార్య యుక్త్యాపేక్షయా.*

అలా మళ్ళీ దగ్గర చేర్చుకున్న విటుడి విషయంలో చేయవలసిన పని చెపుతున్నారు. మొదట్లో తనను విడిచి వెళ్ళిన పిమ్మట అతను మరో మగువతో సంబంధం పెట్టుకున్నాడేమో సాక్ష్యాధారాలతో తెలుసుకుని నిరార్థణ చేసుకోవాలి. ఇలా ఒకసారి ఇంట్లోనుంచి వెళ్లగొట్టబడిన విటులు ఆరు రకాలుగా ఉంటారు - తనతో పూర్వం సంభోగించిన వాడైతే ఈ భేధాలుండవు.

*4. ఇతస్స్వయమపసృతః, తతోఽపి స్వయమేవాపసృతః.*

*5. ఇతస్తతశ్చ నిష్కాసితాపసృతః.*

ఈ వేశ్యను స్వయంగా విడిచిపెట్టి మరొక మగువను మరిగినవాడు, ఆ వేశ్యను కూడా స్వయంగా వదిలేసి వచ్చినవాడు, అక్కడ చీవాట్లు, చెప్పుదెబ్బలు

తిని వచ్చినవాడు, ఈ వేశ్యనుండి స్వయంగానే వెళ్ళిపోయి తిరిగి ఈమె దగ్గరికే చేరినవాడు, ఇక్కడనుంచి వెళ్ళగొట్టబడి వెళ్ళి పోయినవాడు, ఇక్కడనుంచి వెళ్ళగొట్టబడిన పిమ్మట అక్కడ చేరిన వాడు ఇలా ఆరు రకాలు. వీరిపేరు నిష్కాసితులు.

6. *ఇతః స్వయమపసృతస్తతో నిష్కాసితాపసృతః.*

7. *ఇతః నిష్కాసితాపసృతస్తత్రస్థితః*

8. *ఇతస్స్వయమప సృతస్తత్రస్థితః*

9. *ఇతో నిష్కాసితాపసృతః.*

10. *ఇతస్తతశ్చ స్వయమేవాప సృత్యోపజపతిచేదు*
*భయోర్గుణానపేక్షీచల బుద్ధిరసంధేయః.*

ఇద్దరు స్త్రీలనూ తనంతటతానే వదిలేసి, మరల పీఠమర్దులద్వారా సంధానంకోసం ప్రయత్నం చేసే విటుణ్ణి వేశ్యలు ఎప్పుడూ దగ్గరికి రానివ్వకూడదు. అలాంటివాడు గుణహీనుడుగా చపలచిత్తుడుగా లెక్కవేసుకోవాలి. అలాకాక ధనహీనుడైనకారణం చేత వెళ్ళగొట్టబడి, మరల ధనం సంపాదించిన వాడైతే అవశ్యం దగ్గరికి చేర్చుకోవాలి. తిరిగి తన వద్దకు వచ్చిన విటుడు, ముందుగానే కొంత ధనం ముట్టచెప్పి, మనస్పూర్తిగా అనురాగం ప్రదర్శిస్తుంటే అలాంటి వాణ్ణికూడా అవశ్యఃచెంతకు చేర్చుకోవాలి.

11. *ఇతస్తతశ్చ నిష్కాసితాపసృతః, స్థిరబుద్ధిః, నచేదన్యతో బహులభ్యమానయా నిష్కాసితః స్యాత్ససారోపి తయారోషితో యనూమర్షాద్బహుదా స్యతీతి సంధేయః.*

ఈ వేశ్యఇంటినుండి వెళ్ళగొట్టబడి, ఆ వేశ్య ఇంటినుండి నిష్కాసితుడై మళ్ళీ సంధిచేసుకోవాలని ఈ వేశ్య దగ్గరికి వస్తే, అలాంటి వాణ్ణి స్థిరచిత్తుడని తెలుసుకోవాలి. ఇతనికన్నా గొప్పవాడి ఆశ్రయం దొరకడం వల్ల ధనవంతుడై ఉన్న మరో స్త్రీ చేత వెళ్ళగొట్టబడి ఉంటే, ఆమెపై రోషంతో, తన కెక్కువధనం ఇస్తాడని చెంతకు చేర్చుకోవచ్చు.

12. *నిస్సారతయా కదర్యతయా వాత్యక్తోనశ్రేయాన్.*

ధనం లేనివాడనిగానీ లేదా పిసినిగొట్టు అనిగానీ వెళ్ళగొట్టబడి ఉంటే అలాంటి వాణ్ణి దగ్గరికి రానివ్వకూడదు.

13. *ఇతస్స్వయ మపసృతస్తతో నిష్కాసితాపసృతో*
*యద్యతిరిక్తమాదౌచదద్యాత్తతః ప్రతిగ్రాహ్యః*

ఈ వేశ్యఇంటినుండి తనంతటతానే వెళ్ళిపోయి, ఆ వేశ్యచేత వెళ్ళగొట్టబడి వచ్చి పూర్వం తనకు ఇవ్వవలసిన బాకీ సొమ్ము ఇచ్చివేస్తే అలాంటి విటుణ్ణి దగ్గరికి తీయవచ్చు.

14. *ఇతస్స్వయ మపసృత్యతత్రస్థిత ఉపజపంస్తర్కయితవ్యః.*

ఈ వేశ్య దగ్గరికి రాకుండా స్వయంగానే విరమించుకుని, మరో వేశ్యతో చేరి భోగిస్తూ మళ్ళీ తనవాళ్ళతో ఆలోచనసాగిస్తే, అలాంటివాళ్ణి కొంచెంపరీక్షించిన పిదప గని దగ్గరికి చేరనివ్వరాదు.

*15. విశేషార్థీ చాగత్య తత్ర విశేష మపశ్యన్ ఆగంతుకామోమయి*
*మాంజిజ్ఞాపిసు కామన్య ఆగత్యసామరాగత్యద్దాన్యతి.*

*16. తస్యాంతా దోషాన్ దృష్ట్వామయి భూయిష్ఠాన్గుణాన్*
*అధునాపశ్యతిః సగుణదర్శీ భూయిష్ఠందాన్యతి.*

దాని దగ్గర విశేషం ఏమీ లేదు. అంచేత నా దగ్గర విశేషాలు ఉంటాయనినాదగ్గరికి వస్తున్నాడు. నా వల్ల విశేషాలు తెలునుకోవాలనే వస్తున్నాడు. అంచేత నాకు ఎక్కువ ధనం ఇస్తాడు. ఆమెలో దోషాలు అధికంగా చూచి, నాలోగుణాలు ఎక్కువగా గ్రహిస్తున్నాడు. గుణగ్రహణ పారీణుడైన ఈవిటుడు నాకు అతిగా ధనం కుమ్మరిస్తాడు. కాబట్టే అతనితో తప్పకుండా సంధి కుదుర్చుకోవాలి - ఇలా ఆలోచించి విటుణ్ని చేర్చుకోవచ్చు.

*17. బాలోవానైకత్రదృష్టిః, అతి సంధాన ప్రధానోవా,*
*హరిదాగోవా, యత్కించన కారీ వేశ్య వేశ్య సంధధ్యాన్నవా.*

ఈ కుర్రవాడికి ఇప్పుడిప్పుడే యౌవనం అంకురిస్తున్నది. కాబట్టే చలచిత్తం ఎక్కువ. ఎక్కువమంది దగ్గర పడుకోవాలనుకునేవాడు. ఇతని దృష్టి ఎక్కడో ఉంటుంది. ఇక్కడ నుంచి మరో ' ముండ ' దగ్గరికి పోతాడు. మళ్ళీ అక్కడనుంచి ఇక్కడికి రావడానికి ప్రయత్నిస్తాడు. ఇలాంటి వాడివల్ల ఏం లాభం? ఏమీ తెలియని ఈ కుర్ర కుంక అనర్థం తెచ్చిపెడతాడు - ఇలా ఆలోచించి సంధి చేసుకోవచ్చు. ఒక పక్షంగా రెండో పక్షంగా సంధి చేసుకోకూడదు కూడా.

*18. ఇతోనిష్కాసితాన్యతంత్రే తతస్స్వయ మపసృత ఉపజనంస్తర్క యితవ్యః.*

*19. అనురాగా దా గంతుకామః సబహుదాన్యతి.*
*మనుగుణైర్భావితో యోఽన్యస్యాంసరమతే.*

ఇక్కడ వెళ్ళగొడితే వెళ్ళిపోయాడు. అక్కడనుంచి తనకై తానే వచ్చాడు. నాతో కలియడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇలాంటివాణ్ని కాస్త పరీక్షించాలి. అనురాగంతో నా దగ్గరికి వస్తే ఎక్కువ ధనం ఇస్తాడు. నా గుణాలు అతనికి బాగా నచ్చాయి. అంచేత మరే స్త్రీ దగ్గరా పడుకోడు. ఇలా ఆలోచించి అతనితో రాజీ పడవచ్చు.

*20 పూర్వమయోగేన వాయం మయా నిష్కాసితః.*

*21. నమాం శీల యిత్వావైరం నిర్యాతయితు కామః ధనమభియోగాద్వామయా*
*అస్వాపహృతం తద్విశ్వాస్య ప్రతీప మాదాతు కామః నిర్వేష్టుకామోవా*
*మాంవర్తమానా ద్భేతయి త్వాత్యక్తుకామః ఇత్యకల్యాణ గుణబుద్ధిరనంధేయ.*

ఇతన్ని ఇంతకుమునుపు అన్యాయంగా వెళ్ళగొట్టాను. అందుగ్గాను ఇతను నన్ను నమ్మించి కసితీర్చుకోదలచి, పూర్వం ఇతనివద్ద నేను తీసుకున్న ధనం నమ్మకం మీద మళ్ళీ గుంజుకోవాలని చూస్తున్నాడు. ఇప్పుడు నేను ఉంచుకున్న వాడినుండి నన్ను విడదీసి, వదిలెయ్యాలని కోరుతున్నాడు. అంచేత ఇతనితో సంధానం నాకు కూడదు - ఈ దూరపు ఆలోచనతో ప్రవర్తించి అతన్ని దూరంగా ఉంచాలి.

22. అన్యధాబుద్ధిః కాలేనలంభయితవ్యః.

23. ఇతో నిష్కాసితస్త్రత్రస్థితః, ఉపజపన్నే తేన్యూఖాతః.

24. తేషునావజపత్సు అన్యత్రస్థితా స్వయముపజపేత్.

ఒకసారి వెళ్ళగొట్టబడినవాడు కొంతకాలం గడిచిన పిమ్మట మళ్ళీ సంధానం చేసుకోడానికి అర్హుడు. ఇక్కడ నుండి వెళ్ళిపోయి మరో స్త్రీ దగ్గర ఉండి, మళ్ళీ తన దగ్గరికి వచ్చే ప్రయత్నంలో ఉన్నవాడి విషయం ఇలా స్పష్టమవుతూనే ఉంది. అలాంటి వాడు తన కోసం రాయబారాలు సాగిస్తుంటే స్వయంగానే మంత్రాంగం నడపడం మంచిది.

25. వ్యళీకార్థం నిష్కాసితోమయాZసావన్యత్రగతోయత్నాదానే అవ్యః.

26. ఇతః ప్రవృత్త సంభాషేవాతతః భేదమవాన్స్యతి.

27. వర్తమానస్య వా దర్పు విఘాతం కరిష్యామి.

28. అర్థాగమకాలో వాన్య, స్థాన వృద్ధి రన్యజాతాలబ్ధమనే నాధికరణం
దారైర్వియుక్తః పారత్రంత్ర్యాద్వ్యా వృత్తః పిత్రాభ్రాతా వావిభక్తః

29. అనేనూ ప్రతిబద్ధం, అనేన సంధిం కృత్వానాయకం ధనినమవాప్స్యామి.

30. విమానితో వా భార్యయాతమేవ తస్యాం విక్రమయిష్యామి.

31. అన్యవామిత్రం మద్ద్వేషిణీం సవత్నీం కామయతే, తదమునా భేదయిష్యామి.

32. చలచిత్తతయా వా లాఘవమేనమాపాదయిష్యామీతి.

పరస్త్రీల దగ్గర పడుకున్నాడన్న సాకుతో ఈ విటుణ్ణి నేను వెళ్ళగొట్టాను. అంచేత ఇతను మరోచోటుకు వెళ్ళాడు. అతన్ని మళ్ళీ ఎలాగైనా ప్రయత్నించి నాదగ్గరికి తెచ్చుకోవాలి. నాతో మాట్లాడడం ప్రారంభిస్తే పరస్త్రీల పట్ల విరక్తి చెందుతాడు. అతన్ని తీసుకుని వచ్చి ఇప్పుడు నాదగ్గర ఉన్న 'మిండగాడికి' శృంగభంగం చేస్తాను. అతనికి ఇప్పుడు ఏవో ఉద్యోగాలు వచ్చే అవకాశాలు ఏర్పడ్డాయి. ధన ద్రవ్యాదులు బాగా లభించవచ్చు. అధికారం కూడాచేజిక్కుతుంది. పైగా భార్యకు దూరంగా ఉన్నాడు, ఒకరి చెప్పుచేతల్లో లేదు. సర్వ స్వతంత్రుడు, తండ్రితోనూ అన్నదమ్ములతోనూ వేరుపడ్డాడు. అతనికి ఇతనుమిత్రుడు కాబట్టే అతనితో సంధి చేసుకుని ధనవంతుడైన విటుణ్ణి పొందుతాను; ఒకవేళ భార్య అతన్ని తిరస్కరిస్తే అతని చేత గట్టిగా మందలింపజేస్తాను. అతనిస్నేహితుడు

నాకు విరోధస్తురాలైన నా సవతిని మరిగాడు. అతనికీ ఇతనికీ మధ్యభేదం పుట్టిస్తాను. ఈ కారణాలతో వేశ్యలు సంధానాలు జరుపుతూఉంటారు.

33. తస్య పీఠమర్దాదయో మాతుర్దౌశ్శీల్యేన, నాయికా యానన్త్యప్యనురాగే
వివశాయాః పూర్వం నిష్క్రమణం వర్ణయేయుః.

34. వర్తమానేన చాకామాయాః సంసర్గం విద్వేషం చ.

35. తస్యాశ్చ సాభిజ్ఞానైః పూర్వానురాగైరేనంప్రత్యాయేయుః.

36. అభిజ్ఞానం చ తత్కృతోపచారసంబద్ధం స్యాదితి విశీర్ణప్రతిసంధానమ్.

వెళ్ళగొట్టబడిన విటుడి దగ్గరికి వెళ్ళి పీఠమర్దాదులు వేశ్య తల్లి దుర్మార్గురాలు కావడం చేత ఆమెకు నీపై ఎంత అనురాగం ఉన్నా వెళ్ళగొట్టవలసి వచ్చింది. తల్లి ఆధీనంలో ఉంది పాపం, ఏం చేస్తుంది, అని అతనితో పూర్వం వెళ్ళగొట్టడానికి గల కారణాలు వివరించాలి. ప్రస్తుతం తాను ఉంచుకున్న వాడిపై అనురాగం లేదని, ఊరికే కాలక్షేపం కోసం భోగిస్తున్నానని, అంతకు తప్ప మనస్సులో అసహ్యించుకుంటున్నానని చెప్పాలి. తాను ఇదివరకు అతన్ని ఎలా మెప్పించిందో, ఎలా సుఖ పెట్టిందో ఆ గుర్తులు, చిహ్నాలతో సహా జ్ఞాపకం చెయ్యాలి. విశీర్ణ ప్రతి సంధానం చేయవలసిన క్రమం ఇదంతా.

37. అపూర్వపూర్వసంసృష్టయోః పూర్వసంసృష్టశ్శ్రేయాన్,
సహి విదితశీలోదృష్టరాగశ్చ సూపచరో భవతీత్యాచార్యాః.

38. పూర్వసంసృష్టః సర్వతో నిష్పీడితార్థత్వాన్నాత్యర్థ మర్థదో దుఃఖం చ
పునః విశ్వాసయితు మపూర్వస్తుసుఖేనానురజ్యత ఇతి వాత్స్యాయనః.

39. తథాఽపి పురుష ప్రకృతితో విశేషః.

ఇది వరకు ఎప్పుడూ వేశ్యతో పోనివాడు, లోగడ ఒకసారి మాత్రం కలిసినవాడు, - ఈ రెండు రకాల విటుల్లో ఎవరు ఉత్తములు అన్న ప్రశ్నవస్తే సమాధానం చెపుతున్నారు. పూర్వం సంభోగించినవాడి స్వభావం ఎలాంటిదో వేశ్యకు బాగా తెలుసుకాబట్టి, అతని అనురాగం ఎలాంటిదో ఎరుగును కాబట్టి అతనే శ్రేష్ఠుడని పూర్వాచార్యుల అభిప్రాయం. అయితే, పూర్వం సంభోగించినవాడు, తన ధనాన్ని పూర్తిగా వెచ్చించాడు కాబట్టి, ఇప్పుడు ఎక్కువ ధనం ఇవ్వలేడు. వేశ్యకు ధనమే ముఖ్యం. పైగా అతన్ని మరల నమ్మించి వలలో వేసుకోడం కూడా కష్టమే. అంచేత పూర్వం తనతో సంబంధం ఉన్నవాడు ఉత్తముడుకాడని, లోగడ ఏ మాత్రం పరిచయం లేనివాడు సులభంగా అనురాగం పొందుతాడు, వెంటనే నమ్ముతాడు కూడా. కాబట్టి అలాంటి కొత్తవాడే ఉత్తముడని వాత్స్యాయనుల సిద్ధాంతం. పురుషుడి విషయంలో కొత్తదనం ఉండడమే ఇందులో విశేషం.

40. భవంతి చాత్ర శ్లోకాః అన్యాం భేదయితుం
గమ్యాదన్యతో గమ్యమేవవా, స్థితస్య చోపఘాతార్థం పునస్సంధానమిష్యతే.

41. బిభేత్యన్యస్య సంయోగాద్వ్యలీకాని చ నేక్షతే
ఆతినక్తః పుమాన్యత్ర భయాద్బహుదదాతి చ.

42. అనక్తమభినందేచ్చ సక్తం పరిలవేత్తథా అన్యదూతాను పాతేచయః స్యాదతి విశారదః.

43. తత్రోపుజాపి సం పూర్వం నారీ కాలేన యోజయేత్
భవేచ్చా చిన్నసంధానా న చ సక్తం పరిత్యజేత్.



తన విటుడు మరో స్త్రీతో సంబంధం పెట్టుకుని ఉన్నప్పుడు అతన్ని ఆ స్త్రీ నుండి వేరు చేయాలంటే, తన దగ్గర ఉన్న విటుణ్ణి వెళ్ళ గొట్టాలంటే, వెళ్ళ గొట్టిన వాడితో మరల చేతులు కలపాలి. అలా ఇతర పురుషుడితో వేశ్య సంబంధం పెట్టుకోడం వల్ల ఆ విటుడు భయపడి పోతాడు. ఆమె చేసే అపరాధాలు అపేక్షించకుండా ఉంటాడు. ఎక్కువగా ఆసక్తుడై ఉంటే ఎక్కువ ధనం కూడా ఇస్తాడు. ఇతర పురుషుల దూతలు తన దగ్గరికి వచ్చినప్పుడు తన వద్ద గల ధనవంతుడైన పురుషుడు తనపై అనురాగం లేనివాడైతే, అతన్ని పొగుడుతుంది. అలా చేయడం వల్ల అతను ధనం కుమ్మరిస్తాడు సంధానం కోసం ప్రయత్నించే వాణ్ణే ముందుగా దగ్గర చేర్చుకోవాలి. తనపట్ల సక్తుడై ఉన్నవాణ్ణి సంధానం నుంచి తక్షణం తప్పించి వదిలిపెట్టకూడదు.

44. సక్తం, తు వశినం నారీ సంభాష్యాప్యన్యతో వ్రజేత్.
తతశ్చార్థముపాదాయ సక్తమేవాను రంజయేత్.

45. ఆయతిం ప్రసమీక్ష్యాదౌ లాభం ప్రీతిం చ పుష్కలాం,
సౌహృదం ప్రతిసంధధ్యాత్ విశీర్ణం స్త్రీ విచక్షణా.

తనపట్ల అనురాగాసక్తుడై, తన వశంలో ఉండేవాడితో అనునయంగా మాట్లాడితే, ఇతరుని దగ్గరికి పోవాలి. అతని వల్ల ధనం సంపాదించాలి. తనను ఎవడు ప్రేమిస్తుంటాడో అతన్ని సుఖ సంతోషాలలో ముంచి వెయ్యాలి వేశ్య. దూరదృష్టి గల వేశ్య మొట్టమొదట చేయవలసిన పని ముందు కాలానికి తనకు

అవసరమయ్యే ధనం అధికంగా సంపాదించడం ఆ తరువాతనే లాభం, ప్రేమాను మంచి మనస్సుగల పూర్వపు విటుడితో ఎప్పుడూ మంచిగానే ఉండడం అవసగం.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే వైశికే షష్ఠేऽధికరణే*
*విశీర్ణప్రతిసంధానం చతుర్థోऽధ్యాయః.*

ఇది శ్రీ వాత్స్యాయనముని విరచిత కామ సూత్రాల్లో వైశికమనే ఆరో అధికరణంలోని విశీరప్రతి సంధానం అనే నాలుగో అధ్యాయం.



# పంచమాధ్యాయం
## లాభవిశేషం



*1. గమ్యబాహుళ్యే బహు ప్రతిదినం చ లభమానానైకం ప్రతిగృహ్ణీయాత్.*

వేశ్యల్లో మూడు రకాలవారున్నారు. ఒక పురుషుడితో వుండేది, అనేకమంది పురుషులతో వుండేది, ఎవరితోనూ వుండనిది. ఈ మూడు రకాలవారికీ వచ్చే ధనలాభం ఒక విధంగా ఉండదు. మూడు రకాలుగా వుంటుంది. వీరిలో ఒక పురుషుడితో ఉండే వేశ్యకు వచ్చే ధనలాభం గురించి ఇప్పటికే చెప్పడం జరిగింది. రెండో రకం వేశ్య - అంటే పలువురితో పోయ్యే వేశ్యకు వచ్చే ధనలాభం గురించి ముందు చెప్పడం జరుగుతుంది. ఇక, ఇప్పుడు మూడో రకం వేశ్య - అంటే ఎవరితోనూ ఉండని వేశ్యకు వచ్చే ధనలాభం గురించి ఇక్కడ చెప్పడం జరుగుచున్నది.

అసలు, మొదట ఒక విషయం తెలుసుకోవాలి. ఎవరినీ ఉంచుకొనక పోవడం అనేది ఎందువల్ల జరుగుచున్నది వేశ్యకు? తన దగ్గర పడుకోవాలని ఒకరికంటె ఎక్కువగా, ఎక్కువ మంది రావడం ఎప్పుడైతే తటస్థిస్తుందో, అప్పుడు వాళ్లలో వాళ్ళకు పోటీ వస్తుంది. ఒకరి కంటె ఒకరు ధనం ఎక్కువ ధనం ఆర్జించడానికి అవకాశం ఉంటుందన్న మాట! ఏ ఒక్కడితోనో వుంటే, అతను రోజూ ఎంత ధనం తెచ్చి ఇవ్వగలడు?

2. *దేశం కాలం స్థితిమాత్మనో గుణాన్ సౌభాగ్యం చ అన్యాభ్యో*
*న్యూనాతిరిక్తతాం చావేక్ష్య రజన్యామర్ఘం స్థాపయేత్.*

దేశ, కాల పరిస్థితులను గమనించి, తక్కిన వేశ్యలకన్నా తాను గొప్పదో లేక తక్కువదో ఆలోచించుకుని, ఆప్రకారం రాత్రులకు వెల నిర్ణయించి ప్రవర్తిస్తూ వుండాలి.

ఇక్కడ దేశకాల పరిస్థితులంటే - ఒక్కొక్క దేశంలోని వేశ్యాంగనలు తమతో సుఖించే పురుషులనుండి ఒక్కొక్క రకంగా ధనం వసూలు చేస్తుంటారు. రతి యొక్క విధానాన్ని బట్టి ఈ వెల నిర్ణయించడం జరుగుతున్నది . పూర్వ శరీరంతో సుఖపెడితే ఒక రకంగాను, శరీరంలోని క్రింది భాగంతో సుఖపెడితే ఒక విధంగాను - అంటే కాస్త ఎక్కువగాను, మొత్తం శరీరంలోని పూర్వాపర భాగాలతో రతి సాగిస్తే ఇంకా ఎక్కువగాను ధనం వసూలుచేసే అలవాటు వుంది. కాబట్టి అలాంటి పరిస్థితులు గమనించాలన్నమాట.

3. *గమ్యే దూతాంశ్చ ప్రయోజయేత్ తత్ప్రతి బద్ధాంశ్చ, స్వయం ప్రహిణుయాత్.*

నాయిక తన దూతలద్వారా నాయకుడి దగ్గరికి వర్తమానం పంపాలి. అతను తనకు రతిచేసే ఇష్టమైన పద్ధతిని సూచిస్తూ ఆ దూతల ద్వారా ప్రత్యుత్తరం పంపుతాడు. లేదా నాయకుడు వాంఛించే విధానం ఏదో వేశ్య అంతకు ముందే ఎరిగి ఉన్నట్లయితే, ఆ దూతలద్వారానే అతన్ని రప్పించుకోవచ్చు.

4. *ద్విస్త్రి రశ్చతురితి లాభాతిశయగ్రహార్థమేకస్యాపిగచ్ఛేత్,*
*పరిగ్రహ కల్పం నకలం చ చరేత్.*

అలా నాయికుణ్ణి తన దగ్గరికి రప్పించుకుని అతనితో రతి చేస్తే అతను ధనం ఇస్తాడు. నాయకుడు మరింతగా అనురాగం పొందితే తాను నిర్ణయించిన వెలకంటె ఎక్కువ ధనం ఇవ్వవచ్చు. ఇలా అధికంగా ధనం లభించటాన్ని 'లాభాతిశయం' అంటారు. ఇలాంటి లాభం మొట్టమొదటే లభిస్తే మంచిది. అలా లభించకపోతే అనుసరించవలసిన విధానం గురించి చెపుతున్నారు - ఇలా అధిక లాభం కోసం ఒక విటుడి దగ్గరికే ఒకే రాత్రి ఒకటి, రెండు, మూడు, నాలుగుసార్లు సంభోగించడానికి వెళ్ళాలి. అలా వెళ్ళేటప్పుడు ఇతరులెవరి వంకా కన్నెత్తి చూడకుండా స్వంత భార్య, భర్త దగ్గరికి వెళ్ళినట్లుగా వెళ్ళాలి.

5. *గమ్యయోగపద్యే తు లాభసామ్యే యద్ద్రవ్యార్థినీ*
*స్యాత్తద్దాయిని విశేషః ప్రత్యక్ష ఇత్యాచార్యాః.*

ఒకేసారి అనేకులు రతికి సిద్ధమై వస్తారనుకోండి. అందరూకూడా సమానంగానే ద్రవ్యం ఇస్తారనుకోండి. అప్పుడు ఎవరు ఇచ్చే వస్తువుపై తనకు ఎక్కువ ప్రీతి వుంటుందో, ఆవ్యక్తిపైనే అనుగ్రహ దృష్టి ప్రసరింపజేసి అతనితో సుఖించాలి. ఇది పూర్వాచార్యులు చెప్పిన మాట.

6. *అప్రత్యాదేయత్వాత్సర్వకార్యాణాం తన్మూలత్వాద్ధిరణ్యద ఇతి వాత్స్యాయనః.*

ఇక ఈ విషయంలో వాత్స్యాయనుల అభిప్రాయం - ఇచ్చి తిరిగి తీసుకోడానికి వీలులేనట్టిదీ, లోకంలో అత్యంత ప్రియమైనదీ, అయిన బంగారాన్ని ఇవ్వడానికి ఎవడైతే సిద్ధపడతాడో, అతన్ని అనుసరించడమే ఉత్తమమని వాత్స్యాయనులన్నారు.

7. *సువర్ణ రజత తామ్ర కాంస్య లోహ భాండోపస్కరాస్తరణప్రావరణవాసో విశేష గంధ ద్రవ్య కటుక భాండఘృతతైల ధాన్య పశుజాతీనాం పూర్వ పూర్వతో విశేషః*

8. *యత్తనసామ్యాద్వా ద్రవ్యసామ్యే మిత్రవాక్యాదతి పాతిత్వాదాయతితో గమ్యగుణతః ప్రీతితశ్చ విశేషః.*

పశువులకన్నా ధాన్యం గొప్పది . ధాన్యంకన్నా నూనెలు, నూనెలకన్నా నెయ్యి, అంతకన్నా నేతి పాత్రలు, వాటికన్నా మిరియాలు, జాపత్రి, జాజికాయ, మున్నగు వస్తువులు, వాటికన్నా సుగంధ ద్రవ్యాలు, అంతకన్నా వస్త్రాలు, వాటికన్నా తివాసీలు, వాటకన్నా రాగి, కంచు, ఇత్తడి, వెండి, బంగారాలు మున్నగు లోహాలతో తయారు చేసిన పాత్రలు అధికమైనవి. అయినప్పటికీ పట్టణాలలో గల అలవాట్లను అనుసరించిగానీ, ఒకే రకమైన వస్తువు ఇరువురు పురుషులు ఇవ్వడానికి సిద్ధపడినప్పుడు గానీ మిత్రుల మాటప్రకారం గానీ, ఉత్తమమైన వస్తువును గ్రహించి గుణం, ప్రేమ చూచుకొని సంభోగించాలి.

9. *రాగిత్యాగినోస్త్యాగిని విశేషః ప్రత్యక్ష ఇత్యాచార్యాః.*

అనురాగం కలవాడు, త్యాగబుద్ధి కలవాడు తటస్థపడినప్పుడు త్యాగ గుణం కలవాణ్ణే వేశ్య సంగ్రహించాలి. అతడే వేశ్యకు గొప్పవాడని పూర్వాచార్యులు చెపుతున్నారు.

10. *శక్యోహిరాగిణ్యే త్యాగ ఆధాతుం, లుబ్ధోఽపిహి క్షస్యజతి న తు త్యాగీ నిర్బంధాద్రజ్యత ఇతి వాత్స్యాయనః.*

ఇక వాత్స్యాయనుల సిద్ధాంతం - అనురాగం కలవాణ్ణి, ప్రయత్నం ద్వారా త్యాగవంతునిగా చేయవచ్చు. ఎంత లుబ్ధుడైనా సరే, అనురాగం . అనేది వుంటే త్యాగి అవుతాడు. కాని, త్యాగం కలవాడైనా పురుషుడు, అనురాగం లేకపోతే నిర్బంధంమీద కూడా సక్తుడు కాడని వాత్స్యాయనులు స్పష్టం చేస్తున్నారు.

11. *తత్రాపి ధనవద ధనవతోర్ధనవతి విశేషః త్యాగి ప్రయోజనకర్త్రోః ప్రయోజనకర్తరి విశేషః పత్యక్ష ఇత్యాచార్యాః.*

12. *ప్రయోజనకర్తా సకృత్కృత్వా కృతినమాత్మానమన్యతే త్యాగీ పునరతీతం నాపేక్షత ఇతి వాత్స్యాయనః.*

ధనవంతుడు, నిర్ధనుడు - వీరిరువురూ ఒకేమాటు రావడం తటస్థిస్తే - వీరిలో ధనవంతుణ్ణే ఉత్తముణ్ణిగా గ్రహించాలి వేశ్య. త్యాగవంతుడు, కార్యశూరుడు ఒకేసారి ప్రాప్తిస్తే కార్యశూరుని శ్రేష్ఠునిగా స్వీకరించాలి. ఇది పూర్వాచార్యులు వెలిబుచ్చిన అభిప్రాయం. కార్యశూరుడు వేశ్యకు తక్షణం అవసరమైన కార్యాలను ఒక్కమాటుగా

చేసి వేసి, తను కృతకృత్యుడైనట్లు భావిస్తాడు. త్యాగవంతుడు పూర్వం జరిగిపోయిన దాన్ని గురించి ఆలోచించడు. నిత్యం ధనం ఇస్తూ ఉంటాడు. ఇది వాత్స్యాయనులు చెప్పిన మాట.

*13. తత్రాప్యాయతితో విశేషః.*

*14. కృతజ్ఞత్యాగినోస్త్యాగిని విశేషః ప్రత్యక్ష ఇత్యాచార్యాః.*

హెచ్చు ఆదాయం వచ్చే మానవులలో విశేషం ఉంది. కృతజ్ఞుడు, త్యాగి ఒక్కమాటు వస్తే, త్యాగిలోనే గొప్పతనం ప్రత్యక్షంగా కాన వస్తుంది - అని పూర్వాచార్యులు అంటున్నారు.

*15. చిరమారాధితోఽపి త్యాగీ వ్యళీకమేక ముపలభ్య, ప్రతిగణికయా వా*
*మిథ్యాదూషితః శ్రమ మతీతమనాపేక్షతే, ప్రాయేణ హి తేజస్వినః*
*ఋజవోఽత్యాదృతాశ్చ త్యాగినో భవంతి, కృతజ్ఞస్తు పూర్వ శ్రమాపేక్షీ*
*న సహసా విరజ్యతే పరీక్షితశీలం త్వాచ్చ న మిథ్యా దూష్యత ఇతి వాత్స్యాయనః.*

త్యాగపురుషుణ్ణి ఎంతగా ఆరాధించినా నాయికలో ఒక్క తప్పు కనిపిస్తే ఆమెను దూషిస్తాడతను. అంతేకాని అప్పటివరకూ ఆమె తన విషయంలో చేసిన సేవగానీ, పడిన శ్రమగానీ గమనించడు. అంతేకాక ఆ తప్పిదాన్ని ఎప్పటికీ మరిచిపోడు. పైగా త్యాగవంతులు సాధారణంగా గొప్ప పౌరుషవంతులుగాను, సరి అయిన నడవడి కలవారుగాను ఉంటారు. అంచాత నామమాత్రపు దోషాన్ని కూడా సహించలేరు. కృతజ్ఞుడు అలా కాదు. పూర్వం నాయిక తనకోసం పడిన శ్రమ జ్ఞాపకం ఉంచుకుంటాడు. తొందరపడి విరక్తుడు కాదు. ఎంతగానో పరీక్షించే స్వభావం కలవాడు కాబట్టి అనవసరంగా దూషించడు - ఇది వాత్స్యాయనుల సిద్ధాంతం.

*16. తత్రప్యాయతితో విశేషః*

*17. మిత్రవచనార్థాగమయోరర్థాగమే విశేషః ప్రత్యక్ష ఇత్యాచార్యాః.*

పైన పేర్కొన్న ఇద్దరిలో ఆదాయాన్నిబట్టి కూడా ఒక విశేషం ఉంది. మిత్రవాక్యము, ధనాగమము ఒక్కసారే సంభవిస్తే, అర్థాగమంలో విశేషం ప్రత్యక్ష సిద్ధమని పూర్వాచార్యులన్నారు.

*18. సోఽపి, హ్యర్థాగమో భవితా మిత్రంతు సకృద్వాక్యే*
*ప్రతిహతే కలుషితం స్యాదితి వాత్స్యాయనః.*

*19. తత్రాప్యతిపాతతో విశేషః*

అర్థాగమం కూడా ఒకానొక కారణంచేత గొప్పది కావచ్చు. అయితే, స్నేహితుడు తన మాట ఒకసారి నిష్ప్రయోజనం అయిన తరువాత దోషగ్రస్తుడవుతాడు. అప్పుడతనివల్ల కావలసిన కార్యం పూర్తికాదు - ఇది వాత్స్యాయనుల అభిప్రాయం.

అందువల్ల వీరిలో కూడా ఆదాయాన్ని బట్టి విశేషాన్ని గమనించవలసి ఉంటుంది.

*20. తత్ర కార్యసందర్శనేన మిత్రమనునీయ శ్వోభూతేవచనమస్త్వితి*
*తతోఽతిపాతిమనర్థం ప్రతిగృహ్ణీయాత్.*

స్నేహితుడికి కోపం వస్తుందేమోనన్న భయం కలిగితే 'నీవు చెప్పినపని రేపు చేస్తాను' - అని అతనితో చెప్పి, ధనాన్ని స్వీకరించాలి.

21. అర్థాగమానర్థప్రతీఘాతయోః అర్థాగమే విశేషః ప్రత్యక్ష ఇత్యాచార్యాః.

22. అర్థః పరిమితావచ్ఛేదః అనర్థాః పునః సకృత్ప్రసృతోన
జ్ఞాయతేక్వావతిష్ఠత ఇతి వాత్స్యాయనః.

ధనం లభ్యమయ్యే సదుపాయమూ, అనర్థాన్ని తప్పించుకునే అవకాశమూ - ఈ రెండూ ఒకేసారి సంభవిస్తే, అప్పుడు ధనం రావడంలో గల సదుపాయమే ఉత్తమమైనదని, ఇది ప్రత్యక్షంగా గోచరిస్తున్నదని పూర్వాచార్యులు అంటున్నారు.

అయితే, ధనం అనేది ఏదో కొంత లెక్కలో మాత్రమే వస్తుందని, అనర్థం అనేది అలాకాక అనేకసార్లు విస్తరించి బాధిస్తుందని, ఆ అనర్థం ఎలా పరిణమిస్తుందో కూడా తెలియదని, వాత్స్యాయనులు వ్యక్తం చేస్తున్నారు.

*23. తత్రాపి గురులాఘవకృతో విశేషః.*

*24. ఏతేనార్థ సంశయాదనర్థ ప్రతీకారే విశేషోవ్యాఖ్యాతః.*

స్వల్పమైన అనర్థంకన్నా అధికమైన అనర్థం పెద్దదికదా! అంచాత ధనంకన్నా కూడా అనర్థ ప్రతీకారంలోనే విశేషం ఉన్నట్లు స్పష్టం అవుతూ ఉంది.

*25. దేవకుల తటాకారామాణాం, కరణం స్థలీనామగ్ని చైత్యానాం నిబంధనం,*
*గో సహస్రాణాం పాత్రాంతరితం బ్రాహ్మణేభ్యో దానం, దేవతానాం*
*పూజోపహారప్రవర్తనం, త ద్వ్యయ సహిష్ణోర్వా ధనస్య పరిగ్రహణం,*
*ఇత్యుత్తమ గణికానాం లాభాతిశయః.*

వేశ్యలు మూడు రకాలుగా ఉన్నారు. ఒకటి గణిక, రెండు రూపాజీవ, మూడు కుంభదాసి. వీరు వరుసగా ఉత్తమ, మధ్యమ, అధమలుగా పరిగణింపబడుతున్నారు.

దేవాలయ ప్రతిష్ఠకు, తటాక నిర్మాణానికి, ఆరామ నిర్మాణానికి, ఏరులపైన, కాలువలపైన వంతెనలు నిర్మించడానికి, ఊరిబయట మట్టి ఇళ్ళు కట్టించి వాటిలో అన్నిరకాల పదార్థాలు ఉంచి అగ్నిదేవుడికి అర్పించడానికి, గోగణాలను బ్రాహ్మణోత్తములకు దానం ఇప్పించడానికి, దేవతలకు పూజలు, ఉపచారాలు చెయ్యడానికి, అయ్యే ధనం ఉత్తమురాండ్రైన గణికలు సంపాదిస్తారు. ఉత్తమ గణికలకు వచ్చే లాభవిశేషాలు ఇవి.

*26. సార్వాంగికః అలంకారయోగః, గృహస్యోదారస్యకరణం, మహార్హైర్భాండైః*
*పరిచారకైశ్చ గృహ పరిచ్ఛదస్యోజ్జ్వలతేతి, రూప జీవానాం లాభాతిశయః.*

దేహానికి అలంకారాలు సమకూర్చుకోడానికి, పెద్దది, అందమైనది అయిన ఇల్లు కట్టుకోడానికి, విలువైన పాత్రలు, గృహోపకరణాలు సంపాదించుకోడానికి,

సేవకులను ఏర్పాటు చేసుకోడానికి అవసరమైన ధనాన్ని మధ్యరకం వేశ్యలైన రూపాజీవలు ధనం సంపాదించాలి. ఇదే వారి లాభాతిశయం.

27. *నిత్యం శుక్లమాచ్ఛాదన మపక్షుధమన్న పానం నిత్యం సౌగంధికేన తాంబూలేన చ యోగః సహిరణ్య భాగమలంకరణ మితి కుంభదాసీనాం లాభాతిశయః.*

ఇక అధమ రకం వేశ్య కుంభదాసి ఉంది. ఎల్లప్పుడూ తెల్లటి దుస్తులు ధరించడానికీ, మనస్సులోని కలత పోగొట్టి ఆకలి తీర్చే అన్నం సంపాదించుకోడానికీ, పానీయాలకోసం, పరిమళ ద్రవ్యాలతో కూడిన తాంబూలం ఎల్లప్పుడూ లభించడానికీ, బంగారు నగలు ధరించడానికీ ఈ కుంభదాసీకి ధనం అవసరం అవుతుంది. ఇదే వీరి లాభాతిశయం.

28. *ఏతేన ప్రదేశేన మధ్యమాధమానామపి లాభాతి శయాన్సర్వాసామేవ యోజయే దిత్యాచార్యాః.*

ఉత్తమశ్రేణికి చెందిన వేశ్యల లాభాతిశయాల ద్వారానే మధ్యమ, అధమ తరగతుల వేశ్యల లాభాతిశయాలు కూడా తెలుసుకోవలసి ఉంటుంది. అంటే, పైన పేర్కొన్న క్రమంలోనే ఉత్తమ, మధ్యమ, అధమ వేశ్యలు ఎవరో నిర్ణయించాలన్నమాట.

29. *దేశకాల విభవ సామర్థ్యానురాగ లోక ప్రకృతివశా దనియత లాభాధియమవృత్తిరితి వాత్స్యాయనః.*

దేశం సంపన్నమై ఉన్నా లేకపోయినా, కాలం సుభిక్షంగా ఉన్నా, ఉండకపోయినా, తన వైభవం స్వల్పంగా ఉన్నా, అధికంగా ఉన్నా, సామర్థ్యం ఉన్నా లేకపోయినా, నాయకుడి అనురాగం, అల్పంగా ఉన్నా లేక అధికంగా ఉన్నా, ఆయా అవస్థా విశేషాలను అనుసరించి ధనలాభం లెక్క కట్టడానికి వీలులేదు. అనుకున్న దానికన్నా ఒకప్పుడు ఎక్కువ ధనం లభించవచ్చు; మరొకప్పుడు తక్కువ ధనం లభించవచ్చు.

30. *గమ్యమన్యతో నివారయితుకామా, సక్త మన్యస్యామపహర్తుకామావా,*
*అన్యాం వా లభతోవియుయుక్షమాణా, గమ్యసంసర్గాదాత్మనః*
*స్థానం వృద్ధిమాయతి మభిగమ్యతాం చ మన్యమానా,*
*అనర్థప్రతీకారే వా సాహాయ్యమేనం కారయితు కామా, సక్తస్య వాన్యస్య*
*వ్యళీకార్థినీ పూర్వోపకార మకృత మివ పశ్యంతీ, కేవలప్రీత్యర్థినీ వా,*
*కల్యాణబుద్ధిః అల్పమపి లాభం ప్రతిగృహ్ణీయాత్.*

ఒక్కొక్కప్పుడు వేశ్య స్వల్ప లాభంకోసం కూడా సంగమించవలసి వస్తుంది. ఈ విషయాన్ని నిరూపిస్తూ అందుకు కారణాలు చెపుతున్నారు. తన నాయకుడి మనస్సు ఇతర స్త్రీలనుండి మళ్ళించడానికీ, తక్కిన వేశ్యలపట్ల ఆసక్తుడై ఉన్న వాణ్ణి తనవైపు తిప్పుకోడానికీ, తోటి వేశ్యలకు వచ్చే లాభాన్ని పడగొట్టడానికీ, అతనితో సంభోగించడంవల్ల తనకు గౌరవ ప్రతిష్ఠలు, అభివృద్ధి, కీర్తి, ధనలాభం లభిస్తాయనీ, తనకు రానున్న ఆపదకు ప్రతిక్రియచేయడానికిగాను సహాయం

అర్థించడానికీ, తనపై అనురాగం ఉన్నా, మరో స్త్రీని ఆశ్రయించి ఉన్న నాయకుణ్ణి-అతను అంతకు ముందు ఎంత ఉపకారం చేసి ఉన్నప్పడికీ అది లెక్క-చెయ్యకుండా అతనిపై నేరం మోపి ఇబ్బంది పెట్టడానికీ, కేవలం ప్రేమాతిశయంవల్ల గానీ, బుద్ధిమంతుడని గానీ స్వల్ప లాభానికే ఒక్కొక్కప్పుడు సంగమించవలసి వస్తుంది వేశ్య.

*31. ఆయత్యర్థినీ తు తమాశ్రితానర్థం ప్రతిచికీర్షంతీనైవ ప్రతిగృహ్ణీయాత్.*

*32. త్యక్ష్య మ్యేన మన్యతఃప్రతినంధాస్యామి, గమిష్యతి దారైర్యోక్ష్యతే,*
*నాశయిష్యత్యనర్థాన్, అంకుశభూతః ఉత్తరాధ్యక్షోZస్యాగమిష్యతి*
*స్వామీ పితా వా, స్థానభ్రంశో వాZన్య భవిష్యతి*
*చలచిత్తశ్చేతి మన్యమానా తదాత్వే తస్మాల్లాభమిచ్ఛేత్.*

ముందు ముందు తనకు వచ్చే అనర్థాలు తొలగించుకోవాలన్న అభిప్రాయంతో ఉన్న వేశ్య అనర్థ ప్రతీకారంకోసం నాయకుడితో సంగమిస్తూ ఏమాత్రం ధనలాభాన్ని కోరకూడదు. అతన్ని విడిచిపెట్టాలనుకున్నప్పుడు, మరి ఒకతెను అతనికి ఒప్పచెపుదామనుకున్నప్పుడు, భార్యను కలుసుకోబోతున్నాడని గాని, గొప్ప ధనం తన ఆధీనంలో ఉంచుకునాన్నడని గాని, అతనికి అంకుశంలాంటి వారైన ప్రభువు లేదా తండ్రి వస్తాడనిగాని, అతినకి స్థానభ్రంశం కలుగుతుందనిగాని, చపల చిత్తుడనిగాని, తాత్కాలికంగా స్వల్పలాభం అపేక్షించే, వేశ్య పురుషుడితో సంభోగిస్తుంది.

*33. ప్రతిజ్ఞాత మిశ్వరేణ ప్రతిగ్రహం, లప్స్యతే, అధికరణం స్థానం వా ప్రాప్స్యతి,*
*వృత్తికాలోస్య వాసన్నః, వాహనమస్యాగమిష్యతి, సస్యమస్య పక్ష్యతే కృతమస్మిన్న*
*నశ్యతి, నిత్యమవిసంవాదకో వేత్యాయత్యామిచ్ఛేత్, పరిగ్రహత్వం చా స్యాచరేత్.*

ముందు ముందు ప్రభువులవల్ల వాగ్దానం చేయబడిన గొప్ప కానుకలు పొందబోతున్నాడని గానీ, గొప్పపదవి, లేదా అధికారం పొందబోతున్నాడని గానీ, అతని మంచి వృత్తి ప్రాప్తించబోతున్నదని గానీ, అతనికి వాహనయోగం పట్టబోతున్నదని గానీ, అపారమైన పంట అతని చేతికి చిక్కబోతున్నదనిగానీ, అతనికి మేలుచేస్తే, అది వృథాగా పోదన్న అభిప్రాయంతో గానీ, ఆడితప్పని వాడనిగానీ - ఇలాంటి ఊహలతో అతని పొందు కోరవలసి ఉంటుంది. అతని నుండి స్వల్పధనం కూడా ప్రస్తుతానికి తీసుకోవచ్చు.

*34. భవంతిశ్చాత్ర శ్లోకాః - కృచ్ఛ్రాధిగతవిత్తాంశ్చ రాజవల్ల భ నిష్ఠూరాన్*
*ఆయత్యాం చ తదాత్వే చ దూరాదేవ వివర్జయేత్.*

*35. అనర్థో వర్జనే యేషాం గమనేZభ్యుదయస్తథా*
*ప్రయత్నేనాపి తాన్గత్వా సాపదేశ ముపక్రమేత్.*

ఎంతో కష్టపడి ధనం సంపాదించిన వాళ్ళను, రాజులకు ఇష్టులుగా ఉండేవాళ్ళను, అతి క్రూరులుగా ఉండేవాళ్ళను, ముందు ముందు కూడా ఎందుకూ

ఉపయోగపడని వాళ్ళను వేశ్య తన దగ్గరికి చేరనివ్వకూడదు. ఏ పురుషులను విడిచిపెడితే, అనర్థం వచ్చి పడుతుందో ఆ పురుషులను విడిచిపెట్టరాదు. ఎవరితో సంభోగిస్తే అభ్యుదయం చేకూరుతుందో, అలాంటి వారిని ప్రయత్న పూర్వకంగా పొందవలసి ఉంటుంది.

36. *ప్రసన్నాzయే ప్రయచ్ఛంతి స్వల్పేప్యగణితం వసు,*
*స్థూలలక్షాన్మహోత్సాహం స్తాగచ్ఛే త్ప్రిరపి వ్యయైః*

ఆహ్లాద పూరితమైన మందహాసంతో పలకరించి, మనస్ఫూర్తిగా స్వల్పమైన ధనం లెక్కచెయ్యకుండా ఏ పురుషులైతే అర్పిస్తారో, అలాంటి వదాన్య బుద్ధి గలవారిని తన ధనం ఖర్చుపెట్టుకుని ప్రయాణం చేసి వెళ్ళివారిని కలుసుకోవాలి, సంభోగించాలి.

**ఇది వాత్స్యాయన ముని విరచిత కామసూత్రాల్లో వైశికం అనే ఆరో అధికరణంలో లాభ విశేషం అనే అయిదో అధ్యాయం.**



# షష్ఠాధ్యాయం
## అర్థానర్థానుబంధ సంశయ విచారం



*1. అర్థానాచర్యమాణా ననర్థా అప్యనూద్భవంతి అనుబంధాః సంశయాశ్చ*

ధన సంపాదనకు ఎప్పుడైతే ఒడిగడతామో అప్పుడే అర్థాలు, అనర్థాలు కూడా - ఆ అర్థాలను అనుసరించే ప్రాప్తిస్తుంటాయి. ఆ అర్థానర్థాలే కాకుండా, వాటికి సంబంధించిన ఇతర సంశయాలు సయితం సంభవిస్తూ ఉండడం సహజం.

*2. తే బుద్ధిదౌర్బల్యాదతిరాగా దత్యభిమానాదతి దంభాత్ ఆత్యార్జవా దతి విశ్వాసా దతిక్రోధాత్ప్రమాదా త్సాహసాద్దైవయోగాచ్చ స్యుః*

ధనం, దానికి సంబంధించినవీ ప్రాప్తించినప్పుడు వాటిని పరిగ్రహించవచ్చు. ఆక్షేపణలేదు. కాని అర్థం విషయంలో కొందరికి సందేహం కూడా కలుగుతూ ఉంటుంది. పోతే అనర్థాలు, వాటికి సంబంధించిన అనుబంధాలు గాని, సంశయాలుగాని పరిగ్రహించదగినవికావు. అందువల్ల అవి ఎలా సంభవిస్తున్నాయో ఆ కారణాలను గురించి ఇక్కడ చెపుతున్నారు.

తెలివితక్కువ వల్ల గానీ, ఎక్కువ అనురాగంతో ఉండడం వల్ల గానీ, అధికమైన అభిమానం మూలంగాగానీ, గర్వాతిశయం వల్లగానీ, అతి మంచితనం వల్లగానీ, అధికమైన విశ్వాసం వల్లగానీ, అతి క్రోధం వల్లగానీ, పొరపాటువల్లగానీ లేక అతి సాహసంవల్లగానీ - ఇవేవీ కాకుండా దైవయోగం వల్లగానీ పైనచెప్పిన అనర్థాలు వాటిల్లుతూ ఉంటాయి. మానవుల్లో సాధారణంగా పందొమ్మిదిపాళ్ళు మానవుల వైఖరివల్ల, ఒక పాలు దైవయోగం వల్ల అనర్థాలు సంభవిస్తాయని పెద్దలు చెపుతున్నారు.

*3. తేషాం ఫలం కృతస్య వ్యయస్య నిష్ఫలత్వం, అనాయతిః ఆగమిష్యతోఽర్థస్య నివర్తనం, ఆప్తస్య నిష్క్రమణం, పారుష్యస్య ప్రాప్తిః ఆపరిచయతాః శరీరస్యప్రమాతః కేశానాం ఛేదనం, అంగవైకల్య స్యాపత్తిరితి.*

ఈ అనర్థాలు, వాటి అనుబంధాలు, సంశయాలు మొదలైన వాటికి ఫలితం ఏమిటో చెపుతున్నారు - పురుషుణ్ణి పొందడానికై చేసిన ధనవ్యయం యావత్తూ నిష్ప్రయోజనం కావడం, తన పేరు ప్రతిష్టలు మంట కలియడం, వస్తుందనుకున్న లాభానికి ఎవరో అడ్డు తగలడం, ధనం లభించికూడా అది మధ్యవర్తుల వల్ల అపహరించబడడం, నిందలపాలు కావడం, మరెవరి పరిచయమూ లభించకపోవడం, దేహానికే ప్రమాదం సంభవించడం, కేశఖండనం, అంగవైకల్యం లాంటివి కలిగే ఫలితాలు.

*4. తస్మాత్తానాదిత ఏవ పరిజిహీర్షే దర్థ భూయిష్ఠాంశ్చ ఉపేక్షేతే.*

కాబట్టి బుద్ధి దౌర్బల్యాదులను మొట్టమొదటే తొలగించుకోవాలి. ధనప్రాప్తికి కారణాలు ఏవో, వాటిని అంగీకరించి తీరాలి.

*5. అర్థో ధర్మః కామ ఇత్యర్థ త్రివర్గః అనర్థః అధర్మః ద్వేషః ఇత్యనర్థత్రివర్గః*

ఇక ఇప్పుడు అర్థానర్థాలలో గల అనుబంధాలను నిరనుబంధాలను గురించి విచారణ చేస్తున్నారు. పురుషార్థాలు నాలుగింటిలో ఉన్న అర్థం, ధర్మం, కామం - ఈ మూటినీ అర్థ త్రివర్గం అని అంటారు. వీటికి మూలమైన అర్థానర్థానుబంధ సంశయ విచారం ఇప్పుడు చేస్తున్నారు కాబట్టి, ధర్మాధర్మాలను గురించి, కామద్వేషాలను గురించి ఇక్కడ చెప్పవలసి వచ్చింది.

*6. తేష్వాచర్యమాణేష్వన్యస్యాపి నిష్పత్తి రనుబంధః*

పైన చెప్పిన అర్థాదులు ఆరింటిలోనూ ఏ ఒక్కదాన్ని సాధిస్తున్నప్పటికీ తక్కిన అయిదూ ప్రాప్తించడాన్నే అనుబంధం అంటారు.

*7. సందిగ్ధాయాం తు ఫలప్రాప్తౌ స్యాద్వాన వేతి శుద్ధసంశయః*

ఒక దానికి ఫలితం లభిస్తుందా? లభించదా? అన్న సందేహం కలిగితే దాన్ని శుద్ధ సంశయం అంటారు. ఫలానా వాడితో రతి సాగిస్తే ఇది సంక్రమిస్తుందేమో అన్న సందేహం కలగడాన్ని, సంకీర్ణ సందేహం అంటారు.

*8. ఏకస్మిన్కార్యే క్రియమాణే కార్యద్వయస్యోత్పత్తి రుభయతో యోగః*

*9. సమంతాదుత్పత్తిస్సమంతతోయోగః ఇతి తానుదాహరిష్యామః*

ఒక పనికోసం ప్రయత్నం చేస్తూ ఉంటే దానితోపాటు మరోపని కూడా తటస్థిస్తే దాన్ని ఉభయతోయోగం అంటారు. ఒక పనిచేయబూనినప్పుడు అర్థాలు, అనర్థాలు కూడా అనేకం తటస్థిస్తే దాన్ని సమంతతో యోగం అంటారు. ఇక వాటికి ఉదాహరణలు చెపుతున్నారు -

*10. విచారితరూపోఽర్థ త్రివర్గః*

జాగ్రత్తగా ఆలోచనచేసి ప్రవర్తిస్తే అర్థ త్రివర్గం ప్రాప్తిస్తుంది. ఆలోచన లేకుండా, తెలివి తక్కువగా ప్రవర్తిస్తే అనర్థత్రివర్గం ప్రాప్తిస్తుంది.

*11.* యస్యోత్తమస్యాభిగమనే ప్రత్యక్షతోర్థలాభః గ్రహణీయత్వమాయతి ంాగమః ప్రార్థనీయత్వం చాన్యేషాం స్యాత్సోఽర్థో అర్థానుబంధః

*12.* లాభమాత్రే కస్య చిదన్యస్య గమనం, సోర్థో నిరనుబంధః

*13.* అన్యార్థ పరిగ్రహే నక్తాదాయతిచ్ఛేదనం, అర్థస్య నిష్క్రమణం, లోకవిద్విష్టస్య వా నీచస్య గమమాయత్నిఘ్న మర్థోఽనర్థానుబంధః

*14.* స్వేనవ్యయేన శూరస్య మహామాత్రస్య ప్రభావతో వా లుబ్ధస్య గమనం

- నిష్ఫలమపి వ్యసన ప్రతీకారార్థం మహాతశ్చార్థఘ్నస్య నిమిత్తస్య ప్రశమనమాయతి జననం చ సోఽనర్థో ఽర్థానుబంధః

*15.* కదర్యస్య సుభగమానినః కృతఘ్నస్య వా అతిసంధాన శీలస్య స్వైరపి వ్యయైః తదారాధన మపి నిష్ఫలం సోఽనర్థో నిరనుబంధః.

*16.* తస్యైవ రాజవల్లభస్య క్రౌర్య ప్రభావా దధికస్య తథైవారాధన మంతే నిష్ఫలం నిష్కాసనం చ రోషకరంసోఽనర్థోఽనర్థానుబంధః.

*17.* ఏవం ధర్మ కామయోరపి అనుబంధాన్యోజయేత్

ఉత్తముడైన పురుషుడితో సంభోగించడం వల్ల వేశ్యకు ప్రత్యక్షంగానే ధనలాభం చేకూరుతుంది. అంతేకాక పేరు - ప్రతిష్టలు, గౌరవమర్యాదలు, ప్రజల్లో ఆదర్శవంతులుగా పేరు తెచ్చుకోవడం, ఇతరుల నుండి ప్రశంసలు పొందడం జరుగుతుంది. దీన్నే అర్థానుబంధం అంటారు. అంటే తక్కిన రకాలైన లాభాలు ఏవీ ఉండవన్నమాట. ధనం కోలుపోయి, పరులధనం అపహరించడంలో ఆసక్తి కలవాడితో సంభోగిస్తే వేశ్యకు అంతకు ముందున్న పేరు - ప్రతిష్టలు ప్రభావం మట్టికొట్టుకునిపోతాయి. ఉన్న ధనం కూడా పోతుంది. లోకంలో అందరూ ద్వేషించే వాడితో గానీ, నీచుడితో గానీ పొత్తు పెట్టుకోడం జరుగుతుంది. దీన్నే అనర్థానుబంధం అంటారు. తన ధనవ్యయంతోనే గొప్ప శూరుడు, మహాసామంతుడు, ప్రభువు అయిన పిసినారితో సంగమిస్తే, అది కేవలం వ్యసనాన్ని పోగొట్టుకోడం కోసం చేసే పని అవుతుంది. అందువల్ల అనర్థమైనా అందులో అర్థానుబంధం ఉంది. ధూర్తుడు, కృతఘ్నుడు, తాను అందగాడినని పొంగిపోయేవాడు, సంధికార్యాలు చెడగొట్టేవాడు, అయినవాడితో సంభోగిస్తే, అతని కోసం తన ధనం వెచ్చించినా అదంతా వ్యర్థమే అవుతుంది. ఈ అనర్థం అనుబంధం లేనిదని అంటారు అందుకే. అలాంటి రాజబంధువుల క్రూరమైన, అపసవ్యమైన పద్ధతులలో అధికుడైనవాడు అయిన వ్యక్తితో తన ధనవ్యయంతో సంగమిస్తే అది నిష్ఫలం అవుతుంది. వెడలగొట్టిలే దోషం ప్రాప్తిస్తుంది. ఈ అనర్థాన్ని అనర్థానుబంధం అంటారు. ఇలా ధర్మం, కామం అనుబంధాలను జతకూర్చుకుని చూచుకోవలసిఉంటుంది.

19. పరస్పరేణ చ యుక్త్యా సంకిరేదిత్యనుబంధాః

20. పరితోషితోఽపి దాస్యతి న వేత్యర్థ సంశయః

21. నిష్పీడితార్థ మఫల ముత్సృజంత్యా అర్థమలభమా నాయా
ధర్మస్స్యాన్న వేతి ధర్మసంశయః

22. అభిప్రేతమనుపలభ్య పరిచారక మన్యం వా క్షుద్రం గత్వాకామస్స్యాన్న వేతి కామసంశయః

23. ప్రభావవాన్ క్షుద్రో అనభిమతోఽనర్థం కరిష్యతి న వేత్య నర్థసంశయః.

24. అత్యంత నిష్ఫలస్సక్తఃపరిత్యక్తః పితృలోకం యాయా త్తత్రాధర్మ స్స్యాన్న వేత్య ధర్మసంశయః

సంకీర్ణ సందేహాలను పరస్పరంగాను, యుక్తిగాను కూడా సృష్టించవచ్చు. ఒకడు ఒక వేశ్య వల్ల తృప్తి పడినప్పటికీ అతను ధనం ఇస్తాడా, ఇవ్వడా అన్న సందేహం కలిగితే, దాన్ని అర్థ సంశయం అంటారు. ధనం యావత్తూ గుంజుకుని, వ్యర్థుడైన అతన్ని విడిచివెయ్యడం ధర్మమా, కాదా? అన్న సందేహం కలగడాన్ని ధర్మ సంశయం అంటారు. తాను అభిలషించిన సుందరుణ్ణి పొందలేక, ఏ సేవకుడితోనో లేక ఏ అల్పుడితోనో సంభోగిస్తే, అది కామం అవుతుందా, కాదా? - అని సందేహపడడాన్ని కామ సంశయం అంటారు. తాను పొందబోయే విటుడిపై తనకు ఇష్టం ఉన్నా, లేకున్నా అతడు నీచుడు కాబట్టి అతనితో పోకపోతే ఏదో అనర్థం తెచ్చిపెడతాడేమో అని సంశయించడం అనర్థసంశయం. పనికిమాలినవాడైనా తనపై తీపి వదలలేనివాణ్ణి వదిలేస్తే వాడు తట్టుకోలేక ప్రాణం విడుస్తాడు. అప్పుడు తనకు అధర్మం ప్రాప్తిస్తుందా, ప్రాప్తించదా అనేదాన్ని అధర్మ సంశయం అంటారు.

25. రాగస్యాఽపి విపక్షయాం అభిప్రేత మనుపలభ్య విరాగః
స్యాన్న వేతి ద్వేషసంశయ ఇతి శుద్ధ సంశయాః.

26. అథ సంకీర్ణాః.

27. ఆగంతో రవిదితశీలస్య వల్లభసంశ్రయస్య ప్రభవిష్ణోర్వా
సముపస్థితస్యారాధన మర్థోఽనర్థ ఇతి సంశయః.

28. శ్రోత్రియస్య బ్రహ్మచారిణో దీక్షితస్య వ్రతినో లింగినోవా
మాం దృష్ట్వా జాతరాగస్యము మూర్షోర్మిత్ర వాక్యాదా
నృశంస్యాచ్చ గమనం ధర్మోఽధర్మ ఇతి సంశయః

29. లోకా దేవాకృత ప్రత్యయాదగుణో గుణ వాన్వేత్యనపేక్ష్య
గమనం కామోద్వేష ఇతి సంశయః.

30. సంకిరేచ్చ పరస్పరేణేతి సంకీర్ణ సంశయాః.

అనురాగం అధికమై, తన సొగసుగాణ్ణి పొందలేక ఇతను విరక్తుడా, కాదా? ఇతను నాలో ఏదైనా దోషం కనిపెట్టాడా, లేదా? అనే రెండు రకాల సంశయాలు

ఏర్పడితే వాటిని శుద్ధ సంశయాలని అంటారు. ఇక సంకీర్ణ సంశయాల సంగతి - కొత్తగా ఎక్కడ నుంచో వచ్చిన వాడి స్వభావ స్వరూపాలు ఏమిటో తనకు తెలియవు. అతను రాజాశ్రితుడు, ప్రభుత్వంలో ఉన్నవాడు అయి వుండి, తన దగ్గరికి వచ్చినప్పుడు అతనితో సంభోగించడం అనర్థమా లేక అర్థదాయకమా? అనే సందేహాన్ని అర్థానర్థ సంశయం అంటారు. శ్రోత్రియుడు, బ్రహ్మచారి, దీక్షితుడు, యతీశ్వరుడు అయినవాడు తనను చూడగానే మోహంలో మునిగిపోతాడు. అతనితో సంగమించకపోతే చనిపోతాడు. దయతోనో, ప్రార్థనల వల్లనో అతనితో పొందుకు అంగీకరించడం ధర్మమా అధర్మమా? అనే సంశయాన్ని ధర్మాధర్మ సంశయం అంటారు. సమాజంపై కోపంతో, ఇతను గుణవంతుడా, కాదా అని విచారణ చేయకుండా ఎవడితో బడితే వాడితో రతి చేయడం కామమా, ద్వేషమా? - అనేది మరొక సంకీర్ణ సంశయం. ఇలాగే పరస్పర విరుద్ధాలైన సంశయాలు ఎదురైతే వాటిని సంకీర్ణ సంశయాలు అంటారు.

*31. యత్ర పరస్యాభిగమనేఽర్థః నక్తాచ్చ సంఘర్షితః న ఉభయతోఽర్థః.*

*32. యత్ర స్వేన వ్యయేన నిష్ఫలమభి గమనం నక్తాచ్చ*
*మర్షితా ద్విత్తప్రత్యాదానం న తూ భయతోఽనర్థః.*

*33. యత్రాభిగమనేఽర్థో భవిష్యతి న వేత్యాశంకా*
*నక్తోపి సంఘర్షాద్దాస్యతి న వేతి న ఉభయతోఽర్థ సంశయః*

*34. యత్రాభిగమనే వ్యయవతి పూర్వోవిరుద్ధః*
*క్రోధాదపకారం కరిష్యతి న వేతి నక్తో వా మర్షితో దత్తం*
*ప్రత్యాదాస్యతి న వేతి న ఉభయతోఽనర్థ సంశయః*
*ఇత్యౌద్ధాలకే రుభయతో యోగాః.*

ఒక విటుడితో సంగమిస్తే, అతనివల్లా, అంతకు ముందు తను సంబంధం పెట్టుకున్న విటుడివల్లా కూడా ధనం లభిస్తూ వుంటే దాన్ని ఉభయతోర్థం అంటారు. తన వ్యయంతోనే ఒక వ్యక్తితో పోతే, అది వ్యర్థమై పూర్వం పెట్టుకున్న విటుడివల్ల చీవాట్లు తినడం, ధనం కూడా పోవడం - ఇలా రెంటికీ చెడిన రేవడు కావడం జరిగితే దాన్ని ఉభయత్రో అనర్థం అంటారు. ఒకడితో సంభోగిస్తే ధనలాభం వుంటుందా, ఉండదా? - అనే సంశయం కలిగితేనూ, తనపై అభిలాష వున్నా పోటీపడి తగినంత ధనం ఇస్తాడా, ఇవ్వడా అనే సందేహం కూడా కలిగితేనూ, అప్పుడు రెండు విధాలుగా అర్థ సంశయం ఏర్పడుతున్నది. ఎక్కువ ధనం ఖర్చు పెట్టుకుని సంగమిస్తే పూర్వం వున్న విటుడికి కోపం వచ్చి, అపకారం తలపెడతాడేమో అన్న సంశయం కలుగుతుంది. అలాగే ఇప్పుడు తనతో సంగమించిన విటుడు ఆగ్రహంతో ఇచ్చిన ధనం సయితం తిరిగి లాక్కుంటాడేమో అన్న సందేహం కలుగుతుంది. దీన్ని ఉభయితో అనర్థయోగం అంటారు. ఔద్దాలకి చెప్పిన ఉభయతో యోగాలు ఇవి.

*35. బాభ్రవీయాస్తు - యత్రాభిగమనేఽర్థోఽనభి గమనే చనక్తాదర్థః న ఉభయతోఽర్థః.*

36. యత్రాభిగమనే నిష్ఫలో వ్యయః అనభిగమనే చ నిష్ప్రతీకారో౽నర్థః న ఉభయతో౽నర్థః.

37. యత్రాభిగమనే నిర్వ్యయో దాస్యతి న వేతి సంశయో౽నభిగమనే
సక్తోదాస్యతి న వేతి న ఉభయతో౽ర్థ సంశయః.

38. యత్రాభిగమనే వ్యయవతి పూర్వో విరుద్ధః ప్రభావవాన్
ప్రాప్స్యతే న వేతి న ఉభయతో౽నర్థసంశయః.

39. ఏతేషామేవ వ్యతికరే అన్యతో౽ర్థో అన్యతో౽నర్థః.

40. అన్యతోర్థో అన్యతో౽ర్థసంశయః.

41. అన్యతోర్థో౽న్యతో౽నర్థ సంశయః.

42. అన్యతో౽నర్థో౽న్యతోర్థ సంశయః.

43. అన్యతో౽నర్థో౽న్యతోర్థసంశయః.

44. అన్యతోర్థసంశయో౽న్యతో౽నర్థసంశయ ఇతి షట్ సంకీర్ణయోగాః.

మరొకడితో సంగమించడంవల్ల ధనం వస్తుంది. సంకమించకుండా వుంటే పూర్వం వున్నవాడివల్ల ధనం వస్తుంది. దీన్ని ఉభయతోర్థం అంటారు. అలాగే మరొకడితో సంభోగించడంవల్ల ధన వ్యయం, నైష్ఫల్యం ప్రాప్తిస్తాయి. సంభోగించకపోతే ప్రతిక్రియలేని అనర్థం వస్తుంది. దీన్ని ఉభయతోనర్థం అంటారు. ఏ సంభోగం వల్ల పూర్వం ఉన్నవాడు విరోధి అవుతాడో, ప్రభావం కలవాడు దొరుకుతాడా దొరకడా అనే సంశయం ఏర్పడుతుందో, వాడితో పోకపోతే కోపంతో అనర్థం తెచ్చిపెడతాడని, సందేహం కలుగుతుందో, దాన్ని ఉభయతో అనర్థ సంశయం అంటారు. వీటి వ్యతిరేకంగా జరిగితే అన్యతోర్థము, అన్యతోనర్థము, అన్యతోర్థము, అన్యతోర్థ సంశయము, అన్యతోనర్థము, అన్యతోనర్థాసంశయము, అన్యతోర్థ సంశయము - ఇలా మొత్తం ఆరు సంకీర్ణ యోగాలు ఏర్పడతాయి. బాభ్రవీయులు చెప్పిన యోగాలు ఇవి.

45. తేషు సహాయైస్సహ విమృశ్య యతో౽భూయి ష్ఠో౽ర్థ సంశయః,
గురుసర్థప్రశమో వాతతః ప్రవర్తేత.

46. ఏవం ధర్మ కామావప్యనయైవ యుక్త్యా ఉదాహరేత్,
సంకిరేచ్ఛ పరస్పరేణ వ్యతిషం జయేచ్ఛేత్యుభయతో యోగాః.

శుద్ధ సంకీర్ణ యోగాలను గురించి ఇంతకు ముందు చెప్పిన పీతమర్దాది సహాయులతో ఆలోచించి, ఏ యోగం వల్ల ధనం అధికంగా వస్తుందో, ఏ యోగం వల్ల అర్థ సంశయం ఏర్పడుతుందో, ఏ యోగం వల్ల గొప్ప అనర్థం తొలగిపోతుందో, గమనించి సరియైన మార్గం అనుసరించాలి. ఇదే విధంగా ధర్మం, కామం గురించి కూడా ఉదాహరణలు చూచుకోవాలి. ధర్మ కామాలకు సంకీర్ణం ఏర్పరచుకోవాలి. మార్పు కూడా వచ్చేలా చూడాలి. వీటినే ఉభయతో యోగాలని అంటారు.

47. సంభూయ చ. విటాః పరిగృహ్ణంత్యేకామసౌ గోష్ఠి పరిగ్రహః.

పలువురు విటులు ఒక చోట గుంపుకూడి ఒకే వేశ్యతో సంగమిస్తేదాన్ని గోష్ఠి పరిగ్రహం అంటారు. విటులు ఎంతో మైత్రి, అన్యోన్యత కలవారైతే తప్ప ఇది జరగదు.

48. సా తేషామితస్తతః సంప్రయ్యమానా ప్రత్యేకం సంఘర్షాదర్థం నిర్వర్తయేత్.

పైన చెప్పిన సందర్భాల్లో వేశ్య ఒక నియమం అంటూ లేకుండా అనేక మందితో కామకేళి సాగిస్తూ, అందరి దగ్గర నుంచి ధనం గుంజుతూ ఉండాలి.

49. సువసంతకాదిషు చ యో మ ఇమ మముంచ మనో రథం సాధయిష్యతి
తస్యాద్య గమిష్యతి మే దుహి తేతి మాత్రా వాచయేత్.

50. తేషాం చ సంఘర్షజేఽభిగమనే కార్యాణి లక్షయేత్.

అనేక మంది పురుషులు ఒకే వేశ్యను మరిగినప్పుడు ఘర్షణలు జరగడం, స్పర్థలు రావడం సహజం. దానికి కారణాలు చెపుతున్నారు. వసంతకాది ఉత్సవాలలో వేశ్యమాత విటుల దగ్గరచేరి, 'ఎవరు నా కోరికలు తీరిస్తే, వారితోనే నా కూతురు పోతుంది.'- అని చెప్పాలి. ఇలా వేశ్య మాత చెప్పినప్పుడు విటులలో పోటీ వస్తుంది. ఒకరి కంటె ఒకరు ఎక్కువ ధనం ఇస్తామంటారు. అప్పుడు ఎవరు ఎక్కువ ధనం ఇస్తారో గమనించాలి.

51. ఏకతోఽర్థం, సర్వతోఽర్థం, ఏకతోఽనర్థః, సర్వతోఽనర్థః, అర్థతోఽర్థః
సర్వతోఽరః, అర్థతోఽనర్థః, సర్వతోఽనర్థః, ఇతి సమంతతోయోగాః.

ఇలాంటి సందర్భాల్లో ఏం చేయాలో ఇక్కడ చెపుతున్నారు - ఒకరి నుండి కొంత ధనాన్ని సంపాదించాలి. తరువాత తక్కిన వారందరి నుండి ధనం గడించాలి. వీటినే సమంతతో యోగాలని అంటారు.

52. అర్థసంశయ మనర్థసంశయం చ పూర్వవద్యోజయే త్సంకీ ర్ణేచ్చ.

అర్థ సంశయాన్ని, అనర్థసంశయాన్ని పూర్వం వలెనే గ్రహించాలి. ఇలాగే సంకీర్ణాలను సయితం స్వీకరించాలి.

53. తథా ధర్మకామావపి. ఇత్యర్థానర్థానుబంధ సంశయ విచారః.

అదే విధంగా ధర్మ కామాలను గురించి కూడా సంశయాలు, సంకీర్ణ సంశయాలు కనిపెట్టి నడచుకోవాలి. ఇలా అర్థానర్థానుబంధ సంశయ విచారణ పూర్తి అవుతుంది.

54. కుంభదాసీ, పరిచారికా, కులటా, స్వైరిణీ, నటీ, శిల్పకారికా,
ప్రకాశవినష్టా, రూపాజీవా, గణికా చేతి వేశ్యావిశేషాః.

వేశ్యావృత్తి అనేది ఏ ఏ రకం స్త్రీలకు విధించబడినదో చెపుతున్నారు - కంభ దాసి వేశ్య జాతిలో చేరినదే. రాజుల దగ్గర దాస్యం చేస్తూ జీవించేది పరిచారిక. కులంలో చెడబుట్టి, భ్రష్ఠురాలై ధర్మం తప్పి, భర్తకు దూరమై మరొకడి దగ్గర చేరి, వాడితో సంభోగిస్తూ ఉండేది కులట. భర్తను కాదని, తన ఇంట్లోగానీ,

మరొకరి ఇంట్లోగానీ పరులతో కూడి ఉండేది స్వైరిణి. నాట్య కళను నేర్చి, నాటకాదుల్లో వేషాలు వేస్తూ ఇతరులతో సంగమించేది నటి. చేతి వృత్తులు చేస్తూ జీవించే వాళ్ళ భార్య రంకుతనం చేస్తుంటే అది శిల్పకారిక. ఇక ప్రకాశవినష్ట, రూపాజీవ, గణిక - వీరంతా వేశ్యల జాతిలోనే చేరతారు.

55. *సర్వాసాం చానురూప్యేణ గమ్యాస్సహాయా స్తదు పరంజన*
*మర్థాగమోపాయా, నిష్కాసనం, పునస్సం ధానం లాభవిశేషానుబంధాః*
*అర్థానర్థానుబంధ సంశయవిచారాశ్చేతి వైశికం ప్రకరణం.*

ఈ ప్రకరణంలో చెప్పబడిన నాయికలకు తగిన విటులు, సహాయకులు ఉండాలని, వారు వారిని రంజింపజేయాలని, అర్థాగమోపాయాలు, నిష్కాసన పద్ధతులు, పునస్సంధానాలు లాభవిశేషాలు, అనుబంధ విశేషాలు, అర్థానర్థానుబంధ సంశయ విచారాలు - మొదలైనవన్నీ చెప్పబడినాయి. ఇది వైశిక ప్రకరణం లేదా వైశికాధికరణం.

56. *భవతశ్చాత్ర శ్లోకా - రత్యర్థాఃపురుషాయేన రత్యర్థా శ్చైవ యోషితః,*
*శాస్త్రస్యార్థప్రధానత్వాత్ తేన యోగోఽత్ర యోషితాం.*

కేవలం రతి చేయడమే ప్రధానంగా భావించే పురుషులు, రతిక్రీడలే ముఖ్యమని అనుకునే స్త్రీలు - ఈ లోకంలో ఉన్నారు. కాబట్టి ఈ విషయం ప్రధానంగా శాస్త్రం ఉపదేశస్తున్నది. అంచాత ఈ వైశికాధికరణం కేవలం వేశ్యలకే ఉద్దేశించబడినది. వారే దీన్ని చదవడానికి, దీన్ని అనుసరించడానికి అధికారం కలవారు.

57. *సంతి రాగపరా నార్యః సన్తి చార్థపరా అపి,*
*ప్రాక్తత్ర వర్ణితో రాగో, వేశ్యాయోగాశ్చ వైశికే.*

లోకంలో ప్రధానంగా పరిగణించబడే స్త్రీలను గురించి కన్యా సంప్రయుక్తక, భార్యాధికారిక, పారదారిక - అధికరణాలలో చెప్పడం జరిగింది. వీరందరికీ అనురాగమే ముఖ్యం. కాబట్టి వారికి అనుకూలమైన చరిత్ర అక్కడ వర్ణించడం జరిగింది. ఇక వేశ్యలంటారా ? - వీరికి అనురాగం కాదు ప్రధానం - ధనమే ప్రధానం. కాబట్టి అటు రతి ఇటు వృత్తి - రెండూ కావాలి వీరికి. అంచాతనే వీరి చరిత్ర ఇక్కడ చెప్పడం జరిగింది.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే వైశికే షష్ఠేఽధికరణే*
*అర్థానర్థానుబంధ సంశయ విచారః వేశ్యావిశేషాశ్చేతి షష్ఠోఽధ్యాయః.*

**ఇది వాత్స్యాయన ముని విరచిత కామసూత్రాల్లోని వైశికమనే ఆరో అధికరణంలో అర్థానర్థానుబంధ సంశయ విచారం, వేశ్యావిశేషాలు అనే ఆరో అధ్యాయం.**



# వాత్స్యాయన కామసూత్రాలు

## అధికరణం - 7

## ప్రథమాధ్యాయం

### ఔపనిషదికం - సుభగం కరణం



1. *వ్యాఖ్యాతం కామసూత్రమ్.*

**ఇంతవరకూ** తంత్రావాపాత్మకమైన కామసూత్రాలను గురించి స్పష్టంగా చెప్పబడింది.

2. *తదుక్తైస్తు విధిభి రభిప్రేత మర్థ మనధిగచ్ఛన్నౌ పనిషదిక మాచరేత్.*

ఇంతవరకూ చెప్పిన తంత్రావాపాది విధానాలతో కామాన్ని సాధించలేకపోతే, అప్పుడు ఔషధ ప్రయోగానికి పూనుకోవాలి. ఆ ప్రయోగాలను పేర్కొనేదే ఈ ఔపనిషదికాధికరణం.

3. *రూపం గుణో వయస్త్యాగ ఇతి సుభగంకరణం.*

ఇందులో సుభగం కరణం అనే యోగాన్ని గురించి చెపుతున్నారు. - ఇది రూపం, గుణం,యశస్సు, భాగ్యం - అని నాలుగు రకాలుగా ఉంటుంది. సుభగం కరణం అంటే దేహానికి సౌందర్యం సమకూర్చడం. మొదట రూపం గురించి

చెపుతున్నారు. ప్రతిరోజూ కనీసం ఒక్కసారైనా పరిశుభ్రంగా స్నానం చెయ్యాలి. రెండు రోజుల కొకసారి ఒళ్ళు పట్టించుకోవాలి. ఇదివరకు చెప్పిన విధంగా దేహానికి చక్కని సంస్కారం చేస్తే, హృదయాకర్షకమైన అందం వస్తుంది. నాయకుడికి ఉండవలసినవిగా పైన చెప్పిన గుణాలు ఎంత వికృతరూపుల్నే అయినా అందగాళ్ళగా చేస్తాయి. అంచేత ఆ గుణాలు అలవరచుకోడానికి ప్రయత్నించాలి. యవ్వనంలో ఉన్నప్పుడు చెయ్యలేని పని అంటూ ఉండదు మానవుడికి. కాబట్టి ఈ యవ్వనాన్ని మంచినడవడికతో కాపాడుకుంటూ, అది స్థిరంగా ఉండేలా చూచుకోవాలి. వృద్ధుణ్ణి చూస్తే మగువలు లెక్కచెయ్యరు. ఇతని పని అయిపోయిందని అనాదరంగా చూస్తారు. అలాంటి వార్థక్యంలో కూడా జుట్టును పరిమళద్రవ్యాలతో సంస్కరించుకుంటూ వుంటే, కాంతలు వైముఖ్యం చూపరు. ఇక ధనం ఉన్నది. దాని ప్రభావం ముందు అంతా దిగదుడుపే! కురూపి అయినా, గుణహీనుడైనా వృద్ధుడైనా ధనం వెదజల్లితే వనితలు తమంతట తామే అతనిపై ఎగబడతారు.

*4. తగరకుష్ఠతాళీసపత్రకానులేపనం సుభగంకరణం.*

రూపం, గుణం, యవ్వనం, దాతృత్వం - ఈ నాలుగూ లేనివాడి విషయంలో అనుసరించవలసిన విధానం గురించి చెపుతున్నారు. గ్రంధివర్ణం, చెంగల్వకోష్టు, తాళిసపత్రి - వీటిని మెత్తగా చూర్ణంచేసి వంటికి నలుగు పెట్టుకుంటే దేహానికి ఎక్కడలేని కాంతి, శోభ వస్తాయి.

*5. ఏతైరేవ సుపిష్టైః వర్తిమాలిప్య అక్షతైలేన నరకపాలే సాధిత మంజనం చ.*

పైన చెప్పిన గ్రంధిపర్ణం, చెంగల్వకోష్టు, తాళిసపత్రి - ఈ మూడు వస్తువులూ మెత్తగా చూర్ణం చేసి, ఒక గుడ్డలో పొయ్యాలి. ఆ గుడ్డను వత్తిగా తయారు చెయ్యాలి. మనిషి పుర్రెలో తాటిగింజలనుండి తీసిననూనె పోసి, ఈ వత్తిని దానిలో తడిపి దీపం వెలిగించాలి. ఆ దీపపు మసి మరో పుర్రెకు కాటుకలా పట్టించి, ఆ కాటుక కళ్ళకు పెట్టుకుంటే, అది ఒక రకమైన సుభగం కరణం అవుతుంది.

*6. పునర్నవా, సహదేవీ, శారిబా, కురంటకోత్పలపత్రైశ్చ సిద్ధతైల మభ్యంజనం చ.*

గల్జేరు, సహదేవి, నల్లసుగంధపాల, గోరంట - ఈ చెట్లు, వీటి వ్రేళ్ళు, కలువపూవు నడిమిభాగంతో కషాయం పెట్టి, దానినుండి నూనె తియ్యాలి. ఆ నూనెతో తలంటుకోడం కూడా ఒక రకమైన సుభగం కరణం అవుతుంది.

*7. తద్యుక్తా ఏవ స్రజశ్చ.*

పైన పేర్కొన్న చెట్ల, వ్రేళ్ళ చూర్ణాన్ని పూలమాలలకు పట్టించి, మెడలో ధరించడం సయితం ఒకవిధమైన సుభగం కరణం యోగమే అవుతుంది.

*8. పద్మోత్పల నాగకేసరాణాం శోషితానాం చూర్ణం*
*మధుఘృతాభ్యామవలిహ్య సుభగో భవతి.*

తామరపువ్వుల, కలువుపువ్వుల కింజల్కాలను, నాగకేసరాలను చూర్ణం చేసి, తేనెతోను, నేతితోను కలిపి కడుపులోకి పుచ్చుకుంటే మానవుడు సుందరరూపుడవుతాడు.

9. *తాన్యేవ తగరతాళీస తమాల పత్రయుక్తాన్యనులిప్య.*

తామరపువ్వుల, కలువపువ్వుల కింజల్కాలను, గ్రంధితగరం, తాళిసపత్రి, తమాలపత్రం - వీటిని బాగా నూరి వంటికి నలుగుపెట్టుకుంటే మానవుడు మంచి అందగాడవుతాడు.

10. *మయూరస్యాక్షి తరక్షోర్వా నువర్ణేనావలిప్య దక్షిణహస్తేన ధారయేదితి నుభగంకరణం.*

నెమలికళ్ళుగాని, చిరుతపులి కళ్ళుగాని తెచ్చి పచ్చిపసుపాకుతో చుట్టి, కుడిచేత్తో పట్టుకుని ఉంటే ఒకవిధమైన సుభగంకరణం.

11. *బాదరమణిం, శంఖమణిం చ తథైవ తేషు చాథర్వణాన్యోగాన్ గమయేత్.*

రేగి గింజలు, శంఖమణి పసుపాకుతో చుట్టి, ధరిస్తే మరోవిధమైన సుభగం కరణం. ఈ యోగాలుకాక అధర్వణవేదంలో చెప్పిన యోగాలు కూడా ఆచరించవచ్చు.

12. *విద్యాతంత్రాచ్చ విద్యాయోగాత్ ప్రాప్తయౌవనాం పరిచారికాం స్వామీ*
*నంవత్సరమాత్ర మన్యతో వారయేత్, తతో వారితాం బాలాం వామత్వా లాలసీభూతేషు*
*గమ్యేషు యోఽస్యై నఘర్షేణ బహుదద్యాత్తస్మై విసృజేత్, ఇతి సౌభాగ్య వర్ధనం.*

13. *గణికా ప్రాప్తయౌవనాం స్వాం దుహితరం తస్యాః*
*విజ్ఞానశీల రూపానురూప్యేణ తానభిమంత్ర్య సారేణ యోస్యా*
*ఇదమిదం చ దద్యాత్స పాణిం గృహ్ణీయాదితి నంభాష్య రక్షయేదితి.*

14. *సా చ మాతు రవిదితా నామ నాగరికపుత్రైః ధనిభి రత్యర్థం ప్రీయేత.*

15. *తేషాం కళాగ్రహణే గాంధర్వశీలాయాం భిక్షుకీభవనే, తత్ర తత్ర చ నందర్శనయోగాః.*

16. *తేషాం యథోక్తదాయినాం మాతా పాణిం గ్రాహయేత్.*

17. *తావ దర్థ మలభమానా తు. స్వేనాప్యేకదేశేనదుహిత్రా వీతదత్తమనే నేతి ఖ్యాపయేత్.*

18. *ఊఢాయా వా కన్యాభావం విమోచయేత్.*

19. *ప్రచ్ఛన్నం వా తైన్సంయోజ్య స్వయమజానతీ*
*భూత్వాతతో విదితేష్వేతం ధర్మస్థేషు నివేదయేత్.*

20. *నఖ్యైవ తు దాస్యావా మోచితకన్యాభావాం, నుగృహీత కామనూత్రాం,*
*ఆభ్యాసికేషు యోగేషు ప్రతిష్ఠితాం, ప్రతిష్ఠితే వయసి సౌభాగ్యే చ*
*దుహితర మవనృజంతి గణికాః ఇతి ప్రాచ్యోపచారాః.*

21. *పాణిగ్రహోశ్చ నంవత్సర మవ్యభిచార్యస్తతో యథాకామినీ స్యాత్.*

22. *ఊర్ధ్వమపి నంవత్సరాత్పరిణేతేన నిమంత్ర్యమాణా లాభమప్యుత్సృజ్య తాం*
*రాత్రిం తస్యాగచ్ఛేదితి వేశ్యాయాః పాణిగ్రహణవిధిః సౌభాగ్యవర్ధనం చ.*

గణికకు కూతురున్నట్లయితే, ఆమెకు యుక్త వయస్సురాగానే, ఆమె తెలివితేటలకు, పాండిత్యానికి, శీలానికి, రూపానికి తగిన పురుషులను పిలిపించి, ఫలానా వస్తువులు ఎవరు తెచ్చి ఇస్తారో, వారితో మా అమ్మాయి పాణిగ్రహణం చేస్తుందని చెప్పి, ఆ పిల్లను సంరక్షించాలి. ఆ పిల్లకూడా తల్లికి తెలియకుండా ధనవంతుడు, నాగరకుడు అయిన పురుషుణ్ణి ప్రేమించాలి. ఆ పురుషుణ్ణి తన కుమార్తె నాట్యశాలలలోనో, భిక్షుకీ గృహాలలోనో, చూచేటట్లు ఏర్పాట్లుచేసి, అప్పుడతనితో ఫలానా వస్తువులు ఇస్తావా అని అడిగి, అతడు ఇస్తానంటే అతనితో పాణిగ్రహణం చేయించాలి వేశ్యమాత - తన వద్ద గల ధనమైనా కుమార్తెకు ఇస్తున్నట్లు ప్రకటించి, వారి పెళ్ళి జరిగేలా చూడాలి. అలా పాణిగ్రహణం చేయించి ఆ అమ్మాయిని కన్యాత్వం నుంచి విడిపించాలి. (దీన్నే కన్నెరికం అంటారు కాబోలు) ఒకవేళ అంతకు మునుపే రహస్యంగా ఆ అమ్మాయిని ఆమె కోరిన పురుషుడితో సంగమింజేసి తానేమి ఎరుగనట్లు ఊరుకోవాలి తల్లి. ఆ తరువాత ఆ విషయం బయటపడితే ధర్మాధికారులు దానిపై విచారణ జరుపుతారు. అప్పుడు తల్లి తనకేమీ తెలియదని చెప్పాలి. అంటే తాను ఇంతకు ముందు సూచించిన ధనం, వస్తువులు సంపాదించడానికి వేశ్యమాత పన్నే పన్నాగం అన్నమాట. ఇలా చెలికత్తెల ద్వారా కన్నెచెర నుండి విడిపడిన వేశ్యకూతురు కామసూత్ర మర్మాలన్నీ బాగా గ్రహించి, అభ్యాస యోగాలు నేర్చుకుని, నవయౌవనంతో వెలిగిపోతున్న తన కూతుర్ని విటులకు తారుస్తూ ఉంటారు వేశ్యమాతలు. ఇది ప్రాచ్యుల పద్ధతి. పాణిగ్రహణం అయిన పిమ్మట ఒక ఏడాదిపాటు ఇతరులతో సంభోగించకుండా ఉండి అటుపైన కాముకిలా ప్రవర్తించాలి ఆ యువతి. ఏడాది దాటిన తరువాత కూడా పాణిగ్రహణం చేసుకున్నవాడు కబురు పెడితే, అవతల మరొకరినుండి ఎంత లాభం వస్తున్నా వదిలి పెట్టి ఆ రాత్రి అతనితోనే భోగించాలి. వేశ్యల పాణిగ్రహణ విధి ఇది. ఈ విధానం వారికి ఎంతో సౌభాగ్యప్రదం.

*23. ఏతేన రంగోపజీవినాం కన్యాః వ్యాఖ్యాతాః.*

*24. తస్మైతు తాందద్యుర్య ఏషాం తూర్యే విశిష్టముపకుర్యాత్. ఇతి సుభగంకరణం.*

రంగస్థలంపై నటిస్తూ జీవించే నటీమణుల కన్యలకు కూడా ఇదే పద్ధతి చెప్పారు. కాకపోతే వీరి విషయంలో ఒక విశేషం ఉంది. నృత్య నాట్యాదుల్లో ఎవరైతే తమకు ఎక్కువ సహాయ సహకారాలు అందిస్తూ ఉంటారో, వారికే మొదట కన్నెను పై రీతిగా అప్పగించి రంజింపజెయ్యాలి. ఇది సుభగంకరణ విధానం.

# వశీకరణ యోగాలు

*25. దుత్తూరక మరి చ పిప్పలీచూర్ణైః మధుమిశ్రైః లిప్తలింగస్య సంప్రయోగో వశీకరణం.*

*26. వాతోద్భ్రాంత పత్రం మృతకనిర్మాల్యం మయూరాస్థిచూర్ణావచూర్ణం వశీకరణం.*

లోక ప్రియుడుగా ఉన్న పురుషుడి ఇష్ట కార్యాలు సిద్ధించాలంటె వశీకరణ విధానం ఉంది. అదే ఇక్కడ చెపుతున్నారు. ఉమ్మెత్త చెట్టు గింజలు, మిరియాలు, పిప్పళ్ళు, పొడిచేసి తేనెతో రంగరించి లింగానికి పూసుకోవాలి. అది ఆరిన తరువాత సంభోగించే స్త్రీ అతనికి వశం అయిపోతుంది. ఈ విషయం ఆమెకు తెలియనివ్వకూడదు. వాతోద్భ్రాంత పత్రం, చనిపోయినవాడి గుండె, చకోరపక్షి ఎముకలు పొడిచేసి కలిపి స్త్రీలకు తలమీద, పురుషులకు పాదాలపైన పూస్తే, పురుషులకు ఆ స్త్రీలు, స్త్రీలకు ఆ పురుషులు వశ్యులవుతారు.

*27. స్వయం మృతాయాః మండల కారికాయాశ్చూర్ణం,*
*మధునంయుక్తం సహామలుకైః స్నానం వశీకరణం.*

*28. వజ్రస్నుహీ గండకాని ఖండశః కృతాని మనశ్శిలాగంధ పాషాణచూర్ణే నాభ్యజ్య*
*సప్తకృత్యః శోషితాని చూర్ణయిత్వా మధునా లిప్తలింగస్య నంప్రయోగో వశీకరణం.*

*29. ఏతేనైవ రాత్రౌ ధూమం కృత్వాతద్ధూమ*
*తిరస్కృతం సౌవర్ణం చంద్రమ నందర్శయతి.*

*30. ఏతేరేవ చూర్ణితైః వానరపురీషమిశ్రితైః యాం*
*కన్యామవకిరేత్సాऽన్యస్మైన దీయతే.*

ఒక నీటిపిట్ట ఉంది. అదే మండకారికగ్రద్దల జాతిలో చేరిన పక్షి అది. ఈ పక్షుల్లో ఆడపక్షి దానంతట అది చచ్చిపోతే, దానిని చూర్ణం చేసి, యష్టి మధుకముల చూర్ణంతోను, ఉసిరికాయల చూర్ణంతోను కలిపిన నీళ్ళతో స్నానం ఆచరిస్తే వశీకరణసిద్ధి. జెముడు చెక్క, గండకం అనే చేపపిల్ల - వీటిని ముక్కలుచేసి, ఎండబెట్టి మణిశిల, గంధక చూర్ణాలతో కలిపి మరల ఏడుసార్లు ఎండించి, పొడిచేసి ఆ పొడినితేనెలోవేసి నూరి, మదన దండానికి పట్టించి, ఏస్త్రీతోనైనా నంభోగిస్తే ఆ స్త్రీ ఎల్లప్పుడు తన వశంలో ఉంటుంది. ఈ పొడినే రాత్రివేళ ధూపంవేసి, ఆపొగలోనుంచి స్త్రీకి చంద్రుణ్ణి చూపిస్తే ఆమె వశమవుతుంది. అలాగే ఈ చూర్ణాలను కోతి ఒంటెలుతో (పురీషం) కలిపి స్త్రీ పై చల్లితే ఆ స్త్రీ తనకు వశమై ఉంటుంది శాశ్వతంగా.

*31. వహా గండకాని సహకార తైల లిప్తాని శింశుపా వృక్షస్కంధ ముత్కీర్య*
*షణ్మానం నిదధ్యాత్, తతః షడ్భిర్మా సైరపనీతాని దేవకాంత*
*మనులేపనం వశీకరణం చేత్యాచక్షతే.*

*32. తథా ఖాదిరసారజాని శకలాని తనూని యం వృక్షముత్కీర్య*
*షణ్మానం నిదధ్యాత్త త్పుష్పగంధాని భవంతి*
*గంధర్వకాంత మనులేపనం వశీకరణం చేత్యాచక్షతే.*

*33. ప్రియంగవ స్తగరమిశ్రాః సహకారతైలదిగ్ధాః నాగవృక్ష ముత్కీర్య షణ్మానం*
*నిహితాః నాగకాంతమనులేపనం వశీకరణ మిత్యాచక్షతే.*

*34. ఉష్ట్రాస్థి భృంగరాజరసేన భావితం దగ్ధం అంజనం నాళికాయాం నిహిత ముష్ట్రాస్థి*
*శలాకయైవ స్రోతోంజన సహితం పుణ్యం చక్షుష్యం వశీకరణం చేత్యాచక్షతే.*

35. ఏతేన శ్యేనభాసమయూరాస్థిమయాని
ఆంజనాని వ్యాఖ్యాతాని, ఇతి వశీకరణం.

తెల్లవస, చేప, - ఈ రెంటికీ తియ్యమామిడి తైలం పూసి శింశుపావృక్షపు తొర్రలో పెట్టి మూసి వేసి, ఆరు నెలల పాటు అట్టే పెట్టాలి. ఆ తరువాత ఆ వస్తువులు బయటికి తీసి మెత్తగా నూరి, దాన్ని స్త్రీ వంటికి పూసినా, తాను ఉపయోగించుకున్నా ఎంతో మనః ప్రీతిగా ఉంటుంది. అయితే, ఇది సుభగం కరణం కాదు, వశీకరణమూకాదు.

చేవ గల చంద్ర చెట్టు చెక్కలను బాగా నలగ గొట్టి సువాసనగల చెట్టు తొర్రలో ఉంచి, ఆరునెలల పాటు అలా మూసి ఉంచి, తీస్తే ఆ చెట్టు పూల వాసన ఈ వస్తువులకు తగులుతుంది. అంతట ఆ వస్తువులు అరగదీసి, ఆ గంధం తను పూసుకున్నా, ఎవరికైనా పూసినా వారు గంధర్వ కాంతలను కూడా మొహింపజేసే సౌందర్యవంతులవుతారు.

ప్రేంఖణపు చెట్లపూలు, గ్రంధి తగరం, తియ్యమామిడి తైలంతో తడిపి నాగవృక్షం తొర్రంలో ఆరు నెలలు ఉంచి తీసి, నీళ్ళలో అరగదీసి లేపనం చేస్తే నాగకాంతానులేపనం అవుతుంది. ఇది వశీకరణం. ఒంటె ఎముక, గుంట గలగరాకు తైలంతో భావనచేసి, కాల్చిమసి చేసి కాటుకగా తయారుచేసి, దాన్ని ఒంటె ఎముకతో తయారు చేసిన గొట్టంలో ఆ కాటుక పెట్టి, ఒంటె ఎముక ముక్కతోనే తీసి కళ్ళకు పెట్టుకుంటే ఎలాంటి కళ్ళరోగాలైనా నయమవుతాయి. అంతేకాక వశీకరణంగా పనిచేస్తుంది. డేగ, భాసపిట్ట, నెమలి - వీటి అంజనాలు కూడా పై విధంగానే తయారుచేసి వాడుకుంటే వశీకరణంగా పనిచేస్తాయి. ఇవి వశీకరణ యోగాలు.

## వృష్యయోగాలు

36. ఉచ్చటాకందశ్చవ్యా యష్టీ మధుకం చ నశర్కా రేణపయసా పీత్వా వృషీభవతి.

37. మేష వస్త ముష్కసిద్ధస్య పయసః నశర్కస్యపానం వృషత్వయోగః

స్త్రీ తన వశమైనప్పటికీ, కొందరు పురుషలకు వీర్యబలం లేక, సంభోగించే శక్తి ఉండదు. అలాంటి వారికోసం చెపుతున్న యోగాలు ఇవి. వీటికి వృష్యయోగాలని పేరు. గుంద్రటి తుంగగడ్డలు, చవ్యం యష్టి మధుకం, వీటిని పొడిచేసి పాలల్లోవేసి, శర్కర కలిపి త్రాగితే నపుంసకత్వంపోయి వీర్యబలం వస్తుంది. మేక, గొఱ్ఱెల అండాల నుండి వచ్చే పాలు శర్కరతో కలిపి సేవిస్తే నపుంసకత్వం తొలగిపోతుంది.

38. తథా విదార్యాః క్షీరికాయాః స్వయంగుప్తాయాశ్చ క్షీరేణ పానం.

39. తథా ప్రియాళు బీజానాం మోరటావిద్యార్యోశ్చక్షీ రేణైవ.

40. శృంగాటక, కసేరుక, మధూలికాని, క్షీరకాకోల్యా నహ పిష్టాని నశర్కరేణ
పయసా ఘృతేన మందాగ్నినా ఉత్కారికాం పక్వా యావదర్థం
భక్షితవాన్ అనంతాః స్త్రీయో గచ్ఛతీత్యాచార్యాః ప్రచక్షతే.

41. మాషకమలినీం, పయసా ధౌతాముష్ణేన మృతేన మృదూకృత్య
ఉద్ధృతాం వృద్ధవత్సాయాః గోఃపయస్సిద్ధం పాయసం
మధుసర్పిర్భ్యాం ఆశిత్వా అనంతాః స్త్రియో గచ్ఛతీత్యాచార్యాః ప్రచక్షతే.

నేల గుమ్మడి, పాలపండ్లు, దురదగొండి - వీటిని పాలల్లో వేసి కాచి, ఆ పాలు త్రాగినా, అలాగే చారపప్పు, చాగచెట్టు గింజలు, నేల గుమ్మడి గింజలు, పాలలో నానబెట్టి తాగినా, సింగాణి గడ్డలు, ములువెలగ, యష్టి మధుకం వీటిని క్షీరకాకోలితో నూరి, పిండి చేసి పంచదార కలిపి, పాలల్లో వేసుకుని త్రాగినా, నేతితో లేదా నిప్పుసెగపై వండి భుజించినా ఏక కాలంలో అనేకమంది స్త్రీలతో సంభోగించగలుగుతాడు.

మాషకమలినిని నీళ్ళలో వేసి నానబెట్టి పై పొట్టు తీసివేసి, కడిగి, గోరువెచ్చటి నెయ్యిలో వేయించి ఆవుపాలతో పాయసం చెయ్యాలి. దానిలో నెయ్యి, తేనె కలిపి భక్షిస్తే, అనేక మంది స్త్రీలతో, రమించవచ్చు. ఇది పూర్వపు ఆచార్యులు పేర్కొన్న వృష్యయోగం.

42. విదారీ స్వయంగుప్తా శర్కరా మధుసర్పిర్భ్యాం గోధూమచూర్ణేన పోలికాం కృత్వా
యావదర్థం భక్షితవాన్ అనంతాః స్త్రియో గచ్ఛతీత్యాచార్యాః ప్రచక్షతే.

43. చటకాండ రసభావితైః తండులైః పాయసం సిద్ధం మధుసర్పిర్భ్యాం
ప్లావితం యావదర్థమితి సమానం పూర్వేణ.

44. చటకాండ రసభావితానపగతత్వచస్తిలాన్ శృంగారక కసేరుక
స్వయంగుప్తా ఫలాని గోధూమమాషచూర్ణైః సశర్కరేణ పయసా సర్పిషా చ
పక్వం సంయావం యావదర్థం ప్రాశితవానితి సమానం పూర్వేణ.

45. సర్పిషో మధునః శర్కరాయా మధుకస్య చ ద్వే ద్వేపలే మధురసాయాః కర్షః
ప్రస్థం పయస ఇతిషడంగ మమృతం మేధ్యం
వృష్యమాయుష్యం యుక్తరస మిత్యాచార్యాః ప్రచక్షతే.

46. శతవరీ శ్వదంష్ట్రా గుడకషాయే పిప్పలీ మధుకల్కే గోక్షీరచ్ఛాగ ఘృతే పక్వే
తస్య పుష్యారంభేణా స్వహం ప్రాశనం మేధ్యం
వృష్యమాయుష్యం యుక్తరస మిత్యాచార్యాః ప్రచక్షతే.

47. శతావర్యాః శ్వదంష్ట్రాయాః శ్రీపర్ణీ ఫలానాంచ క్షుణ్ణానాం చతుర్గుణితజలేన పాక
అప్రకృత్యా వస్థానాత్ తస్య పుష్యారంభేణ ప్రాతః ప్రాశనం
మేధ్యం వృష్యమాయుష్యం యుక్తరస మిత్యాచార్యాః ప్రచక్షతే.

రేల గుమ్మడి, దురదగొండి, పొడిచేసి పంచదార, తేనె, నెయ్యి కలిపి కొంచెం గోధుమ రవ్వతో చేర్చి పోణీలు చేసి ఇష్టంగా భుజిస్తే పురుషుడు పలువురు పడతులతో భోగించగలుగుతాడు. ఊర పిచ్చుకల గ్రుడ్ల సొనతో బియ్యం నానబెట్టి ఆ బియ్యంతో క్షీరాన్నం వండించి, దాంట్లో నెయ్యి, తేనె కలిపి భక్షిస్తే చాలామంది రమణులతో రమించగలుగుతాడు. ఇది ప్రాచీనాచార్యులు చెప్పిన వృష్యయోగం. ఊర పిచ్చుకల గ్రుడ్ల సొనతోనే చేరుడు నువ్వులు, సింగాణి

గడ్డలు, ములువెలగపళ్ళు, దురదగొండి విత్తులు, గోధుమరవ్వ, మినపసున్ని, పంచదార, పాలు కలిపి జావగా కాచి పుచ్చుకుంటే ఎందరు యువతులనైనా తృప్తిపరచవచ్చు. తేనె, నెయ్యి, పంచదార, యష్టిమధుకం - వీటిన రెండేసి రెండేసి ఫలాల చొప్పున, మధురసం ఒక వర్షం ఒక ప్రస్థం పాలల్లో కలిపి, ముద్ద అయ్యేదాకా ఉడకబెడితే - అది షడాంగామృతం అవుతుంది. దీన్ని సేవించడం వల్ల మేధస్సు వృద్ధి అవుతుంది. మంచి పుంస్త్వం కలిగి అమిత వీర్యవంతుడవుతాడు. ఆయుష్యం కూడా పెరుగుతుంది. పిల్లిపీచర గడ్డలు, పల్లేరు, బెల్లం వీటితో కషాయం కాచి పిప్పళ్ళు, యష్టిమధుకం కలికం తీసి ఆవుపాలు, మేక నెయ్యితో కలిపి వండి పుష్యమీ నక్షత్రంనాడు మొదలుపెట్టి రోజూ ప్రొద్దున్నే భక్షిస్తే అమిత వీర్యపుష్టి, బలం, ఆయుష్యం కలుగుతాయి.

*48.* *శ్వదంష్ట్రా చూర్ణ సమన్వితం తత్సమ మేవ యవచూర్ణం*
*ప్రాతరుత్థాయ ద్విపలక మనుదినం ప్రాశ్నీయాన్మేధ్యం*
*వృష్యం యుక్తరస మిత్యాచార్యాః ప్రచక్షతే.*

ఏనుగు పల్లేరు కాయల చూర్ణాన్ని, యవ చూర్ణాన్ని సమానంగా తీసుకుని ప్రొద్దున్నే ప్రతిరోజూ రెండేసి ఫలాల చొప్పున భుజిస్తే చక్కటి బుద్ధిబలం, వీర్యవృద్ధి, రక్తవృద్ధి కలుగుతాయని ప్రాచీనాచార్యులు చెప్పారు.

*49.* *ఆయుర్వేదాచ్చ వేదాచ్చ విద్యాతంత్రేభ్య ఏవ చ,*
*ఆప్తేభ్యశ్చావబోద్ధవ్యా యోగా యే ప్రీతి కారకాః.*

*50.* *న ప్రయుంజీత సందిగ్ధాన్ న శరీరాత్య యావహాన్,*
*న జీవఘాతసంబద్ధాన్ నాశుచిద్రవ్యసంయుతాన్*

*51.* *తపోయుక్తః ప్రయుంజీత శిష్టై రనుగతాన్ విధీన్,*
*బ్రాహ్మణైశ్చ సుహృద్భిశ్చ మంగళై రభినందితాన్.*

ఆయుర్వేదం నుంచి, అధర్వణ వేదం నుంచి, కామవిద్యాతంత్రం తెలిసినవారినుంచి, ఆప్తులనుంచి, ప్రేమను వృద్ధి చేసే ప్రక్రియలను గ్రహించాలి. సందేహంగా తోచిన ప్రక్రియలు, యోగాలు, హింసాత్మకమైన యోగాలు, తుచ్ఛమైన పదార్థాలు వాడే యోగాలు - వీటిని నీతి - నియమం గల బుద్ధిమంతులు అనుసరించకూడదు. పెద్దలు ఏ ప్రక్రియలను ఆచరిస్తున్నారో, బ్రాహ్మణులు, స్నేహితులు మంగళకరమైనవని ప్రశంసిస్తున్నారో ఆ ప్రక్రియలను యోగాలను మాత్రమే ఆచరించాలని వాత్స్యాయనులు హెచ్చరిస్తున్నారు.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే ఔపనిషదికే సప్తమేఽధికరణే, సుభగంకరణం, వశీకరణం, వృష్యయోగాః ప్రథమోఽధ్యాయః.*

**ఇది శ్రీ వాత్స్యాయన ముని విరచిత కామసూత్రాల్లో ఔపనిషదికం అనే ఏడో అధికరణంలో సుభగంకరణం, వశీకరణం, వృష్యయోగాలు అనే మొదటి అధ్యాయం.**



# ద్వితీయాధ్యాయం
## నష్టరాగ ప్రత్యానయనం

*1. చండవేగాం రంజయితు మశక్నువన్ యోగాన్ ఆచరేత్.*

*2. రతస్యోపక్రమే సంబాధస్య కరేణోపమర్దనం తస్యా రసప్రాప్తికాలే చ రతియోజనమితి రాగప్రత్యానయనం.*

*3. ఔపరిష్టకం మందవేగస్య గతవయసో వ్యాయతస్య రతశ్రాంతస్యచ రాగప్రత్యానయనం.*

*4. అపద్రవ్యాణి వా యోజయేత్.*

*5. తాని సువర్ణ రజత తామ్ర కాలాయస గజదంత గవలద్రవ్య మయాని.*

సంభోగానికి ఫలం ఏమిటయ్యా అని ప్రశ్నించుకుంటే, అవి రెండు ఫలాలు. ఒకటి పుత్రప్రాప్తి, రెండు రతి సౌఖ్యం. పుత్రప్రాప్తికోసం పుంస్త్వాన్ని సంపాదించుకునే యోగాలు ఇంతకు ముందు చెప్పారు. ఇక, ఇప్పుడు మరికొన్ని విశేషాలు పేర్కొంటున్నారు. కొందరు స్త్రీలు చాలాసేపు సురత సుఖాన్ని కోరతారు. మందవేగాడైన పురుషుడు ఆ సుఖాన్ని కలిగించలేడు. అలాంటి పురుషుడి విషయంలో కాంత విముఖురాలు అవుతుంది. అలా స్త్రీ అనురాగాన్ని కోల్పోయిన పురుషుడు మరల అనురాగాన్ని సంపాదించి ఆమెను తృప్తిపరిచే విధానాలు ఇక్కడ చెపుతున్నారు శాస్త్రకారులు.

చాలాసేపు ఎడతెగని రతిక్రీడ సాగిస్తే కాని తృప్తి చెందని స్త్రీని, శీఘ్రంగా స్ఖలనం అయ్యే మందవేగుడు మెప్పించలేడు. అందువల్ల యోగాలు ఆచరించక తప్పదు. అతడు సురతాన్ని మొదలుపెట్టే తరుణంలోనే ఆమె భగం లోపలికి వ్రేళ్ళు పోనిచ్చి ఆమెకు భావప్రాప్తి కలుగబోతున్న సమయం కనిపెట్టి, అప్పుడు భగంలోనికి లింగాన్ని ప్రవేశపెట్టి రతి చెయ్యాలి. ఇలా చేయడం వల్ల ఆ చండవేగ తృప్తిపడుతుంది. అలాగే మందవేగుడు, వృద్ధుడు, అంతకుమునుపే బాగా రతి చేసి అలసిపోయినవాడు ఔపరిష్టక రతి సాగించాలి. అంటే ముఖ రతి అన్నమాట. ఈ ముఖరతిని గురించి ఇంతకు పూర్వమే చెప్పడం జరిగింది. ఈ ముఖ రతి కాకపోతే, అపద్రవ్యాలనన్నా ఉపయోగించాలి. అపద్రవ్యాలంటే పురుషుడి లింగంతో సమానమైన ఆకారం గల సాధనాలు. ఇవి ముందుగా తయారుచేసి పెట్టుకోవాలి. బంగారంతో, వెండితో, రాగితో, ఇనుముతో, ఏనుగు దంతంతో - వీటిల్లో దేనితోనైనా ఈ కృత్రిమ లింగాలను తయారు చేసికోవచ్చు.

# కృత్రిమ సాధనాలు

6. త్రాపుషాణి సైనకాని చ మృదూని శీతవీర్యాణి,
నృష్ణాణి, కర్మణి చ ధృష్ణూని భవంతీతి బాభ్రవీయాః యోగాః.

7. దారుమయాణి సామ్యతశ్చేతి వాత్స్యాయనః.

8. లింగప్రమాణాంతరం బిందుభిః కర్కశపర్యంతం బహుళం స్యాత్.

9. ఏతే ఏవ ద్వే సంఘాటీ.

10. త్రిప్రభృతి యావత్ప్రమాణం వా చూడకః.

11. ఏకామేవ లతికాం ప్రమాణవశేన్ వేష్టయేదిత్యేకచూడకః.

త్రపుషం అనేది ఒకలోహం. దానితో తయారైన వాటిని త్రాపుషకాలని అంటారు. సీసంతో తయారైన లింగాలు సీసకాలు. ఈ రెండు సాధనాలూ పురుషుడి మేహనం లాగే నున్నగా మెత్తగా, మృదువుగా, ఉండాలి. యోనిలో ప్రవేశపెట్టినది లగాయతూ సుఖంగా ఉండి, నిజంగా పురుషుడి లింగంలాగానే పని చేస్తూ ఈ సాధనాలు స్త్రీలకు స్ఖలనసుఖాన్ని కలిగిస్తాయి. చల్లని స్పర్శ సుఖాన్ని కూడా ఇస్తాయి. బాభ్రవీయులు సూచించిన ప్రక్రియ ఇది. ఇవికాక కొయ్యతోకూడా ఇలాంటి సాధనాలు తయారుచేస్తారు. వాటిని ఉపయోగించకూడదని బాభ్రవీయులు అంటున్నారు. ఆయా దేశాచారాలను బట్టి, పద్ధతులనుబట్టి కొయ్య సాధనాలను సయితం ఉపయోగించవచ్చునని వాత్స్యాయనుల అభిప్రాయం. ఈ అపద్రవ్యాలు ఒక్కొక్క స్త్రీకి ఒక్కొక్క రకం ప్రీతికరంగా ఉంటుంది. పురుషుడి లింగంతో సమానమైన లోపలిభాగం, కొసన ఉండే బెజ్జం, మొదలైనవన్నీ ఈ సాధనాలకు అమర్చబడి ఉంటాయి. ఈ అమర్చడంలో గల తేడాలను బట్టి వీటిని సంఘాటి అని, చూడకం అని పిలుస్తారు.

12. ఉభయతో ముఖచ్ఛిద్రః స్థూల కర్కశ వృషణ గుటికాయుక్తః
ప్రమాణవశయోగీ కట్యాం బద్ధః కంచుకో జాలకం వా.

13. తదభావే అలాబూనాళకం వేణుశ్చ తైలకషాయైః
సుభావితః సూత్రేణ కట్యాం బద్ధః శ్లక్ష్ణ కాష్ఠ మాలావా
గ్రథితా బహుభిరామలకాస్థిభిః సంయుక్తేత్యపవిద్ధకయోగాః.

14. న త్వవిద్ధస్య కస్య చిద్ వ్యవహృతిరస్తీతి.

15. దక్షిణాత్యానాం లింగస్య కర్ణయోరివ వ్యధనం బాలస్య.

పైన పేర్కొన్న కృత్రిమ సాధనాలలో పురుషుడి మర్మాంగాన్ని ప్రవేశ పెట్టే వైపున ఆ సాధనానికి రెండు ప్రక్కలా రెండు రంధ్రాలు ఉంటాయి. ఆ రంధ్రాల్లో తాళ్ళు గుచ్చి పురుషుడు తన నడుముకు కట్టుకుంటాడు. ఈ సాధనాలకు పెద్దవి, కఠినంగా ఉండేవి అయిన వృషణాలు కూడా అమర్చబడి ఉంటాయి.

ఇలా నడుముకు బిగించుకునేదాన్ని జాలకం అనీ, కంచుకం అనీ అంటారు. లింగానికి అంతటా విస్తరించి ఉంటుంది ఈ సాధనం. లేదా సొరకాయబుర్రగాని వెదురు గొట్టంగాని తెచ్చి, దాన్ని శుభ్రంచేయాలి. దాని చివరిభాగం నున్నగా, మెత్తగా ఉండేటట్లు చేసి నడుముకు వ్రేలాడగట్టుకుని, అందులో లింగాన్ని చొప్పించాలి. ఈ సాధనం సయితం ఎంతో నున్నగా మెత్తగా ఉండాలి. దీన్ని కాష్ఠమాల అని అంటారు. దీనికి రెండు ప్రక్కలా కొయ్య గుళికలు, ఉసిరికాయలోని గింజలు కట్టి వాడుకోవాలి. ఇవి అపవిద్ధక యోగాలు. దక్షిణాది దేశస్థులు చిన్నతనంలోనే చెవిలో పుల్లలు పెట్టి తిప్పుకుంటారు. అలాగే ఈ సాధనాలలో లింగాలు చొప్పించి తిప్పే ఆచారం కూడా ఉంది.

*16. యువా తు శస్త్రేణ ఛేదయిత్వా యావద్రధిరస్యాగమనం తావ దుదకే తిష్ఠేత్.*

*17. వైశద్యార్థం చ తస్యాం రాత్రౌ నిర్బంధాద్వ్యవాయః.*

*18. తతః కషాయై రేకదినాంతరితం శోధనమ్.*

*19. వేతసకుటజశంకుభిః క్రమేణ వర్ధమానస్య వర్తనైర్బంధనమ్.*

*20. యష్టీమధుకేన మధుయుక్తేన శోధనమ్.*

*21. తతః సీసకపత్రకర్ణి కయా వర్ధయేత్.*

*22. మ్రక్షయేద్భల్లాతక తైలేన, ఇతి వ్యధనయోగాః.*

*23. తస్మిన్న నేకాకృతి వికల్పా న్యపద్రవ్యాణి యోజయేత్.*

*24. వృత్తమేకతో వృత్త ముదూఖలకం కుసుమకం, కంటకితం, కంకాస్థి, గజప్రహేలికం, అష్టమండలికం, భ్రమరకం, శృంగాటక మాన్యాని వోపాయతః కర్మతశ్చ బహుకర్మసహతా చైషాం మృదుకర్కశతా యథాసాత్మ్యమితి.*

*ఇతి నష్టరాగప్రత్యానయనం ద్విషష్టితమం ప్రకరణమ్.*

ఇక పురుషాంగాన్ని ఎలా వ్యధనం చెయ్యాలో ఆ విధానం చెపుతున్నారిక్కడ. యువకుడైన పురుషుడి లింగాన్ని కత్తితో కొయ్యాలి. అప్పుడు కారే రక్తం ఆగిపొయ్యేదాకా లింగాన్ని నీళ్ళలో ఉంచాలి. ఆ రాత్రి మాత్రం పొయ్యకూడదు. ఆ తరువాత దినం మార్చి దినం కషాయాలతో లింగాన్ని కడగాలి. పేము బద్దలు, ప్రబ్బలి బద్దలు మొదలైన వాటితో లింగానికి కట్టుకట్టి ఉంచాలి. అప్పుడు లింగం క్రమక్రమంగా పెరుగుతూ ఉంటుంది. లింగానికి కట్టు గట్టిగా కట్టాలి. తేనె, యష్టి మధుకం కలిపి లింగానికి రాస్తూ ఉండాలి. పిమ్మట లింగానికి సీసకకర్ణ పత్రిక వేసి కట్టాలి. సాధనంలో చొప్పించడానికి గాను జీడిగింజల తైలంతో పురుషాంగాన్ని బాగా మర్దన చెయ్యాలి. వీటినే వ్యధన యోగాలని అంటారు. ఈ విధంగా పలు రంధ్రాలు గల సాధనాల్లో పురుషాంగాన్ని అనేక విధాలుగా ప్రవేశపెట్టాలి. వృత్తం, ఏకతోవృత్తం, ఉదూఖలం, కసుమకం, కంటకితం, కంకాస్థి, గజ ప్రహేరికం, అష్టమండలికం, భ్రమరకం, శృంగాటకం, మున్నగునవన్నీ ఉపాయాన్ని, చేసే పనిని అనుసరించి అనేక క్రియలకు ఉపయోగించే వాటిని

ఇష్టాన్ని బట్టి మృదువుగాను కఠినంగాను అమర్చుకోవలసి ఉంటుంది. ఇది నష్టరాగ ప్రత్యాయనం.

*25. ఏవం వృక్షజానాం జంతూనాం శూకై రుపబృంహితం లింగం దశరాత్రం*
*తైలేన మృదితం పునరుపబృంహితం, పునః ప్రమృదితం*
*ఇతి జాతశోఫంఖట్వాయా మధో ముఖస్తదంతరే లంబయేత్.*

ఇక పురుషాంగాన్ని పెద్దది చేసుకునే ప్రక్రియను గురించి చెపుతున్నారు.

చెట్ల బెరళ్ళతోను జంతువుల రోమాలతోను, పెద్దదిగా చేయబడిన పురుషాంగాన్ని పది రాత్రిళ్ళు తైలంతో మర్దించి, మరల పై వాటితో వృద్ధి పొందించి మళ్ళీ పది రాత్రులు తైలంతో మర్దన చేస్తే లింగం బ్రహ్మాండంగా సాగి పొడుగవుతుంది. ఆ తరువాత మళ్ళీ లింగం ముడుచుకుని పోకుండా మంచం మీద బోర్లా పడుకుని, దాని రంధ్రాల్లో మేహనాన్ని వ్రేలాడవెయ్యాలి.

*26. తతశ్శీతైః కషాయైః కృతవేదనానిగ్రహం సోపక్రమేణ నిర్ధారయేత్.*

*27. స యావజ్జీవం శూకజో నామ శోఫో విటానాం.*

*28. అశ్వగంధా శబరకంద జలశూక బృహతీఫల మాహిషనవనీత*
*హస్తికర్ణ వజ్రవల్లీరసైః ఏకైకేన పరిమర్దనం మాసికం వర్ధనమ్.*

*29. ఏతైరేవ కషాయైః పక్వేన తైలేన పరిమర్దం షాణ్మాన్యం*

*30. దాడిమ త్రాపుషబీజానివాలుకా బృహతీఫల రసశ్చేతి,*
*మృద్వగ్నినా పక్వేన తైలేన పరిమర్దనం పరిషేకోవా.*

*31. తాంస్తాంశ్చ యోగా నాప్తేభ్యో బుద్ధ్యేతేతి వర్ధమాన యోగాః.*

ఈ విధంగా ఇష్టమైనంత పొడుగ్గా లింగం సాగిన తరువాత చల్లని పంచకషాయాలతో కడుగుతూ బాధనుసహిస్తూ ఉండాలి. విటులు మాత్రమే ఎక్కువగా ఇలా పురుషాంగాన్ని పెంచుతారు. అంచేత దాన్ని శూకజశేషం అని అంటారు. అశ్వగంధం (పెన్నేరుగడ్డ) శబరకందం, జలశూకం, బృహతీఫలం, మాహిషనవనీతం, మొదలైన రసాలతో మాసం రోజులు లింగాన్ని మర్దిస్తే అభివృద్ధి అవుతుంధి. పై మూలికల కషాయాలతో వండిన తైలం మర్దన చేస్తే ఆరుమాసాల్లో లింగం పెరుగుతుంది. దానిమ్మ గింజలు, త్రపుషబీజాలు, వాలుక, బృహతీఫలరసం - వీటిని సన్నటి మంటపై వండి, తైలం తీసి పురుషాంగాన్ని మర్దన చేస్తే లేదా లింగానికి పూస్తే, లింగం పెద్దది అవుతుంది. ఇలాంటి యోగాలు, ప్రక్రియలు ఆప్తులైన పెద్దలవల్ల, అనుభవజ్ఞుల వల్ల, తెలుసుకోవలసి ఉంటుంది.

*32. అథ స్నుహీ కంటకమార్ణైః పునర్నవా వానరపురీష లాంగలి కా*
*మూలమిశ్రైః యామునకిరేత్సాన్యం కామయేత్.*

*33. తథాసోమలతా, అవల్గుజా, భృంగలోహోపజిహ్వికా*
*మార్ణైః వ్యాధిఘాతక జంబూఫల నిర్యాసేన ఘనీకృతేన*
*చలిప్తసంబంధాం గచ్ఛతో రాగో నశ్యతి.*

34. గోపాలికా, బహుపాదికా, జిహ్వికాచూర్ణైః
మాహిషతక్రయుక్తైః స్నాతాం గచ్ఛతో రాగోనశ్యతి.

## చిత్రయోగాలు

ఇక ఇప్పుడు కొన్ని చిత్ర యోగాలు చెపుతున్నారు. స్నుహికంటక చూర్ణంతో పునర్నవా, వానరపురీష, లాంగలికాలను సమూలంగా చేర్చి చూర్ణం చేసి, స్త్రీ తలపై రాస్తే ఆమె అలా రాసిన వారిని తప్పమరెవ్వరినీ ప్రేమించరు. అలాగే సోమలత, అవల్గుజ, భృంగలోహం, ఉపజిహ్వికల చూర్ణంతో చేర్చి, ఇంకా వ్యాధి ఘాతక, జంబూఫల, నిర్యాసాదులు కలిపి కలికం తీసి భగానికి పూస్తే, ఆ ద్రవం తగిలిన వెంటనే పురుషాంగక వాలిపోతుంది. గోపాలిక, బహుపాది, జిహ్వక - వీటి చూర్ణాన్ని, గేదె మజ్జికతో కలిపి భగానికి పూసుకుని స్నానం చేస్తే, ఆ స్త్రీతో రతి చేస్తే మరుక్షణంలోనే ఆ పురుషుడి కామం గంగలో కలుస్తుంది.

35. నీపామ్రాతక జంబూకుసుమయుక్త మనులేపనం దౌర్భాగ్యకరం, స్రజశ్చ.

36. కోకిలాక్షప్రలేపః హస్తిన్యానహతమేకరాత్రే కరోతి.

37. పద్మోత్పల కదంబసర్జక సుగంధ చూర్ణాని మధునాపిష్టాని లేపోమృగ్యాః విశాలీకరణం.

38. స్నుహిసోమార్కక్షారైః అవల్గుజాఫలైః భావితాన్యామలకాని కేశానాం శ్వేతీకరణం.

39. మదయంతికా కుటజకాంజనికా గిరికర్ణికాశ్లక్ష్ణపర్ణీమూలైః
స్నానం కేశానాం ప్రత్యానయనం.

నీపామ్రాతకం, నేరేడు చెట్టుపూలు, - వీటితో తయారుచేసిన అనువేపనం, వీటి పూలమాలలు దౌర్భాగ్యాన్ని ప్రాప్తింపజేస్తాయి.

హస్తినీ జాతి స్త్రీకి కోకిలాక్ష పూలరసంతో భగానికి రుద్దితే, ఒక్క రాత్రిలోనే భగం ముడుచుకుపోతుంది.

పద్మోత్పల, కదంబసర్జన, సుగంధ చూర్ణాలను తేనెలో వేసి నూరి, అది స్త్రీమర్మాంగానికి పూస్తే, మృగీజాతి స్త్రీకి యోని వెడల్పు అవుతుంది. స్నుహి, సోమార్కక్షీర, అవల్గుజాపండ్ల ద్రవ్యాలతో భావన చేసి, అలా తయారైన ద్రవాన్ని తల వెంట్రుకలకు రాచుకుంటే, వెంట్రుకలు తెల్లబడిపోతాయి. మదయంతికను సమూలంగా తెచ్చి నీళ్ళలో వేసి, కాచి, ఆ నీళ్ళతో స్నానం ఆచరిస్తే తెల్లబడిన జుట్టు మళ్ళీ నల్లబడుతుంది.

40. ఏతైరేవ నుపక్వేన తైలేన అభ్యంగా త్కృష్ణీకరణాత్క్రమేణాస్య ప్రత్యానయనం.

41. శ్వేతాశ్వస్య ముష్కస్వేదైః సప్తకృత్వో భావితేన ఆలక్తకేన రక్తోధరః శ్వేతో భవతి.

42. మదయంతికాదీన్యేవ ప్రత్యానయనం.

43. బహుపాదికా కుష్ఠతగర వీభవంతి శ్రవణప్రియంగుతైల
తాళిన దేవదారు వజ్ర కందకైరుపలిప్తం వంశంవాదయతో
యా శబ్దం శృణోతి సా వశ్యా భవతి.

44. ధుత్తూరఫలయుక్తో అభ్యవహారః ఉన్మాదకః

45. గుడో, జీర్ణితశ్చ ప్రత్యానయనం.

ఇంతకు ముందు చెప్పిన మదయంతికాది మూలికలతో కాగబెట్టిన తైలంతో ప్రతిరోజా తలంటుకుని స్నానం చేస్తే వెంట్రుకలు నల్లగా తుమ్మెద రెక్కల్లా ఉంటాయి.

తెల్లగుర్రం వృషణాలమీద గల చెమటతో అలక్తకాన్ని ఏడుసార్లు భావనచేసి, దాన్ని అర్ధితే ఎర్రగా ఉన్న పెదవులు తెల్లగా అవుతాయి. పైన చెప్పిన మదయంతికా తైలం మళ్ళీ యధావిధిగా ఉండేలా చేస్తుంది. బహుపాదికాది మూలికలను నూరి పిల్లనగ్రోవికి రాచి, దాన్ని ఊదితే ఆ ధ్వని విన్న స్త్రీలు ఇట్టే మోహితులై వశం అయిపోతారు. ధుత్తూరంతో కలిపిన అన్నం తిన్నవాళ్ళకు పిచ్చెక్కుతుంది. వెంటనే బెల్లం తింటే ఆ పిచ్చి మాయమవుతుంది. అంటే దానికి బెల్లం విరుగుదన్న మాట!

46. హరితాళ మనశ్శిలాభక్షిణో మయూరస్య పురీషేణ
లిప్తహస్తో యద్ద్రవ్యం స్పృశతి తన్న దృశ్యతే.

47. అంగారతృణభస్మనా తైలేన విమిశ్రముదకం క్షీరవర్ణం భవతి.

48. హరీతకామ్రాతకయోః శ్రవణ
ప్రియంగుకాభిశ్చపిష్టాభిర్లిప్తాని లోహభాండాని తామ్రీభవంతి.

49. శ్రవణప్రియంగుకాతైలేన దుకూల సర్ప నిర్మోకేణవర్త్యా దీపం
ప్రజ్వాల్య పార్శ్వే దీర్ఘీకృతానికాష్ఠాని సర్పవద్ భ్రమంతే.

50. శ్వేతాయాశ్శ్వేతవత్సాయాః గోః క్షీరస్య పానం యశస్య మాయుష్యం చ.

51. బ్రాహ్మణానాం ప్రశస్తానామాశిషః ఇతి చిత్రయోగాశ్చతుష్షష్టితమం ప్రకరణం.

హరితాళం, మనశ్శిల, భక్షించే నెమలి పెంటను చేతులకు పూసుకుని ఏ వస్తువును ముట్టకుంటే ఆ వస్తువు అదృశ్యం అవుతుంది. అంగారతృణ భస్మంతోను, తైలంతోను వీటిని కలిపితే, ఆ నీరు పాలలాగా మారిపోతుంది. హరీతక, ఆమ్రాతకాలతో శ్రవణప్రియంగువులను కలిపి పిండిచేసి లోహపాత్రలకు పూస్తే అవి రాగిపాత్రలవుతాయి.

గుడ్డతోగాని, పాము కుబుసంతోగాని వత్తిచేసి దాన్ని శ్రవణ ప్రియంగుతైలంలో తడిపి దీపం పెడితే, చుట్టుప్రక్కల గల కొయ్య సామాన్లన్నీ సర్పాల్లాగా తిరుగుతాయి. తెల్లటి దూడగల తెల్ల ఆవుపాలు త్రాగితే శ్రేయస్సు కలగడమే కాక, ఆయుష్షును పెంపొందిస్తాయి.

ఇవన్నీ చిత్రయోగాలు (కౌటిల్యుని అర్థశాస్త్రంలో కూడా ఇలాంటి యోగాలు అనేకం ఉన్నాయి. అయితే ఈ ప్రక్రియలలో చెప్పిన మూలికలు, ఇతర ద్రవ్యాలు దొరకడం దుర్లభం. వాటిని సంపాదించడం కష్టం)

— ఇది అరవైనాలుగో ప్రకరణం.

52. పూర్వశాస్త్రాణి సంధృశ్య ప్రయోగా ననుసృత్య చ,
కామసూత్ర మిదం యత్నాత్సంక్షేపేణ నివేదితమ్.

పూర్వం వ్రాసిన శాస్త్రాలు పరిశీలించి, ప్రయోగాలను అనుసరించి, ఎంతో ప్రయత్నంతో ఈ కామసూత్రాలు సంగ్రహరూపంలో చెప్పడం జరిగింది.

53. *ధర్మమర్థం చ కామం చ ప్రత్యయం లోకమేవ చ,*
*పశ్య త్యేతస్య తత్త్వజ్ఞో న చ రాగాత్ప్రవర్తతే.*

*ఈ కామశాస్త్రాన్ని, దీని తత్వాన్ని సవ్యంగా అవగతం చేసుకున్న బుద్ధిమంతుడు, ధర్మార్థకామాలను, విశ్వాసాలను, దేశకాల పరిస్థితులను గమనించి ప్రవర్తిస్తాడు. అంతేకాని కేవలం కామాంధుడై మూర్ఖత్వంతో ఎన్నడూ ప్రవర్తించలేదు.*

54. *అధికారవశా దుక్తాయే చిత్రా రాగవర్ధనాః, తదనంతర మత్రైవ తే యత్నాద్వినివారితాః.*

ప్రకరణ సందర్భాన్ని పురస్కరించుకుని శాస్త్రంలో చెప్పాల్సిన విషయాలు కాబట్టి సాధికారంగా ఈ చిత్రయోగాలు చెప్పారు. అనురాగాన్ని వృద్ధిచేయడమే వీటి లక్ష్యం. అయితే, ఆ వెంటనే వీటిని ఆచరించకూడదని నిషేధం విధించారు. (కాబట్టి పాఠకులు ఈ విషయాన్ని ముఖ్యంగా గమనించాలి.)

# ఉపసంహారం

55. *న శాస్త్ర మస్తీత్యేతేన ప్రయోగోహి సమీక్ష్యతే,*
*శాస్త్రార్థాన్ వ్యాపినో విద్యాత్ప్రయోగాంస్త్వైకదేశికాన్.*

56. *బాభ్రవీయాంశ్చ సూత్రార్థాన్ ఆగమయ్య విమృశ్య చ,*
*వాత్స్యాయనశ్చకారేదం కామసూత్రం యథావిధి.*

శాస్త్రంలో చెప్పారు కదా అని, ఆచరించవచ్చు కదా అని ఏదిబడితే అది ఆచరించడానికి పూనుకోరాదు. శాస్త్ర విషయాలు ఎప్పుడూ ప్రపంచాన్ని గురించి చెపుతాయి. ఇక ప్రయోగం అంటారా? అది కేవలం ఒక్కొక్క దేశానికి సంబంధించినది. ఈ విషయం గ్రహించాలి.

బాభ్రవీయుడి కామసూత్రార్థాలను బాగా అధ్యయనంచేసి, విమర్శించుకుని, వాత్స్యాయన మునీంద్రులు ఈ కామశాస్త్రాన్ని యథావిధగా రచించారు.

57. *తదేతద్బ్రహ్మచర్యేణ పరేణ చ సమాధినా, విహితం లోకయాత్రార్థం న రాగోర్థోస్య సంవిధిః.*

58. *రక్షన్ ధర్మార్థ కామానాం స్థితిం స్వాం లోకవర్తినీం,*
*అస్య శాస్త్రస్య తత్త్వజ్ఞో భవత్యేవ జితేంద్రియః.*

బ్రహ్మచర్యనిష్ఠతో, నిశ్చలమైన బుద్ధితో లోకయాత్ర సాగించడానికే ఈ కామశాస్త్రం చెప్పబడినది. అంతేకాని కామప్రవృత్తిని ప్రకోపింపజేసి, ప్రపంచాన్ని అధఃపతితం కావించడానికి కాదు ఈ కామ సూత్రాలు వ్రాసింది.

ఈ కామశాస్త్రం యొక్క తత్త్వాన్ని గ్రహించిన బుద్ధిమంతుడు ధర్మార్థకామాలు అనే పురుషార్థాలను, వాటి స్థితిని, తన స్థితిని, లోకంలోని పరిస్థితులను గమనించి జితేంద్రియుడుగా ఉంటాడు.

59. *తదేతత్కుశలో విద్వాన్ ధర్మార్థావవలోకయన్,*
*నాతిరాగాత్మకః కామీ ప్రయుంజానః ప్రసిద్ధ్యతి.*

అంచాత బుద్ధిమంతుడైన మానవుడు ఈ శాస్త్రంలో మంచి ప్రావీణ్యం సంపాదించి, ధర్మార్థాలను పరిరక్షించుకుంటూ, రాగంతో మునిగిపోకుండా కామవంతుడై ప్రయోగాలను, ప్రక్రియలను అనుసరించి, ఇష్టారసిద్ధిని పొందుతాడు.

*ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే ఔపనిషదికే సప్తమేఽధికరణే, నష్టరాగప్రత్యానయనం, వృద్ధియోగాః, చిత్రాశ్చయోగాః ద్వితీయోఽధ్యాయః*

*సమాప్త మౌపనిషదికం, సప్తమ మధికరణం.*
*సమాప్తం వాత్స్యాయనీయ కామసూత్రమ్.*
*సమాప్తం సవ్యాఖ్యానం కామశాస్త్రమ్.*

ఇది శ్రీ వాత్స్యాయనముని విరచిత కామసూత్రాల్లోని ఔపనిషదికం అనే ఏడో అధికరణంలో నష్టరాగ ప్రత్యానయనం, వృద్ధియోగాలు, చిత్రయోగాలు అనే రెండో అధ్యాయం.

ఇది వాత్స్యాయన కామసూత్రాల్లోని ఉత్తరార్థం.

భారద్వాజ గోత్రుడూ, ఆశ్వలాయన సూత్రుడూ, ఋక్శాఖీయుడూ, నందవరీకీ అయిన రెంటాల గోపాలకృష్ణ ఏడు అధికరణాలతో కూడిన వాత్స్యాయన కామసూత్రాలకు యశోధరుని 'జయమంగళ' వ్యాఖ్యానుసారం రచించిన తెలుగువ్యాఖ్య 'శృంగారతిలక' ఇది.

కామసూత్రాలు సర్వం సంపూర్ణం.

## — మంగళమ్ —



# VATSYAYANA KAMA SUTRALU _ RENTALA GOPALA KRISHNA

ILLUSTRATED BY **CHANDRA**

కామశాస్త్ర గ్రంథాలలో వాత్స్యాయన కామసూత్రాలదే అగ్రస్థానం. కామ పురుషార్థ సాధనకు దీనిని మించిన ప్రామాణిక గ్రంథం మరొకటి లేదు. వాత్స్యాయన మునివర్యులు రచించిన అత్యంత ప్రాచీనమైన (క్రీ.శ. మూడవ శతాబ్దం) గ్రంథం ఇది.

ప్రాచీన కాలంలోనే కాక, ఆధునిక కాలంలో కూడా ప్రపంచంలోని లైంగిక శాస్త్రవేత్తలందరూ ప్రశంసించి, పరమ ప్రామాణికంగా పరిగణిస్తున్న గొప్ప కావ్యం ఇది. ప్రతి విషయమూ శాస్త్రీయ దృక్పథంతో చర్చించడినది.

తెలుగులో సమగ్రంగా సచిత్రంగా మేమందిస్తున్న ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరని మా అకాంక్ష!





నవసాహితి బుక్ హౌస్
ఏలూరు రోడ్ • విజయవాడ-520 002



NBH051070